బహుముఖ ప్రజ్ఞాశాలి



# ఆచార్య కోనేరు రామకృష్ణారావు

పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), డి.ఎస్సి. (ఆనరరీ) (నాగార్జున విశ్వవిద్యాలయం)
ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# ముందుమాట

ఆంధ్ర విశ్వకళాపరిషత్తుద్వారా ఎనిమిది సంపుటాలుగా వెలువడుతున్న తెలుగు వ్యుత్పత్తి కోశంలో ఇప్పుడు మీ ముందుంచుతున్నది ఆరో సంపుటం. దాదాపు పదివేల మకారాది పదాలతో ఉన్న ఈ సంపుటం తర్వాత ప్రకటించవలసినవి ఇంకా కేవలం రెండు మాత్రమే. వాటి రాతప్రతులు సిద్ధంగానే ఉన్నాయి. ఏడో సంపుటం (య – వ) ఎనిమిదో సంపుటం (శ – హ) త్వరలోనే ప్రకటిస్తాం.

ఈ మూడు సంవత్సరాల హయాం (1984 – 87) లోను తెలుగు వ్యుత్పత్తి కోశ నిర్మాణ కార్యక్రమాన్ని పూర్తిచేసి రాతప్రతిని సిద్ధంచేయించడమే కాకుండా నాలుగు, ఐదు, ఆరు సంపుటాల ముద్రణ కార్యక్రమాన్ని పూర్తికావింపగలిగినందుకు సంతోషంగా ఉంది. సకాలంలో ఈ ఎనిమిది సంపుటాల రాతప్రతిని అందించగలిగిన ఆంధ్ర విశ్వకళాపరిషదాంధ్ర శాఖాధ్యక్షులు, తెలుగు వ్యుత్పత్తి కోశ పథక ప్రధాన సంపాదకులు, పర్యవేక్షకులు డాక్టరు లకంసాని చక్రధరరావుగారిని, పథక సిబ్బందిని, ఈ సంపుటాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది ముద్రణకార్యక్రమాన్ని పూర్తికావించిన ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్ డైరెక్టరు ఆచార్య కె. సుబ్బారావుగారిని, తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహాసంఘ సభ్యులను అభినందిస్తూ ఈ ఆరో సంపుటాన్ని అందిస్తున్నాను.

మీ

వాల్తేరు

6-6-1987

(కోనేరు రామకృష్ణారావు)
ఆంధ్ర విశ్వకళాపరిషత్ కులపతి
ఉన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం

# పీఠిక

1957 లో ప్రారంభించిన ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ పథక రచనా పరిసమాప్తి, సహృదయ సమ్రాట్టులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వోన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి. ; డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్) ; డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం) గారి హయాంలో పూర్తికావటం, వారి ఈ మూడు సంవత్సరాల పరిపాలనాకాలంలోను తెలుగు వ్యుత్పత్తి కోశం మూడు సంపుటాలు (4, 5, 6) వెలుగులోకి రావటం నాకు మిక్కిలి ప్రమోదాన్ని కల్గిస్తోంది. ఇంకా మిగిలిన ఏడు, ఎనిమిది సంపుటాలుకూడా వారి హయాంలోనే ప్రచురించబడగలవని ఆశిస్తున్నాను. ఈ ఆరో సంపుటంలో 9,754 మకారాది పదాలున్నాయి. ఉభయోష్ఠ్య వ్యంజన వర్ణాలై ప, ఫ, బ, భ, మ లతో కూడిన పదాలు ప్రపంచంలోని అనేక భాషలలో అధికంగా ఉంటాయనటంలో అతిశయోక్తి లేదు. కాగా ప, ఫ, బ, భ లతో మొదలైన పదాలను ఐదో సంపుటిగా ప్రకటించి మకారాది పదాలతోకూడినదాన్ని ఆరో సంపుటిగా ప్రకటిస్తున్నాం.

ఈ ఆరో సంపుటిలో భాగస్వాములు : ఈ సంపుట ప్రధాన సంపాదకులు – డా॥ లకంసాని చక్రధరరావు కాగా సహాయసంపాదకులుగా ఉన్నవారు – డా॥ బాల అరుణ కుమారి, డా॥ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, డా॥ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, డా॥ కందాళ కనక మహాలక్ష్మి, డా॥ శ్రీపాద సీతామహాలక్ష్మి, డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, డా॥ సజ్జా మోహనరావు, శ్రీ గోనెళ్ళ వెంకట సీతారాం టైపిస్టుగాను, శ్రీ బోర వెంకటరమణారెడ్డి అటెండరుగాను పనిచేశారు.

'సాహితీవల్లభ', 'కళాప్రపూర్ణ' బిరుద విరాజితులయిన శ్రీ మేకా రాజా వేంకటాద్రి అప్పారావు శ్రీ రాణీ రామయ్యమ్మారావుగార్లకు 21-3-1915 న జన్మించిన శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు నూజివీడు ఉన్నత పాఠశాలలో విద్య నభ్యసించి తర్వాత మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఇంటర్ పరీక్షలో ఉత్తీర్ణులై, బందరు నోబుల్ కళాశాలలో పట్టభద్రులై అనంతరం ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో ఆర్థిక శాస్త్రంలో పరిశోధన సాగించి 1940 లో ఆంధ్రా యూనివర్సిటీనుంచి ఎమ్.ఏ. పట్టాన్ని పొందారు. 1926 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ప్రారంభోత్సవ సమావేశాల్లో తమ తండ్రిగారితోపాటు వీరు పాల్గొన్నారు. 1941 నుంచి 1962 వరకు ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనెట్ సభ్యులుగాను, 1944 నుంచి 1962 వరకు ఆంధ్ర విశ్వకళాపరిషత్ సిండికేట్ సభ్యులుగాను, 1960 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తాత్కాలికోపాధ్యక్షులుగాను ఉండి తమ విధుల్ని శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు సమర్థవంతంగా నిర్వహించారు. వీరు 1974 నుంచి 1980 డిసెంబరు వరకు ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులుగా తమ పదవీబాధ్యతల్ని సమర్థంగా నిర్వహించి విశ్వవిద్యాలయాభివృద్ధికి తెలుగు సంస్కృత భాషల అభివృద్ధికి విశేషంగా దోహదంచేశారు. 1976 లో ఆచార్య దొణప్పగారు గుంటూరు బదిలీకాగా అప్పటివరకు 1970 నుంచి వారు నిర్వహిస్తున్న తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి అప్పుడు తెలుగు శాఖలో లెక్చరర్‌గాఉన్న నన్ను శ్రీ అప్పారావుగారు నియమించగా నేను

1-6-1976 లో పదవీబాధ్యతల్ని స్వీకరించి 30-6-1986 నాటికి నా బాధ్యతను పూర్తి చేయగలిగాను. వీరి హయాంలో నూజివీడు, కాకినాడ, శ్రీకాకుళాల్లో పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులు నెలకొల్పబడి నిర్వహించబడటమే కాకుండా డాక్టర్ నీలం సంజీవరెడ్డిగారి ఆశీస్సులతో 1978 జూలై 8, 9, 10 తేదీలలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఘనంగా ఉత్సాహంగా స్వర్ణోత్సవాల్ని జరుపుకొంది. 12,219 పదాలతో కూడిన "తెలుగు వ్యుత్పత్తి కోశం (ప్రథమ సంపుటం)" కేంద్ర విద్యాశాఖామాత్యులయిన శ్రీ పి. సి. చందర్‌గారిచే 10-7-78 న ఆంధ్ర విశ్వకళా పరిషత్ అసెంబ్లీ హాలులో శ్రీ అప్పారావుగారి ఆధ్వర్యంలో స్వర్ణోత్సవ సందర్భంగా ఆవిష్కరించబడింది. 1952 నుంచి 1978 వరకు అవిచ్ఛిన్నంగా అసెంబ్లీ ఎన్నికల్లో పాల్గొని అఖండ విజయాన్ని సాధించిన కీర్తి ఆంధ్ర ప్రదేశ్ రాజకీయాల్లో వీరికే దక్కింది. 1962 లో శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నకాలంలో మద్యపాన నిషేధా మాత్యులుగాను, 1967 లో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగాను ఉండి ఆంధ్ర ప్రదేశ్‌కు సేవచేశారు. ప్రస్తుతం వీరు విద్యాసంబంధి స్టాండింగ్ కమిటీ చైర్మన్‌గా వున్నారు. వీరు "రుబాయ్యాత్, యాంటిగని, సాహితీ విపంచిక (1977)" అనే గ్రంథాల్ని రచించారు. సాహిత్య రాజకీయరంగాలలో ధురంధరులైన సహృదయ సార్వభౌములు శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారికి ఈ 'తెలుగు వ్యుత్పత్తి కోశం (ఆరో సంపుటం)' ను అంకితం కావించటానికి నన్ను అనుమతించిన సరసహృదయులు గుణగ్రహణ పారీణులు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత విధాన పరిషదధ్యక్షులు ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారికి కృతజ్ఞతలు.

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్వహణకు ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న నా మాతృసంస్థ ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృతజ్ఞతలు.

ఈ సంపుటానికి సొంపైన 'ముందుమాట'ను తెలుగులో ప్రసాదించిన అంతర్బహిసుందర మూర్తులు, ఆంధ్రాంగ్ల భాషాపండితులు, సహృదయ సమ్రాట్టులు, మనస్తత్త్వ పరామనస్తత్త్వ పారావారపారంగతులు, తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత విద్యావిధానపరిషదధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం) గారికి మనోవాక్కాయకర్మలతో ఈ కోశ స్ఫూర్తికి కారకులైనందుకు కృతజ్ఞతాంజలులు.

తమ అమూల్యాలైన సలహాలద్వారా శుభాశంసలద్వారా ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ పథక పరిసమాప్తికి కారకులయిన అనుభవజ్ఞులు మేధావులు పండితులు తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహాసంఘ సభ్యులు : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఆచార్య జి. ఎన్. రెడ్డి, డాక్టర్ వడ్లమూడి గోపాల కృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి, ఆచార్య చేకూరి రామారావు గార్లకు—

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్మాణ కార్యక్రమానికి సంపూర్ణ సహకారాన్ని అందిస్తున్న తెలుగు భాషాప్రియులు సరసులు ఆంధ్ర విశ్వకళాపరిషద్విద్యాధికారులు ఆచార్య బోడేపూడి ప్రసాదరావు, ఎమ్.ఏ., ఎమ్.ఏ. (ఆనర్స్), పిఎచ్.డి. (ఓహిఓ స్టేట్) గారికి—

ఈ ఆరో సంపుటాన్ని సర్వాంగసుందరంగా ముద్రింపడంలో సహకరించిన ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ డైరెక్టర్ ఆచార్య కశిరెడ్డి సుబ్బారావు, డి. యస్‌సి. గారికి, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. మదనరాజ్, బి.ఏ. గారికి హార్దిక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషివల్ల ఈ కోశ సంపూర్తికి కారకులయిన మా తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి—

మనఃపూర్వకాభినందనలు.

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం
కార్యదర్శి, సభ్యులు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘం

విశాఖపట్నం
10-6-1987

ఆంధ్ర రాష్ట్ర అవతరణకు
అసువులను అర్పించిన



అమరజీవి

# శ్రీ పొట్టి శ్రీరాములు

# అంకితం

ధీ శా లి



**ఆచార్య ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ.**

చైర్మన్, విద్యాసంబంధి స్టాండింగ్ కమిటీ, తెలుగు అకాడమీ

# తెలుగు వ్యుత్పత్తి కోశ సలహాసంఘం

అధ్యక్షులు:

**డాక్టర్ కోనేరు రామకృష్ణారావు**, పిఎచ్.డి., డి.లిట్.
(ఆంధ్రవిశ్వకళాపరిషత్), డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం)
ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్
ఉన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

సభ్యులు:

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి**, డి.లిట్.
గౌరవాచార్యులు, రవీంద్ర సాహిత్యం
ఆంధ్రవిశ్వకళాపరిషత్

**ఆచార్య జి.ఎన్. రెడ్డి**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
ఉపాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

వాఙ్మయమహోధ్యక్ష
**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
హైదరాబాదు

**డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
సత్తెనపల్లి

**శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి**
మదనపల్లి

**ఆచార్య చేకూరి రామారావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
భాషాశాస్త్రవిభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం

**డాక్టర్ ఎల్. చక్రధరరావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
కార్యదర్శి, సభ్యులు
డైరెక్టర్, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తికోశ పథకం
తెలుగు శాఖాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

# మ

మ వి. ఉభయోష్ఠ్యాను నాసికాల్ప ప్రాణనాద స్పర్శ వర్ణం.

-మ- ప్రత్య. ఆశీశ్యాపార్థకాలైన ఎడు, తవర్ణాలకు అచ్చు పరమైనపుడు ఆదేశంగానూ (బాలవ్యా. క్రియా. 28), చిర్రు, బుర్రు, మినుకు మొ. శబ్దాలకు అచ్చుపరమైనపుడు ఆగమంగానూ వచ్చే వర్ణకం.

/-ఎడున్, -తన్‌ల పూర్వరూపాలు* -ఎడుమ్*, -తమ్ అని గ్రహించాలి. వీటి సామ్యంవల్ల మినుకు + అను > మినుకుమను మొ. శబ్దరూపాలు ఏర్పడి ఉంటాయి.

మకన్దు రూ. మగ², మగఁడు, మగన్దు, మొగ², మొగుడు ; వి. కొడుకు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 610. క్రీ.శ. 8వ శతాబ్దం.

/క. మగ. కొడుకు. పురుషుడు, మగవు, మగు, మగవు, మొగ, మొగు, మొగువు. శిశువు (మగ లేక ఆడ) ; కొడ. మోవన్. కొడుకు, మక్క. పిల్లలు ; తు. మగ. కొడుకు. మోను. కొడుకు ; త. మక. చిన్నపిల్లడు, జంతువుల పిల్ల, మకవు. బాలుడు, కొడుకు, చెట్లపై ఉండే కోతులవంటి జంతువుల పిల్లలు, మకణ్. కొడుకు, చిన్నవాడు, ఊరుడు, భర్త, మకణ్మై. కొడుకుతనం, మగతనం, మకార్. కొడుకులు, సంతానం, మక్కల్. మనుషులు, మాక్కల్. పురుషులు, ప్రజలు, మానవజాతి, పిల్లలు, మోటై. కొడుకుని ముద్దుగా పిలుచు, మకిణన్. భర్త, కొంత పొలానికి అధిపతి, భూకామందు, మవుణన్. భర్త, మ. మకన్, మోన్. కొడుకు, మక్కల్. (ప్రత్యేకించి మగ) పిల్లలు, జంతువుల పిల్లలు ; తొ. మోక్స్. చిన్నపిల్లడు, కొడుకు, కూతురు, స్త్రీ. పురుషుడు ; పర్జి. మయిద్. భర్త ; కొలా. మగ్వన్. భర్త ; గ. మగిండ్‌సిండె. పురుషుడు, భర్త ; మ.గసిండు. మగపిల్లవాడు, మగ్గిండ్. భర్త ; పూల్తొ. మక్వే. బాలుడు.

/< మూ.ద్రా. *మక్-.

మకపట్టె వి. మోటబావి కొమిరె (నిలువు గుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె.

మకమక వి. 1. తేజోహీనత, కాంతిహీనత. శశా. 3.59 ; 2. తేజోహీనతను తెల్పే అనుకరణం.

క. మక. తేజోపిహీనంగా ఉండటం, మంకు. కాంతి లేకపోవటం.

మకరం రూ.చూ. మొక్కరము¹. వి. 1. నిరోధం, ఆటంకం. 2. గెడమ్రాను, అడ్డగడియ, అర్గళం ; 3. స్తంభం.

మకరంగుబ్బ వి. కొయ్యస్తంభానికి పీటకు కింద ఉబ్బెత్తుగా చెక్కిన గుండ్రటి భాగం.

సం. మకర-. మొసలి.

మకరతము వి. పచ్చ, గారుత్మతమణి. ఉ.రా. 6.76.

సం. మరకత-. పచ్చ.

< సం. మరకత-, (వర్ణవ్యత్యయం).

మకరదూలం వి. గోడమధ్యలో వేసిన దూలం.

సం. మకర-. మొసలి.

< సం. మకర- + దూలము (మిశ్రస.).

మకరందబ్బ వి. కొయ్యస్తంభం పీటకు పక్కల వంపుగా చెక్కిన భాగం.

సం. మకర-. మొసలి.

మకరబిబ్బీ రూ. మకరబ్బీ. వి. మకరతోరణం, దేవతల్ని గురువుల్ని రాజుల్ని ఊరేగించేటప్పుడు, జయోత్సవాల్లోనూ ముందు తీసుకువెళ్ళే గౌరవచిహ్నం. చంద్రాంగ. 2.16.

సం. మకర-. మొసలి ; హిం.ఉ. బీబీ. స్త్రీ.

< సం. మకర- + ఉ. బీబీ. (మిశ్రస.).

మకరబ్బీ రూ.చూ. మకరబిబ్బీ. వి. మకరతోరణం. పార్వ. 2.114.

మకరంపీట వి. కొయ్యస్తంభాలమీద నిలిపే చెక్కిన కొయ్యదిమ్మ.

సం. మకర-. మొసలి.

మకరివల వి. మృగాల్నిపట్టే ఒకరకం వల. యయా. 1.38.

సం. మకరిన్. మొసళ్ళు కలది, సముద్రం.

మకాము రూ.చూ. ముకాము. వి. ప్రయాణంలో నిల్చిచే స్థలం, ఆగేచోటు.

మకిని రూ చూ. మకిలి. వి. నలుపు, మాలిన్యం.

మకినెతెవులు చూ. మకిన. వి. నువ్వుతెగులు, కాయతొలిచే ఒకరకం గొంగళిపురుగు పట్టే తెగులు.

మకిరె వి. తట్ట.

మకిల రూ.చూ. మకిలి. వి. 1. మురికి, మాలిన్యం. మొల్ల. యుద్ధ. 3.36 ; 2. నలుపు ; 3. ధూళి ; విణ. మలినమైన. మురికైన.

మకిలక్రోవి వి. నల్లనిక్రోవి, ఒకరకమైన సుషిర వాద్యం, ఊదే ఒకానొక వాద్యం. మొల్ల.యు. 3.20.

మకిలి చూ. మయిల. రూ. మకిని, మకిల, మకిలీ, మకిలె. వి. కాలుష్యం, మలినం, మురికి.

సం. మలిన-. మురికిఐనది.

మకిలీ రూ.చూ. మకిలి. వి. మలినం, మురికి.

మకిలె రూ.చూ. మకిలి. వి. 1. మెల ; 2. పక్షూతి వ్యాధి.

మకుడు చూ. మకిలి. వి. మురికి.

సం. మక-. మాలూకికి వైశ్యునివల్ల పుట్టిన సంకర జాతివాడు.

**మకురు** రూ. మొకురు. వి. 1. పొగరుబోతుతనం, మొండిపట్టుదల ; **2.** మూర్ఖుడు, మొండివాడు.

క. మక్కళ్. పిల్లలు ; త. మక్కల్. పాడైనది, మక్కళ్. పిల్లలు ;

నం. మూర్ఖ-. మూఢుడు, అజ్ఞుడు.

**మకురుతనము** వి. మూర్ఖత్వం, మొండితనం. **మకురుపట్టు** అ.క్రి. మొండికేయు ; వి. మొండిపట్టుదల.

**మక్క**[1] రూ. మక్కె[1]. వి. (స్త్రీ) కటిప్రదేశం.

క. మగ్గల్ మగ్గిల్, మగ్గుల్. పక్క ; తు. మర్గిలు. పక్క ; త. మరుంకు. పక్కభాగం, కటిప్రదేశం, మరుంకుల్. (స్త్రీల) కటిప్రదేశం, కడుపు ; మ. మరు. పక్క ; తొ. మగిల్. కొండవాలు, మెక్స్. వాలు, కొండవాలు ; పర్జి. మక్క. పిరుదు ; కొలా. మగ్ల్. పక్క, వాలు.

**మక్కలు విరగదన్ను(-తన్ను)** స.క్రి. బాగాకొట్టు.

**మక్క**[2] రూ.చూ. మక్కె[2]. వి. 1. ఒకరకం పురుగు ; **2.** మొక్కజొన్న.

**మక్క**[3] వి. బిడ్డల్నికన్న స్త్రీకి పొత్తికడుపులో పుట్టే అపాయకరమైన నెత్తురుగడ్డ.

సం. మక్కల్ల-. మక్కనగాయ. ప్రసవ రక్తావరోధం వలన గర్భంలో అపాయకరమైన నెత్తురుగడ్డ.

< నం. మక్కల్ల-.

**మక్క**[4] వి. ఉత్తర సర్కారులు, దక్కను మొ.చోట్ల అడవుల్లో సుమారు యాభై అడుగుల ఎత్తు పెరిగేచెట్టు (Schrebera swietenioides).

**మక్కనగాయ** వి. బిడ్డల్నికన్న స్త్రీకి పొత్తికడుపులో పుట్టిన అపాయకరమైన కాయ, మక్క.

నం. మక్కల్ల-. మక్క.

< నం. మక్కల్ల- + కాయ.

**మక్కరాయి** వి. మరకతశిల. ఇందు. 1.17.

నం. మరకత-. పచ్చ ; ప్రా. మరఅద-. మరగయ-. పచ్చ ; సిం. మరా-. పచ్చ, పచ్చని.

< నం. మరకత- + రాయి.

**మక్కలు** చూ. మొక్క. వి.బ.వ. మొక్కజొన్నలు.

**మక్కల్లు** రూ. ముక్కల్లు. వి బ.వ. కుండలను సర్సిన తరవాత ఆరబెట్టి మగ్గటానికి ఇంట్లో పేర్చిన పాత్రలు.

< ముక్క[1] + కల్లు[2].

**మక్కళించు** స.క్రి. 1. సరిచేయు, సమానంచేయు. ఉ.హరి. 5.50 ; **2.** పెంపొందించు, వృద్ధిపొందించు. ఉ.హరి. 6.252 ; **3.** కూర్చు, అమర్చు. కాశీ. 3.118 ; **4.** ఉబికించు, ఉబ్బేటట్లుచేయు. మను. 1.59 ; అ.క్రి. **1.** వ్యాపించు, ప్రసారితమగు. శృం.నై. 6.108 ; **2.** మిళితమగు, కలియు. పి.శకు. 2.5 ; **3.** జ్వరాది రోగం తిరగబెట్టు, మాని మరల వచ్చు.

నం. మ్రక్షణ-. పోగుచేయటం, రాశిగా చేర్చటం. తైలంతో శరీరాన్ని మర్దన చేయటం, గూఢవర్తనం ; ప్రా, మక్ఖణ-. అభ్యంగనం, చమురు రాయటం ;

తు. మకళ యుని. మార్చు, మోపుని. తలకిందు చేయు, తిప్పు ; త. మక్కళి- (-ప్ప్-, -త్త్-) మఱుక్కళి (-ప్ప్-, -త్త్-). రోగాదులు తిరగబెట్టు, విడిపోవు, జారు ; కో. మకర్. పైకివెళ్ళు, తన్ను, మకళ్ప్). నిర్లక్ష్యంచేయు, ఖండించు ; కొం. మక్ (-వ్-త్-). చుట్టుతిప్పు, తలకిందులుగా తిప్పు.

< ప్రా. మక్ఖణ- + -ఇంచు[3].

**మక్కష్టము** వి. ముఖక్షౌరం.

సం. ముఖ-. ముఖం, కష్ట-. ఇనుము.

**మక్కా**[1] రూ.చూ. మక్కా. వి. అరేబియా దేశంలోని ఒక పెద్దపట్టణం, యవనకాశి, మహమ్మదు జన్మస్థానం, మహమ్మదీయుల పుణ్యక్షేత్రం. దశా. పీఠిక. 14, శుక. 1.222.

**మక్కాచెంబు** వి. మక్కా పట్టణంలో చేసే ఒకతకం పాత్ర, కూజా. పాంచాలీ. 4.51.

**మక్కా**[2] వి. ఏటి ఒడ్డున ఇసకనేలల్లో సాగుచేసి పెంచే దోసజాతి మొక్క (Aucumis me'o).

**మక్కి**[1] చూ. ముక్కు[1].

**మక్కి**[2] వి. ఈగ.

సం. మక్షా, మక్షికా. ఈగ ; ప్రా. మక్ఖిఅ, మచ్ఛి ; పా. మక్ఖికా ; కా. మఛి : అ. మాఖి ; బెం.ఒ. మాఛి ; బీ. మాఛీ ; హిం. మాఛీ, మాఖీ, మఖీ ; పం. మక్ఖీ ; సిం. మఖ, మఖీ ; గు. మాఖ్, మాఖీ ;

/క.త. మక్క.

/< ప్రా. మక్ఖిఅ.

/**మక్కికిమక్కిగా** అవ్య.ద్రు. అసలుకి సరియైన నకలుగా, చూచి రాయమన్నప్పుడు కొన్ని అక్షరాలపై ఈగ చచ్చిపోయిఉండగా మరో ఈగను చంపి అక్షరాలపై వేసి రాయటాన్ని బట్టి ఏర్పడిన పలుకుబడి. త. మక్కుక్కుమక్క. శుద్ధప్రతి.

**మక్కించు** చూ. ముక్కు[1].

**మక్కిడు** చూ. ముక్కు[3]. వి. కోళ్ళగూడు, కోళ్ళను దాచే మట్టి కట్టడం.

**మక్కింపు** చూ. ముక్కు[1].

**మక్కిర** రూ.చూ. మక్కెర. వి. జల్ల, బండిమీద సరుకు పెట్టుకోవటానికి పెట్టిన తొట్టి.

**మక్కిరి** రూ.చూ. మక్కెర. వి. వెదురుతో అల్లిన బండిపై పెట్టే జల్ల.

**మక్కిలు** చూ. ముక్కు[1].

**మక్కిల్లు** చూ. ముక్కు[1].

**ముక్కు**[1] రూ.చూ. మ్రుక్కు. అ.క్రి. 1. (రాగంతో) విరూపమగు, రూపుచెడు. భోజ. 1.101 ; **2.** నవయు, కృశించు, చిక్కు. నార.పంచ. 2.179 ; **3.** చచ్చు, మృతినొందు. రామాభ్యు. 8.154 ; **4.** మగ్గు, ఉక్కచే ఉడుకు. ప్రబంధ. 78 ; 5. కాంతివిహీనమగు ; 6. పండు, ముదిరిన కాయలు, పైరు, పూర్తిగా పరిణతిచెందు ; **7.** నానబెట్టు ; **8.** ధాన్యాదులు ఎక్కువగా పాతబడు ; **9.** కంకులు కొన్నాళ్ళు కుప్పలో నిలువ ఉండు ; వి. **1.** మాలిన్యం, మురికి. ఆము. 6.17 ; **2.** పుండు, గాయం ; **3.** ముక్క

వాసన ; విణ. మాసిన, మలినమైన. అం.భా. 3.15.

మక్కి[1] విణ. 1. మాంసంలేని, శుష్కించిన. పండి. చ. 1.40 ; 2. నిస్సారమైన. మక్కించు రూ.చూ. మ్రక్కించు. స.క్రి. 1. నిర్జించు, జయించు, గెల్చు. భాగ. 1.361 ; 2. చంపు, వధించు. భాగ. 6.394 ; 3. నశింపచేయు, చెరచు. ద్వి.భాగ. 6 స్కం. మక్కింపు వి. నొక్కు, రాతిలోని గుంట. మక్కిలు రూ. మక్కిల్లు. అ.క్రి. నశించు. మక్కిల్లు రూ.చూ. మక్కిలు. అ.క్రి. నశించు. మక్కుడు[1] వి. మురికి, మాలిన్యం. కకుత్స్థ. 4.49. మక్కుపెట్టు అ.క్రి. కుండలు సర్సిన తర్వాత మగ్గటానికి ఇంట్లో నీడలు పేర్చి పెట్టు. మక్కులేయు అ.క్రి. కుండలు సర్సిన తరవాత ఆరనిచ్చి మగ్గటానికి ఇంట్లో నీడలో పేర్చిపెట్టు.

మక్కు[2] వి. నితంబైకదేశం. తుంటి. రాజవా 3.68.

మక్కుదోనె వి. దోనె మలుపు తరవాత ఉన్న భాగం. మక్కుసుడి వి. మలుగులమీద ఉండే సుడి.

మక్కు[3] రూ. మొక్కు[3]. వి. బల్లులు మొ.వాటి అతుకుల్ని సందుల్ని కనబడకుండ రాయటానికుపయోగించే ఒకరకమైన జిగురుపదార్థం, లప్పం.

మక్కుడు[2] విణ. గుత్తం, దాచబడింది. మక్కుడుచేయు స.క్రి. ఇతరులకి తెలియకుండా దాచు. మక్కుడువట్టు (-పట్టు[1]) అ.క్రి. గడ్డకట్టు. పర.రా.యు. పు. 343.9. పం. మక్కుమారుచు స.క్రి. పట్టి పల్లార్చు. వర.రా.కిష్కిం.పు. 506.20 పం. మక్కువేయు అ.క్రి. 1. అతుకు. శాశ్ల.నం. 18.261 ; 2. గుమ్మి మొ.వాటిలోని ధాన్యం మీద గడ్డి కప్పి పైన బురదమట్టి పట్టించి మూసివేయు, మెత్తువేయు.

మక్కు[4] రూ.చూ. మంకు. వి. మొండివాడు.

మక్కువ వి. 1. వాత్సల్యం, పుత్రాదులపట్ల ఉండే ప్రేమ. భార.ఆది. 7.187 ; 2. స్త్రీ పురుషుల పరస్పరానురాగం, వలపు. భార.విరా. 2.86 ; 3. కుతూహలం, వేడుక. హరి.ఉ. 2.79 ; 4. స్నేహం, మైత్రి. దశా. 2.343 ; 5. ప్రేమ, కూరిమి. ఆం.భా. 1.136.

మక్కువకా(డు వి. ప్రేమకలవాడు, ప్రియుడు. ప్రద్యుమ్న. 3.75.

మక్కె[1] రూ.చూ. మక్క[1]. వి. 1. అస్థి, ఎముక ; 2. తొడ ఎముక.

మక్కె[2] రూ. మక్క[2]. వి. 1. ఒకరకం పురుగు ; 2. మొక్క జొన్న.

మక్కెర రూ. మక్కర, మక్కరి, మంకిరి. వి. 1. వెదురుతో అల్లిన బండిమీద పెట్టే జల్ల ; 2. పేడ మట్టి పూయని గంప.

క. మక్కరి, మ్రకి, మంకరి, మంర్కి. వెదురు లేదా ఈత ఆకులతో అల్లిన గంప ;

సం. మస్కర-. వెదురు.

<క. మక్కరి.

మక్బా రూ. మక్కా[1], మఖా, మఖ్ఖా, మఖ్ఖికా. వి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రం, మహమ్మదు పుట్టిన నగరం. నరస. 5.243

అ. మక్కహ్. అరేబియా దేశంలోని నగరం, మహమ్మదు పుట్టిన పట్టణం, మహమ్మదీయుల పవిత్ర యాత్రాస్థలం ; హిం.ఉ. మక్కా. అరబ్ దేశ మందలి మహమ్మదీయుల పవిత్ర నగరం ; పార. మక్కహ్ ;

క. మక్కా.

<ఉ. మక్కా.

మక్తా రూ.చూ. మాక్తా. వి. 1. ఒడంబడిక. ద.హిం.శా, సంపు. 4. శా.సం. 711. క్రీ.శ. 1593 ; 2. గుత్త. భూకామందుకు రైతు ఇచ్చే డబ్బు లేక పంట ; 3. ప్రభుత్వం గుత్త కిచ్చిన పొలం.

మక్తారైతు వి. పొలం చేసే రైతు.

మక్తేదారు వి. పొలం గుత్తకిచ్చినవాడు.

హిం.ఉ. మక్తాదార్. మగతాకిచ్చిన వ్యక్తి; మరా. మక్తా. ఒడంబడిక ; పార. మక్త. విభజనం, -దార్. మతుబ్ ప్రత్యయం.

<ఉ. మక్తాదార్.

మఖ రూ.చూ. మగ[1]. వి. శ్రావణమాసంలో వచ్చే కార్తె.

మఖమల్ రూ. చూ. మఖమలు. వి. 1. ఒకరకం పట్టు ; 2. వెల్వెటు.

మఖమలు రూ. మఖమల్. వి. ఒకరకం పట్టు, మొఖమల్ గుడ్డ.

హిం.ఉ. మఖ్మల్. ముతకరకం పట్టు ; మరా. మఖ్మల్ ; పార. మఖ్మల్. ఒకరకం పట్టు.

<ఉ. మఖ్మల్.

మఖా రూ.చూ. మక్కా. వి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రం, మహమ్మదు పుట్టిన నగరం. నె.శా. 2. సంపు. కందుకూరు. 44. శా.సం. క్రీ.శ. 1650–51.

మఖాంచేయు చూ. మకాము.

మఖాము రూ.చూ. ముకాము. వి. ప్రయాణంలో నిలిచే స్థలం, ఆగే చోటు.

మఖాంచేయు అ.క్రి. బసచేయు. ఉ.అర. ముకామ్. ఇల్లు, నివాస స్థలం.

మఖాసా రూ.చూ. మొఖాసా. వి. నిబంధన మీద ఇవ్వబడిన గ్రామం.

మఖ్ఖా రూ.చూ. మక్కా. వి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రం, మహ్మమదు పుట్టిన నగరం. హంస. 5.359.

మఖ్ఖికా రూ.చూ. మక్కా. వి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రం, మహమ్మదు పుట్టిన నగరం. రాజవా. 3.143.

మఖ్తా రూ.చూ. మాక్తా. వి. ఒప్పుదల, ఒప్పందం, అంగీకారం.

మగ[1] రూ. మఖ. వి. శ్రావణమాసంలో వచ్చే కార్తె.

సం. మఘా. పదోనక్షత్రం.

<సం. మఘా.

మగ[2] రూ.చూ. మకన్తు. వి. 1. పురుషుడు. కు.సం. 7.39 ; 2. భర్త, పెనిమిటి. భార.ఆరణ్య. 6.208 ; 3. రాజు, ప్రభువు. ప్రభు. 8.56 పు. 4 పం. ; 4. ఇది కర్మధారయ సమాసంలో ఉత్తరపదంగా ఉండేటప్పుడు శ్రేష్ఠవాచకం. రామాభ్యు. 5.204.

మగకఅవున(బడినగతి అవ్య.ద్రు. మగవాడే కరవైనట్లు అనటం. శుక. 3.543. మగకూడుకుడుచు అ.క్రి. పౌరుషంతో బ్రతుకు. సిం.ద్వా. 2.134. మగచెయ్యులు వి.బ.వ

సంభోగాలు, రతులు. నీలా. 1.76. మగఁటిమి వి. 1. శౌర్యం, పౌరుషం, పరాక్రమం. భార.ఆది. 6.309 ; 2. మగతనం, పుంస్త్వం. భార.ఉద్యో. 4.376 ; 3. పురుషాయితం, ఉపరతి. ఉ.రా. 6.168. త. మగన్మై. మగతనం. మగతనము వి. 1. పరాక్రమం, మగటిమి, పౌరుషం. భార.విరా. 3.170 ; 2. రతి, సంభోగం (ఉపరతి అని వ్యాఖ్య). ఆము. 4.183 ; 3. పురుషత్వం, పుంస్త్వం. రాఘవ. 3.75 మగత్రాడు వి.బొ. మగతాడి చెట్టు. మగదట్టువు వి. పురుష సంబంధి అయిన శిక్ష. కలకడశాసనం. క్రీ.శ. 972. మగనిల్వు వి. చేయి పైకెత్తి నిలుచున్న పురుషుని ఎత్తు. పండి.చ. 5.389 పు. మగపంతము వి. 1. మగటిమి, పౌరుషం, శౌర్యం. భాస్క.రా.యు. 2089 ; 2. కూటమి, సురతం. భాగ. 10 పూ. 993. మగపంద వి. పిరికమనిషి. భాగ. 9.406. మగపసరము వి. ఎద్దు. మగపాటి వి. పౌరుషం. మగపాడి వి. 1. శూరధర్మం, మగటిమి, శౌర్యం. భార.భీష్మ. 1.193 ; 2. పురుషధర్మం, మగవాని మర్యాద. రం.రా.కిష్కిం. 203పు. 10 పం. ; 3. ఉపరతి, పురుషాయితం. శశా. 3.111. మగపాలు వి. పురుషుని భాగం, భర్తృభాగం. హర. 3.25 మగపేఁచము వి. మగపురుగు, పురుషవేషం భార. సౌప్తి. 2.91. మగపోగు వి. అనుపోసినప్పుడు పడుగులో పైకి వచ్చిన ఉన్నిపోగు. మగపోఁడిమి వి. 1. పురుషునివిధం, పురుషరూపం. కాశీ. 3.99 ; 2. సురతం, సంభోగం. అష్టమ. క. 1.34 ; 3. మగతనం, పుంస్త్వం. శుక. 2.422. మగపోఁడుములు వి.బ.వ. గ్రామధర్మం, రతులు. మగపోల్కికూటమి వి. ఉపరతి, పురుషాయితం. అం.భా. 2.180. మగబీర[1] రూ. మాబీర. వి. సుమారు ఆరు అడుగుల ఎత్తు పెరిగి మందుల్లో ఉపయోగపడే మొక్క (Anisomeles malabarica). మగబీర[2] రూ.చూ. మొగబీఱ. వి. దక్కను కర్ణాటకల్లో పెరిగే తెల్లని మొక్క. (Aerva javanica). మగమాట వి. పౌరుషవాక్యం శూర వచనం. భాస్క.రా.యు. 123 మగమానికపువాలు వి. వజ్రాయుధం. నీలా. 3.8. మగమానికపువాలుదాల్పు వి. వజ్రాయుధాన్ని ధరించినవాడు, ఇంద్రుడు. నీలా. 3.8. మగమానికము రూ.చూ. మొగమానికము. వి. వజ్రం. యయా. 1.52 ; విణ. పురుషరత్నం, పురుషశ్రేష్ఠుడు, పురుషోత్తముడు. అచ్చ.రా.బాల 183. మగమొలక వి. పురుషసంతానం. ఉ.హరి. 3.157. మగరాతివాలు రూ.చూ. మగఱాతివాలు. వి. వజ్రాయుధం. మగరాయి రూ.చూ. మగఱాయి. వి.బొ. వజ్రం, నవరత్నాల్లో ఒకటి. సారంగ. 2.72. మగఱాతివాలు రూ. మగరాతివాలు. వి. వజ్రాయుధం. అచ్చ.రా.యు. 581. మగఱాయి రూ. మగరాయి, మొగఱా. వి.బొ. వజ్రం, నవరత్నాల్లో ఒకటి. ఉ.రా. 1.307. మగలంజియ రూ. మగలంజె. వి. విటుడు. కు.సం. 8.143. మగలంజె రూ.చూ. మగలంజియ. వి. విటుడు. పండి.చ. 2.122. మగలమగఁడు వి. శూరాగ్రేసరుడు. భాగ. 10 ఉ. 190. మగలరాజు వి. పురుషుల్లో రాజు. భార.ద్రోణ. 2.230. మగలాగు వి. 1. పురుషధర్మం, మగవాని మర్యాద ; 2. శూరధర్మం, మగటిమి, శౌర్యం ; 3. ఉపరతి, పురుషాయితం. మగలాఁడువాడు విణ.బ.వ. మగనాంధ్రుడు. కు.సం. 7.36. మగలింగము రూ. మొగలింగం. వి. నదుల ఒడ్డున పెరిగి తెల్లని పూలుపూసే మొక్క. త. మర్విలింగ. (Crataeva religiosa). మగవాఁడు విణ. 1. పౌరుషవంతుడు. భార.ఉద్యో. 1.247 ; 2. పురుషుడు, పుంవ్యక్తి. శృం.నై. 4.61 ; 3. మగడు, భర్త, ప్రియుడు. భాగ. 1.160. మగవానిమేలు వి. పురుషప్రేమ. శుక. 1.344. మగవాసం రూ. మొగ్గోసం. వి. పోతువాసం. మరవాసంలో తగిలించే మొన చెక్కిన వాసం. మగసిరి రూ. మొగసిరి. వి. పౌరుషం.

మగం వి. మార్గం.

సం. మార్గ. బాట, దారి ; ప్రా.పా. మగ్గ ; హిం. మగ్గ్, మాగ్ ; ల. మాగ్ ; సిం. మాగు ; గు. మగ్, మాగ్.

< ప్రా. మగ్గ-.

మగంశాసనము వి. సుంకాలు విధించటానికి ఇచ్చిన శాసనం. E.C.X. బాగెపల్లి-64. క్రీ.శ. 1744.

త. మక. పూర్వకాలంలో విధించబడే భూమిశిస్తు ; సం. శాసన-. ఆజ్ఞ, ఆజ్ఞ వేయబడ్డ శాసనం.

< త. మక + సం. శాసన- + -ము.

మగచేరులు వి.బ.వ. ప్రకాశవంతమైన ఆకులు కలిగి కొండల మీద పెరిగే చెట్లు.

మగటం వి. ఒకరకం మడి (మడుగు) పంచె, చిన్నది.

క. మగట, మగుటి, మాగట, మాగుటి, మొగటి. పట్టు వస్త్రం.

< క. మగట.

మగడి వి. పాములవాడూదే వాద్య విశేషం, నాగస్వరం.

త. మకుటి. పాములవాడూదే బూరవంటిది, నాగస్వరం, మోటి. పాములవాడూదే బూరవంటిది, నాగస్వరం.

మగఁడు రూ.చూ. మకన్డు. వి. 1. భర్త. కలకడ శాసనం. క్రీ.శ. 972 ; 2. పురుషుడు. సిర్వ.రా. 1 ; 3. శూరుడు. భార. ద్రోణ. 4.157 ; 4. రాజు. రామాభ్యు. 5.

మగఁడువిడిచినా మావవిడువనట్లు అవ్య. అసలు వాడు వదిలిపెట్టినా పైవాడు వదలడు అనటం. తాళ్ల. సం. 8.220. మగనాలు రూ.చూ. మగనియాలు. వి. మగడున్న ఆడది, భర్తృమతి, కులస్త్రీ. కాశీ. 2.83. మగనాలువెల్లి అ.క్రి. కొన్ని ప్రాంతాల్లో మరొకడితో వెళ్లి. మగనిఅన్న వి. బావ, బావగారు. మగనిపేరెదనున్నవగలాఁడి వి. లక్ష్మీదేవి. మగనియాలు రూ. మగనాలు. వి. మగడున్న ఆడది, భర్తృమతి, కులస్త్రీ. హరి. పూ. 9.76.

మగత వి. మత్తు.

మగతా రూ.చూ. మాక్తా. వి. ఒప్పందం.

మగనాలు చూ. మగఁడు.

మగనాలువెల్లి చూ. మగఁడు.

మగనిఅన్న చూ. మగఁడు.

మగనిపేరెదనున్నవగలాఁడి చూ. మగఁడు.

**మగనియాలు** చూ. మగఁడు.
**మగన్టు** రూ.చూ. మకన్టు. వి. కుమారుడు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 621. క్రీ.శ. 9/10శ.
**మగన్సూల** వి. మంటపెట్టటానికి ఆముకుముందు ఆముగోడ మధ్య భాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు.
**మగపెట్టు** రూ.చూ. మగ్గబెట్టు. స.క్రి. ఒరలు, తొట్లు మొ.వి చేయటానికి వాడే మట్టిలోపొట్టుకలిపి వారం రోజులు మురగబెట్టు.
**మగమ** రూ. మగమా. వి. **1**. పేంటసుంకం, దేవభోగం నిమిత్తం విధించబడే సుంకం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 309. క్రీ.శ. 1246 ; **2**. వణిజులు కాని సేద్యగాళ్ళుకాని దేవాలయాదుల కిచ్చే విరాళం, రుసుం. ద. హిం. శా. సంపు. 4. శా.సం. 935 క్రీ.శ. 1269.
**మగమా** రూ.చూ. మగమ. వి. వణిజులుకాని సేద్యగాండ్రు కాని దేవాలయాదులకిచ్చే విరాళం, రుసుం.
**మగరూరీ** వి. అహంకారం, డాంబికం.

మరా. మగరూర. గర్విష్టి, పిచ్చి; ఉ. మ్గరూర్. గర్వంకల; అర. మఘ్రూరీ.

< మరా. మగరూర.

**మగసాలెదంతె** వి. వాకిలిపై కమ్మిమీది చెక్క.

సం. ముఖశాలా. మొగసాల.

< సం. ముఖశాలా + దంతె.

**మగాతి** రూ.చూ. మొగాతి. వి. మంటపెట్టడానికి ఆముకు ముందు ఆముగోడ మధ్యభాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు.
**మగాయి** రూ.చూ. మొగాయి. వి. ఆముపొయ్యి, మంటపెట్టటానికి ఆముకుముందు ఆముగోడ మధ్య భాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు.

**మగాయిగోడ** రూ.చూ. మొగాయిగోడ. వి. కుండని కాల్చటానికి ఆముకు ఒకవైపు మట్టితో గాని, ఇటుకతోగాని కట్టినగోడ ; **మగాయిపొయ్యి** వి. మంటపెట్టటానికి ఆముకు ముందు ఆముగోడ మధ్యభాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు.

**మగావు** రూ.చూ. మొగాయి. వి. ఆముపొయ్యి, మంటపెట్టటానికి ఆముకుముందు ఆముగోడమధ్య భాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు.
**మగిడించు** చూ. మగుడు.
**మగిడివచ్చు** చూ. మగుడు.
**మగియించు** యా.చూ. ముగించు. స.క్రి. చంపు.
**మగుచు** చూ. మగుడు.
**మగుడఁబడు** చూ. మగుడు.
**మగుడించు** చూ. మగుడు.
**మగుడిపోవు** చూ. మగుడు.
**మగుడివచ్చు** చూ. మగుడు.
**మగుడు** అ.క్రి. **1**. క్రమ్మరు, తిరుగు. భార. విరా. 2.47 ; **2**. పోవు, తొలగు. భార. ద్రోణ. 2.328 ; **3**. బాగుపడు, చక్కనగు. భార. స్త్రీ. 1.20 ; **4**. వెనుకకు మరలు. భార. శాంతి. 5.97 ; **5**. అభిముఖమగు. భీమ. 3.38 ; **6**. తిరిగివచ్చు. విక్ర. 6.93 ; వి. తిరగటం, నివృత్తి. కావ్యా. చూ. 7.14.

క. మగుళ్, మోగల్. చుట్టూతిరుగు, గుండ్రంగా తిరుగు, తలకిందులగు, అభిముఖమగు, మగుఌ. వెనుకకు మరలు, మగుళ్చు వెనక్కు మరలజేయు, తిప్పు, తిరిగి వచ్చు, మగచు, మగుచు, మగఌ్చు, మోగచు, మోగుచు. చుట్టూతిరుగు, గుండ్రగాతిరుగు, వెనక్కు తిరుగు, తలకిందులగు ; తు. మగపుని, మగుచుని. మోగపుని. తిరుగు, తారుమారగు, మగుటె. మరల, రెండవసారి, మ్గు. తర్వాత, మరల, మరొకసారి, మగపుని. లాగితిప్పు ; త. మకిటి (-ప్ప్-ట్ట్-). తలకిందులగు, తారుమారగు ; కో. మన్ఙ్. తారుమారగు, మఙ్. తిరుగు ; కొలా. మగుడె ; నా. మగుట్. వాంతిచేయు.

< మూ. ద్రా. *మక్-.

**మగిడించు** రూ. మగుడించు. స.క్రి. **1**. మరలించు, తిప్పు. కు.సం. 9.147 ; **2**. నివారించు, ఆపు. భార.భీష్మ. 3 283. < మగుడు + -ఇంచు[3]. **మగిడివచ్చు** రూ.చూ. మగుడివచ్చు. అ.క్రి. తిరగవచ్చు. కు.సం. 8.2. < మగుడు + -ఇ[13] + వచ్చు. **మగుచు** స.క్రి. మరలించు, తిప్పు. అష్టమ. క. 5.242పు. 14పం. క. మగుచు, మొగుచు. తిప్పు, చుట్టూతిప్పు, తలకిందులుగా పడు. < క. మగుచు. **మగుడఁబడు** అ.క్రి. **1**. తిరుగు, తారుమారగు. మార్క. 3.369 ; **2**. తిరగబడు. హరి. ఉ. 1.140 ; **3**. మరలు, నివృత్తమగు. హరి. ఉ.10.161. < మగుడు + -అ[7] + పడు. **మగుడించు** రూ.చూ. మగిడించు. స.క్రి. **1**. మరలించు, తిప్పు. పి.శకు. 2.122 ; **2**. నివారించు, ఆపు. **మగుడిపోవు** అ.క్రి. మరలు, తిరిగిపోవు. భార. ఆది. 1.102. త. మక్కడసెయ్. < మగుడు + -ఇ[13] + పోవు. **మగుడివచ్చు** రూ. మగిడివచ్చు. అ.క్రి. తిరిగివచ్చు. భార. ఆది. 8.321. < మగుడు + -ఇ[13] + వచ్చు. **మగుడుచు** రూ. చూ. మగుడ్చు. స.క్రి. మరల్చు, తిప్పు. **మగుడ్చు** రూ. మగుడుచు. స.క్రి. మరల్చు, తిప్పు. భార. అను. 4.408. క. మగుచు, మొగుచు. చుట్టూతిప్పు, తిప్పు, తలకిందులుగాపడు ; తు. మగుచుని, మగపుని. లాగితిప్పు, మగుపుని. తిప్పు, తలకిందులుచేయు, మగపు. మలుపు.
**మగుడ్చు** చూ. మగుడు.
**మగురాతనము** వి. పొగరు.

< మగ[2] (?) + రాతనము.

**మగులు** రూ. ముగులు, మొగులు[3]. వి. **1**. చుట్టుగోడ, ప్రాకారం. వేంక. పంచ. 4.416 ; **2**. కుడ్యపాలిక, గోడ మీదకప్పు. ఆం. భా. 2.13.

క. మదిల్. గోడ ; తు. మదిలు, మదులు. గోడ మీదకప్పు ; త. మతిల్. కోటచుట్టుగోడ, ప్రాకారం ; మ. మతిల్. గోడ. (తోట, గుడి, ఇల్లు మొ. వాటి చుట్టూరా కట్టేది).

**మగులుకొయ్య** వి. చిలకకట్టు, మదురు వెయ్యటానికి గోడలోపాతిన కొయ్యముక్క. **మగులుగూన** వి. మదురుమీద పేర్చే వెడల్పుగా చదునుగా ఉండే గూన. **మగులుగోడ** వి.

1. చుట్టుగోడ, ప్రాకారం. హంస. 2.226 ; 2. చూరుగోడ మదురు వేసిన ప్రహరీగోడ.

మగువ వి. 1. స్త్రీ. ఆడది. భార. ఆది. 1.130 : 2. ప్రియురాలు, భార్య. శృం. నై. 1.74.

క. మగళ్. కుమార్తె, మక్కల్, మర్కళ్. పిల్లలు, మగళ్మా. భర్తకు నమ్మకస్తురాలైన భార్య ; కొడ. మోవ. కుమార్తె, మగలు. కుమార్తె, పొయ్మక్క. స్త్రీలు, భార్యలు ; తు. మగలు. కుమార్తె, మక్కల్. పిల్లలు, మోని. కుమార్తె ; త. మకటు, మకటూవు. స్త్రీ, భార్య, మకల్. కుమార్తె, స్త్రీ, భార్య, మకణ్మై. ఆడతనం, కూతురితనం ; మ. మొళ్. కుమార్తె ; కో. మోగ్. భార్య, పిల్ల లేక పిల్లడు ; పె.. మోగ్. స్త్రీ, మోళ్. కుమార్తె, మోట్చ్. (పిల్ల లేక పిల్లవాడితో) స్త్రీ ; తొ. మోక్స్. చిన్నపిల్లడు, కొడుకు, కూతురు, స్త్రీ, పురుషుడు ; గోం. మెయాట్, మియాలి. కుమార్తె ; పర్జి. మాల్ (బ.వ. మాచిల్), కుమార్తె ; గ. మాల్. కుమార్తె, మాచిల్. ఆడపిల్ల, మాల్. స్త్రీ ; మాల్తొ. మక్వి. బాలిక.

పో.చూ. సం. మాలికా. కుమార్తె.

మగువతనము వి. స్త్రీత్వం, ఆడతనం. భాగ. 8.404.

మగ్గ రూ.చూ. మొగడ. వి. ముకుళం. కాశీ. 7.221.
మగ్గంలాక చూ. మగ్గము.
మగ్గంలైను చూ. మగ్గము.
మగ్గంవాడిచేయు చూ. మగ్గము.
మగ్గంవీథి చూ. మగ్గము.
మగ్గంసందు చూ. మగ్గము.
మగ్గంస్తంబం చూ. మగ్గము.
మగ్గంస్తంభం చూ. మగ్గము.
మగ్గంఈది చూ. మగ్గము.
మగ్గంకొట్టు చూ. మగ్గము.
మగ్గంకొయ్య చూ. మగ్గము.
మగ్గంగజెం చూ. మగ్గము.
మగ్గంగడి చూ. మగ్గము.
మగ్గంగద్దె చూ. మగ్గము.
మగ్గంగుంజ చూ. మగ్గము.
మగ్గంగుంట చూ. మగ్గము.
మగ్గంగుండి చూ. మగ్గము.
మగ్గంగుండు చూ. మగ్గము.
మగ్గంగుంత చూ. మగ్గము.
మగ్గంగూటం చూ. మగ్గము.
మగ్గంగొయ్య చూ. మగ్గము.
మగ్గంచట్టం చూ. మగ్గము.
మగ్గంచదర చూ. మగ్గము.
మగ్గంచెవు చూ. మగ్గము.
మగ్గంజిల్ల చూ. మగ్గము.
మగ్గంజొరు చూ. మగ్గము.
మగ్గంతాడు చూ. మగ్గము.
మగ్గంనిడపకమ్మి చూ. మగ్గము.
మగ్గంనిలువు చూ. మగ్గము.
మగ్గపుగుంత చూ. మగ్గము.
మగ్గపుతాడు చూ. మగ్గము.
మగ్గబెట్టు చూ. మగ్గు[1].

మగ్గము రూ. మఘ్గం, మొగ్గం. వి. 1. వయన యంత్రం, సాలెవాడు బట్టలు నేసే యంత్రం. ద.హిం.శా. సంపు. 10 శా. సం. 533. క్రీ.శ. 1323 ; 2. సాలెపురుగు అల్లే వల. ఆము. 1.93.

క. మగ్గ. బట్టలు నేసే యంత్రం ; తు. మగ్గ ; త. మక్కం ; పో.చూ. మాగ్. మగ్గం.

మగ్గంలాక రూ. మొగ్గంలాక. వి. నేత పడుగులో పై పోగులకు కింది పోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద. మగ్గంలైను రూ. మొగ్గంలైను. వి. మరమగ్గంలో పన్నె బిగించిన చివర సొరుగులుండే కింది కొయ్య. మగ్గంవాడిచేయు అ.క్రి. నేతకు మగ్గం సిద్ధంచేయు. మగ్గంవీథి రూ. మగ్గం ఈది. వి మగ్గానికి తగిలించిన పడుగులో దోనె దగ్గరనుంచి దండెవరకూ ఉన్న భాగం. మగ్గంసంచు వి. మగ్గం దోనెకూ దండకూ మధ్యభాగం. మగ్గంస్తంబం రూ. చూ. మగ్గం స్తంభం. వి. మరమగ్గం. చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. మగ్గంస్తంభం రూ. మగ్గంస్తంబం. వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. మగ్గంఈది రూ.చూ. మగ్గంవీథి. వి. మగ్గానికి తగిలించిన పడుగులో దోనెదగ్గరినుంచి దండెవరకు ఉన్నభాగం. మగ్గంకొట్టు అ.క్రి. నేత నేసేటప్పుడు పడుగులో నాడె (= పేక దారం కండె గలది) చేసిన తరవాత పోగు దగ్గర బడేట్టు చేతిపలకతో అదుము. మగ్గంకొయ్య రూ. మొగ్గంకొయ్య. వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నేత బయలులో పాతిన ఒకరకం గుంజ. మగ్గంగజెం వి. కత్తెరగుంజకు అడ్డంగా కొయ్యపట్టె బిగించిన ఇనప కడ్డీ. మగ్గంగడి వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు, నేత నేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది, సొరుగు. మగ్గంగద్దె రూ. మొగ్గంగద్దె. వి. మగ్గంముందు నేతపనివారు కూర్చునే మెరకగా ఉండే చోటు. మగ్గంగుంజ వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నేతబయలులో పాతిన కొయ్యరాట. ఇటువంటివి నాలుగుంటాయి. మగ్గంగుంట రూ.చూ. మగ్గపుగుంత. వి. నేతబయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్విన చోటు. మగ్గంగుండి వి. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క. మగ్గంసుందు రూ. మొగ్గంగుండు. వి. 1. చేతిమగ్గం పన్నె బిగించిన కింది కొయ్య, రోకలి మాదిరిగా గుండ్రంగా ఉంటుంది, దీన్ని పలక సీలలతో పై పలకకు బిగిస్తారు ; 2. మరమగ్గంలో బిగించిన కింది కొయ్య, నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది. దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. మగ్గంగుంత రూ. చూ. మగ్గపుగుంత. వి. 1. నేత బయలులో పావుకోళ్ళు అమర్చడానికి తవ్విన చోటు ; 2. గొంగడి నేసేవాడు. మగ్గందగ్గర కూర్చున్నప్పుడు కాళ్ళు పెట్టుకోటానికి తవ్విన చిన్న గొయ్యి. మగ్గంగూటం రూ. మొగ్గంగూటం. వి. 1. ఉన్ని మగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్యగూటం ;

2. ఉన్నిమగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతిన కొయ్య; 3. నవారుమగ్గం కట్టుబడిలో వడి దారాలు అల్లిన కర్రలకు ఆధారంగా నేలలో పాతిన కొయ్య. **మగ్గంగొయ్య** రూ. మొగ్గంగొయ్య. వి. నేత బయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్విన చోటు, మోకాలు లోతు ఉంటుంది. **మగ్గంచట్టం** రూ. మొగ్గంసట్టం. వి. 1. మర మగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం; 2. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. **మగ్గంచదర** వి. నేతనేసేటప్పుడు నేతపనివాడు కూర్చొనే చిన్నచాప. **మగ్గంచెవు** వి. మరమగ్గం బొమ్మకు, నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **మగ్గంజిల్ల** రూ. మొగ్గం జిల్ల. వి. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల. **మగ్గంజొరు** చూ. చొచ్చు. రూ. మొగ్గంజొ్రు. అ.క్రి. మగ్గంముందు కూర్చొని నేతపని ప్రారంభించు. **మగ్గంతాడు** రూ.చూ. మగ్గపుతాడు. వి. 1. కుచ్చుతాళ్ళలో డైమను తాడుకు ఒకవైపు కట్టిన దారం; 2. మగ్గంమీద నేతపడుగును బిరుపెట్టే లావు పాటి తాడు. **మగ్గంనిడపకమ్మి** వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **మగ్గంనిలువు** రూ. మొగ్గం నిలువు. వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె, ఇటువంటివి రెండుంటాయి. **మగ్గపుగుంత** రూ. మగ్గంగుంట, మగ్గంగుంత, మగ్గుపుగుంత, మొగ్గంగుంత. వి. సాలెవాడు నేయటానికి కూర్చునేటప్పుడు కాలుచాచుకొనే పల్లం. హంస. 2.11. **మగ్గపుతాడు** రూ. మగ్గంతాడు, మొగ్గపుతాడు, మొగ్గంతాడు. వి. గొంగడినేసే మగ్గం బిగించే తాడు. **మగ్గంపందిరి** రూ. మొగ్గంపందిరి. వి. నేత బయలులోమరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలతో మగ్గం గుంటకు పైన ఎత్తుగా వేసే పందిరి. <మగ్గము + పందిరి. **మగ్గంపలక** రూ. మొగ్గంపలక. వి. 1. చేతిమగ్గం పన్నె బిగించిన పైచెక్క; 2. మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; 3. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క. <మగ్గము + పలక. **మగ్గంపాగడ** రూ. మొగ్గంపాగడా. వి. మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు. <మగ్గము + పాగడ. **మగ్గంపీట** వి. నేతపనివాడు మగ్గం దగ్గర కూర్చోటానికి వేసుకొనే పీట. <మగ్గము + పీట. **మగ్గంపురితాడు** రూ. మొగ్గంపురితాడు. వి. మరమగ్గం నిలువు పట్టెను మేరువ పలకకు బిగించి సన్నపుల్లతో వడిపెట్టిన దారం. <మగ్గము + పురితాడు. **మగ్గంబడితె** రూ. మొగ్గంబడితె. వి. 1. నేతబయలులో మర మగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్ర, కొన్నిచోట్ల దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు; 2. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర, కొన్నిచోట్ల వెదురుది. <మగ్గము + బడితె. **మగ్గంబడ్డీ** రూ. మొగ్గంబడ్డీ. వి. 1. నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలు; 2. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెల చట్రం. < మగము + బడ్డీ. **మగ్గంబయలు** వి. ఇంట్లో నేతపనికి కేటాయించిన చోటు. <మగ్గము + బయలు. **మగ్గంబల్ల** రూ. మొకంబల్ల, మొగంబల్ల, మొగ్గంబల్ల. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య నేతనేసే బల్ల. <మగ్గము + బల్ల. **మగ్గంబెడుగు** వి. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె. **మగ్గంమేకు** వి. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల. <మొగ్గము + మేకు. **మగ్గంమోకు** రూ. మొగ్గం మోకు. వి. మగ్గంమీద నేతపడుగును బిరుపట్టే లావుపాటి తాడు <మగ్గము + మోకు. **మగ్గరి** వి. తంతువాయుడు, సాలెవాడు. ఆం.భా. 2.283. <మగ్గము + -అరి. **మగ్గాల ఇల్లు** రూ. మొగ్గాలిల్లు. వి. ఇంట్లో నేతపనికి కేటాయించిన ప్రదేశం.

**మగ్గంపందిరి** చూ. మగ్గము.

**మగ్గంపలక** చూ. మగ్గము.

**మగ్గంపాగడ** చూ. మగ్గము.

**మగ్గంపీట** చూ. మగ్గము.

**మగ్గంపురితాడు** చూ. మగ్గము.

**మగ్గంబడితె** చూ. మగ్గము.

**మగ్గంబడ్డీ** చూ. మగ్గము.

**మగ్గంబయలు** చూ. మగ్గము.

**మగ్గంబల్ల** చూ. మగ్గము.

**మగ్గంబెడుగు** చూ. మగ్గము.

**మగ్గంమేకు** చూ. మగ్గము.

**మగ్గంమోకు** చూ. మగ్గము.

**మగ్గరి** చూ. మగ్గము.

**మగ్గాలఇల్లు** చూ. మగ్గము.

**మగ్గించు** చూ. మగ్గు[1].

**మగ్గు[1]** రూ.చూ. మాగు. అ.క్రి. 1. ఎక్కువగా మగ్గు, కమియ పండు; 2. ఉక్కవలన చెమ్మగిల్లి చెడు; 3. ఆవిరిమీద లేదా వేరేవిధంగా చక్కగా ఉడుకు; 4. ఆధారంగా ఉండు; 5. చచ్చు.

**మగ్గబెట్టు** రూ. మగపెట్టు. స.క్రి. 1. ఒరలు, తొట్లు మొ.వి చేయటానికి వాడే మట్టిలో పొట్టు కలిపి వారం రోజులు మురగబెట్టు. 2. మగ్గేటట్లుచేయు. <మగ్గు[1] + -అ[7] + పెట్టు. **మగ్గించు** రూ.చూ. మర్గించు. స.క్రి. మగ్గు, చంపు. సిం.ద్వా. 1.219. <మగ్గు[1] + -ఇంచు[3]. **మగ్గుడు** వి. ఎక్కువగా ముగ్గటం, కమియ పండటం. **మగ్గుడుపాఱు** అ.క్రి. మాగిపోవు.

**మగ్గు[2]** వి. 1. ఇడ్లీల తయారీకి వాడే మట్టిపాత్ర; 2. ఒకరకం ప్లాస్టిక్ మొ. వాటితో చేయబడ్డపాత్ర.

ఇం. *Mug*. హేండిల్‌కల మట్టి లేదా లోహంతో చేయబడ్డ పాన పాత్ర విశేషం.

<ఇం. Mug.

**మగ్గుపుగుంత** రూ.చూ. మగ్గపుగుంత. వి. సాలెవాడు నేయటానికి కూర్చున్నప్పుడు కాలు దాచుకొనే పల్లం.

**మగ్జీ** వి. తివాసీమగ్గం అచ్చుకర్రలకు అల్లిన వడిదారం.

హిం. మగ్జీ. చీరఅంచు.

<హిం. మగ్జీ.

**మగ్దూరు** వి. అధికారం.

మరా. మగ్దూర్ ; ఉ.అర. మక్దూర్. బలం, శక్తి, అధికారం.

<ఉ. మక్దూర్.

**మఘ్గం** రూ.చూ. మగ్గము. వి. **1**. సాలెపురుగు అల్లే వల : **2**. వయన యంత్రం, సాలెవాడు బట్టలునేసే యంత్రం.

**మంకన** చూ. మంకెన. వి. తోటల్లో పెంచబడే మొక్క (Ixola Coccinea).

**మంకిపెణక** వి. కిటికీలమీద సన్‌షేడ్.

**మంకిరి** రూ.చూ. మక్కెర. వి. జల్ల, బండిమీద సరుకులు పెట్టుకోవటానికి వెదురు మొ. వాటితో చేసిన తొట్టి.

**మంకు** రూ. మక్కు[4]. విణ. **1**. అవివేకి, మూర్ఖుడు, మూర్ఖం. వేంక. పంచ. 4.479 ; **2**. మొండి, కూడని పట్టుదల కలది, చెప్పిన మాట విననిది. ద్వి.పరమ.వి. 4.258 పు. 11 పం ; **3**. చెడ్డది, దుష్టం. సానంద. 2.26.

క. మగ్గు. నీరసించిపోవు, మంకు. మూర్ఖత్వం, మంద గొండితనం ; తు. మంక, మంకు. మూర్ఖత్వం, మొండి తనం ; త. మఙ్కు. మొండిగాఅగు, వన్నెతరుగు, మఙ్క్కమ్. మొండితనం, మందగొడితనం, మ. మజ్జక. మొండిగాఅగు ; కో. మక్, మక్ల్. మత్తుగాఉండు.

**మంకుఘటము** వి. మొండి ఘటం, మొండివాడు. సం. ఘట-. కుండ. <మంకు + సం. ఘట- + -ము. **మంకుతనము** వి. మొండితనం, మూర్ఖత్వం. క్ష.శకు.పీఠి. 1.50. క. మంకుతన. **మంకుపట్టుపట్టు** అ.క్రి. మొండిపట్టుపట్టు. **మంకు(బోతు(-పోతు[2])** వి. **1**. మిక్కిలి మూర్ఖురాలు. అష్టమ. క. 1.9 పు. 3 పం ; **2**. మిక్కిలి మూర్ఖుడు.

**మంకురు** చూ. మంకు. వి. కాపుకాయని ఒకరకం తెగులు.

**మంకెండ్లు** చూ. మంకెన[1].

**మంకెన[1]** వి. **1**. వృక్షవిశేషం, బంధూకం. శృం.నై. 4.13 ; **2**. రంగునీళ్ళు అండాలో ఉడకబెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనప ఊచ.

**మంకెండ్లు** వి.బ.వ. రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలు లడీలు తగిలించిన ఇనపఊచలు. **మంకెనలు** వి.బ.వ. **1**. ధాన్యవిశేషం. హంస. 4.128 ; **2**. బంధూక వృక్షాలు.

**మంకెన[2]** వి. ఎద్దులు మొ. వాటిమీద తీసుకుపోయే నీరు, నూనె మొ. పాత్రలు కుదురుగా ఉండటంకోసం కింద అమర్చే బెత్తంబుట్ట. చంద్రాంగ. 2.41, శుక. 1.100.

సం. మంకిత-. కదలికది, అలంకరించినది ; ప్రా. మంకిఅ. గంతులు వేస్తూ నడచు ;

క. మంకిణి. ద్రవపూరిత ఘటాలు ఉంచే కొయ్య చట్రం.

<ప్రా. మంకిఅ.

**మంకెనకొమ్మ** వి. బండిచట్రంలోని నిలువుపట్టె. **మంకెనగంప** వి. సన్నటి పొట్టుపోసి ఇంటికి తీసుకు పోవటానికి ఉపయోగించే చిన్న గంప. **మంకెనగిత్త** వి. మంకెన మోసే ఎద్దు. రాజవా. 2.61. **మంకెనగుండు** వి. మోటబొక్కెన పైనఉన్న ఇనపకట్టు.

**మంకెలు** వి.బ.వ. బాలక్రీడా విశేషం.

**మంగ[1]** రూ. మ్రంగ. వి. **1**. వృక్ష విశేషం, పిండీతకం. సారంగ. 3.111 పు. 6 పం. (Gardenia dumentorum) ; **2**. మదనం. ఆం.భా. 2.48.

క. మంగరె-ముళ్ళు. వృక్ష విశేషం ; త. మరుక్కారై, మతుక్కారై.

**మంగకంప** వి. ఆము కాల్పుకు వాడే మంగచెట్టు కంప. **మంగచెక్క** వి. మంగచెట్టు బెరడుతో చేసిన పొడి, ఇది స్నానానికి ఉపయుక్తం. **మంగపొరక** వి. ఆముకాల్పుకు ఉపయోగపడే మంగిచెట్టు కంప.

**మంగ[2]** వి. కొమ్మలు దడులకు, పళ్ళు చేపలకు విషంగా ఉపయోగపడేచెట్టు (Randia dumenorum).

**మంగ[3]** వి. ఏమీ తెలియని స్త్రీ.

త. మంకై-. స్త్రీ, 12 లేదా 13 సంవత్సరాల వయసు కల పిల్ల.

**మంగమచ్చ** వి. పుట్టుమచ్చ.

**మంగమ్మచీర** చూ. మంగ[3]. వి. నిలువుకు తెలుపు నూలు, పేకకు ఎరుపు నూలు పెట్టి నేసిన కలనేత చీర.

**మంగల** వి. క్షౌరం చేసి జీవించే జాతి.

సం. మంగళ-. శుభమైన.

క. మంగల. క్షురకుడు ; త. మంకలి.

**మంగలకత్తి** వి. **1**. కత్తి, క్షురం. ఆం.భా. 2.301 ; **2**. మంగలి కత్తిలా ఉండే తొమ్మిది నక్షత్రాల సమూహం. కృత్తికా నక్షత్రం. **మంగలకత్తిరూపు** వి. కృత్తికా నక్షత్రం. **మంగలపక్కి** వి. మత్స్య విశేషం, ఒకజాతిచేప. **మంగలపిట్ట** వి. ఏట్రింత, భరద్వాజపక్షి. **మంగలవా(డు** విణ. క్షౌరికుడు, అంబష్ఠుడు.

**మంగలము** రూ. మంగళము, మంగులం. వి. వేపుడు చట్టి, భాష్ట్రం, అంబరీషం. కు.సం. 6.137.

సం. మంగల-. శుభం, క్షేమం.

<సం. మంగల- (అర్థవిపరి.).

**మంగలములోనిప్రేలలభంగి** అవ్య.ద్రు. పెనం మీద పేలగింజల్లా. కు.సం. 6.137. **మంగలమువంటి** విణ. కష్టతరం అయిన, పొయ్యిమీద పెనం వేడివల్ల భరింప రానిది అనటంపై ఏర్పడిన పలుకుబడి. రాజగో. 2.19. **మంగలంపెంకు** రూ. మంగులంపెంక. వి. పేలాలు మొ.వి వేయించటానికి ఉపయోగించే లోతుగా ఉండే కుండపెంకు. **మంగలానజాజులువైచు** అ.క్రి. లలితం అయినవాటిని పాడు చేయు. తాళ్ల.సం. 3.

**మంగలంపెంకు** చూ. మంగలము.

**మంగలానజాజులువైచు** చూ. మంగలము.

**మంగలాపేటు** వి. అంచుల్లో నేసే ఒకరకం డిజైను.

సం. మంగల-. శుభమైన.

<సం. మంగల- + పేటు[3].

**మంగలి** చూ. మంగల. రూ. మంగి. వి. మంగలజాతికి సంబంధించినవాడు, క్షౌరికుడు. మంగి. భార.అను. 1.91.

త. మంగలి. క్షురకుడు.

<మంగల+-ఇ[9].

మంగలికత్తిమ్రింగు అ.క్రి. గొప్పలకు పోవు. పాండు. 5.250. మంగలికోలు వి. మంగలికోళ్ళు. మంగలి ఊదే గొట్టం. సన్నాయి. కళా. 7.75. <మంగలి+క్రోలు. మంగలిపని వి. క్షౌరం. భార.అను. 4.121. మంగలిమాన్యం వి. తమకు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ.వారు మంగలి కిచ్చిన భూమి. మంగలిసుడి వి. మూపురం కింద ముందు భాగంలో ఉండేది. మంగళ్ల తిప్ప వి. మంగలివారు గొరిగి పడేసిన వెంట్రుకల కుప్ప. ఆము. 6.17. మంగళ్లతిప్పలురేఁగువడువున అవ్య.క్రియా. ఎక్కువగా. ఆము. 6.17.

మంగళగిడ్డి వి. మందుల్లో ఉపయోగపడే మొక్క (Bleroden infoltunatum).

మంగళగిరికంప వి. పొడుగాటి వాడి ముళ్ళుండి గుబురుగా పెరిగే చిన్న కంచె (Balsamoden dropgenus). మంగళగిరి ప్రదేశనామం కావచ్చు.

సం. మంగల-. శుభం, క్షేమం, గిరి-. కొండ.

<సం. మంగల-+సం. గిరి-+కంప.

మంగళము రూ.చూ. మంగలము. వి. **1**. పెంకు ; **2**. మంగలం.

మంగళముచేయు స.క్రి. ధ్వంసంచేయు.

సం. మంగల-. శుభం.

<సం. మంగల+-ము+చేయు.

మంగళంపాడు స.క్రి. ముగించు.

సం. మంగల-. శుభం.

<సం. మంగల+-ము+పాడు.

మంగళవారప్పీనుగ వి. **1**. తన దురదృష్టంలోనికి ఇంకొకరిని ఈడ్చేది ; **2**. మంగళవారం చచ్చిన వ్యక్తి శవం ; **3**. రాచపీనుగ.

సం. మంగలవార-. వారంలో మూడోరోజు, జయ వారం.

<సం. మంగలవార+-ము+పీనుఁగు.

మంగళహారతి రూ.చూ. మంగళారతి. వి. శుభకరమైన హారతి, నీరాజనం.

మంగళారతి రూ. మంగళహారతి, మంగళార్తి. వి. శుభకరమైన హారతి, నీరాజనం. పండి.చ. 3.175.

సం. మంగల-. శుభమైన.

<సం. మంగల-+ఆరతి (మిశ్రస.).

మంగళార్తి రూ.చూ. మంగళారతి. వి. మంగళహారతి.

మంగళూరిపెంకు రూ. మెంగుళూరి పెంకు, మెంగుళూరు పెంకు, మేంకలూర్ పెంకు, మేంగళూర్ పెంకు. వి. అంగ్రేజి పెంకు, యంత్రంతో తయారుచేసే పెద్దపెంకు.

మంగళ్లతిప్ప చూ. మంగలి.

మంగళ్లతిప్పలురేఁగువడువున చూ. మంగలి.

మంగాను తలుపు చెక్కల బిగింపుకు వాడే పనిముట్టు.

హిం. మంగోల్. మంగోలియాదేశం.

మంగాము రూ.చూ. ముంగాము. వి. **1**. పొట్లంగా మడచిన తాటాకు మట్ట ; **2**. బెల్లం మొ.వాటిని నింపిన బరువులో నగం.

మంగార వి. కొమ్మలు దడులకు, చేపలకు విషంగా ఉపయోగ పడే పళ్ళుకాసే చెట్టు.

మంగి రూ.చూ. మంగలి. వి. మంగలివాడు, క్షౌరికుడు. ఆం.భా. 2.283.

మంగు రూ. మంగుడు. వి. **1**. ముఖ సిధ్మం, ముఖంమీది పొడ (ముసలితనంవల్ల ముఖంమీద ఏర్పడిన ముడత). ఆం.భా. 2.129 ; **2**. మబ్బులు కమ్మి ఉండటం.

క. బంకు. వంగు, బంగు. ముఖంమీది తెల్ల నల్ల మచ్చల రోగం ; త. మంకు. నాశం, ముఖంపైని నల్లటి మచ్చలు.

మంగువేయు అ.క్రి. ఆకుతోట తెగులు, ముదిరిన తమల పాకులకు సన్నటి బెజ్జాలు పడు.

మంగుడు రూ.చూ. మంగు. వి. ముఖసిధ్మం,

మంగులం రూ.చూ. మంగలము. వి. వేపుడుచట్టి, భ్రాష్ట్రం, అంబరీషు.

మంగులంపెంకు రూ.చూ. మంగలంపెంకు. వి. లోతుగా ఉండే సాదాపెంకు, పేలాలు మొ. వి. వేయించటానికి ఉపయోగం.

మంగుళూరిపెంకిల్లు వి. మంగుళూరి పెంకు కప్పిన ఇల్లు.

క. మంగుళూర్. కర్ణాటకలోని ఒక నగరం.

మంగ్గలవారము వి. మంగళవారం. చిట్టివలస శాసనం. క్రీ.శ. 1080.

సం. మంగలవార-. జయవారం.

<సం. మంగలవార-+-ము.

మచ్చ[1] రూ. మచ్చము, మట్టె[3]. వి. **1**. చిహ్నం, గుర్తు, కళంకం, మాలిన్యం, మరక. భీమ. 2.45 ; **2**. పుట్టుమచ్చ. పుట్టినప్పుడే శరీరంలో ఉండే నల్లని గుర్తు. విక్ర. 3.56 ; **3**. కురుపు, గాయం మొ. వి మానిన తర్వాత శరీరం మీద అయిన ఆనవాలు.

క. మచ్చ, మచ్చె. పుట్టుమచ్చ, గాయంలేక పుండు మానిన మచ్చ ; త. మచ్చు. కళంకం, నిందార్హం, అనుచితం, మచ్చమి. శరీరం మీద పుట్టుమచ్చ ; కో. మత్. శరీరం మీది తెలుపు లేక నలుపు మచ్చ ; తొ. మస్ట్. శరీరం మీది నల్లరంగు మచ్చ.

పో.చూ.మరా. మత్స్య. పుట్టుమచ్చ.

మచ్చకంద వి. గట్టిగా ఎర్రగా ఉండే కలప, చిన్న ఆకులు కలిగిన అందమైన చెట్టు (Pterospermum heyneanum). మచ్చకాయగూడు వి. కార్నీనుగూడు, నగిషీ పని చేసిన గూడు. మచ్చగట్టు(-కట్టు) అ.క్రి. నింద తెచ్చు. వర.రా.యు. పు. 75. 12 పం. మచ్చగాల్పు (-కాల్పు) రూ. మచ్చుగాల్పు. వి. పాత్రలు మచ్చలు మచ్చలుగా కాలటం, మచ్చనాలుకవాడు విణ. **1**. రహస్యం దాచలేనివాడు. పి.శకు. 2.172 ; **2**. అబద్ధాలాడేవాడు, నాలికమీద మచ్చకలవాడు. మచ్చమాపు స.క్రి. నశింప చేయు. సంహరించు. మచ్చమాయు స.క్రి. నశింపచేయు, సంహరించు ; అ.క్రి. **1**. నశించు ; **2**. జాడలేకుండపోవు. మచ్చరోగం వి. పొగాకు తెగులు, ఆకులమీద మచ్చలేర్పడే

పొగాకు తెగులు.

మచ్చ[2] వి. 1. వెదురుదబ్బ; 2. అట్టక, అటక.

మచ్చము రూ.చూ. మచ్చ[1]. వి. 1. నిదర్శనమైన దొంగిలించిన సొమ్ము. విక్ర. 5.145; 2. నిదర్శనం, దృష్టాంతం. గౌ.హరి.ఉ. 23. 29 పం.; 3. చిహ్నం, గుర్తు, జాడ, ఆచూకీ. వసు. 6.73.

మచ్చరము వి. 1. పట్టుదల, చలం. నిర్వ.రా. 3.11; 2. స్పర్ధ, పోటీ. నిర్వ.రా. 6.90; 3. ద్వేషం, పగ, వైరాగ్యం. హరి.ఉ. 3.223; 4. ఈర్ష్య, ఓర్వలేమి. భీమ. 1.13.

సం. మత్సర-. ద్వేషం; ప్రా. మచ్ఛర-. ఈర్ష్య, ద్వేషం; జైమహా. శౌ.అమా.పా.అప. మచ్ఛర;

క.తు. మచ్చర. మాత్సర్యం; త. మచ్చరమ్. పగ, ఈర్ష్య; మ. మల్సరం.

<ప్రా. మచ్ఛర-.

మచ్చరి వి. 1. పట్టిన పట్టు విడవనివాడు, చలపాది. భాగ. 6.273; 2. ద్వేషి, విరోధి. సారంగ. 3.237. <మచ్చరము+-ఇ[9]. మచ్చరికము వి. 1. చలం, పట్టుదల. ఉ.హరి. 4.196; 2. స్పర్ధ, పోటీ. విక్ర. 5.62; 3. ద్వేషం. <మచ్చరము+-ఇకము. మచ్చరికించు అ.క్రి. 1. స్పర్ధవహించు, పోటీచేయు. శృం.నై. 3.86; 2, చలపట్టు, పట్టు పట్టు. కాశీ. 5.304; 3. ద్వేషించు, కలహించు, పోరాడు. విక్ర. 4.216. <మచ్చరికము+-ఇంచు[3]. మచ్చరించు అ.క్రి. 1. పోటీచేయు, స్పర్ధగొను. భార.ఆది. 5.225; 2. ద్వేషించు, పగగొను. భార.విరా. 3.34; 3. చలపట్టు, పట్టినపట్టు విడవకుండు. చంద్రాంగ. 5.12. <మచ్చర(ము)+-ఇంచు[3]. మచ్చరీడు విశే. 1. మచ్చరం కలవాడు, ఈసు పూనేవాడు. ప్రభా. 1.134; 2. వైరి, పగతుడు. సానంద. 5.173. <మచ్చరము+-ఈ[5].

మచ్చరి చూ. మచ్చరము.

మచ్చరికము చూ. మచ్చరము.

మచ్చరికించు చూ. మచ్చరము.

మచ్చరించు చూ మచ్చరము.

మచ్చరీడు చూ. మచ్చరము.

మచ్చి రూ.చూ. మచ్చు[1]. వి. ఎత్తుగా ఉండే గోడల్ని కట్టటానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం, పరంజీ.

మచ్చిబల్ల వి. ద్వారబంధం మీద అందానికి బిగించే చెక్క.

మచ్చిక రూ. మచ్చికె, మచ్చిగ. వి. 1. ప్రేమ. నిర్వ.రా. 6.57; 2. వలపు, మోహం. భార.శాంతి. 3.245; 3. చనవు. మార్క. 3.248; 4. ఆసక్తి. శృం.నై. 4.84; 5. భ్రమ, భ్రాంతి. వసు. 2.11.

క. మచ్చికె, మెచ్చికె, మెచ్చిగె. సమ్మతి, అంగీకారం.

మచ్చికపడు అ.క్రి. మరులుకొను, మరగు.

మచ్చికె రూ.చూ. మచ్చిక. వి. ప్రేమ, స్నేహం.

మచ్చిగ రూ.చూ. మచ్చిక. వి. 1. దయ. భాగ. 10 పూ. 101; 2. ప్రీతి, ఆసక్తి. భాగ. 10 పూ. 862.

మచ్చు[1] రూ. మచ్చి, మచ్చె. వి. 1. మీది కట్టడం. మిద్దె. కేయూ. 2.60; 2. మీది కట్టడంలేని ఇల్లు. వసు. 6.65; 3. అల్పహర్మ్యం. అచ్చ.రా. అయోధ్యా. 10; 4. ఎత్తుగా ఉండే గోడల్ని కట్టటానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం; 5. అట్టు, సామానులుంచటానికి సాధనాలుంచటానికి అనువుగా సామాను గదిలో ఏర్పరచినది, అటక; 6. పశువుల గాటి మీద మేత పెట్టటానికి కట్టిన అట్టక; 7. అలమారవంటిది, రెండుగోడలు కలిసే మూలల్లో ఉంచే రాతిపలక; 8. వామి అడుగుభాగం.

క. మచ్చు. మేడ; కొడ. మచ్చి. లోకప్పు, అటక కింది భాగం; త. మచ్చు. మీది కట్టడం. మిద్దె, మేడభాగం; మ. మచ్చు. మేడ.

మచ్చుబండ వి. అటకబండ అటక చెక్కకు బదులుగా వేసినరాయి.

మచ్చు[2] అ.క్రి. ఆకర్షించు. పండి.చ. 2.115 పు.; వి. 1. మృగాలు మొ. వి వలలో పడటంకోసం వలకు దగ్గరగా ఉంచే ఆహారం, ప్రలోభం. భాగ. 10 పూ. 1287; 2 చుక్క మందు, మీద చల్లితే పరవశం చేసే భస్మవిశేషం. ద్వి. పరమ. వి. 2.63; 3. స్త్రీలు పురుషుణ్ణి లోబరచుకోవటానికి పెట్టేమందు, మరులుమందు.

క. మర్చు, మచ్చు. మిక్కిలి, అర్పింపబడు, సంతోషపడు, స్నేహం. ప్రేమ; తు. మర్చుని. ఆకర్షించు, లోబరచుకొను, మర్చు. ఆశచూపించటం, మోహింపజేయటం.

మచ్చుమందు వి. వశ్యౌషధం. మచ్చుమరలేకయుండు (-ఉండు) అ.క్రి. ఏమాత్రం చెక్కుచెదరక ఉండు. కళా. 7.102. మచ్చుమాయు వి. మోసం. మచ్చెర్కలఅడ్డి (-అడుది) వి. వగలాడి. మచ్చెర్కలచేష్టలు వి.బ.వ. నమ్మదగని చేష్టలు.

మచ్చు[3] వి 1. వన్నెసరిగా ఉన్నదని చూడటంకోసం అగసాలి వాడిచ్చే వెండి బంగారాలకమ్మి. రం.రా. సుందర. 276 పు. 14 పం.; 2. నికషోపలం, ఒరగల్లు, బంగారువన్నె పరీక్షించటానికి ఉపయోగించే గీటురాయి. ఘటికా. 1.40; 3. మచ్చుముక్క, బంగారం మొ. వాటి వన్నె పరీక్షించటం కోసం అగసాలి మొ.వాళ్ళు దగ్గరుంచుకొనే కమ్మి. శుక. 1.420; 4. ఉదాహరణ.

క. మచ్చ, మచ్చు. గుర్తు, మచ్చుముక్క, బంగారం మొ. వాటి వన్నె పరీక్షించటం కోసం అగసాలి మొ. వారు దగ్గరుంచుకొనే కమ్మి; తు. మచ్చ. పరీక్షకై దగ్గరుంచుకొనే బంగారం మొ. వాటి మచ్చుముక్క; త. మచ్చమ్, మచ్చు. బంగారం మచ్చు ముక్క; మ. మచ్చమ్, మెచ్చమ్. మాదిరి, నమూనా, మోస్తరు.

మచ్చుకులేకపోవు అ.క్రి. అసలు లేకపోవు. మచ్చుగుబ్బలి వి. బంగారుకొండ, మేరుపర్వతం. చంద్రాంగ. 2.45. మచ్చుపసరు వి. మాదిరికై తీసిన పసిడి పసరు. మచ్చుముక్క వి. వన్నెసరి చూచుకోవటానికి అగసాలివాడిచ్చే వెండి

బంగారాల ముక్క.

మచ్చు[4] వి. మాలిన్యం, మురికి. కళా. 7.100.

త. మచ్చు. దోషం, తగనిది.

మచ్చుపెట్టు అ.క్రి. నేతపడుగు మీద గుర్తుపెట్టు.

మచ్చు[5] వి. మోటకత్తి, కంపమండలు నరికే మొద్దుకత్తి.

క. మచ్చు, మచ్చు, మచ్చుకత్తి. చెట్లకొమ్మలు నరికే కత్తి; కొడ. మత్తి. గొడ్డలి; తు. మడు. గొడ్డలి, చెట్ల కొమ్మలునరికే కత్తి; త. మచ్చుక్కత్తి. చెట్లకొమ్మలను నరికేకత్తి; కో. మర్త్. గొడ్డలి; తొ. మెస్త్. గొడ్డలి; గోం. మర్స్, మరస్, మరసు, మగ్సు. గొడ్డలి; పర్జి. మడి. గండ్రగొడ్డలి; మాల్తొ. మసు. గొడ్డలి.

మచ్చుకత్తి వి. మొక్కలు మొ. వాటిని కత్తిరించే కత్తి. క. మచ్చుగత్తి. మొక్కల్ని కత్తిరించే కత్తి; త. మచ్చుక్కత్తి.

మచ్చె రూ.చూ. మచ్చు[1]. వి. మిద్దె.

మచ్చెకంటి చూ. మచ్చెము.

మచ్చెము వి. 1. మత్స్యం, చేప. భాస్క. రా. యు. 615; 2. మత్స్యాకారమైన బరణి. కవి. ర. 3.51.

సం. మత్స్య-. చేప; ప్రా. మచ్ఛ-; శౌ. అ. మా. పా. మచ్ఛ-; మా. మశ్చ, మశ్చరీ;

క. మచ్చ, మచ్చె; తు. మచ్చమీను; గోం. మహ్ భమ్. చేపగాలం, మచ్ఛి.

<ప్రా. మచ్ఛ-.

మచ్చెకంటి వి. మీననేత్రి, చేపల్లాంటి కన్నులున్న స్త్రీ. హరి. పూ. 2.5.

మచ్చెర్కలఅడ్డి చూ. మచ్చు[2].

మచ్చెర్కలచేష్టలు చూ. మచ్చు[2].

మచ్చెర్దాన్‌నేత వి. దోమతెరనేత.

హిం. మచ్ఛడ్, మచ్ఛర్. దోమ, మశకం.

మజ రూ. మజా, మజారె, మజ్జ, మజ్జరె, మజ్జా, మజ్జారె, మజ్జారే, మఝ్ఝా, మఝ్ఝారె, మాజా. అవ్య. ప్రశంసార్థకం, (దీనికి బాపు, బాపురే, బళి. మొ. వి. తరచుగా అను ప్రయుక్తాలై కన్పడుతున్నాయి). బసవ. 4పు. 35పం.

హిం. మజా. అనందం, హాస్యం; మరా. మజా. గమ్మతు, హాస్యం, ఆనందం; ఉ. మజా. ఆనందం, తమాషా, శిక్ష; పార. మజా. రుచి. సువాసన, మజ్జాహ్. ఆడటానికి తగిన, ఆనందితం, హాస్యం కలగచేసే వాడు.

<ఉ. మజహ్.

మజబూతు రూ. చూ. మజుబూతు. వి. దార్ఢ్యం, గట్టిదనం.

మజరా రూ. మజరే, మజిరా, మజురా, మదిర[1]. వి. 1. సారవంతమైన ప్రాంతం; 2. పెద్దగ్రామంలో చేరిన చిన్నపల్లె.

అ. మజ్‌రా. సేద్యానికి పనికివచ్చే పొలం; హిం. మజ్‌రూఅ. క్షేత్రం, సాగవత్ప్రాంతం; మరా. మజరా. క్షేత్రానికి దగ్గరగా ఉన్న గుడిసెల తీర్మానం: ఉ. మజ్‌రా, మజ్‌రూఅ. సేద్యానికి యోగ్యమైన భూమి.

<ఉ. మజ్‌రా.

మజరే రూ.చూ. మజరా. వి. సారవంతమైన ప్రాంతం.

మజలి రూ.చూ. మజిలి. వి. ప్రయాణంలో ఒకదశ.

మజలుదర్‌మజలు వి. ప్రతిచోట.

ఉ. అర. మంజిల్-దర్-మంజిల్. ప్రతిచోటా, ప్రతిదశలో.

మజా రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం. వి. మర్యాద.

మజాకా వి. 1. తమాషా, తడాకా; 2. దెబ్బ.

హిం. ఉ. మజాక్. పరిహాసం, వినోదం.

<ఉ. మజాక్.

మజారె రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం.

మజాలీసు వి. సభ, దర్బారు. మృత్యు. 2.5.

అ. మజ్‌లిస్. సభ; హిం. మజ్‌లిస్. సభ, సమాజం, నాట్యంచేసే చోటు; మరా. మజలస్. దర్బారు, సభ; ఉ మజ్లిస్. సభ, గోష్ఠి, సంఘం, పార. మజ్లిస్. సభ, దర్బారు.

<ఉ. మజ్లిస్.

మజాలు వి. ధైర్యం, దమ్ము.

హిం. ఉ. మజాల్. సామర్థ్యం, శక్తి.

<ఉ. మజాల్.

మజిరా రూ.చూ. మజరా. వి. 1. సారవంతమైన ప్రాంతం; 2. పెద్దగ్రామంలో చేరిన చిన్నపల్లె.

మజిలి రూ. మజలి, మజిలీ. వి. తాత్కాలిక స్థానం, ప్రయాణంలో రాత్రి ఆగేచోటు. పల్నా. పు. 102.

హిం. మంజిల్. యాత్రలో ఆగేస్థానం; మరా. మజలా. ఇంటికి పైన ఉండే గదులుగల భాగం, మంఝిర్. గృహం; ఉ. మంజిల్. బసచేసే చోటు; పార. మంజిల్. సత్రం. గృహం, ఒకరోజుపయనం;

క. మజలు. దశ, ఆగేచోటు; త. మంచల్, మంచిల్. మజిలీ.

<ఉ. మంజిల్.

మజిలీ రూ.చూ. మజిలి. వి. తాత్కాలికస్థానం.

మజీతుచెక్క వి. రంగుల అద్దకంలో వాడే ఒకరకం కొయ్య చెక్క.

హిం. ఉ. మజ్‌బూత్. దృఢమైన, గట్టి.

మజీదు రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థనచేసే మందిరం.

మజుకూరు రూ. మజ్కూరు. వి. 1. వృత్తాంతం. ద. హిం. కా. సంపు. 10. కా. సం. 759. క్రీ.శ. 1663; 2. పూర్వోక్తం.

మరా. మజకూర్. యదార్థ వృత్తాంతం, వృత్తాంతం; ఉ. మజ్కూర్. చర్చ, వృత్తాంతం; అర. మజ్కూర్. వృత్తాంతం, మజ్‌కూర్. పైనచెప్పబడిన.

<ఉ. మజ్కూర్.

మజుబూతు రూ. మజబూతు. వి. దార్ఢ్యం, గట్టిదనం.

హిం. మజ్‌బూత్; మరా. మజ్‌బూత్; ఉ. మజ్‌బూత్. దృఢం, నిశ్చితం, శక్తివంతం; పార. మజ్‌బూత్; అర. మజ్‌బూత్. బలయుతం.

<ఉ. మజ్‌బూత్.

మజుముదారు రూ. మజ్ముదారు, మంజుదారు, ముజుందారు. వి. 1. శాసకుడు. శేషధ. 1.50; 2. లెక్కలు సరిచూచే

వాడు. వేణు. శ. 16.

మరా. మజమ్. భూమిపన్నువసూలుచేసే అధికారం, ముజుముాదార్, ముజుమ్‌దార్. భూమి పన్ను వసూలు చేసేఅధికారి ; ఉ. మజుమ్‌దార్. ఒకఉద్యోగి ; పార. మజ్‌ముాదార్. తహసీలుదారు, లెక్కలను తనికీచేసే ఉద్యోగి, రికార్డుల్ని జాగ్రత్తగా చూసేవాడు ; అర. మజ ముాఅ. వసూలు.

<ఉ. మజుమ్‌దార్.

మజుమూను వి. ఉత్తరంలోని విషయం.

హిం. ఉ. మజ్‌మూన్. విషయం, లేఖ.

<ఉ. మజ్‌మూన్.

మజురా రూ.చూ. మజరా. వి. సివారుపల్లె.

మజూరి రూ. మజూరీ. వి. 1. భూమికి పెట్టిన ఎరువు ; 2. శిల్పులు మొ. వారు చేసే వస్తువులకు కూలి.

హిం. మజ్‌దూరీ. ప్రతిఫలం, కూలి, కూలికిచ్చేడబ్బు ; ఉ. పార. మజ్‌దూరీ ;

క. మజూరి, మంజారి, ముజూరి, ముజూరి.

<ఉ. మజ్‌దూరీ.

మజూరీ రూ.చూ. మజూరి. వి. కూలి.

మజూరు రూ.చూ. మజ్దూరు. వి. 1. కార్మికుడు ; 2. కూలి వాడు.

మజ్కూరు రూ.చూ. మజుకూరు. వి. పూర్వోక్తం, పైన చెప్ప బడింది.

మజ్జ రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం.

మజ్జరి వి. నైచికి. ఉత్తమమైన ఆవు. అం. భా. 2.263.

<మజ్జ+-అరి.

మజ్జత్రం రూ. మధ్యాటం, మధ్యాతం, మాయాటం, విణ. మధ్యఉన్న.

సం. మధ్యస్థ-. మధ్యలోఉన్న.

<సం. మధ్యస్థ-.

మజ్జనమాడు చూ. మజ్జనము.

మజ్జనము వి. స్నానం. కాశీ. 6.125.

సం. మజ్జన-, మార్జన-. మునగటం; ప్రా. మజ్జణ-; అ.మా.పా. మజ్జణ- ;

క. మజ్జన.

<సం. మజ్జన-+-ము.

మజ్జనమాడు అ.క్రి. స్నానమాడు. కాళ. 1.35. <మజ్జ నము+ఆడు.

మజ్జరె రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం.

మజ్జా రూ.చూ. మజ. వి. ప్రశంసార్థకం. క్రీడా. 232.

మజ్జారె రూ.చూ. మజ. అవ్య. 1. ఆశ్చర్యార్థకం. యయా. 4.65 ; 2. ప్రశంసార్థకం. చంపూరా. 8.141.

మజ్జారే రూ.చూ. మజ. వి. ప్రశంసార్థకం.

మజ్జి[1] వి. గ్రామాధికారి, విశాఖపట్టణంలోని ఖోండు గ్రామాల అధికారికి మజ్జి అనిపేరు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1118. క్రీ.శ. 1281.

మజ్జితనము వి. పరిపాలనం, అధికారం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 719. క్రీ.శ. 1278.

మజ్జి[2] రూ.చూ. మధ్య. వి. 1. గర్భం, వస్తువులోని కేంద్రం ; 2. కేంద్రభాగం.

మజ్జికుండ చూ. మజ్జిగ.

మజ్జిగ వి. చల్ల, తక్రం. కాశీ. 6.186.

క. మజ్జిగె. మజ్జిగ, తు. మజికోలు. కవ్వం ; త. మచ్చికై ; కో. మంజ్. మజ్జిగ ; తొ. మొజ్ ; ఒరయాన్. మహీ. మజ్జిగ ;

సం. మార్జికా, మార్జితా. పంచదార కలిపి పొగపిన పెరుగు ; పా. మజ్జిఅ. పంచదార కలిపి పొగపిన పెరుగు, మజ్జిగ. మధ్య సంబంధి.

మజ్జికుండ రూ.చూ. మజ్జిగకుండ. వి. మజ్జిగ చిలికే దానికి వాడే మట్టిపాత్ర. మజ్జిగకుండ రూ. మజ్జికుండ. వి. మజ్జిగ చిలికేదానికి వాడే మట్టిపాత్ర. మజ్జిగతెగులు వి. వరి, మిరప, వేరుసెనగ మొ. పైర్ల తెగులు. మజ్జిగరాగి వి. ఒక రకం రాగి పంట.

మజ్జీదు రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థనచేసే మందిరం.

మజ్జు విణ. జబ్బుగల ; వి. సోమరి.

మజ్జుగుజ్జులుపడు అ.క్రి. తలపటాయించు.

మజ్జె రూ.చూ. మధ్య. వి. గర్భం, వస్తువులోని కేంద్రం, కేంద్ర భాగం.

మజ్ఝా రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం. క్రీడా. 2.32.

మజ్ఝారె రూ.చూ. మజ. అవ్య. ప్రశంసార్థకం. ప్రబంధ. 484.

మజ్దూరు రూ. మజూరు. వి. 1. కార్మికుడు ; 2. కూలివాడు.

హిం.ఉ.పార. మజ్‌దూర్. కూలివాడు, కమతగాడు.

<ఉ. మజ్‌దూర్.

మజ్ముదారు రూ.చూ. మజుముదారు. వి. గణకుడు.

మజ్య రూ.చూ. మధ్య. వి. గర్భం, వస్తువులోని కేంద్రం, కేంద్ర భాగం.

మఝ్ఝిచెక్క రూ. మధ్యచెక్క. వి. మరమగ్గం చట్రంలో మేరువ పలకకు కిందిగా నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర.

మంచకొర్ర రూ.చూ. మంచుకొర్ర. వి. ఎర్రని గింజరకం కొర్రలు.

మంచపు దొడుగఅయగు చూ. మంచము.

మంచము వి. 1. పర్యంకం, ఖట్వ. ఉ.హరి. 2.172, సాంబ. స్థా. 64 ; 2. బండి ఇరుసుమీద నిలిచే అడ్డ, నిలువ పట్టెలు.

సం. మంచ-. మంచం ; ప్రా. మంచ-, మంచి. ఉచ్చాసనం, పరుపు; అ.మా. పా. మంచ-; అప. మంచ; క. మంచ.

<ప్రా. మంచ.

మంచపు దొడుగఅయగు అ.క్రి. రోగగ్రస్తుడగు, మంచం దిగలేని స్థితిలో పడిపోవు. మను. 3.131. మంచముకింద నూలు వి. కనపడని ప్రమాదం. తాళ్ల.సం. 9.84. మంచము కోళ్లు వి.బ.వ. 1. చెరువులో మొలిచే ఒకరకం గడ్డి ; 2. ఒకానొక పక్షి ; 3. మంచానికుండే కాళ్ళు ; 4. సప్తర్షి మండలంలోని నాలుగు చుక్కలు. మంచముగల్గునాడె నీళ్లాడు అ.క్రి. అన్నీ అమరినప్పుడే ఆపని నెరవేర్చుకొను. మంచము

పట్టు అ.క్రి. వ్యాధిగ్రస్తుడగు. మంచమువంచు అ.క్రి. మంచం వేయు. తాళ్ల.సం. 14.198 మంచమువేయు అ.క్రి. 1. జబ్బుపడు ; 2. పడకపెట్టు. మంచమెక్కు అ.క్రి. జబ్బుపడు. < మంచము + ఎక్కు. మంచానపడు అ.క్రి. రోగానపడు.

మంచమెక్కు చూ. మంచము.

మంచయిపోవు చూ. మంచు[1].

మంచానపడు చూ. మంచము.

మంచి[1] విశ. 1. మనోజ్ఞమైంది, ఇంపైంది. భార. ఆది. 4.29 ; 2. ఘనం, గొప్పది, అధికం, అత్యంతం, మిక్కిలి. భార. సభా. 1.17 ; భార. భీష్మ. 2.352 ; 3. ప్రశస్తమైన, శ్రేష్ఠమైన. ఉ. హరి. 1.83 ; 4. ఇష్టం, ప్రియమైంది. వరాహ. 5.8 ; 5. మేలైనది, లెస్స. ఆము. 4.41 ; 6. అనుకూలం, ఫలకారి. ఆము. 4.123 ; 7. ఇతర పదార్థాలు కలియని, స్వచ్ఛమైన ; వి. 1. సజ్జనుడు. భార. ఆరణ్య. 4.3 ; 2. మేలు, శుభం, లగ్గు. హర. 2.102 ; 3. సామం, కలుపుగోలుతనం (చతురోపాయాల్లో ఒకటి). ఆం.భా. 2.190.

సం. మంజు-. సుందరమైన, మనోహరమైన.

మంచి అనిపించుకొను అ.క్రి. మంచి అభిప్రాయం కలిగేటట్లు చేసికొను. మంచిఆరి రూ.చూ. మంచియారె. వి. గట్టిగా ఉండి ఇంధనంగా ఉపయోగపడే కలప కలిగి లేత పసుపు రంగు పూలుపూసే చెట్టు (Bauhinia racemosa). మంచికత్తాళి వి. కంచెల్లో పెంచబడే మొక్క (Aloe vera). మంచికంద వి. సారవంతమైన ఒదులు నేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు (Amor phallus campanulatus). మంచికలబంద వి. కలబందలో ఒకరకం. మంచికాల్పు వి. 1. ఎర్రగాల్పు, ఇటుక మొ.వి సరిగా కాలటం ; 2. నల్ల కాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్పు. మంచికి పోతే చెడుఎదురగు అ.క్రి. ఉపకారం చేయబోగా అపకారం అగు. మంచికుందెన వి. ఒకజాతి చెట్టు. హంస. 4.10. మంచికొరింత రూ. మంచికొరింద. వి. కొండలమీద పెరిగే ఒక తీగ (Acacia instia). మంచికొరింద రూ.చూ. మంచికొరింత. వి. కొండలమీద పెరిగే ఒకతీగ (Acacia instia). మంచికొలుపు వి. ఉత్తర సర్కారుల్లో పెరిగే పొద లేదా మొక్క (Grueria salwifolia). మంచి గంగులపాలు వి. గంగగోవుపాలు. బసవ. 3.62. మంచి గందము వి. శ్రీచందనం, సానమీద తీసిన చందనం. మను. 5.101. మంచిగంధంరంగు వి. ఒకరకం గోధుమరంగు. మంచిగాత రూ.చూ. మంచిఘాత. వి. తుమ్మిచెట్టు, తినేపళ్లు కాసే చెట్టు (Diospyros melanoxylon). మంచి గుమ్మడి వి. పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగ పైరు (Cucunbia maxina). మంచిగురస్తు వి. బలే మంచి మనిషివి అన్నఅర్థంలో వాడేది. శుక. 2.414. మంచిఘాత రూ. మంచిగాత. వి. తుమ్మిచెట్టు, తినేపళ్ళు కాసేచెట్టు (Diospyros melanoxylon). మంచిచికు రూ.చూ. మంచిసీకాయ. వి. చింతాకులాగా కూరగా ఉపయోగపడే ఆకులు, తలరుద్దుకోవటానికి ఉపయోగపడే కాయలు కాసేచెట్టు (Acacia concinna). మంచి చిక్కుడు వి. తోటల్లోను పెరళ్ళలోను సాగుచేసి పెంచే తీగపైరు (Polichos tipicus). మంచిచీపురు వి. గంజాం నుంచి గోదావరివరకు, దక్కను, కృష్ణనుంచి బళ్ళారివరకు గల ప్రదేశాల్లో పెరిగి పచ్చనిపూలు పూసేచెట్టు (Grewia excelsa). మంచిచెడ్డలు వి.బ.వ. అవుగాములు, మేలుకీళ్ళు. మంచిచెమ్మ వి. పదిపదిహేను అంగుళాల పొడవున బద్దగా ఉండే కాయలు గుత్తులు గుత్తులుగా కాసే ఒకరకం మొక్క. మంచిచేయు అ.క్రి. మేలుసేయు. మంచిజెముడు వి. దబ్బ చెముడు, కంచెమొక్క. మంచిటికి రూ.చూ. మంచిటుక. వి. పండిటుక, బాగాకాలిన ఇటిక. మంచిటికె రూ.చూ. మంచిటుక. వి. పండిటుక, బాగాకాలిన ఇటిక. మంచిటుక రూ. మంచిటికి, మంచిటికె. వి. పండిటుక, బాగాకాలిన ఇటుక. మంచితనము వి. 1. గొప్పతనం. భార. అశ్వ. 4.73 ; 2. కలుపుగోలుతనం, సామం. ఉరా. 2.320 ; 3. యోగ్యత, సౌజన్యం. మంచితుమికి వి. చిన్నచిన్న వస్తువులు తయారుచేయటానికి ఉపయోగించే కలపకలిగి తినే పళ్ళు కాసేచెట్టు (Diospyros tomentosa). మంచిదను అ.క్రి. సరేఅను, అంగీకరించు. శుక. 1.521. < మంచి[1] + అది + అను. మంచిది వి. మేలు, క్షేమం, కుశలం, శుభం. వాల్మీ. 1.43 ; అవ్య. 1. భయపెట్టటాన్ని తెలుపుతుంది. దశా. 2.292 ; 2. అంగీకారాన్ని తెలుపుతుంది. దశా. 3.32 ; విశ. యోగ్యం, ప్రశస్తం మొ. వి. దశా. 3.32. < మంచి + అది. మంచిదె అవ్య. అంగీకారాన్ని తెల్పుతుంది. ఆం. భా. 3.75. < మంచి + అది + ఎ[3]. మంచిదే అవ్య. అంగీకారాన్ని తెలుపుతుంది. దశా. 2.97. < మంచి + అది + ఏ[4]. మంచిదొండ వి. పొదగాపెరిగి విరివిగా కాపు కాసేపైరు (Coccinia indica) మంచిదోస వి. వంటకాల్లో ఉపయోగించే దోస. మంచినిద్ర వి. గాఢ నిద్ర. మంచినిమ్మ వి. ఊరగాయకు రసానికి పనికివచ్చే సన్నటి చర్మం కలిగిన చిన్న నిమ్మకాయ. మంచినీరు వి. కుడినీరు. మంచినీరుకుంచాలబోయు (-పోయు) అ.క్రి. వట్టి మాటలతో సంతృప్తిపఱచు. తాళ్ల. సం. 3 354. మంచినీళ్లు వి.బ.వ. తాగటానికి ఉపయోగపడే నీళ్లు. మంచినువ్వులు వి.బ.వ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనె గింజల చెట్లు. గింజలనుంచి నూనె తయారు చేస్తారు. వంటకాలకు సబ్బు, అత్తర్లు మొ. వాటి పరిశ్రమల్లోనూ వీటిని ఉపయోగిస్తారు. మంచినూనె వి. 1. నువ్వులనూనె ; 2. వేరుసెనగ నూనె. మంచిపగడము వి. స్వచ్ఛప్రవాళం, కృత్రిమం కాని పగడం. మంచిపట్టు వి. మంచిరకం పురుగులనుంచి వచ్చే పట్టు, పోగు ఒకచోటలావు, ఒకచోట సన్నం లేకుండా అంతటా సమంగా ఉంటుంది. మంచిపాపిడి వి. అందమైన తెల్లని పూలుపూసే చిన్నచెట్టు (Pavetta indica). మంచి పాము వి. నాగుపాము, తాచు. మంచిపాల వి. గృహాది నిర్మాణాలకుపయోగించే కలప నిచ్చే చెట్టు. మంచిపుల్లేరి రూ. మంచిపొలారి. వి. పెల్లగుమ్మడు, దళసరి ఆకులు కలిగి ఎర్రని తినేపళ్ళు కాసేచెట్టు. మంచిపొణకు రూ.చూ. మంచి పొలికి. వి. దుర్వాసన కల పూలు నిరుపయోగమైన

కలప కలచెట్టు (Sterculia foetida). మంచిపొన్న వి. ఊడలుకలిగి ఉపయోగపడే గట్టి కలపనిచ్చే చెట్టు (Rhizophora mucronata). మంచిపాలారి రూ.చూ. మంచిపుల్లేరి. వి. పెల్లగుముడు, దళసరి ఆకులు కలిగి ఎఱ్ఱని తినేపళ్ళు కాసేచెట్టు (Antidesma diandrum). మంచిపాలికి రూ. మంచిపొణకు. వి. దుర్వాసనకల పూలు నిరుపయోగమైన కలప కలచెట్టు (Sterculia foetida). మంచిబంగారము వి. కల్తీలేని బంగారం. మంచిబిక్కి వి. మందుల్లో ఉపయోగపడే జిగురునిచ్చే చిన్నచెట్టు (Gardenia gummifera). మంచిబీర[1] వి. తెల్లనికలపనిచ్చే చెట్టు (Hemi cyclia sepiaria). మంచిబీర[2] వి. మంచిబిక్కి, మందుల్లో ఉపయోగపడే జిగురునిచ్చే చిన్నచెట్టు (Gardenia gummifera). మంచిబీర[3] వి. వానాకాలంలో పెరళ్ళలోను మెట్టపొలాల్లోను పెంచే తీగపైరు కాయలు కూర దినుసుగా ఉపయోగపడతాయి. మంచిబెండ వి. ముద్రబెండ చెట్టు, కలుపుమొక్క, ఆకులు మృదువుగా, జిగటగా ఉంటాయి. (Sida rhombifolia). మంచిబెల్లము వి. చెరుకురసంతో చేసిన బెల్లం. మంచిభాగం వి. ఎనిమిది సెంట్ల భూమికొలత. మంచిమణఁగు వి. మంచి ఆభరణం. తాళ్ల. సం. 17.526. <మంచి[1] + మణుఁగు[2]. మంచిమండ వి. ఆకులు, దుంపలు తినటానికి ఉపయోగపడే మొక్క (Ceropegia bulbosa). మంచిమనసు వి. మంచిఅయిన మనస్సు. మంచిమాట వి. 1. స్నేహం. పొత్తు, సంధి. కకుత్థ్స. 3.72 ; 2. సుభాషితం, ప్రియభాషణం ; 3. వివాహం నిశ్చయం చేసికోవటం. మంచిమాటచేసికొను అ.క్రి. భోజనం చేయు. మంచిమినుము వి. మినుముల్లో ఒకరకం. మంచిముట్టు వి. 1. శుభప్రదమైన పెద్దల స్పర్శ ; 2. శుభప్రదమైన నూలిపోగు. మంచిముత్తెము వి. అకృత్రిమ మౌక్తికం. మంచిమేడి వి. గట్టిగా ఉండే కలపనిచ్చే చెట్టు (Ficus palmata). మంచిమొగి రూ.చూ. మంచిమోవి. వి. గృహ నిర్మాణానికుపయోగించే కలప కలిగి సువాసన కల పసుపుతో కూడిన తెల్లనిపూలు పూసేచెట్టు (Eugenia alternifolia). మంచిమొయది వి. మంచిమొగి, గృహనిర్మాణానికి ఉపయోగపడే కలప కలిగి సువాసన కల పసుపుతో కూడిన తెల్లని పూలుపూసే చెట్టు (Syzyglum alternifolium). మంచిమోవి రూ. మంచిమొగి. వి. గృహనిర్మాణానికి ఉపయోగపడే కలప కలిగి సువాసన కల పసుపుతో కూడిన తెల్లని పూలుపూసే చెట్టు (Eugenia alternifolia). మంచియల్లి వి. నీలి రంగుపూలు, తినే నల్లని పళ్ళు కాసేపొదలాంటి మొక్క (Memecylon edule). మంచియారె రూ. మంచిఆరి. వి. గట్టిగాఉండి ఇంధనంగా ఉపయోగపడే కలప కలిగి లేత పసుపు పూలు పూసేచెట్టు (Bauhinia racemosa). మంచియీత (-ఈఁత) వి. ముళ్ళుకలిగి, చాపల అల్లకానికి పనికివచ్చే ఆకులు కలిగి తినటానికి పనికివచ్చే చిన్నపళ్ళు కాసేచెట్టు (Phoenix dactylifera). మంచిరౌతు వి. గట్టిగాఉండేరాయి. మంచివాఁడు విణ. 1. సజ్జనుడు. ఆం. భా. 2.170 ; 2. సుకృతి. ఆం. భా. 3.3. మంచివాన వి. పెద్దవర్షం. మంచివిరులు వి.బ.వ. ధాన్యవిశేషం, ఒకజాతి వడ్లు. ప్రబంధ. 112. మంచివెట్టు (-పెట్టు) అ.క్రి. మంచితనం చూపు. శుక. 3.294. మంచివేళ వి. అనుకూలం అయిన సమయం. మంచిసరకు వి. మంచివస్తువులు. మంచిసాంబ్రీలు వి.బ.వ. ఒకరకం వడ్లు. మంచిసీకాయ రూ. మంచిచికు. వి. చింతాకులాగా కూరగా ఉపయోగపడే ఆకులు కలిగి తలరుద్దుకోవటానికి ఉపయోగపడే కాయలు కాసే చెట్టు (Acacia concinna). మంచిసురుబి వి. కొండలమీద పొదగా పెరిగే మొక్క (Sageretia opposilifolia). మంచిసెనగ వి. మెట్టలో పండే ఒకరకం పప్పు దినుసు. మంచెవలు వి.బ.వ. మనుషులు తినే బార్లీ బియ్యం. సం. యవ-. బార్లీ. < మంచి[1] + సం. యవ- + -లు.

మంచి[2] రూ.చూ. మంచియ. వి. చాలాఎత్తున వేసిన పందిరి. మంచియ రూ. మంచి[2]. మంచె, మణిసి[2], మనిసి[2], మంత[2]. వి. జొన్నచేలు మొ. వాటి కాపలా కాయటం కోసం కూర్చోవటానికి ఎత్తుగా వేసే చప్పరం, అరప. శుక. 2.410.

సం. మంచ-. వేదిక, మంచం, మంచక-, మంచికా-. ఎత్తుగా కట్టిన నీళ్ళ తొట్టి ; ప్రా. మంచీ-, మంచిఆ, మంచక- ; పా. మంచ-. పొలంలో కాపలావాడు, కూర్చోవటానికి ఎత్తుగా కట్టిన చప్పరం వంటిది ;

క. మంచికె, మంచిగె ; మ. వచ్చ ; ఒరయాన్. మంచీ ; బ్రా. మన్న.

<ప్రా. మంచిఆ.

మంచు[1] రూ. మంచుక, మనుసు. వి. 1. హిమం, తుహినం. కు.సం. 5.38 ; 2. శీతాకాలం, శిశిరరుతువు. మను. 6.26 ; 3. ఉష్మం, ఆవిరి, నుదురికి పట్టిన చెమట. దశా. 4.232.

క. మంజు. మంచు ; కొడ. మఞ్. మంచు ; తు. మైందు. మంచు ; త. మంచు. మబ్బు, తెల్లమబ్బు మంచు ; మ. మఞ్ఞు. మంచు, హిమం ; కో. మంజ్. మబ్బు ; తొ. మోజ్. మబ్బు ; కువి. మొంచూ, మంజు. మంచు ; పర్జి. మఞ్, మంజ్. మంచు, మేండర్, మేఁదిర్. మంచు ; కొలా. మంచ్. మంచు ; గ. నేందిర్ మంచు.

<మూ.ద్రా. *మఞ్.

మంచయిపోవు రూ. మంచైపోవు. అ.క్రి. మంచులా విరిగిపోవు, తొలగిపోవు. పండి.చ. 1.2 పు. 2 పం. <మంచు + అగు + -ఇ[13] + పోవు. మంచుకారు వి. హేమంతఋతువు. ఆం.భా. 1.86. మంచుకుంచములు గొలుచు(-కొలుచు[1]) అ.క్రి. అసాధ్యం అయిన కార్యాల్ని నిర్వర్తించగలుగు. కు.సం. 8.135. మంచుకొర రూ.చూ. మంచుకొర్ర. వి. ఎఱ్ఱని గింజరకం కొర్రలు. మంచుకొర్ర రూ. మంచకొర్ర, మంచుకొర. వి. ఎఱ్ఱని గింజరకం కొర్రలు. మంచుగుబ్బలి వి. హిమవత్పర్వతం. భీమ. 4.154. మంచుఁగొండ(-కొండ) వి. హిమవత్పర్వతం. హర. 7.33. కాశీ. 1.40. మంచుఁగొండచూలి వి. పార్వతీదేవి. పల్నా. 2.249. మంచుఁగొండరాచూలి వి. పార్వతీ.

దేవి. హర. 4 86. మంచుగొను(-కొను) అ.క్రి. మంచు కప్పినదగు. కు నం. 6.128. మంచుజోదు రూ. మంచుం జోదు. వి. చంద్రుడు. ఉ. హరిశ్చ. 2.44. మంచుంజోదు రూ.చూ. మంచుజోదు. వి. చంద్రుడు. మంచుతటి వి. హేమంతఋతువు. మంచుతెగులు వి. వరి, మిరప, వేరు సెనగ మొ. పైర్ల తెగులు. మంచుత్రాగుడుపులుగు వి. చకోరపక్షి. మంచుమలపట్టి వి. పార్వతి. మంచుమేపు వి. బీటిగడ్డపై కురిసిన మంచు ఆరిపోక ముందే వేకువన పశువుల్ని మేపటం. మంచువిచ్చినట్లు అవ్య. ఎండ వచ్చిన వెంటనే మంచు కరిగిపోయినట్లుగా అనటం. మంచువేల్పు వి. హిమకరుడు, చంద్రుడు. శ్రీరం.మా. 4.77. మంచై పోవు రూ.చూ. మంచయిపోవు. అ.క్రి. మంచులా విరిగి పోవు, తొలగిపోవు. జాహ్నవీ. 3.59.

మంచు² చూ. మను.

మంచు³ వి. ప్రహరీటోపీ మీద ఇటిక వరసల మధ్యవచ్చే చిన్న సందు.

త. మంచు మంచం, ముంజూరు.

మంచుక రూ.చూ. మంచు¹. వి. హిమం. నిర్వ.రా. 3.26.

మంచె రూ.చూ. మంచియ. వి. 1. జొన్నచేను మొ. చోట్ల కూర్చోవటానికి ఎత్తుగా వేసే చప్పరం వంటి పందిరి. ఆము. 4.163 ; 2. పందిరిలాగ వేసి పైన గడ్డిని నిలవ చేసుకొనే కట్టడం ; 3. గాదెకింద పెట్టిన ఎత్తుపీట ; 4. నీడ కోసం స్తంభాలమీద తడికలో ఆకులో పరిచి కట్టిన తాత్కాలిక నిర్మాణం ; 5. ఎత్తుగా ఉండే గోడల్ని కట్టటానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం ; 6. మళల, సున్నబ్బట్టీ పైభాగంలో ముఖ్యంగా జాతి బట్టీలమీద మనిషి తిరగటానికి వీలుగా కట్టిన అంచె.

మంచెకర్ర వి. అడ్డుకర్ర, అటకలమర్చేందుకు గోడలో నాటిన కొయ్య ముక్క. మంచెపెట్టు వి. రెండు కోనుల దూరం.

మంచెవలు చూ. మంచి¹.

మంచైపోవు చూ. మంచు¹.

మంజర్య చూ. మంజీరవావు. వి. గూడుపట్టి కుంటలం.

మంజలి వి. 1. ఎర్రటి మన్ను, తిరుచూర్ణం. ద్వి.పరమ. వి. 3.1692 పు. 13 పం ; 2. పసుపు, హరిద్ర. ప్రబంధ. 78.

క.తు. మంజ్ళ. పసుపువర్ణం ; త. మంజళ్. పసుపు. పసుపువర్ణం ; మ. మఞ్ఞళ్.

మంజల్‌పీట రూ.చూ. మంజిరిపీట. వి. తురుముపీట.

మంజన రూ. మందన, మందనము. వి. మందనం, పెట్టె. భార. ఆది. 5.30.

సం. మంజిషా, మంజూషకా, మంజూషా. పెట్టె ; ప్రా. మంజూసా, మంజుసా ; అ.మా. మంజూసా ; పా. మంజూసా. పెట్టె ; అప. మంజూస.

<ప్రా. మంజుసా.

మంజాడి రూ.చూ. మంజాళి. వి. బంగారం, రత్నాలు మొ. వాటిని తూచటానికుపయోగించే ఎర్రగింజలున్న గురివెంద చెట్టు, వజ్రప్రమాణ విశేషం, వజ్రాలఎత్తు, వజ్రాల తూనిక. ఆం భా. 2.278.

క. మంజాడి. గురువింద తీగ ; త. మంచాటి, మంచాళి. రెండు గురువిందగింజల ఎత్తు.

మంజాడుకొంగు వి. చీరకట్టుకున్నప్పుడు భుజం మీద వేలాడేట్టు వేసుకొనే చెరగు.

మంజాళి రూ.చూ. మంజాళు. వి. వజ్రాలఎత్తు, రత్నాల తూనిక.

మంజాళు రూ. మంజాడి, మంజాళి. వి. వజ్రాలఎత్తు, రెండు గురువింద గింజలఎత్తు. T.T.D.E.S.III32. క్రీ.శ. 1512.

క. మంచటిగె, మంజాడి, మంజెట్టి. గురువింద చెట్టు ; తు. మంజెట్టి. గురువిందచెట్టు ; త. మంచాటి. ఎర్రకర్ర (Adenauthera pavoueora). రత్నాలు, బంగారం మొ. వి తూచటానికుపయోగించే గురువింద గింజ, మంచాళి. కంసాలి వాళ్ళు బంగారం మొ. వి తూచటానికుపయోగించే తూనిక ; మ. మంచాటి. నాలుగు ధాన్యం గింజల ఎత్తున్న తూనిక, బంగారం మొ.వి తూచటానికి ఉపయోగించేది.

మంజిటి వి. మంజిష్ఠ.

సం. మంజిష్ఠా. మంజిడి ; ప్రా. మంజిట్ఠా ; నే. మజిఠొ ; హిం. మంజీట్, మంజీఠ్.

<ప్రా. మంజిట్ఠా.

మంజిడి వి. 1. చిత్రవర్ణ వస్త్రం. పండి. చ. 5.309 ; 2. చిత్రవర్ణంకలది. శృం.నై. 7.155 ; 3. నీలవర్ణ వస్త్రం. పాండు. 2.110 ; 4. ఎరుపు మించిన పసుపువన్నె. కళా. 7.171.

సం. మాంజిష్ఠ-. మంజిష్ఠాలతనుండి తీసే ఎర్రని రంగు ; ప్రా. మంజిట్ఠ-. ఎరుపు ; అ.మా. మంజిట్ఠా. ఎరుపురాతువు ; పా. మంజేష్ఠ-. లేత ఎరుపురంగు ;

క. మంజటిగె, మంజట్టిగె ; మ. మంజెట్టి.

<ప్రా. మంజిట్ఠ-.

మంజిరిపీట రూ. మంజల్‌పీట. వి. తురుముపీట.

మంజిళ్లు వి.బ.వ. అశ్వాల చిత్రగతి విశేషం.

మంజీరవావు రూ. మంజీరావు. వి కాలిగుత్తిగగర వావు.

మంజీరావు రూ.చూ. మంజీరవావు. వి. కాలిగుత్తిదగ్గర వావు.

మంజు వి. ఇంటికప్పు గట్టిపడేవరకు నీరు నిలబడటానికి కట్టిన మట్టికట్ట, మడి.

త. మంచు. మంచం, ఇంటి పైకప్పుకు సంబంధించిన ఒకరకం కట్టడం.

మంజుదారీ వి. లెక్కలు సరిచూసే ఉద్యోగం.

హిం. మజ్‌మూదారీ, మజుమ్‌దారీ. భూమిపన్ను వసూలుచేసే అధికారి ; ఉ. మజుమ్‌దారీ-. లెక్కలు సరి చూసే ఉద్యోగం ; పార. మజుమ్‌దారీ. లెక్కలు సరి చూసే ఉద్యోగం ; మజుమ్. భూమిపన్ను వసూలుచేసే అధికారం.

<ఉ. మజుమ్‌దారీ.

మంజుదారు రూ.చూ. మజుముదారు. వి. గణకుడు.

మంజుల్ వి. ఆర్చీ కట్టుబడి సమయంలో రాళ్ళపక్క భాగాలకు సున్నం పూయటం.

సం. మంజుల-. మనోహరమైనది, అందమైనది ; హిం. మంజుల్.

< హిం. మంజుల్.

**మటం** రూ.చూ. మటము. వి. ఎడమ కాలిపాదం కుడి తొడదగ్గరికి కుడిపాదం ఎడమ కాలివేళ్ళ దగ్గరకు వచ్చేలాగ కాళ్ళు ముడుచుకొని కూర్చోవటం.

**మటంవేసుకొను** అ.క్రి. **1**. కుండలు నర్సేటప్పుడు కమిదిపై కమ్మరి చతికిలబడి కూర్చునే తీరు ; **2**. ఎడమకాలి పాదం కుడి తొడదగ్గరికి, కుడిపాదం ఎడమ కాలివేళ్ళ దగ్గరికి వచ్చేటట్లు కాళ్ళు ముడుచుకొని కూర్చొను. **మటంసాటు** వి. కమిదిపై మటం వేసుకొని కూర్చొని తొడలపై కుండను పెట్టుకొని నర్సు.

**మటపల్ల** రూ.చూ. మడపలి. వి. దేవాలయంలోని వంటిల్లు. విప్ర. 5.6.

**మటమట** వి. మాడటం, మరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. భాగ. 9.241.

త. మటుమటెనల్, మటుమటువెనల్. నీరు పారే టప్పుడయ్యే ధ్వని. మటుక్కు మటుక్కెనాల్. నీరు తాగే టప్పుడయ్యే ధ్వని.

**మటమటమా(డు** అ.క్రి. ఆకలిచే నకనకలాడు. భాగ. 9.241. **మటమటలాడు** అ.క్రి. **1**. మండు, జ్వలించు ; **2**. విసుగుతో మాట మార్చుకొను. < మటమట + -లు + ఆడు.

**మటము** రూ. మటం. వి. పరదేశులు, సన్న్యాసులు మొ. వారు వసించే గృహం. ధర్మవరం శాసనం. క్రీ.శ. 850.

సం. మఠ-. సన్న్యాసుల నివాసం ; ప్రా. మఢ, మఢీ, మఠ- ; బెం. మొఠో ;

త. మటుమ్. సన్న్యాసాశ్రమం.

< సం. మఠ-.

**మటిక**[1] రూ.చూ. మటికి. వి. మట్టిపాత్ర.

**మటిక**[2] రూ.చూ. మటికె[2]. వి. గోరుచిక్కుడు.

**మటికి** చూ. మట్టి. రూ. మటిక[1], మటికీ, మటికె, మట్కి, మడికి, మడ్కి. వి. కుండమీద మూసిపెట్టే మట్టిపాత్ర.

**మటికిపావు** వి. మజ్జిగ పోసేందుకు వాడే చిన్న మట్టిపాత్ర.

**మటికీ** రూ.చూ. మటికి. వి. పీర్ల పండుగలో పానకం చేసుకోవటానికి వాడే మట్టిపాత్ర.

**మటికె**[1] రూ.చూ. మటికి. వి. మట్టిపాత్ర.

**మటికె**[2] రూ. మటిక[2]. వి. గోరుచిక్కుడు (Cyamopsis-fefragonoloba).

ఉ. మటిక, మిటిక, మొటిక. గోరుచిక్కుడు : మరా. మటకీ.

< మరా. మటకీ.

**మటిక్కారువడ్లు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**మటిక్కారువడ్లు** చూ. మటికె[2].

**మటింకొయ్య** వి. మానికంకొయ్య, బండిపరం జారకుండ ఇరుసు మీద అడ్డం పెట్టిన కొయ్య.

**మటియా** రూ.చూ. మట్టియ[2]. వి. చిన్నబిందె.

**మటుకు** రూ. మట్టుకు. అవ్య. వరకు, సంబంధించినంతవరకు.

**మటుమాయ** రూ. మటుమాయము. విశే. **1**. అదృశ్యం, కన్పడనిది. చిత్రభా. 2.95 ; **2**. మిక్కిలిమాయ, మోసం. సారంగ. 2.13 ; **3**. మాయావి, మిక్కిలి టక్కరి. గౌ. హరి.పూ. 1709 పం.

సం. మాయా. మాయ.

**మటుమాయకా(డు** వి. మిక్కిలి మాయలు కలవాడు. **మటుమాయతనము** వి. మిక్కిలిమాయ. ప్రభు. 2.50 పు. 9 పం. **మటుమాయలబండి** విశే. మిక్కిలి మాయలు కలది. ద్వి. పరమ. వి. 4.298. **మటుమాయలాడు** వి. మాయావి, టక్కరి. ద్వి. పరమ. వి. 4.309 పు. **మటుమాయలా(డి** విశే. మిక్కిలి మాయలు కలది. ద్వి. పరమ. వి. 4.285.

**మటుమాయంచేయు** చూ. మటుమాయము.

**మటుమాయము** రూ.చూ. మటుమాయ. విశే. **1**. అదృశ్యం, కన్పడనిది ; **2**. మిక్కిలి మాయ, మోసం ; **3**. మాయావి, మిక్కిలి టక్కరి.

**మటుమాయంచేయు** స.క్రి. చూస్తుండగానే కనపడకుండా మరుగు పరచు.

**మట్కి** రూ.చూ. మటికి. వి. పీర్ల పండుగలో పానకం చేసుకోవటానికి వాడే మట్టిపాత్ర.

**మట్ట** రూ. మంట[2]. వి. **1**. ఆకులుపేర్చి పెట్టిన చిన్న ముడుపు ; **2**. తాడి, కొబ్బరి మొ. వాటి ఆకు ; **3**. చిన్న తాటిచెట్టు ; **4**. లావు తాటినార ; **5**. ముంజేతి ముంగలి భాగం ; **6**. ఎండిపోయిన ఆకు, పెద్ద పువ్వుమీద ఉన్న రేకు.

క. మట్టె, మొట్టె. తాటికమ్మ, మడల్. కొబ్బరికమ్మ ; కొడ. మడలు. కొబ్బరికమ్మ ; తు. మడలు. తాటికమ్మ. త. మట్టై. కొబ్బరి, తాటి మొ. వాటి కమ్మ ; మ. మట్ట, మట్టల్. తాటికమ్మ.

**మట్టకట్టె** వి. ఆకు కప్పుమీది మిట్టపల్లాలు సరిచేసే సాధనం. **మట్టకర్ర** వి. జేబందు చెక్క, పొడుగ్గా సన్నగా ఉండే కొయ్యతాపి చెక్కసున్నం పట్టించిన తరవాత ఎచ్చుపెచ్చులు సరిచేయటానికి తాపీ పని వాళ్ళు వాడే పరికరం. **మట్టకారులు** రూ. మట్టకార్లు. వి.బ.వ. కాలిధాన్య భేదం. **మట్టకార్లు** రూ.చూ. మట్టకారులు. వి.బ.వ. ఒకరకం మెట్టవడ్లు. **మట్టకాల్వు** వి. ఆములో కుండలు సరిగా కాలని తీరు. **మట్టకైల** వి. ముప్పాతిక గజం వెడల్పు పెట్టి నేసిన ఒకరకం తురకల గళ్ళలుంగీ. **మట్టగడన** రూ.చూ. మట్టగిడుసు. వి. మత్స్య విశేషం, ఒక జాతి చేప. **మట్టగడ్డి** వి. గొడ్లచే తొక్కించిన వెనుక కళ్ళంలోనుంచి తీసిన గడ్డి, కలిమట్టుగడ్డి. **మట్టగిచ్చు** స.క్రి. పత్రించు, క్రమంగా తగ్గించు, కమ్ము, కాలితో తొక్కు. **మట్టగించు** స.క్రి. **1**. పెకలించు. బసవ. 3.499 పం. 74 పు. ; **2**. తొలగించు. పా.శకు. 4.79 ; **3**. తక్కువచేయు ; **4**. నరికివేయు ; **5**. సున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **మట్టగిడుసు** రూ. మట్టగడన, మట్టగుడిశ, మట్టగొడిసె. వి. మత్స్య విశేషం, ఒకజాతి చేప. **మట్టగింపు** వి. మట్టగించటం, పెకలించటం. లక్ష్మీవి. 4.41. **మట్టగుడిశ** రూ.చూ. మట్టగిడుసు. వి. కొరమీను వంటి నల్లటి చిన్న మంచినీటి చేప, మట్టగొడిసె. **మట్టగేయు**

న.క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. మట్టగొడిసె రూ.చూ. మట్టగిడుసు. వి. ఒకరకం చేప. మట్టచెక్కిల్లు వి. సమానమైన కొలతల్లో ఉన్న చతురస్ర భుజాలు. మట్టతెగులు వి. చోడితెగులు, ఆకులు పొదగా పెరిగి ఎన్ను వెయ్యని తెగులు. మట్టతోపుడు వి. కొయ్యను తోవడాతో నున్నబరిచే తీరు. మట్టపలక రూ.చూ. మట్టపు పలక. వి. మట్టం చూపే పలక. మట్టపాటి విణ. కురుచది, పొట్టిది. మట్టరోగం వి. చెరకు, వరి, చోడి, సజ్జ మొ. పైర్ల తెగులు.

మట్టచం రూ.చూ. మట్టసము. వి. అంతటా ఒకే ఎత్తులో ఉండటం.

మట్టంచూరు చూ. మట్టము.

మట్టంచేయు చూ. మట్టము.

మట్టందట్టు చూ. మట్టము.

మట్టపరచు చూ. మట్టము.

మట్టపలక చూ. మట్టము.

మట్టపార్చి చూ. మట్టము.

మట్టపుకమాను చూ. మట్టము.

మట్టపుకిస్తీ చూ. మట్టము.

మట్టపుదబ్బ చూ. మట్టము.

మట్టపుపలక చూ. మట్టము.

మట్టపుబంగారు చూ. మట్టము.

మట్టపుబద్ద చూ. మట్టము.

మట్టపురవాకార్చి చూ. మట్టము.

మట్టపులాదు చూ. మట్టము.

మట్టప్దబ్బ చూ. మట్టము.

మట్టప్పలక చూ. మట్టము.

మట్టబు రూ.చూ. మట్టము. వి. మట్టం.

మట్టబెట్టు చూ. మట్టు[1].

మట్టమంచు చూ. మట్టము.

మట్టమధ్యాహ్నము చూ. మట్టము.

మట్టమార్చి చూ. మట్టము.

మట్టము రూ. మట్టబు, మట్టా, మ్రటం, మంటం. విణ. 1. సమానం. కు.సం. 9.133 ; 2. అల్పం, తక్కువైనది. ఉ.హరి. 3.125 ; 3. వామనం, పొట్టిది. నవనాథ. 19 పు. 7 పం. ; వి. 1. శిల్ప సాధనం, నేల మొ. వాటి ఎత్తు పల్లాలు సరిచూసే సాధనం ; 2. కొలది, మితి ; 3. తక్కువ ; 4. ఎత్తు కొలత, గోడ మట్టం ; 5. అంతా సమంగా ఉండటం ; 6. నేలపై ఆనే పాత్రల కిందిభాగం ; 7. రూపాయి.

క. మట, మట్ట, మట్టస. కొలత, ఎత్తు, హద్దు, తాపీవాని మట్టం ; తు. మట్టు. తాపీవాని మట్టం, మట్టు. కొలత ; త. మట్టమ్. కొలత, సమస్థితి, మట్టు. కొలత ; మ. మట్టమ్. ఇటికల సమస్థితి ; కో. మటమ్. సమస్థితి.

మట్టంచూరు రూ. మ్రటంనూరు. వి. సమతలంగా ఉన్న భూమి. <మట్టము + చూరు. మట్టంచేయు స.క్రి. వాటలకు పైభాగం చుట్టూ గతుకులు లేకుండ దబ్బతో సాపుచేయు. <మట్టము + చేయు. మట్టందట్టు వి. అసలుకే మోసం. <మట్టము + తట్టు[1]. మట్టపరచు స.క్రి. చెల్లాచెదురుగా పడిఉన్న వాటిని చక్కచేయు. < మట్టము + పఱచు. మట్టపలక రూ. చూ. మట్టపుపలక. వి. ఎచ్చుతగ్గులు సరిచేయటానికి తాపేవాళ్ళు వాడే పరికరం. మట్టపార్చి (-అర్చి) రూ.చూ. మట్టమార్చి. వి. పైభాగం బల్లపరుపుగా ఉండే ఆర్చి. మట్టపుకమాను వి. మట్టుమార్చి. పైభాగం బల్లపరుపుగా ఉండే ఆర్చి. మట్టపుకిస్తీ వి. గడ్లకిస్తీ, చ్రటంతో సమానమైన మట్టంలో ఉండే కిస్తీ. మట్టపుదబ్బ రూ. మట్టప్దబ్బ. వి. 1. జేబందు, సన్నగా పొడుగ్గా ఉండే కొయ్యతాపి, చెక్కనున్నం పట్టించిన తరవాత ఎచ్చు పెచ్చులు లేకుండా సరిచేయటానికి తాపీ వాళ్ళు వాడే పరికరం ; 2. ఆకు కప్పుమీది మిట్టపల్లాలు సరిచేసే చెక్క సాధనం. మట్టపుపలక రూ. మట్టపలక, మట్టప్పలక. వి. జేబందు చెక్క, పొడుగ్గా సన్నగా ఉండే కొయ్య తాపి, చెక్కనున్నం పట్టించిన తరవాత ఎచ్చు పెచ్చులు సరిచేయటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం. మట్టపుబంగారు వి. కోరాబంగారు. మట్టపుబద్ద వి. జేబందు, పొడుగ్గా సన్నగా ఉండే కొయ్య తాపి, చెక్కనున్నం పట్టించిన తర్వాత ఎచ్చుపెచ్చులు సరిచేయటానికి తాపీ పనివాళ్ళు వాడే పరికరం. మట్టపురవాకార్చి వి. పైభాగం చదునుగా ఉన్న రవాకు ఆర్చి. మట్టపులాదు వి. కంసాలి లాజు, సమానమైన మట్టంలో ఇటికలను నిలువున అతికి కప్పు వేయటం. మట్టప్దబ్బ రూ.చూ. మట్టపుదబ్బ. వి. 1. సన్నగా పొడుగ్గా ఉండే కొయ్యతాపి ; 2. ఆకు కప్పు మీది మిట్టపల్లాలు సరిచేసే సాధనం. మట్టప్పలక రూ.చూ. మట్టపుపలక. వి. కప్పుడు బద్ద, ఆకు కప్పుమీది మిట్ట పల్లాలు సరిచేసే చెక్క సాధనం. మట్టమంచు వి. 'L' ఆకారంలో డిజైను నేసిన అంచు. <మట్టము + అంచు[3]. మట్టమధ్యాహ్నము వి. కొంచమైన హెచ్చు తగ్గులు లేని పగటి నడిమిభాగం, మిట్టమధ్యాహ్నం. కట్టకడ, నట్టనడుమ మొ. శబ్దాల సామ్యంవల్ల "మధ్యాహ్నము + మధ్యాహ్నము >మట్టమధ్యాహ్నము" అనే శబ్ద రూపం ఏర్పడిఉంటుంది. మట్టమార్చి రూ. మట్టపార్చి. వి. లెవలార్చి. పై భాగం బల్లపరుపుగా ఉండే ఆర్చి. <మట్టము + ఆర్చి. మట్టము సేయు (-చేయు) స.క్రి. నశింపచేయు. భాగ. 6.49. మట్టసారం వి. అంతటా ఒకే ఎత్తులో ఉండటం.

మట్టవియు చూ. మట్టు[2].

మట్టసంకాల్పు చూ. మట్టసము.

మట్టసము చూ. మట్టము. రూ. మట్టచం. విణ. 1. పరిమితం. యయా. 4.134 ; 2. వామనం, పొట్టిది. ఆం.భా. 2.123 ; 3. పరిశుభ్రం ; 4. కచ్చితం ; 5. సరైనది ; 6. అధికం ; 7. అంతటా ఒకే ఎత్తులో ఉండటం ; 8. బుద్ధి, మర్యాదగా ; 9. పొదుపు.

మట్టసంకాల్పు వి. ఎర్రకాల్పు, ఇటిక మొ.వి సరిగా కాలటం. మట్టసానికి అవ్య. సంబంధించినంతవరకు.

మట్టసానికి చూ. మట్టసము.

మట్టసారం చూ. మట్టము.

**మట్టసి** చూ. మట్టము. విశ. వామనం, పొట్టిది, వామనుడు, పొట్టివాడు. ఆం.భా. 2.123.

**మట్టా** రూ. చూ. ముట్టము. విశ. 1. సమానం ; 2. అల్పం, తక్కువైన ; 3. వామనం, పొట్టిదైన ; వి. 1. శిల్ప సాధనం, నేల మొ.వాటి ఎత్తు పల్లాలు సరిచూసే సాధనం ; 2. కొలది, మితి ; 3. తక్కువ ; 4. ఎత్తు కొలత, గోడ మట్టం ; 5. అంతా సమంగా ఉండటం ; 6. నేలపై ఆనే పాత్ర కిందిభాగం.

**మట్టాం** రూ.చూ. మట్టు[2]. వి. కొడవలి, గుద్దలి, సెలగపార మొ.వాటి పలుగును కామతో కలిపే ఇనప కొండి లేక కాడ.

మట్టాంపార రూ.చూ. మట్టుపార. వి. తూముపార, రేకునకు తూములో కర్ర దిగేసిన సెలగపార.

**మట్టాడు** చూ. మట్టు[1].

**మట్టి** రూ.చూ. మట్టియ[2]. వి. మన్ను, మృత్తిక. కాశీ. 7.235.

మట్టికం వి. మట్టికట్టుబడి. మట్టికడతలు వి.బ.వ. కుండల మన్నులోని మట్టిబెడ్డలు. మట్టికడెం వి. గాబు తయారీలో అడుగుబళ్ళకు కడియంలాగా చుట్టూ గుండ్రంగా బెత్తెడెత్తుగా సాగదీసిన మట్టితాలిక. మట్టికాడ వి. కమండలం, కూజాకు పట్టుకోవటానికి పైన మట్టితో అమర్చిన వంకీ. మట్టికాసె వి. మట్టి రంగున్న దట్టి. చంపూ రా. 2.61. మట్టికుండ వి. పొయ్యిమీద ఎసరు పెట్టటానికి గంజి పోసుకోవటానికి వాడే ఒకరకం మట్టిపాత్ర. మట్టికోపా వి. మజ్జిగ పోసుకోవటానికి వాడే చిన్న పాత్ర. మట్టిగలాసు రూ. మట్టిగిలాస, మంటిగలాసు, మంటిగ్లాసు. వి. కల్లు తాగే పొడుగ్గా ఉండే మట్టిపాత్ర. మట్టిగిలాస రూ.చూ. మట్టిగలాసు. వి. కల్లు తాగే పొడుగ్గాఉండే మట్టిపాత్ర. మట్టిగుబ్బి వి. సులువుగా తిరగటానికి వీలుగా రంధ్రం ఉన్న మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ. మట్టిగుల్ల వి. మట్టి తట్ట, మోయటానికి పనికివచ్చే వెదురు బద్దలతో అల్లిన పళ్ళిక. మట్టిగొట్టం వి. సారాయిబట్టీలో బడ్డు బుడ్డీలోని సారాయి ఊట ఆవిరి రూపంగా రాయబారం కుండలోనికి పోవటానికి అమర్చిన మట్టిదోనె. మట్టిగొర్రు వి. ఆటగొర్రు, భూమిదున్నే గొర్రు, నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దున్నే ఆటగొర్రు. మట్టిచాపవి మట్టిమోతకు వాడే చాప. మట్టిచిప్ప వి. సన్నని అంచుతో కొంచెం లోతుగాఉండే మట్టికంచం. మట్టిటెంకె రూ. మట్టెంకె. వి. ఒకరకం మట్టిపాత్ర, పెద్దమూకుడు, చిప్పమాదిరిది, దీనిలో రంగునీళ్ళు పోసి నూలు లడీలు తడుపుతారు. మట్టితట్ట వి. అంచె, మట్టిగుల్ల, మట్టిబుట్ట, వడ్డెగంప, మట్టిమోయటానికి పనికివచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక. మట్టితైలము వి. మట్టినుంచి తీసే ధృతి. మట్టిదిమ్మ వి. సర్వేటప్పుడు కుమ్మరి కూర్చోవటానికి చేసుకొన్న మట్టిపీట. మట్టినూనె వి. బావులు గొట్టాలు మూలంగా నేలనుంచి ఎత్తేనూనె. మట్టిపగడము వి. ఇటిక పగడం. మట్టిపాకం వి. మట్టిపాత్రలు తయారుచేయటానికి అనుకూలంగా బిర్రుగా చిక్కటి పాకంలో ఉన్న బురదమట్టి. మట్టిపార వి. చెలకపార. మట్టిపని చెయ్యటానికి వడ్డెవారు, రైతులు వాడే పార. మట్టిపీట వి. కుండల్ని సర్వేటప్పుడు కుమ్మరి కూర్చోవటానికి చేసుకొన్న మట్టిదిమ్మ. మట్టిపెంకు వి. నాటుపెంకు, మామూలుగా ఇళ్ళు కప్పటానికి వాడే పెంకు. మట్టిపెట్టు వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. మట్టిపైపు వి. మట్టితో చేసిన గుండ్రని గొట్టం. ఇం. *Pipe*. గొట్టం. <మట్టి + ఇం. Pipe. మట్టిపొయ్యి వి. మూడు వైపులా గోడలాగ పెట్టి ముందువైపు కట్టెలు పెట్టటానికి జానెడు వెడల్పు మూతి ఉండే వంట పొయ్యి. మట్టిబాండలి రూ. మట్టిబాండీ. వి. రెండంగుళాల లోతులో అడుగు వెడల్పుతో రెండంచుల్తో ఉండే మట్టిపాత్ర. మట్టిబాండీ రూ.చూ. మట్టిబాండలి. వి. రెండంగుళాల లోతులో అడుగు వెడల్పుతో రెండంచుల్తో ఉండే మట్టిపాత్ర. మట్టిబాన వి. 1. నీళ్ళు పోసుకొనే తొట్టి ; 2. రంగు అద్దిన బట్టలు నానబెట్టే తొట్టి. మట్టిబిళ్ళ వి. గాబు, కాగు మొ.వి తయారుచేసేటప్పుడు అంగుళం మందంతో గుండ్రంగా మట్టితో చేసిపెట్టిన వలయాకార భాగం. మట్టిబుట్ట వి. మట్టి తట్ట, మోయటానికి పనికొచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక. మట్టిబురద వి. జిగట వచ్చేదాకా కాలితో తొక్కి తయారుచేసిన పాకంగల మట్టి. మట్టిబోలె వి. రంగునీళ్ళు పోసి నూలు లడీలు తడిపే ఒకరకం మట్టిపాత్ర. మట్టిమిద్ది రూ. మట్టిమిద్దె. వి. మట్టికప్పున్న ఇల్లు. మట్టిమిద్దె రూ. చూ. మట్టిమిద్ది. వి. మట్టికప్పున్న ఇల్లు. మట్టిమెత్తు వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. మట్టిరంగు వి. ఒకరకం గోధుమ రంగు. మట్టివన్నె వి. మట్టిరంగు. పి.శకు. 4.81. మట్టిసారి వి. మట్టిని మెత్తి చేసిన సారె. మట్టీమశానం వి. కశ్మలం. <మట్టి +- ఉన్ + మశానము. మట్టెంకె రూ.చూ. మట్టిటెంకె. వి. ఒకరకం మట్టిపాత్ర. పెద్ద మూకుడుచిప్పమాదిరిది. దీంట్లో రంగు నీళ్ళు పోసి నూలు లడీలు తడుపుతారు.

**మట్టిక** చూ. మట్టు[2].

**మట్టించు** చూ. మట్టు[1].

**మట్టినచోటె మట్టు** చూ. మట్టు[1].

**మట్టిమల్లాడు** చూ. మట్టు[1].

**మట్టియ**[1] రూ. మట్టె[1], మెట్టియ, మెట్టె. వి. 1. స్త్రీలు కాలి రెండవవేలుకి ధరించే ఆభరణ విశేషం. భార. విరా. 2.54 ; 2. మగవాడు కాలి రెండవవేలుకి ధరించే భూషణ విశేషం. భార.విరా. 2.250.

క. మెట్టు. కాలి రెండవవేలికి పెట్టుకునే ఆభరణం ; త. మెట్టి, మెట్టు. కాలి రెండవవేలికి పెట్టుకొనే ఆభరణం ; పర్జి. కాలి రెండవవేలికి పెట్టుకునే ఆభరణ విశేషం ; నా. మట్టె. కాలివేలికి పెట్టుకునే ఆభరణం.

**మట్టియ**[2] రూ. మటియా, మట్టి, మట్టె[2]. వి. మట్టి. కాశీ. 1.37.

సం. మృత్తికా. భూమి, మట్టి ; ప్రా. మట్టీ ; పా. మట్టీ, మట్టిఅ, మత్తియా ; నే. మాటో ; అ. బెం. ఒ. మాటీ ; హిం. మాటీ, మాఁటీ, మట్టీ, మిట్టీ ; సిం. మిటి ; గు. మాటీ, మాఁటీ.

<ప్రా. మట్టిఆ.

మట్టీమశానం చూ. మట్టి.

మట్టు[1] చూ. మెట్టు. 1. బాధించు. కు.నం. 8.153; 2. తొక్కు. కు.నం. 9.102; 3. ప్రవేశించు. ఉ. హరి. 2.37; 4. పడవేయు. హర. 7.44; 5. అణగతొక్కు. పారి. 3.33; 6. అధఃకరించు. రాజవా. 3.87; వి. 1. ఐటికబట్టీ అడుగుభాగం, బట్టీపొయ్యిమీద అడ్డంగా ఉంచిన రాయి; 2. బొద్దుచూరు, వెడల్పుగా లావుగా ఉన్న చూరు; 3. కప్పు ఎగరకుండా దానిమీద వేసే కట్ట; 4. గందపుట్టె, తలుపు రెక్కమీద అడ్డంగా బిగించే కొయ్య బద్ద.

మాల్తా. మడ్య్-, మడ్చ్. తొక్కు.

<మూ.ద్రా. *మంట్-/*మట్.

మట్టబెట్టు స.క్రి. చప్పుడుచేయు, మెత్తగా చితగ్గొట్టు. <మట్టు[1]+-అ[7]+పెట్టు. మట్టాడు అ.క్రి. వ్యాపించు. రం.రా.యు. 387 పు. 5 పం. స.క్రి. 1. తొక్కు. రం.రా. ఉ. 42 పు. 13 పం.; 2. మథించు, పీడించు. చంపూరా. 6.11. <మట్టు[1]+ఆడు. మట్టించు స.క్రి. 1. తొక్కించు. భాస్క.రా.యు. 871; 2. కళ్ళంలో వేసిన కుప్పలు ఎడ్లచే తొక్కించు. <మట్టు[1]+-ఇంచు[3]. మట్టినచోటెమట్టు అ.క్రి. తిరిగినచోటె తిరుగు. తాళ్ల.నం. 9.51. మట్టిమల్లాడు స.క్రి. పాడుచేయు, ధ్వంసంచేయు. రం.రా. ఉ. 29 పు. 29 పం. <మట్టు[1]+-ఇ[13]+మల్లాడు. మట్టుకర్ర రూ. చూ. మట్టుగర్ర. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చు కర్రను కిందికిలాగే కర్ర. మట్టుగడ్డి వి. నురిపిడిలో గింజలు రాలిపోయినా నలుగుడు పడక మట్టగా ఉండే గడ్డి. మట్టుగర్ర (-కఱ్ఱ) రూ. మట్టుకర్ర. వి. పావ చెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర, అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది. దీనికి రెండు వైపులా అచ్చు కర్రల తాళ్ళు కట్టి ఉంటాయి, ఇటువంటి కర్రలు రెండుంటాయి. మట్టుగర్రతాడు వి. మగ్గంలో పూను గర్రకు కట్టిన దారం. మట్టుపడు అ.క్రి. 1. కుదురుపడు, స్థిరపడు. ద. హిం.శా. సంపు. 6. శా.సం. 103: క్రీ.శ. 1145; 2. అడుగు, నశించు. హరి. ఉ. 8.157; 3. చచ్చు. జైమినిభా. 5.145. త. మట్టుప్పడు. మట్టుపఱచు స.క్రి. 1. కుదురు పర్చు, బాగుచేయు. జైమినిభా. 6.30; 2. అలంకరించు, ధరింపచేయు. మను. 6.5; 3. తగ్గించు, చాలించు, విర మించు హ. స. 2.62. మట్టుపెట్టు రూ. మట్టువెట్టు. స.క్రి. 1. చంపు, వధించు. భాస్క. రా. కిష్కిం. 677; 2. సమాధానపరచు. కుచే. 1.35; 3. తెగగొట్టు. కువ. చ. 3.43; 4. అణచు. ఉ. రా. 5.11; 5. కుదురుపర్చు. వేమ. 3.279. మట్టుపొయ్యి వి. బూడిదనేల రాలకుండ అడుగుభాగంలోనే నిలిచేటట్లు చేసిన మట్టిపొయ్యి. మట్టుబల్ల వి. 1. పత్తిరాట్నం కిందిపీట; 2. రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట; 3. పంటెఆకులు బిగింపుకు వేసేఅడ్డ బద్దల్లో పైది. మట్టువెట్టు (-పెట్టు) రూ.చూ. మట్టుపెట్టు స.క్రి. 1. చంపు, వధించు. ఉ.రా. 2.13; 2. అణచు; 3. తెగగొట్టు; 4. సమాధానపరచు; 5. కుదురుపర్చు.

మట్టు[2] రూ. మట్టాం. వి. 1. కుదురు, మూలం. కు.నం. 7.119; 2. మర్యాద. కట్టుబాటు. రం. రా. బాల. 5పు.; 3. ఆధారం. హర. 6.40; 4. ప్రదేశం, చోటు. జైమినిభా. 3.28; 5. పరిమాణం. కాశ. 3.112; 6. అందం. విజయ. 3.13; 7. మితి, మేర. కకుత్స్థ. 3.114; 8. విధం. ప్రబంధ. 788; 9. తొక్కుడు. రాజవా. 3.49; 10. పాతు. రాజవా. 3.87; 11. అరమరిక, కుదిరిక. దశా. 9.223; 12. కుండఉంచే కుదురు; 13. పారను పట్టుకునే పిడి; 14. తాపీరేకును పిడిని కలిపే వంగిన ఇనప చువ్వ; 15. కావడిలో వస్తువులనుంచే వలయం; 16. ఎత్తునుగాని, లోతునుగాని చెప్పే పరిమాణం, రెండుగజాల కొలత; 17. మనిషి ఎత్తుకు సమానమైన వాటిలోతు; 18. రాతిస్తంభాలకింద ఆధారంగాను అలంకారంగాను పెట్టే మలిచిన రాతిపీట; 19. నారుపోసిన భూభాగం; 20. నాగవల్లి సామానులో ఒకటి, గుండ్రంగా చిప్పలాగా ఉండి మధ్యలో రంధ్రంఉండే పనిముట్టు; 21. కూజా, కంచుడు మొ. పాత్రలకు అటూ ఇటూ దొర్లకుండా ఉండటానికి కింది భాగంలో అర అడుగు దళసరితో బెత్తెడు వెడల్పు పెట్టిన భాగం.

క. మటు, మట్టు, మట్టుస కొలత, హద్దు, క్రమం, మూలమట్టం; తు. మట్టు. తాపీపనివాడి మూలమట్టం, పరిమాణం, ఎత్తు, మట్టు. పరిమాణం, మేర, హద్దు సామర్థ్యం; త. మట్టుమ్. కొలత. సమానత, నిబంధన, గీత, హద్దు, మితి, పరిమాణం, లోపొడవులో సమానత. మట్టు, మట్టాయ్. మితంగా, మట్టు. కొలత, పరిమాణం, మొత్తం, ప్రమాణం, దశ, స్థితి, అవకాశం, అంచనా, ప్రామాణిక పరిమాణం, మటంకు. కొలత, పరిమాణం, మెట్టు, అంతస్తు; మ. మట్టు. పొడవు, పరిమాణం, మట్టమ్. నిబంధన. ఇటుక మట్టం, మూలమట్టం.

మట్టవియు అ.క్రి. అడుగుభాగం పగులు. కు. సం. 7.119. <మట్టు[2]+అవియు. మట్టిక వి. పాదపీఠం. చంద్రికా. 2.79. మట్టుకమీరు రూ. చూ. మట్టుమీఱు అ.క్రి. మితిమీరు. రాధికా. 4.48. మట్టుకర్ర వి. తాగాడి, నీళ్ళలో పైకివచ్చిన ఏతం బొక్కెన అందుకునే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య. మట్టుకు రూ.చూ. మటుకు. వరకు, సంబంధించినంత వరకు. మట్టుకుతెచ్చు అ.క్రి. దారికితెచ్చు. వర. రా. కిష్కిం. పు. 377.22. మట్టుకొను అ.క్రి. కుదురుకొను, నెలకొను. విక్ర. 1.139. మట్టుకొలుపు రూ.చూ. మట్టుకొల్పు. స.క్రి. మట్టుకొనచేయు. మట్టుకొల్పు రూ. మట్టుకొలుపు. స.క్రి. మట్టుకొనచేయు. విక్ర. 2.73. మట్టుగడప వి. పేనుముందు పంచగుమ్మానికి ఎదురుగా ఉన్న ఎత్తయిన భాగం. మట్టుచీల వి. నొగచీల, గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టేమేకు. మట్టుచెక్క వి. ఏతం మానుకు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. మట్టుచేయు స.క్రి. చక్కచేయు, సమాప్తంచేయు. ద్వి. సార. చ. 1.718. మట్టుదొరంగు (-తొరంగు) అ.క్రి. అతిశయించు. ఇందు. 2.135. మట్టుదొలి (-తొలి) వి. కొయ్యమట్టు.

విత్తనాలు పడటానికి గొర్రు చెక్కలకు వేసిన బెజ్జం. మట్టుపార. రూ. మట్టాంపార, మట్లుపార. వి. 1. తూముపార, రేకుకున్న తూములోకర్రదిగేసిన సెలగపార ; 2. మొత్తం ఇనుముతో చేసినపార. మట్టుమిగులు అ.క్రి. అతిశయించు. మట్టుమీరు రూ.చూ. మట్టుమీఱు. అ.క్రి. అతిశయించు. తాళ్ల. సం. 10.53. మట్టుమీఱు రూ. మట్టుకమీరు, మట్టుమీరు, అ.క్రి. మితిమీరు. అతిశయించు. వసు. 2.140. మట్టుమేర వి. అడ్డు, సరిహద్దు. తాళ్ల. సం. 9.112. మట్లుపార రూ.చూ. మట్టుపార. వి. తూముపార, రేకుకున్న తూములో కర్ర దిగేసిన సెలగపార.

**మట్టు**[3] స.క్రి. 1. చుట్టుముట్టు, ఆవరించు. ఉ. హరి. 2.60 ; అ.క్రి. 1. వ్యాపించు, ప్రసరించు. భర్తృ. 3.82 ; 2. గుమికూడు.

క. మడు. గట్టిగా (ఒకచోట) చేర్చికట్టు, కూర్చు, దరిచేర్చు ; త. మట్టు (మట్టి-). దగ్గరగా ఉండు ; కూడు, గుమికూడు, నొక్కు, జనసమ్మర్దం, హెచ్చుగు, తోయు. మటు (-ప్పు-ట్ట్-). నొక్కు, తోయు, అణచు, కలియు, గూడు, మట్టుక. పరిగెత్తించు.

మట్టుకా(కర వి. ఒకదినుసు కాకర. మట్టుబచ్చలి వి. దుంపబచ్చలి. ఉపోదక. మట్టుబీర వి. ఒకదినుసు బీర.

**మట్టు**[4] విశే. 1. వామనం, పొట్టిది, తక్కువది, అల్పం. పండి, చ. 1.40 ; 2. సుందరం. భీమ. 1.101 ; 3. స్థిరం. రామే. 4.112.

క. మట్టు, మొట్టు, మట్టు. పొట్టిది, చిన్నది, చిన్న గుర్రం, మొటకు. పరిమాణంలో చిన్నది, ముక్క, తునక ; తు. మట్టి- తౌతె. చిన్నదోసకాయ ; త. మట్టుమ్. చిన్నతనం, తక్కువతనం, కొరత, చిన్నగుర్రం పిల్ల, లేతచెట్టు, మట్టుయ్. అప్రయోజకుడు, ఏవిధమైన విలువలేనివాడు, ఒకరకం వరి ; మ. మట్టుమ్. చిన్నగుర్రం ; కో. మట్టుమ్ న్యూనతాభావం, తక్కువతనం.

మట్టుకత్తి వి. బెత్తెడు వెడల్పు పల్చగా ఉండే రేకు ముక్కను ఒకవైపున పిడిగా పనికివచ్చేటట్లు చుట్టుముట్టి తయారు చేసిన పనిముట్టు.

**మట్టు**[5] వి. 1. ఆవులు మొ. వాటితోక. భార. విరా. 4.265 ; 2. కొబ్బరిచెట్టు, తాటిచెట్టు మొ. వాటికమ్మ. భీమ. 2.53 ; 3. పత్రవృంతం ; ఆకుతొడిమ. ఆం. భా. 2.77.

క. మట్టె, మొట్టె. తాటాకు, కొబ్బరిచెట్టు, ఈతచెట్టు, కొబ్బరిచీపురు, మడల్. కొబ్బరిమట్ట, వట్టె. ఆవు మొ. వాటితోక ; కొడ. మట్ట. కొబ్బరిచెట్టు, మొదట్లో ఉండే ఆకు వంటి బాగం ; తు. మడల్. కొబ్బరిచెట్టు, తాటిచెట్టు మొ. వాటి కమ్మ ; త. మట్టయ్. కొబ్బరిచెట్టు, తాటిచెట్టు మొ. వాటికొమ్మ, మటల్. తాటిచెట్టు. కొబ్బరిచెట్టు మొ. వాటి కమ్మ ; మ. మట్ట, మట్టల్. తాటికమ్మ, తాటాకు.

మట్టుగార్చు అ.క్రి. గేదెలు మొ. వి కట్టటానికి ముందు తెల్లని రసిని కార్చు. మట్టుబోయు (-పోయు) స.క్రి. గేదెలు మొ. వి కట్టటానికి తెల్లని రసినికార్చు.

**మట్టు**[6] వి. గూడకొమ్ము, గూడ పైపైపు తాడుకట్టే చివర.

**మట్టె**[1] రూ.చూ. మట్టియ[1], వి. 1. స్త్రీలు కాలి రెండోవేలికి ధరించే ఆభరణ విశేషం. భీమ. 1.105 ; 2. పికాసితాడు, కుచ్చు తాడుకలిపే ఉంగరం లాంటి చుట్టు.

క. మెట్టు. మెట్టె ; త. మెట్టి, మెట్టు ; పర్జి. మట్టు ; నా. మట్టె.

**మట్టె**[2] రూ.చూ. మట్టియ[2]. వి. మన్ను, మృత్తిక. చంద్రికా. 5.33.

మట్టెవన్నె వి. మట్టిరంగు. కాశీ. 4.197.

**మట్టె**[3] రూ.చూ. మచ్చ[1]. వి. 1. ఏదైనారంగు మీద మరో రంగు మచ్చ ; 2. బట్టల ఆవు, మచ్చలున్న ఆవు.

**మట్టెంకె** చూ. మట్టి.

**మట్ర** వి. 1. దున్నేటప్పుడు కొండ తిరగకుండ మధ్యలో నిలిచే కొంత తావు. పాండు. 3.24 ; 2. చిన్న కొమ్మ.

మట్రకమాను వి. మట్టమార్చి. పైభాగం బల్లపరుపుగా ఉండే ఆర్చి.

**మట్రంసూరు** చూ. మట్రము.

**మట్రము** రూ.చూ. మట్టము. వి. 1. స్తంభానికిపైన దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొన చదునుగా ఉండేటట్టు కట్టిన, వెడల్పుగా పొడుగ్గా ఉండే ఉబ్బెత్తు భాగం ; 2. అంతా నమంగా ఉండటం, సరిసమానం.

మట్రంసూరు రూ.చూ. మట్టంచూరు. వి. సమతలంగా ఉన్న భూమి. మట్రాడు వి. ఆర్చి, స్తంభాలమీద అంచులు మాత్రం మోపి పైకి విలువంపుతో నిర్మించిన కట్టడం, మధ్యభాగం ఆధార రహితంగా ఉండి పై బరువును మోస్తూ కింది కాళీస్థలానికి కప్పుగా ఉంటుంది.

**మట్రాడు** చూ. మట్రము.

**మట్లుపార** చూ. మట్టు[2].

**మట్వాడబండి** వి. పొట్టిబండి, చిన్నబండి.

**మఠంఇనాం** వి. మఠ సంస్థకిచ్చిన ఇనాం.

సం, మఠ-. విద్యార్థులు మొ. వారి నివాసం ; హిం.ఉ. ఇనామ్. బహుమతి.

<సం. మఠ- + -ము + ఉ. ఇనామ్.

**మఠాయించు** స.క్రి. అదలించు, కొయ్యసాధనాలతో మెల్లగా కొట్టు, బాదు.

హిం. మఠా, మఠా. మజ్జిగ.

<హిం. మఠా + -ఇంచు[3].

**మడ**[1] వి. 1. ప్రవాహమార్గం. నవనాథ. 1.9 పు. 14 పం. ; 2. చెరువు, కాలవలనుండి పొలాలకు నీరు పెట్టే కాలవ.

క. మడె, మడ. చిన్న ఆనకట్ట, తూము, చేనికి నీరు పారే బోదె మొదలు ; త. మటమ్. చిన్న ప్రవాహ మార్గం, కన్నం, మట. డాము, తూము, తూము విడిచి నీళ్ళుపారించు ; మ. మట. తూము, బోటు. కన్నం, ప్రవాహం, వెల్లువ.

మడనేల వి. ఒండు మట్టి కలిసిన రేగడినేల.

**మడ**[2] వి. కుప్ప, గుట్ట, తిప్ప, తిన్నె.

**మడ**[3] వి. ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Avicennid officinalis).

మడకట్టె వి. 1. లావుకట్టె ; 2. వంట కట్టియ. మడచెట్టు వి. వృక్షవిశేషం.

మడ⁴ వి. ఒకజాతి చేప.

మడక రూ.చూ. మడ(క². వి. 1. స్థలం; 2. ఊరు; 3. పరిసరం, చుట్టుపట్లు; 4. నాగలి; 5. పొలం అటూఇటూ రెండు చాళ్ళుగా దున్నటం; 6. పల్లం; 7. చేతిమగ్గం మీద డిజైన్లు నేసేటప్పుడు పేటు అడ్డుపోగులు ఎత్తి పట్టుకొనే కొయ్య పనిముట్టు.

మడకదుంప వి. నాగలి క్రురూపంలో చెక్క గుంజల మీద పీటలాగా తగిలించిన కొయ్యముక్క. మడకపులుసు వి. నూనెనిచ్చే గింజలు, రోకళ్ళు, బళ్ళు మొ. వాటి తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Schleichera trijuga).

మడగంచము(-కంచము) వి. కంచుతో చేసిన పెద్ద కంచం.

మడ(క¹ చూ. మడ(గు.

మడ(క² రూ. మడక. వి. దున్నటం కోసం ఎడ్లను కట్టి సిద్ధంగా చేసిన నాగలి, అరక.

క. మడికె. నేలను చదునుచేయటానికి, చల్లిన విత్తనాలపై మన్ను కప్పటానికి ఉపయోగించే పళ్ళకోల.

మడ(గు రూ.చూ. మడ(గు¹. అ.క్రి. 1. క్షీణించు, తగ్గు. నిర్వ.రా. 5.61; 2. అడగు, లొంగు, మరలు. ఉ.హరి. 2.176; 3. చెడు, నశించు. భాగ. 3.83; 4. వంగు.

మడ(క¹ వి. మడుపు, చలువబట్ట. పండి.చ. 2.115 పు.

మడ(చు రూ. మడు(చు, మడ్చు, మణు(చు. స.క్రి. 1. అడచు, నశింపచేయు. కు.సం. 12.220; 2. అణచు, ఇముడ్చుకొను. భార. అశ్వ. 2.153; 3. మడతచేయు, మడతపెట్టు. హర. 2.93. క. మడగు. మడపు విశ. మడతపెట్టబడినది. బసవ. 6.646; స.క్రి. 1. పోగొట్టు. చంద్రభా. 1.2; 2. రెట్టించు, ద్విగుణీకరించు. అష్టమ. క. 4.39. మడపుటాకులు(-అకులు) వి.బ.వ. చిలకలు చుట్టిన ఆకులు. శుక. 1.303.

మడ(చు చూ. మడ(గు.

మడత చూ. మడ(గు. వి. 1. మడుపు. ద్వి.పరమ.వి. 3.225; 2. భక్ష్యవిశేషం. హంస. 1.105; 3. తెల్లని వస్త్రం, ఆం.భా. 2.153; 4. కడుపు మీది మడత; 5. అచ్చుతికేటప్పుడు కింది పోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు: 6. పిర్ర, పణతవంపు తిరిగిన వెలుపలి తట్టు.

క. మడతె. మడత.

మడతకట్టు స.క్రి. సారెకు లోపల వెదురు దబ్బల్తో పెండె కట్టు. మడతకుడుము వి. ఉపవాసం. మడతకూజా వి. కమండలం ఆకారంలో ఉన్న నీళ్ళకూజా. మడతకోల వి. ఒకరకం అనుచివరి పీటకు బిగించిన కొయ్య. మడతచెక్క వి. మడతబందులు బిగించిన మూసుకునే తలుపు చెక్క. మడతచ్చు వి. ఒకరకం అచ్చు, నేత పడుగులో కిందిపోగులు పైపొర పోగులు అతికి నేసే పనిముట్టు. <మడత+అచ్చు¹. మడతంచు వి. పెద చీల్చకుండా లోపల పెళ ఉంటూ మందంగా కడెంలాగా పాత్రలకు పెట్టే అంచు. <మడత+అంచు³. మడతతలుపులు వి.బ.వ. రెక్కలు మడత పడేటట్లు ఏర్పాటు చేసిన తలుపులు.

మడతతుకు వి. అచ్చుతికేటప్పుడు కింది పోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు. <మడత+అతుకు. మడతదుక్కి రూ. మడద్దుక్కి. వి. 1. కోంద్ర వెయ్యకుండా వరసగా దున్నటం; 2. కోంద్రవెయ్యకుండా దున్నిన పొలం. మడతనాలుక రూ.చూ. మడనాలుక. వి. 1. మందం అయిన నాలుక; 2. అబద్ధాలు చెప్పే నాలుక. మడతనిచ్చెన వి. మడతపెట్టటానికి వీలుగా ఉండే నిచ్చెన, పొడుగాటి తాళ్ళను సమానదూరంలో మధ్యమధ్య అడ్డ కర్రల్ని కట్టి తయారు చేసిన ఒకరకం నిచ్చెన. మడతపంచె వి. గొల్లవాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచె. మడతపడుగు వి. అచ్చుతికేటప్పుడు కిందిపోగూ పైపోగూ కలిపి మొత్తం అతికే పడుగు. మడతపెండి వి. గుండుపెండి మీది పల్చని కర్రలు వేసి కట్టిన తర్వాత వాటిని వెనక్కు విరిచి మళ్ళీ కట్టిన పెండి. మడతబందికలు వి.బ.వ. మోచేయి మోకాలి కీళ్ళు. మడతబందు వి. బొందు, కీలుబొందు, రెక్కలు తెరుచుకోవటానికి మూసుకోవటానికి వీలుగా కమ్ములకు పట్టి ఉంచే రెండురెక్కల పరికరం. మడతబల్ల వి. అను పీటల్లో చివరిబల్ల. మడతమంచము మడుచుకోటానికి వీలుగా ఉండే మంచం. మడతమాటలు వి.బ.వ. ద్వంద్వార్థాన్నిచ్చే మాటలు. మడతమాను రూ. మర్తమాను, మత్తమాల, మరువాను, మర్తబాన్, మర్తుమాన్. వి. కొన్ని రంగులు, ద్రావకాలు పోసే జాడి. హిం. మర్తయాన్. జాడీ. <హిం. మర్తబాన్. మడతమానుకుండ వి. మామిడికాయ ఊరగాయ పెట్టుకోవటానికి వాడే మట్టిపాత్ర. మడతమోకు వి. రెండు వరసలుగా నేసిన నేత మోకు. మడతసుడి వి. చిలకసుడి, జెబ్బ, మోచేతుల్లోగాని మోకాళ్ళ మడతల్లో గాని ఉండే సుడి. మడతసెల్లా వి. ఒంటిమీద కప్పుకోవటానికి నేసిన ఒకరకం ముతకబట్ట, రెండు పొరలుగా నేసిన దుప్పటి. మడతాను వి. 1. అనుల్లో ఒకరకం; 2 కొయ్యల సంఖ్య ఎక్కువ ఉన్న అను; 3. ఎదురు, వాలు అనులు పడేట్టు పడుగుపోసే అను; 4. ముప్పయి రెండు మూరల పడుగుపోసే అను. <మడత+అను¹. మడద్దుక్కి రూ.చూ. మడతదుక్కి. వి. 1. కోంద్ర వెయ్యకుండా వరసగా దున్నటం; 2. కోంద్ర వేయకుండా దున్నిన పొలం. <మడత+దుక్కి.

మడతాను చూ. మడత.

మడత్రొక్కు చూ. మడ(చు. రూ. మడదొక్కు. స.క్రి. తాటాకులు మొ.వి విడదీసి దొంతిగా అణగత్రొక్కు.

మడదల(-తల⁴) చూ. మడ(చు. వి. మోమెత్తని విత్తనపు గింజ.

మడదొక్కు రూ.చూ. మడత్రొక్కు. స.క్రి. తాటాకు కొట్టిన తరవాత పచ్చిమీదనే ఒకదానిపైన ఇంకొకటిగా బారుగా పొడవుగా తొక్కిఉంచు.

మడద్దుక్కి చూ. మడత.

మడనాలుక చూ. మడ(త. రూ. మడతనాలుక. వి. అబద్ధాలు పలికించే నాలుక, మచ్చనాలుక.

మడ(తి రూ. మడ(ది. వి. స్త్రీ, ఆడుది. కు.సం. 6.115; బసవ. 2.91.

క. మడది. స్త్రీ, భార్య; త. మడన్తై. స్త్రీ, యుక్త

పయసులో ఉన్న కన్య; మ. మటుంత. యువతి, మటువ. స్త్రీ, మటువి. పనిచేసే స్త్రీ.

మడఁతితనము వి. స్త్రీత్వం, ఆడతనం. అచ్చ.రా.బాల. 149. మడఁతుక వి. స్త్రీ, ఆడుది. అచ్చ.రా. సుందర. 138.

మడఁతుక చూ. మడఁతి.

మడఁది రూ.చూ. మడఁతి. వి. 1. స్త్రీ, ఆడది. కు.సం. 8.67; 2. భార్య. శివత. సా. 185.

మడపరొయ్య వి. ఒలవకుండా ఎండబెట్టిన రొయ్య.

మడపలకుండ చూ. మడపలు.

మడపలి రూ. మటపల్ల. వి. వంటసాల. ద.హిం.శా. శా.సం. 7.61. క్రీ.శ. 1360.

త. మటుప్పల్లి, మఱైప్పళి, మఱైప్పళ్ళి. దేవాలయం లోని వంటిల్లు.

< త. మటప్పల్లి.

మడపలు చూ. మడఁచు. వి.బ.వ. పితరులకిచ్చే నైవేద్యం, మడనళ్ళు.

మడపలకుండ వి. నాలుగు లేక అయిదు శేర్లు బియ్యం ఉడికే అన్నం కుండ.

మడపాకు(-ఆకు) రూ.చూ. మోడపాకు. వి. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపుమొక్క.

మడపు చూ. మడఁగు.

మడపుటాకులు చూ. మడఁగు.

మడమ రూ. మడప[1], మడిమ, మడిమె, మడెం, మడ్మ. వి. 1. పార్ష్ణి, చీలమండ కిందిభాగం. కు.సం. 3.46; 2. వెదురు సోల మొ.వాటి అడుగుభాగం; 3. చెలకపార తూము పైనున్న కట్టెమొదలు; 4. గూడకొమ్ము, గూడకు పైవైపు ఖాడుకట్టేచివర; 5. సారెపెట్టులో గుండ్రంగా చుట్టటానికి ఉపయోగించే చీల్చిన వెదురుబద్ద.

క. మడ, మడహు మడి, మిడి. మోకాలు; కొడ. ముడి; తు. హిమ్మడి; మ. మటంపు.

మడమగడ్డ రూ. మడిమెగడ్డ. వి. పొలంలో కోంద్ర కలిసిన తరవాత మిగిలిపోయే కొన. మడమ తిరుగని మగటిమి వి. శత్రువులకు వెన్నుచూపని శౌర్యం. రంగా.చ. 2.44. మడమపొల్లు రూ. మడవపొల్లు. వి. గాలిపాటు సరిగా లేక పోవటం వల్ల వరి వెన్నులో గింజలు కట్టని తప్పలు. మడమలుద్రొక్కు(-త్రొక్కు) స.క్రి. అడుగులో అడుగుపెట్టి తరుము. కళా. 8.119. మడమెత్తుపరువు రూ. మడిమెత్తు పరువు. వి. మడమకూడ నేలపై మోపకుండ మునిగాళ్ళపై గబగబ పరిగెత్తటం. శుక. 1.411. < మడమ + ఎత్తు[1] + పరువు.

మడమెత్తుపరువు చూ. మడమ.

మడయు రూ.చూ. మడియు, అ.క్రి. మరణించు. భార. సౌప్తి. 1.207.

మడవ[1] రూ.చూ. మడమ. వి. 1. పార్ష్ణి, చీలమండ కింది భాగం; 2. వెదురు సోల మొ. వాటి అడుగుభాగం.

మడవ[2] చూ. మడి[1]. రూ. మరవ[1], మరుగు[3], మర్వ, మొరవ[2]. వి. 1. మళ్ళకు పాదులకు నీళ్ళుపారే కాలవ ముఖం. కళా. 4.96; 2. అడ్డంవేసే కట్ట; 3. వరవ.

మడవకట్టుకాడు వి. చేలకు నీరు పారించేవాడు, నీరు కట్టుగాడు. మడవచేఁప వి. మత్స్య విశేషం. మడవపార వి. సెలగపార, మడవలేర్పరచటానికి ఉపయోగించే సెలగ పార. మడవపొల్లు రూ.చూ. మడమపొల్లు. వి. గాలిపాటు సరిగా లేకపోవటం వలన వరి వెన్నులో గింజలు కట్టినవి కాక పొల్లు అయినది. మడవబండ వి. పిల్లకాలవనీరు పొలాలకు పంచే కంతకు అడ్డంగా వేసిన బండ.

మడవలి రూ.చూ. మడివాలు. వి. చాకలి, మడేలు.

మడవు రూ.చూ. మడుఁగు[1]. అ.క్రి. 1. విముఖమగు. భార. ఆది. 2.25; 2. మరలు, వెనుదీయు, జంకు, కొంకు. భార. ఆది. 2.42; 3. నిష్ఫలమగు. భార. సభా. 2.190.

మడపెట్టు(-పెట్టు) చూ. మడఁచు. స.క్రి. మడతపెట్టు, చుట్టపెట్టు. ద్వి. హరి. ఉ. 903 పం.

మడసళ్లు వి.బ.వ. పితరులకిచ్చే నైవేద్యం.

మడసోల రూ. మడిశూల. వి. కాలిమడమలో పుట్టే మాదు, మడిశూరు.

సం. శూల-. నొప్పి.

< మడమ + సం. శూల-.

మడాయించు స.క్రి. మండిగలో గంజి కలియబెట్టు.

హిం. మఢానా. బలవంతంగా ఆరోపించటం.

< హిం. మఢా(నా) + -ఇంచు[3].

మడి[1] వి. 1. వరి మొ. సస్యాలకు నీరు నిలవటానికి నాలుగు పక్కల గట్టువేసి ఏర్పరచిన పొలం, కేదారం, నదీప్రాంతం. వరాహ. 9.148; 2. పాదు, మధ్యలో నీళ్ళుపోసి గచ్చును గట్టిపరచటానికి వీలుగా మట్టితో కట్టిన కట్ట, ఇంటి కప్పు గట్టి పడేవరకు కట్టిన మట్టికట్ట; 3. ఆడపశువుల మర్మస్థానం; 4. మాగాణిపొలం; 5. ఒక రంగుబట్టలో వేరే రంగు పోగులతో నేసిన చదరం; 6. నారుపోసిన పొలం.

క. మడి. నారుమడి, పొలంలో భాగం, చెట్టుచుట్టూ కట్టిన పాదు.

మడికట్టు వి. 1. మాగిలి పొలం, పల్లపుచేను; 2. వర్షం. మడికట్టుగొర్రు వి. పలుగొర్రు, మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. మడికట్టుదుక్కి వి. మాగాణి నీళ్ళు పెట్టి దున్నటం. మడికట్టునాగలి వి. బురదనాగలి, మాగాణి నేలలు దున్నే దంపనాగలి. మడికట్టువాన వి. మళ్ళమునిగే వాన. మడికలుపు వి. మాగాణిలో తీసే కలుపు, నారుమడిలో తీసే కలుపు. మడిగట్టు వి. చేనుగట్టు. మడిగొర్రు వి. పలుగొర్రు, మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి, విత్తిన తర్వాత కలుపు, గడ్డిపోవటానికి తోలే పరికరం. మడిచేయు అ.క్రి. పశువులు ఈనటానికి ముందు గురిలో మార్పుకలుగు. మడిదున్నుకొనిబ్రదుకు అ.క్రి. పొలం దున్ని జీవించు. శ్రాళ్ల.సం. 11.2.27. మడిపెట్టు అ.క్రి. పశువు ఈనటానికి సిద్ధమగు. మడిపెసలు వి.బ.వ. మడిలో పెరిగే పెసలు. మడిఫాలము వి. వరిచేను. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1016, క్రీ.శ. 1134. మడిప్రాలు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. మడిమంచ రూ. మడిమంచము.

విశ. బలహీనుడు, సారహీనుడు. మను. 6.26. మడిమంచము రూ. చూ. మడిమంచ. విశ. బలహీనుడు, సారహీనుడు. ద్వి.భాగ. 10. మడిమ్రాటి వి. పొలాలు. మడిమడక వి. బురద నాగలి, మాగాణి నేలలు దున్నే నాగలి. మడిసుంఖము వి. నౌకారోహణ స్థలసుంకం. ద. హిం. శా.సంపు. 10. శా.సం. 556. క్రీ.శ. 1358. మడేయు స.క్రి. ఆము లోపలి కట్టె కంపలకు అగ్గి అంటుకొనేటట్లు పొయ్యి దగ్గరి పుల్లల్ని కాల్చు. < మడి[1] + వేయు. మళ్ళచీర రూ. మల్లసీర. వి. అంచుల మధ్యభాగంలో రంగుపోగులు పెట్టి గదులు గదులుగా నేసిన చీర.

మడి[2] వి. మడుగు, ధౌతవస్త్రం, పవిత్రవస్త్రం. ఆం.భా. 2.153 ; విశ. పరిశుద్ధం. ఉ.హరిశ్చ. 2.98.

క. మడి. శుభ్రత, స్వచ్ఛత ; కొడ. మడి ; తు. మడి. ఉతికిన వస్త్రం, భోజనాది సమయాల్లో కట్టుకొనే పట్టువస్త్రం ; త. మటి. స్వచ్ఛత, పట్టు, నార మొ. మడి బట్ట.

మడికట్టు వి. మగ్గానికి అమర్చి నేత బయలులో చాపిన మొత్తం పడుగు నూలు. మడికట్టుకొను అ.క్రి. ఆచారవంతులు నిత్య కర్మలకూ, వంటకూ భోజనాదులకూ ముందు పట్టు బట్టనో ఉతికిన బట్టనో కట్టుకొను. మడికాసు వి. వెండి, రజతం. రాజవా. 2.55. మడికాసుగట్టు వి. వెండికొండ, కైలాసం. ఆం భా. 2.28. మడికాసుమల వి. వెండికొండ, కైలాసం. పార్వ. 2.70. మడికాసులతేఁడు వి. శివుడు. మడికూడు వి. ప్రసాదం. బసవ. 7.569. మడిగూటివృత్తి వి. దేవునికి పెట్టిన నైవేద్యం తినే వృత్తి. బసవ. 7.198. మడిచాపు వి. వితంతువులు కట్టుకునే మడి బట్టల జత. మడిచీర వి. 1. వితంతువులు కట్టుకోవటానికి నేసిన ఒకరకం తెల్లచీర ; 2. ఆచారవంతులు వంటకూ భోజనాదులకూ కట్టుకునే ఉతికి ఆరవేసిన బట్ట. మడిచెరు రూ.చూ. మడిచేరు. వి. మడిచీర, పట్టువస్త్రం. మడిచేరు రూ. మడిచెరు, మడిచేలు. వి. మడి కచ్చ ముందునుండి వెనక్కి దోపుకునే కొంగు. ద్వి. పరమ. వి. 4.284. మడిచేలు రూ.చూ. మడిచేరు. వి. మడికచ్చ, ముందునుంచి వెనక్కి దోపుకునే కొంగు. మడిధోతి వి. వితంతువులు కట్టుకోవటానికి నేసిన ఒకరకం తెల్లచీర. మడిపంచ రూ.చూ. మడిపంచె. వి. 1. ఆరవేసిన బట్ట ; 2. మడిగా కట్టుకొనే పంచె. మడిపంచి రూ.చూ. మడిపంచె. వి. 1. వితంతువులు కట్టుకోవటానికి నేసిన ఒకరకం బట్ట ; 2. మడికి కట్టుకునే ఆరవేసిన పంచ. మడిపంచె రూ. మడిపంచ, మడిపంచి. వి. 1. వితంతువులు కట్టుకోవటానికి నేసిన ఒకరకం తెల్లచీర ; 2. మడికి కట్టుకునే ఆరవేసిన పంచ. మడిసంచి వి. మడుగు వస్త్రం ఉంచుకొనే సంచి. హంస. 2.138. త. మటిచంచి. మడిబట్టలుంచుకొనే ప్రేము లేదా నూలుసంచి. మడిసంది వి చంక. హరి.పూ. 7.13.

మడి[3] వి. గుణం, రెట్టింపు. వెలుదుర్తి శాసనం, క్రీ.శ. 625. క. మడి. రెట్టింపు ; త. మటి. మడచు.

మడికల రూ.చూ. మడికెల. వి. అచ్చుతికిన పడుగు.

మడికలకట్టె రూ.చూ. మడికెలకట్టె. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర. మడికలబొంగు రూ.చూ. మడికెలబొంగు. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర, మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు, కొన్ని చోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళు గాని కడతారు.

మడికాల రూ.చూ. మడికెల. వి. అచ్చుతికిన పడుగు.

మడికాలకట్టు రూ.చూ. మడికెలకట్టు. స.క్రి. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపు చేయు.

మడికాళ్ళు వి.బ.వ. కాలుపై కాలు వేసుకొన్నప్పటి రెండు కాళ్ళు.

త. మటికాల్. మడచుకొన్న కాలు (మోకాళ్ళపై వంగినప్పుడు).

<త. మటికాల్ + -లు.

మడికాళ్ళువేసుకొను అ.క్రి. సంప్రదాయ విరుద్ధంగా కాళ్ళు మడచికొని కూర్చుండు.

మడికి రూ.చూ. మటికి. వి. మట్టిపాత్ర.

మడికెల రూ. మడికల, మడికాల. వి. అచ్చుతికిన పడుగు.

మడికెల కట్టు రూ. మడికాల కట్టు. స. క్రి. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు. మడికెలకట్టె రూ. మడికల కట్టె. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర, మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు, కొన్నిచోట్ల పొట్టెగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. మడికెలగుతి రూ.చూ. మడికెలగుది. వి. పెడకోలకు తగిలించే మలగర్ర. మడికెలగుది రూ. మడికెలగుతి. వి. పెడకోలకు తగిలించే మలకర్ర. మడికెలబొంగు రూ. మడికలబొంగు, మడికోలబొంగు. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర.

మడికోల వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర, మలగర్ర.

మడికోలకర్ర వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర. మడికోలగుతి రూ.చూ. మడికోలగుది. వి. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం. మడికోలగుది రూ. మడికోలగుతి. వి. నేత పడుగులో చివరి పాయకు కట్టిన దారం. మడికోలబొంగు రూ.చూ. మడికెలబొంగు. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర.

మడిగ రూ.చూ. మళిగ. వి. అంగడి.

మడిగసుంకము రూ. మళిగసుంకము. వి. అంగడిపై సుంకం. H.A.S. 19.20.

మడిగలకొయ్య వి. మానికంకొయ్య, బండిపరం జారకుండా ఇరుసుమీద అడ్డం పెట్టిన కొయ్య.

మడిగె రూ.చూ. మళిగ. వి. దుకాణం.

మడిగెచెక్క వి. కొట్టుచెక్క, గాడి దర్వాజాలో అమర్చే చెక్కతలుపు, వరసక్రమంలో ఒకదాని తరవాత ఒకటిగా పక్కపక్కన పేర్చే చెక్క.

మడిగెం రూ.చూ. మండిగము. వి. బండి ఇరుసుపై అడ్డంగా

ఉండే మొద్దు.

**మడిమ** రూ.చూ. మడమ. వి. చీలమండ.

**మడిమకొయ్య** రూ. మడెమకొయ్య. వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. **మడిమతాడు** రూ. మడిమితాడు. వి. పావుచెక్కను గూటానికి బిగించే వెనక తాడు. **మడిమితాడు** రూ.చూ. మడిమతాడు. వి. పావ చెక్కను గూటానికి బిగించే వెనక తాడు.

**మడిమితాడు** చూ. మడిమ.

**మడిమె** రూ.చూ. మడమ. వి. పిర్ర, పణత వంపు తిరిగిన వెలుపలి తట్టు.

**మడిమెకొం(డె** వి. వంకర తిరిగిన కొం(డను కలిపే కొం(డ. **మడిమెగడ్డ** రూ.చూ. మడమగడ్డ. వి. పొలంలో కొం(డ కలిసి తరవాత మిగిలిపోయే కొన. **మడిమెచుక్క** రూ. మడెంచుక్క, మెడెమచుక్క. వి. బుధుడి పేరుతో ఉండే చుక్క. రోహిణీ నక్షత్రం అని కొందరు.

**మడిమెత్తుపరువు** రూ.చూ. మడమెత్తుపరువు. వి. త్వర త్వరగా పరుగెత్తటం. శుక. 3.315.

**మడియ** రూ. మడియ(డు. విణ. **1**. మోటువాడు, మోటుది. వేంక. పంచ. 1.687 ; **2**. మూఢుడు, జడుడు. హంస. 5.113.

త. మటువన్. మూడుడు, మట్టన్, మణ్ణన్. జడుడు ; మ. మటయన్.

**మడియమానిసి** వి. ప్రమాణానికి మించిన మోటుమనిషి. < మడియ + మానిసి.

**మడియ(డు** రూ. చూ. మడియ. విణ. **1**. మోటువాడు, మోటుది ; **2**. మూఢుడు, జడుడు.

**మడియ(బెట్టు** చూ. మడియు.

**మడియాలు** రూ.చూ. మడివాలు. వి. చాకలి.

**మడియించు** చూ. మడియు.

**మడియిల్లు** చూ. మడియు.

**మడియు** రూ. చూ. మణియు. అ.క్రి. **1**. చచ్చు, నశించు, చెడు. కు. సం. 11.119 ; **2**. తునుగు, ఖండితమగు. హరి. ఉ. 2.57.

**మడియ(బెట్టు** స.క్రి. బాధించు. సానంద. 2.161 < మడియు + -అ[7] + పెట్టు. **మడియించు** స.క్రి. చంపు, కడతేర్చు, మనగచేయు. భార. ద్రోణ. 4.118. < మడియు + -ఇంచు[3]. **మడియిల్లు** అ. క్రి. మడియు, నశించు. శివత. సా. 82.

**మడివాలు** రూ. మడవలి, మడియాలు, మడివేలు, మడేలు, మెడవాలు. వి. చాకలి. బసవ. 2.496.

క. మడివళ్ళ, మడివా(ళ, మడివాళి. చాకలి వాడు, చాకలిది ; తు. మడ్వెలె, మడ్యెలె. చాకలివాడు.

**మడివేలు** రూ.చూ. మడివాలు. వి. చాకలి.

**మడిస** వి. మత్స్యవిశేషం. వేంక. పంచ. 1.194.

**మడిసి** రూ.చూ. మణిసి[1]. వి. మనిషి.

**మడిసె** రూ.చూ. మడిసెల. వి. దొంగెద్దుకు ఒకకాలు మడిచి కట్టే కట్టు.

**మడిసెల** చూ. మడ(చు. రూ. మడిసె, మడిసేల. వి. దొంగెద్దుకు ఒకకాలు మడిచికట్టే కట్టు.

**మడిసేల** రూ.చూ. మడిసెల. వి. దొంగెద్దుకు ఒకకాలు మడిచి కట్టే కట్టు.

**మడు(గు[1]** రూ. మడ(గు, మడవు, మడుపు, మడ్గు, మడ్పు, మణ(గు, మణు(గు. అ.క్రి. **1**. న్రమతనొందు. భార. అను. 3.291 ; **2**. అడగు. ఉ. హరి. 2.137 ; **3**. వంగు. ఉ. హరి. 4.44 ; వి. ఆకుమడుపు. రుక్మి. 5.57.

క. మడతె. మడత, మడపు, మడిపు. మడచిన, (గుడ్డ, తమలపాకు మొ. వాటి) మడత, మడలు, మడిల్, మడ్లు, మళ్ళు. (తినుబండారాలు, డబ్బులు మొ. వి దాచుకోవటానికి మడచిన) మడత, మడి. మడచు, వంచు, కలుపు, మడికె. వంపు, మడత, రెట్టింపు, మడిసు, మడచు, మడసు. వంచు, ముడుచు, మణి. వంచు, మణిసు. వంపు, వంచు, మంగు. వంచు, లోబరచుకొను ; కొడ. మడక్-. (మడకి-). మడచు, మడకి. వంపు, ముడత ; తు. మడతె. మడత, మడచు, మడిపావుని. మడచు, మడిపు. మడత, మడిపుని. మడచు, మడి యుని. మడవబడిన, మడ్డెలు. స్త్రీలకొంగు మడతలవలన ఏర్పడిన సంచివంటిది ; త. మటంకు (మటంకి) (కాలు, చేయివలె) వంచు, (టేబిల్లు, కత్తి మొ. వాటిలాగా) వంచు, (రోడ్డు, నది మొ. వాటిలాగా) మెలితిరుగు, తిరుగు, కుంచించుకుపోవు, మెలితిరుగు, వంకరచేయు, తగ్గించు, లొంగిపోవు, కుంగు, అణగు, లొంగు, మటంకల్. వంపు, కోణం, మూల, అధీనం, మటుక్కు. వంచు, మడచు, మూయు, తిప్పు, తిరిగిచేయు, అణచు, లోబరచు కొను, స్వాధీనం చేసుకొను, అడ్డగించు, ఆటంకపరచు, వశమైన, మచ్చిక చేయబడిన, వంపు, వంకర, మూల, వక్రమార్గం, వక్రీకరణం, తిరుగు, మడతనిరాకరణ, గద్దింపు, మటుక్కలై. వక్రత, మటుక్కమ్. వలపు, అధీనత, ముటలి. (-ప్పు-ట్ట్-). మడత పెట్టు, కిందికివంచు, చుట్టు బెట్టు, కుంగు, మూయు, మెలితిప్పు, కంగారుపెట్టు. మటిప్పు. మడత, మడతగుర్తు, మోసం, కపటం, మటివి. (-ప్పు-, -ట్ట్-). (కత్తి మొ. వాటికొన) వంపు, మటున్ని ప్పికక్క. కిందికివంచు, మటుక్కమ్. ముడత, మటుక్కుక మడత, వంపు, వెనక్కితిరుగు, అధిగమించు, మటుక్కు. మడత, అతుకు, మటుయుక. ముడత, మటి. ముడత, మటిప్పు. మడత, మణన్నుక. వంచు ; కో. మట్క. మడచు, అడచు, లోబరచుకొను ; తొ. మొటి- (మొట్చ్-). చక్కగా మడచు, మొట్క. మడచు, వంచు, మాటల్లో ఓడించు ; గోం. ముడ్పుత్తానా. (రగ్గు మొ. వాటిలాగా) అనేక మడతలు మడచు, మట్పానా. మడచు ; పర్జి. మడెకిప్. మడచు, చుట్టు ; పో. చూ. త. మణిక్కట్టు. త. మంటి.

< మూ. ద్రా. *మట్-.

**మడు(గు[2]** రూ.చూ. మణు(గు[2]. వి. **1**. పరిశుద్ధవస్త్రం. బసవ. 4పు. 74పం ; **2**. వస్త్రం. ఉ. హరి. 1.57 ; **3**. తెల్లనివస్త్రం. పారి. 2.12 ; **4**. పరిశుభ్రత. అచలా. 2.10.

**మడు(గు(జీరయందు మసితా(కినట్లు** అవ్య. స్వచ్ఛం

అయినవస్తువుకు మచ్చ ఏర్పడినట్లు. భార. ఉద్యో. 1.295. మడుఁగుఁబూలు రూ. చూ. మణుఁగుఁబూవులు. వి.బ.వ. మణుగు బువ్వులు, తేనెతొలలు. మడుఁగులుబ్బు అ.క్రి. వస్త్రాలుపొంగు. తాళ్ల. సం. 14.190. <మడుఁగు²+-లు+ఉబ్బు.

మడుఁగు³ రూ.చూ. మడువు¹. వి. 1. కొలను, సరస్సు. నె.శా. పొదిలి. 18. క్రీ. శ. 1369; 2. నదీమధ్యంలో అగాథ తలం, హ్రదం. ఉ. రా. 6.282; 3. పొలంలో తవ్విన నీళ్ళగుంట.

మడుఁగులువాఱు(-పాఱు³) అ.క్రి. మడుగుకట్టు, మడుగులుగా ఏర్పడు. కు. సం. 6.111.

మడుఁగు⁴ రూ. మణుఁగు³, మణుము, మణువు, మణ్ము. వి. 1. గుణం, రెట్టి. భార.ఆది. 1.81; 2. ఎనిమిది మణుగుల బరువు. వైజ. 4.137; 3. నలభై శేర్ల బరువుగల ఒక కొలత.

క. మణు, మణువు, మన, మాణ. కొలత; త; మన్, మణు, మణంకు, మణుంగు. ఎనిమిది వీసెలు.

హిం. మన్. నలభై శేర్లకొలత, మనస్సు, హృదయం, ఆత్మ, ఆలోచన, మేధస్సు, దృష్టి, కోరిక, యత్నం, ఉద్దేశం; ఉ. పార. మన్. నలభై శేర్ల కొలత లేదా బరువుపేరు, ఉత్తమపురుష సర్వనామాలు, నేను, నాయొక్క; అర. మన్, మణువు.

మడుఁచు రూ.చూ. మడఁచు. స.క్రి. 1. అణచు. నొక్కు. దశకు. 5.69; 2. మణచు, వంచు. శృం. నై. 5.12; 3. మడతపెట్టు, చుట్టచుట్టు. శృం. నై. 8.84.

మడుతులు చూ. మడఁత. వి. నూరుపౌన్ల బరువుండే సుత్తెఆకారంలో ఉండే రాతిపనివాళ్ళు వాడే పనిముట్టు.

మడుపు¹ చూ మడుఁగు¹. వి. 1. మడత. శృం. నై. 6.124; 2. మడిచిన తమలపాకులచుట్ట. ఉ.రా. 1.309; 3. ఒకసారి నిలువు అడ్డం దున్నటం; స.క్రి. 1. మడగచేయు, చంపు. అచ్చ. రా. యు. 180.

మడుపు² చూ. మడుఁగు². వి. మడత, ధౌతవస్త్రం. వేమ. 2.72; విణ. చలువచేసి మడతపెట్టినది. శుక. 1.214.

మడుపుకచ్చులువేయు అ.క్రి. పడుగులో ఒకబట్ట నేతకు సరిపడే నూలులో రెండేసి కచ్చులు వేయు. మడుపుకట్టు అ.క్రి. ఒకబట్ట నేతకు సరిపడే పడుగులుగా విడదీసి చుట్టు. మడుపుకట్టె వి. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కఱ్ఱ. మడుపుకఱ్ఱ(-కట్టె) వి. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. మడుపుపారు అ.క్రి. మగ్గంమీద ఒకనేతకు సరిపడే పడుగు విస్తరిల్లు. మడుపులు వి.బ.వ. 1. చిన్న చిన్న కట్టలుగా పేర్చిన ఆకులు; 2. తాంబూలానికి సిద్ధం చేసిన తమలపాకులు; 3. ఆకుపూజ, దేవతను ఆకు మడుపులతో అలంకరించటం. మడుపుసాగు వి. మగ్గానికి చాపిన పడుగు.

మడుపు³ రూ. మణుపు. వి. 1. ఎదిగిపోయిన తమలపాకు తీగను అనుగా పెరిగే అవిసె చెట్టు మొదలుకు దించి కింద అంటు గట్టేది; 2. రెండోసారి దున్నిన దుక్కి; 3. సున్నం రాసి మడిచి ఇచ్చిన తమలపాకు; 4. మగ్గానికి అమర్చి నేత బయలులో చాపిన పడుగునూలు.

క. మడపు. మడిపు. మడచబడినది, తాంబూలం; తు. మడిపు, మడత; త. మటిపయి.

మడువ చూ. మడి¹. వి. 1. పుట్ట. ఆం.భా. 2.8; 2. కట్ట, మళ్ళచుట్టు కట్టిన కట్ట, మడవ.

మడువు¹ రూ. మడుఁగు³. వి. 1. హ్రదం, ఏటినడుమ లోతుగల చోటు, కొలను. భార.ఆది. 5.171; 2. ఉపశాంతి. నిర్వ.రా. 4.40, అ.క్రి. అడగు. ద్వి.భార.విరా. 4.73 ప.

క. మడ, మడవు, మడు, మడువు, మడుహు. నదుల్లో అగాధమైనచోటు, కొలను; కొడ. మడ్వ్; త. మటు; మ. మడు.

మడువుకొను అ.క్రి. మడుగ్గా ఏర్పడు, మడుగగు. కవిక. 2.126. మడువులుగట్టు(-కట్టు) అ. క్రి. మడుగులుగా ఏర్పడు, కొలకులుగా ఏర్పడు. భీమ. 5.120.

మడువు² రూ. చూ. మణుఁగు². వి.బ.వ. ఉతికి మడిచిపెట్టిన గుడ్డ.

మడువులెత్తు రూ. మడువులొత్తు. అ.క్రి. మొక్కుబడి చెల్లించటానికి కోవెలకు నడచిపోవటానికి నేలమీద నడచిపోవటానికి నేలమీద చలువచేసిన దుప్పట్లను పరచి నడచిపోయినదానిని ఎత్తి మరల ముందు పరుస్తూ దారి సాగించు. <మడువు² +-లు + ఎత్తు¹. మడువులొత్తు రూ. చూ. మడువులెత్తు. అ.క్రి. మొక్కుబడి చెల్లించటానికి కోవెలకు నడచిపోవటానికి నేలమీద చలువచేసిన దుప్పట్లను పరచి నడచిపోయినదానిని ఎత్తి మరల ముందు పరుస్తూ దారి సాగించు.

మడెం రూ.చూ. మడమ. వి. ముక్కుపీట. పోలుగఱ్ఱ నేలకు ఆనేవైపు అడుగున వేసిన కొయ్య.

మడెంగుంట వి. వెనకభాగం నేలకు తాకేచోట ఏర్పడ్డ పల్లం లేదా గుంట. మడెంచుక్క రూ.చూ. మడిమెచుక్క. వి. బుధుడి పేరుతో ఉండే చుక్క. రోహిణీ నక్షత్రం అని కొందరు. మడెంపన్ను వి. పిడికి వెనుకవైపున ఉన్న రేకు కట్టు.

మడెమకొయ్య రూ.చూ. మడిమకొయ్య. వి. మగ్గంగుంటలో పావుచెక్కల మడిమదగ్గర ఉండే కొయ్య.

మడేయు చూ. మడి¹.

మడేలు రూ.చూ. మడివాలు. వి. చాకలి.

మడ్కి రూ.చూ. మటికి. వి. మట్టిపాత్ర.

మడ్గు రూ.చూ. మడుఁగు¹. అ.క్రి. అణగు.

మడ్గుఁబూలు(-పూలు) రూ.చూ. మణుఁగుబూలు. వి.బ.వ. తేనెతొలలు, భక్ష్య విశేషం.

మడ్చకత్తి వి. బెత్తెడు వెడల్పున పల్చగా ఉండే రేకు ముక్కను ఒకవైపున విడిగా పనికివచ్చేటట్టు చుట్టచుట్టి తయారుచేసిన పనిముట్టు.

మడ్చు రూ.చూ. మడఁచు. స.క్రి. 1. మణచు, వంచు; 2. మడతపెట్టు, చుట్టచుట్టు; 3. అణచు, నొక్కు.

మడ్డి¹ విణ. 1. మూఢుడు; 2. మొద్దు.

క. మడ్డ. మూర్ఖుడు, మొద్దు. మడ్డతన. మూర్ఖత, మడ్డి. మూర్ఖుడు, మొద్దు; త. మట్టి; మ. మటయన్.

మూర్ఖుడు.

**మడ్డితనము** వి. మూర్ఖత, మొరకుతనం. క. మటు. గాబరా, మూర్ఖత్వం, మోసం, కపటం, తెలివితక్కువతనం, అవివేకం ; మట్టు. భ్రమ, మాయ ; త. మటమ్. అజ్ఞానం, మూర్ఖత్వం, నిరాడంబరత్వం, నమ్మేస్వభావం, ఒప్పుదల, సమ్మతి. మటమై. అజ్ఞానం, నిరాడంబరత, అవివేకం, మూర్ఖత్వం, మటప్పమ్. నిరాడంబరత, నమ్మేస్వభావం, మట్టి. మొరటుతనం, మోటుతనం, వికారమైన. మట్టి తణమ్. మూర్ఖత్వం, మట్టయ్. మూర్ఖుడు; మ. మటమ్. మూర్ఖత్వం, మట్టి. వికారం, మట్టతరమ్. వికారమైన ; ప్రా. మట్ట-. నెమ్మది, మొద్దు, మూర్ఖుడు.

**మడ్డి**[2] వి. **1.** ఏదైనా పదార్థం మరిగించగా నిల్చే చిక్కని సారం. ఆము. 4.35 ; **2.** నూనె మొ.వి తేరగా అడుగున నిల్చే పదార్థం.

క. మడ్డి, మడ్డు, మస్టు, మిడ్డె. నూనె, నెయ్యి మొ. వాటి అడుగునచేరే మురికి ; తు. మడ్డి. నూనె, నీరు మొ. వాటి అడుగునచేరే మురికి, పశువులకు పెట్టే ఊక, పొట్టు ; త. మట్టి. నీరు మొ.వాటి అడుగునచేరు మురికి ; మ. మట్టు. నూనె, తాటికల్లు మొ.వాటి అడుగునచేరే మురికి. పో.చూ. త. వంటల్.

**మడ్డికర్రు** వి. టంకారు, చేలోని చెట్లను వేళ్ళతోకూడా పెళ్ళగించే పనిముట్టు. **మడ్డికూడు** వి. **1.** సజ్జలు, జొన్నలు, వక్కలు ముక్కలుగా దంచి ఉడకవేసి పశువులకు వేసేది ; **2** .గాడి, కొట్టంలో పశువులకు మేత వెయ్యటానికి ఏర్పర చిన అర. **మడ్డిగార** వి. గిలాబా, గోడమీది సున్నం మొ. వాటి పూత. **మడ్డిచాయ** రూ. మడ్డిసాయ. వి. మడ్డిచెక్కతో తయారుచేసిన ఎర్రరంగు. **మడ్డిచెక్క** వి. మడ్డిచెట్టు చెక్క. **మడ్డిమేత** వి. మడ్డికూడు. సజ్జలు, జొన్నలు మొ. ధాన్యం దంచి కడక్కుండా వండి పశువులకుపెట్టే దాణా. **మడ్డిరంగు** వి. **1**. ఎరుపులో ముదురు వన్నె ; **2.** నస్యం రంగుకంటె ముదురు వన్నె. **మడ్డిలుంగీచీర** వి. మడ్డివన్నె గీరలు పడేట్టు నేసిన గళ్ళచీర. **మడ్డివెట్టు(-పెట్టు)** అ.క్రి. మట్టివెట్టు. పండి.చ. 2.5 పు. 442. **మడ్డిసాయ(-చాయ)** రూ.చూ. మడ్డిచాయ. వి. మడ్డిచెక్కతో తయారుచేసిన ఎర్రరంగు.

**మడ్డిగము** వి. వివాదం వచ్చినప్పుడు మధ్యస్థుని దగ్గర ఒక వస్తువునుంచటం.

**మడ్డిపాలు** వి. **1.** బంకగా ఉండే ఒక రసం ; **2.** మెత్తని కలపనిచ్చే చెట్టు (Aliantus malabarica).

క. మడ్డి (Aliantus malabarica) ; త. మట్టి ప్పాల్, మట్టిప్పాలై (Aliantus malabarica).

**మడ్డు** వి. **1**. ఒకరకం ఇనపగుండు. విజ్ఞా. **3.118** ; **2.** ఇనపగుండు, ఎర్రగా కాలిన ఇనపగుండు. భోజ. 6.181 ; **3**. కాక, అత్యుష్ణం.

త. మఝు. ఎర్రగా కాల్చిన ఇనుము, గొడ్డలి, గండ్ర గొడ్డలి.

**మడ్డుకత్తి** రూ. మడ్డుగత్తి. వి. మోటుకత్తి, మచ్చుకత్తి ; త. మఝు. గండ్రగొడ్డలి, కత్తి (కఠిన పరీక్షలకొరకు) ఎర్రగా కాల్చిన ఇనుము ; మ. మఝు. న్యాయాధిపతికి ముందు పట్టుకొనే (వెండి) కర్ర, చిన్నగొడ్డలి. **మడ్డుగత్తి** రూ.చూ. మడ్డుకత్తి. వి. ఈదరకత్తి, కంపమండలు నరికే మొద్దుకత్తి. **మడ్డురంగు** వి. జిడ్డునలుపు. **మడ్డువట్టు(-పట్టు**[1]**)** అ.క్రి. తన యెడ అపరాధం లేదని తెలపటానికై ఎఱ్ఱగా కాలిన ఇనప గుండును పట్టుకొని ప్రమాణంచేయు. సిం.ద్వా. **4**.106.

**మడ్డె** వి. కంది, ఆహార ధాన్యంగా పనికివచ్చే గింజలు కాసే మొక్క (Cajanus cajan).

**మడ్తమాను** రూ.చూ. మడతమాను. వి. పచ్చళ్ళు, ఊరగాయలు పెట్టుకోవటానికి వాడే పాత్ర.

**మడ్మ** రూ.చూ. మడమ. వి. **1.** పార్ష్ణి, చీలమండకింది భాగం ; **2**. వెదురుసోల మొ. వాటి అడుగుభాగం.

**మడ్వు** రూ.చూ. మడుఁగు[1]. అ.క్రి. అణగు.

**మణఁగు** రూ.చూ. మడుఁగు[1]. అ.క్రి. వంగు, నమ్రమగు. కృ.శకు. 1.78.

**మణత** వి. భక్ష్యవిశేషం. ప్రబంధ. 112.

**మణత** చూ. మణఁగు.

**మణాయించు** స.క్రి. స్వీకరించు. రఘునా.

హిం. మనానా. స్వీకరించు, రాజీచేయు, ప్రార్థించు ; ఉ. మనానా. స్వీకరించు, ప్రార్థించు.

<హిం. మనా(నా)+-ఇంచు[3].

**మణాయింపు** వి. తమ ఆజ్ఞకు లోబడేటట్లు చేయుటం.

**మణాయింపు** చూ. మణాయించు.

**మణి** వి. దర్వాజా నిలబెట్టేటప్పుడు యజమాని ఆచారం ప్రకారం దానికి వేలాడగట్టే మెరుగురాయి.

సం. మణి-. రత్నం, శ్రేష్ఠం.

<సం. మణి- (అర్థవిపరి.).

**మణికిత్తనాలు** వి.బ.వ. బియ్యం ఎర్రగా ఉండే ఒకరకం వడ్లు. **మణిముత్యాలు** వి.బ.వ. గుండ్రటి తెల్లటివడ్లు. **మణిసరులు** వి బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**మణికట్టు** రూ. మనికట్టు. వి. మణిబంధం. బసవ. **4.544.**

క. మణికత్తు. ముంజేయి ; త. మణిక్కట్టు, మక్కట్టు ; మ. మణిక్కట్టు.

**మణికి** రూ.చూ. మనికి. వి. స్థిరాసనం.

**మణిగ** రూ.చూ. మళిగ. వి. సరకులమ్మే ఇల్లు.

**మణిగము** రూ.చూ. మణివము. వి. ఉద్యోగం, అధికారం, పూనిక, ఉద్యమం.

**మణిగాననము** వి. నన్నసున్నపు పూత. రుక్మా.చ. 1.118.

త. మణియాచమ్. సున్నంపూత, మణియాచనమ్.

**మణిపట్టు** వి. ఒకవిధమైన పట్టు. బసవ. **3.100.**

**మణిమాల** వి. గచ్చుమీద వేసే దండలాంటి బొమ్మ.

సం. మణిమాలా. మణులదండ.

<సం. మణిమాలా (అర్థవిపరి.).

**మణియకాఁడు** వి. గ్రామాధికారి. హంస. 2.48.

క. మణియగార. తహసీల్దారు కింది అధికారి ; త. మణియకారన్. గ్రామాధికారి.

**మణియము** వి. గ్రామాధికారం, అధికారం. సానంద. 4.432, రామలిం. శ.25.

క. మణియ. తహసీల్దారు కింది ఉద్యోగం, దేవా

లయాది అధికారి ; త. మణియం.

**మణియారవెల్లలు** వి.బ.వ. వస్త్రవిశేషం. ద.హిం.శా. సంపు. **4.** శా.సం. 975. క్రీ.శ. 1353.

**మణియు** రూ. మడయు, మడియు. అ.క్రి. చచ్చు, మరణించు. కొరవిశాసనం. క్రీ.శ. 892–922.

క. మడి. చచ్చు, నశించు, తెగు, ఖండితమగు, మడిపు. చచ్చు ; త. మటి. నశించు, చెడు.

సం. మృత-. చచ్చిన ; ప్రా. మడ-. నిర్జీవం ; జై.మహా. మడయ, మడ- ; అ.మా. మడ- ; మా. మడ-, మళ-. మృచ్చ.

**మణివకాఁడు** చూ. మణివము.

**మణివము** రూ. మణిగము. వి. ఉద్యోగం, అధికారం, పూనిక, ఉద్యమం. వరాహ. 7.29.

**మణివకాఁడు** వి. అధికారి.

**మణిసి**[1] రూ. మడిసి. వి. మనిషి. కొరవిశాసనం. క్రీ.శ. 892- 922.

సం. మనుష్య-. మానవుడు ; ప్రా. మణుస్స-, మణూస- ; పా. మనుస్స- ; అ. మనిహ్ ; బెం. మునిస్ ; ఒ. మణిస.

<ప్రా. మణుస్స-.

**మణిసి**[2] రూ.చూ. మంచియ. వి. జొన్నచేలు మొ. వాటిని కాపలాకాయటంకోసం కూర్చోవటానికి ఎత్తుగా వేసే చప్పరం, అరప.

**మణిసిల** వి. పర్వత ధాతువిశేషం.

సం. మణిశిలా. రత్నశిల.

<సం. మణిశిలా.

**మణిహము** వి. వాణిజ్యస్థానం, ఆపణం, బజారు. కవిక. 4.86.

క. మణియ ; త. మణియమ్. పన్నువసూలు చేయటానికి నియుక్తుడైన గ్రామాధికారి కార్యాలయం.

<త. మణియమ్.

**మణుగూలు** చూ. మణుఁగు[1].

**మణుఁగు**[1] రూ.చూ. మడుఁగు[1]. అ.క్రి. అణగు.

**మణుగూలు** రూ.చూ. మణుఁగుఁబూవులు. వి.బ.వ. తేనెతొలలు. **మణుఁగుఁబువ్వులు (-పువ్వులు)** రూ.చూ. మణుఁగుఁబూవులు. వి. భక్ష్యవిశేషం. ప్రబంధ. 112. **మణుఁగుఁబూలు(-పూలు)** రూ.చూ. మణుఁగుఁబూవులు. వి. భక్ష్యవిశేషం. చెన్నబసవ. 4.358. త. మణుగుప్పు. **మణుఁగుఁబూవులు** రూ. మడుఁగుఁబూలు, మడ్గుఁబూలు. మణుగూలు, మణుఁగుఁబువ్వులు, మణుఁగుఁబూలు, మణుబువ్వులు. వి.బ.వ. భక్ష్యవిశేషం. కాశీ. 7.187. త. మణుగుప్పు. భక్ష్యవిశేషం. **మణుబువ్వులు** రూ.చూ. మణుఁగుఁబూవులు. వి.బ.వ. ఎక్కువ చుట్లు కలిగిన మురుకులు.

**మణుఁగు**[2] రూ. మడుఁగు[2], మడుపు[2]. వి. **1.** పరిశుద్ధ వస్త్రం. బసవ. 4పు. 18పం. ; **2.** పరిశుద్ధి. పాండు. 5.220 ; విణ. పరిశుద్ధమైన. పి.శకు. 4.81.

త. మటి. వస్త్రం, మడత.

**మణుఁగు**[3] రూ.చూ. మడుఁగు[4]. వి. **1.** రెట్టి. జైమినిభా. 8.67 ; **2.** ఎనిమిది వీసెలు. ఆం.భా. **3**.58.

**మణుఁచు** రూ.చూ. మడఁచు. స.క్రి. మడగచేయు.

**మణుపు** చూ. మడుఁగు. రూ.చూ. మడుపు[3]. స.క్రి. మడగచేయు, చంపు ; విణ. **1.** చలవ చేసి మడత పెట్టినది ; **2.** చుట్ట, చుట్టినది ; వి. **1.** మడత ; **2.** విడిచిన తమలపాకుచుట్ట ; **3.** ధౌతవస్త్రం, మడత.

**మణుబువ్వులు** చూ. మణుఁగు[1].

**మణుము** రూ.చూ. మడుఁగు[4]. వి. నలభైశేర్ల బరువుగల ఒక కొలత.

**మణువు** రూ.చూ. మడుఁగు[4]. వి.నలభైశేర్ల బరువుగల ఒక కొలత.

**మణె** వి. కరణం.

క. మణియ, మణిహ, మణెహ, మణే. మఠాది సంస్థలపై అధికారి, ఆసీల్దారుకింది ఉద్యోగి.

<క. మణే.

**మణేలా** వి. పేకాటలోని పరిభాష, ఏలం ఆటలో తొమ్మిది.

పో. మనిల్హా. పేకాటలోని పరిభాష, పేకాట పందెంలో ఏడు పాయింట్లు.

<పో. మనిల్హా.

**మంట**[1] చూ. మండు. వి. **1.** జ్వాల, వహ్నిశిఖ. కు.సం. 5.49 ; **2.** ఈర్ష్యాదులతో తాపరూపంగా కలిగే చిత్తవికారం, ద్వేషం. విష్ణుపు. 7.105 ; **3.** కినుక, కోపం ; **4.** కాలటంవల్ల కలిగే చురుక్కుమనే నొప్పి, అలాంటి బాధ.

**మంటగాలి** వి. వడగాలి, ఎండకాలంలో నిప్పులు చెరిగినట్టు వీచే గాలి. **మంటఁగలియు(-కలియు)** అ.క్రి. దగ్ధమగు, చెడు, నశించు. రామలిం. శ. 89. **మంటఁగలుపు(-కలుపు**[1]**)** స.క్రి. **1.** దగ్ధంచేయు ; **2.** నశింపచేయు, చెరచు. **మంటచమురు** వి. ఎర్రగా కాలిన గరిటెలో పోయగా మండే చమురు. **మంటపుట్టు** అ.క్రి. కోపంకలుగు. నిరంకు. **2.25**. **మంటఁబెట్టు(-పెట్టు)** స.క్రి. దహింపచేయు. **మంటమారి** వి. **1.** కోప స్వభావం కలవాడు. ఏసు. **4.44** ; **2.** జ్వలనశీలుడు, మండే స్వభావం ఉన్నవాడు. చంద్రాంగ. **5.73.** **మంటమారితనము** వి. కాల్చివేసే స్వభావం, కోపం. ప్రభు. 3.40 పు. 27 పం. **మంటయెత్తు(-ఎత్తు**[1]**)** అ.క్రి. బాధకలుగు. **మంటలఁగలుపు**[1] స.క్రి. దగ్ధంచేయు, నశింపచేయు, చెరచు. కలు.శ. 56. <మంట[1]+-లు+-అ[7]+కలుపు[1]. **మంటలమలచినరూపగు** అ.క్రి. మంటలతో చేసింది అగు. ఉ.హరి. 3.132.

**మంట**[2] రూ.చూ. మట్ట. వి. **1.** తాడి, కొబ్బరి మొ. వాటి ఆకు ; **2.** నరి చేసేటప్పుడు పడుగుమీద చిలికే వేప, వెంపలి మొ. చెట్ల ఆకుల రెమ్మ.

**మంటం** రూ.చూ. మట్టము. వి. నేల ఎత్తుపల్లాలు చూసే సాధనం.

**మంటపము** వి. **1.** చావడి, సభాభవనం. ఛందో. **4.191** ; **2.** దేవతా విగ్రహాదులుంచటానికి చుట్టు తెరపిగ పందెట్లు స్తంభాలమీద కట్టిన కట్టడం, చవికె. ఆం.భా. 2.16 ; **3.** వ్రతాది శుభకర్మల్లో కొత్తబట్టపరచి బియ్యంపోసి నవగ్రహాది దేవతల నారాధించే స్థలం.

నం. మండప-. చావడి, చలికె, వివాహమండపం.

<సం. మండప-.

మంటిఅడుగు చూ. మన్ను[1].

మంటికోపు చూ. మన్ను[1].

మంటిగడ్డ చూ. మన్ను[1].

మంటిగడ్డలు చూ. మన్ను[1].

మంటిగలాసు చూ. మన్ను[1].

మంటిగూండ్లు చూ. మన్ను[1].

మంటిగోడ చూ. మన్ను[1].

మంటిగ్లాసు చూ. మన్ను[1].

మంటితిండి చూ. మన్ను[1].

మంటినూనె చూ. మన్ను[1].

మంటిపెంకు చూ. మన్ను[1].

మంటిపొయ్యి చూ. మన్ను[1].

మంటిబుక్కడు చూ. మన్ను[1].

మంటిభూమి చూ. మన్ను[1].

మంటిసారి చూ. మన్ను[1].

మండ[1] రూ. మండి[2], మండియ[1], మండె[1]. మెండె, మొండి. వి. **1**. విరివిగా ఉండే కొమ్మ, వితతశాఖ. ద.హిం.శా. సంపు. **4**. శా.సం. 1007. క్రీ.శ. 1065 ; **2**. శాఖనుంచి బయలుదేరిన శాఖ, ఉపశాఖ. మను. **4**.37.

మండజలకము వి. స్ఫోటకాదులు వచ్చినవారికి వేప మండతో చేయించే స్నానం. మండదొక్కు (-త్రొక్కు) స.క్రి. **1**. ఆకు కట్టలు ఒకదానిమీద ఒకటి పేర్చు ; **2**. బస్తాలు ఒకదానిమీద ఒకటి పేర్చినట్లువేయు. మండపీత వి. గుడ్ల పీత, గుండ్ల ఎండ్రకాయ. మండమొటుకు వి. బళ్ళు, గృహోపకరణాలు తయారుచేయటానికి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Ougenia dalbergioides). మండవేయు అ.క్రి. వేపాకుమండ తీసుకొని మంత్రించు.

మండ[2] రూ. మండి[3], మండీ. వి. **1**. చీలమండ, గుల్ఫం ; **2**. మణిబంధం, మణికట్టు.

క. మండి. మోకాలు, వంచబడినది ; త. మంటి, మోకాలుమీద కూర్చోటం.

మండవాయి వి. గుల్ఫవాయువనే రోగవిశేషం, చీలిమండలకి కలిగే వాతరోగం. ఆం.భా. 2.125. మండాడు స.క్రి. **1**. అతి ప్రార్థనలతో పీడించు. యయా. 3.16; **2**. అర్థించు, కోరు. శశా. 4.183. <మండ[2] + ఆడు.

మండ[3] చూ. మండు. వి. **1**. తప్తలోహం. ఆం.భా. 2.275 ; **2**. వేపుడుచట్టి ; **3**. వేపుడుకుచ్చు ; **4**. నూలు తడపటానికి వాడే మట్టిపాత్ర ; **5**. లోతుగాఉండే సాదాపెంకు.

మండకంచము వి. అంచుకట్టిన కంచం, అంచులేని కంచం, ఆకు కంచం. మండగరువు వి. భరించలేని కరువు. మండచిప్ప రూ. మండిచిప్ప. వి. గుండ్రంగా గుంటగా ఉండే మట్టిపాత్ర. అడుగున మట్టు అంచు బోడుగా ఉంటుంది, కడవలపై మూయటానికి లేక అన్నం తినటానికి ఉపయోగిస్తారు. మండపప్పు వి. వేపుడుపప్పు. హర. 6.56. మండమలక వి. అన్నం తినటానికి వాడే మట్టి మూకుడు.

మండగబ్బ రూ.చూ. మండ్రగబ్బ. వి. పెద్దతేలు.

మండపం రూ.చూ. మటప. వి. పునాదితో శంకుస్థాపనకోసం కట్టిన కట్టడం.

మండపుసద్ద రూ. మండపుసొద్ద. వి. నాలుగు నెలలపంట, గింజ లావుగా ఉండే సజ్జ.

మండపుసొద్ద రూ.చూ. మండపుసద్ద. వి. నాలుగునెలల్లో పండే గింజ లావుగా ఉండే సజ్జ.

మండము రూ. మండాము. వి. చేపల్ని పొడిచే చిల్లకోల.

త. మంట. చేపల్ని వేటాడే ఈటె.

<త. మంట.

మండలము వి. 40 రోజుల కాలపరిమితి.

సం. మండల-. రాష్ట్రం, భూభాగం.

<సం. మండల- (అర్థవిపరి.).

మండలికాంపులు వి.బ.వ. గ్రామాధికారులు. నె.శా. కందుకూరు శాసనం. 41. క్రీ.శ. 1684.

సం. మండల-. భూభాగం, దేశం, మండలిన్. ఏలిక, దేశాన్ని ఏలినది.

<సం. మండలిన్ + కాంపు + -లు.

మండసంపీట వి. కోడిపీట, ఒకరకం రెండు నొగలబండికి డొంకి మొద్దుకింద వేసిన పట్టె.

మండా వి. జూదమాడే ఇల్లు

హిం.ఉ. మండీ. దుకాణం, బజారు.

మండాకుడుములు చూ. మండు. వి.బ.వ. ఆవిరితో ఉడికే పిండి వంట.

మండాటము వి. బతిమాలటం, దైన్యంతో యాచించటం. లక్ష్మీ వి. 2.76.

త. మణ్ఆటమ్.

మండాడు చూ. మండ[2].

మండాపగొయ్య వి. మానికంకొయ్య, బండి పరం జారకుండా ఇరుసుమీద అడ్డం పెట్టినకొయ్య.

మండాపచీల వి. డొలుపుచీల, బండి డొలుపును పోలుగ్రకు కలిపే మేకు.

మండాపరోలు వి. పెద్దరోలు.

మండాబూరెలు చూ. మండు. వి.బ.వ. ఆవిరితో ఉడికే బూరెలు.

మండాము రూ.చూ. మండము. వి. చేపల్ని పొడిచే చిల్లకోల

మండాలు చూ. మండెఁగ. వి.బ.వ. భక్ష్య విశేషం. (పాలు, నెయ్యి కలిపి పిండితో కలిపి చేసే పలచటి అట్లు).

మండి[1] వి. వడేరు, బావి గోడ కింద ఆధారంగా ఉండేటట్లు దించిన కొయ్య చక్రం, మెత్తటి నేలమీద ఈ చక్రం ఉంది దీనిమీద గోడ కడతారు.

మండి[2] రూ.చూ. మండ[1]. వి. **1**. గుట్ట, ఇటుకరాళ్ళ కుప్ప ; **2**. దొంతి, పెంకుల కుప్ప ; **3**. పడుగు, సున్నం కుప్ప ; **4**. విత్తనాలు మొలకెత్తటానికి నేలమీద చక్రాకారంగా నెరిపిన గింజల కుప్ప ; **5**. నలుచదరంగా వేసే పంటగడ్డి కుప్ప ; **6**. పొగాకు తోరణాలు ఆరిన తరవాత పేర్చిన కుప్ప ; **7**. పొట్టు మొ. వాటిని దాచటానికి చుట్టూ చొప్పతో కట్టే ఆవరణం ; **8**. తూర్పార పొయ్యటానికి

సిద్ధం చేసిన బూగర; 9. పత్తి కాయలు కోసి వేసిన కుప్ప; 10. నలుచదరంగా వేసిన చొప్పవామి.

**మండికట్టు** రూ.చూ. మండెకట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా కుప్పకట్టు. **మండికుచ్చెల** రూ. చూ. మండెకుచ్చెల. వి. కళ్ళంలో మెదిగిన చొప్పను తీసి నల చదరంగా వేసిన కుప్ప. **మండిగట్టు (-కట్టు)** వి. మట్టిని పాదుకట్టు. **మండిగంట్రలు** రూ. మండిగంౘలు. వి.బ.వ. ధాన్య విశేషం, ఒకరకం వడ్లు. **మండిగంౘలు** రూ.చూ. మండిగంట్రలు. వి.బ.వ. ధాన్య విశేషం. **మండిగూడు** రూ.చూ. మండెగూడు. వి. కంకులు దాచిపెట్టటానికి గడ్డితో కట్టిన ఆవరణం. **మండిదింపు** రూ.చూ. మండెదింపు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా కుప్పవేయు. **మండిపెట్టు** రూ.చూ. మండెపెట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా కుప్పగా పెట్టు. **మండివేయు** రూ.చూ. మండెవేయు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా కుప్పవేయు.

**మండి**[3] రూ.చూ. మండ[2]. వి. ఒక కాలు నేల మోకరించటం.

**మండిగాలు (-కాలు[2])** వి. మండీ ఏర్పడేటట్లు ఉంచిన కొయ్య. మను. 5.44. **మండిచిప్ప** రూ.చూ. మండచిప్ప. వి. గుండ్రంగా గుంటగా ఉండే మట్టిపాత్ర, అడుగున మట్టు అంచు బోడుగా ఉంటుంది. కడవలపై మూయటానికి లేక అన్నం తినటానికి ఉపయోగిస్తుంది. **మండిదొక్కు (-త్రొక్కు)** స.క్రి. జాబేకును గుండ్రంగా పేర్చు. **మండిముంకచింత** వి. వంగిన చిన్న చింతచెట్టు. F.I. XIX. 24.137. **మండివెట్టు (-పెట్టు)** అ.క్రి. 1. ఒక కాలు మోకరించి ఉంచు. భార.విరా. 2.18; 2. మండిమీద ఉండు. ఉ.రా. 3.246.

**మండి**[4] వి. ఒకవిధమయిన విష్రవణం.

**మండిలూటి** వి. పైకి పొడమరించక లోపల అణిగి ఉండే కురుపు. ఆం.భా. 2.130.

**మండిక** రూ.చూ. మండిగ[1]. వి. 1. పడుగుకు పెట్టే గంజి వేసుకొనే వెడల్పు మూతిగల గుండ్రటి పాత్ర; 2. పేక దారం కండెలు వేసుకొనే మట్టిపాత్ర; 3. రంగులు కలుపు కొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టిపాత్ర; 4. పళవు లకు కుడితిని తాగించే మట్టితొట్టి.

**మండికం** రూ.చూ. మండిగ[1]. వి. స్నానం తర్వాత చంటి పిల్లలకి పొగ బట్టటానికి ఉపయోగించే మట్టిపాత్ర.

**మండికి** రూ.చూ. మండిగ[1]. వి. 1. పడుగుకు పెట్టే గంజి వేసుకొనే వెడల్పు మూతిగల గుండ్రటి పాత్ర; 2. పేక దారం కండెలు వేసుకొనే మట్టిపాత్ర; 3. రంగులు కలుపుకొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టిపాత్ర; 4. లోతు తక్కువ, వెడల్పు మూతి రెండంచులుండే నీళ్ళ తొట్టి; 5. మూకుడు కంటె లోతుగా ఉంటుంది. స్నానం తరవాత చంటిపిల్లలకి పొగ బట్టటానికి ఉపయోగించే మట్టి పాత్ర.

**మండికొను** చూ. మండు.

**మండిగ**[1] రూ. మండిక, మండికం, మండికి, మండిగి, మండిగె[2], మండిశ, మండుగు, మండె[2], మండ్రిగె. వి. 1. కుంపటి; 2. బాణ సంచుల మందుల్ని నూరే మట్టిపాత్ర; 3 రంగులు కలుపుకొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టి. పాత్ర; 4. పేకదారం కండెలు వేసుకొనే మట్టిపాత్ర; 5. పడుగుకు పెట్టే గంజి వేసుకొనే వెడల్పు మూతిగల గుండ్రటి పాత్ర; 6. లోతు తక్కువగా వెడల్పు మూతి రెండంచు లుండే నీళ్ళ తొట్టి.

**మండిగ**[2] రూ.చూ. మండిగము. వి. దర్వాజా చట్రం కింది కమ్మి, తక్కిన వాటికన్నా లావుగా ఉండేది.

**మండిగము** రూ. మండిగ[2], మండిగెం, మండెగెం, మండ్గం, మనిగం, మనిగెం. వి. 1. వాకిలి కింద అడ్డంగా అమర్చిన కొయ్య, శిల; 2. బండి ఇరుసుపై అడ్డంగా ఉండే మొద్దు.

త. మండాంకి. గుమ్మం లేదా కిటికీపై ఉన్న అడ్డపు కొయ్య, లింటల్.

**మండిగంబల్ల** రూ. మండ్గంబల్ల. వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు.

**మండిగంబల్ల** చూ. మండిగము.

**మండిగి** రూ.చూ. మండిగ[1]. వి. 1. పడుగుకు పెట్టే గంజి వేసుకొనే వెడల్పు మూతిగల గుండ్రటి పాత్ర; 2. పేకదారం కండెలు వేసుకొనే మట్టిపాత్ర; 3. రంగులు కలుపుకొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టిపాత్ర.

**మండిగె**[1] రూ.చూ. మండెఁగ. వి. భక్ష్య విశేషం. సిం.ద్వా. 2.171.

**మండిగె**[2] రూ.చూ. మండిగ[1]. వి. 1. పడుగుకు పెట్టే గంజి వేసుకొనే వెడల్పు మూతిగల గుండ్రటి పాత్ర; 2. పేకదారం కండెలు వేసుకొనే మట్టిపాత్ర; 3. రంగులు కలుపుకొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టిపాత్ర.

**మండిగెం** రూ.చూ. మండిగము. వి. డొలుపు, బండిచట్రంలోని అడ్డపట్టె.

**మండించు** చూ. మండు.

**మండిపడు** చూ. మండు.

**మండిపోవు** చూ. మండు.

**మండియ**[1] రూ.చూ. మండ[1]. వి. అదిమి పొదువుగా పేర్చిన జొన్న కంకులు, పొగాకు మొ. పోగు.

**మండియ**[2] వి. దుకాణం కోసం వేసిన పాక. కు.సం. 11.30.

క. మండి. సరకులు నిలవ ఉంచే చోటు, టోకుగా సరకులు కొనే కొట్టు; త. మండి;

హిం.ఉ. మండీ. టోకుగా వస్తువులమ్మే చోటు, బజారు.

**మండిలి** రూ. మండీలి. వి. 1. మల్లవిద్యా విశేషం, ఒకరకం సాము. ఆం.భా. 2.207; 2. యుద్ధసమయాల్లో యోధులు నిలుచుండే విధానాల్లో ఒకటి; 3. మల్లబంధ విశేషం.

త. మంటిలమ్. అశ్వగతి, వర్తులగతి;

సం. మండల-. వర్తులాకారం.

**మండిశ** రూ.చూ. మండిగ[1]. వి. మట్టితో చేసిన కుంపటి.

**మండీ** రూ.చూ. మండ[2]. వి. ఒక కాలు నేలమీద మోక రించటం.

**మండీలి** రూ.చూ. మండిలి. వి. 1. మల్లవిద్యా విశేషం, ఒకరకం సాము. ఆం.భా. 2.207; 2. యుద్ధ సమయాల్లో

యోధులు నిలుచుండే విధానాల్లో ఒకటి ; **3**. మల్లబంధ విశేషం.

**మండీలు** చూ. మండెఁగ. వి.బ.వ. ఒకరకం తియ్యటి తిను బండారాలు.

**మండు** అ.క్రి. **1**. ప్రజ్వలించు, ప్రకాశించు, వెలుగు. భార. ఆరణ్య. 2.197 ; **2**. కోపోద్దీపితుడగు, మిక్కిలి కోపించు. భార.ఉద్యో. 4.327 ; **3**. వాడిఅగు. హర. 7.54 ; **4**. ఉద్రేకించు, విజృంభించు, చెలరేగు. ప్రబోధ. 2.2 ; **5**. (అగ్నిస్పర్శలా) గాయం మొ.వి చురుక్కుమని బాధ కలిగించు. మను. 3.35 ; **6**. (ఈర్ష్యాదులతో) తపించు, బాధనొందు. శుక. 3.280.

త. మంటు (మంటి-). మండు, ప్రజ్వలించు, వెలుగు, ప్రకాశించు, మటు (-ప్పి-, -ట్టి-). వెలుగు, మండెరి ; గోం. మర్ గానా. ప్రకాశించు, మండు.

**మండికొను** రూ. మండుకొను. అక్రి. మండు, కోపోద్దీపితుడగు, మిక్కిలి కోపించు. భాస్క.రా.యు. 1218. < మండు + -ఇ[11] + కొను. **మండించు** స.క్రి. **1**. కాల్చు. శృం.నై. 7.53 ; **2**. మాడ్చు, తపింపచేయు, మిక్కిలి బాధించు. భీమ. 2.101 ; **3**. మండేటట్లు చేయు, ప్రజ్వలింప చేయు. < మండు + -ఇంచు[3]. **మండిపడు** అ. క్రి. **1**. కనలు, మిక్కలి కోపించు. వరాహ. 11.107 ; **2**. కాలిపోవు, ప్రజ్వలించు. కాత్యా. 1.113. < మండు + ఇ[13] + పడు. **మండిపోవు** అ.క్రి. **1**. ఎక్కువ కోపంతో ఉండు ; **2**. బజారు ధరలు పెచ్చు పెరిగిపోవు. < మండు + -ఇ[13] + పోవు. **మండుకొను** రూ.చూ. మండికొను. అ.క్రి. మండు, కోపోద్దీపితుడగు, మిక్కలి కోపించు. **మండునెల** వి. వసంత రుతువు, ఆమని, యువజనులకు తాపం పుట్టించే నెల. ఉ. హరి. 2.194. **మండువేసవి** వి. ఎండలెక్కువగా ఉండే గ్రీష్మర్తు భాగం, నడివేసవి. ఆము. 2.62.

**మండుగు** రూ.చూ. మండిగ[1]. వి. సున్నం కలిపే మట్టితొట్టి.

**మండువ** రూ.చూ. మండువా. వి. మూడువైపుల గోడలు కలిగి ఒక తట్టు గోడలేకుండా గుర్రాలకై ఎత్తుగా కట్టబడిన కట్టడం. హంస. 4.30.

**మండువా** రూ. మండువ. వి. **1**. మూడువైపుల గోడలుండి ఒక వైపు గోడ లేకుండ (గుర్రాలకోసం) ఎత్తుగా కట్టిన కట్టడం, లాయం. మను. 1.40 ; **2**. దుకాణంకోసం కట్టినపాక, పాక. హంస. 4.30 ; **3**. నాలుగిళ్ళ బవంతి మధ్య ఖాళీగా ఉండే ప్రదేశం.

హిం. మండ్వా. మండపం ; ఉ. మండ్వా.

< ఉ. మండ్వా.

**మండువాయిల్లు(-ఇల్లు)** వి. లోగిలి(ల్లు) మధ్యనున్న ఖాళీ స్థలానికి నాలుగువైపులా గదులున్న ఇల్లు. **మండువాలోగిలి** వి. నాలుగిండ్ల భవంతి.

**మండె[1]** రూ.చూ. మండ[1]. వి. **1**. అదిమి పొదుపుగా పేర్చి పెట్టిన జొన్న కంకులు పొగాకు మొ.వాటి యొక్క కుప్ప. ఆం.భా. 2.101 ; **2**. కట్ట ; **3**. వస్తువుల రాశి ; **4**. ఆకుల గుట్ట ; **5**. జోడా, పెంకుల్ని ఒకదానితో ఒకటి దూర్చి పేర్చే తీరు ; **6**. పొట్టు మొ.వాటిని దాచటానికి చుట్టూ చొప్పతో కట్టే ఆవరణ ; **7**. నలుచదరంగా వేసే పంట గడ్డికుప్ప , **8**. తూర్పార పోయటానికి సిద్ధంగా చేసిన బూగర రాశి ; **9**. పత్తికాయలు కోసివేసిన కుప్ప ; **10**. నలుచదరంగా వేసిన చొప్పవామి.

**మండెకట్టు** రూ. మండికట్టు, మెండెకట్టు, మొండికట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి. నలచదరంగా కుప్పకట్టు. **మండెకుచ్చెల** రూ. మండికుచ్చెల, మెండెకుచ్చుల, మొండికుచ్చల. వి. కళ్ళంలో మెదిగిన చొప్పను తీసి నలచదరంగా వేసిన కుప్ప. **మండెగూడు** రూ. మండిగూడు, మెండెగూడు, మొండిగూడు. వి. కంకులు దాచిపెట్టటానికి గడ్డితోకట్టిన ఆవరణం. **మండెచేటనలుగు** వి. ఎగురబోయని వడ్లరాశిపై చేటతో నలుగు పెట్టటం. **మండెతిరుగు** అ.క్రి. దెబ్బ తగిలి విరుగు. **మండెదింపు** రూ. మండిదింపు, మెండెదింపు, మొండిదింపు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలుచదరంగా దింపు. **మండెపూలు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **మండెపెట్టు** రూ. మండిపెట్టు, మెండెపెట్టు, మొండిపెట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా పెట్టు. **మండెవేయు** రూ. మండివేయు, మొండివేయు, మొండెవేయు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలుచదరంగావేయు.

**మండె[2]** రూ.చూ. మండిగ[1]. వి. సాలీలు రంగులు కలుపుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర.

**మండెగం** రూ.చూ. మండిగము. వి. బండి ఇరుసుపై అడ్డంగా ఉండే మొద్దు.

**మండెఁగ** రూ. మండిగె[1]. వి. మెత్తని గోధుమ పిండి. నేయి మొ. వాటితో చేసిన ఒకరకం పిండివంట, భక్ష్యవిశేషం. జైమినిభా. 8.204.

సం. మండక-, మండికా. పలచని రొట్టె ; ప్రా. మండగ-,మండఅ; అ.మా. మండగ-; పా. మండక-; క. మండగె, మండిగె ; తు. మండిగె ; త. మంటుకమ్, మంటికై.

< ప్రా. మండగ-.

**మండెబోయు(-పోయు)** స.క్రి. **1**. మొలకెత్తటానికి వడ్లు నానబోయు ; **2**. మామిడిపళ్ళు పండటానికి (మాగటానికి) వేపాకు వేసిపెట్టు.

**మండెము** రూ.చూ. మాఁడెము. వి. **1**. మన్నెపు ప్రదేశం, దుర్గమ స్థలం. ఆం.భా. 2.7 ; **2**. మండలాధిపతుల భూమండలం.

**మండెమురాయఁడు** వి. మండలాధిపతి. తాళ్ల. సం. 13.229.

**మండెలమాను** వి. కుంపుడు బావులలో కింది తల్లి పరను అమర్చి కుంచు పచ్చిపాలకొయ్యతో చేసిన గుండ్రని చట్టం.

**మండోదరి** వి. **1**. సిల్కాలివు రంగులో మబ్బుగాఉండే రంగు ; **2**. బుద్ధిమంతురాలు.

సం. మందోదరీ. రావణుని భార్య.

< సం. మందోదరీ (అర్థవిపరి.).

**మండ్గం** రూ.చూ. మండిగము. వి. డొలువు, బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు.

**మండ్గంబల్ల** రూ.చూ మండిగంబల్ల. వి. బండి ఇరుసు

మీదవేసే అడ్డమొద్దు.

మం(డ వి. ఒకానొక ముళ్ళచెట్టు. హంస. 4.9.

మం(డగబ్బ రూ. మండగబ్బ. వి. నల్లని పెద్దతేలు. ఆం.బా. 2.88.

మం(డాటకాఁడు చూ. మం(డాటము.

మం(డాటము వి. 1. (శమ, బాధ. ఉ.హరి. 2.167 ; 2. పెనుగులాట, మల్లాట. ద్వి.సార.చ. 2.669.

మం(డాటకాఁడు వి. పెనుగులాడేవాడు, (పతిస్పర్ధి. పి.శకు. 2.110.

మం(డాడు అ.(కి. 1. పెనగులాడు, మల్లాడు ; 2. (శమపడు, బాధనొందు.

మం(డిగె రూ.చూ. మండిగ[1]. వి. 1. పడుగుకు పెట్టే గంజివేసుకొనే వెడల్పు మూతిగల గుం(డటి పా(త ; 2. పేకదారం కండెలు వేసుకొనే మట్టిపా(త ; 3. రంగులు కలుపుకొనే మూకుడు మాదిరి ఒకరకం మట్టిపా(త.

మణ్ణాస వి. భూరూపమైన ఆస్తిపై ఆశ. కాశ. 3.185.

త. మణ్ణాసై. భూమిపై ఆశ.

<త. మణ్ణాసై.

మణ్ణియ వి. ఒక భూపరిమాణ విశేషం. NICPI (కీ.శ. 1390.

మణ్ణు వి. మన్ను, భూమి.

క. మణ్. నేల, భూమి ; తు. త. మణ్.

<త. మణ్.

మణ్మ రూ.చూ. మదుఁగు[4]. వి. నలబై శేర్ల బరువుగల ఒక కొలత.

మతకము[1] వి. 1. మాయ. భార. అను. 2.178; 2. మర్మం, గుట్టు. (పభు. 2.24పు. 6పం. ; కపటం. (పభు. 2.27పు. 3 పం. ; విణ. 1. కపటం, కుత్సితం. వైజ. 2.75 ; 2. మాయకలది.

సం. మత్క-. నా సంబంధమైనది, మదీయం.

<సం. మత్క-.

మతకరి[1] వి. మాయకలవాడు, మాయకలది, మాయలాడి. పారి. 1.48. <మతకము[1] + -అరి.

మతకము[2] వి. సద్బుద్ధి.

సం. మస్తక-. శిరస్సు, తల ; (పా. మత్థగ-, మత్థయ-. శిరస్సు.

<(పా. మత్థగ-.

మతకరి[2] వి. మంచి బుద్ధికలవాడు. భాస్క.రా. సుందర. 447. 448. <మతకము[2] + -అరి.

మతకము[3] వి. 1. స్తబ్దత ; 2. సోమరితనం.

సం. మత్తక-. మత్తెక్కినది.

<సం. మత్తక-.

మతకరి[1] చూ. మతకము[1].

మతకరి[2] చూ. మతకము[2].

మతంగిబుడ్డి వి. జాతర్లలో మతంగులకు ఇచ్చేమట్టిపా(త. దీనికి పసుపు కుంకుమ పూసి పోగుదారాలతో వేపమండలు కట్టి ఉంటాయి. దీంట్లో కల్లుపోయించుకొని ముందు పెట్టుకొని 'కలజిగో' అని మాతంగి అరుస్తుంటాడు.

సం. మాతంగీ, హరిజనస్త్రీ.

<సం. మాతంగీ + బుడ్డి.

మతబా రూ.చూ. మహతాబు. వి. ఒకవిధమైన బాణసంచు.

మతలబు రూ. మతలము, మత్తబు. వి. ఉద్దేశం.

అర. మత్లబ్. ఉద్దేశ్యం, కోరిక, విజ్ఞప్తి ; హిం. మత్లబ్. అభి(పాయం, ఆశయం ; మరా. మత్లబ్. హేతువు, ఆశయం ; ఉ. మత్లబ్. అర్థం, ఉద్దేశం ; పార. మత్లబ్. (పశ్న, ఉద్దేశ్యం.

<ఉ. మత్లబ్.

మతలము రూ.చూ. మతలబు. వి. 1. ఉత్తరంపై విలాసం రాసే రీతి ; 2. ఉత్తరం లోని అంశాల గమనిక ; 3. చిత్తురాత.

మతాబా రూ.చూ. మహతాబు. వి. 1. చం(దుడు ; 2 ఒకవిధమైన బాణసంచు.

మతాబి రూ.చూ. మహతాబు. వి. ఒకవిధమైన బాణసంచు.

మతాబిసిప్ప (-చిప్ప) వి. గుం(డంగా అంచు లేకుండా (పమిదలాగ చేసిన చిన్నబుడ్డి.

మతాబీ రూ.చూ. మహతాబు. వి. గుం(డంగా అంచు లేకుండా (పమిదలాగ ఉండే చిప్పబుడ్డి.

మతాబు రూ.చూ. మహతాబు. వి. 1. చం(దుడు ; 2. ఒకవిధమైన బాణసంచు.

మతి వి. దోనె ముందరనేసిన బట్టముడుచుకు పోకుండా అడ్డంగా పైపైపు బి(రుపెట్టే కొయ్యబద్ద.

సం. మతి-. ఆలోచన, ఆరాధన, నిశ్చయం.

<సం. మతి- (అర్థవిపరి.).

మతికిలేకుండు అ.(కి. జ్ఞప్తికి లేకపోవు. మతిచొచ్చు అ.(కి. మనసులో చొచ్చు. తాళ్ల.సం. 3.10. మతించు రూ. చూ. మదించు. స.(కి. 1. లెక్కపెట్టు ; 2. అంచనావేయు ; 3. వెలకట్టు, నిర్ణయించు. మతితప్పు అ.(కి. మతిపోవు. పండి. చ. 1.115పు. మతిపుట్టు అ.(కి. బుద్ధిపుట్టు. పాండు. 2.184. మతిమాలు అ.(కి. (భంశంఅగు. తాళ్ల. సం. 5.63. మతేదులు వి. బ. వ. జంపఖానా నేసేటప్పుడు అడ్డాన్ని బి(రుపెట్టటానికి వాడేక(రలు. <మతి + ఏదు + -లు.

మతుపు రూ.చూ. మదుపు[4]. స.(కి. కప్పిపుచ్చు.

మతుబు వి. ముదురు ఆకుపచ్చరంగు.

మతేదులు చూ. మతి.

మత్త వి. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళుతోడి పోసే వైపు కట్టిన కట్ట.

సం. మా(తా. పరిమాణం ; హిం. మత్త.

మత్తడి వి. 1. చెరువులో ఎక్కువైన నీళ్ళుపొర్లి పోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరచిన రాతి కట్టడం ; 2. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవటానికి మట్టికొట్టుకు పోకుండా ఉండటానికి పొలం గట్టు చివర కట్టిన రాతికట్ట ; 3. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళుతోడి పోసే వైపు కట్టినకట్ట.

మత్తగిలు చూ. మత్తు[2].

మత్తగిల్లు చూ. మత్తు[2].

మత్తగోలు చూ. మత్తు[2].

మత్తబు రూ.చూ. మతలబు. వి. ఉద్దేశం.

మత్తమాల రూ. చూ. మడతమాను. వి. కొన్నిరంగులు, ద్రావకాలు పోసేజాడి.

మత్తా రూ. మత్తు². వి. మదం, కైపు. శివరా. 3.15.

సం. మత్తతా. మదం, కైపు.

<సం. మత్తతా.

మత్తాగొను (-కొను) అ.క్రి. మదించు. వరాహ. 4.115.

మత్తాచి రూ.చూ. మత్తాపు. వి. నీలంరంగు.

మత్తాపు రూ. మత్తాచి. వి. నీలంరంగు.

హిం. మహ్‌తాబ్. చంద్రుడు, వెన్నెల ; మరా. మహ్‌తాప. వి. ఒకవిధమైన బాణసంచా, అందమైనస్త్రీ ; ఉ. పార. మహతాబ్. చంద్రుడు, చంద్రకాంతి, ఒకవిధమైన బాణసంచా ;

క. మతాపు, మతాబు, మహతాబు. ఒకవిధమైన బాణసంచా ; త. మత్తాప్పు ; మ. మేథాప్పి.

<ఉ. మహ్‌తాబ్.

మత్తాబు రూ.చూ. మహతాబు. వి. ఒకరకం బాణానంచు.

మత్తాయిగొను (-కొను) చూ. మత్తా. అ.క్రి. మదించు. తాళ్ల. సం. 8.88.

మత్తి¹ వి. 1. కామం, మరులు. విక్ర. 7.14 ; 2. అవివేకం.

సం. మత్త-. మదించినది.

<సం. మత్త-.

మత్తికాఁడు రూ. మత్తిగాఁడు. విణ. 1. కాముకుడు. బసవ. 3.219 ; 2. అజ్ఞాని, అవివేకి. వరాహ. 11.16. మత్తిగాఁడు (-కాఁడు) రూ.చూ. మత్తికాఁడు. వి అవివేకి. గొ. హరి. ఉ. 535సం.

మత్తి² రూ. మద్ది². వి. తొగర.

మత్తిలు చూ. మత్తు².

మత్తిల్లు చూ. మత్తు².

మత్తు¹ రూ.చూ. మస్తు. వి. హెచ్చు, అధికం.

మత్తు² రూ.చూ. మత్తా. వి. 1. మదం. ఆం. భా. 2.195 ; 2. మంపు, మైకం.

మత్తగిలు రూ.చూ. మత్తగిల్లు. అ.క్రి. మదించు. మత్తగిల్లు రూ. మత్తగిలు. అ.క్రి. మదించు. నీలా. 1.118. మత్తగోలు వి. మత్తు. మత్తిలు రూ. చూ. మత్తిల్లు. అ.క్రి. 1. మదించు ; 2. పరవశుడగు. మత్తిల్లు రూ. మత్తిలు. అ.క్రి. 1. మదించు. కు. సం. 3.74 ; 2. పరవశుడగు. భార. సౌప్తి. 1.202. మత్తుగొను (-కొను) అ.క్రి. మైకంపొందు. మత్తైన వి. కాముకుడు. పండి. చ. 1.41.

మత్తైన రూ. మత్తు².

మదం¹ రూ. మదాం¹. వి. గడ్డ, మట్టు, మేడి బిగించే ఏడికోల కొన.

హిం. ఉ. మద్. విభాగం, ముక్క (ఖండం).

మదంబొక్క వి. దుంపసందు, ఏడికోల దూర్చటానికి పటతతో కొట్టిన రంధ్రం.

మదం² రూ.చూ. మడుగు. వి. 1. తూము ; 2. చెరువునీళ్ళు వెలుపలికి పోయేగొట్టం.

మదగం రూ.చూ. మదనము. వి. తూర్పారపొయ్యకముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యం రాసి.

మదగంపలక వి. బొమ్మ, ఒడ్డె బండిచక్రం మధ్య అమర్చిన చెక్క.

మదగరివెంబు రూ. మదగిరివెంబు. వి. అందంగాఉండే పెద్ద చెట్టు (Chukrasia tabularis).

త. మలైవెంపు.

మదగిరివెంబు రూ.చూ. మదగరివెంబు (Chukrasia tabularis).

మదట రూ. మదల. విణ. 1. మూర్ఖుడు, మూర్ఖం. వేంక. పంచ. 3.122 ; 2. మదించినది, మత్తుడు. వేంక.పంచ. 4.129 ; 3. సోమరి, అలసుడు. ఆం.భా. 3.6 ; వి. మత్తత.

క. మదర, మ్రద. సంతోషం ;

సం. మద-. మత్తు, గర్వం.

మదటగొను (-కొను) అ.క్రి. మత్తతగొను. సాంబో. 1.164. మదటతనము వి. మూర్ఖత్వం. వేంక.పంచ. 3.110. మదటయేనుఁగు (-ఏనుఁగు) వి. తోలు తోగునట్లూ, నెత్తురు కారునట్లూ, కండ ఊడునట్లూ, బరిగోలలతోనూ అంకుశాలతోనూ పొడిచి ఎంత బాధ పెట్టినా ఒడలెఱుగని మదపుటేనుగు.

మదతికత్య వి. గుడిసాని. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1052, క్రీ.శ. 1351.

సం. మదవతీ. స్త్రీ, మదం కలది.

<సం. మదవతీ+-కత్తియ.

మదతు రూ.చూ. మద్దత్తు. వి. సాయం.

మదత్‌ఖానా వి. మదత్తు తాగే చోటు.

హిం.ఉ. మదద్-. తమలపాకు, నల్లమందుల మిశ్రం ; హిం.ఉ.పార. ఖానా. గది, చోటు.

<ఉ. మదత్+ఉ. ఖానా.

మదత్తు రూ. మదాత్తు. వి. ఒక మత్తుపదార్థం.

క. మదత్ ;

హిం. మదత్. మత్తు కోసం పొగ తాగేందుకు తయారు చేయబడిన నల్లమందు మిశ్రమం.

మదద్ వి. బట్టి గోడలు వాలిపోకుండా పోటిగా కట్టిన చిన్న గోడ.

హిం.ఉ. మదద్. సాయం.

<ఉ. మదద్.

మదద్గారు రూ.చూ. మద్దతుగారు. వి. సాయం చేసేవాడు.

మదన వి. కొండలమీద పెరిగే పొదవాటి గొట్టాలుకల పూలు పూసే చెట్టు (Borreria hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన- (అర్థవిపరి.).

మదనం రూ.చూ. మదనము. వి. 1. తూర్పారపొయ్యక ముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యం రాసి ; 2. పాకం, నడుము.

మదనకట్టె వి. మదనబుడత, ఎర్రనేలల్లో పెరిగే పాకుడు తీగ కొమ్మలు నాలుగు పలకలుగా గరుగ్గా ఉంటాయి. చిన్న చిన్న నూలు పోగుల్లాటి వేళ్ళుంటాయి. కణుపు సందుల్లో

ఒక్కొ గుత్తికి నాలుగునుండి ఆరుదాకా తెలుపు లేక నీలి రంగు పూలుంటాయి (Spernacoce hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+కట్టె (మిశ్రన.).

**మదనకామాక్షి** వి. ఆకులు చాపలు అల్లటానికి ఉపయోగపడే తాటిచెట్టువంటి చెట్టు (Cycas circinalis).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది. కామాక్షి. స్త్రీ.

<సం. మదన-+సం. కామాక్షి (అర్థవిపరి.).

**మదనగంధులు** వి.బ.వ. ఒకరకం ధాన్యం.

సం. మదనగంధిన్. మన్మథవాసన కలది.

<సం. మదనగంధిన్+-లు.

**మదనచేయి** వి. **1**. కురుజులు మీద ఉండే పట్టె. అము. 2.17 ; **2**. మిద్దె కడ్డీ. రాజవా. 4.85.

సం. మదన-. ఖదిరవృక్షం, చంద్రచెట్టు.

<సం. మదన-+చేయి (మిశ్రన.).

**మదనపడు** అ.క్రి. **1**. సంకటపడు ; **2**. వెనుకముందాడు.

సం. మథన-. త్రచ్చేది, నశింపచేసేది.

<సం. మథన-+పడు.

**మదనపల్లిసన్నం** వి. ఎర్రనన్నం, ఒకరకం వడ్లు.

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చెంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది. మదనపల్లిలో పండే ధాన్యం కావచ్చు.

**మదనబుడత** వి. మదనకట్టె, మదనకాడ, మదనముత్తు, మదనలం, మదనాకు, ఎర్రనేలల్లో పెరిగే పాకుడు తీగ (Spernacoce hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+బుడత (మిశ్రన.).

**మదనమాగు** రూ.చూ. మదరమాగు. అ.క్రి. పండు ఎక్కువగా మాగు, కలమాగు.

**మదనము** రూ. మదగం, మదనం. వి. వరికుప్ప చుట్టు చెక్కిన స్థలం, కళ్ళం.

సం. మథన-. నశింపచేయటం, చిలకటం.

<సం. మథన-.

**మదనమెత్తించు** అ.క్రి. మత్తుఎక్కించు. తాళ్ల.సం. 17.228. <మదనము+ఎత్తు[1]+-ఇంచు[3].

**మదనముత్తకాడ** వి. మదనబుడత, ఎర్రనేలల్లో పెరిగే పాకుడు తీగ (Borreria hispida, spernacoce hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+ముత్తకాడ.

**మదనమెత్తించు** చూ. మదనము (మిశ్రన.).

**మదనలం** వి. మదనబుడత, ఎర్రనేలల్లో పెరిగే పాకుడు తీగ (Spernacoce hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+అలం (మిశ్రన.).

**మదనసరులు** వి.బ.వ. ధాన్యభేదం, వడ్లలో ఒకరకం. ప్రబంధ. 112.

సం. మదన-. మన్మథుడు, ఆమని.

<సం. మదన-+సరులు (మిశ్రన.).

**మదనాకు** వి. మదనబుడత, ఎర్రనేలల్లో పెరిగే పాకుడు తీగ (Spernacoce hispida).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+ఆకు (మిశ్రన.).

**మదనానప** రూ. మదనానబ. వి. బొప్పాయిచెట్టు (Carica papaya).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+ఆనప (మిశ్రన.).

**మదనానబ** రూ.చూ. మదనానప. వి. బొప్పాయిచెట్టు (Carica papaya).

సం. మదన-. వసంతకాలం, మంగచెట్టు, ఉమ్మెత్త చెట్టు, చంద్రచెట్టు, పొగడచెట్టు, మత్తెక్కించేది.

<సం. మదన-+ఆనబ (మిశ్రన.).

**మదను** వి. గర్వం, పొగరు. రాజవా. 4.58.

సం. మద-. మత్తత, గర్వం, దురహంకారం, మదన-. మన్మథుడు.

<సం. మదన-(అర్థవిపరి.).

**మదపు** రూ. మదుపు.[2] వి. అడ్డతీగ, పెద్ద ఆకులు కలిగి తినే గింజలు కాసే తీగ (Bauhina vahlii.)

**మదరతా** వి. జిల్లేడు చెట్టు.

హిం. మదార్. జిల్లేడు.

<హిం. మదార్.

**మదరమాగు** రూ. మదనమాగు. అ.క్రి. పండు ఎక్కువగా మాగు.

**మదల** రూ.చూ. మదట. విణ. సోమరి. ఆం.భా. 3.6.

**మదలకించు** రూ.చూ. ముదరకించు. స.క్రి. ఒక విషయాన్ని గట్టిగా అడుగు.

**మదళి** వి. బాలుడు, బాలిక. పండి.చ. 5.38.

క. మదకల. ప్రేమాలాపన ; త. మతలై. పిల్లల ప్రేలాపన.

**మదసము** వి. **1**. పొదుపు ; **2**. బుద్ధి, మర్యాద ; **3**. పరిశుభ్రం ; **4**. కచ్చితం ; **5**. సరైంది ; **6**. అధికం.

సం. మంద-. బలుపు, దళసరి ఐనది.

**మదహత్తి** వి. మదపుటేనుగు. పాంచాలీ. 139 ; విణ. శ్రేష్ఠుడు, శ్రేష్ఠం. ఆం.భా. 3.15.

సం. మదహస్తిన్. మదపుటేనుగు ; ప్రా. మదహత్థి.

<ప్రా. మదహత్థి.

**మదాం**[1] రూ.చూ. మదం[1]. వి. గడ్డ, మట్టు, మేడి బిగించే ఏడికోల కొన.

**మదాం**[2] వి. పేకాటలో రాణిబొమ్మ.

ఇం. *Madam*. ప్రియురాలు, బిరుదుగా పేర్ల ముందుంచబడే పదం, గృహస్థురాలు ; ఫ్రె. *Madame*. నా స్త్రీ.

<ఫ్రె. Madame.

**మదాత్తు** రూ.చూ. మదత్తు. వి. ఒక మత్తు పదార్థం.

**మదాయించు** స.క్రి. కలగుమ్మ, కాళ్ళతో తొక్కి అడుసును కలుపు.

సం. మథ్. చిలుకు, మథించు.

<సం. మథ్ + -ఇంచు[3].

**మదాళించు** అ.క్రి. పుష్పించు. వాల్మీ. 3.110.

త. మతాళి-. వికసించు.

**మది** వి. **1**. బుద్ధి. భార.ఆది. 3.29 ; **2**. మనస్సు. భార. ఆది. 3.38 ; **3**. ఇచ్ఛ, కోరిక. శృం.నై. 1.4.

సం. మతి. బుద్ధి, మేధ ; ప్రా. మది, మఇ, మత. మనీష ; శౌ. మది ; అ.మా. మఇ ; పా. మతి ; అప. మది ;

త. మది.

<ప్రా. మది.

**మదికెక్కు** అ.క్రి. మనసుకు వచ్చు. మను. 4.40. **మదికొలంకుపులు(గు** వి. మానస సరోవరపక్షి, హంస. సాంబ. తిర్య. 77. **మదికొలనుసెక్కొనుపిట్ట** వి. హంస. **మదినాటియుండు** అ.క్రి. మనసులో మెదలు. భాస్క.రా. కిష్కిం. 11. **మదిమది** వి. **1**. నెమ్మది, శాంతి, నిశ్చింత. భార. ఉద్యో. 3.280 ; **2**. అనాలోచితం, దూరదృష్టి లేకుండటం. భాస్క.రా.యు. 1292.

**మదించు** అ.క్రి. తలచు. రాజవా. 3.53 ; స.క్రి. మదింపు వేయు. (ఈ అర్థంలో కొన్నిచోట్ల మతింపు అని వాడతారు).

సం. మతి-. ఆలోచన, ఊహ ;

క. మదివు ; తు. మదిపు ; త. మతిప్పు.

<సం. మతి- + -ఇంచు[3].

**మదింపు** రూ. మతించు. వి. **1**. ఇంత అని వెల మొ. వాటిని ఊహించటం ; **2**. చెక్కుడు, రాతిని కావలసిన రూపంలోకి తేవటం. క. మదివు ; త. మదిప్పు ; మ. మదిప్పు. **మదింపుకా(డు** వి. అంచనాదారుడు.

**మదిటిమీదపైరు** చూ. మదురు[2].

**మదింపు** చూ. మదించు.

**మదింపుకా(డు** చూ. మదించు.

**మదియించు** అ.క్రి. విజృంభించి ఉద్ధతిచూపు. పండి.చ. 3.634.

సం. మద-. గర్వం.

<సం. మద- + -ఇంచు[3].

**మదిర[1]** రూ.చూ. ముజరా. వి. సివారు పల్లె.

**మదిర[2]** వి. సున్నంకుప్ప.

సం. మదిర-. సంతోషపరిచేది.

**మదిరచాయ** వి. **1**. ఒకరకం ఎరుపురంగు, మిరపపండురంగు ; **2**. దానిమ్మ రెక్కరంగు.

సం. మదిర-. ఎర్రపువ్వులు కల చంద్ర, ఛాయా. కాంతి, శోభ.

<సం. మదిర + సం. ఛాయా.

**మదిరిణి** వి. మణివిశేషం, పుష్యరాగం. ఉ.రా. 7.397.

సం. మదిర-. ఎర్రపువ్వులు కల చంద్ర ;

**మదీనా** రూ.చూ. మెదీనా. వి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రం.

**మదుగు** రూ. మదం[2], మదుపు[3], మదుము, మదువు[1], ముదం, ముదుం, మెది, మెదుపు[2]. వి. చెరువు మొ. వాటినుంచి నీరుపోయే మార్గం, జలస్రుత. భాగ. 10పూ. 7.56 ; అ.క్రి. ఒకేచోట నీళ్ళు నిలుచు.

క. మదగ, మదగు. తూము ; త. మతకు. కాలవ, మురుగుకాలవ.

**మదుంకుండ** చూ. మదుము.

**మదుంతలుపు** చూ. మదుము.

**మదుపు[1]** వి. ఆకుపచ్చరంగు. కవిక. 7.195.

**మదుపు[2]** రూ.చూ. మదపు. వి. అడ్డతీగ, పెద్ద ఆకులు కలిగి తినే గింజలు కాసే తీగ (Bauhina vahlii).

**మదుపు[3]** రూ.చూ. మదుగు. వి. **1**. తూము ; **2**. చెరువు నీళ్ళు వెలుపలకుపోయే గొట్టం.

**మదుపు[4]** రూ. మతుపు. వి. **1**. మూలధనం, పెట్టుబడి ; **2**. జీతగానికి ముందు ఇచ్చే పెట్టుబడి ; **3**. బంగారులో కలిపే రాగి ; స.క్రి. కప్పివుచ్చు.

**మదుపుపెట్టు** స.క్రి. పనిచేయించుకోవటానికి ముందుగా డబ్బు ఇచ్చు. **మదుపేయు** స.క్రి. ఆము పొయ్యికి ఎదురుగా దాపులువరకు కర్రలు, పిడకలు పేర్చు. <మదుపు[4] + వేయు.

**మదుపేయు** చూ. మదుపు[4].

**మదుము** రూ.చూ. మదుగు. వి. **1**. చెరువు మొ. వాటినుంచి నీరుపారే మార్గం ; **2**. పెరట్లోని నీళ్ళుపోయే దారి ; **3**. కాలువ, వంతెనకింద నుంచి వచ్చే ప్రవాహం.

**మదుంకుండ** వి. **1**. వాటకుండ కింద ఎత్తుకోనం కుదురులాగ పెట్టుకొనే కుండ ; **2**. నీళ్ళు ప్రవహించటానికి పొలంగట్లకు అమర్చే మట్టి కుదురు. <మదుము + కుండ. **మదుంతలుపు** వి. నీటి పారుదల అవసరం లేనప్పుడు మదుం రంధ్రానికి అడ్డంగా పైనుంచి దించిన కొయ్యపలక. <మదుము + తలుపు. **మదుంపలక** వి. నీటిపారుదల అవసరం లేనప్పుడు మదుం రంధ్రానికి అడ్డంగా పైనుంచి దించిన కొయ్యపలక. **మదుంబల్ల** వి. కత్వాబల్ల, నీటి పారుదల అవసరం లేనప్పుడు మదుం రంధ్రానికి అడ్డంగా పైనుంచి దించిన కొయ్య పలక. <మదుము + బల్ల.

**మదుంపలక** చూ. మదుము.

**మదుంబల్ల** చూ. మదుము.

**మదురం** వి. మట్టిని జిగురుదేలేటట్లు తొక్కిపాత్రల తయారీకి పక్వంగా చేసిన స్థితి.

సం. మధుర-. తియ్యని ; ప్రా. మహుర- ; పా. మధుర- ; సిం. మియురు, మిహిరి, మీరి.

సం. మధుర-.

**మదురిల్లు** చూ. మదురు[2].

మదురు[1] అ.క్రి. కవియు, మాగు, మిక్కిలిపండు. కాశీ. 1.91.

సం. మధుర-. తియ్యని ; ప్రా. మహుర- ; పా. మధుర- ; సిం. మియురు, మిహిరి, మిరి ;

తు. మదుర. తియ్యని, అనుకూలమైన.

< సం. మధుర-.

మదురుకమ్మ వి. గరికమ్మ.

మదురు[2] రూ. మదుఱు, మదులు. వి. 1. గోడమీదికప్పు. పండి. చ. 1.44 ; 2. చేనిచుట్టూ రాళ్ళుపేర్చి కాపుగా పెట్టినగోడ.

క. మదిల్. గోడ ; తు. మదిలు, మదులు, మగులు ; త. మతిల్, కోటచుట్టూ ఉండేగోడ ; మ. మతిల్. తోట, ఇల్లు, గుడి మొ. వాటిచుట్టూ ఉండేగోడ.

మదిటిమీదపైరు వి. ఉన్నశక్తినంతా ఉపయోగించుకొని స్వల్ప కాలం మాత్రమే విర్రవీగేవాడు. మదురిల్లు వి. మదురు గోడలున్న ఇల్లు. < మదురు[2] + ఇల్లు. మదురుగోడ వి. పైకప్పున్న గోడ. గా. హరి. ఉ. 1040పం.

మదురువు వి. 1. మద్యం. నృసింహ. 4.68 ; 2. మత్తు. మదం. హరి. పూ. 4.155.

సం. మదిరా. మద్యం ; ప్రా. మఇరా. కల్లు ; పా. మదిరా- ; ఒ. మిరా. ద్రాక్షసారా.

< సం. మదిరా.

మదుఱు రూ.చూ. మదురు[2]. వి. గోడమీదకప్పు.

మదులు రూ.చూ. మదురు[2]. వి. గోడిమీదకప్పు. సిం. ద్వా. 10.122.

మదుల్రాయి వి. చదరపురాయి, చదరంగా నాలుగు పలకలుగా ఉన్నరాయి.

మదుల్రాయి చూ. మదులు.

మదువు[1] రూ.చూ. మదుగు. వి. చెరువు మొ. వాటినుంచి నీరు పోయే మార్గం, జలస్రుత.

మదువు[2] వి. బిర్రు, గట్టితనం.

మదుసన్నం వి. వడ్లలో ఒకరకం.

సం. మధు-. చైత్రమాసం, వసంతమాసం.

< సం. మదు- + సన్నము.

మదూద్‌చేయు అ.క్రి. ముందుజాగ్రత్త తీసుకొను.

ఉ. అర. మదావత్, మదావా. ఒకవ్యాధిని బాగు చేయటం, తోడ్పడటం, పరిహరించటం, నివారణచేయటం, ఉపశమనంచేయటం.

< ఉ. మదావత్ + చేయు.

మద్దటిల్లు అ.క్రి. ఎండ మొ.వి శమించు.

మద్దతు రూ.చూ. మద్దత్తు. వి. సాయం.

మద్దతుగారు రూ. మదద్గారు. వి. సహాయంచేసేవాడు. రంగా. చ. 3.38.

హిం. మదద్‌గార్. సహాయకుడు ; మరా. మదల్‌గార. సహాయకుడు ; ఉ. మదద్‌గార్. సహాయకుడు ; పార. మదద్‌గార్. రక్షకుడు, సాహాయ్యమొనరించేవ్యక్తి.

< ఉ. మదద్‌గార్.

మద్దతుచేయు అ.క్రి. సహాయంచేయు.

మద్దత్తు రూ. మదతు. మద్దతు. వి. సాహాయ్యం, తోడ్పాటు. సాంబ. మాన. 31.

హిం. మదద్. సాహాయ్యం ; మరా. మదత. సాహాయ్యం ; ఉ. మదద్. సహాయత, ఆశ్రయం ; పార. మదత్. సాహాయ్యం ; అర. మదద్. సాహాయ్యం.

< ఉ. మదద్.

మద్దల రూ.చూ. మద్దెల. వి. మృదంగం.

మద్దలయ రూ.చూ. మద్దెల. వి. వాద్యవిశేషం, మృదంగం.

మద్దలియ రూ.చూ. మద్దెల. వి. వాద్యవిశేషం, మృదంగం.

మద్ది[1] వి. 1. వృక్షవిశేషం, సాలం, అర్జునం. శ్రీపూడిశాసనం. క్రీ.శ. 925, కు. సం. 12.122 (Terminalia glabra) ; 2. ఎర్రమద్దిచెట్టు, అందంగా ఉండి గట్టికలపనిచ్చే చెట్టు (Terminalia Arjuna) ; 3. అడవుల్లో పెరిగి గట్టి కలపనిచ్చే పెద్దచెట్టు (Terminalia tomentosa).

క. మద్ది ; తు. మత్తి ; త. మరుతు, మరుదు ; మ. మరుతు ; గోం. మర్ద్, మర్దే ; కుఇ. మర్ది ; పర్జి. మెర్‌దింగి (Merdingi) ; కొలా. మద్గి ; నా. మద్గి.

మూ. ద. ద్రా., మూ. మ. ద్రా. *Mar-ti. మర్‌త్తి.

మద్దికాయలకళంపేట రూ. మద్దికాయలకలషం పెట్టె. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. మద్దికాయలకలషం పెట్టె రూ.చూ. మద్దికాయల కళంపేట. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. మద్దికాయలచీర వి. నేతమధ్యలో మద్దికాయలమాదిరి డిజైన్లు నేసిన చీర. మద్దికాయలు వి.బ.వ. 1. బాలురు చెవి తమ్మికి ధరించే ఒకానొక నగ. కాశీ. 3.240 ; 2. నేతలో మద్దికాయల నమూనాలు నేసిన డిజైను. మద్దికాయవంకచీర వి. ఒకరకం డిజైనులో నేసిన చీర. మద్దిగంగ్రడలు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

మద్ది[2] రూ.చూ. మత్తి[2]. వి. 1. కొమ్మల్ని కంచెకంపగాను, ఆకునుపచ్చి ఎరువుగాను ఉపయోగించే చెట్టు, తొగరిచెట్టు (Moninda tinctoria). 2. తెల్లనిపూలు, వేళ్ళనుంచి ఎర్రని రంగునిచ్చే చెట్టు (Morinda citrifolia).

మద్ది[3] రూ.చూ. మద్య. వి. గర్భం, వస్తువులోని కేంద్రభాగం.

మద్దినేత రూ.చూ. మధ్యనేత. వి. నడిమినేత. నేతలో రెండంచులకూ మధ్యభాగం. మద్దేకు వి. ఒకరకం కలుపు మొక్క, < మద్ది + ఆకు.

మద్దించు స.క్రి. కలగుమ్ము. కాళ్ళతోతొక్కి అడుసును కలుపు.

సం. మర్దతి. తొక్కును ; ప్రా. మడ్డఇ, మద్దఇ ; పా. మద్దతి.

< ప్రా. మద్దఇ + -ఇంచు.

మద్దిలికడవ రూ.చూ. మద్దెలకడవ. వి. బుర్రకథలకి ఘట వాయిద్యంగా వాయించటానికి వాడేకుండ.

మద్దిలియ రూ.చూ. మద్దెల. వి. మద్దెలవాడు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 6.77.

మద్దిలియకారుఁడు వి. మద్దెల వాయించేవాడు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 663.

మద్దు వి. 1. వ్యాప్తిచెందటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759. క్రీ.శ. 1663 ; 2. ఖాతా, విభాగం. భేషజ. 50 ; స.క్రి. దేనికదిగా లెక్కలుచేర్చు.

హిం. మద్. ఖాతా, విభాగం ; ఉ. మద్ద్, మద్.

ఖాతాకు సంబంధించిన వరుస; పార. మద్ద్. వ్యాప్తి చెందు, జాగు, ఖాతా రాయటానికి సంబంధించిన పదం.

<ఉ. మద్ద్.

**మద్దె** రూ.చూ. మద్య. వి. గర్భం, వస్తువులోని కేంద్రం, కేంద్రభాగం.

**మద్దెగది** వి. నట్టిల్లు, ఇంటిమధ్యగది, భాగం. **మద్దెనేత** రూ.చూ. మధ్యనేత. వి. నడిమినేత, నేతలో రెండంచులకు మధ్యభాగం. **మద్దెమాడుకుండ** వి. ఒకటిన్నర శేరు బియ్యం ఉడికే మట్టిపాత్ర. **మద్దెరకంకాల్పు** వి. పచ్చికాల్పు. ఇటుక మొ. వి కాలీకాలకుండా ఉండటం.

**మద్దెము** వి. **1**. అసహ్యం; **2**. చోద్యం.

సం. మధ్య-. నడిమ.

<సం. మధ్య-.

**మద్దెల** రూ. మద్దల, మద్దలయ, మద్దలియ, మద్దిలియ. వి. వాద్య విశేషం, మృదంగం. రం.రా. కిష్కిం. 219పు. 17పం.

సం. మర్దల-. వాద్యవిశేషం; ప్రా. మద్దల-;

క. మదరె, మద్దరె, మద్దళె, మద్లె, మద్దెల, మద్లళిగ, మద్దెలగాఁడు, మత్తళమ్, మత్తళి; తు. మద్దలె, మద్దళె, మద్దొళె; మ. మద్దళం.

<ప్రా. మద్దల-.

**మద్దెలకట్టు** వి. మద్దెల ఆకారంలో పెంకుల్ని పేర్చే తీరు. **మద్దెలకడవ** రూ. మద్దిలికడవ, మద్దెలికడవ. వి. బుర్ర కథలకి ఘటవాయిద్యంగా వాయించటానికి వాడే కుండ. **మద్దెలకాండు** వి. మద్దెల వాయించేవాడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 422 క్రీ.శ. 1269. **మద్దెలకుండ** వి. మద్దెల వాయిద్యం తయారీకి ఉపయోగించే కుండ. **మద్దెలకూజా** వి. మద్దెల ఆకారంలో చేసిన నీళ్ళకూజా. **మద్దెలకొక్కు** విశ. మద్దెల వాద్యాన్ననుసరించి చిందులు తొక్కే సామాన్య నటుడు. గంధ. 9. **మద్దెలగుమ్మడి** వి. బూడిదగుమ్మడి. **మద్దెలరూపురిక్క** వి. ధనిష్ఠా నక్షత్రం. **మద్దెలలో నెల్కమర్యాద** వి. ఒకచోట నిలువక తిరగటం. హంస. 1,22. **మద్దెలికడవ** రూ.చూ. మద్దెలకడవ. వి. బుర్రకథలకి ఘట వాయిద్యంగా వాయించటానికి వాడే కుండ. **మద్దెలీఁడు** వి. మృదంగం వాయించేవాడు. మద్దెలవాడు. నె.శా. సంపు. 3. శా.సం. 1264.

**మద్దెలికడవ** చూ. మద్దెల.

**మద్దెలీఁడు** చూ. మద్దెల.

**మద్దెలు** వి. సమీపం.

**మద్దెళసంచు** వి. మల్లయుద్ధ విశేషం, పదిరెండు దండాల్లో ఒకటి. మల్లుపు. 3,68.

**మద్దేకు** చూ. మద్ది[3].

**మద్య** రూ. మజ్జి[2], మజ్జె, మజ్య, మద్ది[3], మద్దె. వి. **1**. గర్భం, వస్తువులోని కేంద్రం; **2**. కేంద్రభాగం.

సం. మధ్య-. కేంద్రభాగం, వస్తువు నడుమభాగం.

<సం. మధ్య-.

**మద్యలకాంండ్రు** చూ. మద్దెలకాండు. వి.బ.వ. మద్దెలవాయించే వాడు. ద.హిం.శా. సంపు.6. శా.సం. 1188. క్రీ.శ. 1250.

**మద్రాసుమగ్గం** వి. ఒకరకం మగ్గం.

ఇం. *Madras*. తమిళనాడు ముఖ్యపట్టణం.

<ఇం. Madras + మగ్గము.

**మధనపడు** అ.క్రి. బాధపడు, మదనపడు.

సం. మథన-. త్రచ్చటం, చిలకటం.

<సం. మథన-+పడు.

**మధుపర్కం** వి. పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కట్టుకొనే ఎర్రంచు పంచె లేక చీర.

సం. మధుపర్క-. పెరుగు, నేయి, నీరు, పంచదార, తేనె అనే అయిదు వస్తువుల సముదాయం, కన్యాదాత ఇంటికి పెళ్ళికొడుకు వచ్చినప్పుడు అతనికి ఇచ్చే కానుక.

<సం. మధుపర్క- (అర్థవిపరి.).

**మధుర** వి. కుంకుమరంగు.

సం. మధుర-. ఎర్ర చెరకుగడ, తియ్యని, ఇంపైన.

<సం. మధుర- (అర్థవిపరి.).

**మధురలత** వి. తీగ, ఆకులు, పువ్వులు డిజైనులో పడేట్టు నేసిన అంచు.

**మధురాపసంద్** వి. మామిడిపండ్లలో ఒకరకం.

సం. మధురా. ఒకపట్టణం; హిం. పసంద్. ఇష్టం.

<సం. మధురా + హిం. పసంద్.

**మధ్యకట్టె** వి. మరమగ్గం చట్రంలో మేరువు పలకకు కిందిగా నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర.

సం. మధ్య-. నడిమి.

<సం. మధ్య-+కట్టె (మిశ్రన.).

**మధ్యచెక్క** రూ.చూ. మఝ్ఝిచెక్క. వి. మరమగ్గం చట్రంలో మేరువు పలకకు కిందుగా నిలువుపట్టెలు బిగించిన మధ్య కర్ర.

**మధ్యనేత** రూ. మద్దినేత, మద్దెనేత. వి. నడిమినేత, నేతలో రెండంచులకూ మధ్యభాగం.

సం. మధ్య-. నడిమి.

<సం. మధ్య-+తె.నేఁత. (మిశ్రన.).

**మధ్యరంగం** వి. నట్టిల్లు, ఇంటి మధ్యగది, భాగం.

సం. మధ్య-. నడిమి, రంగ-. ప్రదేశం.

<సం. మధ్యరంగ- (అర్థవిపరి.).

**మధ్యాటం** రూ.చూ. మజ్జత్తం. విశ. మధ్యనున్న.

సం. మధ్యస్థ-. మధ్యనున్న.

<సం. మధ్యస్థ-.

**మధ్యాతం** రూ.చూ. మజ్జత్తం. విశ. మధ్యనున్న.

**మధ్యాన్న బేళా ఉత్తర భోంగ** వి. దేవుని మధ్యాహ్న భోగం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1213.

సం. మధ్యాహ్న-. పగటి నడిమిభాగం, భోగ-. భుక్తి, తినటం, వేళా. సమయం.

**మధ్యాహ్న సెజ్జ భోగము** వి. మధ్యాహ్న కాలంలో దేవునికి చేసే శయ్యా అవసరం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1214.

సం. మధ్యాహ్న-. మధ్యాహ్నం, భోగ-. అనుభవం.

<సం. మధ్యాహ్న-+ సెజ్జ + సం. భోగ- + -ము (మిశ్రన.).

**మన** చూ. మనము.

**మనగకొట్టు** చూ. అణఁగఁగొట్టు. స.క్రి. అణగ్గొట్టు.

**మనగాసంచెక్క** చూ. మనగానము.

**మనగానము** వి. **1**. గచ్చుపూత చేయటం ; **2**. గోడ కన్నాలకు పట్టించే బురదమట్టి.

**మనగాసంచెక్క** వి. చెక్కతాపి, కొయ్యతో చేసిన తాపి.

**మనన** వి. ఆయుస్సు.

సం. మనన-. ఆలోచన, ధ్యానం, తెలివి.

< సం. మనన-. (అర్థవిపరి.).

**మనమఁడు** రూ.చూ. మన్మఁడు. వి. **1**. కొడుకు కొడుకు ; **2**. కూతురు కొడుకు.

**మనమరాలు** రూ.చూ. మన్మరాలు. వి. **1**. కొడుకు కూతురు ; **2**. కూతురు కూతురు.

**మనమారు** అ.క్రి. ఒప్పారు. శివలీలా.

సం. మనస్. హృదయం.

< సం. మనస్ + -అరు[1].

**మనము** సర్వ. ఉభయార్థకం.

క. నావు. మనం, మేము ; తు. నమ ; త. నామ్ (నాంకళ్-మేము) ; మ. నామ్ ; కో. నేండ్, నేం ; తొ. ఒమ్ ; గోం. నమెట్ (మేం, మనం). కురు. నామ్ ; మాల్తొ. నామ్ ; బ్రా. నన్. మేం, మనం.

మూ.ద్రా. *నామ్ (నమ్*-).

**మన** సర్వ.బ.వ. **1**. యుష్మదస్మ దుభయార్థకం, నీవును, నేనును, మీరును, మేమును అనే అర్థం ఇస్తుంది. భార. ఆది. 2.34 ; **2**. ఒకప్పుడు నేనుకు మారుగా వాడబడి అహంభావాన్ని సూచిస్తుంది. **మనంమనంబరంపురం** వి. ఒకటేకట్టు అనే అర్థంలోని పలుకుబడి. మనమంతా బరంపురానికి (ఒరిస్సా రాష్ట్రంలోని ఒక పట్టణం) చెందినవారమనటం.

**మనంమనంబరంపురం** చూ. మనము.

**మనవర్తి** రూ.చూ. మనోవర్తి. వి. **1**. జీవనోపాధికి ఇచ్చే భృతి. బొడ్డుపాడు శాసనం. క్రీ.శ. 1060 ; **2**. అనాథలకు, భర్త విడిచిపెట్టినవారికి ఇచ్చే పోషక భృతి.

**మనవి** వి. విన్నపం, విజ్ఞప్తి. రం.రా బాల. 81 పు. 16 పం.

క. మనవె, మనువె. విన్నపం, విజ్ఞప్తి ; త. మను. విజ్ఞప్తి, విన్నపం, ప్రార్థన, వేడికోలు.

**మనవిచెప్పు** అ.క్రి. విన్నవించు. హంస. 3.115. **మనవిచేయు** స.క్రి. విన్నవించు. **మనవితికాలు** వి.బ.వ. మనవిచేసేవారు, విన్నపంచేసేవారు. ద.హిం.శా.సంపు. 5. శా.నం. 176, క్రీ.శ. 1197. < మనవి + ఇతికాడు. **మనవిసనవులు (-చనవులు)** వి.బ.వ. విన్నపాలు. సారంగ. 1.62.

**మనసగు** చూ. మనసు.

**మనసబీ** రూ.చూ. మనసబు. వి. పదవి, సైనిక సంబంధమయిన బిరుదు.

**మనసబు** రూ. మనసబీ, మనసుబా, మనసుబి, మనసుబీ. వి. పదవి, సైనిక సంబంధమైన బిరుదు.

హిం. ఉ. మన్‌సబ్. పదవి స్థానం ; మరా. మన్‌సబ్. పదాధికారం, అశ్వదళాధినేత ; పార. మన్‌సబ్.

< ఉ. మన్‌సబ్.

**మనసరి** చూ. మనసు.

**మనసార** చూ. మనసు.

**మనసిచ్చు** చూ. మనసు.

**మనసించు** చూ. మనసు.

**మనసిడు** చూ. మనసు.

**మనసు** వి. **1**. తలపు, అభిప్రాయం, ఉద్దేశం. భార. స్త్రీ. 1.128 ; **2**. అనురాగం, వలపు. పండి.చ. 2.88 పు. ; **3**. చిత్తం, ఉల్లం. హరి.ఉ. 4.31 ; **4**. కోర్కె, అభిలాష. విష్ణుపు. 3.347 ; విణ. ఇష్టం, సారంగ. 2.29.

సం. మనస్. మనస్సు ; ప్రా. మనో, మణ, మనస్, మనసో. బుద్ధి, ఆలోచన ; నే.అ.బెం. మన్ ; హిం. మన్ ; ఒ. మణా. అర్థంచేసుకోవటం, విజ్ఞానం ; ల. మణ్ణ్ ; మరా. మన్.

< సం. మనస్ (అర్థవిపరి.).

**మనసగు** అ.క్రి. కోరిక కలుగు, అపేక్ష జనించు. రామాభ్యు. 3.94. < మనసు + అగు. **మనసరి** వి. మనస్వి, అభిమానవంతుడు. రామాభ్యు. 1.138. < మనసు + -అరి. **మనసార** క్రి.విణ.ద్రు. విశ్వాసపాత్రంగా. < మనసు + ఆరన్. **మనసిచ్చు** అ.క్రి. **1**. గుట్టుచప్పుడగు, రహస్య మెఱిగించు. కవి. 2.18 ; **2**. ప్రేమించు. < మనసు + ఇచ్చు. **మనసించు** అ.క్రి. మనస్కరించు, ఇష్టమగు. రం.రా.యు. 40 పు. 14 పం. < మనసు + -ఇంచు[3]. **మనసిడు** అ.క్రి. వలపుగొను, ప్రేమించు. కవిక. 4.115. < మనసు + ఇడు. **మనసు కక్కుఱితి** వి. మనసు పట్టలేక చేయగూడని పని కూడా చేయవలెను అనే ఉత్కంఠ. మను. 3.123. **మనసుగాని (-కాని)** విణ. ఇష్టంలేని. భార.ఆశ్ర. 1.10. **మనసు చిముడఁబెట్టు** అ.క్రి. మనసును వ్యథపెట్టు. తాళ్ల.సం. 12.202. **మనసుచిల్లులుపోవు (-పోవు)** అ.క్రి. మనసు వ్యథపడు. తాళ్ల.సం. 4.8. **మనసుంచు** అ.క్రి. అవధరించు, చిత్తగించు. < మనసు + ఉంచు. **మనసుతల్లడము** విణ. భయంకరుడు, బెదరు పుట్టించువాడు. పండి.చ. 1.3.512 పు. **మనసుకెక్కు (-ఎక్కు)** అ.క్రి. మిక్కిలి యిష్టమగు. **మనసుపట్టు** విణ. మిన్నకుండు, ఊరకుండు. హరి.ఉ. 4.204. **మనసుపెట్టు** రూ. మనసువెట్టు. అ.క్రి. వాంఛించు, కోరు, ఇష్టపడు. బసవ. 4.500. **మనసుపేద** విణ. ధైర్యం లేనిది, ధైర్యం లేనివాడు, పిరికి. విజయ. 3.50. **మనసు మంగళము** వి. మనసుమాత్రం లేదు, హృదయ విహీనుడనటం. తాళ్ల.సం. 3.218. **మనసువచ్చు** అ.క్రి. నచ్చు, సమ్మతమగు. భార.విరా. 1.206. **మనసువిరుగు** రూ.చూ. మనసువిఱుగు. అ.క్రి. విముఖతపొందు, విరక్తిచెందు. **మనసువిఱుగు** రూ. మనసువిరుగు. అ.క్రి. విరక్తిపుట్టు. విష్ణుపు. 5.289. కాశ. 4.31. **మనసువెట్టు (-పెట్టు)** రూ.చూ. మనసుపెట్టు. అ.క్రి. వాంఛించు, కోరు, ఇష్టపడు. శృం.నై. 7.172. **మనసొచ్చు (-చొచ్చు)** అ.క్రి. ప్రేమాస్పదుడగు. భార.భీష్మ. 1.159. **మనసొగ్గు** అ.క్రి.

ఇష్టపడు, అంగీకరించు. రం.రా.కిష్కిం.పు. 513.21. < మనను + ఒగ్గు. మనసొత్తిచూచు అ.క్రి. మనసును పరీక్షించు. గౌ.హరి. 373 పు. <మనసు + ఒత్తు + -ఇ[13] + చూచు.

మనసుబా రూ.చూ. మనసబు. వి. పదవి, సైనిక సంబంధ మయిన బిరుదు.

మనసుబి రూ.చూ. మనసబు. వి. పదవి, సైనిక సంబంధమైన బిరుదు.

మనసుబీ రూ.చూ. మనసబు. వి. పదవి, సైనిక సంబంధమైన బిరుదు.

మనసొగ్గు చూ. మనను.

మనసొత్తిచూచు చూ. మనసు.

మనస్కరించు స.క్రి. ఇష్టపడు. భార.శాంతి. 3.117.

సం. మనస్కృ. మననుంచు.

<సం. మనస్కృ + -ఇంచు[3].

మనాగ రూ.చూ. మనోరాద. వి. మార్గశీర్షమాసంలో వచ్చే కార్తె.

మనాయించు స.క్రి. 1. లక్ష్యపెట్టు : 2. విను ; 3. లోబడు.

హిం. మనానా. స్వీకరించటం, స్తుతించటం, రాజీ చేయటం.

<హిం. మనా(నా) + -ఇంచు[3].

మనారాగ రూ.చూ. మనోరాద. వి. మార్గశీర్షమాసంలో వచ్చే కార్తె, అనురాధ నక్షత్రం.

మనిం చూ. మును. వి. 1. వస్తువులోని కేంద్రం, కేంద్ర భాగం ; 2. మధ్య.

మనికట్టు రూ.చూ. మణికట్టు. వి. మణి బంధం. పండి.చ. 2.96.

మనికట్టుదిండు వి. డొలుపు, బండి ఇరుసుమీద వేసే అడ్డ మొద్దు.

మనిక్ర్ర రూ. మనిగర. వి. కయిలుగడ్డి, కళ్ళంలో సరిగ్గా నలగని గడ్డి, కొద్దిపాటి గింజలున్న గడ్డి.

మనికి చూ. మను[1] రూ. మన్కి. వి. 1. ఉనికి, వర్తించటం. భార.ఉద్యో. 3.258 ; 2. బ్రతుకు, జీవనం, సుఖజీవనం. భార.అను. 4.321 ; 3. స్థలం, చోటు. వసు. 2.4 ; 4. వాసస్థానం, నెలవు. నరస. 2.85.

క. మనె. వాసస్థానం ; త. మన్నుహై.

మనికిపట్టు రూ.చూ. మన్కిపట్టు. వి. నివాసస్థలం, నెలవు, ఉండేచోటు. మనికిఁడు వి. గృహస్థుడు, ఇంటి కాపు.

మనికితం వి. డొలుపు, బండి ఇరుసుమీద వేసే అడ్డుమొద్దు.

సం. మనిత-. తెలియబడింది.

మనికితపడు చూ. మనికితము.

మనికితపాటు చూ. మనికితము.

మనికితము చూ. మను[1]. రూ. మన్కితము. వి. 1. సందేహం. జైమినిభా. 5.179 ; 2. దుఃఖం, మనోవ్యథ. ప్రబోధ. 5.5 ; 3. జాలి, కరుణ. వాల్మీ. 2.96.

మనికితపడు అ.క్రి. దుఃఖపడు. రం.రా.కిష్కిం. 214 పు. 1 పం. <మనికితము + పడు. మనికితపాటు వి. దుఃఖపడటం, చింతించటం. విష్ణుపు. 2 ఆ. <మనికితము + పాటు.

మనికుఁడు వి. పరవశుడు. పండి.చ. 1.26.

మనికె చూ. మండిగ[1]. వి. 1. వెడల్పు మూతిగల గుండ్రని పాత్ర ; 2. కండెల మండిగ ; 3. ఒకరకం మూకుడు మాదిరి మట్టిపాత్ర.

మనిగం రూ.చూ. మండిగము. వి. 1. వాకిటి కింద అడ్డుగా అమర్చిన కొయ్యశిల ; 2. బండి ఇరుసుపై అడ్డంగా ఉండే మొద్దు.

మనిగంచీల వి. డొలుపు చీల, బండి డొలుపును పోలు కర్రకు కలిపే మేకు. మనిగంమొద్దు వి. బండి ఇరుసుమీద వేసే కొయ్య మొద్దు.

మనిగర(-కట్ల) రూ.చూ. మనిక్రర. వి. కయిలుగడ్డి, కళ్ళంలో సరిగా నలగక కొద్ది గింజలున్న గడ్డి.

మనిగాసము వి. నేలను నునుపు చేయటం, చదరం చేయటం.

మనిగాసంపలక వి. నేలను చదును చేసే సాధనం.

మనిగాసంపలక చూ. మనిగాసము.

మనిగెం రూ.చూ. మండిగము. వి. 1. వాకిలి కింద అడ్డుగా అమర్చిన కొయ్యశిల ; 2. బండి ఇరుసుపై అడ్డంగా ఉండే మొద్దు.

మనియకాఁడు చూ. మను[1]. వి. పారుపత్తెకాడు.

మనిషి రూ.చూ. మానిసి[1]. వి. మనుష్యుడు.

మనిషిపొత్తు వి. ఒకరైతు ఎద్దులతోను, మరోరైతు మనిషి సహాయంతోను చేసే ఉమ్మడి సాగు. మనిషెత్తు వి. నిలువు, రెండుగజాలు. <మనిషి + ఎత్తు[1]. మనుషులగు అ క్రి. మనుషుల్లా ఉండు. <మనిషి + -లు + అగు.

మనిషెత్తు చూ. మనిషి.

మనిసి[1] రూ.చూ. మానిసి[1]. వి. మనుష్యుడు. ఆం.భా. 2.103.

మనిసి[2] రూ.చూ. మంచియ. వి. జొన్న చేలు మొ. వాటికాపలా కాయటం కోసం కూర్చోవటానికి ఎత్తుగా వేసే చప్పరం, అరప.

మనిసి[3] రూ.చూ. మానిసి[2]. వి. 1. స్త్రీ ; 2. పురుషుడు.

మనిసిల వి. ఔషధాల్లో ఉపయోగించే శిలాభేదం, మణిశిల.

సం. మనశ్శిలా ; ఎరుపురంగుకల ఒక ధాతు విశేషం ; ప్రా. మణొసిలా, మణిసిలా, మణోసిలా, మణం సిలా.

తు. మనిశిలె.

<ప్రా. మణిసిలా.

మను[1] రూ. మన్ను[4]. అ.క్రి. దీనికి మనితివి, మంటివి, మనుదురు, మందురు, మంద్రు, మండ్రు, మనిన, మన్న, మొ. విశేష రూపాలూ హల్లుపరమైనప్పుడు వికల్పంగా ఉత్వలోపం కన్పడుతుంది. 1. జీవించు, బతుకు. రామేశ్వరశాసనం. క్రీ.శ. 625–650, కొరవిశాసనం. క్రీ.శ. 892-922, భార.ఆది. 8.46 ; 2. జీవనంచేయు, సుఖజీవనంచేయు, హాయిగా బ్రతుకు. భార.ఆది. 2.46 ; 3. వర్తిల్లు, నడచుకొను. కు.సం. 1.10 ; 4. వర్తించు, ఉండు. భార.శాంతి. 2.267 ; 5. కృతకృత్యుడగు. ధన్యుడగు. భార.స్వర్గా. 83 ; 6. వృద్ధినొందు, పెరుగు.

అము. 4.261 ; 7. ఒప్పు, శోభిల్లు. రాఘవ. 1.74 ; 8. పుట్టు, జనించు. విష్ణుపు. 5.187.

త. మన్ను(మని-). శాశ్వతంగా ఉండు, చాలా కాలం ఉండు, వర్తించు, స్థిరంగా ఉండు, సహించు, ఓర్చు. మన్నల్. స్థిరత్వం, మనై. ఇల్లు, భార్య ; మ. మణ్ణుక. పట్టుదలగా ఉండు, స్థిరంగా ఉండు ; కొం. మన్-(మర్థ్-). ఉనికి ; కుఇ. మన్బ(మన్-). ఉండు, ఉనికి ; కువి. మంజలి(మచ్-). ఉండు, మన్నయ్. ఉండు. కురు. మన్నా. అగు, అయిపోవు, మారిపోవు, ఫలితం ; మాల్తో మెనే. అగు. అయిపోవు, ఉండు, మనై.(మంచ్)-. విధేయత కలిగి ఉండు, ప్రేమించు ; బ్రా. మన్నింగ్ ;

పో.చూ. ముండా. మెనా. ఉండు, బతుకు.

<మూ.ద్రా. *మన్.

**మంచు²** రూ. మనుచు, మన్చు. స.క్రి. 1. మనచేయు, అన్నవస్త్రాలిచ్చి పోషించు. భార. ఆది. 2.202 ; 2. మన్నించు, గౌరవించు. భార.సభా. 2.10 ; 3. ప్రోది చేయు, పెంచు. చంద్రికా. 4.80. **మనుకంద** వి. 1. జీవం, ప్రాణం. యయా. 1.51 ; 2. ఉనికి, సత్త, ఉండటం. యయా. 3.16. త. మన్నుహై. జీవం, ప్రాణం. **మనుగడ** రూ. మన్గడ. వి. 1. సుఖజీవనం. భార. శాంతి. 2.317 ; 2. బతుకు, జీవనం. భార. శాంతి. 3.394 ; 3. జీవనోపాయం, జీవిక, జీవితం మొ. వి. భార.ఆశ్ర. 1.64. **మనుగాపుచేయు (-కాపుచేయు)** స. క్రి. రక్షించు. తాళ్ల.నం. 10.208. **మనుసుడుపు(-కుడుపు)** వి. 1. పెళ్ళైన తర్వాత అల్లుడికి తొలిసారి అత్తవారింట్లో చేసే విందు ; 2. పెళ్ళి అయిన తర్వాత తొలి సంక్రాంతికి అత్తవారు అల్లుడిని తీసుకొని వచ్చి చేసే లాంఛనం ; 3. పెళ్ళిచూపులకు వెళ్ళి చేసే భోజనం. **మనుగొట్టె** రూ.చూ. మన్గొట్టె. వి. ఒకజాతిగొట్టె, కొండగొర్రె. **మనుచు** రూ.చూ. మంచు². 1. అన్నవస్త్రాదులిచ్చి కాపాడు, పోషించు. భార. భీష్మ. 3.330 ; 2. వర్తిలచేయు, ఉంచు, నిల్పు. భార.శల్య. 2.390 ; 3. బ్రతికించు, జీవింపచేయు. భార. అను. 1.158 ; 4. రక్షించు, ప్రోచు. హరి.ఉ. 4.249 ; 5. పెంచు, అభివృద్ధి నొందించు. కాశీ. 3.44. **మనుదల** రూ. మందల¹. వి. 1. మనుగడ, జీవనం ; 2. ప్రాణం. **మనుపరి** విణ. కాపరి, రక్షకుడు. <మనువు +-అరి. **మనుపాల** వి. జీవంతిక, పాలకూర. ఆం.భా. 2.68. త. మణ్ణారై. **మనుపీను(గు** వి. జీవచ్ఛవం, బతికుండి ప్రయోజనం లేని మనిషి. విక్ర. 2.172. **మనుపు** రూ. మన్పు. స.క్రి. 1. బ్రతికించు. పండి.చ. 2.147 ; 2. జరుపు, సాగించు, ప్రవర్తిలచేయు. హర. 3.25 ; 3. పోషించు, అన్నవస్త్రాలిచ్చి కాపాడు. దశా. 3.133 ; వి. 1. రక్షణం ; 2. పోషణం. **మనుపుకొను** స.క్రి. రక్షించుకొను. మార్క. 1.198. **మనుపర్తి** రూ.చూ. మనోవర్తి. వి. 1. జీవనోపాధికి ఇచ్చే భృతి ; 2. అనాథలకు, భర్త విడిచిపెట్టిన వారికి ఇచ్చే పోషక భృతి ; 3. ఇంటివారి భోజనాదులకయ్యే ఖర్చు. **మనువు** వి. 1. కాపురం. కు.సం. 5.74 ; 2. బ్రతుకు, జీవనం, మనుగడ. నిర్వ.రా. 9.88 ; 3. జీవనోపాయం, వృత్తి. పండి. చ. 1.40 ; 4. వివాహ సంబంధం, పెళ్ళి. భాస్క.రా, అరణ్య. 1.143 ; 5. పెళ్ళైన తర్వాత తొలిసారి అల్లుడికి అత్తవారింట్లో చేసే విందు. హర. 5.5 ; 6. ప్రవర్తన. నడత. భాగ. 2.74. త. మన(-ప్)-, -ట్ప్-). కలియు, కూడు. జతగూడు, చేరు, పెళ్ళిచేసికొను, ప్రకాశించు, ఒకరితో ఒకరు కలియు. కలిసి జీవించు, కౌగలించుకొను. మనప్పు. రతిలోకూడు, సారం, మనమ్. ప్రేమికుల కలయిక, పెళ్ళి, గౌరవం, హోదా, ఐశ్వర్యం, సంపద. మనతవన్, మనవాళన్, మనవాళి. పెళ్ళికొడుకు, భర్త ; మ. మణమ్. పెళ్ళి, మణవాళన్, మణాళన్. పెళ్ళికొడుకు, భర్త ; గోం. మల్మింగ్. పెళ్ళి ; మాల్తో. మన్యో. ప్రేమించు, పెళ్ళిచేసుకొను, మంచ్-నభె. ఒకరినొకరు ప్రేమించుకొను, ఒకరినొకరు పెళ్ళాడు. **మనువు గుడుచు(-కుడుచు)** అ.క్రి. మనగుడుపులుగుడుచు. హర. 5.5. **మనువుమను** అ.క్రి. కాపురం చేయు. భాగ. 9.56. **మన్గొట్టె** రూ. మనుగొట్టె. వి. ఒకజాతిగొర్రె, అడవిగొర్రె. రాజ.వి. 2.65. **మన్చు.** రూ.చూ. మంచు². స.క్రి. 1. బతికించు, జీవింపచేయు. భార. ఉద్యో. 1.373 ; 2. అన్నవస్త్రాదులిచ్చి కాపాడు ; 3. వర్తిలచేయు, ఉంచు, నిల్పు ; 4. రక్షించు, ప్రోచు ; 5. పెంచు, అభివృద్ధి నొందించు. **మన్నమనువు** వి. బతికినబ్రతుకు. తాళ్ల.నం. 1.19. **మన్పు.** రూ.చూ. మనపు. స.క్రి. 1. ప్రవర్తిల్ల చేయు. అని. 4.17 ; 2. బతికించు ; 3. పోషించు ; వి. 1. రక్షణం ; 2. పోషణం.

**మను²** రూ.చూ. మన్ను¹. వి. 1. మట్టి. వరాహ. 3.67 ; 2. భూమి, నేల. మను. 2.11.

**మనుదిండి(-తిండి)** రూ.చూ. మన్దిండి. వి. ఒకజాతి పాము. ఆం.భా. 1.147. **మనుబిళ్ల.** వి. బిళ్ళ దున్న. **మను(బెల్ల(-పెల్ల)** వి. మంటిబెత్తిక, కదళీగర్భవర్ణనం. కకుత్స. 3.62. **మన్దిండి** రూ. మనుదిండి. వి. ఒకజాతి పాము. ఆము. 3.80.

**మను³** రూ.చూ. మన్ను². వి. ఋష్యమృగం, ఒకజాతి జింక.

**మను(బిడి(-పిడి²)** రూ.చూ. మన్బిడి. వి. ఒకజాతి ఆడజింక. సారంగ. 1.10. **మను(బెంటి(-పెంటి)** వి. స్త్రీ. ఋశ్యమృగం, ఒకజాతి ఆడజింక. **మను(బోతు(-పోతు²)** రూ. మన్నుబోతు, మన్పోతు. వి. పురుషఋశ్య మృగం, ఒకజాతి మగజింక. ఇందు. 2.57. క. మరె. ఒకరకం జింక ; త. మరై. జింక. లేడి, అడవిదున్న ; పో. చూ. మఋక. ఒకరకం జింక. **మన్బిడి** రూ. మను(బిడి, మన్ను(బిడి. వి. ఒకజాతి ఆడజింక. గౌ. హరి. పూ.605. **మన్పోతు** రూ.చూ. మను(బోతు. వి. పురుషఋశ్యమృగం. ఒకజాతి మగజింక.

**మను(గు** చూ. మలుగు. రూ. మనువు². అ.క్రి. చచ్చు. ఆధ్యా. రా. యు. 181పు.

**మనుమ** రూ.చూ. మన్మ(డు. వి. మనుమడు. పండి. చ. 1.14పు.

మనుమఁడు రూ.చూ. మన్మఁడు. వి. **1**. పౌత్రుడు, కొడుకు కొడుకు. భార. ద్రోణ. 2.239 ; **2**. పుత్రసంతతిలోనివాడు, మునిమనుమడు, ఇనుమనుమడు మొ. వారు. బసవ. 4.382పం.; **3**. దౌహిత్రుడు, కూతురుకొడుకు. ఉ.రా. 4.318. మనుమరాలు రూ. చూ. మన్మరాలు. వి. **1**. దౌహిత్రి, కూతురు కూతురు. శుక. 2.151 ; **2**. పుత్రుని పుత్రిక, పౌత్రి. ఆం. భా. 2.111.

మనువు[2] రూ.చూ. మనుఁగు. అ.క్రి. మడియు, చచ్చు.

మనుషులగు చూ. మనిషి.

మనుసు రూ.చూ. మంచు[1]. వి. మంచు.

మనెరు వి. తెల్లనిపూలు పూసే పెద్దతీగ (Celastrus paniculata).

మనేగాళ్ళు చూ. మను[1]. వి.బ.వ. మేరవాళ్ళు, గ్రామంలో రైతు దగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకొన్న ప్రకారం కళ్ళంలో ధాన్యం తీసుకొనే చాకలి, మంగలి మొ. వివిధ వృత్తుల వాళ్ళు.

మనేదారు వి. వైరి, ఆటంక పెట్టేవాడు, విరోధి. రాజవా, 5.42.

హిం. మనా. నిషిద్ధం, వర్జితం, అనుచితం ; ఉ. మనాదార్. నిరోధించేవాడు, మన్ అ. అడ్డగించుట. నిషిద్ధం ; పార. మనా. నిషేధించిన, తిరస్కారం, ఆటంకం, ప్రాతికూల్యం, విరోధం.

<ఉ. మనాదార్.

మనేలా వి. రత్నాల వర్తకుల జాతి.

పో. మనిల్యా. కడియం ; స్పా. మానిల్లా. కడియం. మానో. చేయి. మనో హెూ. పిడికెడు.

<పో. మనిల్యా.

మనేసకట్టె రూ. మెనాసకట్టె. వి. చెక్కతాపి, కొయ్యతో చేసిన తాపి, గరుగ్గా ఉన్న చోట్లను చదరం చేయటానికి వాడేది.

మనోరంజనచీర వి. కొంగులో ఆకులు, పూలు నడిమిభాగంలో మినాబుటాలు పడేట్టు నేసిన చీర.

సం. మనోరంజన-. మనస్సును ఆనందింపజేసే ; సం. చీర-. వస్త్రం.

<సం. మనోరంజన- + సం. చీర. (అర్థవిపరి.).

మనోరంజితము వి. తోటల్లో పెంచబడి సువాసన కలపూలు పూసే మొక్క (Artabotrys odorotissimus).

సం. మనోరంజిత-. మనస్సుచే సంతోషపెట్టబడినది.

<సం. మనోరంజిత-. (అర్థవిపరి.).

మనోరమ వి. ఎండుపొగాకు మాదిరి రంగు.

సం. మనోరమ-. మనోహరమైనది, అందమైనది.

<సం. మనోరమ- (అర్థవిపరి.).

మనోరాగ రూ.చూ. మనోరాద. వి. మార్గశీర్షమాసంలో వచ్చే కార్తె.

మనోరాద రూ. మనాగ, మనారాగ, మనోరాగ, మన్రాగ. వి. మార్గశీర్ష మాసంలో వచ్చే కార్తె.

సం. అనూరాధా. ఇరవయ్యేడు కార్తెల్లో ఒకటి.

<సం. అనూరాధా.

మనోవర్తి చూ. మను[1]. రూ. మనవర్తి మనువర్తి. వి. **1**. ఇంటివారికి భోజనాదులకైన ఖర్చు. ఉ. హరిశ్చ. 1.68 ; **2**. భర్త చనిపోయిన స్త్రీలకు జీవనార్థమిచ్చే ధనాదికం, భరణం, జీవనానికై ఇచ్చే సొమ్ము మనువర్తికి సంస్కృతీకృత రూపం.

మనోహరలడ్లు వి.బ.వ. భక్ష్యవిశేషం.

సం. మనోహర-. ఇంపైనది.

<సం. మనోహర- + తె. లడ్డు + -లు (మిశ్రన.).

మన్కి రూ.చూ. మనికి. వి. **1**. బ్రతుకు, సుఖజీవనం ; **2**. ఉనికి, వర్తించటం ; **3**. స్థలం, చోటు.

మన్కిపట్టు రూ. మనికిపట్టు. వి. నివాసస్థానం, నెలవు, ఉండే చోటు. కళా. 1.36.

మన్కితము రూ.చూ. మనికితము. వి. **1**. దుఃఖం, మనోవ్యథ. ప్రబోధ. 5.5 ; **2**. సందేహం ; **3**. జాలి, కరుణ.

మన్గడ రూ.చూ. మనుగడ. వి. **1**. సుఖజీవనం. వేంక. పంచ. 4.542 ; **2**. బతుకు, జీవనం ; **3**. జీవనోపాయం, జీవిక, జీవితం.

మన్గొట్టె చూ. మను[1].

మన్చు చూ. మను[1].

మంత రూ.చూ. మంచియ. వి. జొన్నచేలు మొ. వాటిని కాపలా కాయటానికి కూర్చోవటానికి ఎత్తుగా వేసే చప్పరం, అరప.

మంతనమాడు చూ. మంతనము.

మంతనము వి. **1**. ఆలోచన, రహస్యాలోచనం. భార. ఆది. 2.21 ; **2**. ఏకాంతం. కాశీ. 4.215, శృం. నై. 7.137 ; **3**. రహస్య సంభాషణం. శృం. నై. 8.70, కాశీ. 7.185 ; **4**. రహస్యవిషయం. భాగ. 6.54.

సం. మన్త్రణ-. గుప్తాలోచన, ప్రా. మంతణ- ; పా. మంతనా ;

క. మంతణ. రహస్యం, ఏకాంతప్రదేశం.

<ప్రా. మంతణ-.

మంతనమాడు అ. క్రి. ఏకాంతమాడు. కళా. 7.155. <మంతనము + ఆడు. మంతనమునగోడజేరు అ.క్రి. రహస్యం ఆడటానికి ఒకమూలచేరు. శుక. 3.273. మంతనముండు అ.క్రి. ఏకాంతముండు. హర. 5.11. <మంతనము + ఉండు. మంతనానమండు అ. క్రి. రహస్యాలోచనలో ఉండు. తాళ్ల. సం. 8.152. <మంతనము + -నన్ + ఉండు.

మంతనానమండు చూ. మంతనము.

మంతరకాటుక చూ. మంతరము.

మంతరము రూ. మంత్రము. వి. **1**. ప్రసవోపాయం ; **2**. ఇంద్రజాలం, కనికట్టువిద్య.

సం. మన్త్ర-. వేదం, ఆలోచన. వేదభాగం, దైవానుగ్రహనిమిత్తం జపించే మంత్రం ; ప్రా. పా. అ.మా. మంత- ;

క. మంతర. ఆలోచన.

<సం. మంత్ర- (విప్రకర్ష).

మంతరకాటుక వి. మంత్రించిన కాటుక. బసవ.

5.135. మంతరసాని రూ. మంత్రసాని. వి. సుఖంగా ప్రసవించటానికి ఉపాయంచేసే చికిత్సకురాలు, సావిక. పాండు. 4.21. మంతిరించు అ. క్రి. మంత్రించు, మంత్రంవేయు, మంత్రోచ్చారణం చేయు.

మంతరసాని చూ. మంతరము.

మంతి వి. ప్రసంగం, ప్రస్తావం. శివరా. 2.19.

సం. మన్త్రిన్. బుద్ధిమంతుడు, తెలివిగలవాడు; ప్రా. మంతి. ఆలోచన, సలహా.

<ప్రా. మంతి.

మంతిరి వి. ప్రధానుడు, సచివుడు. భాగ. 10.871.

సం. మన్త్రిన్. బుద్ధిమంతుడు, తెలివిగలవాడు, సచివుడు; ప్రా. అ.మా. మన్త్రి; పా. మన్తిన్. రుషి, బుద్ధిశాలి, మంత్రి.

<సం. మంత్రిన్.

మంతిరించు చూ. మంతరము.

మంతు[1] వి. 1. అమాత్యుడు, ప్రెగ్గడ, మంత్రి. మను. 5.54; 2. మంత్రం. కళా. 2.48; 3. ప్రశస్తి, పొగడ్త. ప్రబంధ. 561; 4. ద్యూత మంత్రి, రాజుకు జూదంలో వినోదం చేసేవాడు. ఆం.భా. 2.183; 5. చదరంగపు కాయల్లో మంత్రి అనే కాయ.

సం. మన్త్రిన్. బుద్ధిమంతుడు, తెలివిగలవాడు, మన్త-. గూఢభాషణం, ఆలోచన వేదం, బ్రాహ్మణేతర వేదభాగం; ప్రా మంత-. మంత్రి;

క. మంతు. మంత్రి.

<ప్రా. మంత-.

మంతుకునెక్కు(-ఎక్కు) అ.క్రి. ప్రసిద్ధినిపొందు. తాళ్ల. సం. 7.111. మంతుకెక్కినవా(డు(-ఎక్కినవా(డు) విశే. ప్రసిద్ధుడు, ఖ్యాతుడు. ఆం.భా. 3.4.

మంతు[2] వి. ఘనత, గొప్పతనం. రం.రా. కిష్కిం. 228 పు. 10 పం.

సం. మహత్. గొప్పది. పెద్దది; ప్రా. మహంత-. గొప్ప, పెద్ద; పా. మహన్త్. గొప్ప, పెద్ద.

<ప్రా. మహంత-.

మంత్రకా(డు చూ. మంత్రము.

మంత్రగా(డు చూ. మంత్రము.

మంత్రతంత్రలూలామాలములు వి.బ.వ. చిన్నచిన్న చిట్కాలు. బసవ. 6.150పు.

సం. మన్త-. ఆలోచన, దేవతాదుల్ని ప్రసన్నం చేసుకోవటానికి జపించే మంత్రం, తన్త-. అధీనం, ఔషధం.

<సం. మంత్ర తంత్ర + లూలామాలములు.

మంత్రతంత్రాలు వి.బ.వ. మాయలూ, మందులూ. పండి.చ. 3.389పు.

సం. మన్త-. ఆలోచన, తన్త-. అధీనం, ఔషధం.

<సం. మంత్రతంత్ర- + -ము + -లు. (అర్థవిపరి.)

మంత్రబోనాము చూ. మంత్రము.

మంత్రము రూ.చూ. మంతరము. వి. 1. ప్రసవోపాయం; 2. ఇంద్రజాలం, కనుకట్టు విద్య.

మంత్రకా(డు రూ. మంత్రగా(డు. వి. ఇంద్రజాల విద్య తెలిసినవాడు. అచ్చ.రా.యు. 549. మంత్రగా(డు రూ. చూ. మంత్రకా(డు. వి. ఇంద్రజాలవిద్య తెలిసినవాడు. మంత్రబోనాము వి. నైవేద్య విశేషం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 235. క్రీ.శ. 1158. త. మన్త్ర పోనకమ్. మంత్రసాని రూ.చూ. మంతరసాని. వి. సావిక. ఆము. 5.112.

మంత్రసాని చూ. మంత్రము.

మంత్రి వి. మంగలి. ఆలోచన చెప్పేవాడని వ్యుత్పత్తి.

సం. మన్త్రిన్. అమాత్యుడు, తెలివికలవాడు.

<సం. మంత్రిన్ (అర్థవిపరి.).

మంద వి. 1. ఆవులు మొ. పశువుల సమూహం, కిలారం. భార. ఆది. 4.212; 2. గుంపు, సమూహం. కు.సం. 5.105; 3. ఆవులు మొ. పశువుల సమూహం ఉండే గోష్ఠి. భార. అను. 3.5; 4. గొల్లపల్లె, ఘోషం, వ్రేపల్లె. భాగ. పూ. 312.

క. మంది, మందె. ఆవులు మొ. వాటి గుంపు; త. మన్తై; పర్జి. మంద.

మందకట్టు రూ. మందగట్టు. వి. గొల్లపల్లెలవారు చేసుకునే కట్టడ, నియమం, ఏర్పాటు; అ.క్రి. పేడ మొ. వాటితో సత్తువ కలిగించటానికి ఆవులు, మేకలు మొ. వాటి మందల్ని రాత్రుళ్ళు పొలాల్లో నిలుపు. త. మన్తైకట్టు. మందకడుగుడు వి. బొచ్చు కత్తిరించే ముందు గొర్రెల మందని చెరువులో కడగటం. మందకా(డు వి. పశువుల మందను కాచేవాడు. పండి.చ. 2.156. మందకొనారి వి. గొర్రెల మంద యజమాని. మందగట్టు(-కట్టు) రూ.చూ. మందకట్టు. స.క్రి. పశువుల్ని ఎరువుకోసం పొలంలో కట్టివేయు. మందగరడ వి. వన్యమృగ విశేషం. మందగుది రూ. మందగుదె. వి. 1. పశువులు కాళ్ళీడ్చుకుంటూ నడిచే ఒకవిధమైన కుంటి నడక. హంస. 5.31; 2. నడిచేముందు కొంచెంసేపు వెనక కాళ్ళు ఈడుస్తూపోయే జబ్బు. మందగుదిపసరం వి. మందగుదికల పశువు. మందగుదె రూ.చూ. మందగుది. వి. నడిచేముందు కొంచెంసేపు కాళ్ళీడ్చుకుంటూ పోయేజబ్బు. మందగొను(-కొను) అ.క్రి. మందగాకూడు, గుంపుగూడు. మందపట్టు వి. గోష్ఠం, పశువులుండేచోటు. గొ. హరి. పూ. 519 పం. మందపిచ్చుక వి. మందలో కలిసిఉండే పిచ్చుక. మందపెట్టు స.క్రి. ఎరువుకోసం పశువుల్ని పొలంలో కట్టివేయు. మందపోచెమ్మజాతర రూ. మందపోసెమ్మ జాతర. వి. గొర్రెలమంద క్షేమంకోసం మందపోచెమ్మ పేరుమీద చేసే పండగ. మందపోసెమ్మజాతర రూ.చూ. మందపోచెమ్మ జాతర. వి. గొర్రెలమంద క్షేమంకోసం మందపోచెమ్మ పేరుమీద చేసే పండుగ. మందప్రోయాలు వి. గొల్లపల్లెలోఉండే స్త్రీ, గోపిక. పాండు. 2.14. మందబయలు వి. శగడా, పశువుల మందలునిల్చే శిస్తులేని భూమి. మందలవాళ్ళు విశే.బ.వ. గాడిద మందల్ని తోలుకుంటూ మందులిచ్చుకుంటూ ఊరూరా తిరిగేవారు. మందలుగొను(-కొను) అ. క్రి. మందగాకూడు, గుంపుకూడు. కు.సం. 7.92. మందవా(డు విశే. గొల్లవాడు. హరి.పూ. 6.9. మందవామిళ్ళు వి.బ.వ. ఒకరకం వడ్లు. మందవేయు స.క్రి. మంద

గట్టు. మందసతి వి. మంద్రపోయాలు, గోపిక. ఆము. 5.67. సం. సతి. పతివ్రత, స్త్రీ.

మందగించు చూ. మందము.

మందగిలు చూ. మందము.

మందగిల్లు చూ. మందము.

మందంకల్మ చూ. మందము.

మందట వి. 1. సమీపం. భార. అను. 2.423; 2. తగవు, వివాదం. దశకు. 5.45; 3. ఉడుకువ, ఊరట, నిర్వ్యాపారత్వం; హరి.ఉ. 7.32; 4. కలహం, జగడం. భాగ. 8.320; 5. వ్యవహారం. ఆం.భా. 1.113; అవ్య. సమక్షంలో, ముంగట.

మందటాడు అ.క్రి. జగడం ఆడు. తాళ్ల.సం. 18.270. <మందట+ఆడు. మందటిలు రూ.చూ. మందటిల్లు. అ.క్రి. అణగు. మందటిల్లు రూ. మందటిలు. అ.క్రి. 1. ఉడుగు, నిలిచిపోవు, క్షీణించు, తగ్గు. కు.సం. 9.133; 2. మెండుకొను, అతిశయించు. చంద్రభా. 3.148; 3. మిన్నకుండు, ఊరకుండు. సారంగ. 2.34.

మందటాడు చూ. మందట.

మందటిలు చూ. మందట.

మందటిల్లు చూ. మందట.

మందడి[1] వి. 1. ఉద్యోగ వాచకం, అశ్వసాహిణి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 639. క్రి.శ. 1177; 2. పశువుల బయలు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 274. క్రి.శ. 1230; 3. అశ్వం, గుర్రం. పండి.చ. 5.388 పు; 4. అశ్వశాల, లాయం. నవనాథ. 3.142 పు. 17 పం.

సం. మందురా. గుర్రపుశాల.

మందడీఁడు వి. గుర్రపువాడు, మందురకుడు. భార. విరా. 1.95.

మందడి[2] రూ.చూ. మందల[2]. వి. 1. బల్లలు మొదలైనవి ఒకటితో ఒకటి కూర్చే భాగం, సంధిస్థానం; 2. రెండు పొలాలకిగాని రెండు నివేశ స్థలాలకిగాని మధ్యనుండే సరిహద్దు; 3. దర్జు, గోడ కట్టేటప్పుడు రాళ్ళమధ్య వచ్చే సందు; 4. రాతి స్తంభంలోని భాగాలను అతికిన సందు.

మందడిగట్టు వి. రెండు పొలాలమధ్య హద్దుగా వేసిన మట్టికట్ట. మందడిదాయి వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి.

మందడిసాని చూ. మంద. వి. గొల్లభామ. తాళ్ల.సం. 17.343.

మందడీఁడు చూ. మందడి[1].

మందండీలు చూ. మందము.

మందనగొయ్య (-కొయ్య) వి. మానికంకొయ్య, బండిపరం జారకుండా ఇరుసుమీద అడ్డుపెట్టిన కొయ్య.

మందన్నమ్రా(కెల్లఁదెచ్చు చూ. మందు.

మందపఱుచు చూ. మందము.

మందము వి. 1. పరిపుష్టి, బలుపు. దశా. 2.224; 2. దళసరి, 3. లావు; 4. చిక్కదనం; విణ. 1. స్థూలం, లావైంది. ద్వి.నల. 3.22; 2. దళసరైంది; 3. నీటి ప్రవాహంలో ఉండే మిక్కిలి లోతైన మడుగు.

సం. మంద-. అల్పమైన, మూఢమైన, అసమర్థమైన, అలసమైన.

<సం. మంద- (అర్థవిపరి.).

మందగించు అ.క్రి. మందమగు, తగ్గు. హంస. 2.93. <మందము+-ఇంచు[3]. మందగిలు రూ.చూ. మందగిల్లు. అ.క్రి. మందమగు, తగ్గు. మందగిల్లు రూ. మందగిలు. అ.క్రి. మందమగు, తగ్గు. మందంకల్మ వి. అడుగురాయి, ఇంటి నేలమీద పరిచే పల్చని రాయి. మందండీలు వి.బ.వ. లావు గింజలలో కొన్నిరకాల వడ్లు. మందపఱుచు స.క్రి. మందపడచేయు, క్షీణింపచేయు. భాగ. 3.83. మందముచేయు స.క్రి. మక్కుమంచం, తలుపులు మొ. వి చేసినప్పుడు పలకలలోని రంధ్రాలు కనపడకుండ వడ్రంగి ఒక విధమైన పదార్థంతో మెత్తు.

మందయిపోవు చూ. మందు.

మందరి చూ. మందు.

మందల[1] రూ.చూ. మనుదల. వి. 1. మనుగడ, జీవనం; 2. ప్రాణం, జీవం; 3. సేద్యం కార్యక్రమం; 4. విషయ విపులీకరణం; 5. క్రమం.

మందలచేయు స.క్రి. ఒక పనిలో ఒక ఘట్టాన్ని పూర్తి చేయు. మందలవిడుచు స.క్రి. జీవంతో వదలు. నిర్వ రా. 7.68.

మందల[2] రూ. మందడి[2]. వి. 1. తెరువు, మార్గం, తెరగు, విధం. భాగ. 10 పూ.; 2. సమీపం. యయా. 4.10; 3. మేర, హద్దు. సారంగ. 1.67; 4. గట్టు; 5. రెండు భాగాల కలయిక; 6. పొలంలో గట్టు పొడవునా ఉన్న మేర.

మందలకడ్డీ వి. దూలం పైయెత్తున నాలుగు వైపులకూ వేసే పిల్లదూలం. మందలచాలు రూ. మందలిసాలు, మందల్చాలు, మందల్సాలు. వి. పొలం గట్టు పక్కన దున్నిన చాలు. మందలతీగె రూ. మంద్రతీగె. వి. అరికోత తీగ, తేనె వాసనగల పూలు పూసే అడవి తీగ (Combretum decandrum). మందలపట్టె వి. గట్టుదగ్గర దున్నిన చాలు. మందలమలపు వి. చేనిగట్టు దగ్గర దున్నటం. మందలమొలక వి. చేనిగట్టు దగ్గర దున్నటం. మందలించు స.క్రి. 1. ఆజ్ఞాపించు. పండి.చ. 2.110; 2. తలపు, పాటించు. కాశ. 3.4; 3. హెచ్చరించు. విష్ణుపు. 3; 4. మనవిచేయు, విన్నవించు. అని. 3.25; 5. చెప్పు, నిర్ధారణచేసి చెప్పు. రాధికా. 4.48; 6. పృచ్ఛించు, అడుగు. చెన్నబసవ. 3.183; 7. చీవాట్లుపెట్టు, తర్జించి బోధించు. <మందల[2]+-ఇంచు[3]. మందలింపు వి. 1. వ్యవహారం. ఆం.భా. 1.113; 2. ఒకరికి జరిగిన అశుభాదులకు పోయి ఓదార్చటం, పరామర్శించటం; 3. మందలించటం. మందలిసాలు(-చాలు[2]) రూ.చూ. మందలచాలు. వి. పొలం గట్టు పక్కన దున్నిన చాలు. మందల్చాలు రూ.చూ. మందలచాలు. వి. పొలం గట్టు పక్కన దున్నిన చాలు. <మందల[2]+చాలు. మందల్సాలు రూ.చూ. మందలచాలు. వి. పొలం గట్టు పక్కన దున్నిన చాలు. <మందల[2]+చాలు.

మందలించు చూ. మందల[2].

మందలింపు చూ. మందల[2].

మందలిసాలు చూ. మందల[2].

మందల్చాలు చూ. మందల[2].

మందల్సాలు చూ. మందల[2].

మందల్లు చూ. మందల[2]. వి.బ.వ. దున్ని చేని గనిమల చుట్టు లోని భాగం.

మందన రూ.చూ. మంజన. వి. పెద్దపెట్టె, పెట్టె. భాస్క.రా. బాల. 675, రం.రా.బాల. 63 పు. 7 పం.

మందనము రూ.చూ. మంజన. వి. పెద్దపెట్టె. కాశీ. 4.105.

మందాకు చూ. మందు.

మందారపూవు వి. 1. ఎరుపురంగు ; 2. ఒకరకం పువ్వు.

సం. మందార-. అందమైన ఎఱ్ఱపూలు పూసే చెట్టు.

<సం. మందార- + పూవు (మిశ్రస.).

మందారపూవుచీర వి. ఎరుపురంగు చీర.

మందారం వి. ఎరుపురంగు.

సం. మందార-. అందమైన ఎఱ్ఱని పూలు పూసే చెట్టు.

<సం. మందార + -ము (అర్థవిపరి.).

మందారంచీర వి. ఎరుపురంగు చీర.

మందారము వి. మోతం, మేఘావరణం. ఆం.భా. 1.71.

త. మంతారమ్. మబ్బుపట్టటం, మంతారమ్, మందారమ్. ఉక్కపోత.

<త. మంతారమ్.

మందారి రూ. మందారె. వి. అందమైన పూలు పూసే చెట్టు (Bauhina tomentosa or Variegata).

సం. మందార-. అందంగా ఉండే ఎఱ్ఱపూలు పూసే చెట్టు, కల్పవృక్షాల్లో ఒకటి.

<సం. మందార-.

మందారె రూ.చూ. మందారి. వి. అందమైన పూలు పూసే చెట్టు.

మంది చూ. మంద. వి. 1. జనం, జనసమూహం. పండి.చ. 4.252 పు. ; 2. పరివారం, బలగం. యయా. 3.32 ; 3. కాల్బలం, పదాతిసేన, సేన. యయా. 4.155.

క. మంది. ఆవుల గుంపు.

మందిగంౘలు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

మందిసొమ్ము వి. పరద్రవ్యం.

మన్దిండి చూ. మను[2].

మందు వి. 1. ఔషధం, వ్యాధి నివారణ సాధనం. నిర్వ.రా. 4.65 ; 2. నిదర్శనం, తార్కాణం. భార.ద్రోణ. 3.194 ; 3. ఉపాయం, వెరవు. భార.ద్రోణ. 5.305 ; 4. ప్రతిక్రియ, ప్రతికారం. భార.శల్య. 2.52 ; 5. దీని షష్ఠ్యేక వచనమైన 'మందునకున్' అనేది కొన్నిపట్ల 'లేశమైనను' 'ఎంతమాత్రమును' అనే అర్థాన్నిస్తుంది. ఈ అర్థంలో దీనికి వ్యతిరేకార్థక క్రియతోనే ప్రయోగా లున్నాయి. భార.శాంతి. 4.395 ; 6. వశ్యౌషధం, వలపుమందు. ఆము. 1.76 ; 7. విషం, విషపదార్థం ; 8. సురేకారం, గంధకం మొ. వాటితో చేసి తుపాకుల బాణసంచు మొ. వాటి కుపయోగించే ఒకరకమైన చూర్ణం, ఆగ్నేయచూర్ణం ; 9. డైనమైట్, తూటామందు, రాళ్ళను పగలగొట్టే ప్రేలుడు ద్రవ్యం ; 10. సారాయి ; విణ. దుర్లభం, అరిది. ఆము. 4.127.

క. మద్దు, మర్దు. మందు ; కొడ. మద్దె ; తు. మర్దు ; త. మరుంతు ; మ. మరున్ను ; తో. మద్ ; పర్జి. మెరుద్, మెర్దుల్ ; కొలా. మంద్ ; నా. మంద్ ; గ. మర్దిల్, మరిద్ ; కురు. మందర్ ; మాల్తొ. మన్గదు.

మందన్నమ్రాఁకెల్లఁదెచ్చు అ.క్రి. చూచి రమ్మంటే కాల్చి వచ్చు వంటిది. ఆము. 5.74. <మందు + అన్న(న్) + మ్రాఁకు + ఎల్లన్ + తెచ్చు. మందయిపోవు అ.క్రి. అరుదగు. పర.రా.బాల. పు. 174. 6 పం. <మందు + అగు + -ఇ[13] + పోవు. మందరి వి. మందులవాడు. <మందు + -అరి. మందాకు వి. మందుకోసం ఉపయోగించే ఆకు, ఓషధి. ఆము. 2.7. <మందు + ఆకు. మందుకాయ వి. బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగ పొడుగ్గా అడుగున రంధ్రంపెట్టి చేసిన మట్టిబుడ్డి. మందుకులేకుండు అ.క్రి. బొత్తుగా లేకుండు. బసవ. 4.97. <మందు + -కున్ + లేక + ఉండు. మందుకొట్టు[1] అ.క్రి. సారాతాగు. <మందు + కొట్టు[1]. మందుకొట్టు[2] వి. 1. మందుగుండుసామాను మొ. వేలుడు వస్తువులుంచే కొట్టు ; 2. సారాకొట్టు ; 3. ఔషధాలమ్మే దుకాణం. <మందు + కొట్టు[2]. మందుగట్టు వి. మందు చెట్లుండే పర్వతం, ద్రోణపర్వతం. అచ్చ.రా.యు. 272. మందుపట్టడ వి. బాణశాల, బాణసంచు చేసే శాల. ఆం.భా. 2.25. మందుపిచ్చిక వి. మిథున అనే పక్షి. మందుపోతు వి. కాలహండీ ప్రాంతపు దున్న. మందుబాయి వి. నల్లమందు మొ. మాదక ద్రవ్యాల్ని సేవించేవాడు. మందుబుడ్డి వి. బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగా పొడుగ్గా అడుగున రంధ్రం పెట్టి చేసిన మట్టిబుడ్డి. మందుమల వి. మందుచెట్లుండే పర్వతం, ద్రోణపర్వతం. ఆం.భా. 2.28. మందుమ్రాకు వి. ఔషధం అనటానికి మందూ మాకూ అని వాడుక. పండి.చ. ప్రథ. 2.389 పు. మందురా వి. చంద్రుడు. వ్యు. మందులకు రాజు. మందులమారి వి. 1. మరులుమందుపెట్టేవాడు, పెట్టేది, వశ్యక్రియావేదిని. పండి.చ. 2.116 ; 2. మందులుపెట్టి మగడిని మలుపుకొనే స్త్రీ. మందులమారితీగ వి. కొండలమీద పెరిగి తెల్లని పళ్ళు కాసే తీగ. (Vitris carnosa). మందులవాండ్రు విణ.బ.వ. మందు లమ్ముకొని జీవించే ఒక ఆటవిక జాతి. మందులవాఁడు వి. 1. మందులమారి ; 2. మందులు అమ్మేవాడు ; 3. మందులుచేసేవాడు ; 4. వైద్యుడు. మందులాఁడి విణ. మర్లుమందుపెట్టేది. చెన్న బసవ. 2.24.

మందురు రూ.చూ. మాద్రి[1]. వి. మచ్చు.

మందెన్నఅంగడము వి. గుణగణాలు తెలియని గొడ్డు.

మందెమేలము రూ. మందెమేళము. వి. 1. గర్వం, అహంకారం. పండి.చ. 2.154 పు. ; 2. చనువు, అతిపరిచయం, జంకుగొంకులు. భోజ. 4.157 ; 3. ఉపేక్ష, ఒప్పరికం. భాగ. 10 ఉ. 578 ; 4. స్నేహం, చెలిమి. విప్ర. 4.17 ; 5. గేలి, పరిహాసం. ఆం.భా. 1.139.

క. మందివాళ, మందెవాళ. నిర్లక్ష్యం.

**మందెమేళము** రూ.చూ. మందెమేలము. వి. **1**. గర్వం ; **2**. చనువు ; **3**. మైత్రి ; **4**. ఉపేక్ష ; **5**. గేలి.

**మన్న**[1] రూ. మన్నా[2]. వి. అడ్డగింపు, నిరోధం.

ఒ. మనా. ; హిం.ఉ. మనా. నిషేధం, అడ్డగింత ; క. మన్నా.

< ఉ. మనా.

**మన్న**[2] రూ.చూ. మన్నీఁడు. వి. **1**. భూస్వామి ; **2**. సామంతుడు ; **3**. ప్రభువు, దొర.

**మన్నఁడు** రూ.చూ. మన్నీఁడు. వి. **1**. స్వామి, ప్రభువ ; **2**. మన్నెపు దొంగ.

**మన్నంగొఱఁడు** చూ. మన్నన.

**మన్నన** వి. **1**. దయ, అనుగ్రహం. కు.సం. 4.61 ; **2**. పరిహారం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 427. క్రీ.శ. 1270 ; **3**. గౌరవం, సన్మానం. భార. విరా. 1.133 ; **4**. ఆదరం. వసు. 1.111.

సం. మానన-. గౌరవించటం ; ప్రా. మణ్ణణ-. ఆదరం ; జై.శౌ. మణ్ణణ-. ; పా. మఞ్ఞనా. ;

క. మన్ననె. గౌరవించటం. ఆదరించటం, సన్మానించటం, మన్నణి, మన్నణె. గౌరవం.

< ప్రా. మణ్ణణ-.

**మన్నంగొఱఁడు** వి. గౌరవంలేనివాడు. కు.సం. 7.49. < మనన + కొఱ[1] + -ఁడు. **మన్ననచేయు** రూ. మన్ననసేయు. స.క్రి. ఆదరించు. భాగ. 10 పూ. 1766. **మన్ననమానిసి** వి. **1**. గౌరవించదగినవ్యక్తి. భార.విరా. 1.128 ; **2**. గౌరవించగల మనుష్యుడు. **మన్ననసేయు** రూ.చూ. మన్ననచేయు. స.క్రి. ఆదరించు. దశా. 6.37.

**మన్ననారు** రూ. మన్నారు. వి. తమిళనాడులోని పాండ్య మండలంలో విల్లుపుత్తూరులో వేంచేసి ఉండే దేవుడు. మన్నారు. ఆము. 2.87.

**మన్నమసువు** చూ. మను[1].

**మన్నసాల** రూ.చూ. మల్లసాల. వి. చావడి, బయటిపంచ.

**మన్నా**[1] వి. క్రైస్తవ మతపరిభాష, అమృతం, దివ్యప్రసాదం, ఐగుప్త దాస్యవిముక్తులై ఇశ్రాయేలను గూర్చి వలస వెళుతూ యూదులకు యెహోవా ప్రసాదించిన ఆహారం, మానా.

పో. మనా. దివ్యప్రసాదం ; స్పా. మనా ; హిబ్రూ. మాన్. దీనికి మూలం.

< పో. మానా.

**మన్నా**[2] రూ.చూ. మన్న[1]. వి. అడ్డగింపు, నిరోధం.

**మన్నాడు** రూ.చూ. మఱునాడు. వి. ఆ రోజు తరువాతి రోజు.

**మన్నారు** రూ.చూ. మన్ననారు. వి. తమిళనాడులోని పాండ్య మండలంలో విల్లుపుత్తూరులో వేంచేసి ఉండే దేవుడు.

**మన్నాన** చూ. మన్ను[1].

**మన్ని**[1] వి. **1**. జీవం, ప్రాణం. రం.రా. కిష్కిం. 215 పు. 11పం. ; **2**. మనుగడ.

త. మన్ను(త్). బతుకు.

**మన్నిగొనిపించు(-కొనిపించు)** స.క్రి. చంపించు. దశా. 7.25. **మన్నిగొను(-కొను)** స.క్రి. **1**. చంపు, వధించు. భార.స్త్రీ. 2.90 ; **2**. (ప్రాణాలుతీయు) మిక్కిలి బాధపెట్టు. హరి.పూ. 5.225.

**మన్ని**[2] వి. పెడతలలో ఉండే నరం, గ్రీవాపశ్చాద్భాగంలోని సిర.ఆం.భా. 2.132.

**మన్నిక**[1] చూ. మన్నన. వి. మన్నన, సన్మానం. ఆం.భా. 1.134.

**మన్నిక**[2] చూ. మన్ను[4].

**మన్నికవాలు** చూ. మన్ను[4].

**మన్నికాలు** చూ. మన్ను[4].

**మన్నించు** చూ. మన్నన. స.క్రి. **1**. గౌరవించు. భార.ఆది. 6.222 ; **2**. సన్మానించు, బహూకరించు. భార.శాంతి. 5.121 ; **3**. కరుణించు, అనుగ్రహించు. హర. 6.6 ; **4**. ఆదరించు. కాశీ. 4.148 ; **5**. ఇచ్చు, ఒసగు. రాజవా. 2.15 ; **6**. రక్షించు, కాపాడు. వేం.మా. 2.128.

క. మన్నిస్తు. ;

సం. మాన్. ; ఒ. మన్నా.

**మన్నింపు** వి. **1**. మన్నించటం. ఆం.భా. 1.134 ; **2**. అపరాధక్షమ.

**మన్నింపు** చూ. మన్నించు.

**మన్నియ** రూ.చూ. మన్నీఁడు. విణ. శ్రేష్ఠుడు. అచ్చ.రా.బాల 204 ; వి. ప్రభువు. అచ్చ.రా.అరణ్య. 73.

**మన్నియతీఱు** వి. మాన్యాలపై విధింపబడే పన్ను. ద.హిం.శా. సంపు. 10. క్రీ.శ. 1078. **మన్నియతీఱుపయిండ్లి** వి. మన్నియతీరుపసిండి, మాన్యంపై విధింపబడే రొక్కరూపమైన పన్ను. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 83. క్రీ.శ. 1125.

**మన్నియఁడు** రూ.చూ. మన్నీఁడు. వి. ప్రభువు; విణ. శ్రేష్ఠుడు.

**మన్నియము** రూ.చూ. మన్నెము. వి. **1**. సన్మానించి ఇచ్చిన భూభాగం ; **2**. పర్వతప్రాంత ప్రదేశం ; **3**. నివాసస్థానం ; **4**. దుర్గమప్రదేశం.

**మన్నియమ్రుచ్చు** వి. కొండల్లో ఉండే దొంగ. హరి పూ. 5.142.

**మన్నియమ్రుచ్చు** చూ. మన్నియము.

**మన్నిల్లు** చూ. మన్ను[1].

**మన్నీఁడు** రూ. మన్న[2], మన్నఁడు, మన్నియ, మన్నియఁడు, మన్నె[2], మన్నెఁడు. వి. **1**. మండలాధిపతి, ప్రభువు, దొర. భార.శల్య. 1.9 ; **2**. సామంతరాజు , **3**. భూస్వామి. విణ. శ్రేష్ఠం, శ్రేష్ఠుడు. ద్వి.సార.చ. 3.111 పు. 20 పం.

క. మన్నెయ. సేనానాయకుడు, ముఠానాయకుడు ; త. మన్. రాజు, వీరుడు, భూస్వామి, దొర, భర్త, మన్నన్. రాజు, దొర, మన్నవన్. రాజు; మ. మన్నన్, మన్నవన్. రాజు.

పో. చూ. సం. మాననీయ-. గౌరవించతగ్గవాడు.

**మన్ను**[1] రూ. మను[2]. వి. ఔ. **1**. మట్టి. భార.ఆది. 5.232 ; **2**. భూమి, నేల. కాశీ, 1.121.

క. మణ్ణు, మణల్, మళల్, మలల్, మరల్. ఇసక, కంకర; కొడ. మణ. ఇసక, మణ్ణి. మట్టి; తు. మణ్ణు. భూమి, సున్నం, మట్టి; త. మణ్. భూమి, దుమ్ము, మట్టి, పొడినేల, మనల్. ఇసక, కంకర; మ. మణ్, మణ్ణు. భూమి, మన్ను, మట్టిగోడ; కో. మణ్. భూమి, మట్టి, వెల్లవేయు, తుప్పు, మణల్. ఇసక, కంకర. తొ. మొణ్. భూమి, మట్టి, సున్నం, నేల, ఎర్‌మొళ్న్. ఇసక, కంకర; కొం. మణు. ఇసక, కంకర; పర్జి. మన్. సం. మృత్స్న, మంచిమన్ను.

<మూ.ద్రా. *మణ్.

**మంటిఅడుగు** వి. కుమ్మర్లు మట్టికలిపే చోటు. <మన్ను$^{1}$ +-ఇ$^{3}$+ అడుగు. **మంటికోపు** వి. మట్టిడిబ్బ. <మన్ను$^{1}$ ఇ$^{3}$+ కోపు. **మంటిగడ్డ** వి. మట్టిగడ్డ. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ గడ్డ. **మంటిగలాసు** రూ.చూ. మట్టిగలాసు. వి. కల్లుతాగటానికి వాడే పొడవాటి మట్టిపాత్ర. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ గలాసు. **మంటిగూండ్లు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ గూండ్లు. **మంటిగోడ** వి. మరుగుగోడ. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ గోడ. **మంటిగ్లాసు** రూ. చూ. మట్టిగలాసు. వి. కల్లు తాగటానికి వాడే పొడుగాటి మట్టి పాత్ర. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ గ్లాసు. **మంటితిండి** వి. తేలు. సాంబ. నానా. 83. < మన్ను$^{1}$ +- ఇ$^{3}$ + తిండి. **మంటినూనె** వి. మన్నులోనుండి తీసిన ఒకరకం చమురు, కిరసనూనె. < మన్ను$^{1}$ +- ఇ$^{3}$ + నూనె. **మంటిపెంకు** వి. మీదపొయ్యి వేయించటానికి వాడే పెంకు. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ పెంకు. **మంటిపొయ్యి** వి. మూడు వైపులా గోడలాగ పెట్టి ముందువైపు కట్టెలు పెట్టటానికి జానెడు వెడల్పు మూతి ఉండే వంటపొయ్యి. <మన్ను$^{1}$ +-ఇ$^{3}$+ పొయ్యి. **మంటిబుక్కడు** వి. విషంలేని ఒకజాతి పాము. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ బుక్కడు. **మంటిభూమి** వి. ఇసకనేల. పొరలు పొరలుగా ఇసక ఇతర విధాల మట్టి కలిసి ఉండే నేల. సం. భూమి-. నేల. <మన్ను$^{1}$+- ఇ$^{3}$+ సం. భూమి-. **మంటిసారి** వి. మట్టిని మెత్తి చేసిన సారె. <మన్ను$^{1}$+-ఇ$^{3}$+ సారి$^{2}$. **మన్నాస** వి. భూమిపై ఆశ, భూమిపై ఉండాలనే ఆశ. కు.సం. 10.142, <మన్ను$^{1}$+ ఆస. **మన్నిల్లు** వి.బొ. భూమిలోపల నిర్మింప బడిన ఇల్లు, నేలమాలె, భూగృహం. దశకు. 8.83. <మన్ను$^{1}$+ ఇల్లు. **మన్నుకానుపు** రూ. మన్నుకాన్పు. వి. సీతాదేవి, భూపుత్రి. **మన్నుకాన్పు** రూ.చూ. మన్నుకానుపు. వి. సీతాదేవి, భూసుత. **మన్నుగుబ్బి** వి. సులువుగా తిరగటానికి వీలుగా రంధ్రం ఉన్న మట్టి. వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ. **మన్నుగొట్టం** వి. సారాబట్టీలో గూనకి రాయబారం కుండకి చేర్చి అమర్చిన మట్టి గొట్టం. **మన్నుగొట్టికొనిపోవు(-కొట్టుకొనిపోవు)** అ.క్రి. నాశనమగు. **మన్నుచూలి** వి. సీతాదేవి. అచ్చ.రా.సం. 33. **మన్నుచేయు** స.క్రి. మట్టితో కలుపు. **మన్నుతాలుపు** రూ. చూ. మన్నుతాల్పు. వి. భూధరం, పర్వతం. **మన్నుతాల్పు** రూ. మన్నుతాలుపు. వి. పర్వతం, భూధరం. అచ్చ.రా. అయోధ్యా. 104. **మన్నుతెర** వి. సారెపలకమీద వేసిన మట్టిముద్ద. **మన్నునాకు** అ.క్రి. చచ్చు, మరణించు. **మన్నుపాకం** వి. మట్టిపాత్రలు తయారుచేయటానికి అనుకూలంగా బిర్రుగ చిక్కటి పాకంలో ఉన్న బురదమట్టి. **మన్నుపీట** వి. కుండల్ని నర్సేటప్పుడు కుమ్మరి కూర్చోవటానికి చేసుకున్న మట్టిదిమ్మ. **మన్నుఱేఁడు** వి. భూపతి, రాజు. కాశీ. 6.141. **మన్నువారి** వి. కేటు, మట్టిగోడ కట్టడంలో తడవకు మూరెడెత్తున నిర్మించిన గోడ. **మన్నేల** వి. మంచినేల. ఎర్రనేలల్లో సారవంతమైంది. **మన్వెట్టు** అ.క్రి. భూదానం చేయు. పాండు. 5.41. <మన్ను$^{1}$+ పెట్టు.

**మన్ను$^{2}$** రూ. మను$^{3}$. వి. ఒకజాతి జింక. పి.శకు. 2 15, నవనాథ. 1.34 పు. 31 పం.

**మన్నుఁబిడి(-పిడి$^{2}$)** రూ.చూ. మన్బిడి. వి. ఆడ ఋష్యమృగం. యయా. 1.104. **మన్నుఁబెంటి(-పెంటి)** వి. ఆడ ఋష్యమృగం. కకుత్థ్స. 4.93. **మన్నుఁబోతు(-పోతు$^{2}$)** రూ. చూ. మనుఁబోతు. వి. ఒకమగజాతి జింక. ఉ.హరి. 4.26.

**మన్ను$^{3}$** వి. యుద్ధసాధన విశేషం. ఉ.హరి. 3.36.

త. మణ్. గొప్పదనం, శ్రేష్ఠత.

**మన్ను$^{4}$** రూ.చూ. మను$^{1}$. అ.క్రి. ఉండు, ఎక్కువ కాలం ఉండు. వసు. 3.146.

**మన్నిక$^{2}$** వి. ఎక్కువ కాలం ఉండటం. **మన్నికవాలు** రూ. మన్నికాలు. వి. రొమ్ముమీద ఉండే సుడి. **మన్నికాలు** రూ.చూ. మన్నికవాలు. వి. రొమ్ముమీద ఉండే సుడి.

**మన్నె$^{1}$** రూ. మున్న. వి. సముద్రతీరంలో పెరిగి పచ్చని పూలు పూసే మొక్క (Crotalaria laburnifolia).

**మన్నె$^{2}$** రూ. చూ. మన్నీఁడు. వి. రాజు, సామంతరాజు. తపతీ. 1.14.

**మన్నెకాఁడు** చూ. మన్నెము.

**మన్నెకావలి** చూ. మన్నెము.

**మన్నెండు** చూ. మన్ను. వి. మృతిని పొందినవాడు.

**మన్నెఁడు** రూ.చూ. మన్నీఁడు. వి. 1. రాజు; 2. అడవి ప్రాంతానికి పాలకుడు.

**మన్నెదొర** చూ. మన్నెము.

**మన్నెపుజ్వరము** చూ. మన్నెము.

**మన్నెపుదొర** చూ. మన్నెము.

**మన్నెపువాఁడు** చూ. మన్నెము.

**మన్నెము** రూ. మన్నియము, మన్యము. వి. 1. సన్మానించి ఇచ్చిన భూభాగం. బసవ. 3.548; 2. పర్వతప్రాంత ప్రదేశం. ఆము. 4.257; 3. నివాసస్థానం. సుద. 2.92; 4. దుర్గమప్రదేశం. ఆం.భా. 2.7.

సం. మనిత-, మాన్య-. గౌరవించబడినది, మన్నించబడినది; ప్రా. మానియ-.

పర్జి. మనామ్. అడవిలో చెట్లుకొట్టి సాగుచేసిన భూమి.

<ప్రా. మానియ-.

**మన్నెకాఁడు** వి. ప్రభువు. తపతీ. 1.4. **మన్నెకావలి** వి. దేశంలో శాంతిభద్రతలు నెలకొల్పే నియోగం (దానవ్యయాదులకు కొన్ని భూముల గ్రామాలవల్ల వచ్చే ఆదాయాన్ని ప్రత్యేకించటం). నె.శా. ఒంగోలు. 102. క్రీ.శ. 1726. **మన్నెదొర** రూ. మన్నెపుదొర. వి. అధిపతి,

ప్రభువు. కృ.శకు. 1.70. మన్నెపుజ్వరము వి. ఒకరకం జ్వరం, మలేరియా. మన్నెపుదొర రూ. చూ. మన్నెదొర. వి. అధిపతి, ప్రభువు. మన్నెపువాఁడు విణ. రైతులవల్ల ఏర్పాటుచేయబడిన మాదిగవాడు. మన్నెముదన్ను(-తన్ను) అ.క్రి. ఒకరికి లోబడక స్వతంత్రించి ఉండు. శృం. నై. 7.48. మన్నెముల్లు వి మేకల కాలిగిట్టలో ముల్లుతీసే పెద్దనూది. హంస. 2.75. < మన్నెము + ముల్లు. మన్నెరాజు వి. మండలాధిపతి, సామంతరాజు. ప్రబోధ. 1.25. మన్నెఱికము వి. ప్రభుత్వం, అధికారం. వైజ. 2.70. మన్నెఱేఁడు వి. మన్నెపుప్రభువు. మన్నెవాఁడు. విణ. రాజు, సామంతరాజు. సారంగ. 1.62.

మన్నెరాజు చూ. మన్నెము.

మన్నెఱికము చూ. మన్నెము.

మన్నెఱేఁడు చూ. మన్నెము.

మన్నెలు చూ. మన్నన. వి.బ.వ. **1**. నాట్యవిశేషం ; **2**. నతి విశేషం.

మన్నెవాఁడు చూ. మన్నెము.

మన్నేరి వి. ఒకానొక జాతి మనుష్యుడు. హంస. 3.29.

మన్నేల చూ. మన్ను[1].

మన్ప చూ. మను[1].

మన్పిడి చూ. మను[3].

మన్మ రూ.చూ. మన్మఁడు. వి. మనుమడు. ఉదయ. 3.56.

మన్మరాలు రూ.చూ. మన్మఁడాలు. వి. **1**. పుత్రుని పుత్రిక, పౌత్రి. రం. రా. ఉ. 26పు. 3పం ; **2**. దౌహిత్రి, కూతురు కూతురు. మన్మఁడాలు రూ.చూ. మన్మఁడాలు. వి. కూతురు లేక కొడుకు కూతురు. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1091. క్రీ.శ. 1123. మన్మఁడాలు రూ. మనమరాలు, మనుమరాలు, మన్మరాలు, మన్మఁడాలు. వి. కూతురు లేక కొడుకు కూతురు. భైరవకొండ శాసనం. క్రీ.శ. 7వ శతాబ్ది.

మన్మఁడు రూ. మనమఁడు, మనుమ, మనుమఁడు, మన్మ. వి. **1**. పౌత్రుడు, కొడుకుకొడుకు. భార. ఆది. 3.118; **2**. దౌహిత్రుడు, కూతురు కొడుకు ; **3**. పుత్రసంతతిలోనివాడు, మునిమనుమడు, ఇనుమనుమడు మొ. వారు.

మన్మథబాణము వి. తెల్లని అందమైన పూలు పూసే మొక్క (Jasminum sambac).

సం. మన్మథ బాణ-. అరవిందాది పుష్పాలు.

<సం. మన్మథబాణ- + -ము. (అర్థవిపరి.).

మన్మథబాణాలు వి.బ.వ. **1**. ఒకరకం వడ్లు. హంస. 4.128 ; **2**. గుత్తగాఉండే రెండురంగులు కలపూలు.

సం. మన్మథ బాణ-. మన్మథునిబాణాలు, పువ్వులు

<సం. మన్మథబాణ- + -ము + -లు (అర్థవిపరి.).

మన్యము రూ.చూ. మన్నెము. వి. **1**. ఇనాంనేల ; **2**. దుర్గమ ప్రాంతం, అడవులతో కొండలతో కూడుకొన్న భూభాగం.

మన్యసుల్తాను వి. మన్నెరాజు, సామంతప్రభువు. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1286.

మన్యసుల్తాను చూ. మన్యము.

మన్రాగ రూ.చూ. మనోరాద. వి. మార్గశిర మాసంలో వచ్చే కార్తె.

మన్వేట్టు చూ. మన్ను[1].

మపున రూ. చూ. ముఫసల్. విణ. ప్రత్యేకమైన ; వి. పల్లెటూరు.

మప్పితము చూ. మప్పు.

మప్పు స.క్రి. **1**. నేర్పు, అభ్యసింపచేయు ; **2**. మాటల్ని కప్పిపుచ్చు ; వి. అభ్యాసం.

కొం. మర్జి. నేర్చుకొను, మర్స్. నేర్పు ; కుఇ. మాస్ప. శిక్షణఇచ్చు, (మిహ్నై. నేర్పు).

మప్పితము విణ. మితం, పరిమితం. మప్పగడ (-గడ[3]) వి. **1**. అలవాటు ; **2**. క్రమశిక్షణ.

మబ్బు వి. **1**. మత్తు, మాంద్యం, మగత. రం. రా. ఉ. 29పు. 24పం. ; **2**. చీకటి, అంధకారం. వేంక. పంచ. 1.259 ; **3**. మేఘం, మొయిలు. ఆము. 4.101 ; **4**. అజ్ఞానం. చంద్రాంగ. 4.26 ; **5**. మందకొడితనం ; **6**. మాపు, సందెవేళ.

క. మర్వ్య, మర్జు, మబ్బు, మొబ్బు. చీకటి ; మసక చీకటి, అజ్ఞానం, నిద్రమత్తు, మూర్ఖత్వం, నిద్రమత్తువల్ల కలిగేభారం ; త. మప్పు. మబ్బు, కమ్ము, చీకటివ్యాపించు. మత్తిలు, అజ్ఞానం, పొగరు, మమ్మల్. మసకచీకటి.

మబ్బుఏలు అ.క్రి. ఆకాశంలో ఒకతట్టు ఎక్కువగా మబ్బుచేరు. మబ్బుకంకి వి. జొన్న మొ. వాటికి గింజలు లేని కంకి ఏర్పడే తెగులు. మబ్బుకొను అ.క్రి. మత్తిల్లు. పారి. 2.52. మబ్బుకొరివి వి. తెల్లనిపూలు కలిగి పచ్చికొమ్మలు కాగడాలకు ఉపయోగపడే చెట్టు (Ixora parviflora). మబ్బుగ్రక్కు(-క్రక్కు) అ.క్రి. స్పృహతప్పు, మబ్బువచ్చి పడిపోవు. పాండు. 4.48. మబ్బుచాయచీర రూ. మబ్బు సాయసీర. వి. ఎరుపువన్నెలో నిలువు నలుపువన్నెలో పేకపెట్టి నేసినచీర. మబ్బుచేయు స.క్రి. (దీపం మొ. వాటిని) తగ్గించు, ఆర్పు. మబ్బుజక్కిరౌతు వి. ఇంద్రుడు, మేఘవాహనుడు. మబ్బుతత్తడిరౌతు వి. మేఘవాహనుడు, ఇంద్రుడు. చంద్రాంగ. 5.54. మబ్బుత్రోవ వి. ఆకాశం. ఆం. భా. 1.69. మబ్బుది విణ. జాగ్రత్తలేనిది. మబ్బునీరానుపిట్ట వి. వానకోయిల. సాంబ. 2.82. <మబ్బు + నీరు + అను[1] + పిట్ట. మబ్బుపగ వి. గాలి. వ్యు. మబ్బుకు శత్రుత్వంకలది. ఆం. పదా. సుర. 35. మబ్బుపట్టు అ.క్రి. మబ్బుఏలు, ఆకాశంలో మబ్బుచేరు. మబ్బుపట్టెజాడి వి. తెలుపు నలుపు పట్టెలు పడేట్టు నేసిన గొంగడి డిజైను. మబ్బుపువు రూ.చూ. మబ్బుపూ. వి. నీరం, జలం. మబ్బుపువ్వు రూ.చూ. మబ్బుపూ. వి. నీరం, జలం. మబ్బుపువ్వులవెల్లి రూ. చూ. మబ్బుపూవులవెల్లి. వి. సముద్రం, కడలి. మబ్బుపూ రూ. మబ్బుపువు, మబ్బుపువ్వు, మబ్బుపూవు. వి. నీరు, జలం. మబ్బుపూనిసువు వి. అగ్ని. వ్యు. నీటినుంచి పుట్టిన శిశువు. ఆం. భా. 1.47. మబ్బుపూపుట్టువు రూ. మబ్బుపూఁబుట్టువు. వి. తామరపూవు. వి. తామరపువ్వు. ప్రబంధ. 153. మబ్బుపూఁబుట్టువు రూ. చూ. మబ్బుపూపుట్టువు. వి. తామరపువ్వు. మబ్బుపూవిడుపు వి. **1**. జలముచం, మేఘం. ప్రబంధ.

216; 2. వర్షం కురవటం. మబ్బుపూవు రూ. చూ. మబ్బుపూ. వి. నీరు, జలం. మబ్బుపూవులవెల్లి రూ. మబ్బుపువ్వులవెల్లి. వి. సముద్రం. సాంబ. దేవ. 17. మబ్బుపెట్టు అ.క్రి. దగాచేయు. స.క్రి. దాచు. మబ్బుమేపరి వి. గాలి, వ్యు. మబ్బును తినేది (పారతోలేది). అచ్చ. రా. సుందర. 121. మబ్బురంగు వి. 1. లేతనలుపు, మొగిలురంగు; 2. లేతనీలంరంగు. మబ్బురవుతు రూ. మబ్బురౌతు. వి. మేఘవాహనుడు, ఇంద్రుడు. చంద్రాంగ. 5.54. మబ్బురాగి వి. ఒకరకం రాగి. మబ్బురాయుంట రూ. మబ్బురాయుంటనము వి. మత్తువస్తువులు కలిపి చేసిన మందు. ప్రబంధ. 78. ఆం. భా. 2.304. <మబ్బు+ రాయి+ఉంట. మబ్బురాయుంటనము రూ. చూ. మబ్బు రాయుంట. వి. మత్తువస్తువులు కలిపిచేసినమందు. మబ్బు రూపరి వి. ఐరావతం. <మబ్బు + రూపు+-అరి. మబ్బురౌతు రూ.చూ. మబ్బురవుతు. వి. మేఘవాహనుడు, ఇంద్రుడు. మబ్బుఱా వి. వడగల్లు. ప్రబంధ. 217. మబ్బులదాయ వి. గాలి. వ్యు. మేఘాలశత్రువు. మబ్బుల పగ వి. గాలి. వ్యు. మబ్బులశత్రుత్వం కలవాడు. మబ్బుల పగతుఁడు వి. గాలి. వ్యు. మబ్బులకు శత్రువు. మబ్బులపగ దాయ వి. గాలి. వ్యు. మేఘాల్ని చెదరగొట్టే శత్రువు. సాంబ. దేవ. 13. మబ్బులపగవాఁడు విశ. గాలి. వ్యు. మేఘాల శత్రువైనవాడు. మబ్బులపూట రూ. మెబ్బుల పూట. వి. సాయంత్రం. సందెవేళ. మబ్బువిప్ప వి. గాలి. వ్యు. మబ్బుల్ని చెదరగొట్టేవాడు. మబ్బువొడుచు(-పొడుచు[1]) స.క్రి. మగతకొల్పు, చేష్టారహితంగా చేయు. చంపు. రాజవా. 3.64. మబ్బుసాయసీర (-చీర) రూ.చూ. మబ్బు చాయచీర. వి. ఎరుపువన్నెలో నిలువు, నలుపువన్నెలో పేకపెట్టి నేసిన చీర. మబ్బొద్దుచ్చడు వి. మాపటివేళ, సాయంత్రం.

మబ్బొద్దుచ్చడు చూ. మబ్బు.

మభ్యపెట్టు చూ. మబ్బు. స.క్రి. 1. మోసంచేయు; 2. ఉపా యంగా దాటవేయు.

మమూలు రూ.చూ. మామూలు. వి. వాడుక, సంప్రదాయం.

మమేకము వి. ఎంతోప్రేమగా అన్యోన్యంగా ఉండటం.

సం. మమ. నాయొక్క, ఏక-. ఒకటి.

<సం. మమైక- (అర్థవిపరి.).

మంపరము చూ. మంపు.

మంపిలు చూ. మంపు.

మంపిల్లు చూ. మంపు.

మంపు వి. 1. నిద్రవల్ల కలిగిన మత్తు, పారవశ్యం. పారి. 2.63; 2. కల్లు మొ. మాదకద్రవ్యాలు సేవించడం చేత, సౌందర్య విలోకనాదులచేత కల్గే మైకం. పాండు. 5.154; 3. రూప యౌవ్వన విత్తాదులవల్ల కల్గే మదమత్తు. యయా. 4.25; 4. ఉద్ధతి, మిడిసిపాటు. చిత్రభా. 7.3; విశ. మత్తు కలిగించేది. శశా. 3.49.

త. మప్పు. మబ్బైన, మత్తువల్ల కల్గినట్టి మానసిక స్థితి, మాంద్యం, గర్వం.

మంపరము వి. స్మృతి లేకపోవటం, మూర్ఛ. మంపిలు రూ.చూ. మంపిల్లు. అ.క్రి. మదించు, కొవ్వు. మంపిల్లు రూ. మంపిలు. అ.క్రి. 1. మత్తిల్లు, మదించు, కొవ్వు. సారంగ. 1.68; 2. చొక్కు, పరవశత్వంనొందు. ప్రబంధ. 114. మంపుగొను(-కొను) అ.క్రి. మత్తిల్లు, మదించు, కొవ్వెక్కు. ఉ.హరి. 4.26. మంపుగొలుపు(-కొలుపు) స.క్రి. మైకం కల్గించు, మత్తిల్లచేయు.

మంబరము వి. దహనం, కాల్చటం.

మంబరముచేయు రూ. మంబరముసేయు. స.క్రి. దహించు, కాల్చు. ఉ.హరి. 3.153. మంబరముసేయు (-చేయు) రూ.చూ. మంబరముచేయు. స.క్రి. దహించు, కాల్చు. మంబరించు స.క్రి. కాల్చు.

మంబరించు చూ. మంబరము.

మంబె వి. అరకడ, మూపు.

మమ్మ రూ. మమ్మా. అవ్య. ప్రశంసార్థకం. సమీర. 6.201.

హిం. మామా. మామయ్య. తల్లి సోదరుడు.

మమ్మరె రూ.చూ. మమ్మరే. అవ్య. ప్రశంసార్థకం. మమ్మరే రూ. మమ్మరె, మమ్మారె, మమ్మారే. అవ్య. ప్రశం సార్థకం. రాజవా. 1.82.

మమ్మదు రూ.చూ. మహమ్మదు. వి. మహమ్మదీయ మత ప్రవక్త, శుభనామం.

మమ్మా రూ.చూ. మమ్మ. అవ్య. ప్రశంసార్థకం. శ్రీరం. మా. 4.962.

మమ్మారె రూ.చూ. మమ్మరే. అవ్య. ప్రశంసార్థకం. మమ్మారే రూ. చూ. మమ్మరే. అవ్య. ప్రశంసార్థకం. అష్టమ. క. 3.1.151 పు. 18 పం.

మమ్మాయము రూ.చూ. మమ్మాయి. వి. ఒకవిధమైన లేహ్యం

మమ్మాయి రూ. మమ్మాయము, మొమ్మాయి. వి. ఒకరకమైన. లేహ్యం.

హిం. మహామాఈ. దుర్గ, కాళి.

<హిం. మహామాఈ.

మమ్ము[1] చూ. మేము.

మమ్ము[2] వి. సముద్రంమీద ఓడలకు విఘాతంగా వీచే సుడిగాలి విశేషం.

హిం. మాయ్. శక్తి.

మయం రూ.చూ. మయము. వి. పన్నకం, దున్నేముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టటం.

మయంకర్ర వి. ఊడ్తె పైవైపున బిగించిన అడ్డపట్టె. మయంగూటం వి. నేతబయలులో చివర పాతిన కొయ్య. మయంగోడ రూ. మయపుగోడ. వి. అడ్డుగోడ, ఇంటిలోపల రెండుగదుల మధ్యన కట్టిన గోడ. మయంతాడు వి. మర మగ్గంలో నాడెలు నడపడానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. మయంతాపునేల వి. మెట్లమధ్య కట్టే వెడల్పైన పెద్ద పెట్టు. మయంపాయ యా. మయింపాయ. వి. అచ్చువడుల్లో అచ్చుకర్ర చివరి గదులు రెంటికీ మధ్యభాగం.

మయగమ్మి చూ. మయము.

మయనము రూ.చూ. మైనము. సిక్థకం, తేనెపట్టులోని తేనె తీసేస్తే మిగిలే మెత్తని పదార్థం.

మయపుగోడ చూ. మయము.

**మయము** రూ. మయం, మయ్యం. వి. **1.** మధ్యం, నడిమి భాగం ; **2.** శరీరం.

సం. మధ్య-. నడిమిభాగం ; ప్రా. పా. మజ్ఝ-; నే. మాఝ్. మధ్యభాగం, మాఝు. నడిమి ; అ. మాజ్ ; బెం. మాజ్, మాఝ్ ; ఒ. మాఝు. నడుము.

< ప్రా. మజ్ఝ-.

**మయగమ్మి** వి. నిలువుపట్టె, కిటికీ చట్రంలో నిలువుగా ఉన్న పట్టి. < మయము + కమ్మి. **మయపుగోడ** రూ.చూ. మయంగోడ. వి. అడ్డగోడ, ఇంటిలోపల రెండుగదులమధ్య కట్టిన గోడ. **మయమేయు** అ.క్రి. సరిచేసేటప్పుడు పడుగు తిరగేసి కుంచెవేయు. < మయము + వేయు.

**మయమేయు** చూ. మయము.

**మయాటం** చూ. మయము. విణ. మధ్యాటం, మధ్యఉన్న.

**మయాణా** వి. వెనకటి కడప నవాబుల బిరుదం.

హిం. మియఁ. నేత, పతి, సర్దారు ; ఉ. మియాఁ ; పార. మియాఁ.

< ఉ. మియాఁ.

**మయి**[1] రూ.చూ. మెయి[1]. వి. **1.** మార్గం. రాఘవ. **4.82** ; **2.** శరీరం. ఉ. హరిశ్చ. 4.152. చంద్రాంగ. 2.30.

**మయికొను** రూ.చూ. మైకొను; స.క్రి. సమ్మతించు. **మయికోలు** రూ.చూ. మైకోలు. వి. సమ్మతి. **మయిచాయ** రూ. మైచాయ. వి. దేహకాంతి. **మయిజోడు** వి. దుప్పటి, కప్పడు బట్ట. **మయితాలుపు** రూ.చూ. మైతాలుప. వి. ప్రాణి, శరీరి, జంతువు. **మయితాల్పు** రూ.చూ. మైతాలుప. వి. జీవి. **మయితెంచు** రూ.చూ. మైతెంచు. స.క్రి. సమ్మతించు. **మయిపూఁత** రూ.చూ. మైపూఁత. వి. అంగరాగం, మేనికి పూసుకునే చందనాది ద్రవ్యం, కలపం. విక్ర. 5.55. **మయిమఱచు** అ.క్రి. పారవశ్యంనందు, ఒడలెరుగకుండు. **మయిమఱపు** రూ.చూ. మైమఱవు. వి. పారవశ్యం, ఒళ్ళు తెలియకపోవటం. **మయిమఱువు** రూ.చూ. మైమఱువు. వి. కవచం. **మయివడి** రూ.చూ. మైవడి. విణ. అనుకూలమైన. వి. **1.** సమ్మది ; **2.** ఆనుకూల్యం ; **3.** నేర్పు ; **4.** విధం, రీతి. **మయిసున్నవజీరు** వి. అనంగుడు, మన్మథుడు.

**-మయి**[2]**(న్)** రూ.చూ. -మై[2](న్). ప్రత్య. ద్రు. **1.** తో. తృతీయా విభక్తిలో వచ్చే ప్రత్యయం ; **2.** చతుర్థి విభక్తిలో వచ్చే ప్రత్యయం ; **3.** సప్తమీవిభక్తిలో వచ్చే ప్రత్యయం.

**మయికము** రూ.చూ. మైకము. వి. మదం, మత్తు.

**మయిజాఱు** రూ.చూ. మైజాఱు. వి. కొంత ఎడం ఎడంగా అడ్డ కమ్ములు వారించిన స్త్రీల చీరకొంగు, బద్దె. ఇందులోని శకటరేఫం కృతకంగా కల్పించబడింది. మయిజారు సరిఐన శబ్దరూపం.

**మయిజాఱుచీర** రూ.చూ. మైజాఱుచీర. వి. మయిజారున్న చీర. మయిజారుచీర సరిఐనరూపం.

**మయిద**[1] రూ.చూ. మైద[1]. వి. మత్తత, మైకం.

**మయిద**[2] రూ.చూ. మైద[2]. వి. గోరంట.

**మయిదానము** రూ.చూ. మయిదాను. వి **1.** బహిః ప్రదేశం ; **2.** సమతలం, అంచుతప్ప మిగిలిన భాగం.

**మయిదాను** రూ. మయిదానము, మైదానము, మైదాను. వి. మైదానం, సమతల ప్రదేశం. రంగా.చ. 2.141.

హిం. మైదాన్. మైదానం ; మరా. మైదాన్. సమతల ప్రదేశం ; ఉ. మైదాన్. వృక్షాదులు లేని సమతల ప్రదేశం, యుద్ధభూమి ; పార. మైదాన్.

< ఉ. మైదాన్.

**మయిదు** రూ. మైదు. వి. **1.** మాయ. శివలీలా. 1 ; **2.** మత్తు

సం. మాంద్య-. మెల్లందనం.

**మయిదుపడు** రూ. మయిదువడు, మైదుపడు. అ.క్రి. **1.** భ్రమపడు ; **2.** మత్తుగొను. **మయిదువడు (-పడు)** రూ.చూ. మయిదుపడు. అ.క్రి. **1.** భ్రమపడు ; **2.** మత్తుగొను.

**మయినగోరవంక** రూ.చూ. మైనగోరువంక. వి. శారిక.

**మయినపువత్తి** చూ. మయినము.

**మయినము** రూ.చూ. మైనము. వి. తేనెపట్టులోని తేనె తీయగా మిగిలిన మెత్తని పదార్థం. ఆము. 5.153.

**మయినపువత్తి** రూ. మైనపువత్తి. వి. మధూచ్ఛిష్టవర్తి, మైనంతో చేసిన వత్తి.

**మయిమయి** రూ.చూ. మైమై. వి. అనుపద్రవం.

**మయింపాయ** రూ.చూ. మయంపాయ. వి. అచ్చు వడుల్లో అచ్చుకఱ్ఱ చివరి గదులు రెంటికీ మధ్య భాగం.

**మయిల** రూ.చూ. మైల. వి. **1.** ధూళి. బసవ. **3.790** ; **2.** మురికి. పండి.చ. 4.188.

**మయిలకన్ను** వి. ఎఱ్ఱబడిపోయిన కన్ను, రేగిన కన్ను. పండి.చ. 2.4.108 వు. **మయిలక్రోలు** రూ. మైలక్రోలు. వి. మురళి. భాస్క.రా.బాల. 687. **మయిలక్రోవి** రూ. మైలక్రోవి. వి. పిల్లనగ్రోవి. భాస్క. రా. బాల. 708. **మయిలనోయిమఱంగగు** అ.క్రి. చెడు మంచిదగు. తాళ్ల.సం. **3.585. మయిలవడు (-పడు)** రూ.చూ. మైలపడు. అ.క్రి. మలినమగు, ధూళికలదగు. **మయిలెద్దు** వి. అన్ని రంగులు కలిసిన ఎద్దు. < మయిల + ఎద్దు.

**మయిలతుత్తము** రూ.చూ. మైలతుత్తము. వి. తుత్తం.

**మయిలారి** రూ.చూ. మైలారు. వి. ఒకానొక క్షుద్రదేవతని పూజించేవాడు.

**మయిలారు** రూ.చూ. మైలారు. వి. ఒకానొక క్షుద్ర దేవత.

**మయిలారువాఁడు** విణ. వైశ్యుల్ని అడుక్కొని జీవించే వాడు.

**మయిలి** వి. మాలి, తోటపని చేసేవాడు.

సం. మాలిన్. తోటమాలి ; ప్రా. మాలి. మాలిఅ ; పా. మాలిక-,

< ప్రా. మాలి.

**మయిలు**[1] రూ.చూ. మైలు. వి. అరక్రోసు దూరం.

**మయిలు**[2] రూ.చూ. మొయిలు. వి. మేఘం.

**మయిలుతుత్తము** రూ.చూ. మైలతుత్తము. వి. ఒకానొక మందు వస్తువు.

**మయిలుమాణిక్యము** వి. బంజరుల్లో పెరిగే మొక్క (Sida rhombifolia).

**మయిలెద్దు** చూ. మయిల.

**మయిసరి** రూ.చూ. మైసరి. వి. నాట్య భేదం.

**మయిసాక్షి** వి. సాంబ్రాణి.

సం. మహీసాక్షిన్. భూసాక్షి.

**మయూరు** వి. 18 ఏళ్ళు దాటినవాడు.

సం. మయూర-. నెమలి, ఓమం, మైనతుత్తం, తులసీ భేదం.

**మయూరేయు (-వేయు)** అ.క్రి. ఆము లోపలి కట్టె కంపల్ని అంటుకొనేటట్లు కొంచెం నింపాదిగా పొయ్యి దగ్గర మంట పెట్టు.

**మయ్యి** వి. అత్తిచెట్టు (Ficus glomerata).

**మయ్యం** రూ.చూ. మయము. వి. పన్నకం, దున్నే ముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టటం.

**మయ్యంకి** వి. బీగం, చర్మవాద్య విశేషం.

**మయ్యచేప** వి. ఒకరకం చేప.

**మయ్యర** రూ.చూ. మయ్యెర. వి. **1**. ముఖరోమం, మీసం వెంట్రుక ; **2**. రోమం, వెంట్రుక.

**మయ్యెర** రూ. మయ్యర. వి. **1**. రోమం, వెంట్రుక. క్రీడా. 192 ; **2**. ముఖ రోమం, మీసం వెంట్రుక.

సం. శ్మశ్రు-. గడ్డం, మీసం.

**మర** వి. **1**. తిరుగుడు చీల, స్క్రూ ; **2**. కీలు ; **3**. తిరుగుడు నొక్కు ; **4**. లంకె, పోతు, పెంటి వాసాల కలయిక ; **5**. మరమేకు గాడి ; **6**. పాత్రలకు అందంగా పెట్టిన పూజ ; **7**. యంత్రం.

త. మరై. తిరుగుడు చీల.

**మరఉండ** వి. వడికి చుట్టిన ఉన్ని దారం. **మరకట్టు** వి. స్తంభనం, గారడివిద్య. పల్నా. 93. **మరకత్తి** వి. కీలు కత్తి. **మరకత్తిపీట** వి. మరకత్తిని ఆడించే ఆనికపీట. **మరకాఁడు** వి. **1**. మందరం. మను. 5.47 ; **2**. కర్ణధారుడు. మైరా. 2.51 ; **3**. జాలరి ; **4**. నరంగు. **మరకాలు** రూ.చూ. మరగాలు. వి. **1**. కృత్రిమపాదం. ఘటికా. 1.144 ; **2**. క్రర. **మరకుఁడు** వి. **1**. మందరం. మను. 5.47 ; **2**. కర్ణధారుడు, ఓడ చుక్కాని పట్టేవాడు. మైరా. 2.51. **మరకూజా** వి. బైర్‌లాగా లేక చుట్టకుదురు లాగ ఉండే కూజా. **మరగానుగ** వి. యంత్ర సహాయంతో నడిచే గానుగ. **మరగాలు (-కాలు[2])** రూ. మరకాలు. వి. **1**. కృత్రిమ పాదం. పండి.చ. 5.312 పు. ; **2**. క్రర. **మరగొమ్ము (-కొమ్ము)** రూ. మరిగొమ్ము, మరుగొమ్ము. వి. **1**. గుబ్బంమీద ఆనుకోవటానికి ఎత్తుగా ఏర్పరచిన భాగం. కళా. 3.62 ; **2**. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరచిన రాతి కట్టడం. **మరచాయ** రూ. మరసాయ. వి. **1**. ఎర్ర తొగరురంగు మీద సుర్ల చెక్కపొడి, ఆముదం కలిపి వేసిన రంగు ; **2**. మిల్లులో తయారైన రంగు. **మరచాయచెక్కతొగరు** రూ. మరసాయిసెక్కతొగరు. వి. మిల్లులో తయారయిన చెక్కతొగరురంగు. **మరచీల** రూ. మరసీల. వి. మర మేకు, సుడి తిరిగిన గాడిగల మేకు. **మరచుట్టలు** వి.బ.వ. బార తీసిన పోగు కుదురుకు చుట్టటం. **మరచుట్టు** వి. మరచీల. ఆము. 5.124. **మరచెంబు** వి. మూతిని బిగించటానికి మర కోసిన చెంబు, రైలుచెంబు. **మరచేప** వి. ఒకరకం సొరచేప. **మరదండమేఘం** వి. సూర్యుడు కనబడకుండా ఆవరించిన మబ్బు. **మరనాడె** రూ. మర్నాడి, మొర్నాడె. వి. పడుగు పై పోగులకు, కింది పోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే నాడే, కొయ్యనాడె. **మరనూలు** రూ. మర్నూలు. వి. మిల్లులో యంత్రాల మీద తయారయిన నూలు. **మరపొయ్యి** వి. అలంకారంగా పూజలు పెట్టి నేసిన పొయ్యి. **మరబందు** వి. మడతబందు, రెక్కలు తెరుచుకోడానికి వీలుగా కమ్ములకు పట్టిఉంచే రెండు రెక్కల పరికరం. **మరబిండ** వి. ఒకరకం కుదురుబిళ్ళ. **మరమగ్గం** వి. నేత నేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజే మరపలక. **మరమామిడి** వి. గట్టి కలపనిచ్చే చెట్టు (Alseodaphone semecarpifolia). **మరమేకు** రూ. మరామేకు. వి. మరచీల, సుడి తిరిగిన గాడిగల మేకు. **మరరాటం** వి. **1**. డబ్బాలకు నూలు తోడే రాట్నం ; **2**. ఒకరకం రాట్నం, దారపు కండెలు చుట్టే రాట్నం. **మరలసల్ప** వి. కుండ పొంగడానికి కొట్టే సలప. **మరలు[1]** వి.బ.వ. వాసాలు, పెండెలు. **మరవడ్లు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **మరసాన** వి. రాళ్ళపనివారి సాధన విశేషం. **మరసాయ (-చాయ)** రూ.చూ. మరచాయ. వి. ఒకరకం ఎరుపురంగు. **మరసాయిసెక్కతొగురు** రూ.చూ. మరచాయచెక్కతొగురు. వి. మిల్లులో తయారయిన చెక్కతొగరురంగు. **మరసీల (-చీల)** రూ.చూ. మరచీల. వి. మరమేకు, సుడి తిరిగిన గాడిగల మేకు. **మరాసు** వి. **1**. ఆసు, జంత్రం ; **2**. డోలి, మిషనాసుమాను ; **3**. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం ఆసు. <మర+ఆసు[1]. **మరాసుఇరుసు** రూ.చూ. మరాసువిసురు. అ.క్రి. నేతలో నిలువుకు వాడే నూలు చుట్టటానికి మరాసు చక్రం తిప్పు. **మరాసుగొయ్య** వి. మరాసు చెక్రం తిరగటానికి అనువుగా తవ్విన పల్లం ప్రదేశం. **మరాసువిసురు** రూ. మరాసు ఇసురు. అ.క్రి. నేతలో నిలువుకు వాడే నూలు చుట్టటానికి మరాసు చెక్రం తిప్పు. **మర్నాడి** రూ.చూ. మరనాడె. వి. పడుగుపై పోగులకు, కింది పోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే నాడె. **మర్నూలు** రూ.చూ. మరనూలు. వి. మిల్లులో యంత్రాల మీద తయారయిన నూలు.

**మరక** రూ.చూ. మఱక[2]. వి. **1**. ఎడకారుమేక లేక గొర్రె పిల్ల ; **2**. గుర్తు ; **3**. మైల ; **4**. దాగు, మచ్చ.

**మరకటము** వి. కోతి. సమీర. 2.6.

సం. మర్కట-. కోతి ; ప్రా. మక్కడ-, మంకడ-. మంకణ- ; అప. మక్కల ; నే. మాకుల్ ; ఒ. మాకడ. మాంకడ ; మరా. మాకడ్.

<సం. మర్కట-(విప్రకర్ష).

**మరకతపట్టు** వి. ఒకవిధమైన పట్టువస్త్రం. బసవ. 3.55.

సం. మరకత- పచ్చ, నవరత్నాల్లో ఒకటి.

<సం. మరకత-+పట్టు[2] (మిశ్రస.).

**మరకము** వి. **1**. ఎనిమిదిపళ్లు, తూము ; **2**. ధాన్యంకొలత.

అయిదు లేక నాలుగు సేర్లు.

త. మరక్కాల్. ధాన్యం కొలత.

**మరకువ** రూ.చూ. మఱకువ. వి. 1. మరుపు; 2. పరాకు.

**మరకూము** విణ. లిఖించబడ్డ.

హిం. మర్కూమహ్. రాయబడ్డది; ఉ. మర్కూమహ్.; పార. మర్కూమహ్.; అర. మర్కూమహ్. లిఖించబడిన.

<ఉ. మర్కూమహ్.

**మరక్కాల్పుకూన** చూ. మరగు[1].

**మరగదుత్త** రూ.చూ. మరవదుత్త. వి. మరవమాదిరి ఉండే దుత్త. పొలం దగ్గరికి నీళ్ళు తీసుకుపోవడానికి ఉపయోగించే కుండ.

**మరగించు** చూ. మరగు[1].

**మరగు**[1] రూ.చూ. మఱుఁగు. అ.క్రి. 1. ఆసగొను, ఆసక్తమగు. కు.సం. 7.36; 2. అలవాటుపడు. భార.విరా. 1.250; 3. పరిచితమగు, మచ్చికపడు. మార్క. 3.319; శివరా. 2.102; 4. వశపడు, స్వాధీనమగు. కళా. 6.171; స.క్రి. 1. అలవాటుచేసికొను, నేర్చుకొను, అభ్యసించు. భార.శాంతి. 5.254; 2. అనుభవించు. భార.అను. 4.304; 3. మోహించు, వలచు. భాస్కరా. యు. 2.685; 4. ఆశ్రయించు. హరి. ఉ. 5.51; 5. ఆశించు, అపేక్షించు. భీమ. 4.8. 6. చవిగొను, రుచిచూచు. కాశీ. 6.55.

మరక్కాల్పుకూన వి. ముదరగాలి నల్లబడినకూన. **మరగించు** రూ. మరిగించు. స.క్రి. 1. మోనగించు. కు సం. 8.145; 2. మప్పు. హరి.పూ. 1.134; 3. ఆసగొల్పు, అభిలషింపచేయు. రం.రా.ఉ. 42పు. 4పం.; 4. అనువర్తింపచేయు. గౌ.హరి.పూ. 1884 పం.; 5. అలవర్చు. కళ. 2.151; 6. పరిచితం కావించు. శుక. 2.101; 7. మంగచేయు. <మరగు[1] + -ఇంచు[3]. **మరపించు** స.క్రి. మరిచిపోయేటట్లుచేయు. **మరపు** రూ. మరుపు[1]. స.క్రి. 1. మప్పు. భార.అను. 5.421; 2. ఆసగొల్పు, అభిలషింపచేయు. భాస్క.రా.సుం. 194, రం.రా.బాల. 13పు. 15పం.; 3. వశపరుచు. వరాహ. 4.75, కళాశాస్త్రం. 1.3; 4. మరగచేయు; 5. కొడెను పనికి అలవాటుచేయు. **మరిగించు** రూ.చూ. మరగించు. స.క్రి. 1. మరగచేయు, అలవరచు. కాశీ. 5.235; 2. ఆసగొల్పు, అభిలషింపచేయు; 3. అనువర్తింపచేయు; 4. మప్పు; 5. పరిచితం కావించు.

**మరగు**[2] రూ.చూ. మఱుఁగు. అ.క్రి. చారు, నీళ్ళు మొ.వి ఎక్కువగా కాగు.

**మరగుజ్జు** రూ.చూ. మఱుగుజ్జు. విణ. 1. గూనివాడు; 2. పొట్టివాడు.

**మరచాలు** చూ. మఱు[1]. రూ. మర్సాలు. వి. మూడోసారి దున్నటం, ఇరచాలు తర్వాతది. కొన్నిచోట్ల రెండోసారి దున్నటం.

**మరతబుచేయు** చూ.చూ. మర్తబుచేయు. స.క్రి. 1. విడుదల చేయు; 2. ప్రారంభం చేయు; 3. పరిష్కారం చేయు.

**మరదాము** చూ. మర. వి. చెట్లుకాసే రెండవ కారుకాపు, గైరంగం.

సం. ధామన్. స్థానం.

**మరన్ని** చూ. మరి[1].

**మరపదుత్త** రూ.చూ. మరవదుత్త. వి. మరవమాదిరి ఉండే దుత్త.

**మరపా** వి. డోలు. పద్మ.యు. 272.

ఉ. మరఫా. డోలు; పార. మర్ఫా. డోలు, వాద్యవిశేషం.

<ఉ. మర్ఫా.

**మరపించు** చూ. మరగు[1].

**మరపు** చూ. మరగు[1].

**మరమత్తు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయించటం.

**మరమరాలు** రూ.చూ. మొరమొరాలు. వి.బ.వ. బొరుగులు.

**మరము** రూ. మరుము. వి. 1. చేట; 2. గట్టి రాతి పొరునేల.

**మరమ్మతు** రూ. చూ. మరహంమతు. వి. భూమి మొ. వాటిని బాగుచేయటం.

**మరమ్మత్తు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయటం.

**మరమ్మదు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయటం.

**మరల** చూ. మరలు[2].

**మరలఁబడు** చూ. మరలు[2].

**మరలఁబాటు** చూ. మరలు[2].

**మరలఁబాటుతనము** చూ. మరలు[2].

**మరలించు** చూ. మరలు[2].

**మరలు**[2] రూ. మర్లు[1], మఱలు, మళ్లు. అ.క్రి. 1. వెనుకకు పోవు, పోవు. భార.ఆది. 8.288, భార.విరా. 4.57; 2. వెనుకకుతిరుగు. కు.సం. 11.131; 3. చల్లారు, శాంతించు. భార.ఉద్యో. 4.307; 4. తిరిగివచ్చు, తిరుగు. హరి.పూ. 9.159; 5. విముఖమగు. శుచే. 1.58; 6. తిరుగు, సుడివడు. సారంగ. 3.232.

క. మరల్, మరళ్, మలర్. వెనక్కితిరుగు, మరలు, మరలివచ్చు, మరలమరల సంభవించు, మరలచేయు, మరల్పు, మరవిసు. వెనక్కితిరుగు, అభిముఖమగు, తిరిగివచ్చు; తు. మరంకణె, మరకణె. వెనుక, తలకిందుల, మరళిక్కె. (తలుపు మొ. తెరగటానికి వేసే) కీలు; త. మఱంకు. దిగ్భ్రమచెందు, తడబాటు, కంగారుపడు, మఱమ్. దిగ్భ్రమ, తడబాటు, మఱి(-మ్-, న్ఱ్-). తలకిందులగు, మరలు, వెనక్కితిరుగు, కిందపడు, వంగు (కెరటంవలె) పైకిలేచు, పైకి కిందకి నడుచు, చుట్టుతిరుగు, పునరావృత్తమగు, మఱి-తరల్. తిరిగివచ్చు, వెనక్కిమరలు, మఱివి. తిరిగివచ్చు, మఱుక్కమ్. తిరుగు, చంచలత్వం, బాధ, దుఃఖం, మఱుకు(మఱుకి-). తిరుగు, తరచు తిరుగు, కంగారుపడు, తడబడు, చంచలమగు, మఱుకలి(-ప్ప్-ఙ్ట్-), మక్కళి(-ప్ప్-, -ఙ్ట్-), పునరావృత్తమగు, తిరగబెట్టు (వ్యాధివలె); మ. మఱి. మలుపు. కొత్తప్రారంభం, మూల, గుండ్రంగా తిరుగు. లోపలలోపలే తిరుగు, మఱియుక. వెనక్కితిరుగు, మగలు, దొర్లు. మఱిచ్చల్. తిరుగు, మరలు, కాళ్ళుపైకి

తల కిందకి పెట్టు, దొర్లు, తల కిందలగు, మఱవు. మార్పు. మఱిక్క. మార్పు, మఱిక్క. తలకిందలగు, వెనక్కతిరుగు, మఱుకుక. గిజగిజలాడు, దొర్లు; కో. మయ్ర్-(మర్చ్-). (చెట్టు) పడు, వేళ్ళతో పెకలించు' మర్ణ్(మర్ట్-). దొర్లు, ఒకదానివెనుక ఒకటి తిరుగు, మర్ట్-(మర్ఠి-). పడగొట్టు, చెడగొట్టు; తొ. మఱి-. (మఱ్స్-). (చెట్టు గోడ మొ. వాటి మీదనుంచి పడు, (పళ్ళు మొ.) ఊడిపడు, (కొమ్మ) విరుగు; గోం. మార్క్. తల వెనక్కి తిప్పి చూచు. పో.చూ. త. మఱు.

మూ.ఉ.ద్రా. మరియు. మూ.మ.ద్రా. మత్.

మూ.ద.ద్రా. *మత్.అర్. ఒకటి విడిచి ఒకటి.

**మరల** రూ. మ్రల, మళ్ళా, మళ్ళీ. అవ్య.ద్రు, పునరర్థకం నిర్వ. రా. 5.9, భార. భీష్మ. 2.8. <మరలు[2]+-అ[7]. **మరలఁబడు** అ.క్రి. 1. నివర్తిల్లు, వెనుకకు తిరుగు, విముఖుడగు. భార. ఉద్యో. 1.317; 2. మారుపడు. కాశ. 2.10. <మరలు[2]+-అ[7]+పడు. **మరలఁబాటు** రూ. మరలుఁబాటు. వి. మరలబడుట, తిరుగుబాటు. <మరలు[2]+-అ[7]+పాటు. **మరలఁబాటుతనము** వి. ప్రతిఘటన. రంగా. చ. 2.171. **మరలించు** స.క్రి. మరలునట్లుచేయు, వెనుకకు తిరిగేటట్లు చేయు. భార. ద్రోణ. 5.299. <మరలు[2]+-ఇంచు[3]. **మరలుచు** రూ. మరల్చు. స.క్రి. 1. విముఖం కావించు. భార. విరా. 2.41; 2. మరలచేయు, నివర్తింపచేయు. భార. ద్రోణ. 4.113. **మరల్చు** రూ.చూ. మరలుచు. స.క్రి. విముఖం కావించు. భార. విరా. 3.220.

**మరల్చు** చూ. మరలు[2].

**మరవ[1]** రూ.చూ. మడవ[2]. వి. 1. వాననీళ్ళకు పొలంలో మట్టి కొట్టుకు పోకుండా పొలం గట్టు చివరకట్టిన రాతికట్ట; 2. నీళ్ళకు వాడే చిన్నదుత్త; 3. చెన్నకుండ; 4. చెరువు అలుగు, చెరువులో నీరునిండి ప్రవహించటం; 5. కోడి. చెరువులో ఎక్కువైన నీళ్ళుపొర్లిపోవడానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరచిన రాతికట్టడం.

**మరవదుత్త** రూ. మరగదుత్త, మరపదుత్త వి. మరవమాదిరి ఉండేదుత్త, పొలం దగ్గరికి నీళ్ళు తీసుకు పోవడానికి ఉపయోగించే కుండ. **మరవముంత** వి. పాలుపిండుకోడానికి వాడే పెద్దముంత.

**మరవ[2]** వి. ఒకజాతి మనుష్యుడు. శేష. 3.87.

**మరవలి** వి. మనుగుడుపు.

**మరవలు** వి.బ.వ. చూ. మొరం[2]. వయస్సు చెల్లినవారికి నరాల నుండి కాళ్ళకు దిగే నీటిచారలు.

**మరవాయి** చూ. మఱు[1]. వి. మూడోసారి దున్నటం.

**మరస** రూ.చూ. మొరసు. వి. 1. మొరం, గులకరాయి; 2. కాపుల్లో ఒకతెగ. విణ. వెలాటు.

**మర్హమ్మతు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయించటం.

**మరహంమతు** రూ. మరమత్తు, మరమ్మతు, మరమ్మత్తు, మరమ్మదు, మరహమ్మతు, మరహింమతు, మరామత్, మరామతు, మరామత్తు. వి. బాగుచేయటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 765, 38, క్రీ.శ. 1678.

మరా. మరామత్. మంచిస్థితి, బాగుచేయటం; ఉ. మరమ్మత్. బాగుచేయటం; పార. మరమ్మత్. ఇంటిని బాగుచేయటం; అర. మరమ్మత్.

క. మరామత్, మరాహమ్మత్. రహదార్లు బాగుచేయటం.

<ఉ. మరమ్మత్.

**మరహింమతు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయడం, రిపేరు.

**మరాట్** రూ.చూ. మలాటు. వి. రాతిపనివాళ్ళు వాడేపెద్ద సుత్తి.

**మరాట** వి. మహారాష్ట్ర దేశస్థుడు.

సం. మహారాష్ట్ర-. ఒకరాష్ట్రం, మహారాష్ట్రీయులు; ప్రా. మరహట్ఠ-; హిం. మర్హట్టా; సిం. మహరటు-; గు. మరాఠ్; మరా. మరాఠా.

<మరా. మరాఠా.

**మరాటము** వి. వృక్షవిశేషం, లాంగవి.

**మరాటి** రూ. మరాటీ, మహరటీ. వి. 1. మహారాష్ట్రదేశీయుడు; 2. మహరాష్ట్రంలోనిభాష; 3. జాతుల్లో వాడే మషాల దినుసు.

ప్రా. మహారాష్ట్రిన్-. మరాటివాడు, మరహట్ఠీ. మరాఠీభాష, ఆరెవాడు, శౌ. జై. మహా. అ.మాగ. అప. మరాఠ. ఆరెవాడు, మరాటి. మహారాష్ట్రి; మరా. మరాఠీ;

క. మరాట. ఆరెవాడు, మరాటి. మహారాష్ట్రసంబంధి, తు. మరాటిగె.

<మరా. మరాఠీ.

**మరాటితీగ** వి. ఒకరకం తీగ (Spilanthus ameua). **మరాటిద్రావకం** రూ. మరాటీద్రావకం. వి. అద్దకం రంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం, గంధకి కామ్లం. **మరాటిమొగ్గ** వి. 1. కూరల్లో మషాలకు ఉపయోగపడే మొగ్గల్ని ఇచ్చేతీగ (Illicium anisatum); 2. వంటల్లోవాడే మసాలా దినుసు. **మరాటివాఁడు** విణ. మహారాష్ట్రదేశస్థుడు.

**మరాటీ** రూ.చూ. మరాటి. వి. 1. మహారాష్ట్రదేశస్థుడు; 2. మరాటీభాష; 3. ఒకరకం మసాల దినుసు.

**మరాటీద్రావకం** రూ.చూ. మరాటిద్రావకం. వి. అద్దకం రంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం, గంధకి కామ్లం.

**మరాతబు** రూ.చూ. మరాతీబు. వి. పదవి, ఆడంబరం.

**మరాతీబు** రూ. మరాతబు. వి. పదవి. ఆడంబరం.

హిం. మరాతిబ్. పదవి, దర్జా; మరా. మరాతిబ్. పదవి, దర్జా; ఉ. మరాతిబ్. వర్గాలు; అర. మరాతిబ్. పదవులు, ఆడంబరాలు, శ్రేణులు.

<ఉ. మరాతిబ్.

**మరామత్** రూ. చూ. మరహంమతు. వి. బాగుచేయడం, రిపేరు.

**మరామతు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయించటం,

**మరామత్తు** రూ.చూ. మరహంమతు. వి. బాగుచేయించటం.

**మరామళ్ల** రూ.చూ. మఱామ్రుళ్లు. వి.బ.వ. చిక్కులు.

**మరాముళ్ల** రూ. మరామళ్ల. వి.బ.వ. చిక్కులు.

**మరామేకు** రూ.చూ. మరమేకు. వి. **1**. అసాధ్యుడు ; **2**. తిరుగుడు చీల.

**మరాసు** చూ. మర.

**మరాసుఇసురు** చూ. మర.

**మరాసుగొయ్య** చూ. మర.

**మరాసువిసురు** చూ. మర.

**మరి**[1] రూ.చూ. మఱి[1]. వి. **1**. తడవ, పర్యాయం. భార. విరా. 1.71 ; **2**. వాక్యాలంకారం. భార. అను, 5.109.

**మరన్ని** విశ. ఎక్కువ. < మరి[1] + అన్ని. **మరిగ**[1] అవ్య.ద్రు. ఏకకాలంలో. **మరిగన్ని** రూ. చూ. మరిన్ని. విశ. ఎక్కువ. **మరిన్ని** రూ. మరిగన్ని. విశ. **1**. మరి కొంచెం ; **2**. ఎక్కువ. < మరి[1] + ఇన్ని. **మరిమరి** రూ.చూ, మఱిమ్మఱి. అవ్య. మిక్కిలి, అత్యంతం. **మరియు** రూ.చూ. మఱియు. అవ్య. ద్రు. **1**. ఇంకా ; **2**. తిరిగి.

**మరి**[2] వి. కొండజీవలగ్గు (Caryota urens).

**మరిగ**[2] రూ. మరిగి, మరిగె. వి. రాతిచిప్ప. భాగ. 3.829.

**మరిగ్రలాయి** వి. చిన్నమట్టిగిన్నెల్ని సర్సేరాయి.

**మరిగి** రూ.చూ. మరిగ[2]. వి. చిన్నమూతి ఉండే చిన్నమట్టి పాత్ర.

**మరిగించు** చూ. మరుగు[2].

**మరిగె** రూ.చూ. మరిగ[2]. వి. చిన్నమూతి ఉండే చిన్నమట్టి పాత్ర.

**మరిగొమ్ము** రూ. చూ. మరగొమ్ము. వి. చెరువు మొ. వాటి లోని నీళ్ళు బైటికి పోవటం కోసం రాళ్ళతో కట్టినమార్గం, చెరువు తూము, కలుజు.

**మరిడమ్మ** చూ. మరిడి.

**మరిడి** వి. అమ్మవారు.

**మరిడమ్మ** వి. కలరా. <మరిడి + అమ్మ. **మరిడివ్యాధి** వి. కలరాజాడ్యం, వాంతి, భేదిరోగం. **మరిడిమహలక్ష్మి** వి. ఒకదేవత. సం. మహాలక్ష్మీ, విష్ణుమూర్తి భార్య, లక్ష్మీదేవి.

**మరిపిచ్చులాక** వి. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద.

**మరిపేట** చూ. మఱు. వి. ఉదయం తినే చలిది అన్నానికి మధ్యాహ్నం అన్నానికి మధ్యతినే తిండి.

**మరిము** వి. **1**. చెరువుతూము ; **2**. నూతిగోడ.

**మరిమెడ** రూ.చూ. మలిమిడి. వి. పశువుల గిట్టలదగ్గరవాపు, కాలికుంటు.

**మరియమ్మ** వి. ఏసుక్రీస్తు తల్లి, మేరీమాత.

లా. *Maria*.

<లా. Maria + అమ్మ.

**మరియాద** వి. **1**. న్యాయబుద్ధి. ముఖలింగశాసనం. క్రీ.శ. 8వ శతాబ్ది. భార. విరా. 1.122 ; **2**. మేర. హద్దు, కట్టుబాటు, మర్యాద.

సం. మర్యాదా. మేర, హద్దు ; ప్రా. మజ్జాయా. అ.మాగ. మజ్జాయా. పా. మరియాదా.

క. మరియాదె ; కొడ. మరిఆది ; బ్రా. మయార్.

<సం. మర్యాదా (విప్రకర్ష).

**మరివేలు** వి. పెళ్ళికాగానే వధూవరులు అత్తవారింటికి వెళ్ళే సాంప్రదాయక ప్రయాణం, వరుని ఇంట పెళ్ళిఅయితే వధువు ఇంటికి, వధువు ఇంట పెళ్ళిఅయితే వరుని ఇంటికి పోయే ప్రయాణం.

**మరీనా** వి. మెత్తని ఉన్నితో కుట్టబడిన గుడ్డ.

హిం.ఉ. మరీనా. ఉన్నితో నేసిన మెత్తనిగుడ్డ.

<ఉ. మరీనా.

**మరీఫత్** రూ.చూ. మారీఫత్తు. అవ్య. ద్వారా.

**మరీబత్తు** రూ.చూ. మారీఫత్తు. అవ్య. ద్వారా.

**మరు** రూ.చూ. మఱు. విశ, సమాసంలో మారుశబ్దానికి ఆదేశ రూపం. **1**. మారు ; **2**. రెండో.

**మరుకలుపు** రూ.చూ. మరుకలుపు. వి. మొక్క పొట్ట కరుకు వచ్చిన తర్వాత తీసే కలుపు. **మరునాటిచవులు** వి.బ.వ. తర్వాతి రోజుకు సంబంధించిన రుచులు. తాళ్ల. సం. 8.206. **మరునటి** విశ. **1**. పిమ్మటి ; **2**. రెండో.

**మరుగు**[1] రూ. మరగు[1], మర్గు. అ.క్రి. **1**. ఆసగొను, ఆసక్తమగు. కు.సం. 5.123 ; **2**. పరిచితమగు, మచ్చికపడు. కు.సం. 7.146 ; **3**. అలవాటుపడు ; **4**. వశపడు, స్వాధీనమగు ; స.క్రి. **1**. అలవాటు చేసికొను, నేర్చుకొను, అభ్యసించు. కు.సం. 6.89 ; **2**. ఆశ్రయించు. కు.సం. 7.121 ; **3**. మోహించు, వలచు. భోజ. 4.230 ; **4**. అనుభవించు ; **5**. ఆశించు, అపేక్షించు ; **6**. చవిగొను, రుచిచూచు.

క. మర్చు, మచ్చు. ఇష్టపడు, మిక్కిలి అభినివేశం, మెర్చు. బంధం, మచ్చు. భ్రాంతి. భ్రమ, మెచ్చికె, మచ్చికె. ఇష్టం, ప్రేమ ; తు. మర్చుని. స్వాధీనమైన, వశమైన, ఆకర్షించు, మర్క. బడలిక, త. మరువు. సంప్రదాయంగా పుట్టు, దరిజేరు, కౌగలించుకొను, మచ్చికగు ; మ. మరువుక. ప్రసిద్ధిచెందు, మరణ్ణుక, మెరుణ్ణుక, వశమగు, స్వాధీనమగు, అలవర్చుకొను ; గోం. మరీస్. తరచుచూచు, మళ్ళామళ్ళా వచ్చు. కుఇ. ఌయస్ప. నేర్చు, అభ్యసించు, కువి. ఌయహ్. అభ్యసించు, మచ్చికచేయు, లొంగదీయు, ఌమిహ్. అలవర్చుకొను ; పర్జి. మెర్చిప్ (మెర్చిత్-) నేర్చు, మెర్. నేర్చుకొను ; కురు. మర్ (మండె-, మర్-). ఎంచుకొను, ఒకచోట ఉంచు ; మాల్తో. మర్. కోరిక, ఇష్టం, ప్రేమ.

<మూ.ద్రా. *మార్ ; *మర్-వ్-.

**మరుపు**[1] రూ.చూ. మరపు. స.క్రి. **1**. మప్పు ; **2**. అలవరుచు ; **3**. ఆసగొల్పు, అభిలషింపచేయు ; **4**. వశపరుచు ; **5**. మరగచేయు.

**మరుగు**[2] రూ.చూ. మఱుఁగు. అ.క్రి. నీళ్ళు మొ.వి ఎక్కువగా కాగు, మరుగు.

**మరిగించు** స.క్రి. కాచు.

**మరుగు**[3] రూ.చూ. మడవ[2]. వి. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లి పోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరచిన రాతి కట్టడం.

**మరుగుబల్ల** వి. అలుగు, తూముకు అడ్డంవేసే చెక్క.

**మరుగుజ్జు** రూ.చూ. మఱుగుజ్జు. విశ. **1**. గూనివాడు ; **2**. పొట్టివాడు.

మరుగుదొడ్డి రూ.చూ. మఱుఁగుదొడ్డి. వి. చాటుగాఉన్నదొడ్డి, వాకిలి, మలవిసర్జనస్థానం.
మరుగుమందు రూ.చూ. మఱుఁగుమందు. వి. స్త్రీ పురుషుని లోబరచుకోవడానికి పెట్టే మరులుమందు, మచ్చుమందు.
మరుగొంగ చూ. మరుఁడు.
మరుగొప్పు చూ. మఱు. వి. మిరప, వంగ మొ. తోటల్లో రెండో సారి కలుపు మొక్కలు తవ్వడం.
మరుగొమ్ము రూ.చూ. మరగొమ్మ. వి. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవడానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పర చిన రాతికట్టడం.
మరుచిలుకులొత్తు చూ. మరుఁడు.
మరుచివ్వ చూ. మరుఁడు.
మరుఁడు వి. మన్మథుడు. కు.సం. 5.88, శృం.నై. 2.99.

సం. స్మర--. జ్ఞప్తి, మన్మథుడు; పా. సర-; ప్రా. సర-, సుమర-. మన్మథుడు.

<సం. స్మర-.

మరుగొంగ వి. శివుడు. ఉ.రా. 1.80. మరుచిలుకులొత్తు అ.క్రి. దంతక్షతాలు చేయు. తాళ్ల.సం. 12.158. మరుచివ్వ వి. రతి, మరుపోరు. మరుతల్లి వి. మన్మథుని తల్లి, లక్ష్మి. సాంబ. దేవ. 6. మరుతేజి వి. చిలుక, మన్మథుని వాహనం. మరుతేరు రూ. మరునితేరు. వి. మన్మథునిరథం, చిలక. తాళ్ల.సం. 5.249. మరుదేవేరి రూ. మరునిదేవేరి. వి. రతి దేవి, మారపత్ని. యయా. 4.92. మరునయ్య(-అయ్య) వి. విష్ణువు, మన్మథుని తండ్రి. నీలా. 2.72. మరునయ్యతేజి వి. గరుడుడు, విష్ణువు వాహనం. మరునల్లె వి. తుమ్మెద, మన్మ థుని అల్లెతాడు. మరునిడాలు వి. 1. చేప; 2. మొసలి. వ్యు. మన్మథుని జెండా. మరునితేరు రూ.చూ. మరుతేరు. వి. చిలక. మరునిదేవేరి రూ.చూ. మరుదేవేరి. వి. రతిదేవి. మరునిల్లు(-ఇల్లు) వి. బొ. ఆడు గురి, మదనగృహం. కాళ. 3.10. మరునిసూఁడు వి. శివుడు, మన్మథుని విరోధి. మరుపని వి. సురతం, మన్మథ కార్యం. ఆము. 4.123. మరుపిచ్చి వి. మన్మథావేశం. కామోద్రేకం. వేంక. పంచ. 4.510. మరుపోరు వి.బొ. సురతం, మన్మథ యుద్ధం. చంద్రికా. 4.3. మరుమామ వి. చంద్రుడు, మన్మథుని మామ. సాంబ. దేవ. 10. మరుమావు వి. చిలక, మన్మథుని వాహనం. యయా. 4.25. మరురాణి వి. రతీదేవి, మన్మథుని రాణి (భార్య). మరుసాము వి. మన్మథక్రీడ. తాళ్ల.సం. 14.125.

మరుతల్లి చూ. మరుఁడు.
మరుతేజి చూ. మరుఁడు.
మరుతేరు చూ. మరుఁడు.
మరుదేవేరి చూ. మరుఁడు.
మరున్ వి. ఎరుపు, పయిలెటు రంగులు కలిసినట్టుండే ఒకరకం ముదురు రంగు.

ఇం. *Maroon*. ఒకరకం రంగు.

<ఇం. Maroon.

మరునయ్య చూ. మరుఁడు.
మరునయ్యతేజి చూ. మరుఁడు.
మరునల్లె చూ. మరుఁడు.
మరునాగి రూ. మర్నాగి. వి. 1. చెరువులకు బుంగలు పుచ్చే ఒక జంతువు; 2. మొసగాడు.
మరునాడు రూ.చూ. మఱునాఁడు. వి. 1. ఆవల ఎల్లుండి; 2. మరుసటి రోజు; 3. ఎల్లుండి.
మరునిడాలు చూ. మరుఁడు.
మరునితేరు చూ. మరుఁడు.
మరునిదేవేరి చూ. మరుఁడు.
మరునిల్లు చూ. మరుఁడు.
మరునిసూఁడు చూ. మరుఁడు.
మరుపని చూ. మరుఁడు.
మరుపిచ్చి చూ. మరుఁడు.
మరుపు[1] చూ. మరుగు[1].
మరుపు[2] రూ.చూ. మఱపు. వి. మరచిపోవటం.

మరుపెట్టు స.క్రి. సంతోషపెట్టు. తాళ్ల.సం. 5.186.

మరుపెట్టు చూ. మరుపు[2].
మరుపోరు చూ. మరుఁడు.
మరుమామ చూ. మరుఁడు.
మరుమావు చూ. మరుఁడు.
మరుము రూ.చూ. మరము. వి. 1. చేట; 2. గట్టిరాతిపొరు నేల.
మరురాణి చూ. మరుఁడు.
మరులమందు చూ. మరులు.
మరులు రూ. మర్లు[2]. వి. 1. అజ్ఞానం. కు.సం. 2.29; 2. మోహం, వలపు, ప్రేమ, అత్యధిక ప్రేమ. కు.సం. 4.42; 3. పిశాచం, దయ్యం. కు.సం. 7.38; 4. పిచ్చి, ఉన్మాదం. చెన్నబసవ. 2.51.

క. మరళి, మరుళి. మూర్ఖునిలా నటించేవాడు; మరుళ. మూర్ఖుడు, మర్లు. పిచ్చి; తు. మర్లు. పిచ్చి; త. మరుళి. మతిభ్రమ. మరుళ్. పిశాచం, దయ్యం.

మరులమందు వి. స్త్రీ పురుషుని లోబరచుకోవడానికి పెట్టే మందు. మరులుకొను రూ.చూ. మరులుగొను. అ.క్రి. 1. ఉన్మత్తుడగు, పిచ్చివాడగు. ఇందు. 2.219; 2. వలపు చెందు, మోహంపొందు. దశా. 2.318; 3. ఆసపడు, ఆసక్తుడగు. సీతారా. 3.111. మరులుకొలుపు రూ. చూ. మరులుగొలుపు. స.క్రి. మోహింపచేయు, మోహపెట్టు, వల పింపచేయు. వరాహ. 4.15. మరులుకొల్పు రూ.చూ. మరులు గొలుపు. స.క్రి. మోహింపచేయు, మోహపెట్టు, వలపింపచేయు. ఆము. 2.21. మరులుగొను(-కొను) రూ. మరులుకొను, మరుల్కొను, మర్లుకొను. అ.క్రి. 1. వలపు చెందు, మోహంపొందు. వరాహ. 3.128; 2. ఆసపడు, ఆసక్తుడగు; 3. ఉన్మత్తుడగు, పిచ్చివాడగు. క. మరసు. భయంకరమగు; తు. మర్లావుని. చెరుపు, మర్లుని. అల్లరి చేయు; త. మరుళ్(-ళ్వ్-, -వ్). భయపడు; మ. మరెళుక. భయపడు. మరులుగొలుపు రూ. మరులుకొలుపు. మరులుకొల్పు, మరులుగొల్పు, మరుల్కొలుపు, మరు ల్కొల్పు, మరుల్గొలుపు, మరుల్గొల్పు. స.క్రి. మోహింప

చేయు, మోహపెట్టు, వలపింపచేయు. శృం.నై. 3.90. **మరులుగొల్పు** రూ.చూ. మరులుగొలుపు. స.క్రి. మోహింపచేయు, మోహపెట్టు, వలపింపచేయు. నీలా. 3.41. **మరులు జడ** రూ. మర్లుజడ. వి. 1. ఉన్మాదాన్ని పుట్టించే జడ. పి.శకు. 3.201 ; 2. మరులుతీగ. **మరులుఁడీఁగ(-తీఁగ)** వి. తొక్కిన వెంటనే అజ్ఞానం పుట్టించే ఒకానొక ఔషధం, భూతకేశం. ఆము. 6.12. **మరులుమాతంగి** రూ.చూ. మర్లు మాతంగి. వి. మర్లు తీగ, మదనం. **మరులుమ్మెత(-ఉమ్మెత)** వి. మదనం. ఆం.భా. 2.53. **మరులుఱేఁడు** వి. పిశాచ వల్లభుడు. ఉ. హరి. 2.141. **మరులెత్తు** అ.క్రి. మరులు, కలుగు. <మరులు + ఎత్తు[1]. **మరుల్కొను** రూ.చూ. మరులుగొను. అ.క్రి. మోహపడు, వలపుచెందు. విప్ర. 2.72. **మరుల్కొలుపు** రూ.చూ. మరులుగొలుపు. స.క్రి. మరులు కొల్పు, వలపించు, ఆసక్తి నొందించు. చంపూ.రా. 2.99. **మరుల్కొల్పు** రూ.చూ. మరులుగొలుపు. స.క్రి. మరులు కొల్పు, వలపించు, ఆసక్తి నొందించు. విప్ర. 3.19. **మరుల్గొలుపు** రూ. మరులుగొలుపు. స.క్రి. మరులుకొల్పు, వలపించు, ఆసక్తి నొందించు. కళా. 2.142. **మరుల్గొల్పు** రూ.చూ. మరులుగొలుపు. స.క్రి. మరులుకొల్పు, వలపించు, ఆసక్తి నొందించు.

**మరులుఁబొటు** రూ.చూ. మరలఁబొటు. వి. తిరుగుదల.

**మరులెత్తు** చూ. మరులు.

**మరుల్కొను** చూ. మరులు.

**మరుల్కొలుపు** చూ. మరులు.

**మరుల్కొల్పు** చూ. మరులు.

**మరుల్గొలుపు** చూ. మరులు.

**మరుల్గొల్పు** చూ. మరులు.

**మరువడు** చూ. మఱుఁగు. రూ. మఱుపడు, మఱువడు. అ.క్రి. చాటగు, తిరోహితమగు, దాగు. భార. ఉద్యో. 4.372.

**మరువనిచాయ** రూ. మరువనిసాయ. వి. చాక్లెట్టు రంగులో నలుపువన్నె కలిసినరంగు.

**మరువనిసాయ** రూ. చూ. మరువనిచాయ. వి. చాక్లెట్టు రంగులో నలుపువన్నె కలిసినరంగు.

**మరువము** రూ. మర్మం. వి. సువాసనగల ఒకజాతిమొక్క. విక్ర. 1.191.

సం. మరువక-. సువాసనగల చిన్నచెట్టు; ప్రా. మరుఅఅ-, మరుఅగు-; అ.మాగ. మరుయ-, మరుయగ-; పా. మరుంబ-, మరువా;

క. మరగ, మరుగ, మరువ.

<సం. మరువక-.

**మరువంపు మొలకలు** రూ. మరువంపు మొల్కలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. **మరువంపుమొల్కలు** రూ.చూ. మరువంపు మొలకలు. వి.బ.వ. ధాన్యవిశేషం.

**మరువంపు మొలకలు** చూ. మరువము.

**మరువంపు మొల్కలు** చూ. మరువము.

**మరువలు** వి.బ.వ. పశురోగ విశేషం. నవనాథ. 1.27 పు. 16 పం.

**మరుసాము** చూ. మరుఁడు.

**మరుసు** వి. ఇసకనేల మధ్య పేరుకొని ఉండే జిగటమట్టి.

సం. మరుస్థల-. మరుభూమి ; హిం. మరుస్థల్.

**మర్కడము** వి. మల విసర్జనం. బసవ. 6 పు. 394 పం.

**మర్కారి** వి. పడవ నడిపించేవాడు.

**మర్గించు** చూ. మ్రగ్గు. రూ. మగ్గించు, మ్రక్కించు, మ్రగ్గించు, స.క్రి. నశింపచేయు (వర్ణ వ్యత్యయం). కు.సం. 11.34.

**మర్గు** రూ.చూ. మరుగు. అ క్రి. ఆసక్తమగు, ఆసగొను. పద్మ. 9.157.

**మర్చు** రూ.చూ. మఱచు. స.క్రి. విస్మరించు, మరచిపోవు. దశా. 7.158.

**మర్జి** రూ.చూ. మర్జీ. వి. ఇచ్ఛ, కోరిక.

**మర్జీ** రూ. మర్జి. వి. ఆజ్ఞ, కోరిక. పద్మ. యు. 143.

హిం. మర్ జీ కోరిక ; మరా. మర్జీ ; ఉ. మర్జీ. ఇచ్ఛ, ఆజ్ఞ; పార. మర్జీ. కోరిక, అంగీకారమయిన; అర. మర్ జీ. ఇచ్ఛ, స్వీకృతం, ఆదేశం.

<ఉ. మర్జీ.

**మర్జు** వి. ఉపవనం.

హిం. మర్ జ్. ఉపవనం ; ఉ. మర్ జ్. వ్యవసాయానికి తగిన భూమి, ఉద్యానవనం ; పార, మర్ జ్.

<ఉ. మర్ జ్.

**మర్తపుచేయు** రూ.చూ. మర్తబుచేయు. అ.క్రి. 1. విడుదల చేయు ; 2. ప్రారంభంచేయు ; 3. పరిష్కారంచేయు.

**మర్తబాన్** రూ.చూ. మడతమాను. వి. కొన్ని రంగులు, ద్రావకాలు పోసే జాడి.

**మర్తబు** రూ. మర్తరబు. వి. వర్గం ; విణ. పూర్తయిన.

హిం. మర్ తద్. వర్గం, శ్రేణి ; ఉ. మర్ తబహ్ ; పార. మర్ తబహ్, మర్ తబ్. అంతస్తు, శ్రేణి ; అర. మర్ తబహ్. వర్గం, శ్రేణి.

<ఉ. మర్ తబహ్.

**మర్తబుచేయు** రూ. మరతబుచేయు, మర్తపుచేయు. అ.క్రి. 1. విడుదలచేయు ; 2. ప్రారంభంచేయు ; 3. పరిష్కారం చేయు.

**మర్తరబు** రూ.చూ. మర్తబు. వి. వర్గం ; విణ. పూర్తయిన.

**మర్తుమాన్** రూ.చూ. మడతమాను. వి. ద్రావకాలు, రంగులు, ద్రావకాలు పోసే జాడి.

**మర్తురు** రూ. చూ. మఱుస్తుఱు. వి. భూపరిమాణ విశేషం. ద. హిం. శా. సంపు. 4. శా.సం. 685.

**మర్తువాను** రూ.చూ. మడతమాను. వి. పచ్చళ్ళు, ఊరగాయలు పెట్టుకోడానికి వాడే పాత్ర.

**మర్దాము** రూ.చూ. మరదాము. వి. మరల కొత్తగా నాటకుండా పాత మొక్కలనుంచి మొలిచిన కరలు.

**మర్నాగి** రూ.చూ. మరునాగి. వి. 1. చెరువులకు బుంగలు పుచ్చే ఒక జంతువు ; 2. మోసగాడు.

**మర్నాటు** రూ.చూ. మఱునాఁడు. వి. 1. ఎల్లుండి తర్వాత రోజు ; 2. ఎల్లుండి ; 3. రేపు.

**మర్నాడి** చూ. మర.

**మర్నాఁడు** రూ.చూ. మఱునాఁడు. వి. పరదినం, మరుసటి దినం. రం. రా. అయోధ్యా. 120పు. 20పం.

మర్నాలు చూ. మర.
మర్మం రూ.చూ. మరువము. వి. మరువకం, మరువం అని పిలవబడే సువాసనగల మొక్క. (Marjorana hortensis).
మర్మతి వి. చిన్న కొమ్మలు కలిగి ముదురు ఎరుపురంగుపూలు, లేతపసుపురంగు గల గట్టి కలపనిచ్చే చెట్టు (Acacia campbellii).
మర్యాద వి. 1. వ్యవహారాను కార్యాలగు సుంకాలు. E.I. 6.23 ; 2. గౌరవం.
<సం. మర్యాదా. సరిహద్దు, ఒడ్డు ; ప్రా. మజ్జా, మజ్జాయా. మేరా, హద్దు, మరియాదా. హద్దు, ఒడ్డు, లంగరు.
<సం. మర్యాదా (అర్థవిపరి.).
మ్ర విణ. సారవంతమయిన.
మ్రచవుడు వి. నల్లచవుడు, రేగడికలిసిన చవిటినేల. మ్రిరేగడి రూ. మ్రేగడి. 1. గరుకుగా ఉండేరేగడి ; 2. గరుకుగా ఉండేరేగడి,సారవంతమైన రేగడినేల. మ్రేగడి రూ.చూ. మ్రిరేగడి. వి. 1. గరుకుగా ; ఉండేరేగడి, 2. సారవంతమైన ఎఱ్ఱరేగడి నేల. <మ్ర + రేగడి.
మ్రి రూ.చూ. మఱ్ఱి. వి. చాలా విశాలంగా పెరిగే మహా వృక్షం, వటవృక్షం (Ficus bengalensis).
మ్రిగడ్డి వి. ఒకరకమైనగడ్డి. మ్రిమాను వి. మ్రిచెట్టు. NICP. 8. క్రీ.శ. 1651. మ్రిరొడ్డ వి.మ్రిఆకులమోపు.
మ్రిరేగడి చూ.మ్రి.
మ్రేగడి చూ.మ్రి.
మ్రేయు రూ. మర్లేయు. స.క్రి. 1. నున్నగింత సలపతో రెండోసారి నునుపుచేయు ; 2. నీళ్ళుబాగా కలిసేటట్లు తిరగచేయు.
మర్లమాతంగి చూ. మర్లు².
మర్లమాతంగికంప చూ. మర్లు².
మర్లవేయు రూ.చూ. మరలవేయు. స.క్రి. పోతున్నపశువులను అడ్డగించి వేరేదారికి తోలు.
మర్లాకు చూ. మర్లు².
మర్లు¹ రూ.చూ. మరలు². అ.క్రి. మళ్ళు, వెనుకకు తిరుగు. కువ. చ. 2.29 ; వి. వైపు, పక్క. సారంగ. 2.155.
మర్లుబాము (-పాము¹) వి. మనుతిండి, ఒకరకం పాము.
మర్లు² రూ.చూ. మరులు. వి. వలపు, మోహం. దశా. 7.71.
మర్లమాతంగి రూ.చూ. మర్లుమాతంగి. వి. ముట్టిన వెంటనే మరులు పుట్టించే ఓషధి. మర్లమాతంగికంప వి. ఆముకాల్పుకు వాడే మర్లమాతంగి చెట్లకంప. మర్లాకు వి. దూడను ఒల్లని పశువులకు పెట్టే ఆకుఓషధి. <మర్లు²+ ఆకు. మర్లుకొను రూ.చూ. మరులుగొను. స.క్రి. వలచు, మోహించు. ఉ. హరి. 4.18. మర్లుజడ రూ. మరులు జడ¹. వి. 1. ఉన్మాదాన్ని పుట్టించే జడ ; 2. మరులు పుట్టించేతీగ, మర్లుమాతంగి యా. మరులుమాతంగి, మర్ల మాతంగి. వి. మర్లు తీగ, మదనం. ప్రబంధ. 640, ఆం. భా. 2.53.
మర్లేయు రూ.చూ. మ్రేయు. స.క్రి. 1. నున్నగింత సలపతో రెండోసారి నునుపుచేయు ; 2. నీళ్ళుబాగా కలిసేటట్లు తిరగవేయు.
మర్వ రూ. చూ. మడవ². వి. నీళ్ళకువాడే చిన్నదుత్త.
మర్వు రూ.చూ. మఱుఁగు. వి. చాటు, ఓలం. భాస్క. రా. యు. 1440.
మర్సాలు రూ.చూ. మరచాలు. వి. మూడోసారి దున్నటం, కొన్ని చోట్ల రెండోసారి దున్నటం.
మఱ వి. 1. మర్మం, గుట్టు. ఉ. హరి. 5.195 ; 2. భేదం, తేడా. భాగ. 5.1467 ; 3. దైన్యం. దుఃఖం.
మఱక¹ వి. పాలువిడిచిన ఆడమేకపిల్ల. సార. పంచ. 5.11.
క. మఱి. జంతుపుపిల్లలు (ఎద్దులు, ఆవులు తప్ప), చిన్న పిల్లలు, లేతకొమ్మలు ; తు. మఱి. జంతువుపిల్ల ; త. మఱి. మేకపిల్ల, గుర్రప్పిల్ల, లేడిపిల్ల, ఆడమేక, ఆడ గొర్రె, ఆడలేడి ; మ. మఱి. జంతువు పిల్లలు ; కో. మయ్ర్, జంతువు పిల్లలు (పశువులు తప్ప) ; తొ. మరి. జంతువు పక్షిపిల్లలు (ఎద్దులుతప్ప) ; గోం. మ్రి, కొడుకు ; కొండ. మే. మరి. భర్త, కొడుకు ; కుఇ. మ్రీంజు. కొడుకు, మ్రే, మ్రౌ. కూతురు ; కువి. మిరెసి. కొడుకు, మీసి. కొడుకు, మేనల్లుడు, అంద్రమీస. సేవకుడు ; బ్రా.మార్. కొడుకు, బాలుడు, మసిర్. కూతురు.
మఱక² రూ. మరక, వి. డాగు, కర్రు. రామలిం. శ. 34.
తు. మజె. సహజంగా ఉండేమచ్చ, మంజనె. ఒంటిపై ఉండే నల్లటిచారలు ; త. మఱు. మరక, డాగు, నేరం, తప్పు, మచ్చ, గుర్తు, పుట్టుమచ్చ (చంద్రునిలో). మచ్చ, కళంకం, మరై. విలువైనరాయిలో దోషం ; మ. మఱు. మచ్చ, పుట్టుమచ్చ, మొటిమ ; తొ. మస్ట్. నలుపుమచ్చ ; గోం. మ్రొ. నల్లమచ్చ, మొటిమ.
మఱకువ చూ. మఱచు.
మఱగొను చూ. మఱచు.
మఱచు రూ. మర్చు. స.క్రి. 1. విస్మరించు, తలంపకుండు. భార. ఆది. 5.53, భార. విరా. 5.357 ; 2. మాను, విడుచు. వసు. 3.110 ; అ.క్రి. ప్రమాదంనొందు, పొరపడు. భార. ఆది. 6.102.
క. మఱె, అశ్రద్ధ, మరచు, మెదడులోంచి తొలగు, అదృశ్యమగు, మరగు, చాటుమూత, నిరాకరించు, మఱగు, మఱపు, మఱవు, మఱహు. మరుగు, రహస్యం. దాపరికం, మతిమరపు, మఱవు. దాచు, మరపించు, మఱవె. స్పృహ లేక పోవడం, అశ్రద్ధ, మఱసు, మఱయిసు, మఱిసు. దాచు, మరిపించు, మఱసుహ. దాచు, మఱెయువికె. అశ్రద్ధ, మొఱె. ఆశ్రయం, అశ్రద్ధ ; కొడ. మర-. (మరప్-, మరంద్-). మరచు, మరె, కనుమరుగగు, దాగు, చాటు, మరంది, మరపు ; తు. మదపుని, మరపుని, మరెపుని. మరచు, మదపు, మరపు. మరవు, మరపెలె. మతిమరపుమనిషి, మరెపుని. మరుగు, చాటు, ఏకాంతస్థలం, మదెయుని, కనుమరుగగు, మూయు, మదె, చాటు, మరుగు, మరె. చాటు, ఏకాంతస్థలం ; త. మఱ (-ప్ప-, -న్ట్-). విస్మరించు, మరచు, తలపకుండు, విడుచు, మఱతి, మఱప్పు,

మఱల్, మఱలి, మఱవి. మరపు, మర్. (-వ్-,-న్ట్-). దాచు, అదృశ్యమగు, మూయు, రక్షించు, ఏకాంతస్థలం, వి. రహస్యం, మోసం, నిరాకరణ, మఱైప్పు. చాటు, దాపు, మరుగు, మఱైవు. అదృశ్యమగు, తెరమరుగు దాగు. మఱవు. దాచు, ఏకాంతస్థలం, మఱెక్క. దాచు, పాతిపెట్టు, మరుగు, చాటు, మఱెప్పు, మఱప్పు. రక్షణ, పరువు గలేబు, ఏకాంతస్థలం, మఱక్క. మరచు, అశ్రద్ధ, నిరాశక్తి, మఱతి, మఱవి. అశ్రద్ధ, మఱప్పిక్క, మరిపించు ; కో. మర్వ్ (మర్ద్-). మరచు, మర్- నిరాకరించు, అదృశ్యమగు, రహస్యం, ముగియు, ముగించు ; తొ. మఱ్ (మఱ్-). మరచు, మఱ్. నీడ, ఆశ్రయం, నిరాకరించు, మఱ్ఫ్. చూడలేని, వినలేనిస్థితి, అదృశ్యస్థితి ; గోం. మరేంగానా, మరుంగ్-సైన, మారంగ్. మారండ్. మర్చు, మక్కానా, తప్పించుకొను, దాక్కొను, మక్స్థానా. మక్స్థూనా. దాచు, మకానా దాచు ; కొండ. మర్గ్. దాచు ; కుఇ. మ్రాఁగ. (మ్రాంగి-), పోగొట్టుకొను ; కువి. మ్రఖలి, మంపు, చెరుపు ; పర్జి. మెంగ్. మరచు ; కొలా. మద్ (మత్-). మరచు, గ. మెయ్. మరచు, మెయిండి, ఎక్కువ తిరిగేవాడు, మెయిల్, పిచ్చిగాతిరుగు, మాల్తొ. మస్గె. కనుమరుగగు.

<మూ. ద్రా. మత్.

మఱకువ రూ. మరకువ. వి. 1. అజ్ఞానం, తెలివి తక్కువ. భార. ఆది. 1.327 ; 2. విస్మృతి, పరాకు. ఆం. భా. 1.137 ; మఱగొను (-కొను) అ.క్రి. దైన్యం పొందు. భార. ఉద్యో. 1.348. మఱపించు స.క్రి. 1. మరచునట్లుచేయు, విస్మరించుచేయు. కు.సం. 6.30 ; 2. భ్రాంతినొందించు, భ్రమింపచేయు. నీలా. 1.76. <మఱచు + -ఇంచు[3]. మఱపు రూ. మరుపు[2], మఱుపు. వి. 1. విస్మృతి. కు.సం. 4.57 ; 2. ప్రమాదం, పొరపాటు. భార. ద్రోణ. 1.80 ; 3. మూర్ఛ. రంరా. ఉ. 146పు. 18పం. ; 4. పారవశ్యం, ఒడలెరుగమి, మత్తత. ఉ.హరి. 5.73 ; 5. అజ్ఞానం. భాగ. 9.116 ; స.క్రి. ప్రమాదపర్చు, పొరపెట్టు. హరి.ఉ. 7.129.

మఱన్ది రూ.చూ. మఱఁది. వి. మరిది.

మఱఁదలు వి.ఔ. 1. తమ్ముని భార్య. భార.ఆది. 4.217 ; 2. మగని చెల్లెలు. ఆం.భా. 2.114 ; 3. భార్య చెల్లెలు ; 4. తనకంటె చిన్నదైన మేనత్త కూతురు, తనకంటె చిన్నదైన మేనమామ కూతురు.

కుఇ. మ్రేగలి. మేనమామకూతురు ; కొలా. మరందల్. మేనమామకూతురు, మరందా. భార్య చెల్లెలు.

<మఱఁది + ఆలు.

మఱఁది రూ. మఱన్ది. వి. 1. చెల్లెలు మగడు. భార.ఆది. 8.214 ; 2. భార్య తమ్ముడు, స్యాలకుడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 164. క్రీ.శ. 1168. భార.ద్రోణ. 1.363 ; 3. మేనత్తకొడుకు. భార.ద్రోణ. 4.141 ; 4. మగనితమ్ముడు. శృం.నై. 3.126 ; 5. మేనమామకొడుకు. భాను. 4.10 ; 6. పరియాచకపువావి, సరసోక్తులాడటం కోసం కల్పించిన వరస. ద.శా. 2.366.

కుఇ. మెయిూగెంజు. మేనమామకొడుకు ; కొలా. మరన్. భార్య లేక భర్త యొక్క తమ్ముడు, మరాండ్. భర్తతమ్ముడు.

మఱపించు చూ. మఱచు.

మఱపు చూ. మఱచు.

మఱలించు చూ. మఱలు.

మఱలు రూ.చూ. మరలు[2]. అ.క్రి. 1. వెనుకకు తిరుగు, వెనుకకు మొగమగు. కాశీ. 4.284, గౌ.హరి.ఉ. 129 పం. ; 2. నివర్తిలు, వెనుకకు వచ్చు. పారి. 5.41.

మఱలించు స.క్రి. 1. వెనక్కితిప్పు ; 2. మళ్ళించు. <మఱలు + -ఇంచు[3].

మఱి[1] రూ. మరి[1]. అవ్య. 1. మరి, మళ్ళీ మొ. విప్పర్ల శాసనం. క్రీ. శ. 633–63 ; 2. పునరర్థకం, వెండియు, ఇంకా. భార.ఆది. 1.63 ; 3. నిశ్చయంగా. భార.ఆది. 2.34 ; 4. రెండు వాక్యాలను కలిపే సముచ్చయ పదం. భార.అది. 2.194 ; 5. కొన్నియెడల అర్థవిశేషం లేకుండా వాక్యాలంకారంగా ప్రయోగించబడుతుంది. భార. ఆది. 3.159 ; 6. పూర్వోత్తర వాక్యార్థాలకు ఉండే భేదాన్ని తెల్పుతుంది. భార.ఆది. 4.71 ; 7. ఇదిగాక. భార. ఆది. 4.219 ; 8. అన్యం, వేరు. భార.ఆది. 5.211 ; 9. తడవ, పర్యాయం. నిర్వ. రా. 2.19, కాశీ. 4.209 ; 10. మరల మరల, పలుమారు. కాశీ. 4.89 ; 11. అట్లుకానిచో, పక్షాంతరంలో. భాగ. 10. ఉ. 155 ; 12. అట్లు, ఆ విధంగా. ఆము. 5.42.

క. మఱు. అన్యం, తర్వాత, తదుపరిది, మరల వ్యతిరేకం, మత్త, మత్మ్. మరల, తర్వాత, అదీకాక, మరియు, మత్తె. అన్యం, మరల, తర్వాత. ఇంకా, మఱనా, తర్వాత, మరుసటిరోజు, మరుసటి ఉదయం, మాఱనె. అన్యం, తదుపరి, తర్వాత ; కొడ. మరి. ప్రతికూలం, మృతిఅంది. ఎల్లుండి, ఆవలనాడు ; తు. మరు. మరుసటి, తర్వాత ; త. మఱు. మరొక, తర్వాత, వేరొక, ఇతరమైన, మఱు-నాళ్. మరుసటి రోజు, రేపు, మఱుమై. మరుజన్మ, పరలోకం, మఱ్ఱు. వేరొక, మరల, మఱ్ఱై, మఱ్ఱు. వేరొక, మఱ్ఱతు. వేరొక, మఱ్ఱవణ్. వేరొకటి ; మ. మఱు. వేరొక, తర్వాత. మఱు-నాళ్. మరుసటిరోజు, ముందురోజు, మఱ్ఱు. వేరొక, అదీకాక, యింకా, మఱ్ఱవళ్. వేరొక, ఇతరమైన ; కో. మర్. ఇతరమైన, వేరొక, తర్వాతది ; తొ. మఱ్. తర్వాత (రోజు, నెల మొ.) ; మర్చ్. మరల, మకొల్. రేపు ; పర్జి. మరి. మళ్ళీ, మరిఒక. వేరొకటి ; కొలా. మరి. అప్పటినుంచి, ఆ తర్వాత, మర్.తొల్లి. ఎల్లుండి, ఆవలనాడు ; నా. మరి. మళ్ళీ. పో.చూ.త. మఱంకు.

మూ.మ.ద్రా., మూ.ద.ద్రా. *మత్ + ఇ.

మఱిన్మఱి రూ. మరిమరి, మఱిమఱి. అవ్య. అత్యంతం, మిక్కిలి. ఇందు. 2.213. మఱిమఱి రూ.చూ. మఱిన్మఱి. అవ్య. 1. అత్యంతం. భల్లా. 5.6 ; 2. మరియు, మరియు,

పౌనఃపున్యంగా. మఱియు రూ. మరియు. అవ్య.(ద్రు. **1.** అంతేకాకుండ. భార.ఆది. 1.37, ద.హిం.శా.సంపు. 4. శా.నం. 633 ; **2.** రెండు వాక్యాల్ని కలిపే పదం. భార. ఆది. 3.33. మఱియొకటి(-ఒకటి) సర్వ. అన్యం.

**మఱి²** రూ.చూ. మఱ్ఱి. వి. వటవృక్షం, మర్రిచెట్టు. జైమినిభా. 1.21.

**మఱిగ** వి. రాచ్చిప్ప, పులుసు మొ. వి వండడానికుపయోగించే రాతితో చేసిన పాత్ర.

క. మరగె. కొయ్యపాత్ర, ఒకరకం బకెట్టు.

**మఱు¹** రూ. మరు. (వృత్తిలో పూర్వ పదమైన మాఱు శబ్దానికి వికల్పంగా ఆదేశమై వచ్చే రూపం). విణ. **1.** ప్రతి, బదులు. భార.ఆది. 6.108, భార.ఆది. 7.76 ; **2.** అన్యం, వేరొకటి. భార.అను. 4.267.

**మఱు²** రూ. మఱున. (వృత్తిలో పూర్వపదమైన మఱుగు శబ్దానికి వికల్పంగా ఆదేశమై వచ్చే రూపం) విణ. అనంతరం, ప్రిమ్మటిది. భార.ఆది. 8.183 ; వి. తడవ, పర్యాయం.

**మఱునాఁడు** రూ. మన్నాడు, మరునాడు, మర్నాటు, మర్నాఁడు. వి.ఔ. మరుసటి దినం, పరదినం. నిర్వ.రా. 6.25. **మఱుపుట్టువు** రూ. మఱునపట్టువు. వి. పిమ్మటి జన్మ. **మఱుమాట** వి. ప్రతివచనం. ఆం.భా. 1.114. **మఱుమేను** వి. పరజన్మ, ఉత్తర జన్మం. భాగ. 1.100. **మఱుమ్రోత** వి. ప్రతిధ్వని. ఆం.భా. 1.122. **మఱుసంజ** వి. సాయం సంధ్య. కాశీ. 1.129.

**మఱు³** రూ.చూ. మఱుఁగు. వి. చాటు, వృత్తిలో పూర్వ పదమైన మఱుగుశబ్దానికి వికల్పంగా ఆదేశమైన రూపం.

**మఱుపడు** రూ.చూ. మరుపడు. అ.క్రి. చాటగు, తిరోహితమగు, దాగు. భాగ. 10పూ. 1564. **మఱుపెట్టు** రూ.చూ. మఱువెట్టు. స.క్రి. **1.** దాగు, మరుగుపరుచు. పారి. 2.51 ; **2.** వంచించు, మోసపుచ్చు, మిషపెట్టు. కవిరా. 2.13. **మఱుమాట** రూ.చూ. మఱుఁగుమాట. వి. **1.** బదులుమాట ; **2.** రహస్యం. **మఱుమూల** వి. ఎదురు మూల, గొంది. **మఱువడు(-పడు)** రూ.చూ. మరువడు. అ.క్రి. చాటగు, తిరోహితమగు, దాగు. **మఱువెట్టు(-పెట్టు)** రూ. మఱుఁగుపెట్టు, మఱుఁగు పెట్టు, మఱుపెట్టు. స.క్రి. **1.** దాచు, మరుగుపఱ్చు. భార.విరా. 1.177 ; **2.** వంచించు, మోసపుచ్చు, మిషపెట్టు. శృం.నై 7.191.

**మఱుకువ** చూ. మఱుఁగు.

**మఱుగుజ్జు** రూ. మరగుజ్జు, మరుగుజ్జు. విణ. **1.** గూనివాడు, గూనిది. వరాహ. 9.43 ; **2.** పొట్టివాడు.

**మఱుఁగిడు** చూ. మఱుఁగు.

**మఱుఁగు** రూ. మరగు² మరుగు², మర్వు, మఱు³, మఱువు. అ.క్రి. **1.** సంతాపించు, మిక్కిలి దుఃఖించు. భార.ఆది. 6.243, భార.విరా. 2.146 ; **2.** చాటగు, తిరోహితమగు, దాగు. గౌ.హరి.పూ. 606 పం. ; **3.** నీళ్ళు మొ. సలసల కాగు ; వి. **1.** చాటు, వ్యవధానం. పండి.చ. 1.44పు. ; **2.** మిష, నెపం, సాకు. కాళ. 4.109 ; **3.** దాపరికం. ప్రభా. 3.72 ; **4.** చాటుకవులు తరచుగా ప్రయోగించని మారుమూల మాట, అప్రతీతం. ప్రబంధ. 16.

క. మఱుగు, మఱగు. మందు, వేడిగా ఉండు, ప్రేమోద్రేకం కలుగు, మిక్కిలి విచారించు, బాధపడు, మఱుక. విచారం, దుఃఖం, మఱ. దుఃఖంతో, మరళు. మనలు, పొంగు, సలసల కాగు, మఱసు. దాగు, మఱ. రహస్యం, మూత, ఏకాంతం, మఱవు. దాక్కొను ; తు. మదెయుని. కనుమరుగగు, చాటగు, మదెపుని. ఏకాంతం, మరుగు, మదెపు. ఏకాంతస్థలం ; త. మఱై. దాచు, అదృశ్యమగు ; మ. మఱయుక. దాచు, మఱిక్క. మరుగు, దాచు, మఱెచ్చు. ఏకాంతం, మఱచ్చ. ఏకాంతం ; కో. మర్వ్. రహస్యంగా మనసులో ఉంచుకొను ; గోం. మరుస్తానా. నూనెతోవండు ; కుఇ. మాగ్. ఏకాంతమందుండు, దాగు, (మహ్వ). మందు ; కురు. మార్. దాచు, చాటగు.

< మూ.ద్రా. *మాత్త్- ; *మత్త్-వ్-.

**మఱుకువ** వి. సంతాపం. భార.అరణ్య. 6.242. **మఱుఁగిడు** స.క్రి. దాచు, గోపనంచేయు. కళా. 6.160. < మఱుఁగు + ఇడు. **మఱుఁగుగోడ** వి. మన్ను, ఇటుక రాయి మొ. వాటిచేత పెట్టబడిన గోడ. **మఱుఁగుచెందు** అ.క్రి. శరణుచొచ్చు. శుక. 2.248. **మఱుఁగుచోటు** వి. అంతరువు, ఓలం. **మఱుఁగుఁజొచ్చు (-చొచ్చు)** రూ.చూ. మఱువుసొచ్చు. స.క్రి. శరణం పొందు. ఆము. 2.58 **మఱుఁగుడు** వి. **1.** కాగటం ; **2.** వేడిమి ; **3.** అక్కసు. **మఱుఁగుదొడ్డి** రూ. మరుగుదొడ్డి. వి. మలవిసర్జన స్థానం, పాయఖాన. **మఱుఁగునబదుకు** అ.క్రి. శరణు పొంది బ్రతుకు, చాటున బ్రతుకు. తాళ్ల.నం. 7.250. **మఱుఁగుపడు** రూ. మఱుపడు. అ.క్రి. దాగు, చాటగు, తిరోహితమగు. కాశీ. 5.70. **మఱుఁగుపెట్టు** రూ. మఱుపెట్టు. స.క్రి. దాచు, గోపనంచేయు, కప్పిపుచ్చు. విక్ర. 1.122. **మఱుఁగుపెరడు** వి. మరుగుదొడ్డి, పాయఖానా. **మఱుఁగుమందు** రూ. మరుగు మందు. వి. స్త్రీ పురుషుణ్ణి లోబరచుకోడానికి పెట్టే మరుల మందు, మచ్చుమందు. **మఱుఁగుమాట** రూ. మఱుమాట. వి. **1.** బదులు మాట ; **2.** రహస్యం. **మఱుఁగువెట్టు (-పెట్టు)** రూ.చూ. మఱుపెట్టు. స.క్రి. చాటుపెట్టు. **మఱుఁగుసొచ్చు (-చొచ్చు)** రూ.చూ. మఱువుసొచ్చు. స.క్రి. శరణుపొందు.

**మఱుతు** రూ.చూ. మఱున్తుఱు. వి. భూప్రమాణం. విప్పర్ల శిలాశాసనం. క్రీ.శ. 10వ శతాబ్ది.

**మఱుతుఱు** రూ.చూ. మఱున్తుఱు. వి. భూప్రమాణం. ద.హిం. శా.సంపు. 10, శా.నం. 600, క్రీ.శ. 700/725.

**మఱుతుర** రూ.చూ. మఱున్తుఱు. వి. భూపరిమాణ విశేషం, ఒకరకం భూమి కొలత. నె.శా.సంపు. 3. శా.నం. 1202, క్రీ.శ. 1023.

**మఱుతుఱు** రూ.చూ. మఱున్తుఱు. వి. భూ ప్రమాణం. ద.హిం.శా.సంపు. 10. శా.నం. 24, క్రీ.శ. 682.

**మఱుస్తురు** రూ.చూ. మఱున్తుఱు. వి. భూ ప్రమాణం. ద.హిం. శా.సంపు. 10, శా.సంపు. 660, క్రీ.శ. 600-625.

**మఱుస్తుఱు** రూ. మత్తరు, మర్తురు, మఱుతు, మఱుతుణ్డు, మఱుతురు, మఱుతుఱు, మఱుస్తురు, మఱుస్తు, మత్తు, మత్తురు, మార్తు. వి. **1.** 300 హస్తాల లేదా 30 దండాల భూ ప్రమాణం. ఎర్రగుడిపాడు శిలాశాసనం. క్రీ.శ. 575-600 ; **2.** భూ ప్రమాణ విశేషం. ఈ ప్రమాణం ఒకే రకంగా ఉండకుండా కాలాన్నిబట్టి మారేది.

క. మత్తరు. భూ ప్రమాణం. <సం. మాత్రా. ప్రమాణం ; మ. మట్టు. ప్రమాణం.

<మూ.ద్రా. *మత్-అ.

**మఱుస్తు** రూ.చూ. మఱుస్తుఱు. వి. భూ ప్రమాణం. మాలెపాడు శిలాశాసనం. క్రీ.శ. 625.

**మఱుపు** రూ.చూ. మఱపు. వి. మరచిపోవటం.

**మఱుమన్న** వి. బీడు. E.I. 62. క్రీ.శ. 578.

**మఱువ** చూ. మఱుఁగు. వి. కుండ. విణ. మూగ. **పాండు.** 4.21.

**మఱువకంఢు** వి. అగస్త్యుడు. అచ్చ.రా. ఆరణ్య. 7.

**మఱువు** రూ.చూ. మఱుఁగు. వి. **1.** కపచం. భార.విరా. 3.162 ; **2.** మచ్చ ; **3.** మూత ; **4.** మాటు ; అ.క్రి. చాటగు, తిరోహితమగు. కవిక. 3.221.

**మఱువుకొను** అ.క్రి. దాక్కొను, మరుగుపడు. కు.సం. 10.438. **మఱువుఁజొచ్చు (-చొచ్చు)** రూ.చూ. మఱువుసొచ్చు. స.క్రి. శరణుపొందు. **మఱువుసొచ్చు (-చొచ్చు)** రూ. మఱుఁగుఁజొచ్చు, మఱుఁగుసొచ్చు, మఱువుఁజొచ్చు. స.క్రి. శరణుపొందు. భార.ఆది. 6.201.

**మఱుస** రూ.చూ. మఱు². విణ. ఔ. అనో. అనంతరం, తర్వాతది. వేంక.పంచ. 3.9.

**మఱుసపుట్టువు** రూ.చూ. మఱుపుట్టువు. వి. అనంతర జన్మ.

**మఱ్తు** రూ.చూ. మఱుస్తుఱు. వి. భూ ప్రమాణం. ద.హిం. శా.సంపు. 10. శా.సం. 599, క్రీ.శ. 625-650.

**మఱ్తురు** రూ.చూ. మఱుస్తు. వి. భూపరిమాణ విశేషం. రొంపిచెర్ల శాసనం. 1242.

**మఱ్జి** రూ. మఱ్రి, మఱి², మఱ్జియ, మఱ్జె, మఱ్జెయు¹. వి. వట వృక్షం. కు.సం. 9.117, విక్ర. 2.44 (Ficus bengalensis). నందమపూడి శాసనం. క్రీ.శ. 1053.

పర్జి. మర్. వటవృక్షం ; కొలా. మఱీ. వటవృక్షం. **మఱ్జిమానిపంట** వి. ఎక్కువ పంట. తాళ్ల.సం. 11.47.

**మఱ్జియ** రూ.చూ. మఱ్జి. వి. వటవృక్షం.

**మఱ్జూళ్ల** వి. తెల్ల వేపురు జాతిభేదం.

**మఱ్జె** రూ.చూ. మఱ్జి. వి. మఱ్జిచెట్టు.

**మఱ్జెత** వి. మూర్ఖురాలు, అవివేకిని. వైజ. 4.12.

క. మఱ్జె. పిచ్చి, బుద్ధిహీనత.

**మఱ్జెయు¹** రూ.చూ. మఱ్జి. వి. మఱ్రిచెట్టు.

**మఱ్జెయు²** వి. అజీర్తి.

**మల¹** వి. **1.** పర్వతం, కొండ. హరి.పూ. 3.128 ; **2.** గట్టు ; **3.** మెట్ట, తిప్ప.

క. మలె. కొండ, అడవి ; కొడ. మలె. దట్టమైన అడవి, అడవుల్లో కొండ పక్కన నాటే ఏలకచెట్టు ; త. మలై. కొండ, పర్వతం ; మ. మల. కొండ, పర్వతం, గుట్ట ; కో. మలిమ్. పెద్దకొండలు, మలర్. నీలగిరి పడమట భాగానఉన్న ఎత్తుపల్లాలు ; తొ. మసార్. ఎత్తుపల్లాలు ; పర్జి. మలంగ్. అడవి ; గ. మరె. మిట్ట, దిబ్బ ; కొలా. మలె, మాలె. కొండ ; బ్రా. మస్హ్. కొండ, పర్వతం.

పో.చూ. సం. మలయ-. మలబారు తూర్పుకొండ ; మాల-. గ్రామ సమీపానున్న అడవి, మాలక-. గ్రామ సమీపంలో ఉన్న కలప.

**మలకుదోలు** స.క్రి. పశువుల్ని వానాకాలంలో కొండ ప్రాంతానికి బీళ్ళతోలు. < మల + -కున్ + తోలు¹. **మలకోడె** వి. నల్లగొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందింది. **మలగొంగ** వి. గోత్రభేది, ఇంద్రుడు. అచ్చ.రా. సుం. 41. **మలగొట్టు¹ (-కొట్టు¹)** వి. ఇంద్రుడు, పర్వతాల్ని భేదించినవాడు. **మలగొట్టుకత్తి** వి. వజ్రాయుధం, ఇంద్రుని ఆయుధం. **మలజువ్వి** వి. ఒకజాతిజువ్వి. ద్వి.సార.చ. 2.79. **మలదాయ** వి. పర్వత విరోధి, ఇంద్రుడు. **మలదాయఱా** వి. ఇంద్రనీలం. చంద్రాంగ. 2.36. **మలద్రిమ్మరి (-త్రిమ్మరి)** వి. వానరం, కోతి. అచ్చ.రా.కిష్కిం. 24. **మలమనికి** రూ.చూ. మలమన్కి. వి. కోతి. **మలమన్కి** రూ. మలమనికి. వి. కోతి. అచ్చ.రా.యు. 88. **మలయమ్మ (-అమ్మ)** వి. **1.** ఒకానొక దేవత. యయా. 2.3 ; **2.** పార్వతి. **మలలమ్మ** రూ. మల్లలమ్మ. వి. **1.** ఒకానొక కొండదేవత. చంద్రాంగ. 2.51 ; **2.** పార్వతి. **మలవిలుకాఁడు** రూ. మలవిల్కాఁడు. వి. శివుడు. **మలవిలుకానితేరు** రూ. మలవిల్కానితేరు. వి. గోపతి, నంది. వేంక.ఆం. 96. **మలవిల్కాఁడు** రూ.చూ. మలవిలుకాఁడు. వి. శివుడు. **మలవిల్కానితేరు** రూ.చూ. మలవిలుకానితేరు. వి. నంది. **మలసూడు** వి. ఇంద్రుడు, నగవైరి. **మలహజారవుజోదు** వి. వానరయోధుడు. అచ్చ.రా.యు. 199.

**మల²** వి. **1.** ఏను, ఉల్లారికి వేసిన ఇనపకొండి ; **2.** గుడారం బిగించి కట్టడానికి వాడే పెద్దమేకు.

**మలకట్టెదిండు** వి. డొలుపు, బండి ఇరుసు మీద వేసే అడ్డమొద్దు. **మలవేయు** రూ.చూ. మలకవేయు. స.క్రి. **1.** మగ్గం మోకు చేతి గూటానికి ముడివేయు ; **2.** ఉన్ని కదురుకు చుట్టిన పోగు ఊడిపోకుండా పైగాడిలో మెలిక వేయు. **మలేయు** రూ.చూ. మలకవేయు. స.క్రి. **1.** మగ్గం మోకు చేతి గూటానికి ముడివేయు ; **2.** ఉన్ని కదురుకు చుట్టిన పోగు ఊడిపోకుండా పైగాడిలో మెలికవేయు ; **3.** సరి చేసేటప్పుడు పడుగు తిరగవేయు ; **4.** అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్ర మీద వడిదారంతో మెలిక వేయు.

**మల³** రూ. మొల³. వి. **1.** సరి చెయ్యటానికి చాపిన పడుగు ; **2.** పడుగేరే కర్రలమీద నెరపిన పడుగు ; **3.** అచ్చుతికిన పడుగు ; **4.** నేతకు సిద్ధంచేసి చుట్టిన పడుగు ; **5.** మగ్గానికి అమర్చి నేత బయలులో చాపిన పడుగునూలు ; **6.** పడుగు పాయకు చివర వేసిన ముడి, మెలిక.

**మలఎలుపు** అ.క్రి. **1.** అల్లు చేసేటప్పుడు, పడుగు పోగులు నెరపు; **2.** చుట్టిన పడుగును మరల చాపు.

**మలకచ్చి** రూ. మొలకచ్చి వి. సరి చేసిన పడుగులో అనికి దగ్గరగా లాకలు చేర్చిన కచ్చి. **మలకచ్చివేయు** అ.క్రి. సరి చేసిన పడుగులో అనికి దగ్గరగా కచ్చి లాకలు చేర్చు. **మలకట్టు** రూ.చూ. మలగట్టు. వి. పన్నె కట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెకు దారంతో నేసిన ముడి; స.క్రి. మలఎలుపు; అ.క్రి. **1**. అచ్చుతికి చాపిన పడుగులో చివరి పాయలు కట్టు; **2**. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపిన నేతకు అనుకూలంగా సాపుచేయు. **మలకఱ్ఱ** రూ.చూ. మలగఱ్ఱ. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలకొయ్య** వి. **1**. మగ్గం మీద నేత బిఱ్ఱు పెట్టటానికి మోకు కట్టే కొయ్య; **2**. నేత బయలులో చివర పాతిన కొయ్య. **మలకోల** వి. **1**. పడుగు చాపినప్పుడు కింది పోగులు కలిసి పోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కఱ్ఱ; **2**. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలకోలగుది** వి. **1**. పెద కోలకు తగిలించే మలగఱ్ఱ; **2**. మలబద్ద దారం. **మలగట్టు (-కట్టు)** రూ. మలకట్టు, మొలకట్టు[2], మొలగట్టు. అ.క్రి. **1**. అచ్చుతికి చాపిన పడుగులో చివరి పాయలు కట్టు; **2**. అచ్చుతికిన పడుగు ఆరు బయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు; వి. పన్నె కట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి. **మలగట్టు కఱ్ఱ** వి. **1**. అచ్చుకట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు పై పైపున అడ్డంగా కట్టిన కఱ్ఱ; **2**. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలగట్టుకొయ్య** వి. **1**. నేత పడుగులో చివరిపాయలు బిగించిన కఱ్ఱ; **2**. నేత బయలులో చివర పాతిన కొయ్య. **మలగట్టుకోల** వి. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలగట్టుగుది** వి. **1**. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; **2**. పెదకోలకు తగిలించే మలగఱ్ఱ కొన్నిచోట్ల మలబద్ద దారం. **మలగట్టు చివ్వ** రూ. మలగట్టుసివ. వి. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలగట్టుతాడు** రూ. మలగడ్తాడు. వి. పడుగు చివర మలగట్టు, కఱ్ఱమాలాకనూ కలిపి కట్టిన తాడు. **మలగట్టుబద్ద** వి. పడుగులో చివర, కఱ్ఱకు జోడించిన లాక, బద్ద. **మలగట్టుసివ** రూ.చూ. మలగట్టుచివ్వ. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలగడ్తాడు** రూ.చూ. మలగట్టుతాడు. వి. పడుగు చివర మలగట్టు కఱ్ఱ మాలాకనూ కలిపి కట్టిన తాడు. **మలగఱ్ఱ(-కఱ్ఱ)** రూ. మలకఱ్ఱ, మొలకఱ్ఱ. వి. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కఱ్ఱ. **మలగుది** రూ. మొలగుది. వి. **1**. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం; **2**. పెడకోలకు తగిలించే మలగఱ్ఱ. **మలచివ్వ** రూ. మొలచివ్వ. వి. నేతపడుగులో చివరపెట్టిన నన్నని బెత్తం. **మలచుట్టకఱ్ఱ** రూ. మొలసుట్టు కఱ్ఱ. వి. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలచుట్టు** రూ. మొలసుట్టు స.క్రి. అల్లుచేసిన పడుగును మలలుగా విడతీసి చుట్టు. **మలచుట్టుకోల** వి. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ. **మలచేయు** రూ.చూ. మలజేయు. స.క్రి. **1**. పడుగుపోగులు సాపుజేయు; **2**. ఏరిన పడుగుచుట్టు; **3**. పడుగేరిన తరువాత అవి చివరికి జరుపు; **4**. సరిచేసేటపుడు పడుగుపోగులు సమంగా సర్దు. **మలజాపు (-చాపు)** రూ. మొలజాపు. వి. **1**. అచ్చుతికిన పడుగు ఆరు బయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు; **2**. మగ్గం బయలులో పడుగుచాపు. **మలజేయు(-చేయు)** రూ. మల చేయు, మొలచేయు, మొలసేయు. స.క్రి. **1**. పడుగు పోగులు సాపుచెయ్యి; **2**. ఏరిన పడుగుచుట్టు; **3**. పడు గేరిన తరువాత అని చివరికి జరుపు. **మలజోడు** వి. నేత పడుగుకు చివర పెట్టిన రెండు కఱ్ఱలు. **మలతడుపు** అ.క్రి. వడుగేరే కఱ్ఱ మీది పగుగుపోగులు గంజితో తడుపు. **మలతాడు** రూ.చూ. మొలత్రాడు. వి. అచ్చుతికిన పడుగులో చివర పోట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం. **మలదోయు** స.క్రి. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపినేతకు అనుకూలంగా సాపుచేయు. **మలపట్టు** స.క్రి. అచ్చుతికిన పడుగు ఆరు బయటచాపి, నేతకు అనుకూలంగా సాపుచేయు. **మలపొడుచు** స.క్రి. పడుగేరు కఱ్ఱమీది పడుగుపోగులు సమంగా ఉండేట్టు చేత్తో తట్టు. **మలబద్ద** రూ. మొలబద్ద. వి. నేత పడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద. **మలబద్దగుది** వి. **1**. పెడకోలకు తగిలించే మలగఱ్ఱ; **2**. మలబద్ద దారం. **మలబిగించు** అ.క్రి. నేత మోకుతో మగ్గంమీద పడుగు బిగించు. **మలమగ్గం** రూ. మొలమగ్గం. వి. **1**. మగ్గంమీద పడుగులో చిపరి భాగం కఱ్ఱలకు చుట్టి నేసే మగ్గం; **2**. మగ్గంమీది పడుగులో చివర, పొట్టెలు కట్టినేసే మగ్గం. **మలలాక** రూ. మల్లాక. వి. **1**. అచ్చుతికిన పడుగులో మొదట అచ్చుదగ్గర ఎక్కించిన కఱ్ఱ; **2**. పడుగు మధ్య భాగంలో అని వెంబడి దూర్చిన బద్ద. **మలలువేయు** అ.క్రి. ముడులు వేయు, పడుగులో మొదటి పోగులకు ముడులువేసి మగ్గం దోనెలో పుల్లలకు కట్టు. **మలలెక్కించు** అ.క్రి. అల్లుచేసే టప్పుడు పడుగుకు మసిగుర్తులు వేసి లాకలు, కఱ్ఱలు దూర్చు. **మలలేరు** స.క్రి. పడుగును మొదటినుంచి చివరి వరకూ పాయలుగా విడదీసుకొను. **మలసాగు** వి. **1**. మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు; **2**. నేత సాగులో దండె దగ్గరినుంచి చివరిదాకా చాపినపడుగు. **మల్తాడు** రూ.చూ. మొలత్రాడు. వి. మొలకి కట్టుకునే తాడు, కటిసూత్రం. **మల్లాక** రూ.చూ. మలలాక. వి. **1**. అచ్చుతికిన పడుగులో మొదట అచ్చుదగ్గర ఎక్కించిన కఱ్ఱ, కొన్ని చోట్ల బద్దగాని, నన్న బెత్తంగాని, ఇనప కడ్డీగాని ఎక్కిస్తారు; **2**. పడుగు మధ్యభాగంలో అని వెంబడి దూర్చిన బద్ద.

**మలక**[1] వి. మూకుడు. సిం.ద్వా. 5.263.

క. మల్ల, మల్లికె. తాగడానికి ఉపయోగించే మట్టి మొ. వాటితో తయారైన పాత్ర; త. మల్లమ్, మల్లై. భిక్షాపాత్ర; మ. మల్లమ్. కొబ్బరిచిప్పతో చేసిన పాత్ర; గోం. మాల్కి. చిన్న మట్టిపాత్ర;

సం. మల్ల-, మల్లక-, మల్లికా, మల్లీ. సెమ్మె, కొబ్బరిచిప్ప; ప్రా. మల్ల-, మల్లయ-; పా. మల్లక-. భిక్షాపాత్ర; మరా. మలియా; హిం. మలియా, మల్సా. నేతిపాత్ర, మల్సీ. మట్టి వంట పాత్ర.

**మలక**[2] రూ. మల్క, మల్కి, మల్కిక, ముల్క[2]. వి. తురు

ష్కుడు, మహమ్మదీయుడు. కా.ప.మం. 75, క్రీ.శ. 1417.

హిం. మలిక్. రాజు, ప్రభువు ; ఉ. మలిక్, మల్క్. పాదుషా, రాజు, శాసకుడు, మాలిక్. యజమాని ; పార. మల్కా. రాజు, మలిక్. రాజు, ప్రభువు, మల్క్. రాజ్యం కలవాడు ; అర. మాలిక్.

< ఉ. మల్క్.

మలకలమాటలు వి.బ.వ. శుష్కప్రియాలు. రాధికా. 4.72.

**మలక[3]** వి. 1. చిట్టె, నాగటి మోకుకు చివరవేసే ముడి ; 2. సాగు పనిముట్టు ఒకసారి దున్ని తిరిగి రావటం ; 3. నారు మడిలో పెట్టిన రెండో తడి ; 4. సారి.

మలకచాలు వి. మొదటిసారి దున్నటం. మలకబెట్టు అ.క్రి. పనికిరాక బందుపెట్టు. మలకవేయు రూ. మలవేయు, మలువేయు, మలేయు. స.క్రి. 1. మగ్గంమోకు చేతి గూటానికి ముడివేయు ; 2. ఉన్ని కదురుకు చుట్టిన పోగు ఊడిపోకుండా పైగాడిలో మెలికవేయు.

**మలకకూర** వి. కొయ్యగూర, కోయటాకు.

**మలకడము** వి. పాదరక్ష. ఆము. 77.

**మలకలపౌర్ణమి** రూ.చూ. మొలకల పున్నమి. వి. చైత్రమాసంలో వచ్చే పున్నమి, వ్యాసపూర్ణిమ.

**మలకవ** వి. ఒకసారి మోటలాగిన తర్వాత ఎద్దులు మోటబావి పైపు ఎక్కివెళ్ళే దారి.

**మలకా** రూ.చూ. మలాక. వి. శ్రీఖండం, చందనం.

**మలకు** వి. పన్నె కట్టుబడిలో దండెలమధ్య బిగించిన ఊనెకు దారంతో వేసిన ముడి.

మలకువేయు వి. పన్నెకట్టుబడిలో దండెలమధ్య బిగించిన ఊనెకు దారంతో ముడివేయు.

**మలగ** చూ. మలఁగు[1]. వి. రెండెడ్లబండి. E.I.VI. 23.

**మలగం** చూ. మలఁగు. వి. 1. నూర్పిడికి కళ్ళంలో కుప్పదింపి పరచిన కంకులు ; 2. గడ్డి.

**మలగుదాలు** రూ.చూ. మలగులాలు. వి.బ.వ. 1. చిక్కులు అభ్యంతరాలు ; 2. నిర్ణయం కుదరక రహస్యంగా జరిపే ఆలోచనలు.

**మలగుబ** రూ.చూ. మలగూబ. వి. మామిడి పళ్ళలో ఒకరకం.

**మలగులాలు** రూ. మలగుదాలు, మల్లగుల్లాలు. వి.బ.వ. 1. అయోమయం ; 2. కష్టాలు.

సం. మల్ల-. వస్తాదు, పహల్వాను.

**మలగూబ** రూ. మలగుబ, మల్గూబ, మల్గోబా. వి. మామిడి పళ్ళలో ఒకరకం, మలయా గోవాలనుంచి తేబడ్డ ఒకరకం మామిడి.

**మలగొట్టు[2]** రూ. మళ్లగొట్టు, మళ్లుగొట్టు. స.క్రి. బండ్లుగాని, పశువులు గాని ఒకరి పొలంలోకి రాకుండా అడ్డగించి వెనుక తిప్పి కొట్టివేయు.

**మలగొను** చూ. మలఁగు[1].

**మలఁక[1]** చూ. మలఁగు[1].

**మలఁక[2]** వి. పరిమాణ విశేషం.

మలఁకతూము వి. పదికుంచాల పరిమాణంగల మాన విశేషం. మలఁకపుట్టి వి. రెండుకుంచాల పరిమాణం గల కొలత.

**మలఁకతపసి** చూ. మలఁగు[1].

**మలఁకమెఱుపు** చూ. మలఁగు[1].

**మలఁకవాలు** చూ. మలక[2]. వి. 1. చెప్పులు ; 2. పావుకోళ్ళు.

**మలఁగ** చూ. మలఁగు[1].

**మలఁగకొట్టు** చూ. మలఁగు[1].

**మలఁగించు** చూ. మలఁగు[1].

**మలఁగు[1]** అ.క్రి. 1. వంకరగు, వంకరగాతిరుగు. భార. విరా. 1.291 ; 2. నివర్తిల్లు, వెనుకకు మరలు, వెనుకమొనమగు. భార. భీష్మ. 2.70 ; పోలవరం శాసనం, క్రీ.శ. 1354 ; 3. చుట్టుకొని ఉండు, పరివేష్టించు ఉండు, హరి. పూ. 7.13 ; 4. వర్తిల్లు, ఉండు. ఉ. హరి. 5.10 ; 5. తొలగు, అపసరిల్లు. భాగ. 10పూ. 1732 ; 6. వెనుదీయు, సంకోచించు. గౌ. హరి. పూ. 2188పం. ; 7. పక్కకు తిరుగు.

క. మలగు, మలంగు. పక్కకువరుగు, వంగు, సోలిసు. పక్కకువంగు, మాలు, పక్కకివంగు, వంగు ; తు. మలెంగుని. వెనక్కివంగు ; త. మలర్. మొహం, మూతి, పైకెత్తు, మల్లా, మల్కా. వెనక్కిపడు, వెనక్కివాలు ; మ. మలరుక. దొప్పతేలిఉండు, వెనక్కివాలు ; తో. మల్ప్ (మల్త్). పక్కచూపులు ; కుఈ. మర్మరర్. శరీరాన్ని కొంచెంగా అటూ ఇటూకదల్చు. పో. చూ. కుఇ. మల్ల. బోర్లాపడు.

< మూ. ద్రా.* మల్.

మలగొను అ.క్రి. 1. పెనగొను, మెలిగొను రం. రా. యు. 356పు. 24పం. ; 2. వ్యాపించు. కావ్యా. చూ. 9.119. < మలఁగు[1] + కొను. మలఁక[1] రూ. మలుకు[1], మలుక్కు. విణ. వంకరైనది. భాగ. 10పూ. 691 ; వి. 1. మెలిక, వంకర. భార. భీష్మ. 1.269 ; 2. కపటపునడత, కుటిలప్రవర్తన. పండి. చ. 2.116 ; 3. చుట్టు. వలయం, హరి. పూ. 7.21 ; 4. చిక్కు. గౌ. హరి. పూ. 1709 పం. ; 5. ఏరులు మొ. వి పక్కకి తిరిగిన మలుపు. వసు. 1.68 ; 6. నడత. క. మలకు. మెలిపెట్టు ; త. మలకు, మలుక్కు. జారుముడి. మలఁకతపసి వి. కుటిలముని. మలఁకమెఱుపు వి. ధనురాకారమైన మెరుపు. మలఁగ వి. 1. ఎద్దుపై గంతతోడి సరకుగోనె ; 2. సరకు నింపని గోనెల తోడి ఎద్దుల లేదా గాడిదల గుంపు. మలఁగకొట్టు స.క్రి. మట్టిని పొడికొట్టు, నలగగొట్టు. మలఁగించు స.క్రి. 1. ప్రసరింపచేయు, వ్యాపింపచేయు. భార. అశ్వ. 3.102 ; 2. వెనుకకుత్రిప్పు. గౌ. హరి. పూ. 1112 పం. < మలఁగు[1] + -ఇంచు[3]. మలఁగుటొఱగు (-ఒఱగు) వి. గుండ్రనిదిండు. ద్విపదమ. వి. 3పు. 193. మలఁచు[4]. స.క్రి. 1. వంచు, ఒరగచేయు. నిర్వ. రా. 8.88 ; 2. చుట్టు పరివేష్టించు. భార. భీష్మ. 8.441 ; 3. వెనక్కితిప్పు, భార. శాంతి. 4.357 ; 4. పక్కకితిప్పు. శృం. నై. 7.191. మలపించు[1] స.క్రి. 1. తిప్పు, మరలించు ; 2. నిర్మించు. మలపు[1] స.క్రి. 1. తిప్పు, మరలించు ; 2. నిర్మించు. మలుపు[1] స.క్రి. 1. మలగజేయు. నిర్వ. రా.

2.86 ; **2.** నేతపడుగులో బెండతో పేకపోగులు తిప్పు ; వి. **1.** వ్యాపనం, ఉ. హరి. 6.29 ; **2.** వీథి ; **3.** వంగి ఉండటం ; **4.** వంపు ; **5.** సాగుపనిముట్టు, ఒకసారిదున్ని తిరిగిరావటం. **మలుపుకొను** స.క్రి. మచ్చికపరచుకొను, మరపుకొను. **మలుపుడుచీర** వి. అంచుకు పేకరంగు పోగు కలవకుండా వేరేరంగు నూలుపెట్టి రెండునాడెల పోగులు మలుపుతూ నేసినచీర. **మలుపుత్రొట్టి** వి. దోసెమలుపు తర్వాత ఉన్నభాగం. **మలుపుదోని** వి. పెంటిదోనె, దోనె మలుపు తరవాత ఉన్నభాగం, దోనెనన్నగిల్లే భాగం.

**మల(గు[2]** చూ. మలయు[1].

**మల(గు[3]** చూ. మాను, మాలు. అ.క్రి. **1.** క్షీణించు, తగ్గు, నశించు, చెడు. భార. శాంతి. 6.166 ; **2.** కలగు, క్షోభపడు. రం. రా. అయోధ్యా. 129పు. 31పం. ; **3.** వగచు.

క. మాళ్, మాణ్. అగు, తొలగు ; త. మాళ్ (మాణ్-ట్-). చచ్చు, నశించు.

మల(చు[5] స.క్రి. **1.** అడచు, నశింపచేయు. వసు. 1.118 ; **2.** తొలచు. **మలుపు[2]** రూ. మల్పు. స.క్రి. **1.** ఆర్చు, ఆర్పివేయు. నరస. 1.42 ; **2.** నశింపజేయు.

**మల(గు[4]** చూ. మలయు[3].

**మలచము** విణ. **1.** గొప్పది, పృథుపు. ఉ. రా. 3.123 ; **2.** అధికం ; **3.** చౌక.

**మల(చు[1]** రూ.చూ. మలుచు[1]. స.క్రి. విగ్రహాదుల్ని చెక్కు. హరి. ఉ. 10.21.

మల(పించు స.క్రి. తవ్వించు, తొలువచేయు. కా. ప. మ. 33.1.41. సొ. మల(పు స.క్రి. **1.** పోజేయు, తొలగజేయు. భార. ఆరణ్య. 5.41 ; **2.** తొలచు, రంధ్రం చేయు. రం. రా. యు. 294పు. 18పం. ; **3.** ఆర్పివేయు. గంధ. 130 ; **4.** చెక్కు. చంద్రాంగ. 2.36. మల(పుకొను రూ.చూ. మల(పుగొను. స.క్రి. **1.** తొలగించుకొను, పోగొట్టుకొను. అచ్చ. రా. అర. 21 ; **2.** నర్తించు, నాట్యంచేయు. **మల(పుగొను (-కొను)** రూ. మల(పుకొను. స.క్రి. నర్తించు, నాట్యంచేయు. ఆము. 4.35 ; **2.** తొలగించుకొను, పోగొట్టుకొను. **మలుపు[3]** వి. చెక్కటం, మలచటం. కృ. శకు. 1.55. **మలుపుకట్టు** వి. కట్టురాయికట్టుబడి, రాతిని చెక్కి కట్టేపద్ధతి. మలుపురాయి వి. కండిపొడరాయి, కట్టుబడికిగాని, నేలపై పరచడానికిగాని, స్తంభాలుగా నిలపడానికిగాని, వాడేచెక్కిన లేక మలిచినరాయి.

**మల(చు[2]** రూ. చూ. మలుచు[2]. స.క్రి. **1.** ధాన్యాదుల్ని జల్లించు ; **2.** కుప్పనూర్చు.

**మల(చు[3]** అ.క్రి. పుష్పించు. కు. నం. 3.40.

క. మలర్. పువ్వు ; త. మలర్. వికసించు, పుష్పింపచేయు, పువ్వు ; మ. మలర్. పువ్వు.

**మల(చు[4]** చూ.మల(గు[1].

**మల(చు[5]** చూ.మల(గు[3].

**మల(చు[6]** చూ. మలయు[1].

**మలత** విణ. **1.** గర్వించినది. ఆం. భా. 3.26 ; **2.** మదించినది.

నం. మత్త-. మదించినది.

**మలదోలు** చూ. మల(గు[1], తోలు[1]. రూ. మల్లడోలు. స.క్రి. **1.** బీడు మొ. సొంతపొలాల్లోకి ఇతరుల పశువులు రాకుండ అడ్డుపెట్టు. ; **2.** మేపు.

**మలన** వి. చావు, మృతి.

సం. మరణ-. చావు.

<నం. మరణ-.

**మలప[1]** చూ. మలయు[3]. వి. దూడచచ్చిన ఆవు, గేదె మొ. వి. హంస. 2.75.

మలపబఱ్ఱె వి. దూడచచ్చి పాలిచ్చేగేదె.

**మలప[2]** చూ. మలయు[1]. వి. కొంటెబాలుడు ; విణ. నీచమైన.

**మలపచ్చి** చూ. మల[3]. విణ. కొంచెం తడారింది. విక్ర. 8.82.

**మలపము** వి. (పికిలిపిట్టల) కూత. ప్రబంధ. 1.30.

**మలపించు[1]** చూ. మల(గు[1].

**మలపించు[2]** చూ. మలయు[1].

**మలపు[1]** చూ. మల(గు[1].

**మలపు[2]** చూ. మలయు[1].

**మలపూబ్** రూ.చూ. మలపూపు. వి. బిడాయించబడ్డ అవరణం, లేదా లోపలపెట్టిన కాగితం.

**మలభక్షకుడు** వి. పిసినిగొట్టు.

నం. మలభక్షక-. పీతిని తినేవాడు.

<నం. మలభక్షక- (అర్థవిపరి.).

**మలమల** వి. మరగటం, మాడటం, వేగటం మొ. వాటిలో అయిన అనుకరణం. భార. ఆది. 3.111.

మలమలమఱగు అ.క్రి. **1.** సలసల కాగు ; **2.** వ్యథపడు.

**మలమలమాడు** అ.క్రి. **1.** ఎక్కువమాడిపోవు ; **2.** ఆకలితో బాధపడు.

**మల(పించు** చూ. మల(చు[1].

**మల(పు** చూ. మల(చు[1].

**మల(పుకొను** చూ. మల(చు[1].

**మల(పుగొను** చూ. మల(చు[1].

**మలయాడు** చూ. మలయు[1].

**మలయిక** చూ. మలయు[1].

**మలయించు** చూ. మలయు[4].

**మలయు[1]** అ.క్రి. **1.** కదలు, చలించు. కు.నం. 9.46 ; **2.** సంచరించు. ఉ.హరి. 4.26.

మ. వలయుక. అటు ఇటు తిరుగు ; గో౦. వలీ. తిరుగు, వలిస్త్. తిప్పు ; కొలా. యులామ్. అటు ఇటు తిరుగు.

మూ.ద.ద్రా., మూ.మ.ద్రా. *వల్-/*మల్-.

మల(గు[2] అ.క్రి. సంచరించు, తిరుగు. నిర్వ.రా. 6.48. మల(చు[6] స.క్రి. కదల్చు, చలింపజేయు. కళా. 6.23. మలపించు[2] స.క్రి. కదలించు. మలపు[2] స.క్రి. కదలించు. రంగా.చ. 2.11. **మలయాడు** అ.క్రి. సంచరించు, తిరుగాడు. ధనా. 1.34. <మలయు[1]+అడు. మలయిక వి. విహారం.

**మలయు[2]** అ.క్రి. **1.** విజృంభించు, చెలరేగు. భార.విరా. 5.165 ; **2.** పోరాడు, పెనగు, మార్కొను, ప్రతిఘటించు. ఉ.హరి. 3.62 ; **3.** యత్నించు, ఉత్సహించు. వసు.

3.96, శాల్ల.నం. 9.251.

మలసిమిట్టాడు అ.క్రి. విజృంభించు. <మలయు²+-ఇ¹³+మట్టు+అడు.

**మలయు³** అ.క్రి. తపించు, బాధపడు. మార్క. 5.27.

త. మలై (మలై-ట్-). తపనపడు, బాధపడు; మ. వలయుక. తపనచెందు, వలచ్చల్. బాధ, వలెక్క. దుఃఖం.

మూ.ద.ద్రా. *వల్/మల్.

మల(గు⁴ అ.క్రి. మండు, ప్రజ్వలించు. కు సం. 2.43.

**మలయు⁴** అ.క్రి. 1. వ్యాపించు. కు.సం. 12.202; 2. వీచు, విసరు. వి.క. 4.162; 3. తొలగు, అపసరిల్లు. గౌ.హరి.పూ. 704.

క. మలె. అహంకారంగల, ఎత్తుగాఉండు, ఎత్తబడు, మల్‌య. గొప్ప, పెద్ద, ముఖ్యమైన, మల్లలి. గుంపు; తు. మల్ల, మల్లవు, మల్లావు. గొప్ప, పెద్ద, ఎక్కువ, ముఖ్యమైన, మల్లసిగె, మల్లడిగె. గొప్పతనం, ఆధిక్యం, అహంకారం, మల్లాయె. పెద్దవాడు (వయసులో), గొప్పవాడు, పె(రిగిన)ద్దవాడు; త. మలి. విస్తారంగా ఉండు, మూగు, వ్యాపించు, విస్తరించు; మల్కు. హెచ్చగు, విస్తారంగాఉండు, నిండివుండు, మల్. బలం, గొప్పతనం, ఫలవంతం, మలర్ (-వ్-స్వ్-). విస్తారంగా ఉండు, నిండు, వ్యాపించు, మలివు. అధికం, విస్తారం. మలిర్ (-వ్-స్వ్-). తరచుగావచ్చు, వెల్లువ, మలివు. విస్తారంగా, నిండు, సంతోషం, మల్లల్. బలం, విస్తారం, సంపద, ఫలవంతం, గొప్పతెలివి, అందం; మ. మల్క. విస్తారంగా ఉండు, మలిక. విస్తారంగాఉండు, మలెక్క. ఉబ్బు, దళమెక్కు; తొ. మస్త్. వరద, వెల్లువ.

మలయించు స.క్రి. మలయచేయు, తొలగించు. సిం.ద్వా. 5.238. <మలయు⁴+ఇంచు³. మలసియాడు అ.క్రి. వీచు, విసరు. ఉ.హరి. 2.173. <మలయు⁴+-ఇ¹³+అడు.

**మలయు⁵** అ.క్రి. 1. వర్తించు, ఉండు. ఉ.హరి. 6.16; 2. ఒప్పు. రామాభ్యు. 6.5; 3. తడయు, ఆలసించు. దశా. 7.2.133.

పో.చూ. త. మలర్. కన్పించు, సంభవించు.

**మలరు** అ.క్రి. 1. యత్నించు, కడగు. కు.సం. 1.41; 2. తపించు.

**మలవ¹** చూ. మలయు³. వి. చచ్చిన ఆవు.

మలవపాలు వి. పశువుల పాలు.

**మలవ²** రూ.చూ. మొలవ. వి. మాగాణిలో ఎక్కువగా పెరిగే గడ్డి, దుబ్బుగడ్డి.

**మలవతీ** రూ.చూ. మల్వతీ. వి. అధికంగా విధించిన పన్ను. రామలిం.శ. 89.

**మలవేయు** స.క్రి. పోతున్న పశువుల్ని అడ్డగించి వేరే దారికి తోలు.

**మలసాల** రూ.చూ. మల్లసాల. వి. కూటం, చావడి. హంస. 1.151.

**మలసిమిట్టాడు** చూ. మలయు².

**మలసియాడు** చూ. మలయు⁴.

**మలహరి** వి. 1. రాగ విశేషం, 24 స్త్రీ రాగాల్లో ఒకటి. హంస. 5.123; 2. చర్మవాద్య విశేషం. ఇందు. 2.54.

**మలా** రూ.చూ. మలాము. వి. పైపూత.

**మలాకి** రూ. మలకా, మలాకీ. వి. శ్రీఖండం. చందనం. కువ.చ. 1.98.

సం. మలయక-. మలయపర్వత సంబంధమైన.

<సం. మలయక-.

**మలాకీ** రూ.చూ. మలక. వి. శ్రీఖండం, చందనం. సింహ.శ. 18.

**మలాటు** రూ. మరాట్. వి. రాతి పనివాళ్ళు వాడే పెద్దసుత్తె.

**మలామ** రూ.చూ. మలాము. వి. బంగారునీరు మొదలగువాని పూత.

**మలామా** రూ.చూ. మలాము. వి. పైపూత.

**మలాము** రూ. మలా, మలామ, మలామా, మొలాము. వి. బంగారం మొ. పూత. సానందో. 5.136.

హిం. ములమ్మా. వస్తువుకు బంగారు, వెండి పూత వేయడం; మరా. ములామా; ఉ.అర. ములమ్మా. బంగారు లేదా వెండి పూత వేయబడిన, కురుపపెట్టడంలో ఒక పద్ధతి, అరబ్బీ పర్షియను భాషలోగల రెండు చరణాల ద్విపద వంటి పద్యం; పార. ములమ్మ.

త. మలామ్.

<ఉ. ములమ్మా.

**మలాయిదా** విణ. పరిష్కారంకాని.

హిం. మలాఈ. మర్దించటం.

**మలారము** రూ.చూ. మల్లారము. వి. 1. గాజుల గుది; 2. నిడుపు కొయ్య కొనకు రెల్లలు కట్టి వీధి మొ. వానిని ఊడ్చే సాధనం.

**మలి** రూ.చూ. మలు. విణ. రెండవ.

మలికలుపు వి. పైరు ముదిరి పొట్టకరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. మలికోత వి. మిరపపంట రెండో కోత. మలిగండ్లు వి.బ.వ. బియ్యం మొ. బాగుచేసినపుడు మలిచి తీయదగిన రాలు. ప్రభులింగ. 5.157. 18 పం. <మలి+కండ్లు. మలిగాబు వి. పైరు ముదిరి పొట్టకరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. మలిగొప్పు వి. మిరప, వంగ మొ. తోటల్లో రెండోసారి కలుపు మొక్కలు తవ్వడం. మలిచాలు వి. ఇరవాలు, నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు. మలిదత వి. రెండవసారి. <మలి+విడత. మలితడి వి. నారుమడిలో పెట్టే రెండో తడి. మలివారము వి. సోమవారం. మలివిరుపు వి. పత్తికాయల రెండో కోత.

**మలికి** రూ.చూ. మెలికె. వి. అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల వడిదారాలకు వేసిన లంకె.

**మలికితపడు** చూ. మలికితము.

**మలికితము** వి. 1. సంశయం. యయా. 4.63; 2. కలత.

త. మలక్కడి. చిత్తసంక్షోభం.

మలికితపడు అ.క్రి. సందేహించు. ప్రభులింగ. 3.22. <మలికితము+పడు.

**మలిగ** రూ.చూ. మళిగ. వి. **1.** అంగడి. ఆం.శా. 2.12 ; **2.** కొట్టుచెక్క, గాడి దర్వాజాలో అమర్చే చెక్క తలుపు.

మలిగదర్వాజా చూ. మలిగ. వి. మడత తలుపులు బిగించడానికి వీలుగా చేయబడిన పెద్ద దర్వాజా.

**మలినర్** విశ.బ.వ. చెడ్డవాళ్ళు. బెజవాడ శాసనం.క్రీ.శ.898-934.

సం. మలిన-. మురికిగల, దుష్టమైన.

<సం. మలిన- + -ర్ (అర్థవిపరి.).

**మలిపించు** చూ. మలుచు[1].

**మలిమండు** చూ. మలు. అ.క్రి. పొరపాటుచేయు.

**మలిమిడి** చూ. మలు, మడమ. రూ. మరిమెడ. వి. పశువుల మడపులకు వచ్చే వాపురోగం. ఆం.శా. 1.125.

**మలిసాల** రూ.చూ. మల్లసాల. వి. చావడి.

**మలిసినరాయి** రూ. మెల్సినరాయి. వి. కందిపొడరాయి, కట్టుబడికిగాని నేలపై పరవడానికిగాని స్తంభాలుగా నిలప డానికిగాని వాడే చెక్కిన లేక మలిచినరాయి.

**మలీఖు** వి. రాజ శాసకుడు.

హిం.ఉ. మలిక్. రాజు, శాసకుడు, సమ్రాట్టు ; అర. మలిక్, మాలిక్.

<ఉ. మలిక్.

**మలు** రూ. మలి. విశ. **1.** రెండవ. శివరా. 3.84, భీమ. 5.76 ; **2.** అల్పమైన, కొంచమైన.

క. మల. తర్వాత, వేరే, రెండవ, మలతండె. నవతితండ్రి.

మలుకారు వి. **1.** ముక్కారు పంటల్లో రెండవకారు ; **2.** శీతాకాలం. మలుచుట్టు వి. **1.** స్క్రూ ; **2.** రెంచి ; **3.** స్క్రూడ్రైవర్. మలుచూలు వి. రెండవచూలు. క. మలచూలు. రెండవసారి గర్భిణిగా ఉండటం, రెండవ బిడ్డ. మలుపక్కము వి. మాసం రెండో పక్షం, కృష్ణ పక్షం. మలుసంజ వి. సాయంసంధ్య.

**మలుకు**[1] రూ.చూ. మలఁక[1]. విశ. నకిపీ చెక్కిన. ద్వి.పరమ. వి. 3.160 ; వి. **1.** దారం మొ. వాటిని ఎదురెదురుగా తగిలించి మెలితిప్పేది ; **2.** మెలి ; **3.** మడత.

మలుకుదోనె వి. వెంటిదోనె, దోనెమలువ తర్వాత ఉన్న భాగం, దోనె నన్నగిల్లే భాగం. మలుకేయు రూ.చూ. మలకవేయు. స.క్రి. **1.** సరిచేసేటపుడు పడుగు తిరగ వేయు ; **2.** మెలికవేయు ; **3.** అతుకు వేయు.

**మలుకు**[2] వి. చాల చిన్నదారి, ఇరుకుదారి, సందు.

**మలుకువ** వి. మురికి, మాలిన్యం.

పో.చూ.సం. మలిన-. మురికిఐనది.

**మలుకేయు** చూ. మలుకు[1].

**మలుగు**[1] రూ. మలువు. అ.క్రి. **1.** నశించు, చెడు. కు.సం. 9.161, భార.ఉద్యో. 2.23 ; **2.** (దీపాదులు) ఆరిపోవు. భార.అను. 4.399 ; **3.** ఉపశమిల్లు, తగ్గు, క్షీణించు. రం.రా.యు. 307వ. 14పం.

క. మాళ్, మణ్. పరీక్షించు, తగ్గు, విడుచు ; తు. మాణవుని. తగ్గు, క్షీణించు ; త. మాళ్ (మాట్-ట్-). చచ్చు, నశించు, పూర్తగు, చెడు.

మూ.ద.ద్రా. *మాళ్ ; మళ్-వ్-.

**మలుగు**[2] రూ. మలుము[1], మల్గు[2]. వి. తుంటి, మక్క. రాజ. వి. 3.60.

కొ. ముల్కె. పీప, నడుము ; నా. ముల్కె. నడుము ; బ్రా. ముఖ్. నడుము, పిరుదులు.

మలుగుజారు అ.క్రి. చూడిపశువులకు ముడ్డి పైభాగం కొంచెం అణగు.

**మలుఁగు** రూ. మల్గు[1], ములుగు, ముల్గు. వి. పాపమీను, శృంగి, ఒకజాతి అడచేప. వేంక.పంచ. 1.294.

త. మలంకు. మీను, ఒకరకం చేప ; కుఇ. ముఅ. ఒకరకం చేప, మీను.

**మలుచము** విశ. సొగసైన, మంచి.

**మలుచు**[1] రూ. మలఁచు[1], మల్చు, మల్చు, మెలుచు[1], మెల్చు[2]. స.క్రి. **1.** చెక్కు, తరిమెనపెట్టు. భార.ఆది. 7.176 ; **2.** చేయు, కల్పించు. భీమ. 3.102 ; **3.** మందలో అమ్మిన గొర్రెలకు గుర్తుగా రోమాలుకత్తిరించు.

క. మాడు. చేయు, మాళ్డ్. (అమ్) చేశాడు, చేసింది ; తు. మళ్పుని. చేయు, నిర్వహించు.

మలిపించు స.క్రి. మలపచేయు, చెక్కించు. భీమ. 5.81. <మలుచు[1] + -ఇంచు[3].

**మలుచు**[2] రూ. మలఁచు[2]. స.క్రి. **1.** బియ్యం మొ. వాటిని రాళ్ళు పోయేటట్లు చేటలో బాగుచేయు ; **2.** కుప్పనూర్చు.

**మలుపన** చూ. మలప. వి. లేగచచ్చిన పాడిగేదెమరల చేపి పాలివ్వటం.

**మలుపు**[1] చూ. మలఁగు[1].

**మలుపు**[2] చూ. మలఁగు[3].

**మలుపు**[3] చూ. మలఁచు[1].

**మలుపుకట్టు** చూ. మలఁచు[1].

**మలుపుకొను** చూ. మలఁగు[1].

**మలుపుడుచీర** చూ. మలఁగు[1].

**మలుపుతొట్టి** చూ. మలఁగు[1].

**మలుపుదోని** చూ. మలఁగు[1].

**మలుపురాయి** చూ. మలఁచు[1].

**మలుపూపు** రూ. మలపూట్, మలహూపు, మలుహూపు, మలూపు, మల్పూపు, మల్హూట్, మల్హూబు, మల్పూపు. వి. **1.** కవరు ; **2.** మూయబడిన ఆవరణం.

ఉ. మల్ఫూఫ్. కవరులో మూయటం, చుట్టబడిన ; పార. మల్ ఫూఫ్. జోడించుటం, ఉత్తరం మడచటం ; అర. మల్ఫూఫ్. చుట్టబడిన.

<ఉ. మల్ఫూఫ్.

**మలుహూపు** రూ.చూ. మలుహూపు. వి. **1.** కవరు ; **2.** మూయ బడిన ఆవరణం.

**మలుము**[1] రూ.చూ. మలుగు[2]. వి. తుంటి.

**మలుము**[2] వి. **1.** పాడిపశువులు చేపటానికి పాలుతీయడానికి ముందు తినిపించేనున్న మొ. బుట్టమేపు ; **2.** గొర్రె, మేక మొ. వాటి పిల్లల పెంట.

**మలుము**[3] వి. కుష్ఠం.

**మలువగడ్డి** వి. సారమైన కంచెగడ్డి.

మలుపు రూ.చూ. మలుగు[1]. అ.క్రి. 1. నశించు ; 2. (దీపాదులు) ఆరిపోవు ; 3. ఉపశమిల్లు, తగ్గు, క్షీణించు.

మలూపు రూ.చూ. మలుపూవు. వి. బిడాయించబడ్డ ఆవరణం, లేదా లోపల పెట్టిన కాగితం.

మలెసాల వి. మెల్ల, అరుగు.

మలేయు చూ. మల[2].

మలోమలికతం వి. మాలిన్యం.

మల్క రూ.చూ. మలక[2]. వి. తురక, తురుష్కుడు, మను. 4.46.

మల్కి రూ.చూ. మలక[2]. వి. మహమ్మదీయుల బిరుదు నామం. ద.హిం.శా.సంపు. శా.సం. 759. క్రీ.శ. 1663.

మల్కిక రూ.చూ. మలక[2]. వి. తురుష్కుడు, మహమ్మదీయుడు. వసు. 4.69.

మల్కిముడి చూ. మల్కు. వి. మెలికముడి.

మల్కు రూ.చూ. మలంక[1]. విణ. నకిషీ చెక్కినది. శశా. 5.7 ; వి. 1. దారం మొ. వాటిని ఎదురెదురుగా తగిలించి మెలితిప్పినది ; 2. మెలి ; 3. మడత.

మల్‌కూజా విణ. పాడుచేయబడిన, నలిపివేసిన.

హిం. మర్‌గజా, మల్‌గజా.

< హిం. మల్‌గజా.

మల్గు[1] రూ.చూ. మలుంగు. వి. పాపమీను, శృంగి, ఒకజాతి ఆడచేప.

మల్గు[2] రూ.చూ. మలుగు[2]. వి. తుంటి.

మల్గూబ రూ.చూ. మలగూబ. వి. మామిడి పళ్ళలో ఒకరకం.

మల్గోబా రూ.చూ. మలగూబ. వి. మామిడిలో ఒక దినుసు.

మల్చు రూ.చూ. మలుచు[1]. స.క్రి. 1. (వెనుకకు) మరలు. కు.సం. 5.49 ; 2. చెక్కు, తరిమెనపెట్టు. రం.రా.బాల. 73 పు. 8పం. ; 3. చేయు, కల్పించు ; 4. బియ్యం మొ. రాళ్ళుపోయేట్లు చేటతో బాగుచేయు.

మల్జెరి రూ. మజ్జెరు. వి. జబ్బవాపు.

మల్జెరు రూ.చూ. మజ్జెరి. వి. జబ్బవాపు.

మల్తాడు చూ. మల[3].

మల్తాడంచు వి. ఒక వరసలో లాహిరీ దాన్ని ఆనుకొని పైన, కింద గీరలూ పడేట్టు నేసిన అంచు.

మల్పికొట్టు చూ. మల్పు.

మల్పు రూ.చూ. మలుపు[3]. స.క్రి. 1 నశింపచేయు ; 2. మలగచేయు ; 3. ఆర్చు, ఆర్పివేయు ; వి. మలచటం, చెక్కటం.

మల్పికొట్టు స.క్రి. సలపతో రెండోసారి పాత్రను త్రిప్పుతూ మెత్తగా కొట్టు. మల్పుజేయు(-చేయు) స.క్రి. మలుచు, రాతిని చెక్కు.

మల్పూపు రూ.చూ. మలుపూవు. వి. బిడాయించబడ్డ ఆవరణం, లేదా లోపల పెట్టిన కాగితం.

మల్పూపుచేయు స.క్రి. మూసివేయు.

మల్‌పూబ్ రూ.చూ. మలుపూవు. వి. బిడాయించబడ్డ ఆవరణం, లేదా లోపల పెట్టిన కాగితం.

మల్‌పూబు రూ.చూ. మలుపూవు. వి. బిడాయించబడ్డ ఆవరణం లేదా లోపలపెట్టిన కాగితం.

మల్పూవు రూ.చూ. మలుపూవు. వి. బిడాయించబడిన ఆవరణం, లేదా లోపలపెట్టిన కాగితం.

మల్బరీఆకు వి. మల్బరీ చెట్టుఆకు, పట్టుపురుగుకు ఆహారంగా ఉపయోగపడే ఆకు.

ఇం. *Mulburry*. మల్బరీచెట్టు.

< ఇం. Mulburry + ఆకు.

మల్మల్ రూ. మల్మిల్, మొలుములు. వి. ఒకవిధమైన నాణ్యమైన గుడ్డ.

హిం. మల్‌మల్, మస్లిన్. లినిన్‌గుడ్డ ; ఉ. మల్‌మల్. నాణ్యమైన ఒకరకం పట్టు ;

క. మలమలి, మలు, మల్‌మల్ ; మస్లిన్ ; త. మల్, మల్‌మల్ ; మ. మలమల్.

< ఉ. మల్‌మల్.

మల్మిల్ రూ.చూ. మల్మల్. వి. ఒకవిధమైన నాణ్యమైన గుడ్డ.

మ్రల రూ.చూ. మరల. అవ్య. మరల, మళ్ళీ.

మ్రలకలుపు వి. పైరుపొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. మ్రలిచ్చు అ.క్రి. పూను, తిరగవేయు, తిరగబెట్టు.

మ్రలిచ్చు చూ. మ్రల.

మల్ల రూ. మల్లె. వి. 1. మట్టికంచం, చిప్ప. ఆం.భా. 2.248 ; 2. పశువులకు దాణా పెట్టే తట్ట.

క. మల్ల, మల్లికె. నీరు మొ. వాటిని తాగే పాత్ర, మట్టితోచేసిన (విచిత్రమైన) పాత్ర ; త. మల్లమ్. కప్పు, కంచం, గిన్నె, మల్తై. భిక్షుకుని భిక్షాపాత్ర ; మ. మల్ల, మల్లిక. మట్టిగిన్నె, మట్టికంచం, మల్లమ్. కొబ్బరి పెంకుతో చేసిన గిన్నె ; గోం. మల్కి. చిన్న మట్టికంచం ; పర్జి. మల్లక. పాత్ర, గిన్నె ;

ప్రా. మల్లగ-. పాత్ర, గిన్నె ; అ.మాగ. మల్ల, మల్లగ-, మల్లయ. మట్టిపాత్ర ; పా. మల్లక-. పాత్ర, కంచం, పంచపాత్ర, మాళద-. భిక్షాపాత్రను ఉంచే పీట ; పో.చూ.సం. మల్లి-. మట్టితో చేసినది, మల్లి. పాత్ర, నీళ్ళుకాచేది, మల్లక-. కొబ్బరి పెంకుతో చేసినపాత్ర, మల్ల-. పాత్ర, నీళ్ళుకాచేది.

మల్లకంచం వి. గుండ్రంగా పళ్ళెంలాగ ఉండే మట్టి మూకుడు. మల్లచిప్ప వి. నేతనేసేటప్పుడు దీంట్లో పేక దారం కండెలు వేసుకొనే మూకుడు. మల్లపీట వి. చెక్క తాపి, కొయ్యతోచేసిన తాపి, గరుగ్గా వున్నచోట్లను చదరం చెయ్యడానికి వాడేది. మల్లబద్ద వి. మూలమట్టం, మూలలు కొలవడానికి తాపీ పనివాళ్ళు వాడే పరికరం. మల్లమూకుడు వి. గుండ్రంగా చిప్పలాగ ఉండే మట్టిమూకుడు.

మల్లకుఁడు వి. కఠినుడు, గడుసరి. భార. అను. 4.123.

సం. మల్లక-. దీపస్తంభం, దంతం, కంకం.

< సం. మల్లక- (అర్థవిపరి.).

మల్లగల్లము రూ.చూ. మల్లగుల్లము. వి. ఇగ్గులాడటం, వాదులాడటం.

మల్లగుంతలు వి.బ.వ. తెగని ఆలోచనలు.

మల్లగుల్లము రూ. మల్లగల్లము. వి. వాదులాడటం.

సం. మల్ల-. జెట్టి, మల్లయుద్ధం చేసేవాడు.

మల్లగుల్లాలు రూ.చూ. మలగులాలు. వి.బ.వ. **1.** అయో మయం ; **2.** కష్టాలు.

మల్లగుల్లాలు చూ. మల్లగుల్లము.

మల్లచఱచు రూ. మల్లనఱచు.

మల్లచఱచుకొను అ.క్రి. జబ్బచఱచుకొను. జైమినిభా. 6.135. మల్లచఱపు వి. భుజాస్ఫాలనం. ఆం.భా. 2.208.

మల్లచఱపు చూ. మల్లచఱచు.

మల్లజాలు(-చాలు$^{2}$) వి. **1.** ఇరవాలు, నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు ; **2.** ఆవిధంగా దున్నే పద్ధతి.

మల్లంచెక్క వి. చెక్కతాపి, కొయ్యతో చేసిన తాపి, గరుగ్గా వున్న చోట్లను చదరం చెయ్యడానికి వాడే సాధన విశేషం. సం. మల్ల-. పాత్ర విశేషం, గండస్థలం.

మల్లట రూ. మల్లాట. వి. **1.** నిర్బంధం. నిరంకు. 2.26 ; **2.** మల్లాట, పెనుగులాట.

మల్లడి చూ. మల్లు$^{2}$. వి. **1.** పరితాపం, చింత. పి.శకు. 3.215 ; **2** మిక్కుటం, అతిశయం, పెంపు. రామాభ్యు. 2.152 ; **3.** పెనకువ, పోరు.

మల్లడిగొట్టు(-కొట్టు$^{1}$) అ.క్రి. పెనగొను. చంద్రాంగ. 5.25. మల్లడిగొను(-కొను) అ.క్రి. **1.** అతిశయించు, అధికమగు. కు.సం. 11.12 ; **2.** పరితపించు. భార. విరా. 2.74 ; **3.** చెలరేగు, విజృంభించు. భార. భీష్మ. 3.248 ; **4.** ఒకదానితో ఒకటి కలియు. భార. ద్రోణ. 1.377 ; **5.** వ్యాపించు. భార. శాంతి. 6.172 ; **6.** పెనగొను, ఒకదానితో ఒకటి చుట్టుకొను. భాస్క.రా.బాల. 181 ; **7.** గుంపుకూడు. ఆము. 1.68. మల్లడిగొలుపు(-కొలుపు) రూ.చూ. మల్లడిగొల్పు. స.క్రి. పరితపింపచేయు. మల్లడిగొల్పు(-కొల్పు) రూ. మల్లడిగొలుపు. స.క్రి. పరితపింపచేయు. పాండు. 4.293. మల్లడించు అ.క్రి. **1.** అతిశయించు. భాగ. 4.515 ; **2.** పెనగొను. భాగ 4.784 ; స.క్రి. పరితపింపచేయు. సానందో. 2.119. < మల్లడి + -ఇంచు$^{3}$. మల్లడిసేయు(-చేయు) స.క్రి. పరితాపం కల్గించు, పరితపింపచేయు. గంధ. 116. మల్లడుల్గొను అ.క్రి. మల్లడిగొను, అతిశయించు. శుక. 4.117. < మల్లడి + -లు + కొను.

మల్లడుల్గొను చూ. మల్లడి.

మల్లదోలు రూ.చూ. మలదోలు. స.క్రి. పశువులుమేసే బీటిలో పచ్చికను పెంచటానికి పశువులను రానీయకుండు.

మల్లనందిమాడ వి. మాడవిశేషం. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 1180, క్రీ.శ. 1216.

మల్లన్నపండుగ వి. శ్రీశైల మల్లికార్జునుణ్ణి కొలిచే పండుగ.

మల్లపుకోడుచెక్క వి. జేబందుచెక్క, పొడుగ్గా సన్నగా ఉండే కొయ్యతాపి, చెక్కసున్నం పట్టించిన తర్వాత ఎచ్చు పెచ్చులు లేకుండా నరిచేయడానికి తాపీవాళ్ళు వాడే పరికరం.

మల్లపువ్వంచు(-అంచు$^{3}$) రూ.చూ. మల్లెపువ్వంచు. వి. మల్లెపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు.

మల్లప్పపండుగ వి. శ్రీశైల మల్లికార్జునుణ్ణి కొలిచే పండుగ.

మల్లబడు(-పడు) అ.క్రి. అవసరమప్పుడు వెనుకాముందూ చూచుకోకుండా పనికిదిగు, నడుముకట్టు.

మల్లమాడ వి. మాడవిశేషం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 933, క్రీ.శ. 1350.

మల్లంపట్టి వి. కట్టుబడిలో వాడేమట్టి, బావుల్లో పొలాల్లో దొరికే మట్టి.

మల్లమ్మబాడరు రూ.చూ. మల్లమ్మ బార్డరు. వి. కృత్రిమపు పట్టుతో కడ్డీమాదిరిగా నేసి నీలిరంగులో చిన్నకడ్డీలు పడేట్టు నేసిన అంచు.

ఇం. *boarder*. అంచు.

< మల్లమ్మ + ఇం. boarder.

మల్లయ్య పండుగ వి. శ్రీశైల మల్లికార్జునుణ్ణి కొలిచే పండుగ.

మల్లరము చూ. మలయు, మల్లు$^{2}$. విణ. మదించినది. అష్టమ. క. 5.259 పు. 1 పం ; వి. **1.** బలిసిన ఎద్దు. అష్టమ. క. 5.2.62. పు. 4 పం ; **2.** గర్వం. ఆం.భా. 1.133.

మల్లరి చూ. మల్లు$^{2}$.

మల్లలమ్మ రూ.చూ. మలలమ్మ. వి. ఒక గ్రామదేవత.

మల్లలు వి.బ.వ. మల్లనిష్కాలు, మల్లమాడలు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 936. క్రీ.శ. 1280.

మల్లసఱచు(-చఱచు) రూ.చూ. మల్లచఱచు. అ.క్రి. దండపై అరచేతితో కొట్టుకొను.

మల్లసాల రూ. మన్నసాల, మలసాల, మలిసాల, మల్లిసాల, మల్లెసాల. వి. చావడి, కూటం, భోజనశాల. అచ్చ.రా. సుందర. 172.

మల్లసీర(-చీర) రూ.చూ. మళ్ళచీర. వి. అంచుల మధ్య భాగంలో రంగుపోగులు పెట్టి గదులుగదులుగా నేసిన చీర.

మల్లాకి చూ. మల$^{3}$.

మల్లాట రూ.చూ. మల్లట. వి. మల్లాడటం.

మల్లాడు చూ. మల్లు$^{2}$. అ.క్రి. **1** పెనుగు. కు.సం. 9.102 ; **2.** మల్లు, పోరాడు, భార.కర్ణ. 2.243 ; **3.** అతిశయించు, అధికమగు. వరాహ. 9.28 ; **4.** క్రీడించు, విహరించు. వసు. 4.12 ; **5.** పెనుగులాడు. అష్టమ. క. 1.38 పు. 23పం.

మల్లాపురంరౌతు వి. మల్లాపురం గ్రామం నుంచి వచ్చే చలవ రాయి.

మల్లామడి విణ. పీడితం, అదమబడినది. ఉ.హరి. 5.16 ; వి. నొక్కుడు, అదుముడు.

మల్లారము రూ. మలారము. వి. మట్టిగాజులగుడి. ఆం.భా. 3.36.

క. మలార. గాజులగుడి ; త. మలారమ్.

మల్లి$^{1}$ రూ.చూ. మల్లియ. వి. పందిళ్ళమీద పెంచే పూలతీగ (Jasminum sambac).

మల్లికానారంజి వి. నారింజలో ఒకరకం చెట్టు (Citrus aurantium bigaradia). మల్లిపందిరి వి. **1.** ఒకరకం గళ్ళుపడేట్టు నేసిన అంచు ; **2.** పెద్దగడిలో సన్నగడి పడేట్టు నేసిన చీర, సారంగి. మల్లిపువ్వంచు రూ.చూ. మల్లెపువ్వంచు. వి. మల్లెపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. మల్లిమొగ్గంచు వి. మల్లిమొగ్గమాదిరి డిజైను నేసిన

అంచు. **మల్లిమొగ్గపేటు** వి. అంచుగో మల్లిమొగ్గ ఆకారంలో నేసిన డిజైను. **మల్లిమొగ్గబూటా** వి. బట్ట మధ్యభాగంలో మల్లిమొగ్గమాదిరి నేసిన డిజైను.

**మల్లి**$^{2}$ వి. అక్కడి మాటలు ఇక్కడ, ఇక్కడిమాటలు అక్కడ చెప్పే ఆడది.

**మల్లిగాఁడు** వి. క్షుద్రజనుడు, అల్పుడైన మానవుడు. పండి.చ. 2.95 పు.

**మల్లి**$^{3}$ రూ.చూ. మల్లె$^{2}$. వి. జొన్న, సజ్జ, కొఱ్ఱ, పొగాకు, చెరుకు మొ. పైర్లవేళ్ళ నుండి పెరిగే కలుపు మొక్క.

**మల్లింగమడుపులు** వి.బ.వ. జాతర్లలో అమ్మవారి నైవేద్యానికి వంటవండే మట్టిపాత్రలు, తొట్టిమాదిరి ఉండి మూడు రంధ్రాలుండే పాత్రలు.

**మల్లిముల్లు** రూ.చూ. మల్లెముల్లు. వి. ముల్లు తీసే సాధనం.

**మల్లియ** రూ. మల్లి$^{1}$, మల్లె$^{1}$. వి. 1. మల్లెపూవు. కు.సం. 9.116. ఉ.రా. 4.167 ; 2. మల్లెతీగ. నీలా. 3.6 (Jasminum sambac).

సం. మల్లీ, మల్లికా. మల్లెతీగ, మల్లెపువ్వు ; ప్రా. మల్లి, మల్లిఅ ; శౌ. మల్లిఅ; అమా.గ. మల్లిఅ, మలియా ;

క. మల్లిగె; తు. మల్లిగె ; త. మల్లికై ; కువి. మల్లె. <ప్రా. మల్లిఅ.

**మల్లియకరివేల** వి. అల్పతృణవిశేషం. హంస. 5.45.

**మల్లిసాల** రూ.చూ. మల్లసాల. వి. బయటి వడసాల, చావడి, బయటి పంచ.

**మల్లీశ్వరంచు** చూ. మల్లీశ్వరి.

**మల్లీశ్వరి** వి. ఒకరకం పచ్చ, నూర్జహాను కంటె తెలుపు వన్నె.

**మల్లీశ్వరంచు** వి. మూడురంగులు పెట్టి నేసిన ఒకరకం అంచు ; 'మల్లీశ్వరి' అనే సినిమా పేరుతో ప్రచారంలోకి వచ్చిన ఒకరకం అంచు. <మల్లీశ్వరి + అంచు$^{3}$. **మల్లీశ్వరి కమ్మి** వి. ఒక పెద్దపట్టెకు రెండు వైపులా మూడేసి చిన్న పట్టెలు నేసిన కమ్మి. **మల్లీశ్వరిచీర** వి. ఒకరకం పచ్చ, నూర్జహానుకంటె తెలుపు వన్నె చీర.

**మల్లు**$^{1}$ వి. 1. కోతి, మర్కటం. యయా. 3.35 ; 2. ఎలుగుబంటి, భల్లూకం.

త. మలై. కొండ.

**మల్లు**$^{2}$ వి. 1. మల్లుడు, జెట్టి. భీమ. 2.73; 2. మల్లయుద్ధం. జెట్టిపెనకువ.

క. మల్లాడు. కొన్నెటికొరకు యుద్ధంచేయు, దెబ్బలాడు, మల్ల. జెట్టి, మల్లుడు, చాల బలంగలవాడు, మల్లా-మల్లి. మల్లయుద్ధంచేయు ; తు. మల్లె. జెట్టి, మల్లుడు; త. మల్, మల్లమ్. కుస్తీ, మల్లయుద్ధం, మల్లాట్పుమ్, మల్లాటమ్. మల్లయుద్ధం, కుస్తీ, పోట్లాట, మల్లణ్. జెట్టి, మల్లుడు, మల్లయుద్ధంలో ప్రావీణ్యం గలవాడు, గొప్పవాడు, మల్లు-క్కట్టు. పోట్లాట, యుద్ధం చేయు, కుస్తీపట్టు ; మ. మల్లు. మల్లయుద్ధం, మల్లన్. జెట్టి, మల్లుడు ; పో.చూ.త. మలై. కొండ ;

పో.చూ.సం. మల్ల-. మల్లుడు, జెట్టి, బలవంతుడు.

**మల్లరి** వి. జెట్టి, మల్లుడు. పి.శకు. 3.225. <మల్లు$^{2}$ +-అరి. **మల్లుకట్టు** స.క్రి. అడ్డగించు, నిరోధించు. **మల్లుకొను** అ.క్రి. 1. విజృంభించు ; 2. ఒక పనిని పలుమార్లు చేయు. **మల్లుతనము** వి. జెట్టితనం, మల్లత్వం. భార.విరా. 1.81. **మల్లుపెనంగు** రూ. మల్లుపెనఁగు. అ.క్రి. మల్లయుద్ధంచేయు. విష్ణుపు. 6.268. **మల్లుపెనఁగు** రూ.చూ. మల్లుపెనంగు. అ.క్రి. జెట్టి పెనకువగా పెనగు. **మల్లుపోరు** వి.ఔ. అనౌ. మల్లయుద్ధం, జెట్టిపెనకువ. ఆము. 2.9.

**మల్లు**$^{3}$ వి. 1. ఏకులు ; 2. మిల్లు బట్ట.

ఇం. *Mill*. యంత్రం.

**మల్లుతాను** వి. మల్లుబట్ట. **మల్లుబెల్లిపంచె** రూ.చూ. మల్లుబెళ్ళిపంచె. వి. పెళ్ళి అయిన తరువాత పెళ్ళికొడుకు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు కట్టుకొనే పంచె. **మల్లుబెళ్ళిపంచె** రూ. మల్లుబెల్లిపంచె. వి. పెళ్ళి అయిన తరువాత పెళ్ళికొడుకు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు కట్టుకొనే పంచె.

**మల్లె**$^{1}$ రూ.చూ. మల్లియ. వి. 1. మల్లితీగ. శృం.నై. 8.162 ; 2. మల్లిపువ్వు. యయా. 4.25 ; 3. తీగలు అల్లుకోటానికి దోహదం చేసే దడి.

**మల్లెపువ్వంచు** రూ. మల్లపువ్వంచు, మల్లిపువ్వంచు. వి. మల్లెపువ్వ ఆకారంలో డిజైను నేసిన అంచు. **మల్లెపువ్వబొగిడి** వి. అంచులో మల్లెపువ్వ, మొగ్గపడేట్టు నేసిన డిజైను. **మల్లెపూవుచీర** వి. మధ్యభాగంలో మల్లెపువ్వ మాదిరి డిజైన్లు నేసిన చీర. **మల్లెమార్పులు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **మల్లెమొగ్గ** వి. 1. చాల చక్కని స్త్రీ ; 2. అంచులో మల్లెమొగ్గ ఆకారంలో డిజైన్లు నేసిన చాప. **మల్లెమెగ్గచీర** వి. 1. అంచులో మల్లెమొగ్గమాదిరి డిజైన్లు నేసిన చీర ; 2. అంచుల మధ్యభాగంలో మల్లెమొగ్గ ఆకారం డిజైన్లు నేసిన చీర. **మల్లెమొగ్గలు** వి.బ.వ. 1. మెడనగ ; 2. మల్లెచెట్టు మొగ్గలు. **మల్లెలగుది** వి. మల్లెపూల గుత్తివలె మనోజ్ఞం అవటంచేత కుక్కకు ఇయ్యబడిన పేరు. **మల్లెలు** వి.బ.వ. స్ఫోటకం బొబ్బల్లో కలిగే పురుగులు. **మల్లెశ్రీగంధులు** వి.బ.వ. ధాన్యవిశేషం, ఒక జాతి వడ్లు. హంస. 4.128. **మల్లెసరులు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**మల్లె**$^{2}$ రూ. మల్లి$^{3}$. వి. 1. ఒకవిధమైన సస్యరోగం. వేంక. పంచ. 1.347 ; 2. జొన్న, సజ్జ, కొఱ్ఱ, పొగాకు, చెరుకు మొ. చాలాపైర్ల వేళ్ళనుంచి పెరిగే కలుపు మొక్క (Orobanche lonainthus).

**మల్లెపడు** అ.క్రి. కలుపు మొక్కలు ఎక్కువగా పెరుగు. కాళ. 3.152. **మల్లెమారిజొన్న** వి. 'మల్లె' పుట్టినా దెబ్బతినని జొన్న. **మల్లెవట్టినచేనిక్రమము(పట్టినచేనిక్రమము)** అవ్య.ద్రు. మల్లెకలుపు మొక్క ఉన్న చేనువలె. మను. 5.26. సం. క్రమ-. వరస, పద్ధతి.

**మల్లె**$^{3}$ వి. నిప్పు. క్రీడా. 1.42.

**మల్లె**$^{4}$ వి. రెమ్మ, ఉపశాఖ. ఆం. భా. 2.37.

**మల్లె**$^{5}$ రూ.చూ. మల్ల. వి. మట్టికంచం, చిప్ప.

**మల్లె**$^{6}$ రూ.చూ. మెల్లె$^{1}$. వి. అరుగు, మలెసాల.

**మల్లెజేగులు** రూ. మల్లెజేరుగు. వి. రావులుగు.

**మల్లెజేరుగు** రూ.చూ. మల్లెజేగులు. వి. రావులుగు, లోహ

పృష్ఠం.

**మల్లెముల్లు** రూ. మల్లిముల్లు. వి. కాలిలో విరిగిన ముల్లు తీసే శ్రావణం వంటి చిన్న ఇనపసాధనం.

**మల్లెసాల** రూ.చూ. మల్లసాల. వి. చావడి, బయటివడసాల, బయటి పంచ.

**మల్వతీ** రూ. మలవతీ. వి. అధికంగా విధించిన పన్ను. రామలిం. శ. 5.

హిం. మాలియత్. పన్నులు, మల్వతీ; ఉ. మఅలియత్, మాలియత్; పార. మాలియాత్; అర. మఅలియత్.

< ఉ. మాలియత్.

**మల్సు** రూ.చూ. మలుచు[1]. స.క్రి. 1. చెక్కు. తరిమెనచెట్టు; 2. చేయు, కల్పించు; 3. బియ్యం మొ. రాళ్ళు పోయేట్లు చేలులో బాగుచేయు; 4. మందలో అమ్మిన గొర్రెలకు గుర్తుగా రోమాలు కత్తిరించు.

**మళ** రూ.చూ. మొల. వి. 1. తలబుడుపులేని లావు ఇనప చీల; 2. నాగలి కర్రును ఇమిడ్చేచీల; 3. మేకు: 4. రాతిని చెక్కేసాధనం.

**మళిగ** రూ. మడిగ, మడిగె, మణిగ, మలిగ, మళిగె. వి. ఆపణం, అంగడి. యయా. 1.16.

సం. మఠికా. చిన్నమఠం; ప్రా. మఢిగా, మఢీ. చిన్నమఠం;

క. మళిగె. అంగడి, కొట్టు; తు. మళిగె. దుకాణం, కొట్టు, బట్టలకొట్టు, టోకుదుకాణం; త. మళిగై. అంగడి, దుకాణం.

< ప్రా. మఢిగా.

**మళిగసుంకము** రూ.చూ. మడిగసుంకము. వి. అంగడిపై సుంకం.

**మళిగె** రూ.చూ. మళిగ. వి. అంగడి.

**మళియలు** వి.బ.వ. పూలమాలలు. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1275, క్రి. శ. 1233.

**మళ్లగుల్లాలు** వి.బ.వ. మలకలు, పేచీలు, మలగుదాలు.

**మళ్లగొట్టు** చూ. మళ్ల.

**మళ్లవేయు** చూ. మళ్ల.

**మళ్లవేసుకొను** చూ. మళ్ల.

**మళ్లా** రూ.చూ. మరల, అవ్య. మరల.

**మళ్లిక** చూ. మళ్ల.

**మళ్లించు** చూ. మళ్ల.

**మళ్లీ** రూ.చూ. మరల. అవ్య. మరల.

**మళ్ల** రూ.చూ. మరలు. అ.క్రి. మరలు. పల్నా. పు. 50, భాగ. 6.247.

**మళ్లగొట్టు** రూ. చూ. మలగొట్టు. స.క్రి. బళ్ళుగాని పశువులుగాని ఒకరి పొలంలోకి రాకుండ అడ్డగించి వెనుకకు తిప్పి కొట్టివేయు. **మళ్లవేయు** రూ. మళ్లేయు. స.క్రి. మలవేయు. **మళ్లవేసుకొను** స.క్రి. మరలించుకొను. తాళ్ల. సం. 14.61. **మళ్లిక** వి. తిప్పుకోవటం. అధ్యా. యు. 170. **మళ్లించు** స.క్రి. మరలించు, నివర్తింపచేయు. ఉ. హరి. 4.146. < మళ్ల. + -ఇంచు[3]. **మళ్లగొట్టు** (-కొట్టు[1]) రూ. చూ. మలగొట్టు. స.క్రి. మలవేయు. **మళ్లేయు** రూ.చూ. మళ్లవేయు. స.క్రి. మలవేయు.

**మళ్లేయు** చూ. మళ్ల.

**మళ్ళచీర** చూ. మడి[1].

**మవకూపు** రూ. మవుకూఫ్, మవుఖూబు, మోకూపు, మోకూబు, మోఖూబు, మౌఖూబు. వి. ఉద్యోగం నుంచి తీసివేయడం.

హిం. ఉ. మౌకూఫ్; మరా. మౌకూఫ్; పార. మౌకూఫ్; అర. మూకూఫ్. పదచ్యుతం, వదలివేయబడిన.

< ఉ. మౌకూఫ్.

**మవల్లీ** రూ.చూ. మౌల్వీ. వి. ముస్లింసన్న్యాసి.

**మవుకూఫ్** రూ.చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసివేయటం.

**మవుఖూబు** రూ.చూ. మవకూపు. వి. వదలివేయబడటం.

**మవుజుదాతు** రూ. చూ. మౌజుదాతు. వి. నిలవఉంచబడ్డ సరుకు.

**మవుజె** రూ.చూ. మౌంజె. వి. ఒకఊరితో చేరిన చిన్నపల్లె.

**మవుజే** రూ.చూ. మౌంజె. వి. ఒకఊరితో చేరిన చిన్నపల్లె.

**మవుంజె** రూ.చూ. మౌంజె. వి. ఒకఊరితో చేరిన చిన్నపల్లె.

**మవుంజే** రూ.చూ. మౌంజె. వి. గ్రామం.

**మవుంజేవారి** రూ.చూ. మౌజీవారి. విశ. పల్లెల లేదా మౌజే క్రమప్రకారం.

**మవురా** రూ.చూ. మొక్కరము. వి. నిట్ట, కొట్టం కట్టుబడిలో మధ్యవేసే నిలుపుగుంజ.

**మవురి** రూ. చూ. మౌరి. వి. పాములవాడు ఊదేబుర్ర, నాగస్వరం.

**మవ్వమారు** చూ. మవ్వము.

**మవ్వము** వి. 1. కోమలత్వం, మార్దవం. కు. సం. 3.74; 2. సౌందర్యం, చక్కదనం. భార. ద్రోణ. 1.136; 3. ఉత్సాహం. ఉ. హరి. 3.125; 4. విధం, రీతి. విష్ణుపు. 6.71; విశ. 1. కోమలమైంది, మృదువైంది. కు. సం. 9.312; 2. మనోజ్ఞమైంది, సుందరమైంది. హరి. పూ. 4.16; 3. చక్కదనం కూర్చేది, శోభాకరం. కాశ. 4.92; 4. సూక్ష్మం, సన్ననిది. శుక. 3.323.

త. మవ్వమ్, మయమ్, మామై, మాతర్, మాతు. సౌందర్యం, చక్కదనం, మా. చక్కదనం, అందం, లక్ష్మీదేవి; కో. మక్, మక్‌మ్. అందం, చక్కదనం;

పో. చూ. సం. మార్దవ-. మృదువు.

**మవ్వమారు** అ.క్రి. 1. కోమలమగు; 2. సొగసగు. < మవ్వము + ఆరు[1]. **మవ్వమెక్కు** అ.క్రి. కోమలమగు. కు. సం. 7.197. < మవ్వము + ఎక్కు.

**మవ్వమెక్కు** చూ. మవ్వము.

**మశటవ** రూ.చూ. మసటికె. వి. సర్పేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న చిన్నమట్టిపాత్ర.

**మశనికాడు** వి. వల్లకాడు, శ్మశానం.

సం. శ్మశాన-; శ్మశానిక-. ప్రేతభూమి; ప్రా. మసాణ-, మసాన-; ఒ. మసాణిఅ.

< ప్రా. మసాణ- + కాడు[1].

**మశర** రూ.చూ. మశల. వి. మంచె, సున్నబ్బట్టీ పైభాగంలో ముఖ్యంగా జాతి బట్టీ మీద మనిషి తిరగటానికి వీలుగా దిమ్మలమీద క్రరలు పరచి వాటిమీద మట్టిపూసి కట్టిన అంచె.

**మశల** రూ. మశర, మసాలు, మసిలి, మసెల, మస్లె. వి. మంచె, సున్నబ్బట్టీ పైభాగంలో ముఖ్యంగా జాతిబట్టీమీద మనిషి తిరగటానికి వీలుగా దిమ్మలమీద క్రరలు పరచి వాటిమీద మట్టిపూసి కట్టిన అంచె.

**మశాకత్తు** రూ. చూ. మశాఖత్తు. వి. **1**. భూమికి పెట్టిన ఎరువు; **2**. శిల్పులు చేసిన వస్తువులకు మజూరి; విణ. వృద్ధిచేయబడ్డది.

**మశాఖత్తు** రూ. మశాకత్తు, మషాకత్తు, మషాఖతు. విణ. వృద్ధి చేయబడినది ; వి. సర్వేకొలతలు తెలిపే నివేదిక.

హిం. మశ్క్కత్. శ్రమ, కష్టం, బాధ ; మరా. మశాగత్ ; ఉ.అర. మషక్కత్. కష్టం, శ్రమ, పాటు, తొందర, మసాహత్. భూమి కొలవటం, క్షేత్రగణితం.

< ఉ. మషక్కత్.

**మశాణం** రూ.చూ. మశానము. వి. శ్మశానం.

**మశాతు** రూ.చూ. మషాహతు. వి. కొలవటం, సర్వేచేయటం.

**మశానము** రూ. మశాణం. వి. శ్మశానం, వల్లకాడు.

సం. శ్మశాన-. వల్లకాడు ; ప్రా. మసాణ-, సుసాణ- ; పా. సుసాన- ; నే.బెం. మసాన్ ; ఒ. మసాణ, మసాణి, ససాన ; గు. మసాణ్ ; హిం. మసాన్.

< ప్రా. మసాణ-.

**మశాల్చి** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మశాల్తి** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మశాల్సి** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మశీద్** రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే మందిరం.

**మశీది** రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే మందిరం.

**మశీదు** రూ.చూ. మసీదు. వి. తురుష్కుల దేవాలయం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 762, క్రీ.శ. 1668.

**మషరతు** వి. ఒడంబడిక.

ఉ.అర. మష్రూత్, మష్రూతి. అంగీకరించిన, ఒడంబడిక చేయబడిన, జమీందారుకు చెల్లించబడే పది శాతం శాశ్వత శిస్తు.

< ఉ. మష్రూత్.

**మషహతుదారు** వి. పొలంలో సర్వే చేసే ఉద్యోగి.

మరా. మ్హత్-దార్.

**మషాకత్తు** రూ.చూ. మశాఖత్తు. వి. సేవ.

**మషాఖతు** రూ.చూ. మశాఖత్తు. వి. భూమిని బాగుచేయటం.

**మషాజ** రూ.చూ. మషాల్చి. వి. కాగడా పట్టే చాకలి.

**మషాతు** రూ.చూ. మషాహతు. వి. నేల కొలవటం, సర్వే.

**మషాయత్** రూ.చూ. మషాహతు. వి. కొలవటం, సర్వే చేయటం.

**మషాల్** రూ.చూ. మషాలు. వి. దివిటీ.

**మషాలిచి** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మషాలు** రూ. మషాల్. వి. దివిటీ.

హిం. మశాల్. దివిటీ ; ఉ. మషాల్.

క. మసాలు.

< ఉ. మషాల్.

**మషాలుచీ** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మషాల్చి** రూ. మశాల్చి, మశాల్తి, మశాల్సి, మషాజ, మషాలిచి, మషాలుచీ, మషాల్జి, మషాల్జీ, మషాల్తి, మసాల్చి, మసాల్జి, మసాల్జీ, మసాల్తి, మస్సాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు (చాకలి) ; **2**. దివిటీ దొంగతనం.

హిం.ఉ. మషాల్చీ. దివిటీ పట్టేవాడు ;

క. మషాల్చి ; మ. మషాల్చి. ఊడ్చేవాడు.

< ఉ. మషాల్చీ.

**మషాల్జి** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మషాల్జీ** రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

**మషాల్తి** రూ.చూ. మషాల్చి. వి. దివిటీపట్టేవాడు.

**మషాహతు** రూ. మశాతు, మషాతు, మషాయత్. వి. కొలత.

ఉ.అర. మసాహత్. భూమి కొలత వేయటం, క్షేత్రగణితం.

< ఉ. మసాహత్.

**మషీ** వి. కావలివాడు.

ఉ.అర. మషీ. నడవటం, వెళ్ళటం.

< ఉ. మషీ.

**మషురు** రూ.చూ. మషురూ. వి. ఒకవిధమైన పట్టుగుడ్డ.

**మషురూ** రూ. మషురు, మసురు, మసురూ. వి. ఒకవిధమైన పట్టుగుడ్డ.

హిం.ఉ. మష్రూ, మష్రుఅ. పొడవు గీత లుండే ఒకరకమైన దళసరి గుడ్డ ; అర. మశ్రూఅ.

< ఉ. మష్రూ.

**మష్టు** రూ.చూ. మస్టు. వి. మురికి, మకిలి.

**మస**[1] వి. **1**. విలాసం, శృంగారచేష్ట. విక్ర. 8.82 ; **2**. డిజైను అద్దకంలో అంచులో మొదట అద్దే కొయ్య అచ్చు; **3**. అచ్చుతో మొదట అద్దిన రేఖాచిత్రం ; **4**. భ్రమ ; **5**. తళుకు ; **6**. క్రీడ.

**మసకొను** రూ. మసగొను. అ.క్రి. **1**. ఆసక్తికొను, మక్కువపడు. దా.శ. 7 ; **2**. సంభోగేచ్ఛగొను. **మసకొలుపు** రూ. మసకొల్పు. స.క్రి. **1**. సంభోగేచ్ఛ కలగచేయు. పాండు. 5.41 ; **2**. ఆసగొల్పు, ఆసక్తిపడచేయు. అచ్చ.రా.అయోధ్యా. 34. **మసకొల్పు** రూ.చూ. మసకొలుపు. అ.క్రి. వశపరచుకొను. **మసగొను** రూ. చూ.

మసకొను. అ.క్రి. 1. ఆసక్తిగొను, మక్కువపడు ; 2. సంభోగేచ్ఛగొను.

**మసక** రూ. మసుకు, మసుగు. వి. 1. కొంచెం నలుపు. శృం.నై. 7.141 ; 2. మునిచీకటి. మను. 4.37 ; విశే. కొంచెం నల్లని.

క. మసమస. మందమైన, అస్పష్టమైన, మసక, మసగె. కొంచెం నలుపురంగు, మసకు. కొంచెం నలుపు రంగు, మసకనె. అస్పష్టమైన, మందమైన, మసుల్. అదృశ్యమగు, మసకబారు, పేలవమగు ; త. మచంకు (మచంకి). కాంతివిహీనమగు, మచంకల్. సాయం సంధ్య, మసకచీకటి, మైమల్. సాయంకాలం ; మ. మయణ్ణుక. కాంతివిహీనమగు, నగంచీకటగు, మయక్కు. మసకచీకటి, సందెచీకటి, మయంపు. సందెచీకటి, మయ్యల్. సందెచీకటి, మునిమాపు ; కుఇ. మహురి. సందెచీకటి.

మసకచవుదు వి. పైన చవుడు, కింద రేగడి ఎర్రమన్ను మొ.వి కల నేల, మసరనేల. మసకన వి. 1. ఇంచుక నలుపు ; 2. మునిచీకటి. మసకనేల వి. పైన చవుడు కింద రేగడి ఎర్రమన్ను మొ.వి కల నేల. మసక(బడు (-పడు) అ.క్రి. కాంతిహీనమగు. జైమిని భా. 7.193. మసకరేగడి రూ.చూ. మసకరేవడి. వి. ఎర్రమన్ను కలిసిన రేగడి. మసకరేవడి రూ. మసకరేగడి. వి. ఎర్రమన్ను కలిసిన రేగడి.

**మసకతిత్తి** రూ. మసగతిత్తి. వి. 1. సుత్తిపట్టు తోలుతిత్తి. శ్రీరం.మా. 4.154 ; 2. పన్నీరు మొ.వి నింపే తోలు తిత్తి. నార.పంచ. 2.98.

**మసకపు(బాము**[1] చూ. మసకము.

**మసకము** వి. 1. అహిరతి, సర్పసురతం. భీమ. 1.34 ; 2. రతి, సురతం. కవిక. 3.195 ; 3. సర్పసంభోగేచ్ఛ. విప్ర. 2.14 ; 4. మక్కువ, ఆసక్తి.

త. మత (మతపు). బలం, అందం, అధికం, విస్తారం, అజ్ఞానం, మయక్కమ్. రతి, సురతం.

మసకపు(బాము (-పాము[1]) వి. సురతం ఒనరించే పాము.

**మసకలుపాఋటు** చూ. మసకము. వి. అహిరతి.

**మసకెరుపురౌతు** వి. ఎర్రరాయి, సున్నపుమన్ను.

**మసగతిత్తి** రూ.చూ. మసకతిత్తి. వి. 1. సుత్తిపట్టు తోలుతిత్తి ; 2. పన్నీరు మొ.వి నింపే తోలుతిత్తి.

**మస(గు** అ.క్రి. విజృంభించు, చెలరేగు. కు.సం. 2.78.

క. మసక. ఉద్రేకం, అలజడి, మసగు, మొసగు, వ్యాపించు, వ్యాప్తిచెందు, ప్రదర్శించు, వృద్ధిచెందు, వర్ధిల్లు, మసె. కామం, మా. ఉద్రేకం, కోపం ; తు. మదకుని. వేగంగా కదలు, మస్థు, అధికం, స్థూలం, మస్థి. గర్వం ; త. మైంటు. కోరిక, గర్వం, బలం, మతర్. హెచ్చుగు. విస్తారంగా ఉండు, మత. పిచ్చికోపంగల, విస్తారమగు. స్థూలమగు, సారవంతమగు, కామాతురతగల, అక్రమమగు, పొగరుకల, కంగారుకల, మతక్కమ్-. బాగా తినటం వలన తాగటం వలన కలిగేమత్తు, మైకం, మతప్పు. మత్తు, కామాతురం, భయంకరం, (భూమి) సారవంతం, మతమ్. ఉల్లాసం, ఉత్సాహం, ఆనందం, బలం, గర్వం, తేనె, ఉన్మాదం, కామాతురత, మత్తు, విస్తారం, గొప్పతనం, మతళ్. పొగరు, బలం, కుతూహలం, అందం, గొప్ప తనం, అధికం, అజ్ఞానం, కంగారు, మతర్ (-ప్)-త్-). ఫలవంతమైన, గొప్ప, ఉన్మాదంగల, స్వాతిశయంగల, పొగరు, సంతోషం, విస్తారం, రద్దీ, ధైర్యం, మతర్ప్పు, మతర్వు. సంపదగల, సంతోషం, అందం, ఆనందం, బలం, విస్తారం, నిండుదనం, మతర్వె. గొప్ప, గర్వం, అహంకారం, తడబాటు, మతలై. కోరిక, అనుబంధం, మతౌర్. పొగరు, మతౌళి (-ప్పు-, -త్). వర్ధిల్లు, బాగా సారవంతమైన భూమి, మతి (-ప్పు-, -త్ -). ఆగ్రహం గల, కోపంగల, మతిప్పు. బలియు, లావెక్కు (చెట్లవలె) ఆకలెక్కువగు, మలైఇయ. కామాతురత, అక్రమం, అందం, సౌందర్యం, అమాయకత్వం, బలమైన, మతుకై. బలం ; మ. మదమ్. ఉత్సాహం, మత్తు, మైకం, మద జలం, (ఏనుగు గండస్థలం నుంచి కారేది), మదాళిక్క. స్థితి పెరుగు. మదిక్క. ఉల్లాసపరుచు, మత్తిల్లచేయు. మద మెక్కు ; పో.చూ.త. మయ ;

హిం. మచ్‌నా. ఉద్రేకపడు ; పో.చూ.సం. మచ్. పొగరుగల ; ప్రా. మచ్చై. ఉద్రేకపడు.

<మూ.మ.ద్రా. *మచ్-/*మత్-*మయ్-.

**మసజీదు** రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే పవిత్ర మందిరం. విశ్వే.శ.

**మసటికె** చూ. మసి.

**మసటు** రూ.చూ. మస్టు. వి. 1. మురికి. పాండు. 5.41 ; 2. నింపిరి.

**మసడు** రూ.చూ. మస్టు. వి. మాలిన్యం, మురికి.

**మసదరు** రూ. మునదరు. వి. మూడు రకాలు.

ఉ. మస్‌దర్. మూలస్థానం, ఉత్పత్తి ; పార. మస్దర్. మూలం, విషయం.

<ఉ. మస్‌దర్.

**మసనద** వి. సింహాసనం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 745. క్రీ.శ. 1530.

హిం.ఉ, పార. అర. మస్‌నద్. సింహాసనం.

<ఉ. మస్‌నద్.

**మసనము** వి. పితృవనం, వల్లకాడు. భార. ఆరణ్య. 6.201.

సం. శ్మశాన-. వల్లకాడు ; ప్రా. మసావణ, మసాణ-, సిఆణ, సుసాణ-, సోమాణ- ; జై.మహా. సుసాణ ; శౌ. మసాణ, శ్మశానమ్ ; మా. మశాణం ; అ.మా. మసాణ-, సాణ-, సుసాణ- ; పా. సుసాన- ; నే.బెం. మసాన్ ; హిం. మసాన్ ; ఒ. మసాణ, మసాణి, ససాన ;

క. మసణ, మసాణ. వల్లకాడు, మసణి. దుర్గా భేదం ; తు. మసణ. వల్లకాడు ; త. మయానమ్ ; గోం. మిస్సానా. శవాన్ని పాతిపెట్టు ; కువి. మహాణి. వల్ల కాడు ; ఒరయాన్. మస్డా.

<ప్రా. మసాణ-.

**మసపనేల** వి. రెండు మూడు రంగుల మన్ను కలిసిన నేల.

మసపరేగడి వి. ఎఱ్ఱమన్ను కలిసిన రేగడి.
మసమస రూ. మసమసక, మసమసకన. వి. కొంచెం మసక. పండి.చ. 4.273 ప.
మసమసక రూ. చూ. మసమస. వి. ఇంచించుక నలుపు. శృం.నై. 8 12.

మసమసకచీకట్లు వి.బ.వ. కనుచీకట్లు. క్రీడా. పు. 89. మసమసకలువారు అ.క్రి. ఇంచుక చీకటిగొను. కొంచెం చూపు చెడు. కకుత్స. 1.198.
మసమసకన రూ.చూ. మసమస. విణ. కొంచెం నల్లనైన. కాశీ 1.93.
మసర రూ. మసరు[2]. వి. 1. ధూసరవర్ణం. పద్మ. 1.91 ; 2. ఏవైనా రెండు మూడు రంగుల కలయిక ; 3. చలువ చెయ్యని ముడినూలు.

మసరకట్టు వి. మసరనేల. మసరనూలు రూ. మసరు నూలు. వి. చలవచెయ్యని ముడినూలు. మసరనేల వి. రెండు మూడు రకాల (లేక రంగుల) మన్ను కలిసిన నేల. మసర పాడు వి. ఇంకోరకం మన్ను కలిసిన పాటినేల. మసరలు రూ. మసరులు, మసిరెలు. వి.బ.వ. 1. ధాన్య విశేషం, ఒక రకం వడ్లు ; 2. చిరుసెనగలు.
మసరిడు చూ. మసరు[1].
మసరు[1] అ.క్రి. పొగరెక్కు, మదించు. నిర్వ.రా. 5.80 ; వి. గర్వం, అహంకారం.

త. మతర్. పొగరెక్కు, వెర్రి ఆవేశంకల, ఉన్మాది అగు, మతమ్. గర్వం. అహంకారం, బలం, ఆవేశం, పిచ్చి, పొగరు, మతన్. బలం ;

హిం. మచలీ. పొగరుగల, మచ్‌నా. ఆవేశపడు.

< మూ.ద్రా. *మచ్-.

మసరిడు అ.క్రి. పొగరెక్కు, క్రొవ్వు. చెన్నబసవ. 4.343. < మసరు[1] + ఇడు. మసరుకవియు అ.క్రి. పొగ రెక్కు. మార్క. 6.67. మసరుకొను అ.క్రి. మదించు, పొగ రెక్కు. శ్రీరం.మా. 1.132.
మసరు[2] రూ.చూ. మసర. వి. చలవ చెయ్యని ముడినూలు.

మసరుమాలు రూ.చూ. మసరనూలు. వి. చలవ చెయ్యని ముడినూలు.
మసరులు రూ.చూ. మసరలు. వి బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.
మసలతు వి. పరామర్శ. సలహా.

హిం.ఉ. మస్‌లహత్. పరామర్శ, హితకరం, మంచి, సలహా ; గు. మసలత. సలహా ; మరా. మసలత. విచారం, సలహా, ఆలోచన.

< ఉ. మస్‌లహత్.
మసలా వి. మచ్చు.

హిం. మసల్. ఉదాహరణ, ఒకకథ, ఒక పొడుపుకథ, మస్‌లన్. ఉదాహరణకు, మాటకు ; ఉ.అర. ముస్‌ల, మసుల. ఒకప్రశ్న, ఉదాహరణ, విధిప్రసంగం, సూత్రం, ఉదాహరణకోసం వేసే శిక్ష, ఉదాహరణకు, మాటకు.

< ఉ. ముస్‌ల.
మసలాడి చూ. మసలు.
మసలిక చూ. మసలు.
మసలు రూ. మెసలు ; మెసులు. అ.క్రి. 1. ఆలస్యంచేయు, బాగుచేయు. భార. ఆది. 1.118 ; 2. ప్రవర్తించు. భార. ద్రోణ. 5.365 ; 3. కలుగు. పండి.చ. 4.287 ప ; 4. కడగు, యత్నించు. పండి.చ. 5.356 ప ; 5. వర్తించు, ఉండు. శివరా. 1.5 ; 6 విహరించు. భాగ. 10పూ. 178 ; 7. మరలు, వెనుతిరుగు. వసు. 2.137 ; 8. నీళ్ళు మొ.నవి కాగినప్పుడు కళకళమను. సానంద. 2.6 ; 9. పరాజిత మగు, ఓడు. దశా. 5.58 ; 10. మలమలకాగు, మరగు ; 11. తప్పు ; వి. 1. ఆలస్యం ; 2. నివాసం.

క. మశల్. ఆలస్యంచేయు, మసుళ్. దాక్కొను, మసలు ; తు. మదడు. బద్ధకంగల, సోమరి అయిన, మచకు. సంకోచించు, జాగుచేయు, ఆలస్యంచేయు, మచమచ (-ప్పి-, -త్తి-). నెమ్మది, ఒకనిర్ణయానికి రావ టానికి జాగుచేయు, మచత్తె. సోమరిపోతు, బద్ధకస్తుడు.

మసలాడి వి. విలాసవతి, శృంగారచేష్టలున్న స్త్రీ. ద్వి.సార.చ. 3.183 పం. మసలిక వి. మాంద్యం, మెల్లన; పాంచాలీ. 4.21. మసలుకొను అ.క్రి. వెనుదీయు. పాంచాలీ. 4.15.
మసాకత్తు రూ.చూ. ముశాఖత్తు. వి. 1. భూమికి పెట్టిన ఎరువు. 2. శిల్పులు చేసిన వస్తువులకు మజూరు.
మసాల[1] రూ.చూ. మసాలా. వి. 1. పోపు సరకులు ; 2. పశువులు లోనగువాటి వ్యాధులకిచ్చే మందు ; 3. తాంబూలం లోని పరిమళ ద్రవ్యాల గుండ.
మసాల[2] వి. మట్టిగోడలో పెట్టిన ప్రమిదరూపంలో ఉండే గుంట.
మసాలా రూ. మసాల[1]. వి. 1. కూరల్లో వెయ్యటానికి తయారు చేసే జిలకర్ర, మెంతులు, మిరియాలు మొ.వాటి మిశ్రం ; 2. మందు ; 3. అద్దకం రంగు తయారుచేయటానికి ముడి రంగులో కలిపే పదార్థాలు.

హిం.ఉ. మసాలా. మందులు, కూరల్లో వేసే మసాలా దినుసులు, నూనె, బాణసంచా, అనుపానం, కాంక్రీటు, సంబారం ; ఒ. మొసాలా. పోపుసామాను.

క. మసాల, మసాలె. మసాల ; త. మచాల్, మసాళా ; మ. మసాల.

< ఉ. మసాలా.
మసాలు రూ.చూ. మశల. వి. మంచె, సున్నబ్బట్టీ పైభాగంలో ముఖ్యంగా జాతిబట్టీమీద మనిషి తిరగటానికి వీలుగా దిమ్మలమీద కర్రలుపరచి వాటిమీద మట్టిపూసి కట్టిన అంచె.
మసాల్చి రూ.చూ. మషాల్చి. వి. కాగడా పట్టేవాడు (చాకలి).
మసాల్జి రూ.చూ. మషాల్చి. వి. కాగడా పట్టేవాడు (చాకలి).
మసాల్జీ రూ.చూ. మషాల్చి. వి. కాగడా పట్టేవాడు (చాకలి).
మసాల్తి రూ.చూ. మషాల్చి. వి. కాగడా పట్టేవాడు (చాకలి).
మసి రూ. మస్సి. వి. 1. భస్మం, బూడిద. నిర్వ.రా. 4.87 ; 2. నలుపు, మాలిన్యం. భార.ఉద్యో. 1.295 ; 3. నల్లని చూర్ణం, నల్లని గుండ. పి.శకు. 3.209 ; 4. సిరా.

క. మసి. అపవిత్రం, మసిగిన్నెలు, దీపంమసి, కాటుక.

పొగమసి, సుర్మా ; కొడ. మసి. బొగ్గు ; తు. మజి. బొగ్గు, నల్లపొడి, సిరా, మైఞ. కాటుక, మైవరిపుని. కళ్ళకు కాటుక లేక సుర్మా దిద్దుకొను ; త. మై. నల్లని ముద్ద, కాటుక, సిరా, నల్లరంగు, నలుపు, చీకటి (చంద్రుడిలో) మచ్చ, కళంకం, కారుమబ్బు, తప్పు, పొరపాటు. మైప్పు. నలుపు, నల్లదనం ; మ. మై. నల్లదనం, సుర్మా ; తొ. మొయ్(మొచ్-). నలుపెక్కు ; కురు. మైస్. సిరా ; పో.చూ. త. మచంకు ; మా. మాఘు.

సం. మశీ. సిరా, మషీ. మసి ; ప్రా. మసీ.

**మసటికె** రూ. మశటవ, మసెటికె. వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకున్న చిన్నమట్టి పాత్ర. < మసి + అటికె. **మసికంకి** వి. కంకి కాల్చినట్టు మసి అయ్యే జొన్నతెగులు (Sphacelotheca sorghi). **మసికట్టు** వి. 1. కంసాలి దుకాణంలోని కుంపటి బూడిద కుప్ప. బిల్హ. 2.148 ; 2. కంసాలి కుంపటి బూడిదనుంచి తీసిన బంగారం. **మసికప్పు** అ.క్రి. ఆముకాల్పులో ఆవిరి పైకి పోకుండా కుండల్ని పేర్చిన తరువాత వాటిపైన చెత్తవేసి తడిపిన బూడిద పోయు. **మసికానెం** రూ. మసికాన్నెం, మసిఖానం. వి. ఆముదగ్గర ఆము బూడిదను పోసిన గుంట. **మసికాన్నెం** రూ.చూ. మసికానెం. వి. ఆముదగ్గర ఆము బూడిదను పోసిన గుంట. **మసికుండ** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి కుమ్మరి ఎడమచేతివైపు మసిపోసి పెట్టుకొన్న మట్టికుండ. **మసికోతి** వి. కొండముచ్చు, ముఖం నల్లగా ఉండే కోతి. **మసిఖానం** రూ.చూ. మసికానెం. వి. ఆముదగ్గర ఆము బూడిదను పోసిన గుంట. **మసిగాడి** వి. ఆముదగ్గరగా ఆము బూడిదను తీసి పోసినగుంట. **మసిగుడ్డ** వి. వేడి వంటపాత్రల్ని దింపటానికివాడే మసిఅయి మాసిన గుడ్డపీలిక. **మసిగుంట** వి. ఆముదగ్గరగా ఆముబూడిదను తీసిపోసిన గుంట. **మసిగోలెం** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న చిన్న మట్టి పాత్ర. **మసిచిప్ప** రూ. మసిసిప్ప. వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి మసినిపోసి పెట్టిన మట్టిపాత్ర. **మసిచేట** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న చేట. **మసిచేయు** స.క్రి. కాల్చివేయు. మను. 1.37. **మసిజల్లెడ** వి. బలపపు పొడిలాంటి మెత్తని పదార్థంనుంచి ఇతర వస్తువుల్ని వేరుచేసే జల్లెడ, తీగతో అల్లినది, పిండిజల్లెడకన్నా సన్న కళ్ళు ఉన్న జల్లెడ. **మసిటెంక** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొనే చిన్న మట్టి పాత్ర. **మసితట్ట** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న గోలెం. **మసితొట్టి** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న మట్టిపాత్ర. **మసిదాక** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిద పోసి పెట్టుకొన్న చిన్న మట్టిపాత్ర. **మసిపట్టు** అ.క్రి. 1. ఆము కాల్పులో ఆవిరి పైకి పోకుండా కుండల్ని పేర్చిన తర్వాత వాటిపైన చెత్తవేసి తడిపిన బూడిదను పోయు ; 2. మసిని జల్లించు. **మసిపాత** వి. మసిగుడ్డ. **మసిపాతలో మాణిక్యము** వి. తగిన పరిసరపరిస్థితి లేకున్నా అది మాణిక్యమే హీనం అయినచోట అర్హ వస్తువున్నప్పుడనేమాట. పండి.చ. 1.2 వ. 391. **మసిపాదు** వి. ఆముదగ్గరగా ఆము బూడిదను తీసిపోసిన గుంట. **మసిపేను** వి. కాయల్లో నల్లటి పేనుపట్టే వేరుసెనగ తెగులు. **మసిపోయు** స.క్రి. ఆము కాల్పులో ఆవిరి పైకిపోకుండా కుండల్ని పేర్చిన తర్వాత వాటిపైన చెత్తవేసి తడిపిన బూడిదపోయు. **మసిపోవు** అ.క్రి. వ్యర్థమగు. **మసిబుగ్గి** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొనే చిన్న మట్టిపాత్ర. **మసిబుడ్డి** సిరా పోసుకునే బుడ్డి. సం. మశీమణి. సిరాబుడ్డి. **మసిబొచ్చె** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిద పోసి పెట్టుకొనే చిన్న మట్టిపాత్ర. **మసిబోకె** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొనే చిన్న మట్టి పాత్ర. **మసిముట్టు** అ.క్రి. వ్యర్థమగు, బీరుపోవు. హరి.పూ. 8.117. **మసిమూకుడు** వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న చిన్న మట్టిపాత్ర **మసిమోచు** అ.క్రి. మాయు, ధూళి మొ.వి పడి వివర్ణత కలుగు. జైమిని భా. 2.48. **మసిరోగం** వి. చెట్టు నల్లబడిపోయే పత్తితెగులు. **మసిసిప్ప(-చిప్ప)** రూ.చూ. మసిచిప్ప. వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి మసినిపోసి పెట్టిన మట్టిపాత్ర **మసెటికె** రూ.చూ. మసటికె. వి. సర్సేటప్పుడు కుండలపై చల్లటానికి బూడిదపోసి పెట్టుకొన్న చిన్న మట్టి పాత్ర. **మసెంటు** వి. అచ్చుతీకిన పదుగుమీద కొలతనుబట్టి వేసిన గుర్తు. <మసి + అంటు. **మసేయు** అ.క్రి. ఆము కాల్పులో ఆవిరి పైకి పోకుండా కుండలు పేర్చిన తర్వాత వాటిపైన చెత్తవేసి తడిపిన బూడిద పోయు. < మసి + వేయు.

**మసిపిషాణం** వి. అరవదేశంలో మాఘ మాసంలో వేసే వడ్లు.

త. మాచి. మాఘ మాసం.

<త. మాచి + పిషాణం.

**మసిరెలు** రూ. చూ. మసరలు. వి.బ.వ. ధాన్య విశేషం, ఒక రకం వడ్లు.

**మసిలయతుచేయు** అ.క్రి. సంప్రదించు, సమాలోచన చేయు.

హిం. మసల్‌హత్. తగిన, అవసరమైన, సలహా. ఉ. అర. మస్‌లహత్. వృత్తి, సలహా, అవసరం, సమాలోచన, చేయవలసిన మంచిపని, మస్‌లాహత్-కర్నా. ఒకరితో ఒకరు సంప్రదించు, కలియు.

<ఉ. మస్‌లహత్ + చేయు.

**మసిలి** రూ.చూ. మశల. వి. మంచె. సున్నబ్బట్టీ పైభాగంలో ముఖ్యంగా జాతి బట్టీమీద మనిషి తిరగటానికి వీలుగా దిమ్మలమీద కర్రలు పరచి వాటిమీద మట్టిపూసి కట్టిన అంచె.

**మసిలీశం** వి. చేపలుపట్టేవారిపాలెం, బెస్తపాలెం.

**మసిలె** వి. టాపుబండి.

**మసీదు** రూ. మజీదు, మజ్జీతు, మశీద్, మసజీదు, మసీదు, మసూదు, మహజీద్, మహజీదు. వి. మహమ్మదీయులు ప్రార్థనచేసే పవిత్ర మందిరం. క్రీడా. 149. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 779.

హిం. మస్‌జిద్, మసీద్. మహమ్మదీయులు నమాజులు చేసేచోటు ; మరా. మశిద ; ఉ. మస్‌జిద్ ; పార.

మస్జిద్ ; అర. మస్జద్ ; పూజాస్థలం.

<ఉ. మస్జిద్.

మసీదుఇనాం వి. మసీదుకిచ్చిన ఇనాం. మసీదుమాన్యం వి. ముస్లిముల ప్రార్థనాలయ రక్షణ కిచ్చిన మాన్యం. మసీదుముంత వి. మసీదులో పెట్టిఉంచే చిన్నమట్టిచెంబు.

మసుకు రూ.చూ. మసక. వి. 1. మునురు, ఎడతెరిపి లేకుండా పడే సన్నవాన ; 2. కనుచీకటి.

మసుమసుకకన్ను వి. మసక మసకగా కనిపించే కన్ను. పండి. చ. 2.4పు. 108.

మసుగు రూ.చూ. మసక. వి. కనుచీకటి.

మసుమసుకకన్ను చూ. మసుకు.

మసురు రూ.చూ. మషురూ. వి. ఒకవిధమైన పట్టుగుడ్డ.

మసురూ రూ.చూ. మషురూ. వి. ఒకవిధమైన పట్టుగుడ్డ.

మసులుకొను చూ. మసలు. అ.క్రి. రగులు, నిప్పుఅంటుకొను. ముట్టుకొను.

మసూదా రూ. మసోదా, మునలిదా, ముసాయిదా. వి. 1. స్కెచ్ ; 2. చిత్తుప్రతి.

హిం. మసౌదా. డ్రాఫ్టు, ఫిర్యాదు ; మరా. మసూదా ; ఉ. అర. మసవ్వద, మస్వద. స్కెచ్చి, ఉత్తరం మొక్క చిత్తుప్రతి ;

క. మసూద.

<ఉ. మసవ్వద.

మసూదు రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే పవిత్రమందిరం.

మసూరిక వి. మసూరుపప్పు, రాంబూలరాగం.

క. మసూరిక. ఒకరకం పప్పు.

<క. మసూరిక.

మసూరుధాన్యం వి. ఒకరకం వడ్లు.

మసూరుపప్పు వి. మసూరిక, ఒకరకమైన పెసరపప్పు వంటిది.

మసూర్లు వి.బ.వ. ధాన్యవిశేషం.

మసూలు రూ.చూ. మహసూలు. వి పంట, పన్ను.

మసెటికె చూ. మసి.

మసెంటు చూ. మసి.

మసెల రూ.చూ. మశల. వి. 1. అటక ; 2. పందిరి, మంచె.

మసేయు చూ. మసి.

మసోదా రూ.చూ. మసూదా. వి. 1. స్కెచ్ ; 2. చిత్తుప్రతి.

మస్కంలాడు వి. తనాబీఆర్చి, ద్వారబంధాల కిటికీల మీద వేసే ఆర్చి.

మస్కట్ వి. నార, నూలు కలిసిన ఒకరకం దారం.

మస్కట్అంచు రూ. మస్కాట్అంచు. వి. కృత్రిమపు పట్టు, నూలుకలిపినేసిన ఒకరకం అంచు.

మస్కరా వి. నవ్వేవాడు. విశ్వేశ.

హిం. మస్కరా, మస్ఖరా. విదూషకుడు, నవ్వు పుట్టించేవాడు ; మరా. మస్కరీ. హాస్యం ; ఉ. పార. మస్ఖరా. విదూషకుడు, నవ్వు కలిగించేవాడు ; అర. మస్ఖరా. హాస్యం కలిగించేవాడు.

<ఉ. మస్ఖరా.

మస్కా[1] వి. మనకనేల, ఎర్రమన్ను కలిసినరేగడి. తె.శా. 50. క్రీ.శ. 1311.

మస్కా[2] వి. లాదటంలో ఒకవిధం.

హిం. ఉ. మశ్క్. అభ్యాసం.

మస్కా[3] వి. మోసం.

హిం. ఉ. మశ్క్. అభ్యాసం.

<ఉ. మశ్క్.

మస్కాగొట్టు (-కొట్టు[1]) స. క్రి. మోసంచేయు. హిం. ఉ. మస్కా. వెన్న. మస్కాబెట్టు (-పెట్టు) స.క్రి. 1. కందెనబెట్టు ; 2. వంచించు. మస్కావేయు స. క్రి. ఉచ్చించు.

మస్కాట్అంచు రూ. చూ. మస్కట్అంచు. వి. కృత్రిమపు పట్టు, నూలుకలిపి నేసిన ఒకరకం అంచు.

మస్టర్డుకలరు వి. ఒకరకం పసుపురంగు.

<ఇం. *Mustard colour*. ఆవరంగు.

ఇం. Mustard colour.

మస్టు రూ. మష్టు, మసటు, మసదు, మస్డా. వి. మాలిన్యం, మురికి. రం. రా. బాల, 51పు. 5పం.

క. మడ్డి, మడ్డు, మస్టు, మిడ్డె. నూనె, నెయ్యి మొ. వాటి అడుగున చేరేమురికి, మసటు ; త. మష్టు.

మస్డా రూ.చూ. మస్టు. వి. 1. మసి, నలుపు, మాలిన్యం ; 2. భస్మం ; 3. నల్లనైనది ; 4. నల్లనిచూర్ణం.

క. మసి ; తు. మజి. బొగ్గు, నల్లనిగుండ, సిరా ; త. మచి ; మ. మఴి ; కుఇ. మాసి. ముటికి ; ఒరయాన్. మఈన్.

సం. మషీ. మసి ; ప్రా. మసి ; అమా. పా. మసి.

మస్తం రూ. చూ. మస్తకం. వి. కిస్తీ, పక్కలు పల్లుగా మధ్య ఎత్తుగాఉండే కిటికీ తలుపు రెక్కలమీది చెక్కడపు పనిగల భాగం.

మస్తకం రూ. మస్తం. వి. కిస్తీ పక్కలు పల్లంగా మధ్య ఎత్తుగా ఉండే కిటికీ తలుపు రెక్కలమీది చెక్కడపు పనిగల భాగం.

సం. మస్తక-. శిరస్సు.

<సం. మస్తక- (అర్థవిపరి.).

మస్తకంస్తంభం వి. మూడుమెట్లలో ఉబ్బెత్తు చెక్కడపు పనితో తయారైన రాతిస్తంభం. మస్తకంచట్రం వి. మస్త కాలు చెక్కడానికి అనువుగా చేసిన చట్రం. మస్తకం తలుపు వి. కిస్తీతలుపు, అంచులు వాలుగా నరికి మధ్యభాగం చదునుగా ఉంది తయారుచేసిన చెక్కల్ని చట్రంలో బిగించిన తలుపు.

మస్తకి వి. ఒకరకం మందు.

సం. మస్తక-. శిరస్సు.

మస్తరించు చూ. మస్తరు[1].

మస్తరు[1] వి. లోబడటం, అధీనమవటం.

మస్తరించు స.క్రి. 1. వశపరచుకొను. కాశీ. 5.236 ; 2. ఆస్ఫాలనంచేయు, తట్టు, చేతులప్పళించు. అష్టమ. క. 5.242 ; 3. ప్రవేశింపచేయు. పాండు. 1.9 ; 4. హెచ్చరించు, ప్రోత్సాహపరచు. చంద్రభా. 2 17. <మస్తరు+

-ఇంచు[3].

మస్తరు[2] వి. హాజరు.

మస్తి రూ.చూ. మస్తీ. వి. మదించిన ఏనుగు.

మస్తీ రూ. మస్తి, మస్త్రీ. వి. మదించిని ఏనుగు. చంద్రాంగ. 3.51.

హిం. మస్తీ. మదం. కొన్ని జంతువులనుండి, లేక వృక్షాలనుండి వచ్చే మదజలం ; ఉ. మస్తీ. కొన్ని జంతువుల నుండి వచ్చే మదజలం, మదం.

<ఉ. మస్తీ.

మస్తు రూ. మత్తు[1]. వి. **1**. మదం, మత్తు. అహల్యా. 3.94 ; **2**. సమృద్ధి ; విణ. సమృద్ధం, అధికం.

హిం. మస్త్. మదించిన, మదోన్మత్తమైన ; మరా. మస్త. మదించిన, గర్వంకల : ఉ. మస్త్. మదోన్మత్తమైన, పార. మస్త్. తాగిన, మదించిన, అధికకోపంగల, మదించిన జంతువు.

<ఉ. మస్త్.

మస్తువా(డు విణ. మత్తుడు, మదించినవాడు. అం. శా. 3.7.

మస్త్రీ రూ.చూ. మస్తీ. వి. మదం, పొగరు, మిడిసిపాటు.

మస్లె రూ.చూ. మశల. వి. అటక.

మస్సాల్చి రూ.చూ. మషాల్చి. వి. **1**. దివిటీవాడు లేదా దీపాలు పెట్టేవాడు ; **2**. దివిటీ దొంగతనం.

మస్సి రూ.చూ. మసి. వి. మసి, బొగ్గుపొడి.

మహజర్ రూ.చూ. మహజ్జరు. వి. పెక్కుమంది లేదా ఒకడు చేసుకొనే వినతి పత్రం.

మహజరు రూ.చూ. మహజ్జరు. వి. బహుజనుల రాతపూర్వకమైన విన్నపం, అర్జీ.

మహజరుదార్లు వి.బ.వ. వినతిపత్రం సమర్పించినవారు.

ఉ.అర. మహ్జర్; పార. -దార్. మతుప్ప్రత్యయం.

<ఉ. మహ్జర్+-పార-దార్.

మహజరునామా రూ. మహజర్నామా. వి. రాతపూర్వకంగా చేసే ప్రమాణం.

ఉ.అర. మహజర్. ప్రార్థనాపత్రం; పార. నామా. హాజరుపట్టీ.

<ఉ. మహజర్+పార. నామా.

మహజర్నామా రూ.చూ. మహజరునామా. వి. బహుజనుల రాత పూర్వకమైన విన్నపం.

మహజీద్ రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే మందిరం.

మహజీదు రూ.చూ. మసీదు. వి. మహమ్మదీయులు ప్రార్థన చేసే మందిరం.

మహజోతులు వి.బ.వ. దీపభేదం.

సం. మహాజ్యోతిస్. పెద్దకాంతి.

<సం. మహాజ్యోతిస్+-లు.

మహజ్జరు రూ. మహజర్, మహజరు, మహర్జురు, మహీజరు. వి. పెక్కుమంది చేరి రాసుకొనే ప్రార్థనా పత్రం. ద.హిం.కా.సంపు. 10. శా.సం. 767. క్రీ.శ. 1680.

హిం. మహ్జర్. ప్రజలయొక్క హస్తాక్షరపూర్వక సాక్ష్యపత్రం ; మరా. మహజర. దావాలో రాతపూర్వకమైన విజ్ఞప్తి ; ఉ.అర. మహ్జర్. ప్రార్థనాపత్రం ; పార. మహ్జర్.

<ఉ. మహ్జర్.

మహర్జురు రూ.చూ. మహజ్జరు. వి. అనేకమంది వ్యక్తులు కలిసి రాసుకొని సమర్పించిన వినతిపత్రం.

మహడి రూ. మహడీ. వి. **1**. పెద్ద భవనం ; **2**. మిద్దె, మాడి.

క. మాళిగె. భవనం ; త.మ. మాటమ్ ;

సం. మాడి. భవంతి, దే.ప్రా. మాల-, మంచ ; ప్రా. మాల- ; గు. మాళా ; మరా. మాడీ, మాళీ. అంతస్తు.

మహడీ రూ.చూ. మహడి. వి. **1**. పెద్ద భవనం ; **2**. మిద్దె, మాడి.

మహతాజు వి. చంద్రుడు.

హిం.ఉ. మహ్, మహ్తాజ్. చంద్రుడు.

<ఉ. మహ్తాజ్.

మహతాదు రూ.చూ. మొహతాదు. వి. గ్రామరక్షకుడు.

మహతాబు రూ. మతబా, మతాబా, మతాబి, మతాబీ, మతాబు, మత్తాబు. వి. **1**. ఒకవిధమైన బాణసంచు. రంగా.చ. 3.145 ; **2**. చంద్రుడు.

హిం. మహతాబ్. వెన్నెల, చంద్రుడు ; మరా. మహతాప. ఒకవిధమైన బాణసంచు, అయిదవ స్త్రీ ; ఉ. మహతాబ్. చంద్రుడు, కౌముది ; పార. మహతుబ్. వెన్నెల, పూర్ణచంద్రుడు, చంద్రుడు, ఒకవిధమైన బాణసంచు.

<ఉ. మహతాబ్.

మహదేవు(డు రూ. మాదేవు(డు. వి. శివుడు. పండి. చ. 2.266.

సం. మహాదేవ-. శివుడు.

క. మాద, మాదేవ. శివుడు.

<సం. మహాదేవ.

మహనాడు వి. పెక్కు కులస్థుల కూడలి.

సం. మహత్(మహా). గొప్ప, పెద్ద.

సం. మహత్+నాడు.

మహంతు వి. **1**. మఠాధిపతిగా ఉండే సన్యాసి ; **2**. దేవస్థాన ధర్మకర్తగా ఉండే బైరాగి.

ఒ.హిం. మహంత్. సన్యాసి, సన్యాసులుండే మఠాధిపతి, గురువు, ఆశ్రమానికి అధికారి.

<ఒ. మహంత్.

మహమల్ రూ.చూ. ముఖమల్లు. వి. **1**. దళసరిగా ఉండే ఒకవిధమైన పట్టు ; **2**. వెల్వెటు.

మహమహా(డు వి. ఇప్పుడు కాదుగదా ఎల్లప్పుడు, ముందు వెనకల.

సం. మహత్(మహా). పెద్ద.

మహమాన్ రూ. మొహమాన్. వి. కొత్తవాడు.

హిం.ఉ. మేహమాన్. అతిథి.

<ఉ. మేహమాన్.

మహముది వి. వస్త్రవిశేషం. హంస. 5.356.

మరా. మహ్మదీ. వస్త్రవిశేషం ; ఉ. మహ్మూదీ. సన్నని వస్త్రవిశేషం ; పార. మహ్మూదీ. చక్కని వస్త్ర విశేషం, పట్టుబట్ట.

< ఉ. మహ్మూదీ.

**మహముదు** రూ.చూ. మహమ్మదు. వి. మహమ్మదీయ మతప్రవక్తశుభనామం. హంస. 5.359.

**మహమ్మదీ** రూ.చూ. మహమ్మదు. వి. మహమ్మదీయుడు.

**మహమ్మదు** రూ. మమ్మదు, మహముదు, మహమ్మదీ, మామూదు. వి. మహమ్మదీయ మతప్రవక్త శుభనామం.

హిం. ముహమ్మద్. ఇస్లాం మతప్రవక్త: ఉ. ముహమ్మద్. ప్రశంసింపబడినవాడు, మతప్రవక్తపేరు; పార. ముహమ్మద్. ఇస్లాం మతప్రవక్త; అర. ముహమ్మద్. పైగంబరు, మహమ్మదు శుభనామం.

< ఉ. ముహమ్మద్.

**మహరటీ** రూ.చూ. మరాటి. వి. మహారాష్ట్ర సంబంధి.

**మహరాజు** రూ.చూ. మారాజు. వి. **1**. శ్రీమంతుడు, ధనవంతుడు ; **2**. గొప్పవాడు.

**మహల్** రూ.చూ. మహలు. వి. భవనం.

**మహలు** రూ. మహల్, మహాలు, మాలు[2]. వి. మేడ, హర్మ్యం. సాంబ.స్థా. 67.

హిం. మహల్. ప్రాసాదం, అంతఃపురం ; మరా. మహల్. భవనం ; ఉ. మహల్. ప్రాసాదం, గృహం, భార్య ; పార. మహల్, మహల్ల్. వాసస్థానం, గృహం, భవనం ; అర. మహల్ల్. ప్రసాదం, గృహం.

< ఉ. మహల్.

**మహల్లాతు** వి. మండలంలోని ఒకభాగం. నె.శా. కందుకూరు. 42. (క్రీ.శ. 1803).

హిం.ఉ. మహల్లా, ముహల్లా, ముహాల్. నగరంలోని భాగం.

**మహసూర్లు** వి.బ.వ. శత్రువులు.

హిం.ఉ. ముహాసిరా. ముట్టడి, దాడి.

< ఉ. ముహాసిరా + -లు.

**మహసూల్** రూ.చూ. మహసూలు. వి. పంట, పన్ను.

**మహసూలు** రూ. మసూలు. మహసూల్, మహస్తూలు, మహస్సూలు, మాసూలు. వి. **1**. కుప్పలునూర్చి ధాన్యం ఇంటికి చేర్చి గడ్డివాములు వేసే సేద్యపు పని ; **2**. పంట, పన్ను.

హిం.ఉ. మహసూల్. పన్ను : మరా. మహసూల్ ; పార. మహసూల్ ; అర. మహసూల్. పన్ను, సుంకం, పోస్టేజి, పంట ;

క. మహసూల్. పబ్లిక్ రెవిన్యూ, భూమినుంచి వచ్చే ప్రయివేటు ఆదాయం: త. మహబూల్. మ. మహసూల్.

< ఉ. మహ్సూల్.

**మహసూలుదారు** వి. పంటపరామరిక చేసే దివాణపు బంటు.

హిం.ఉ. మహసూల్‌దార్. పన్ను వసూలు చేసేవాడు.

< ఉ. మహ్సూల్‌దార్.

**మహస్తూలు** రూ.చూ. మహసూలు. వి. పంట.

**మహస్సూలు** రూ.చూ. మహసూలు. వి. పంట.

**మహాదర్శనంబుండు** అ.క్రి. కొలువుతీరి ఉండు. కు.సం. 8.2.

సం. మహాదర్శన-. గొప్పచూపు.

< సం. మహాదర్శన- + -ము + ఉండు. (అర్థవిపరి.).

**మహాద్రావకం** వి. గంధకికామ్లం, అద్దకం రంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే ద్రావకం.

సం. మహాద్రావక- గొప్పద్రావకం.

< సం. మహాద్రావక- (అర్థవిపరి.).

**మహాలు** రూ.చూ. మహలు. వి. మేడ.

**మహీజరు** రూ.చూ. మహజ్జరు. వి. అనేక మంది వ్యక్తులు కలిసి రాసుకొని సమర్పించిన వినతిపత్రం.

**మహిసాక్షి** వి. ధూపగుగ్గిలం, ఉప్పుమట్టి, యక్షధూపం.

సం. మహిషాక్ష-. ఒకజాతి గుగ్గిలం.

< సం. మహిషాక్ష-.

**మహేశ్వరిపేటంచు** చూ. మహేశ్వరిపేటు.

**మహేశ్వరిపేటు** వి. రెండు సన్నని కడ్డీలు, రెండు లాహిరీలు, ఒకవరస గోమి అంచులో వరసగా పడేట్టు నేసిన డిజైను.

సం. మహేశ్వరీ. పార్వతి.

< సం. మహేశ్వరీ + పేటు[3].

**మహేశ్వరిపేటంచు** వి. మహేశ్వరి పేటుపెట్టి నేసిన అంచు. < మహేశ్వరిపేటు + అంచు[3].

**మహ్లాదారులు** వి.బ.వ. ధనికులు.

హిం. మహల్‌దార్. భవనం కలవాడు ; ఉ. మహల్‌దార్.

< ఉ. మహల్‌దార్ + -లు.

**మా[1]** అవ్య. మిక్కిలి.

సం. మహత్. గొప్ప.

< సం. మహత్.

**మాకొను** స.క్రి. కాటుపేయు, కరచు. హరిశ్చ. 5.46. **మాగండము** వి. మహాకష్టం. **మాచెడ్డ** రూ. మహచెడ్డ. అవ్య ఎక్కువచెడ్డ.

**మా[2]** అవ్య. బళిర. సెబాసు. శృం.నై. 6.95.

**మా[3]** చూ. మేము[2].

**మాఅమ్మతోడు** చూ. మేము[2].

**మాఅమ్మసాక్షిగా** చూ. మేము[2].

**మాంలతుదారు** రూ. మామ్లతుదారు. వి. కోర్టులో వ్యవహారం నడిపేవాడు.

ఉ. అర. ముఅమలత్ ; పార. -దార్. మతుప్ ప్రత్యయం.

< ఉ. ముఆమలత్- ; పార. దార్.

**మాకు** రూ.చూ. మ్రాంకు. వి. **1**. తివాసీలు నేసే మగ్గం ; **2**. తివాసీమగ్గం కట్టుబడిలో స్తంభాలకు పైన అమర్చిన కొయ్య దూలం.

**మాకుగా** చూ. మేము[2].

**మాక్తా** రూ. మక్తా, మఖ్తా, మగతా, మొగతా. వి. శిస్తు, ఒడంబడిక. నె.శా. దర్మిశాసనం. 15. క్రీ.శ. 1542.

హిం.ఉ.అర. మక్తా. మగతా ; మరా. మక్తా. ఒడం

బడిక ; పార. యక్త. విభజన.

< ఉ. మక్తా.

**మాఖా** రూ.చూ. మొఖాసా. వి. మొఖాసా, ముకాసాగ్రామం, నె.శా. కందుకూరు. **44.** క్రీ శ. 1651.

**మాగ** వి. ఎర్రమాగ, ఒకరకం చేప.

మాగజెల్లి వి. ఎర్రమాగ, ఒకరకం చేప (Polynemus-paradisas). మాగబొచ్చె వి. ఒకరకం చేప.

**మాగనిమాను** వి. మంచి కలపనిచ్చే చెట్టు (Suietenia Mahagoni).

**మాగన్ను** చూ. మాఁగు.

**మాగలి** రూ.చూ. మాంగాణి. వి. మాగాణి, వరిపొలం. నె. శా. ఆత్మకూరు శాసనం 45.

**మాగాటి** రూ.చూ. మాంగాణి వి. ఊడ్పుచేను, పల్లపు పొలం.

**మాగాడి** రూ.చూ. మాంగాణి. వి. ఊడ్పుచేను, పల్లపు పొలం.

**మాగాణి** రూ.చూ. మాంగాణి. వి. ఊడ్పుచేను, పల్లపు పొలం, వరిపంట పండే చేను.

**మాగాని**[1] రూ.చూ. మాంగాణి. వి. ఊడ్పుచేను, పల్లపు పొలం

**మాగాని**[2] రూ. మాగాలి. వి. దేశం, విలాతి.

**మాగాలి** రూ.చూ. మాగాని[2]. వి. దేశం.

**మాగి** వి. చలికాలం.

సం. మాఘ-. మాఘ మాసం, మాఘీ. మాఘపూర్ణమి ; ప్రా. మాహ- ;

క. మాగి, మాగె. మాఘమాసం.

< సం. మాఘ-.

మాగిఉన్ని రూ. మాగున్ని వి. చలికాలంలో కత్తిరించిన ఉన్ని. **మాగికత్తిరింపు** వి. చలికాలంలో ఉన్ని కత్తిరించటం. **మాగికోత** వి. చలికాలంలో ఉన్ని కత్తిరించటం. మాగిగాలి వి. ఆగ్నేయ దిక్కునుంచి వీచే చల్లగాలి. మాగిజొన్న వి. తెల్లజొన్నల్లో కొన్ని రకాలు. మాగిదుక్కి రూ. మాగిలి దుక్కి. వి. మాఘమాసంలో దున్నే దుక్కి. మాగినాగలి వి. మాఘమాసంలో (ఎండాకాలంలో) దున్నే పెద్దమెట్టనాగలి. మాగున్ని రూ.చూ. మాగిఉన్ని. వి. చలికాలంలో కత్తిరించిన ఉన్ని.

**మాగిలి** రూ.చూ. మాంగాణి. వి. ఊడ్పుచేను, పల్లపు పొలం,

**మాగిలికాలము** రూ.చూ. మాఁగుడుకాలము. వి. శరత్ హేమంత ఋతువుల్లో జబ్బులుచేసే కాలం.

**మాగిలిదుక్కి** రూ. చూ. మాగిదుక్కి. వి. మాఘమాసంలో దున్నే దుక్కి.

**మాగున్ని** చూ. మాగి.

**మాగేలి** రూ.చూ. మాంగాణి. వి. ఊడ్పుచేను, పల్లపు పొలం, వరిపంటలు పండే చేను.

**మాంకాళిచిత్త** వి. ఆకులమీద పిండిచల్లినట్టు తెల్లటి చుక్కలు పడే వరితెగులు.

**మాంకోడి** రూ. చూ. మాముకోడి. వి. ఒకరకం కోడి, టర్కీ కోడి.

**మాంగాణి** రూ. మాగలి మాగాటి, మాగాడి, మాగాణి, మాగాని[1], మాగిలి, మాగేలి, మాఁగిలి. వి. వరిపొలం E.I 21-41-A.

**మాంగారిపచ్చజొన్న** వి. జూన్, జూలై నెలల్లో వేసే పచ్చ జొన్న.

**మాఁకు** రూ.చూ. మ్రాఁకు. వి. **1**. దిమ్మెన. ద్వి.పరమ. వి. 7.516 ; **2.** వృక్షం, చెట్టు. ఉ.రా. 6.61.

మాఁకుపడు అ.క్రి. మ్రాన్పడు తాళ్ల.సం. 17.222.

**మాఁగఁబాఱు** చూ. మాఁగు.

**మాఁగఁబెట్టు** చూ. మాఁగు.

**మాఁగాయ** చూ. మాఁగు. వి. **1**. ఇది మామిడికాయలతో ఒక విధంగా తయారుచేసిన ఊరగాయ, మామిడికాయ పొప్పర (తొక్క) గీసి రెండు వైపులతరిగి ఉప్పుతో ఊరబెట్టిన ఊరగాయ ; **2**. మామిడికాయ.

కొడ. మంగె. మామిడికాయ ; త. మాంకామ్. మామిడికాయ.

**మాఁగిలి** రూ. చూ. మాంగాణి. వి. పొలం. ఊడ్పుచేను. క్రీడా. 51.

**మాఁగిలు** చూ. మాఁగు.

**మాఁగు** వి. **1**. శరీరంలోని నల్లని పొడ. హరి.పూ. **5.119** ; **2.** మాలిన్యం, నలుపు. భాస్క. రా. యు. **650** ; **3.** కంకులు ముదిరిన దశ. ; అ.క్రి. **1**. మిగులపండు, కమియు. నవనాథ. 2.74 పు. 12 పం. ; **2**. పరిణతిచెందు, పరిపక్వ స్థితిని పొందు. తాళ్ల.సం. 10 8 ; **3**. ఉడుకు ; **4.** వెచ్చబడు, వేడెక్కు ; **5**. మరుగు ; **6.** పాతబడు ; **7.** పాత్ర చాలాకాలం మన్నికకు వచ్చేటట్లు తయారగు.

క. మాగిసు, మాగు. ముగ్గు, పండు ; తు. మాగుని. ముగ్గు ; త. మంగు ; కుఇ. ముగ్గు ; గ. మాంగ్.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *మాంక్. < మాయ్-ఙ్క్. < మూ.ద్రా. మాయ్-.

మాగన్ను రూ. మేగన్ను. వి. తూగువల్ల ఏర్పడిన అరమోడ్పుకన్ను. < మాఁగు + కన్ను. **మాఁగఁబాఱు** అ.క్రి. మాగటానికి ప్రారంభమగు. మను. 4 37. < మాఁగు + -అ[7] + పాఱు[3]. **మాఁగఁబెట్టు** స.క్రి. **1**. (రత్న్యాదుల్లో) పరిపక్వస్థితికి తీసుకొనివెళ్ళు ; **2.** ఒరలు మొ.వి చేయటానికి మట్టిలో పొట్టుకలిపి వారంరోజులు మగ్గబెట్టు. క. మాగిసు. మాగబెట్టు. < మాఁగు + -అ[7] + పెట్టు. **మాఁగిలు** అ.క్రి. **1**. అచు. క్రీడా. 192 ; **2.** కాంతివిహీనమగు. **మాఁగుడు** వి. **1**. కమియటం, మిక్కిలి నలగటం. కు.సం. 11.150 ; **2**. మాలిన్యం. గౌ.హరి.ఉ. 2083 పం. ; **3.** మబ్బు ; **4.** పళ్ళు మొ. వి ఎక్కువగా మగ్గటం వల్ల పుట్టే కుళ్ళుకంపు ; **5**. మాగినపళ్ళనుంచి వచ్చే మంచి వాసన. **మాఁగుడుకాలము** రూ. మాగిలికాలము. వి. శరత్ హేమంత ఋతువుల్లో జబ్బులుచేసేకాలం. **మాఁగుడుపారు** రూ.చూ. మాఁగువాఱు. అ.క్రి. మాయు, మలినమగు. **మాఁగుడుపడు (-పడు)** రూ. మాఁగుపడు, మాఁగువడు. అ.క్రి. మాగుబారు. మలినమగు. పండి. చ. 1.61. పు. < త. మంగప్పడు. **మాఁగుడువాఱు (-పాఱు[3])** రూ.చూ. మాఁగువాఱు. అ.క్రి. మాయు, మలినమగు. ప్రభా. 5.57. **మాఁగుతెవులు** వి. దోస, కర్బూజా, తమలపాకు మొ.వాటికి పట్టే పేను, బంకతెగులు. **మాఁగుపడు** రూ.చూ. మాఁగుడు

పడు. అ.క్రి. నల్లబడు. మాఁగుపాఱు రూ.చూ. మాఁగువాఱు. అ.క్రి. మాగుడుపడు, మాయు, మలినమగు. ఉ. హరి. 1.179. మాఁగుడువాసన వి. కుంటువాసన. మాగుల్లకట్టు అ.క్రి. మట్టితో దళసరెక్కు. మాఁగువడు(-పడు) రూ.చూ. మాఁగుడుపడు. అ.క్రి. మాగుడువారు, మలినమగు మార్క. 1.168. మాఁగువాఱు (-పాఱు³) రూ. మాఁగుడువారు, మాఁగుడువాఱు, మాఁగుపాఱు. అ.క్రి. మాగుడుపడు, మాయు, మలినమగు. మార్క. 1.169.

మాచకమ్మ రూ. మానకమ్మ. వి. 1. స్త్రీ సాజాత్యంకల నపుంసక ప్రకృతి, మగరొమ్ములు మీసాలుకల ఆడది, మీసం ఉండి రొమ్ములు లేని ఆడది. శృం. నై. 7.133; 2. వయసు చెల్లినా సమర్తకాని స్త్రీ.

సం. మానక-. నెలకలది.

<సం. మానక-+అమ్మ.

మాచి వి. మాచిపత్రి. భల్లా. 3. (Artemisia indica).

సం. మాచిపత్త్ర-. వైద్యానికి ఉపయోగపడే ఒకరకం మొక్క.

<సం. మాచీపత్త్ర-.

మాచిపత్తిరి రూ.చూ. మాచిపత్రి. వి. ఒకానొకచెట్టు (Artemisia indica).

మాచిపత్రి రూ మాచిపత్తిరి. వి. ఒకానొకచెట్టు. ఉ. రా. 3.201 (Artemisia indica).

సం. మాచిపత్త్ర-. వైద్యానికి ఉపయోగపడే ఒకరకం మొక్క;

క. మాసిపత్రి. ఒకరకం మొక్క; త. మాసిపత్తిరి.

<సం. మాచీపత్ర-.

మాచెనపక్కె వి. మత్స్యవిశేషం.

మాచెర్లబండ వి. గుంటూరు జిల్లా మాచెర్ల ప్రాంతం నుంచి వచ్చే చలపరాయి.

మాజీ విణ. 1. గడచిన; 2. మునుపటి.

ఉ. పార. అర. మాజీ. గడచిన;

క. మాజీ; త. మాచీ.

<ఉ. మాజీ.

మాజీపరచు అ.క్రి. రద్దుచేయు.

మాజుం రూ.చూ. మాజుము. వి. గంజాయి.

మాజుము రూ. మాజుం. వి. బెల్లం మొ. వాటితో చేసిన మత్తు పదార్థం. చంద్రరే. 3.136.

హిం. మాజూన్. పంచదార పాకంతో చేసినమందు.

<హిం. మాజూన్.

మాజులు చూ. మాజీ. విణ. కార్యాలయం లేక ఉద్యోగంనుంచి తీసివేయబడిన.

మాజేటిడేరావిమానము వి. ఎర్రనిపట్టు చందువా. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1216.

మాంజ వి. చెక్కకు రెండువైపులా బొంగులు బిగించి మోతకు పనికి వచ్చేటట్లు చేసిన సాధనం.

సం. మధ్య-. నడుమ, మధ్యభాగం; ప్రా. మజ్ఝ-; హిం. మంఝూ. మధ్యభాగం.

మాట వి. 1. పలుకు. భార. ఆది. 3.38; 2. పదం, గర్వోక్తి. నిర్వ. రా. 1.6; 3. హితోక్తి. భార. ఉద్యో. 3.104; 4. ప్రతిజ్ఞ, ప్రతిజ్ఞావచనం. భార. భీష్మ. 2.150; 5. లోకోక్తి. హర. 2.101; 6. విషయం, సంగతి. హర. 4.22; 7. సూక్తి, ఆర్యోక్తి. ఆము. 5.99; 8. వివాదం. వసు. 3.25; 9. వాక్యం. ప్రభా. 1.65; 10. సందేశం, వార్త. ప్రభా. 2.16; 11. చరిత్ర, కథ. చిత్రభా. 5.214; 12. ఆజ్ఞ. కవిక. 3.164; 13. వాగ్దండం, తిట్టు. విజయ. 3.140; 14. శాస్త్రయుక్తి. కవిరాజ. 1.157; 15. నింద, నిందావాక్యం. శుక. 2.97; 16. ప్రార్థన. నీలా. 3.51; 17. పిలుపు.

క. మాతు, మాత, మాట, మాఱ్మ్; త. మాట్టు. మాట; మాల్తొ. మాఱు. మాట, జవాబు.

మాటఅమ్మైతాకు అ.క్రి. బాధకలిగించు, మాటనూటిగా బాణంలా తాకు. మాటకాఁడు వి. సభలో భయంలేకుండా మాట్లాడేవాడు, మంచివక్త. మాటకారి వి. వాగ్మి, చక్కగా మాట్లాడేవాడు, యుక్తిగా మాట్లాడేవాడు. నిరంకు. 2.34. క. మాతాళి. మాటకు అవ్య. ద్రు. మాటవరసకు. నిరంకు. 4.55. మాటకుబొంకుకలుగు అ.క్రి. చెప్పినమాట అబద్ధం అగు. ప్రభా. 1.128. మాటకుమాటగా అవ్య. ద్రు. మాట మీద మాటగా, సంభాషణవశాత్తు. ప్రభా. 4.72. మాట కుఱుచచేయు (-చేయు) అ.క్రి. మాటకిందపఱచు. విక్ర. 2.35. మాటకెదురులేకఉండు అ.క్రి. చెప్పినమాట చెల్లించు కొను. మాటగడచు (-కడచు) స.క్రి. మాటమీరు. పల్నా. 39పు. మాటగుత్తుకఁదగులు అ.క్రి. గొంతులోనేమాట మిగిలిపోవు, మాటలాడలేకపోవు. ఉ. హరి. 3.136. < మాట + కుత్తుక + -ను + తగులు. మాటగైకొను (-కైకొను) స.క్రి. మాటవిను. కళా. 4.96. మాటచెడు అ.క్రి. మాటపోవు. రాధా. 3.49. మాటచెల్లించు అ.క్రి. మాటప్రకారంనడచు. వర. రా. అయోధ్యా. పు. 326. పం.15. మాటచేసికొను అ.క్రి. 1. వివాహం నిశ్చయం చేసుకొను; 2. మంచిమాట చేసికొను. మాటజారు అ.క్రి. పొరబాటుగా నోటినుంచి మాట వెలువడు (చెప్పకూడని మాటచెప్పు). మాటతప్పు అ.క్రి. 1. అన్నమాటజరగక పోవు; 2. అబద్ధమాడు. మాటతీఱు అ.క్రి. మాటనెరవేరు. వర. రా. యు. పు. 285. పం. 17; వి. మాట్లాడేవిధానం. మాటతీసివేయు స.క్రి. తిరస్కరించు. మాటతెచ్చుకొను అ.క్రి. ఒకరి నిందకు పాత్రమగు. మాటతేడా వి. తేడా మాట. మాటదక్కు (-తక్కు) అ.క్రి. మాటనిలుచు. మాట దాఁటనివాఁడు విణ. విధేయుడు. మాటనిజము వి. నిజా యితీ, సత్యవాక్కు. శుక. 1.176. మాటనిజముగలవాఁడు విణ. నిజాయితీపరుడు. శుక. 3.8. మాటనిలకడ రూ.చూ. మాటనిల్కడ. వి. మాటమీద నిలిచి ఉండటం. మాట నిలుపుకొను అ.క్రి. చెప్పినట్లు చేయగలుగు. శుక. 4.10. మాట నిల్కడ రూ. మాటనిలకడ. వి. మాటమీదనిలిచి ఉండటం, సత్యప్రీతం. కాశీ. 2.105. మాటపట్టింపు వి. పట్టుదల. మాట పట్టు వి. 1. మాటల్లో పట్టుదల, వాక్కులో అభినివేశం. వేంక.పంచ. 1.523; 2. ఒట్టు, శపథం. ప్రభా. 4.9; 3. వాగమలంబనం, మాటఆసరా. కవిరాజ. 5.154. మాట

పడిపోవు అ.క్రి. మాట్లాడేశక్తి లేకపోవు, నోటమాట రాక పోవు. మాటపడు స.క్రి. దూషణపొందు, ఒకరిచేతపృ పట్టించుకొను. కాళ. 3.163. మాటపుట్టు అ.క్రి. చెడ్డపేరు వచ్చు. మాటపొందు వి. మాటపొందిక. ఉ. హరి. 1.90. మాటపొఅపొచ్చము వి. మాటపొరపాటు, హెచ్చు తక్కువగా మాట్లాడటం, న్యూనపరచటం. శుక. 3.150. మాటపోవు అ.క్రి. చెప్పినది అబద్ధమగు. మాటమంతి వి. మాట మొ. వి. మాటమాట వి. వివాదం, మాటమీదమాట వచ్చి ఏర్పడేది. భీమ. 2.88. మాటమాత్ర వి. 1. అనాయాసం. హర. 6.48; 2. నిమేషం, రెప్పపాటుకాలం. చిత్రభా. 6.66. మాటమాత్రన రూ. మాటమాత్రమున. అవ్య. ద్రు. ఒక్కక్షణంలో పారి. 1.23. మాటమాత్రమున రూ. చూ. మాటమాత్రన. అవ్య. ద్రు. ఒక్కమాటలో. మాటమాత్రమునకు అవ్య. ద్రు. అవలీలగా, సులభంగా. హరి. 6.84. మాటమారి వి. వదరుబోతు. మాటమిగులు అ.క్రి. హెచ్చు తక్కువగా మాట్లాడు. మాటమీఁద నిలఁబడు అ.క్రి. చెప్పిన మాటప్రకారం నడచుకొను. మాటమోచు అ.క్రి. నిందలపాలగు. వసు. 1.36. మాటమోపరి వి. అపవాదులు పుట్టించేవాడు, వార్తాహరుడు. చంద్రాంగ. 4.53. < మాటమోపు + -అరి. మాటమోపు వి. అపవాదాల్ని (నిందల్ని) పుట్టించటం. మాటయిచ్చు(-ఇచ్చు) అ.క్రి. వాగ్దానంచేయు. రామాభ్యు. 7.201. మాటయిచ్చుకొను అ.క్రి. వాగ్దానంచేసికొను. తాళ్ల.సం. 18.352. మాటలతో కడుపునింపు అ.క్రి. ఉపక్రప్రియాలు పలుకు. మాటలతో పందిరికప్పు అ.క్రి. పట్టిమాటలతో నరిపుచ్చు. మాటల వచ్చుళ్ళు వి.బ.వ. రుచికరమైన మాటలు. మాటలపందిలి వి. పట్టిమాటలు. ప్రభు. 8.64. మాటలపుట్ట వి. వదరుబోతు. మాటలబీటవెట్టు(-పెట్టు) అ.క్రి. మాటలతో కొంతకాలం గడుపు. శుక. 2.238. మాటలబెల్లాలు వి.బ.వ. తీయని మాటలు. తాళ్ల.సం. 3.583. మాటలబోటి వి. సరస్వతి. అహల్యా, 3.7. మాటలమంచి వి. తియ్యని మాటలు చెబుతూ చెరుపు చేసేది. పండి.చ. 2.116 పు. మాటలమారి వి. వాచాలుడు, వదరుబోతు. ఆం.భా. 3.11. మాటలమాస వి. పొల్నామవాస్య, దీపావళీ అమావాస్య. మాటలమిటారి వి. సరస్వతి. సమీర. 1.190. మాటలమ్రుచ్చు వి. ఒక తిట్టు, వాకోచ్చరుడు. పండి.చ. 1.2.343పు. మాటలల్లు అ.క్రి. కవిత్వం చెప్పు. మాటలల్లువాడు విణ. కవి, అభీకుడు. మాటలవర్షము వి. ఎక్కువగా మాట్లాడటం. మాటలాట (-ఆట) వి. ముచ్చటింపు, ప్రసంగం. భార. శల్య. 2.323. మాటలాడు అ.క్రి. 1. వ్యతిరేకంగాచెప్పు. శృం.నై. 8.55; 2. ఆలోచనచేయు. కువ.చ. 1.33; 3. నిష్ఠురాలాడు. దశా. 2.344; 4. ప్రసంగించు; 5. పలుకు. < మాట + -లు + ఆడు. మాటలుకరువగు అ.క్రి. ఉదాసీనత ఎక్కువగు. < మాట + -లు + కరువు + అగు. మాటలుకోటలుదాటు అ.క్రి. మాటల్లో ఆడంబరం చూపు, కబుర్లు మాత్రమే చెప్పు. మాటలు గట్టిపెట్టు(-కట్టిపెట్టు) అ.క్రి. మాటలు చాలించు. గౌ.హరి. ఉ. 1459 పం. మాటలు చెవినినాటు అ.క్రి. తెలిసేటట్లు దృష్టాంతంగా చెప్పు. మాటలు నూటిపోయు స.క్రి. 1. మాటలునేర్పు. కాళ. 3.44; 2. కొండేలు చెప్పు. మాటలుపడు అ.క్రి. దూషణకి గురిఅగు. విప్ర. 4.87. మాటలుమిగులు అ.క్రి. దూషణోక్తులాడు. మాటలుముదురు అ.క్రి. క్రమంగా మాటలు పెరిగి తగాదావచ్చు. మాటలు లేకపోవు అ.క్రి. విరోధం కలిగిఉండు. మాటలో అవ్య. ద్రు. రెప్పపాటు కాలంలో, క్షణంలో. నీలా. 1.34. మాటలోనివాఁడు విణ. చెప్పినట్టు చేసేవాడు. కువ.చ. 4.46. మాటవచ్చు అ.క్రి. 1. చెడ్డపేరువచ్చు. విప్ర. 5.43; 2. నిందవచ్చు; 3. రాజదండన కలుగు. మాటవరుసకు అవ్య.ద్రు. ప్రస్తావ వశంగా, మనఃపూర్వకంగా కాక. మాటవాసి వి. 1. పలుకుబడి. విప్ర. 3.13; 2. కీర్త్యాధిక్యం. విజయ. 2.284; 3. మాటనేర్పు. మాటవీడుపాటులు వి.బ.వ. తడబాటుమాటలు. కళా. 6.215. మాటవెట్టు(-పెట్టు) అ.క్రి. సంభాషించు, మాటాడు. భార. శాంతి. 4.387. మాటసందులుపట్టు స.క్రి. మాట పొరపాట్లను అవకాశంగా తీసుకొను. గౌ.హరి. పూ. 1307 పం. మాటసామెతకు అవ్య.ద్రు. మాటవరుసకు. మాటాడు అ.క్రి. 1. పలుకు. విక్ర. 1.133; 2. ప్రసంగించు. ఆము. 3.9; 3. నిష్ఠూరాలాడు; 4. ఆలోచన చేయు; 5. వ్యతిరేకంగా చెప్పు. < మాట + ఆడు. మాటాపలుకూ వి. 1. చెడుమాట. బసవ. 7.182; 2. మాటలు. మాటిడు అ.క్రి. మాటలాడు, సమాధానం చెప్పు. నిరంకు. 3.15. < మాట + ఇడు. మాట్లాడుకొను అ.క్రి. ముందుగా బాడుగ మొ. వి నిర్ణయించుకొను. మాట్లాడే దిక్కు వి. మంచీ చెడ్డా కనుక్కునే దిక్కు. మాట్లాడేవారు విణ.బ.వ. యోగక్షేమాలు విచారించేవారు.

**మాటాడు** చూ. మాట.

**మాటాపలుకూ** చూ. మాట.

**మాటి** రూ. మాటీ వి. స్త్రీలు చెవికమ్మనుంచి గూబమీదగా పైన జుట్టుకు తగిలించే నగ, చెంపసరాలు.

హిం. మాథా. నెత్తి, తలపైభాగం.

**మాటికి** చూ. మాటు[1].

**మాటిడు** చూ. మాట.

**మాటిమాటికి** చూ. మాటు[1].

**మాటీ** రూ.చూ. మాటి. వి. స్త్రీలు చెవికమ్మనుండి గూబ మీదగా పైన జుట్టుకు తగిలించే నగ, చెంపసరాలు.

**మాటు[1]** దూ. మాంటు. వి.ఔ. తూరి, తడవ. కు.సం. 5.110.

మాటికి అవ్య. ద్రు. ముహురర్థకం, అడుగడుక్కు. శృం.నై. 3.175. మాటిమాటికి వి. సారెసారెకు. కు.సం. 12.141.

**మాటు[2]** వి. 1. అతుకు. కు.సం, 11.57; 2. మరుగు, చాటు. భార. ఆశ్ర. 1.58; 3. వేటకాడు దాక్కోవటానికి ఏర్పరచిన పల్లం, తెర మొ.వి. రం. రా. కిష్కిం. 213పు. 16 పం.; 4. రక్షణస్థానం. శివధ. 1.16; 5. ఛత్రం; 6. పొలంలో తవ్విన చిన్నగుంట; 7. తములపాకుల కట్ట; 8. లోహ పాత్రలకు పడిన బొక్కలు అతకటానికి పెట్టిన లోహపుబిళ్ళ; 9. గజ్జెల్ని తయారు చేసేటప్పుడు కుంపటిలో ఏర్పరచిన నిప్పులగుహ; 10. గూనల్తో నీరు తోడ

టానికి ఎడ్లచేత లాగించటం; **11.** పొలంలో తవ్విన చిన్నకుంట; విణ. **1.** రక్షకుడు. భార. ఉద్యో. 4.114; **2.** అడ్డగించేది, నిరోధకం. ద్వి. పరమ. వి. 4.317; స.క్రి. **1.** మరుగుపరుచు. హం.న. 4.7; **2.** కలిగించు. సుద. 2.45; **3.** అణగద్రొక్కు. దాశ. 33; **4.** అంటించు. దాశ. 33; **5.** పాడుచేయు. బిల్హ. 2.17; **6.** కలిగించు. సుదంతా. 2.45; **7.** రంధ్రం లేకుండ సరిచేయు; **8.** ప్రవేశపెట్టు; **9.** పాతు; అ.క్రి. మణుగుపడు.

త. మాట్టు. కట్టు, అతుకు, తెగిఉండు; కుఇ. మార్గ. ఆశ్రయంగాను, మాఙ్జు. మరుగుపడు, అతుకువేయు; కురు. మాఁడ్. మాయు, దాచు.

< మూ.ద్రా. *మాత్, *మాత్త్- < *మాత్-త్; మూ.ద.ద్రా. మాత్, మత్-.

మాటుఒగ్గు స.క్రి. మరగుపరుచు. మాటుకట్టు స.క్రి. మరుగుపరుచు. మాటుకందకం వి. కుంటనుండి పొలానికి తీసిన కాలవ. మాటుకాయు అ.క్రి. పొంచిఉండు, చాటుగా ఉండు. మాటుకొను స.క్రి. మరుగు పెట్టుకొను, తిరోహితం కావించు. వసు. 1.34; అ.క్రి. అణగిఉండు. దశా. 3.204. మాటుగొయ్యి వి. దాచిపెట్టబడిన గొయ్యి. మాటుచేయు రూ.చూ. మాటుసేయు. స.క్రి. మరుగుపరచు. భాగ. 1.129. మాటుపడు రూ. మాటువడు. అ.క్రి. మరుగుపడు. విక్ర. 4.60. త. మాఙ్జుప్పడు. మాటుపఱుచు స.క్రి. మరుగుపరుచు. ఆము. 4.35. మాటుపెట్టు రూ.చూ. మాటువెట్టు. స.క్రి. దాచు. ప్రభా. 3.71. మాటుబొచ్చెలు వి.బ.వ. ఆము కాలిన తర్వాత రేవులకు పెట్టే మూతలు. మాటుమడఁగు రూ. మాటుమణఁగు. అ.క్రి. మాటునమడగు, గృహాదుల్లో అణగిఉండు, సద్దులేకుండాఉండు. విప్ర. 4.57. త. మాఙ్జుమడంగు. మాటుమణఁగు రూ.చూ. మాటుమడఁగు. అ.క్రి. మాటునమడగు, గృహాదుల్లో అణిగిఉండు, సద్దులేకుండాఉండు. శుక. 2.189. మాటుమత్తడి వి. కుంట నిండినప్పుడు మిగులు నీళ్ళుపోయే తోవ. మాటువడు(-పడు) రూ.చూ. మాటుపడు. అ.క్రి. మరుగుపడు. మాటువెట్టు(-పెట్టు) రూ. మాటుపెట్టు. స.క్రి. దాచు, మరుగుపర్చు. పి.శకు. 4.15. మాటుసేయు(-చేయు) రూ. మాటుచేయు. స.క్రి. మరుగుపరచు. భార. శాంతి. 2.396.

మాట్లాడుకొను చూ. మాట.

మాట్లాడేదిక్కు చూ. మాట.

మాట్లాడేవారు చూ. మాట.

మాడ[1] రూ. మాడు[2]. వి. **1.** అరవరా, అర్ధదీనారం. భార, అను. 2.268. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1044. క్రీ.శ. 1098; **2.** పణదశకం, పదిరూకలు. సారంగ. 1.56.

త. మాడై. ప్రాచీనకాలంలో వ్యవహారంలో ఉన్న బంగారు నాణెం.

మాడమాడపంతములు వి.బ.వ. మాటిమాటికి పట్టింపులు. తాళ్ల.సం. 14.206.

మాడ[2] రూ.చూ. మోడము. వి. మేఘం.

మాడ[3] రూ.చూ. మాడు[1]. వి. **1.** ఇంటికొప్పుకు చూరుకు మధ్యభాగం; **2.** తలరంధ్రం; **3.** మోరపాక వెనక భాగం; **4.** మట్టిపాత్రను సర్పేటప్పుడు అడుగు పైభాగంలో చుట్టూ వెన్నులాగా నిలిపిన అంచు.

మాడపట్టు వి. బ్రహ్మరంధ్రం, నోడు.

మాడ[4] రూ.చూ. మాడువు. వి. **1.** మేడ, అంతస్తుగల ఇల్లు; **2.** దేవాలయ ప్రహరీ ఆనుకొని ఏర్పడ్డ గ్రామవీథి.

మాడటిక చూ. మాడు[1].

మాడపల్లిరము చూ. మాడ[1]. వి. స్తాంబాళం, పెద్దపళ్ళెం. నె.శా. కనిగిరి. 24. క్రీ.శ. 1268.

మాడఫాకు రూ.చూ. మోడపాకు. వి. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపుమొక్క.

మాడము రూ.చూ. మెండము. వి. మబ్బు.

మాడి[1] వి. కారుకొల్లి, కలిగొట్టు. పి.శకు. 2.14.

మాడి[2] వి. వనకుఠత్థం, అడవిఉలవ. వేంక. పంచ. 4.416.

మాడి[3] వి. ప్రయాణ సాధనం. శ్రీరం. మా. 9.6.

క. మాడి. బండి, ప్రయాణసాధనం.

<క. మాడి.

మాడి[4] రూ.చూ. మాడువు. వి. **1.** మేడ, అంతస్తుగల ఇల్లు, అంతస్తు, ఇంటిపై వేసిన ఇల్లు; **2.** మిద్దె.

మాడిల్లు వి. కొంతభాగం మేడగల పెంకుటిల్లు. <మాడి[4] + ఇల్లు.

మాడి[5] వి. మకరంగుబ్బ, కొయ్యస్తంభానికి పీటకు కింద ఉబ్బెత్తుగా చెక్కిన గుండ్రటి భాగం.

మాడికి రూ.చూ. మాడ్కి. వి. **1.** రీతి, విధం, ఉపమావాచకం; **2.** కారణం.

మాడిగ రూ.చూ. మాడువు. వి. మేడ, అంతస్తుగల ఇల్లు, ఇంటిపైన వేసిన ఇల్లు.

మాడీ రూ.చూ. మాడువు. వి. **1.** మేశ; **2.** మిద్దెపై రెండవ అంతస్తు.

మాడు[1] రూ. మాడ[3]. వి. **1.** శిశువు పుట్టగనే నెత్తిన పుర్రెలో ఏర్పడి ఉండే గుండ్రటి మెత్తటి ప్రదేశం, తలరంధ్రం; **2.** ఇంటికొప్పుకు చూరుకు మధ్యభాగం; **3.** బట్టీవెలుపలి భాగం, బైటిపెళ్ళలుగూడా బాగా కాలటానికి చుట్టూ కట్టే రాతి మందంగోడ; **4.** పణత, ఏడికోల మార్చే కొయ్య మొద్దు, నాగటివంపు పైభాగం; **5.** మట్టిపాత్రను సర్పేటప్పుడు అడుగు పైభాగంలో చుట్టూ వెన్నులాగా నిలిపిన అంచు; **6.** బొయ్యి పైభాగంలో వాలుగా ఒంగిన భాగం.

మాడటిక వి. మాడుపెట్టి చేసిన చిన్న మట్టిపాత్ర. <మాడు[1] + అటిక. మాడుకట్టు స.క్రి. ఆములో కుండలను వరసలుగా అమర్చు. మాడుకడవ వి. మధ్యభాగంలో గేడిపెట్టి చేసిన కడవ. మాడుగోడ వి. సింహద్వారం నిలిపినగోడ. మాడుదాక వి. వెలుద్వమూతి బోడంచు లోపలలో వాయి ఉండే మట్టిపాత్ర. మాడుదించు అ.క్రి. ఆటక, దాక మొ. వాటికి సర్పేటప్పుడు పక్కభాగంలో అంచుపెట్టు. మాడుదూలం వి. కుంటదూలం, గోడమీద నుంచి దూలం మీదకి వేసే మరో చిన్న దూలం, దీని మీద గుజ్జులు బిగిస్తారు. మాడుపిడత రూ. మాడుపిడ్త. వి. నోరు వెడల్పుగా ఉండి అర్ధశేరు బియ్యం ఉడికే

మట్టిపాత్ర. **మాడుపిడ్త** రూ.చూ. మాడుపిడత. వి. అర్ధశేరు బియ్యం ఉడికే మట్టిపాత్ర. **మాడుపెట్టు** అ.క్రి. అటక, దాక మొ. వాటికి సర్దేటప్పుడు పక్కభాగంలో అంచు పెట్టు. **మాడుబాన** వి. మాడు పెట్టి చేసిన పెద్ద మట్టిపాత్ర. **మాడురాయి** వి. కుండమాడును తయారు చేసేటప్పుడు వాడే రాయి. **మాడువేయు** అ.క్రి. అటక, దాక మొ. వాటికి సర్దేటప్పుడు పక్కభాగంలో అంచుపెట్టు. **మాడుశ్రేణి** వి. పంచస్తంభాలమీద వేసే అడ్డవాసం. **మాడుసట్టి** రూ. మాడుగుసట్టి. వి. మాడు పెట్టి చేసిన మట్టిపాత్ర. **మాడెత్తు** అ.క్రి. అటక, ధాక మొ. వాటికి సర్దేటప్పుడు పక్కభాగంలో అంచుపెట్టు. <మాడు[1] + ఎత్తు[1].

**మాడు[2]** రూ.చూ. మాడ[1]. వి. వరహాలోసగం, రెండు రూపాయలు.

**మాడు[3]** రూ.చూ. మాడువు. వి. దేవాలయప్రహరీ అనుకొని ఏర్పడిన గ్రామ వీథి.

**మాడుగు[1]** రూ.చూ. మాడువు. వి. **1**. మేడ; **2**. డాబా; **3**. సౌధం.

**మాడుగు[2]** చూ. మాడు[1]. వి. రెండంచులుండే అన్నంకుండ. **మాడుగుసట్టి** రూ.చూ. మాడుసట్టి. వి. మాడుపెట్టి చేసిన మట్టిపాత్ర.

**మాడుపు** రూ. మాడ్పు. వి. వృక్షవిశేషం. హంస. 4.9.

**మాడువిల్లు** చూ. మాడువు.

**మాడువు** రూ. మాడ[4], మాడి[4], మాడిగ, మాడీ, మాడు[3], మాడుగు[1]. వి. **1**. హర్మ్యం. కు.సం. 7.112; **2**. సౌధభేదం, ఒకరకం మేడ, డాబా. భార. ఆశ్ర. 1.58; **3**. సౌధం, మేడ. ఆము. 1.52.

సం. మాలికా. గృహం; ప్రా. మాడిఅ. దే.ప్రా. మాళె; పా.మా. మాళ; పో.చూ సం. మాడి-. భవనం, మాలా. ఇంటి పైభాగం, మాలిక-. వెల్లవేసిన మేడ, మాడ. మేడ;

క. మాడ, మాట, మాళ, మాళిగె. భవనం, మేడ, మాడి. మేడ, భవనం, మాడు; తు. మాడు. పైకప్పు, మాడ. పిశాచాల స్థావరం; త. మాటమ్. మేడ, ఇల్లు, గుడిసె, పెద్దగది, మేపై; మ. మాటమ్. పై అంతస్థుగల ఇల్లు, మేడ. మాడం, మాడు; కువి. మేడ; పర్జి. మాళ-, మాల. మండపం, పెద్దగది; కొలా. మడి. మేడపై అంతస్థు; మాల్తో. మడిఅ. ఇంటిమీదగది; బ్రా. మాడీ.

<ప్రా. మాడిఅ-.

**మాడువిల్లు** రూ. మాడువటిల్లు. వి. మేడడాబా. కు.సం. 7.109. <మాడువ + ఇల్లు. **మాడువుటిల్లు** రూ.చూ. మాడువిల్లు. వి. మేడిల్లు. తాళ్ల.సం. 17.581.

**మాడె** రూ.చూ. మాడెము. వి. మండలం. పల్నా.వ. 2.6.

**మాడెత్తు** చూ. మాడు[1].

**మాడెము** రూ. మాడువ. వి. 1. మాడుగుల సంస్థానం. మను. 1.37; **2**. దుర్గమస్థలం, మన్నెం. ఆం.భా. 2.7.

**మాడ్కి** రూ. మాడికి. వి. **1**. కారణం. భార.ఆది. 6.178; **2**. రీతి, విధం, ఉపమానావాచకం. కు.సం. 2.42.

క. మాడులికె. చేయటం, మాడ్కె. పద్ధతి, విధం.

**మాడ్పు** రూ.చూ. మాడుపు. వి. ఒకానొక చెట్టు. హంస. 4.10.

**మాణికము** రూ. మాణిక్కము. వి. దేవదాసి, సాని, దేవాలయంలో నాట్యం చేసే స్త్రీ. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 883. క్రీ.శ. 1370.

సం. మాణిక్య-. రత్నవిశేషం; ప్రా. మాణిక్క-.

<ప్రా. మాణిక్క-.

**మాణిక్కము** రూ.చూ. మాణికము. వి. దేవదాసి, సాని. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1202.

**మాణిసి** రూ.చూ. మానిసి[1], వి. మనుష్యుడు.

**మాంటు** రూ.చూ. మాటు[1]. వి. తడప, తూరి. శా.ప.మ. 69. క్రీ.శ. 1378.

**మా(టినంగ** వి. **1**. ముగ్ధ, అవిదగ్ధ. కాశీ. 3.62; **2**. కాముకి. కాశీ. 3.171;

త. మాదునంగై.

**మా(టు** ఆ.క్రి. తగులుకొను. భల్లా. 5. వి. 1 తగులం; **2**. మాతు, చదరంగం ఆటలో బంటుతో కాక తక్కిన వాటితో రాజును కట్టటం.

త. మాతు. లోపం, దోషం.

**మా(డయినామక్కయినా** చూ. మా(డు[1].

**మా(డించు** చూ. మా(డు[1].

**మా(డు[1]** అ.క్రి. **1**. దగ్ధమగు. భార.ఆది. 2.46; **2**. పాడగు, చెడు. భార. శాంతి. 3.189; **3**. శుష్కించు, ఎండు. చెన్నబసవ. 5.27; వి. అడుగంటిన అన్నం, దగ్ధిక. పాండు. **4**.153.

త. మాటు, కాలు, మాట్టు. వెలిగించు; కో. మాట్ (మాచ్). మండించు; తొ. మోట్. అగ్నిలో ఇంధనం చేయు; గోం. మాస్. వెలిగించు, శవాన్నికాల్చు; కుఇ. మాక. కాల్చు; మాల్తొ. మాండ్. కాల్చు.

మూ.ద్రా. మా-, మాంట్-/మాట్ట్ లేక మాట్.

**మా(డయినామక్కయినా** అవ్య. అడుగూబొడుగూ. కుక్కు. 18. **మా(డించు** స.క్రి. మాడచేయు, దగ్ధంచేయు. హరి.పూ. 2.180. <మా(డు[1] + -ఇంచు[3]. **మా(డుచు** రూ.చూ. మాడ్చు. స.క్రి. మాడించు, దగ్ధంచేయు. కకుత్థ. 2114. **మా(డుచెక్క** వి. **1**. వంటలో అడుగంటి మాడిన చెక్కలు; **2**. అడుగున చెక్కలుగా మాడిన అన్నం. **మా(డుముఖం** వి. ముడుచుకుపోయిన ముఖం. **మా(డ్చు** రూ. మా(డుచు. స.క్రి. మాడించు, దగ్ధంచేయు. రామాభ్యు. 7.246.

**మా(డు[2]** వి. ఇంటి వెనకభాగం కప్పు.

**మా(డె** వి. కాకిలా చలించేది, కారుకొల్లి.

**మా(డెము** రూ. మండెము. వి. మండలాధిపతులు, భూమండలం. మను. 1.37.

సం.ప్రా.ఒ. మండల-. వృత్తం.

**మా(డ్చు** చూ. మా(డు[1].

**మాత** వి. పెళ్ళి చేసుకోకుండా జాతర్లలోను కొలుపులలోను జరిగే ఊరేగింపుల్లో చిందు వేసే మాదిగ ఆడబడుచు.

సం. మాతృ-, మాతా. మాతృ శబ్దం ప్రథమైక వచనం, తల్లి; ప్రా. మాయా; పా. మాతా, మాతు.

<సం. మాతా (అర్థవిపరి.).

మాతమ్మ వి. ఒక గ్రామదేవత. <మాత + అమ్మ.

మాతగొరక వి. మత్స్య విశేషం.

మాతంగిముంత వి. చుట్టూ గవ్వల పేరులాగా అలంకారంఉన్న ముంత.

సం. మాతంగీ. చండాలస్త్రీ.

<మాతంగీ + ముంత.

మాతాబి వి. జలతారు.

హిం. మహ్‌తాబీ. జ్వలించే పెద్దవత్తి.

<హిం. మహ్‌తాబీ.

మాతాలు వి.బ.వ. టీకాలు.

సం. మాతృ-. తల్లి. ప్రథమైకవచనం మాతా.

<సం. మాతా + -లు.

మాతు రూ. మాఁతు. వి. చదరంగంలో బంటుతో కాక తక్కిన కాయలతో రాజుకు షా అనటం.

ఉ. పార. మౌత్. మృత్యువు, చావు, మౌతా. చనిపోయిన.

మాతుడుపు వి. మాతంగిని ఆరాధించే ఆచారం.

సం. మా. లక్ష్మిదేవి, తల్లి.

<సం. మా + తుడుపు.

మాతుబరి రూ.చూ. మోతుబరి. వి. **1.** మంచి స్థితిలో ఉన్న ; **2.** ఆర్థిక సంబంధమైన ; **3.** అప్పులు చెల్లించే శక్తి కలిగి ఉండటం.

మాతృస్థానము వి. ప్రధానస్థలం, నగరం. ద.హిం.శా.సంపు. 7, శా.సం. 558, క్రీ.శ. 1856.

సం. మాతృస్థాన-. మూలస్థానం.

<సం. మాతృస్థాన- (అర్థవిపరి.).

మాత్ర వి. అసిమి, గోనెలా కోలగా కుట్టిన సంచి, బాటసార్ల సామాన్ల సంచి. ఆము. 6.71.

మాత్రసంచి వి. అసిమి, గోనెవలె కొలగా కుట్టిన సంచి. ఆము. 2.74.

మాద రూ. మాదు. వి. **1.** ఒకజాతి రోగం, వ్రణాలు కలిగించే రోగ విశేషం. బసవ. 3.789 పం. ; **2.** తలలోని పుండు.

మాదతోక వి. తోక చివర ఏర్పడే పుండు. మాదదొంగ వి. గొంతుమీద వాపు. మాదపుట్టు వి. పుటమోద, కంట్లో కొయ్యకండ పెరగటం.

మాదక్‌సిబ్బి వి. నగభాగందాకా రంధ్రాలుండి గంజి వార్పుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టి మూకుడు.

హిం. మాదక్. మత్తు కలిగించేది.

<హిం. మాదక్ + సిబ్బి.

మాదగిట్ట రూ. మాదగెట్టె. వి. కొన సాగిన గిట్ట.

మాదగెట్టె రూ.చూ. మాదగిట్ట. వి. కొన సాగిన గిట్ట.

మాదచ్చోద్ రూ.చూ. మాదర్చోదీ. వి. ఒకవిధమైన తిట్టు.

మాదపురి రూ.చూ. మాదవపురి. వి. ఒకరకం కలుపుమొక్క.

మాదర రూ. మేదర. వి. మేదర, మేదరివాళ్ళకు సంబంధించిన. బొడ్డపాడు శాసనం. క్రీ.శ. 1060.

క. మేద, మేదఁర. మేదర, మేదరజాతివాడు, బుట్టలు చాపలు అల్లేవాడు; కొడ. మె-దె. మేదరివాడు ; త. మేతరవరే, మేతవర్. వెదురు తడకలు, చాపలు మొ. వి అల్లుకొని జీవించే జాతి ;

పో.చూ. సం. మేద-. సంకరజాతి.

మాదర్చోదీ రూ. మాదచ్చోద్. వి. దగా, మోసం (ఉత్తర సర్కారుల్లో వాడుక).

హిం.ఉ.పార. మాదర్. తల్లి ; హిం.ఉ. ఛూత్. సంసర్గం, సంభోగం.

<ఉ. మాదర్‌ఛూత్.

మాదళము రూ.చూ. మాదావళము. వి. **1.** కపిలవర్ణం. ఉ.రా. **4.176** ; **2.** కపిలవర్ణపు వస్త్ర విశేషం. ప్రబంధ. 505.

మాదవపురి రూ. మాదపురి, మాదప్‌పురి, మాదేపురం. వి. ఒకరకం కలుపుమొక్క.

మాదవళము రూ.చూ. మాదావళము. వి. **1.** కపిలవర్ణం ; **2.** కపిలవర్ణం ఉన్న వస్త్ర విశేషం.

మాదవళి రూ.చూ. మాదావళము. వి. **1.** కపిలవర్ణం. ద్వి.పరమ వి. 6.478 ; **2.** కపిలవర్ణంగల చీర.

మాదప్‌పురి రూ.చూ. మాదవపురి. వి. ఒకరకం కలుపుమొక్క.

మాదాకవళము రూ. మాదాగబళం, మాదోగబళం, మాధాకబళం. వి. అడుక్కొని సంపాదించుకొన్న భిక్షాన్నం.

సం. మాతృ, మాతా. (ప్రథమావిభక్త్యేకవచనం) తల్లి; హిం.ఉ.పార. మాదర్.

<సం. మాతా + కవళము.

మాదాగబళం రూ.చూ. మాదాకవళము. వి. మధుకరవృత్తి.

మాదాగుడి వి. మరియ పేర అంకితమైన ప్రార్థనా మందిరం.

పో. మ్యాఁది. క్రైస్తవ సన్న్యాసిని ; స్పా. మ్యాఁదే.

<పో. మాద్రి + గుడి.

మాదాపన వి. **1.** నిద్ర పట్టీపట్టని స్థితి ; **2.** జ్వరాదుల్లో ఒళ్ళు తెలియని స్థితి.

మాదావళము రూ. మాదళము, మాదవళము, మాదవళి, మాదావళి. వి. **1.** కపిలవర్ణం. కళా. 8.139 ; **2.** కపిల వర్ణంగల చీర.

మాదావళి రూ.చూ. మాదావళము. వి. **1.** కపిలవర్ణం. చిత్రభా. 2.61 ; **2.** కపిలవర్ణంగల చీర. కవిక. **3.195**.

మాదిగ్గాబు చూ. మాదిఁగ.

మాదిగ్గోలెం చూ. మాదిఁగ.

మాదిఁగ రూ.చూ. మాదిఁగి. వి. హరిజనుల్లో ఒక కులంవాడు, చండాలుడు. శృం.శా. 6.215.

మాదిగ్గాబు వి. తోళ్ళు నానబెట్టటానికి మాదిగలు వాడే పెద్ద మట్టిపాత్ర. <మాదిఁగ + గాబు. మాదిగ్గోలెం వి. తోళ్ళు నానబెట్టటానికి మాదిగలు వాడే పెద్ద మట్టిపాత్ర. <మాదిఁగ + గోలెము. మాదిఁగకత్తి వి. మాదిగవాని కత్తి. మాదిఁగకొయ్య వి. ఒకరకం తిట్టు, మాదిగ వెధవ (తిట్టులో కొయ్య చేరుతుంది). పండి.చ. 1.131. మాదిఁగది విణ. చెప్పులు కుట్టే కులం స్త్రీ, మాదిగ స్త్రీ.

<మాదిఁగ + అది. మాదిఁగమంచమగు అ.క్రి. ఛిన్నాభిన్నమగు, మురికి మురికిగా ఉండు. మాదిఁగమాన్యం వి. మాదిగవాడికిచ్చే మాన్యం.

మాదిఁగి రూ. మాదిఁగ. వి. చండాలుడు, హరిజనుల్లో ఒక కులంవాడు. పండి.చ. 1.44 పు.

సం. మాతంగ-. చండాలుడు, మాతంగి. చండాల స్త్రీ ; ప్రా. మాయంఁగ- చండాలుడు, చండాల స్త్రీ ; పా. మాతంగ- ;

క. మాదిగ. చండాలుడు, చర్మకారుడు ; త. మాతిగె.

<సం. మాతంగ-.

మాదితీగె వి. కంచెల్లో పెరిగి లేతఎరుపురంగు పూలుపూసే తీగ (Argyreia eymosa).

మాదిపలము రూ. మాదీపలము. వి. మాతులుంగ. యయా. 2.48.

క. మాదల, మ్యాదాల, మాది. ఒకరకంపండు ; తు. మాదల, మాపల. ఒకరకం పండు, మాదర-ఫల. పెద్దదబ్బపండు ; త. మాతళై, మాతుళై, మాతుళమ్. ఒకరకం పండు ; కో. మదళ్‌మ్, మదళ్, గమ్. ఒక రకం పండు ; పో. చూ. సం. మాతులుంగ-.

మాదిరి[1] రూ. మ్యాద్రి[1]. విశ. సదృశం. కవిజనా. 1.69. వి. 1. పద్ధతి. రాజవా. 5.13 ; 2. ఔపమ్యం, పోలిక. ఆం. భా. 2.302.

సం. మాతృకా. మూలం, అసలు ; ప్రా. మాఉఅ, మాఉక, మాదు ; శౌ. మాదు, మాదరమ్. ద్వివిభక్తి రూపం ; మా. మాదుక ;

క. మాదిరి, మ్యాది ; తు. మాదరి, మాదిరి, మాద్రి ; త. మాతిరి ; మ. మాదిరి.

మాదిరిసేయు (-చేయు) స.క్రి. పోల్చు, ఉపమించు. విజయ. 1.68.

మాదిరి[2] వి. ఒకదినుసుబేకు.

పో. మాదేరా. కొయ్య, కలప ; స్పా. మాదేరా. కొయ్య, కలప, మాదేరో-. కొయ్యదూలం, కలపవర్తకుడు ; పై. మ్యదీప, మూలం, దంతె, గట్టిబల్ల.

<పో. మాదేరా.

మాదిరి[3] వి. ఆకు కప్పుకు ఉపయోగించేగడి.

మాదీపలము రూ.చూ. మాదిపలము. వి. మాతులుంగం.

మాదు రూ.చూ. మాద. వి. తలలో పుట్టేపుండు.

మాదుము వి. పెద్దకురుపు.

మాదెన వి. స్థూలపుష్పం.

మాదేపురం రూ.చూ. మాదవపురి. వి. ఒకరకం కలుపుమొక్క.

మాదేవుఁడు రూ.చూ. మహదేవుఁడు. వి. శివుడు.

మాదోగబళం రూ.చూ. మాదాకవళము. వి. మాధుకరవృత్తి.

మాద్రి[1] రూ.చూ. మాదిరి[1]. వి. సాదృశ్యం, పోలిక. పాండు. 1.3 ; విశ. సమానం. కృ. శకు. 1.17.

మాధవతీగె వి. అందమైన పూలుపూసే ఎర్రనితీగ (Hiptage madablota).

మాధాకబళం రూ.చూ. మాదాకవళము. వి. మధుకరవృత్తి.

మాన రూ. మానకు. వి. మానిక. (కొన్నిప్రాంతాల్లో ఒకశేరు, కొన్ని ప్రాంతాల్లో రెండుశేర్లని వాడుక). ద్రాక్షారామం శాసనం. క్రీ.శ. 1038.

క. మానికె, మానిక, మానికా. ఒకతూనిక, నాలుగు ద్రోణాలు ;

ప్రా. మాణ-, మాణీ. మాన విశేషం; పా. మాన-. ఒకకొలత ; నే. మాను. తవ్వ ; అ. బెం. మాన్. ఒక కొలత ; ఒ. మాణ. భూమికొలత.

మానటిక వి. మానెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర. <మాన + అటిక. మానెటటిక రూ.చూ. మానెడటిక. వి. మానెడుగింజలు ఉడికే మట్టిపాత్ర. మానెటటికె రూ.చూ. మానెడటిక. వి. మానెడుగింజలు ఉడికే మట్టిపాత్ర. మానెడటిక రూ. మానెటటిక, మానెటటికె. వి. మానెడు గింజలు ఉడికే మట్టిపాత్ర. మానెడికుండ చూ. మానెడు కుండ. వి. మానెడుబియ్యం ఉడికే మట్టిపాత్ర. మానెడు రూ. మానెణ్డు. వి. ఒక్కమానిక పరిమాణంగల. సర్పవరం శాసనం. క్రీ. శ. 1074. మానెడుకడవ వి. మానెడు ధాన్యాన్ని కొలిచే మట్టిపాత్ర. మానెడుకుండ వి. మానెడు బియ్యం ఉడికేకుండ. మానెణ్డు రూ.చూ. మానెడు, మానెండు, మానెఁడు. వి. ఒక్కమానిక పరిమాణంగల. మాలెపాడుశాసనం. క్రీ. శ. 971. మానెండు రూ.చూ. మానెణ్డు. వి. మానెడు. సర్పవరంశాసనం. క్రీ. శ. 1094. మానెఁడు రూ.చూ మానెణ్డు. వి. మానిక ప్రమాణం.

మానకము చూ. మాను[1].

మానకు రూ.చూ. మాన. వి. నాలుగుసోలలు లేదా రెండు తవ్వలు పట్టేకొలతపాత్ర.

మానపడు రూ.చూ. మానువడు. అ.క్రి. చేష్టలుడగు. తాళ్ల. సం. 15.125.

మానపొలము వి. మాన్యం. నె. శా. రాపూర్. 46.

సం. మాన-. గౌరవం, సమ్మానం.

<సం. మాన- + పొలము. (మిశ్రస.).

మానము రూ. మానా. విశ. శక్యం. హరి. ఉ. 8.287 ; వి. 1. సమానం. రం. రా. ఉ. 133పు. 9పం. ; 2. సమయం. భాస్క. రా. సుందర. 163 ; 3. పద్ధతి. మొల్లరా. యు. 2.90.

సం. మాన-. సమ్మానం, గౌరవం, పౌరుషం, ఆత్మాభిమానం.

<సం. మాన- (అర్థవిపరి.).

మానముకొల్లలాడు అ.క్రి. సంగమించు. ఉషా. 2.72. మానముగొను (-కొను) స.క్రి. అవమానపరచు. సారంగ. 2.236. మానముబిళ్ల వి. ఆడపిల్లలకు మొలత్రాడుకు కట్టేబిళ్ల, సిగ్గుబిళ్ల. మానానికి అవ్య. దానికది.

మానయినిలుచు చూ. మాను[3].

మానవతలం వి. మానవతి, ఒకరకం కలుపుమొక్క.

సం. మానవతీ. స్త్రీ, గౌరవం కలది.

<సం. మానవతీ + అలం.

మానవతి రూ. మానావతి. వి. మానంగల స్త్రీలాగా నటించేస్త్రీ.

సం. మానవతి. మానిని, అసూయచే కలిగిన కోపం గల స్త్రీ.

<నం. మానవతీ (అర్థవిపరి.).

మానసపుత్రులు వి.బ.వ. అనుసరించేవారు, అచ్చం అలా ఉండేవారు.

నం. మానసపుత్ర-. మనస్సునుంచి పుట్టిన కుమారులు.

<నం. మానసపుత్ర-+-లు (అర్థవిపరి.).

మానా రూ.చూ. మానము. వి. 1. చూచి అనుసరించటానికి ఏర్పరచిన వస్తువు, నమూనా ; 2. విధం ; 3. పైవిలాసం ; 4. విద్యార్థులకు రాత కుదరటానికి కాపీకి రాసే ఒజ్జబంతి ; 5. చిరునామా.

మానానికి చూ. మానము.

మానాబీర వి. దూదిప్పచెట్టు (Hymenodictyon cexelsum).

మానావతి రూ.చూ. మానవతి. వి. తనలోపాన్ని కప్పిపుచ్చి మాటలాడే స్త్రీ.

మానాస వి. లావు.

హిం. ఉ. మన్‌హూస్. అప్రియదర్శనం.

మాని[1] వి. దేవాలయ పరిచారకుడు. ద. హిం. శా. సంపు. 6. శా. నం. 101. క్రీ.శ. 1153.

నం. మాణవక-. బ్రహ్మచారి ; త. మాణాక్కమ్. వటువు.

మాని[2] వి. బుట్ట, మూతిఉన్న చిన్నగంప.

నం. మాన-. పరిమాణం ; ప్రా. మాణ-. పదిసేర్ల పరిమాణం.

మానిఉయ్యాల చూ. మాను[3].

మానిక[1] రూ. మానికము[2], మానికె[1], మానిగ, మానిగె. వి. 1. రెండుతవ్వలు లేదాఅడ్డలోసగం. వలివేరుశాసనం. క్రీ.శ 1043 ; 2. నాలుగుసోలలకొలత, ఆకొలతఉన్నపాత్ర. ఆం. భా. 2.270 ; 3. అలంపూరు తాలూకాలో 12 కొలత సేర్లు ఒకమానిక ; 4. ముంతలో సగం ; 5. మారెళ్ళ సీమలో వాడుకలో ఉన్న సింగంపుట్టి కొలమానంలో ఒక భాగం ; 6. వరంగల్‌లో గిద్దెలలెక్క ప్రకారం గిద్దెడు, అరసోల, సోల, తవ్వ, మానెడు, అడ్డెడు, కుంచెడు, ఇరుస, తూము, ఇవి ఒకదానికి మరొకటి రెండింతలు.

నం. మానక-. పరిమాణవిశేషం ;

క. మానికె. మానిక.

<నం. మానక-.

మానిక[2] వి. మోటబానకు అడుగున తొండం కలిపేచోటు.

మానికమొద్దు వి. చెరువులో కిందితూము మూసే మొద్దు.

మానికవాయి వి. కిందిరోలు, గాడి, నారసం, పొయితూము, చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న కిందితూము.

మానికంకొయ్య రూ.చూ. మానిక్యంకొయ్య. వి. నడుపుకొయ్య, మడిగలకొయ్య. మందసకొయ్య, బండిపరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య.

మానికదారి చూ. మానికము[1].

మానికము[1] రూ. మానికె[2]. విణ. శ్రేష్ఠమైన. విక్ర. 2.257 ; వి. 1. కెంపు, పద్మరాగం. వసు. 1.2 ; 2. రత్నం, మణి. అచ్చ. రా. బాల. 2.

నం. మాణిక్య-. మణి; ప్రా. మాణిక్క-. రత్నవిశేషం; అ.మా. మాణిక్కం ;

క. మాణిక. మాణిక్యం ; తు. మాణిక ; మ. మాణిక్కం.

<ప్రా. మాణిక్క-.

మానికదారి వి. భోగం స్త్రీ ; నం. మాణిక్యధారిణీ. మాణిక్యాన్ని ధరించేది. మానికాలు వి.బ.వ. గుడిసానులు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1214. క్రీ.శ. 1309.

మానికము[2] రూ.చూ. మానిక[1]. వి. మానిక. సర్వవరం శాసనం. క్రీ.శ. 1078.

మానికంబ వి. పార్వతి.

నం. మాణిక్యాంబా. పార్వతీదేవి.

<నం. మాణిక్యాంబా.

మానికాలు చూ. మానికము[1].

మానికె[1] రూ.చూ. మానిక[1]. వి. రెండు తవ్వలు, పరిమాణ విశేషం. కేయూ. 2.10.

మానికె[2] రూ.చూ. మానికము[1]. వి. మణి.

మానిక్కెం చూ. మానికము[1]. వి. చౌడీశ్వరిపూజ చేసేటప్పుడు దీపం పెట్టటానికి గోధుమ పిండితో చేసిన ప్రమిద.

మానిక్కేలు వి.బ.వ. జాతర్లలోవాడే చిన్నమట్టి ప్రమిదలు.

మానిక్యంకొయ్య రూ. మానికంకొయ్య. వి. బండి ఇరుసుల మీద నిలబెట్టినకొయ్య.

మానిగ రూ.చూ. మానిక[1]. వి. 1. ధాన్యం పోసుకొనే పెద్ద మట్టిపాత్ర ; 2. ఒకరకం ఇత్తడి పాత్ర.

మానిగె రూ.చూ. మానిక[1]. వి. ధాన్యం పోసుకొనే పెద్ద మట్టి పాత్ర.

మానించు చూ. మాను[1].

మానిపలక చూ. మాను[3].

మానిపసుపు చూ. మాను[3].

మానిపించు చూ. మాను[1].

మానిపుక్కిటిగా(డు చూ. మాను[3].

మానిపుక్కిటిపులు(గు చూ. మాను[3].

మానిపోటు చూ. మాను[3].

మానిపోటుపులు(గు చూ. మాను[3].

మానిపోటుపుల్లు చూ. మాను[3].

మానిపోటువు చూ. మాను[3].

మానిబొమ్మ చూ. మాను[3].

మానిముంత చూ. మాను[3].

మానిసి[1] రూ. మాణిసి, మాసి. వి. 1. మనుష్యుడు, పెద్దతిప్ప సముద్ర శాసనం. క్రీ.శ. 825 ; 2. యోధుడు, భార.ఆది. 8.268 ; 3. సేవకుడు. భార. ద్రోణ. 5.143 ; విణ. శూరుడు, పౌరుషవంతుడు. భార. ద్రోణ. 3.108.

నం. మానుష-, మనుష్య- ; ప్రా. మాణుస-, మణుస-, మణుస్స-, మనుస్స-, మాణుస్స- ; అశో. ప్రా. మనుస- ; శా. మణుస్స- ; పా. మానుస-. మానవుడు ; మరా. మణుశ్య, మృచ్ఛ, మణుశ్యక ;

క.మనుస, మానస, మానిస. మనిషి; కొడ. మనిసె. ఎరుకల, మెనిసన్. చెంచు, మానూస్. మరియం ; తు. మనుసె. మాదిగ ; త. మవితన్, మనియన్, మను

చ్చున్, మనుటన్ ; మ. మనిచ్చున్. బానిస ; గోం. మన్సె.

<ప్రా. మాణుస-.

**మానిసికో(తి** రూ.చూ. మానిసి[క్రో(తి. వి. మర్కట విశేషం. మనుష్యాకారంగల కోతి. ప్రబంధ. 135. **మానిసి[క్రో(తి** రూ. మానిసికో(తి. వి. మర్కట విశేషం, మనుష్యాకారంగల కోతి. శుక. 1 108 **మానిసితనము** వి. 1. పౌరుషం. భార. ఉద్యో. 4.233 ; 2. మనుష్యత్వం. వేంక. పంచ. 4.161. **మానిసిదిండి(-తిండి)** వి. రాక్షసుడు, నరభోజి. ఉ.హరి. 4.263. **మానిసిదిండికా(డు** వి. రాక్షసుడు, నరభోజి. అచ్చ.రా.బాల. 152. **మానిసిబూతము** వి. మనుష్యరూపంలో ఉన్న పిశాచం. చెన్నబసవ. 2.24. **మానిసిమ[ట** వి. మనిషీ, మ[ట. **మానిసిరౌతు** వి. కుబేరుడు, నరవాహనుడు **మానిసిఱే(డు** వి. రాజు, నరపాలుడు. అచ్చ రా.బాల. 29. **మానిసి సింగము** వి. నరసింహమూర్తి. అచ్చ.రా.యు. 465.

**మానిసి[2]** రూ. మనిసి[3]. వి. స్త్రీ, మనుష్య స్త్రీ. భార. విరా. 1.254.

సం. మానుషీ ; ప్రా. మణుస్సి, మాణుసీ, మాణుస్సె. స్త్రీ ; పా. మానుసీ ;

క. మనుసి, మానసి.

<ప్రా. మాణుసీ.

**మానీ(గ** చూ. మాను[2].

**మాను[1]** స.క్రి. 1. వదులు, విడుచు. నిర్వ.రా. 4.25 ; 2. విరమించు, చాలించు. భార. విరా. 5.255 ; అ.క్రి. 1. పోవు, నశించు. భార. శాంతి. 1.317 ; 2. ఆగు, నిలిచిపోవు. భార. ఆరణ్య. 4.339 ; 3. సమాప్తమగు, ముగియు. హరి.పూ. 5.48 ; 4. కలుగకుండు, పుట్టకుండు. భాగ. 10 ఉ. 52 ; 5. క్షీణించు, తగ్గు. రాఘవ. 2.15 ; 6. (బడికి) రాకుండాపోవు ; 7. (గాయం, పుండు మొ.వి) తగ్గు, మాను.

క. మాణు, మాండు. ఆపు, అడ్డు, నిరోధించు, మాన్. (గాయం, పుండు మొ.వి) తగ్గు, మాను ; త. మాన్, మాంతు (మాంతి-). నశించు, చచ్చు, ముగియు ; కుఇ. మాఱ (మాఱి-). (గాయం, పుండు మొ.వి) మాను, తగ్గు.

**మానకము** వి. 1. పనికి మాలిన సెలవుదినం ; 2. మాఫీ. చేయు. **మానించు** స.క్రి. 1. ఆపు, అడ్డుకొను. భార. భీష్మ. 2.384 ; 2. పోజేయు, నశింపచేయు. భార. కర్ణ. 3.146 ; 3. క్షీణింపచేయు. <మాను[1] + -ఇంచు[3]. **మానిపించు** రూ.చూ. మాన్పించు. స.క్రి. పోగొట్టు. <మానుచు + -ఇంచు[3]. **మానుచు** రూ.చూ. మాన్చు. స.క్రి. 1. మానునట్లు చేయు, పోగొట్టు. భార. ఉద్యో. 3.283 ; 2. క్షీణింపచేయు, తగ్గించు. భార. శాంతి. 1.35 ; 3. విరమింపచేయు. పరమ. వి. 2.111. **మానుపు** రూ.చూ. మాన్పు. స.క్రి. 1. పోగొట్టు, నశింపచేయు. వరాహ. 10.155 ; 2. నివారించు, అడచు. **మాన్చు** రూ. మానుచు. స.క్రి. 1. క్షీణింపచేయు, తగ్గించు. కు.సం. 9.10 ; 2. విరమింపచేయు. మను. 1.50 ; 3. మానునట్లుచేయు, పోగొట్టు **మాన్పించు** రూ. మానిపించు. స.క్రి. పోగొట్టు. భార. భీష్మ. 2.13. క. మాందిసు. మానేట్లుచేయు, మాందడె. నిరోధించలేనిది, ఆపలేనిది <మాన్పు + -ఇంచు[3]. **మాన్పు** రూ. మానుపు. స.క్రి. 1. నివారించు, అడచు. భార. విరా. 3.205 ; 2. పోగొట్టు, నశింపచేయు. భార. విరా. 5.314.

**మాను[2]** విశ. 1. యుక్తం. భార. ఆది. 2.202 ; 2. మనోహరం. భార. ఆది. 3.21 ; వి. 1. ఒప్పిదం, మనోజ్ఞత. కు.సం. 8.6 ; 2. ఘనత, యోగ్యత, అతిశయం. శాసన శబ్దకోశము పు. 234 ;

త. మాణ్ (మాణ్బ-, మాంట్-). అద్వితీయమైన, ఘనమైన, ఉత్తమమైన, విస్తారమైన, విశాలమైన, మాంటల్. గొప్పదైన, ఘనమైన, మాంటవర్, మాంటార్. ఘనతచెందిన, ప్రసిద్ధికెక్కిన, మాణ్బు. గౌరవం, అంతస్థు, అందం, ఐశ్వర్యం, మంచితనం, మానమ్. గొప్పతనం, శ్రేష్టత, ప్రశస్తత, మాణల్. గొప్పతనం, ప్రశస్తత, మాణి. అందం, మాట్చి. మహిమ, శోభ, ప్రకాశం, స్పష్టత, అందం, మంచితనం, మాట్సిమై. మహిమ, శోభ, ప్రకాశం, స్పష్టత, అందం, మంచితనం, మ. మాణ్బు. మహిమ, అందం.

**మానీ(గ** వి. గండుతుమ్మెద. **మానుగ** రూ. మానుగా. క్రి.విశ.ద్రు. 1, పొందుగ. భార. ఆది. 3.108; 2. ఒప్పునట్లుగా. భార. ఆది. 4.133 ; **మానుగా** రూ.చూ. మానుగ. క్రి.విశ.ద్రు. ఒప్పునట్లుగా. భార. ఆది. 7.5. **మానైనవా(డు** విశ. సౌందర్యవంతుడు.

**మాను[3]** రూ.చూ. మ్రాను. విశ. నిశ్చలం, కదలనిది. పండి.చ. 1.63 పు. ; వి.ఔ. 1, వృక్షం, చెట్టు. వసు. 1.44 ; 2. దిండుగుంటక, గొర్రు మొ.వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె ; 3. చెట్టు మొదలు.

**మానయినిలుచు** అ.క్రి. మ్రాన్పడినిలుచు. <మాను[3] + అగు + -ఇ[13] + నిలుచు. **మానిఉయ్యాల** వి. చెట్టుకు వేలాడ గట్టిన గుడ్డ ఉయ్యాల. <మాను[3] + -ఇ[13] + ఉయ్యాల. **మానిపలక** వి. వాటల తయారీకి మట్టిముద్దను వేయటానికి సారె మధ్య ఉండే గుండ్రని చెక్క భాగం < మాను[3] + -ఇ[3] + పలక. **మానిపసుపు** రూ. మాను పసుపు. వి. ఒకరకం పసుపు (Curcuma xanthorrhiza). <మాను[3] + -ఇ[3] + పసుపు. **మానిపుక్కిటిగా(డు** వి. చెట్టును తొలిచే ఒక పక్షి. పార్వ. 6 77. <మాను[3] + -ఇ[3] + పుక్కిలి + -ఇ[3] + కా(డు. **మానిపుక్కిటిపులు(గు** వి. వడ్రంగిపిట్ట. < మాను[3] + -ఇ[3] + పుక్కిలి + -ఇ[3] + పులు(గు. **మానిపోటు** రూ. మానిపోటువు. వి. వడ్రంగిపిట్ట. < మాను[3] + -ఇ[3] + పోటు. **మానిపోటుపులు(గు** రూ. మానిపోటుపుల్గు. వి. వడ్రంగిపిట్ట, <మాను[3] + -ఇ[3] + పోటు + పులు(గు. **మానిపోటుపుల్గు** రూ.చూ. మానిపోటుపులు(గు. వి. వడ్రంగిపిట్ట. **మానిపోటువు** రూ.చూ. మానిపోటు. వి. వడ్రంగిపిట్ట. **మానిబొమ్మ** వి. చెక్కబొమ్మ. తాళ్ల.సం. 5.189. < మాను[3] + -ఇ[3] + బొమ్మ. **మానిముంత** రూ. మానుముంత. వి. 1. గట్టికొయ్యను తొలిచి చేసిన గిన్నె ; 2. పొట్టివాడు. <మాను[3]+

-ఇ[3] + ముంత. **మానుక్ర** వి. అను పీటలు బిగించిన పొడుగుపట్టె. **మానుకాయ** రూ. మానుగాయ, మానుగాయి. వి. **1.** ఆకుపచ్చని పొట్టుతో ఉన్న వడ్లగింజ ; **2.** అక్కడక్కడ నల్లబడ్డ వరిగింజ. **మానుకాయరంగు** రూ.చూ. మానుగాయరంగు. వి. ఆకుపచ్చలో నలుపుచాయ కలిసిన రంగు. **మానుగాయ** (-కాయ) రూ.చూ. మానుకాయ. వి. ఆకుపచ్చని పొట్టుతో ఉన్న వడ్లగింజ. **మానుగాయరంగు** రూ. మానుకాయరంగు. వి. ఆకుపచ్చలో నలుపుచాయ కలిసిన రంగు. **మానుగాయి** (కాయ) రూ.చూ. మానుకాయ. వి. ధాన్యానికి ములుక వచ్చి తడిసినప్పుడు వచ్చే రంగు. **మానుతొట్టి** వి. రంగునీళ్ళు పోసుకొనే కొయ్య తొట్టి. **మానుతోలు** అ.క్రి. కంపతోలు. **మానుపళ్ళు** వి.బ.వ. అక్కడక్కడా నల్లబడ్డ వరిగింజలు. **మానుపసుపు** రూ.చూ. మానిపసుపు. వి. **1.** ఒకరకం పసుపుమొక్క (Coscinium fenestratum) ; **2.** ఒకరకం పసుపు. **మానుపాల** వి. చెక్కడప్పనికి ఉపయోగపడే తెల్లటి కలప కలిగి తెల్లని పూలు పూసే చెట్టు (Holarrhena antridysenterica). **మానుపులి** వి. **1.** చెట్టుపులి ; **2.** ఒకరకం విషపు చెట్టు. **మానుపెండలము** వి. కర్రపెండలం మొక్క (Manihot utilissima). **మానుబొగ్గు** వి. కట్టెబొగ్గు, కర్రలు కాల్చి తయారుచేసిన బొగ్గు. **మానుమల్లె** వి. బర్మానుంచి తేబడి తోటల్లో పెంచబడే మొక్క (Millingtonia hortensis). **మానుముంత** రూ.చూ. మానిముంత. వి. **1.** గట్టి కొయ్యను తొలిచి చేసిన గిన్నె ; **2** పొట్టివాడు. **మానువబిళ్ల** వి. దూదిప్పచెట్టు (Hymensdictyon excelsum). **మానువాసం** వి. తాటి జాతికి చెందిన చెట్ల కలపనుండి చెక్కిన వాసం. **మానైపోవు** అ.క్రి. నిశ్చలుడై పోవు.

**మానె** వి. పెద్దబుట్ట, గంప.

**మానెఅవడం** చూ. మాను[3]. వి. ఇబ్బందిపడటం.

**మానెటటిక** చూ. మాన.

**మానెటటికె** చూ. మాన.

**మానెడటిక** చూ. మాన.

**మానెడికుండ** చూ. మాన.

**మానెడు** చూ. మాన.

**మానెడుకడవ** చూ. మాన.

**మానెడుకుండ** చూ. మాన.

**మానెణ్డు** చూ. మాన.

**మానెండు** చూ. మాన.

**మానెఁడు** చూ. మాన.

**మానెరు** చూ. మాను[2]. రూ. మానేరు. వి. జ్యోతిష్మతితీగ.

**మానెసరుబుడ్డి** రూ.చూ, మారెనరుబుడ్డి. వి. ఎసరుకుండ మీద మూతగా నీళ్ళు పోసి పెట్టిన మట్టిపాత్ర.

**మానేజరు** వి. నిర్వాహకుడు.

ఇం. *Manager*. వ్యాపారాది సంస్థా నిర్వాహకుడు.

< ఇం. Manager.

**మానేరు** రూ.చూ. మానెరు. వి. జ్యోతిష్మతితీగ.

**మానైనవాఁడు** చూ. మాను[2].

**మానైపోవు** చూ. మాను[3].

**మాన్చు** చూ. మాను[1].

**మాంతమైనవాడు** విశ. ఘటికుడు.

హిం.ఉ. మాత్, మాతా. మత్తెక్కినవాడు, మదించిన వాడు.

**మాందాళి** వి. **1.** పచ్చపట్టుచీర. వేంక.పంచ. 4.342 ; **2.** కృత్రిమమరకతభేదం. ఆం.భా. 2.276.

**మాఁతు** రూ.చూ. మాతు. వి. చదరంగం ఆటలో బంటుతోకాక తక్కినవాటితో రాజును కట్టటం.

**మాఁద** వి. శిశువులకు వచ్చే జబ్బు.

సం. మాంద్య-. మెల్లన, దౌర్బల్యం.

< సం. మాంద్య-.

**మాన్నెం** రూ.చూ. మాన్యము. వి. ఇలాం, కొలువు, తమకు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ.వారు ఇచ్చిన భూమి.

**మాన్పించు** చూ. మాను[1].

**మాన్పు** చూ. మాను[1].

**మాన్యమమ్ముకొను** చూ. మాన్యము.

**మాన్యము** రూ. మాన్నెం. వి. **1.** మన్నన. పన్ను లేకుండా ఇచ్చిన భూమి. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 810 ; **2.** ఊరి ఆసాముల ఇళ్ళను కుమ్మర్లు పంచుకొని వారికి కావలసిన కుండల్ని ఇచ్చే హక్కు.

సం. మాన్య-. గౌరవించదగిన.

< సం. మాన్య- (అర్థవిపరి.).

**మాన్యమమ్ముకొను** స.క్రి. దివాలాతీయు. < మాన్యము + అమ్ము[2] + కొను. **మాన్యస్వామ్యాలు** వి. మాన్య మిచ్చి దానిపై సర్వస్వాతంత్ర్యం ఇవ్వటం. నె.శా. కందుకూరు. శా.సం. 41. క్రీ.శ. 1681.

**మాన్యస్వామ్యాలు** చూ. మాన్యము.

**మాపటపొద్దు** చూ. మాపు[1].

**మాపటాల** చూ. మాపు[1].

**మాపటిచేఁత** చూ. మాపు[1].

**మాపటిపాలు** చూ. మాపు[1].

**మాపసారి** చూ. మాపు[1].

**మాపి** రూ.చూ. మాఫీ. వి. తొలగింపు, తీసివేత.

**మాపు**[1] వి.జా. **1.** రాత్రి. కు.సం. 8.185 ; **2.** సాయంకాలం. నిర్వ.రా. 10.10.

త. మా. నలుపు, మామై. నల్లదనం ; కుఇ. మాసు. సాయంసంధ్య.

**మాపటపొద్దు** వి. మాపటాల, సాయంత్రం. **మాపటాల** వి. సాయంత్రం. సం. వేళా. సమయం. **మాపటిచేఁత** వి. సంభోగం. తాళ్ల.సం. 4.128. **మాపటిపాలు** వి. రాత్రిపూట నైవేద్యానికై పాలు. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 650. క్రీ.శ. 1485. **మాపసారి** వి. మబ్బు, సాయంత్రం, సందెవేళ. **మాపుపొంటె** వి. ఒక పూట మాత్రమే పని చేయటం. **మాపురేపు** వి. నేడురేపు. **మాపోరోపో** అవ్య. త్వరలో. < మాపు + ఓ[2] + రేపు + ఓ[2].

మాఫు[2] చూ. మాయు.

మాఫు[3] రూ. మాఫు. స.క్రి. రద్దుచేయు, తీసివేయు.

హిం. మాఫ్. తీసివేయుట; మరా. మాఫ్. రద్దు చేయటం; ఉ. మ అఫ్; మరా. మాఫ్. రద్దుచేయటం; పార. ముఅఫ్; అర. ముఫ్. తీసివేయటం, రద్దుచేయటం.

< ఉ. ముఫ్.

మాఫుచేయు[2] రూ. మాఫుచేయు. స.క్రి. 1. పోగొట్టు, నశింపచేయు. వేమ. 3.148; 2. వదలించుకొను.

మాపుడు చూ. మాయు.

మాపోరేపో చూ. మాపు[1].

మాఫక్ విశ. మధ్యరకమైన.

హిం. మాఫిక్. తగిన, అనుకూలమైన, పొందికైన, అంగీకారయోగ్యమైన; ఉ.అర. మువాఫిక్. సమతూక మైన, పొందికైన, అనురూపమైన, అనుగుణమైన, తగిన, సుఖప్రదమైన, అనుకూలమైన, సరైన, వొద్దికైన.

< ఉ. మువాఫిక్.

మాఫీ రూ. మాపి. వి. తొలగింపు, తీసివేత.

హిం ఉ. మాఫ్. క్షమించబడిన, మన్నించబడిన, మాఫీ. క్షమ, మన్నింపు, శిస్తుమినహాయించిన భూమి; మరా. మాఫీ. క్షమ; ఉ.పార. ముఅఫీ; అర. ముఅఫీ. రద్దు, తీసివేత;

క. మాపి, మాఫు. క్షమించబడిన, శిస్తు మినహా యించిన; త. మాపి, మాప్పు. మన్నింపు; మ. మాప్పి.

< ఉ. మాఫీ.

మాఫీమక్తా వి. పూర్తి పన్ను రద్దు చేసిన ఇనాం.

మాఫు రూ.చూ. మాఫు[3]. స.క్రి. తొలగించు.

మాఫుచేయు రూ.చూ. మాఫుచేయు. స.క్రి. తొలగించు.

< హిం. మాఫ్- + చేయు.

మాబాగు వి. 1. సమ్మతి; 2. చాలా మంచిది.

సం. మహత్, గొప్ప.

< సం. మహత్ + బాగు.

మాబీర రూ.చూ. మగబీర[1]. వి. సుమారు ఆరుఅడుగుల ఎత్తు పెరిగి మందుల్లో ఉపయోగపడే మొక్క (Anisomeles malabarica).

మామ వి. 1. భార్య తండ్రి. కు.సం. 6.10, బుడమనారాయుల పాడు శాసనం. క్రీ.శ. 650. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1066; 2. తల్లికి తోడబుట్టినవాడు, మేనమామ. భార. సభా. 2.174; 3. భర్త తండ్రి. భార.అరణ్య. 7.197; 4. మామ వావివాడు. దశా. 2.366.

క. మావ; కొడ. మావ; తు. మామె, తల్లి సోదరుడు, మామి, తండ్రి సోదరి, త.మ. మామ; తొ. మావ్; గోం. మామా; కుఇ. మామ; కువి. మామ, తండ్రిసోదరి; బ్రా. మామా. తల్లిసోదరుడు; ఒరయాన్. మామున్. తల్లిసోదరుడు. తండ్రి సోదరి మగడు.

మామతనము వి. మామఅవటం. పరమ. 3.93.

మామమామ వి. 1. విష్ణువు. ఆం.నా.సం.దేవ. 7; 2. సముద్రుడు. మామమామబావ వి. చంద్రుడు. ఆం.పదా. సు. 23.

మామడి రూ.చూ. మామిడి. వి. మావి, తినేపళ్ళు, గృహోపకరణాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు (Magnifera indica).

మామలా రూ.చూ. మామలు. వి. వ్యవహారం.

మామలియ్యతు రూ.చూ. మామలీతు. వి. వ్యవహారం.

మామలీతు రూ. మామలియ్యతు, మామలీయతు, మామిలీతు, మామ్లితు, మామ్లియ్యతు. వి. వ్యవహారం. పద్మ.యు. 139.

హిం. మామ్‌లత్, మామ్‌లతి. వివాదాస్పద విషయం; మరా. ముఅమలత్, మామ్‌లత్. వ్యాపారం, పని; ఉ. ముఆమలాత్. కార్యభారం, వ్యవహారం, పనులు, తగవులు; అర. ముఅమిలత్. కార్యభారం, వ్యాపారం.

< ఉ. ముఅమలాత్.

మామలీయతు రూ.చూ. మామలీతు. వి. వ్యవహారం, నిర్వాహకం.

మామలు రూ. మామలా, మామూలా. వి. 1. సొత్తు, వస్తువు సొమ్ము; 2. వ్యవహారం.

హిం. మామ్‌లా. వ్యాపారం, వ్యవహారం, మావ్‌లత్. పదార్థం, దావా, విషయం, వ్యాపార సంబంధమైన చర్చ, వివాదాస్పదమైన ప్రశ్న; ఉ.అర. ము'మలహ్. వ్యాపారం, పని;

క. మామల, మామలె. మామిలేదారుకార్యాలయం.

< ఉ. ము'మలహ్.

మామా[1] వి. తల్లి. విశ్వే.శ. 67.

హిం. మామా; ఉ. మామా. దాసి, తల్లి; పార. మామా. తల్లి. అర. మామా. అమ్మమ్మ.

< ఉ. మామా.

మామా[2] అవ్య. మానుమాను అనే పదాల సంక్షిప్తశబ్దరూపం. భాగ. 9 స్కం.

మామిడంచు చూ. మామిడి.

మామిడంచుకమ్మి చూ. మామిడి.

మామిడంచుబీర చూ. మామిడి.

మామిడంచుజామరు చూ. మామిడి.

మామిడంచుపంచె చూ. మామిడి.

మామిడల్లము చూ. మామిడి.

మామిడాకుబుడ్డి చూ. మామిడి.

మామిడి రూ. మామడి, మామ్డి, మావిడి, మావిండి. వి. 1. మావి, తినేపళ్ళు, గృహోపకరణాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 149. క్రీ.శ. 1161. (Magnifera indica); 2. సుమారు 3 అడుగుల ఎత్తుపెరిగి ఎర్రని పూలుపూసే మొక్క (Ardisia humilis).

క. మా,మామ్, మావు. మామిడికాయ; త. మామరం. మామిడిచెట్టు; మ. మా, మావు. మామిడిచెట్టు.

మామిడంచు రూ. మావిడంచు. వి. 1. తెలుపు వస్త్రానికి రెండు మూడు జమిలి పోగులు నిలువుకు పెట్టి నేసిన అంచు; 2. మామిడిచిగురు రంగులోనే నేసిన

అంచు ; 3. వస్త్రాలకు అంగుళం వెడల్పున నేసిన అంచు ; 4. మామిడి పిందె అంచు. <మామిడి+అంచు³. **మామిడంచుకమ్మి** వి. తెల్లజమిలి పోగులు పెట్టి నేసిన ఒకరకం కమ్మి. **మామిడంచుచీర** వి. అంగుళం వెడల్పు అంచుండి వితంతువులు కట్టుకొనే తెల్లచీర. **మామిడంచు జామరు** వి. వితంతువులు కట్టుకొనే బట్ట. **మామిడంచుపంచె** వి. వితంతువులు కట్టుకొనే బట్ట. **మామిడల్లము** వి. అల్లంలో భేదం, శృంగబేరం. **మామిడాకుబుడ్డి** వి. పొడవుగా ఉండే ఒకరకం చిచ్చుబుడ్డి. **మామిడికాయలంచు** వి. మామిడి కాయ ఆకారంలో డిజైను నేసిన అంచు. **మామిడిక్రింది సోమరి** వి. మామిడిచెట్టు కింద ఆ పండురాలి తన నోట్లో పడుతుందని ఆశించి వేచిఉండే సోమరి. గౌ.హరి.ఉ. 1497 పం. **మామిడిగుత్తులు** వి.బ.వ. ధాన్యవిశేషం. అము. 1.66. **మామిడిచిగురురంగు** రూ. మామిడిసిగురు రంగు, మావిడిసిగురు రంగు. వి. ఎరుపులో బాగా నలుపు వన్నె కలిపిన ఒకరకం రంగు, చేకిలేటురంగు. **మామిడి పిందిలంచు** రూ.చూ. మామిడిపిందెలంచు. వి. మామిడి పిందెల వరసలో డిజైను నేసిన అంచు. **మామిడిపిందె** రూ. మావిడిపిందె. వి. 1. లేతమామిడికాయ ; 2. మామిడి పిందెమాదిరి నేత డిజైను బట్టలమీదవేసే కలంకారీ అద్దకం డిజైనుల్లో ఒకరకం. **మామిడిపిందెబార్డరు** రూ. మావిడిపిందెబార్డరు. వి. మామిడిపిందెల వరసలో డిజైను నేసిన అంచు. ఇం. *boarder*. అంచు. <మామిడిపిందె+ ఇం. boarder. **మామిడిపిందెలంచు** రూ. మామిడిపింది లంచు. వి. మామిడిపిందెలవరసలో డిజైను నేసిన అంచు. **మామిడిపిందెలంచుచీర** వి. అంచులో మామిడిపిందెల ఆకారంలో డిజైను నేసిన చీర. **మామిడిపిందెలపేటంచు** రూ. మావిడిపిందెలపేటంచు. వి. మామిడిపిందెలవరసలో డిజైను నేసినఅంచు. **మామిడిపిందెలపేటి** రూ. చూ. మామిడి పిందెలపేటు. వి. మామిడిపిందెల వరసలో నేసిన డిజైను. **మామిడిపిందెలపేటు** రూ. మామిడిపిందెలపేటి, మామిడి పిందెలప్లేటు. వి. మామిడి పిందెల వరసలో నేసిన డిజైను. **మామిడిపిందెలప్లేటు** రూ.చూ. మామిడి పిందెలపేటు. వి. మామిడిపిందెల వరసలో నేసిన డిజైను. **మామిడి పిందె లాహిరీ** వి. చీరఅంచులో మామిడి పిందె పక్కన లాహిరీ వరసగా నేసిన డిజైను. **మామిడిపూత** వి. 1. మామిడిచెట్టు పూయటం ; 2. ఒకరకం ఎరుపురంగు. **మామిడిపొట్టు** వి. మామిడిచెట్టు కింద రాలిన ఆకు, చిదుగు మొ. వి. **మామిడిబుడ్డి** వి. అంటునుండి తీసిన మామిడి మొక్కలు పెట్టటానికి వాడే నిలువుతొట్టి. **మామిడిముంత** వి. మామిడి మొక్కలు అంటుకట్టటానికి వాడే మట్టిముంత. **మామిడి సిగురురంగు** రూ. చూ. మామిడి చిగురురంగు. వి. 1. ఎరుపులో బాగానలుపు వన్నె కలిసిన ఒకరకం రంగు ; 2. చేకిలేటురంగు. **మామిడెల్లం** వి. కొండలమీద విరివిగా పెరిగే పసుపు జాతికి చెందిన మొక్క. వైద్యంలో జీర్ణకారిగా ఉపయోగిస్తారు (Cucurnaamada).

**మామిడెల్లం** చూ. మామిడి.

**మామిలీతు** రూ.చూ. మామలీతు. వి. పద్ధతి.

**మామిలీయతు** రూ.చూ. మామలీతు. వి. నిర్వాహకత్వం.

**మామిలేదార్** రూ.చూ. మామిలేదారు. వి. తాలూకాలో శిస్తు వసూలు చేసే ఉద్యోగి.

**మామిలేదారు** రూ. మామిలేదార్. వి. తాలూకాలో శిస్తువసూలు చేసే ఉద్యోగి.

ఉ. ముఅమలహ్. వ్యాపారం, పని, దార్. మతు ప్రత్యయం.

<ఉ. ముఆమలహ్-. పార. దార్.

**మామీను** వి. జాగ్రత్తగాఉండటం, సంరక్షించటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759 55. క్రీ. శ. 1663.

ఉ. మామన్. ఆశ్రమం; పార. మామూన్. సంరక్షించబడినది, దృఢంగాఉండు ; అర. మామన్. రక్షణకొరకయిన స్థానం.

<ఉ. మామన్.

**మాముకోడి** రూ. మాంకోడి. వి. ఒకరకం కోడి, టర్కీకోడి.

**మామూదు** రూ.చూ. మహమ్మదు. వి. మహమ్మదీయ మత ప్రవక్త శుభనామం.

**మామూరు** వి. నిశ్చితం.

హిం. మామూర్. నిండిన, సమృద్ధమయిన ; మరా. అమూర్. నిశ్చయించటం ; ఉ. మామూర్. నియుక్తం, ఆదేశితం ; పార. అమూర్. నిశ్చయించటం ; ఆదేశితం ; పార. అమూర్. నిశ్చయించటం ; అర. ముఅమూర్ నిశ్చయం.

<ఉ. మామూర్.

**మామూలంచు** చూ. మామూలు.

**మామూల** రూ. చూ. మామలు. వి. వ్యవహారం.

మామూలాపట్టు స.క్రి. కల్లు, సారాయి దుకాణాలు ఇజరాకు తీసుకొను.

**మామూలు** రూ. చూ. మామూళు. వి. 1. అలవాటు, వాడుక. సె. శా. సంపు. 2. శా. సం. 48. కందుకూరు. క్రీ.శ. 1650-51 ; 2. సహజం ; 3. వాడుకగా ఇచ్చే విత్తం ; 4. లంచంగా ఇచ్చే డబ్బు ; 5. బహుమతి.

మామూలంచు వి. తొమ్మిదంగుళాల వెడల్పున నేసిన అంచు. <మామూలు + అంచు³. **మామూళ్లు** వి.బ.వ. లంచాలు.

**మామూళు** రూ. మమూలు, మామూలు. వి. వాడుక. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 711. క్రీ.శ. 1593.

హిం. మామూల్. రీతి, రివాజు ; మరా. మామూల్. సంప్రదాయం, రీతి, వ్యవహారం ; ఉ. మామూల్. నిత్య నియమం, ఆచారవ్యవహారాలు ; పార. మఅమూల్. తయారుచేయబడిన, సంప్రదాయసిద్ధమైన, ఆచారవ్యవహారాలు ; అర. ముఅమూల్. నిత్యనియమం, సంప్రదాయం ;

క. మామూల్, మామలె : త. మామూలు. నియమం ; మ. మామూల్.

<ఉ. మామూల్.

**మామూళ్లు** చూ. మామూలు.

**మామెన** వి. 1. మామెనకాయలతో పెట్టిన ఊరగాయ. వేంక.

**2**. శ్రేష్ఠమైన, సర్వోత్కృష్టమయిన. భార. ఆది. **4.96**; క్రి.విశ. అధికంగా, ఎక్కువగా. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 427. క్రీ.శ. 1270.

త. మికల్. అధికమైన; మ. మించల్.

**మిక్కిలి కంటివేల్పు** వి. శివుడు. ముక్కంటి. అచ్చ.రా. అయోధ్యా. 19. **మిక్కిలి కంటిసామి** వి. మిక్కిలి కంటి వేల్పు. శివుడు. మృత్యు. 2.43. **మిక్కిలికను** రూ. మిక్కిలి కన్ను. వి. మూడవకన్ను, ఫాలనేత్రం. భీష్మ. 3.93. **మిక్కిలికన్ను** రూ.చూ. మిక్కిలికను. వి. మూడవకన్ను, ఫాలనేత్రం. ద్వి.భాగ. 8.618. **మిక్కిలిచూపు** వి. మూడవ కన్ను. ఫాలనేత్రం. పాండు. 1.95. **మిక్కిలివాఁడు** విశ. శ్రేష్ఠుడు, అధికుడు. భార. ద్రోణ. **5.124**.

**మిక్కిలు** చూ. మిగులు. వి. మిగులు, శేషం. బసవ. 7.39; అ.క్రి. **1**. అతిశయించు. ఉ.హరి. 6.106; **2**. విజృంభించు, చెలరేగు. భాగ. 1.337.

త. మికు (మికువ్-, మిక్క్). అధిగమించు, పెరుగు, మిగులు, మిక్క. గొప్ప, చాల, మిక్కతు. అధికంగా ఉన్న.

**మిక్కుటము** రూ. మిక్కటము. విశ. అధికం. నిర్వ.రా. 10.21.

త. మిక్కతు. ఎక్కువగా ఉన్నది, బాగున్నది, మికుక్కతమ్. ఎక్కువ. పునరుక్తి, మికుంత. చాల, గొప్ప, అధికం, మిగిలిన.

**మిక్సెడ్‌సిల్కు** వి. ఒకరకం పట్టు, మామూలుగా అరటినార, జనపనార గోగునారతో చేసినవట్టు.

ఇం. *Mixed*. మిశ్రితమైన, *silk*. పట్టు.

< ఇం. Mixed + silk.

**మిక్స్చర్‌గడి** రూ. మిక్శర్‌గడి. వి. రెండుమూడు రంగుల దారాలు కలిపి నేసిన గడి.

ఇం. *Mixture*. మిశ్రం.

< ఇం. Mixture + గడి.

**మిగత** చూ. మిగులు. వి. **1**. లాభం. ఆం.భా. 2.267; **2**. మిగులు, శేషం; విశ. **1**. అధికం. ఆం.భా. 3.24; **2**. మిగిలింది, శేషించింది.

క. మిగతె. మిగిలిన; కొడ. మిగితె, మిగుతె. మిగిలింది, అధికంగా ఉన్నది, మికుతి. శేషం.

**మిగమీరు** చూ. మిగులు. స.క్రి. **1**. అతిశయించు; **2**. మాట వినకపోవు.

**మిగలపండిపోవు** చూ. మిగులు.

**మిగ్రలాయి** చూ. మిగులు.

**మిగితి** రూ.చూ. మిగులు. విశ. **1**. అధికం; **2**. మిగిలినది; వి. **1**. లాభం; **2**. మిగులు, శేషం.

**మిగిలి** చూ. మిగులు.

**మిగిలించు** చూ. మిగులు.

**మిగుల** చూ. మిగులు.

**మిగులు** రూ. మిగితి. అ.క్రి. **1**. సంఖ్యలో అధికమగు, ఎక్కువగు, అధికంగా కలుగు, ఎక్కువగా పుట్టు. భార. సభా. 2.43; **2**. శేషించు. భార. సభా. 2.53; **3**. మట్టు, మీరు. భార. సభా. 2.314; **4**. అతిశయించు, ఎక్కువగు. కు.సం. 3.9; **5**. అతిశయించు, ఉత్కృష్టమగు. బసవ. 6.954 పం.; **6**. అతిరిక్తమగు, వేరగు. భార. ఉద్యో. **3**.160; **7**. మీరు, తలకడచు, నడచిపోవు, దాటు. భార.భీష్మ. 1.182; **8**. విజృంభించు, చెలరేగు. హరి. పూ. 4.100; **9**. నిగుడు, మీదికుబుకు. ఆము. 6.81; **10**. నోటికి వచ్చినట్లు మాట్లాడు. అ.క్రి., స.క్రి. అతిక్రమించు. మీరు. కు.సం. 4.24.

క. మిగు(మిక్క్-). అధికంగా ఉండు, అధిగమించు, మిగులు. అధికం, శేషం; తు. మిక్కుని. అధిగమించు, శేషించు, విడువబడు, మిగి, మిగిళు. అధిగమించటం, మిగిలుని. అధిగమించు; త. మికు, మిక్కు. అధిగమించు, ఎక్కువగు. మికు-త్-. పెంచు, మికత్తు. మిగుల్చు, ప్రత్యేకించు; మ. మికుక్కక, మిక్కెక. అధికమగు, మించుక. మిగులు; కో. మిక్. విడువబడు, మిక్చ్. మిగుల్చు.

మూ.ద.ద్రా. *మిక్. మూ.ద్రా. *మిమ్/*మీ.

**మిగలపండిపోవు** అ.క్రి. బాగా తెల్లబడిపోవు. **మిగ్రలాయి** వి. దొడ్డురాయి, పెద్దసైజురాయి. < మిగులు + రాయి. **మిగిలి** క్రి.విశ. ఎక్కువగా, మిక్కిలి; విశ. శేషించిఉన్న. **మిగిలించు** స.క్రి. మిగిలేట్లు చేయు. < మిగులు + -ఇంచు¹. **మిగుల** విశ. మిక్కిలి, అత్యంతం. భార. విరా. 2.314. **మిగులుగాల్పు(-కాల్పు)** వి. ముదురుగాల్పు, ఇటిక మొ.వి ఎక్కువగా కాలటం. **మిగులుచు** రూ.చూ. మిగుల్చు. స.క్రి. మిగులచేయు, శేషింపచేయు. **మిగులుచుకొను** రూ. మిగుల్చుకొను. స.క్రి. కూడబెట్టుకొను. **మిగుల్చు** రూ. మిగులుచు. స.క్రి. మిగులచేయు, శేషింపచేయు. పరమ. 1.49. త. మికుత్తు(మికుత్తి-). మిగుల్చు. **మిగుల్చుకొను** రూ.చూ. మిగులుచుకొను. స.క్రి. కూడబెట్టుకొను.

**మిగుల్చు** చూ. మిగులు.

**మిగుల్చుకొను** చూ. మిగులు.

**మింగగొడ్డి** చూ. మింగు.

**మింగడ** రూ.చూ. మీఁగడ. వి. **1**. కాగిన పాలమీద తెట్టు; **2**. పెరుగుమీది తెట్టు.

**మింగనగొండి** చూ. మింగు.

**మింగలేక కక్కలేక** చూ. మింగు.

**మింగిడి** రూ.చూ మీఁగడ. వి. మీగడ.

**మింగు** రూ.చూ. మ్రింగు. అ.క్రి. కబళించు, గుక్కిళ్ళు మింగు. వైజ. **4.54**.

**మింగగొడ్డి** రూ. మింగనగొండి. వి. తిండిపోతు. భాగ. 10.4.1281. **మింగనగొండి** రూ.చూ. మింగగొడ్డి. వి. తిండిపోతు. **మింగలేక కక్కలేక** అవ్య. ధర్మసంకటంలో పడి ఏమీచేయలేక.

**మిచ్చతుమ్మరు** వి. ముళ్ళు కలిగి ఆకుపచ్చ పూలుపూసే చెట్టు (Diospyros montana).

**మిచ్చరు** వి. ఇనక, మసి మొ.వి చేర్చి కలిపిన మట్టి.

ఇం. *Mixture*. మిశ్రమం.

< ఇం. Mixture.

**మిచ్చికెన** చూ. నిచ్చెన. రూ. మిచ్చెన. వి. నిచ్చెన.
**మిచ్చిమి** వి. నిర్మాణంలో పొదుచుకొనివచ్చిన రాతి ముక్క.
త. మిచ్చమ్. శేషం, అధికం, మిచ్చిలి. శేషం ; మ. మిచ్చమ్. సరిపడేదానికంటే ఎక్కువ.
< త. మిచ్చమ్.
**మిచ్చెన** రూ. చూ. మిచ్చికెన. వి. నిచ్చెన.
**మిజాజు** రూ. మిజాదు. వి. గర్వం, అహంకారం, అహంభావం, మదం.
హిం. మిజాజ్. స్వభావం, అలవాటు, గర్వం ; ఉ. అర. మిజాజ్. స్వభావం, అలవాటు, గుణం.
ఉ. మిజాజ్.
**మిజాదు** యా. చూ. మిజాజు. వి. గర్వం, అహంకారం, అహంభావం, మదం.
**మించడుగు** చూ. మించు[1].
**మించనాడు** చూ. మించు[1].
**మించా** చూ. మించు[1].
**మించారు** చూ. మించు[2].
**మించినదానికి(ద్రవ్వుకొను** చూ. మించు[1].
**మించిలి** వి. నిగాంకుశ. ఒక జాతి చీర.
**మించు[1]** రూ. ముంచు3. స.క్రి. 1. అతిక్రమించు, దాటిపోవు. భార. అరణ్య. 1.2 ; 2. తీర్చుకొను, సఫలంచేయు. భార. ఆరణ్య. 1.80 ; 3. జయించు. రాఘవ. 3.136 ; అ.క్రి. 1. వ్యాపించు కు.సం. 1.109 ; 2. విజృంభించు, చెలరేగు. రం.రా.అయోధ్యా. 129 పు., 13 పం. ; 3. అధికమగు, హెచ్చుగు. హరి. పీఠి. 5 ; 4. పృథులమగు, పెద్దదగు. శృం.నై. 3.102 ; 5. సర్వోత్కృష్టమగు. మను. 5.47 ; 6. పెరుగు, వృద్ధిపొందు. దశా. 1.204 ; 7. సాంతమగు, ముగియు, సమాప్తమగు. శుక. 2.169 ; 8. అతిశయించు ; వి. 1. ఆధిక్యం. రామాభ్యు. 7.192 ; 2. ఒక జాతి డేగ. ప్రబంధ. 191 ; విణ. అధికమైన, గొప్పదైన. ద్వి. పరమ. వి. 1.140.
క. మిక్కు. వృద్ధిఅగు, పెరుగు, అధికమగు, మిగుపెరుగు, అధికమగు, మిగె. అధికం, మిక్కలి ; తు. మింజుని. అధిగమించు, ప్రత్యేకించు ; త. మించు. అధిగమించు, గర్వించు, ఎక్కువ, మికు (మికువ్-మిక్కె-). అధిగమించు, మింపు, ఎక్కువగు, వృద్ధిపొందు, ఉబ్బు, అతిశయించు, మికుటు (మికుట్టి-). రక్షించు, వదిలిపెట్టు, క్షమించు, మిక్క. గొప్ప, అద్భుతమైన, మిక్కటు. అధికమైన, మిక్కలి, మిక్కవర్, మిక్కార్. గొప్పవ్యక్తులు, పెద్దవారు, అధిక సంఖ్యాకులు, మిక్కోళ్. గొప్ప వ్యక్తి, మిక, మిక్కు. ఎక్కువ, అధికం, మికల్. మిక్కుటంగా ఉండు, అధికంగా ఉండు, మికుటమ్. ఎక్కువ, అధికం, మిక్కలి, మిగులు, మికై. అధికమైన, అద్భుతమైన, మిచ్చమ్. మిగిలినది, అధికమైనది, మిచ్చిల్. మిగిలిన, వదిలివేయబడిన, భోజనాదుల తర్వాత మిగిలిన పదార్థాలు, బొగ్గు, మిప్పు. మిక్కలి, అధికమైన, గొప్ప ; మ. మికుక (మిక్క్-). మించు, అతిశయించు, మిక్క. అధికభాగం, మికవు. మిక్కలి, అధికం, మించుక. అధికమగు, మికక్క, మికుక్క. అధికమగు, మికుతి. మిక్కలి, లాభం, మికెక్క. మించు, ఎక్కువగు, వృద్ధిపొందు, మిచ్చమ్. ఎక్కువ, మించల్. మించు, అతిశయించు, మించుక. మించు, మిగులు ; కో మిక్- (మికై-). మిగిలిన, మిక్ప్. పొదుపుచేయు, మిగిలినది, మికల్, మిచ్చమ్. పో. చూ. మిగులు.
మూ. ద. ద్రా. *మి-న్చ్-.
**మించడుగు** వి. బోయీలు పల్లకీ మోసేటప్పుడు పలికే హెచ్చరిక పదం. ప్రబంధ. 605 < మించు[1] + అడుగు[2]. **మించనాడు** స.క్రి. దూషించు, తూలనాడు. కృ. శకు. 2.222. < మించు[1] + -అ[7] + ఆడు. **మించా** అవ్య. ఎక్కువగా. < మించు[1] + -అ[7]. **మించినదానికి(ద్రవ్వుకొను** అ.క్రి. వెనుకటి గాథల్ని మళ్ళీ తలపోయు. **మించు(గాలు (-కాలు[2])** వి. కుడిపాదం. రామాభ్యు, 6.19. **మించుదల** వి. 1. ఆధిక్యం ; 2. అతిక్రమణం.
**మించు[2]** వి. 1. తళతళకాంతి, కాంతి. బసవ. 4 పు. 868 పం. ; 2. మెరపు, విద్యుత్తు. పల్నా. పు. 44, ఆము. 4.83 ; 3. పురుషులు కుడికాలి రెండో వేలికి పెట్టుకొనే ఆభరణ విశేషం. ప్రబంధ. 905 ; 4. కిరణం. ఆం.భా. 82 ; 5. మట్టియ. పెళ్ళైన స్త్రీలు కాలి రెండోవేలికి ధరించే ఆభరణం; విణ. 1. తళతళ కాంతిగలది. శృం.నై. 2.112 ; 2. నిర్మలమయిన. శృం.నై. 2.124 ; అ.క్రి. 1. ఒప్పు, శోభిల్లు. కాశీ. 1.51 ; 2. ప్రకాశించు, తళతళ మెరయు. పారి. 1.24.
క. మించు. పెళ్ళయినస్త్రీ కాలి రెండోవేలికి పెట్టుకొనే వెండి ఆభరణం ; త. మించి. రెండోవేలికి ధరించే మట్టి ; మ. మించి. కాలికి పెట్టుకొనే ఆభరణం ; కో. మించు. మెరయు, ప్రకాశించు ; తొ. మిచ్.
**మించారు** అ.క్రి. మెరయు, ప్రకాశించు. హరి.ఉ. 7.47. < మించు[2] + -అరు[1]. **మించు(గంటి(-కంటి)** వి. చంచలాక్షి, మెరపులా చలించే కన్నులున్న ఆడది, స్త్రీ. అష్టమ. క. 1.37పు. 16 పం. **మించు(గన్ను (-కన్ను)** వి. పిల్లి. రాజ. వి. 5.85. **మించు(బోణి** రూ. చూ. మించు(బోడి. వి. మెరుపులా మనోజ్ఞమైన ఆడది, స్త్రీ. శగాం. 4.50. **మించు(బో(డి(-పో(డి)** రూ. మించు(బోణి. వి. మెరుపులా మనోజ్ఞమైన స్త్రీ. సీలా. 1.56.
**మింజుమల** రూ. చూ. మింజుమలె. వి. 1. భాగం ; 2. చెల్లింపు.
**మింజుమలె** రూ. మింజుమల, మింజుమలే. వి. మొత్తంలో ఒక పాలు.
**మింజుమలే** రూ. చూ. మింజుమలె. వి. ఒకపాలు.
**మిటకరించు** అ.క్రి. 1. భయంతో కళ్ళు ఆర్చు ; 2. సందేహించు ; 3. ఆశ్చర్యంలో ఏమీ తోచకుండు.
క. మిటుకిసు. కళ్ళను అకస్మాత్తుగా తెరచిమూయు.
**మిటమిట** వి. 1. మండటంలో అయ్యే అనుకరణం. భాగ. 10ఉ. 915 : 2. ఎండ, వెన్నెల కాయటంలో అయ్యే అనుకరణం. నుడ. 2.25 ; 3. చూడటంలో అయ్యే అనుకరణం. పద్మ. 7.117 ; విణ. మిక్కలి వేడిగా, ప్రకాశంగా.

పద్మ. 4.62. ధ్వన్యను.

మిటమిటన వి. మిటమిట అనటం ; విణ. ప్రకాశం. మిటమిటలాడు అ.క్రి. ఎగసెగసిపడు. < మిటమిట + -లు + ఆడు.

మిటరాయి వి. కుండల్ని సర్పిన తరవాత నునుపుచేసే రాయి.

మిటాయి రూ. చూ. మితాయి[2]. వి. మధురమైన భక్ష్య విశేషం

మిటాయిలేచు అ.క్రి. ఒకవైపు పైకి లేచిపోవు.

మిటారకత్తియ చూ. మిటారము.

మిటారకత్తె చూ. మిటారము.

మిటారము విణ. 1. విలాసం గలది. కువ.చ. 5.33 ; 2. నిక్కు కలది. నీలా. 2.23 ; 3. ఒప్పిదమైన. రసిక. 4.43 ; 4. అధికమైనది. అచ్చ.రా.బాల. 144 ; వి. 1. ఒయ్యారం, నిక్కు, అతిశయం. నీలా. 2.24 ; 2. యౌవనగర్వం. హంస. 5.8 ; 3. విలాసం. ఆం.భా. 1.139.

సం. మృష్టకర-, మృష్టకార-. మిటారి ; ప్రా. మిఠ్ఠఅర-. మధురమైనది.

< ప్రా. మిట్ఠఆర-.

మిటారకత్తియ రూ.చూ. మిటారకత్తె. విణ. యవ్వనం ఉన్న స్త్రీ, ఆడది. మిటారకత్తె రూ. మిటారకత్తియ. వి. యవ్వనం ఉన్న స్త్రీ, ఆడది. దశా. 8.377. మిటారి వి. 1. యవ్వన గర్వం ఉన్న ఆడది. శృం.నై. 1.29 ; 2. విలాసవతి, ఆడది. హంస. 2.177 ; విణ. 1. మనోజ్ఞం, ఒప్పిదమైనది. వసు. 5.101 ; 2. శ్రేష్ఠురాలు, శ్రేష్ఠం. ద్వి.నల. 1.573 ; 3. విలాసం కలది. సారంగ. 2.113 ; 4. ఉన్నతి గలది, నిక్కుకలది. నీలా. 1.39 ; 5. వాడిగలది. చంపు.రా. 3.4. మిటారికత్తియ రూ. మిటారికత్తె. వి. యవ్వనగర్వం ఉన్న ఆడది, విలాసంఉన్న ఆడది. పాంచాలీ. 4.5. మిటారికత్తె రూ.చూ. మిటారికత్తియ. వి. యవ్వన గర్వం ఉన్న ఆడది, విలాసంఉన్న స్త్రీ. చంపూరా. 55. మిటారికాఁడు వి. విలాసవంతుడు. తపతీ. 1.3. మిటారిచూపులు వి.బ.వ. యవ్వన గర్వంతో కూడిన చూపులు. క్రీడా. పీఠి. 66. మిటారించు అ.క్రి. 1. విజృంభించు, చెలరేగు. యయా. 1.112 ; 2. నిక్కు, పైకుబుకు. కళా. 3.17 ; 3. వ్యాపించు, ప్రసరించు. సుద. 5.27 ; 4. అతిశయించు. ఉ.రా. 1.181 ; 5. ప్రకాశించు, ఒప్పు. ఉ.రా. 6.182 ; స.క్రి. అతిక్రమించు, మించు. ముకుంద. 2.90. < మిటారము + -ఇంచు.[3] మిటారింపు వి. మిటారం, విలాసం. ఆం.భా. 1.139.

మిటారి చూ. మిటారము.

మిటారికత్తియ చూ. మిటారము.

మిటారికత్తె చూ. మిటారము.

మిటారికాఁడు చూ. మిటారము.

మిటారిచూపులు చూ. మిటారము.

మిటారించు చూ. మిటారము.

మిటారింపు చూ. మిటారము.

మిటికె రూ.చూ. మెట్టిక. వి. సోపానం, మెట్టు.

మిటిమిటిపడు రూ.చూ. మిట్టిమిట్టిపడు. అ.క్రి. ఎగిరిపడు. ద్వి.పరమ. వి. 2.126 పు.

మిటిమిటిసర్గము వి. ఎఱ్ఱటి మధ్యాహ్నం ఎండ.

మిటుకు వి. యవ్వన గర్వంతో కలిగే తుళ్ళిపాటు.

మిటుకులాఁడి వి. యవ్వన గర్వంతో అయిన తుళ్ళుపాటు గల ఆడది, వగలాడి. ప్రబంధ. 52. < మిటుకు + -లు + -ఆఁడి. మిటుకుళ్ళు వి.బ వ. పెసల మాదిరిగా ఉండే ఒక రకం ధాన్యం.

మిట్కిచ్చు చూ. మిటుకు. స.క్రి. కొంచెంగ పెట్టు.

మిట్ట రూ.చూ. మెట్ట. వి. 1. తీక్ష్ణమైన బాణం. భార. విరా. 5.221 ; 2. ఉన్నతభూమి. సిం.ద్వా. 10.45 ; 3. రచ్చసావడి. ఆము. 6.70 ; 4. ఇంటి తలవాకిట ఉండే లోగిలి; 5. గ్రామ మధ్యంలో ఉండే జలాశయానికి చుట్టూ నాలుగు పక్కలా ఏర్పడిన వీథులు ; 6. చెరువు లోపలివైపు మిర్రుగా ఉన్న భాగం ; 7. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద ; 8. ఒకరకం పొడుగుబద్దలను కిందివైపు బిగించిన పల్ల.

క. మిఠ్ఠు. తొండ, మిట్ట, మిట్టె. ఎత్తుగాఉండు ; తు. ముట్టె. గట్టు, పర్వతం ; గోం. మట్టా, మెటా. కొండ మెట్టు ; కొలా. మెట్టా, మెట్ట్. కొండ, మెత్, కొండ.

మిట్టకాయ వి. చిటిక. మిట్టకాయలో అవ్య. చిటికవేసినంతలో. మిట్టకాల్వ వి. పెద్దకాలవనుండి మెరక పొలాలకు ఎత్తయిన భూములకు నీళ్ళు పారటానికి తీసిన కాలవ. మిట్టతూము వి. ఎత్తు ప్రదేశంలో కట్టిన తూము. నె.శా. రాయపూరు శాసనం. క్రీ.శ. 1612. మిట్టపండ్లవాఁడు విణ. ఎత్తైన పళ్ళున్నవాడు, దంతరుడు. ఆం.భా. 2.121. మిట్టపండ్లు వి.బ.వ. ఎత్తైనపళ్ళు, పైకుబికినపళ్ళు. మిట్టపల్లములు వి.బ.వ. ఎగుడు దిగుడులు. మిట్టపెత్తనములు వి.బ.వ. మెరకమీద కూర్చుండి చేసే పెత్తనం. మిట్టమిఱ్ఱు వి. ఎక్కువ మెరక ప్రదేశం, అత్యున్నత ప్రదేశం. గొ.హరి. పూ. 895 పం ; విణ. అత్యున్నతం, మిక్కిలి ఎత్తైనది. మిట్టలు వి.బ.వ. చిన్న నల్లటిచేపలు. మిట్టసట్టి వి. అడుగు పైన మిట్టగాఉండి దబ్బంచుతోఉండే మట్టిపాత్ర. మిట్టసల్ప వి. వాటను సాగగొట్టి అడుగు మూసేటప్పుడు వాడే సలప.

మిట్టంసల్ప చూ. మట్టము. వి. ఆరుపదును పాత్రలమీద నునుపు, గట్టితనం రావటానికి సర్వేసలప.

మిట్టాడు చూ. మిట్టు.

మిట్టించు చూ. మిట్టు.

మిట్టిపడు చూ. మిట్టు.

మిట్టిపాటు చూ. మిట్టు.

మిట్టిమిట్టిపడు చూ. మిట్టు.

మిట్టు వి. 1. మీటు. కు.సం. 2.32 ; 2. ఉత్పతనం, ఎగిరిపడటం ; 3. చలనం ; అ.క్రి. ఎగురు, ఉత్పతితమగు. శృం.నై. 3.85,

కొలా. మిట్ట్. వంగు ; నా. మిట్ట్-.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *మిట్.

మిట్టాడు అ.క్రి. సంచరించు, తిరుగు. కాశీ. 5.267. < మిట్టు + ఆడు. మిట్టించు అ.క్రి. 1. ఉబుకు, నిగుడు. భాగ.

9.608 ; **2.** అతిశయించు, అధికమగు. గా.హరి.పూ. 993 పం ; **3.** మీదికెగయు, పైకెగురు. పాండు. 3.150.
<మిట్టు + -ఇంచు[3]. **మిట్టిపడు** అ.క్రి. **1**. (ఇది కొన్నిచోట్ల పదాంతర వ్యవధానంతో కనబడుతోంది) ఎగిరిపడు. కు.సం. 11.40 ; **2.** గర్వంతో తుళ్ళు, ఎగిసిపడు. భాస్క. రా. సుందర. 336 ; **3.** అదిరిపడు, ఉలికిపడు, భయాదులతో చలించు. భాగ. 6.516. **మిట్టిపాటు** వి. మిట్టిపడటం. గా.హరి.పూ. 1230. పం. **మిట్టిమిట్టిపడు** రూ. మిటిమిటిపడు. అ.క్రి. ఎగిరెగిరిపడు. భార.ద్రోణ. 1.377. **మిట్లు** వి.బ.వ. బండివెనుకబరువైతే నొగలు పైకి లేవటం.

**మిట్న** రూ.చూ. మెట్న, మెట్నా. వి. మూలలు కొలవటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం.

**మిట్నబాయి** వి. చౌకంబాయి, నల్చదరంగా ఉండే చుట్టుగోడ ఉన్న బావి.

**మిట్లు** చూ. మిట్టు.

**మితాకోరు** రూ.చూ. ముతాకోరు. వి. హద్దుమీరిపోయే వ్యక్తి.

**మితాయి**[1] వి. (సంగీత) ఒక స్వరస్థాయి. బసవ. 3.938.

**మితాయి**[2] రూ. మిటాయి. వి. మధురమైన భక్ష్యవిశేషం.

సం. మిష్ట-, మృష్ట-. తియ్యని ; ప్రా. మిఠ్ఠ-, మఠ్ఠ-. అ.బెం.ఒ. మిఠా. ; నే. మిఠో. ; హిం. మిఠాఈ. తీపిపదార్థం ; పం. మిఠ్ఠా. ; సిం. మిఠో. ; గు. మిఠు. క. మిటాయి, మిఠాయి. ; త. మిట్టాయ్, మిట్టాయి. మిఠాయి.

<హిం. మిఠాఈ.

**మితాయికొమ్ము** వి. ఒకరకం మిటాయి.

**మితాయిగర్** వి. మిఠాయిచేసి అమ్మేవాడు.

హిం. మిఠాయీ. ; పార-గార్. ;

త. మిట్టాయ్-, క్కారన్. మిఠాయిచేసి అమ్మేవాడు.

<హిం. మిఠాయీ + పార-గార్.

**మిడత** రూ.చూ. మిడుత. వి. **1.** శలభం. ఒకరకం ఎగిరే పురుగు ; **2.** గుర్రం మరమగ్గం సౌరుగుకు మొదట బిగించిన చెక్క.

**మిడతకన్ను** వి. నేతలో నిలువుపోగు తెగి ముడుచుకు పోయినప్పుడు నేత పడకుండా గుండ్రంగా వచ్చిన వెలితి. **మిడతకన్నుపడు** వి. నేతలో నిలువుపోగు తెగి ముడుచుకు పోయినప్పుడు నేత పడకుండా గుండ్రంగా వచ్చిన వెలితి.

**మిడద** వి. ధాన్యం నిలవ చేసే పెద్ద బుట్ట, గాదె.

**మిడమిడ** వి. కోపంతో చూడటంలోని అనుకరణం. బసవ. 115 పు.

**మిడసట్టి(-చట్టి)** రూ. మిడ్సట్టి. వి. అడుగుపైన మిట్టగా ఉండి దబ్బంచుతో ఉండే మట్టిపాత్ర.

**మిడసరము** రూ. మెడసరం. వి. **1.** ఎగురుబోతుతనం ; **2.** పెడసరం ; **3.** ఎగిరిపడే వ్యాధి ; **4.** ఒకరకం వాతపు జబ్బు, జెబ్బలువాచి పశువు నడవలేని జబ్బు.

**మిడసరలగ్గము** వి. **1**. మిట్టమధ్యాహ్నం పెట్టిన లగ్నం ; **2.** పట్టపగలు.

**మిడసరలగ్గము** చూ. మిడసరము.

**మిడి**[1] చూ. మిడియు. వి. **1**. గర్వం, మిడిసిపాటు. భార. శల్య. 2.64 ; **2.** కాంతి, జిగి. హంస. 3.4 ; విణ. **1.** గర్వితుడు, మిడిసిపాటున్నవాడు. దశకు. 7.71 ; **2.** పైకుబికినది. రం.రా.ఉ. 20పు. 21 పం. ; **3.** తీక్ష్ణమైంది, వేడైంది. ఇందు. 3.12 ; **4.** ఉన్నతం. కృ.శకు. 2.220.

క. మిడి. పైకి ఉబకటం.

**మిడికాఁడు** వి. గర్వితుడు, మిడిసిపాటు కలవాడు. అచ్చ.భా. 4.71. **మిడిగండ్లవాన** వి. పెద్ద ధారలతో పడే వాన. **మిడిగర** వి. పైరు పొట్టమీద నిటారుగా మొలచిన ఆకు. **మిడిగుంజ** వి. **1.** పడుగు ఎంట్లు అల్లుచేయటానికి ఆరుబయటచాపి రెండోవైపున కట్టటానికి పాతినగూటం ; **2.** నేతబయలులో చివర పాతిన కొయ్య. **మిడిగుడ్లు** రూ.చూ. మిడిగ్రుడ్లు. వి.బ.వ. మిట్లగుడ్లు, పైకుబికిన కంటి గుడ్లు. తాళ్ల.సం. 7.44. **మిడిగూటం.** రూ. మిడిగూటాం. వి. **1**. మగ్గం గుండలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య ; **2.** నేతబయలులో చివరపాతిన కొయ్య. **మిడిగూటంతాడు** వి. పావుచెక్కను గూటానికి బిగించే వెనకతాడు. **మిడిగూటాం** రూ.చూ. మిడిగూటం. వి. **1**. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య ; **2.** నేతబయలులో చివరపాతిన కొయ్య. **మిడిగొను(కొను)** స.క్రి. మెరయు. హంస. 4.101. **మిడిగ్రుడ్లవాఁడు** విణ. ఉన్నేత్రుడు, మిట్లగుడ్లవాడు. ఆం.భా. 2.121. **మిడిగ్రుడ్లు** రూ. మిడిగుడ్లు. వి.బ.వ. మిట్లగుడ్లు, పైకుబికిన కంటిగుడ్లు. భార.అరణ్య. 1.300. **మిడిదల(-తల[1])** వి. పెద్ద తల, శిరసు. తల. సిం.ద్వా. 4.51. **మిడిదేలు(-తేలు[1])** అ.క్రి. గడిదీరు. **మిడిదొమ్మ** వి. తిరుగుతూ తిరుగుతూ గొడ్డు చచ్చిపోయే జబ్బు. **మిడినల్లి** రూ. మిణ్ణల్లి. వి. తుళ్ళుపురుగు, ఒకరకం పురుగు. **మిడినాగు** రూ. మిడునాగు, మిణ్నాగు. వి. ఎగిరెగిరి పడే సర్పవిశేషం. చంద్రాంగ. 29. **మిడిపండ్లవాడు** విణ. ఎత్తైన పళ్ళు కలవాడు. **మిడిపండ్లు** వి.బ.వ. ఎత్తైన పళ్ళు. భల్లా. 4. **మిడిపోవు** స.క్రి. కాంతిని పోగొట్టుకొను. **మిడిమంచుమబ్బు** వి. సూర్యుడు కనబడకుండా అడ్డుపడే మబ్బు. **మిడిమాను** వి. ఏతాంలో ఒకభాగం, మనిషి తొక్కేలేక లాగే ఏటవాలు కొయ్య. **మిడిమిడి** విణ. **1**. మిక్కిలి తీక్ష్ణం. వాల్మీ. 2.90 ; **2.** మిక్కిలి అల్పం ; **3.** సగంసగం. **మిడిమూలము** వి. మిడిసిపాటు. తాళ్ల.సం. 14.192. **మిడిమేలము** విణ. **1**. మిడిసిపాటు కలది, గర్వితం. సు.శ. 4 ; **2.** ఉపద్రవకరం, బాధకం. ఉ.రా. 6.273 ; వి. **1**. ఉపద్రవం, కీడు. విజయ. 3.36 ; **2.** గర్వం, మిడిసిపాటు. ఉ.హరిశ్చ. **3.31.** **మిణ్నల్లి.** రూ.చూ. మిడినల్లి. వి. తుళ్ళు పురుగు, ఒకరకం పురుగు. **మిణ్నాగు** రూ.చూ. మిడినాగు. వి. ఎగిరెగిరి పడే పాము.

**మిడి**[2] వి. వేటసాధనం, పి. శకు. 1.116.

**మిడిబద్ద** వి. వేటకుపయోగించే సాధన విశేషం. **మిడిబోను** వి. జంతువులు మొ. వాటిని పట్టే కపట యంత్రం. యయా. 2.19. **మిడిమాసి** వి. శూరుడు. **మిడివిల్లు** వి. ఉండ

విల్లు. క. మిడివిల్. వెదురుతో చేసిన విల్లు.

**మిడికిపాటు** చూ. మిడుకు[2].

**మిడికించు** చూ. మిడుకు[3].

**మిడితిగోడ** వి. మట్టితో కట్టిన గోడ.

**మిడిమిట్లు** వి.బ.వ. మిక్కిలి మిట్టుటలు. వేంక. పంచ. 3.134.

**మిడియ** వి. వేదవాక్యం. పరమ. 2.112.

**మిడియు** అ.క్రి. **1**. పైకుబుకు. కు.సం. **6.37**; **2**. మిట్టు, పైకెగయు. వేంక.పంచ. 2.109; **3**. తూలు. మను. 4.102; **4**. తీక్ష్ణమగు. కకుత్స్థ. 1.164: **5**. భయాదులతో పగసిపడు, అదిరిపడు. కకుత్స్థ. **2.133**;

క. మిడి. వంగు, ఎగరగొట్టు, పైకుబుకు, గర్వించు, గర్వం; మీంటు. గెంతు, ఎగురు; నా. మిట్. గెంతు.

**మిడివోవు** అ.క్రి. **1**. క్షీణించు, తగ్గు. గౌ.హరి.పూ. 2120; **2**. బొక్కు, తప్పిపోవు, శేషించు. రాఘవ. **4.237**. <మిడియు + పోవు. **మిడిసిపడు** అ.క్రి. **1**. (కోపం, గర్వం మొ. వాటివల్ల) తుళ్ళు, మిట్టిపడు. హరి. పూ. 5.245; **2**. మీదికెగయు, ఉత్పతితమగు. నరస. **3.60**. **మిడిసిపాటు** వి. మిట్టిపాటు, గర్వాదుల వల్ల కలిగే తుళ్ళు.

**మిడివోవు** చూ. మిడియు.

**మిడిసిపడు** చూ. మిడియు.

**మిడసిపాటు** చూ. మిడియు.

**మిడుకరించు** చూ. మిడుకు[3]

**మిడుకు[1]** చూ. మిడియు. రూ. మెడుకు. అ.క్రి. తుళ్ళు, ఎగిరిపడు, గర్వంతో మిడిసిపడు. భార.ద్రోణ. 2.91.

క. మిడి. తుళ్ళు. ఎగురు, గెంతు. మీంటు. గెంతు, మీటు. గెంతటం, ఎగరటం, దాటటం, మిడుకు. బతికి ఉండు; కొలా. మిట్-(మిట్-). దాటు; నా. మిట్. గెంతు.

**మిడుకు[2]** అ.క్రి. **1**. పరితపించు. భార.శాంతి. 3.370; **2**. పైకుబుకు. జైమినిభా. 8.26.

క. మిడుకు, మిడుగు. పరితపించు, మిడ, మిట్టనె. పరితాపం; మ. మిట్టుక. పరితపించు.

**మిడికిపాటు** అ.క్రి. పరితపించు, పరితాపం పొందు. వరాహ. **12.64**.

**మిడుకు[3]** రూ. మిడ్కు. అ.క్రి. **1**. కదలు, చలించు. నిర్వ. రా. 10.28; **2**. సంచరించు. మార్క. 2.261.

క. మిడుకు. కదలు, తోయు; త. మిటుకు. తొందరపడు, సంచలించు, మిటుక్కు. నడుపు. తోలు. మ. మిటుక్కుక. తోలు; గోం. మిడ్డింగ్, మిడ్డింగ్-ఐ. తిరుగు, మిడ్‌హుత్. వేటాడు.

**మిడికించు** స.క్రి. **1**. తిప్పు, చలింపచేయు. క్రీడా. **226**; **2**. మండించు, కాల్చు. సిం. ద్వా. **3.58**. క. మిటుకిసు, మిటుగరిసు. కళ్ళను అకస్మాత్తుగా తెరచి మూయు. **మిడుకరించు** స.క్రి. కళ్ళుమిటకరించు. **మిడుకుమిడుకు** రూ.చూ. మిడుమిడుకు. వి. కాంతి సన్నగిల్లటంలో ఆయ్యే అనుకరణం. **మిడుకుమిడుకుమను (-అను)** రూ.చూ. మిడుమిడుకను. అ.క్రి. తేజోహీనమగు. **మిడుమిడమిడుకు** అ.క్రి. మిటకరించు. పండి. చ. 2-4-15. **మిడుమిడుకను** రూ. మిడుకుమిడుకుమను. అ.క్రి. తేజోవిహీనమగు. భాగ. 8.290. **మిడుమిడుకు** రూ. మిడుకుమిడుకు. వి. కాంతి సన్నగిల్లటంలో అయ్యే అనుకరణం.

**మిడుకు[4]** అ.క్రి. **1**. బతుకు, జీవించు. భార. భీష్మ. 2.62; **2**. కోపంతో చూచు. బసవ. **4.729**. **3**. తూలు. రం. రా. ఉ. 16పు. 2పం; **4**. ఎండు. శుష్కించు. గౌ. హరి. పూ. 1810; **5**. మండు. సిం. ద్వా. 7.105; వి. **1**. మిడిసిపడేవాడు. హర. 5.10; **2**. మిడిసిపాటు, మిట్టిపడు. ఇందు. 4.37; **3**. జీవం.

**మిడుకుమాలు** అ.క్రి. చచ్చు. ఉ. హరి. **3.53**.

**మిడుగు** రూ. మిణుగు. వి. **1**. చీలమండ, గుల్ఫం. ద్వి. పరమ. వి. **4.315**పు; **2**. కఠినశిల.

**మిడుగుఱాయి** వి. కఠినశిల. ఆం. భా. 2.29.

**మిడు(గు** రూ. మిణు(గు. వి. మిడుగురు, స్ఫులింగం, అగ్నికణం. భాగ. 10ఉ. 909.

**మిడు(గుఱు** రూ. మిణుగురు, మిణుంగురు, మిణు(గుఱు, మినకర, మిను(గుఱు. వి. **1**. ఖద్యోతం, మిణుగురు పురుగు. భార. ఆరణ్య. 3.179; **2**. విస్ఫులింగం, అగ్నికణం. భాస్క. రా. యు. **1216**. క. మిడుకుఱు. అగ్నికణం. **మిడు(గుఱు(బురువు** రూ. మిడు(గుఱు(బుర్వు, మిణు(గుఱు(బురువు, మిణు(గుఱు(బుర్వు, మినుగురుపురుగు. వి. చీకటివేళ తళతళమెరుస్తూఎగిరే ఒకజాతిపురుగు, ఖద్యోతం మను. 1.36. **మిడు(గుఱు(బుర్వు** రూ. చూ మిడు(గుఱు(బురువు. వి. ఖద్యోతం.

**మిడుచు** స.క్రి. (వేళ్ళు) విరుచు, (మెటిక) విరుచు. భార విరా. **2.356**; **2**. ద్రవద్రవ్యాన్ని బొట్టుబొట్టుగా ఇచ్చు, కొంచెం కొంచెంగా పెట్టు. హరి. పూ. 5.219.

క. మిడి. మెటికలు విరుచు; పర్జి. మిట్‌కిప్.

**మిడుత** రూ. మిడత. వి. శలభం, ఒకరకం ఎగిరేపురుగు. భార. సభా. 1.133.

క. మిడిచె, మిడితె, మిడతె, మిడుచు. మిడత; త. వెట్టుక్కిళి. పెద్దమిడత, విట్టిళ్. మిడత; మ. విట్టిల్, వెట్టిల్. మిడత; కో. మిట్ల్. మిడత; తొ. మిట్స్స్. మిడత; పర్జి. మిటుక. మిడత; కొలా. మిడ్జె. మిడత. పో. చూ. మటుచి. మిడత.

**మిడునాగు** రూ.చూ. మిడ్నాగు. వి. ఎగిరెగిరి పడే పాము.

**మిడుమిడమిడుకు** చూ. మిడుకు[3].

**మిడుమిడుకను** చూ. మిడుకు[3].

**మిడుమిడుకు** చూ. మిడుకు[3].

**మిడుసు** వి. ఎండినమామిడి ముట్టెలను నానబెట్టి ఆ రసంతో చేసే పచ్చడి.

**మిడ్కు** రూ.చూ. మిడుకు[3]. అ.క్రి. అయ్యో అయ్యో అని ఏమి తోచక తిరుగు.

**మిడ్చి** చూ. మిర్చి. వి. **1**. మిరపపండురంగు; **2**. ఆరుద్ర పురుగురంగు.

**మిడ్చిరంగు** రూ.చూ. మిర్చిరంగు. వి. **1**. మిరప్పండు

రంగు ; **2**. ఆరుద్ర పురుగురంగు.

**మిడ్సట్టి** రూ.చూ. మిడసట్టి. వి. అడుగుపైన మిట్టగా ఉండి దబ్బంచుతో ఉండే మట్టిపాత్ర.

**మిణకరము** చూ. మిడుకు³ వి. ఏమీతోచక తిరగటం.

**మిణకరించు** అ.క్రి. ఏమీతోచక భ్రమించు.

**మిణకరించు** చూ. మిణకరము.

**మిణుకు** రూ.చూ. మినుకు1. వి. తళుకు.

**మిణుగు** రూ.చూ. మిడుగు. వి. కఠినశిల.

**మిణుగురు** రూ.చూ. మిడుఁగుఱు. వి. అగ్నికణం.

**మిణుంగురు** రూ. చూ. మిడుఁగుఱు. వి. చీకటిలో తళతళ మెరుస్తూ ఎగిరే కీటకం. హర. 6.80.

**మిణుఁగు** రూ.చూ. మిడుఁగు. వి. మిణుగురు పురుగు.

**మిణుఁగురు** రూ. చూ. మిడుఁగుఱు. వి. మిణుగురుపురుగు. పల్నా. పు. 11.

**మిణుఁగురుబూచి** వి. ఖద్యోతం. **మిణుఁగురుమెఱుపు** వి. కనిపించటమే కాని దానిలో ఏమీలేకుండటం. వేంక. ఆం. 79.

**మిణుఁగుఱు** రూ.చూ. మిడుఁగుఱు. వి. స్ఫులింగం, అగ్నికణం. ఉ. హరి. 4.109.

**మిణుఁగుఱుఁబురువు** రూ. చూ. మిడుఁగుఱుఁబురువు. వి. చీకట్లో తళతళ మెరుస్తూ ఎగిరే ఒకజాతిపురుగు, ఖద్యోతం. **మిణుఁగుఱుఁబుర్వు** రూ. చూ. మిడుఁగుఱుఁబురువు. వి. చీకటిలో తళతళమెరుస్తూ ఎగిరే ఒకజాతి కీటకం, ఖద్యోతం. విప్ర. 3.62.

**మింటముక్కిడివల** చూ. మిన్ను.

**మింటఁబెట్టినదీపము** చూ. మిన్ను.

**మింటికాఁపరులు** చూ. మిన్ను.

**మింటికాఁపురంబులవారు** చూ. మిన్ను.

**మింటికినేలకుసూత్రపట్టు** చూ. మిన్ను.

**మింటికిమంటికిదారముపన్ను** చూ. మిన్ను.

**మింటికిమంటికిసూత్రముపన్ను** చూ. మిన్ను.

**మింటిచూలి** చూ. మిన్ను.

**మింటిచెట్టు** చూ. మిన్ను.

**మింటితెరువరి** చూ. మిన్ను.

**మింటిపాదవగు** చూ. మిన్ను.

**మింటిమానికము** చూ. మిన్ను.

**మింటిమాను** చూ. మిన్ను.

**మింటిముక్కిడివల** చూ. మిన్ను.

**మింటిసికవేల్పు** చూ. మిన్ను.

**మింటెకొండి** వి. నాగటీల, గొర్రు, గుంటక మొ వాటి దిండులో నాగలు దూర్చి వెనకవైపు కొట్టేమేకు.

**మిండ¹** రూ.చూ. మిండఁడు. వి. విటుడు. భీమ. 3.212.

**మిండకోర** వి. కులట. **మిండగము** వి. జారత్వం. **మిండగాఁడు** రూ.చూ. మిండగీఁడు. వి. విటుడు. నిరంకు. 4.36. **మిండగీఁడు** రూ. మిండగాఁడు. వి. విటుడు. పల్నా. 3.157. **మిండజంగము** వి. కాముకుడైన జంగము. హర. 1.15. **మిండత** వి. జారిణి, రంకుటాలు. వేంక. పంచ. 4.424, గా. హరి. ఉ. 1063పం. **మిండతనము** వి. జారత్వం. **మిండతపసి** వి. కాముకుడైన తాపసుడు. రామాభ్యు. 2.110. **మిండతుమ్మెద** వి. మగతుమ్మెద. శృం. నై. 7.17. **మిండప్రాయము** వి. యవ్వనం. ద్వి. భాగ. 4.2009. **మిండముండ** వి. జారిణి, వేశ్య. క్రీడా. 214. **మిండమేఘము** వి. పెద్దమబ్బు. **మిండరి** విశ. విటసంబంధమైన. <మిండ¹ + -అరి. **మిండరిమాటలు** వి.బ.వ. విటసంబంధమైన మాటలు. **మిండఱికము** వి. రంకు, జారత్వం. ఉ. హరి. 1.67. **మిండలకోరి** వి. **1**. మిండత, జారిణి; **2**. ముప్పైఆరు ఏళ్ళున్న స్త్రీ. **మిండవడ్డి** వి. ఎక్కువవడ్డి. **మిండాటము** వి. జారత్వం. రంకుతనం. దశకు. 5.58.

**మిండ²** వి. రక్తపుచ్చిక, నలకళ్ళపాము. ఆం. భా. 2.87.

**మిండఁడు** రూ. మిండ¹. విశ. **1**. అధికుడు, శ్రేష్ఠుడు, అధికం, పెద్ద. ఉ. హరి. 5.182 ; **2**. తరుణం, లేతది. వి. **1**. పురుషుడు. శృం. నై. 7.17 ; **2**. విటుడు. సిం. ద్వా. 4.228.

సం. *మింఠ-, మేఢ్ర-*. పురుష చిహ్నం ; ప్రా. అ.మా. *మింఢ-, మేంఢ-* ; జై.మహా. *మింఠ-* ; పా. *మేంఢ-* ;

క. *మిండ* ; త. *మిణ్డన్*.

<ప్రా. మింఢ-.

**మిండాటము** చూ. మిండ¹.

**మిణ్ణక** రూ. మిన్నక. వి. నెమ్మదిగా, మౌనంగా, చల్లగా మొ.వి. కలకడ శాసనం. క్రీ.శ. 972.

క. *మినుకు*. చిన్న గొంతుతో మాట్లాడు, గుసగుసలాడు ; తు. *ముణుముణు*. అస్పష్టంగా మాట్లాడు, గొణుగు, *ముణుక్కని*. అయిష్టతను తెలియపరిచే ధ్వని, *ముణ్కెలె*. సణిగేవాడు ; త. *మిణుమిణు* (-ప్పు-, -త్తు-). గుసగుసలాడు, గొణుగు, *మిణముణ* (-ప్పు-, -త్తు-). *ముణుముణు* (-ప్పు-, -త్తు-). గుసగుసలాడు, *ముణంకు* (*ముణంకి-*). నెమ్మదిగా మాట్లాడు, గొణుగు, గుసగుసలాడు, *ముణక్కమ్*. గుసగుసలాడు, గొణుగు, *మిఴఱు*. (చిన్నపిల్లలవలె) పిచ్చిమాటలాడు, వదరు, మృదువుగా మాట్లాడు, *మిఴలై*. (బిడ్డ) వచ్చీరాని మాటలాడు, అస్పష్టంగా మాట్లాడు ; మ. *మిణుమిణుక్క*. అస్పష్టంగా మాట్లాడు, గుసగుసలాడు, *మింటుక*. అస్పష్టంగా మాట్లాడు, మాట్లాడటానికి ప్రయత్నం చేయు, *మింటాట్టుమ్*. మాట్లాడటానికి నోరు తెరుచు, *మింటాతె*. శబ్దం బయటికి రాకుండా మాట్లాడు, *ముణెముణోన*. గొణుగుడు ;

ప్రా. *ముణముణై*. సణుగు ; మరా. *మిణ్‌మిణా*. లో గొంతుతో మాట్లాడు, అస్పష్టంగా మాట్లాడు.

**మిణ్నల్లి** చూ. మిడి¹.

**మిణ్నాగు** చూ. మిడి¹.

**మితంకాల్పు** వి. ఎర్రగాల్పు, ఇటుక మొ.వి సరిగా కాలటం.

సం. *మిత-*, పరిమితిగల,

<సం. మిత- + -ము + కాల్పు.

**మితువురాయి** వి. అబ్బుగుల్ల, సున్నం తయారీకి ఉపయోగపడే భూమినుంచి లభించే ఇనుములో కలిసిన సుద్ద వంటి

పదార్థం.

మిత్త వి. స్నేహితుడు.

సం. మిత్ర-. స్నేహితుడు ; ప్రా. మిత్త- ; అ.మా. మిత్త- ; పా. మిత్త-.

<ప్రా. మిత్త-.

మిత్తనాన్న వి. నాన్నకు స్నేహితుడు. మిత్తబావ వి. బావకు స్నేహితుడు. మిత్తమామ వి. మామకు స్నేహితుడు. మిత్తమ్మ వి. పూరీ జగన్నాథస్వామివారి ప్రసాదాన్నిగాని ఇంకే దేవుని ప్రసాదాన్నిగాని సాక్షిగా పెట్టుకొని ఇద్దరు మనుష్యులు ప్రమాణం చేసుకొని స్నేహితులయిన వ్యక్తులు. <మిత్త+అమ్మ. మిత్తయ్య వి. పూరీ జగన్నాథస్వామి వారి ప్రసాదాన్నిగాని ఇంకేదేవుడి ప్రసాదాన్నిగాని సాక్షిగా పెట్టుకొని ఇద్దరు మనుష్యులు ప్రమాణం చేసుకొని స్నేహితులైన వ్యక్తులు. <మిత్త+అయ్య.

మిత్తి[1] వి. 1 మృత్యుదేవత, మరణాధిదేవత. భార.అరణ్య. 1.74 ; 2. మరణం. భార.ఉద్యో. 2.82.

సం. మృత్యు-. చావు, మృత్యుదేవత ; ప్రా. మచ్చూ, మచ్చు, మిచ్చు- ; జై. మహా. పా. మచ్చు ; శౌ. మిచ్చు ;

క. మిత్తు. చావు.

<సం. మృత్యు-.

మిత్తికూడు వి. ప్రేతల నుద్దేశించి ఇచ్చే ఆహారం, చచ్చినవారి నుద్దేశించి పెట్టే ఆహారం. మిత్తికూళ్లదొంగ వి. ప్రేతల నుద్దేశించి పెట్టే అన్నం దొంగిలించేవాడు. వేమ. 3.249. మిత్తిగొంగ వి. మృత్యుంజయుడు, శివుడు. ఆం.నా. నం.దేవ. 6. మిత్తిచూలు వి. కేతుగ్రహం. మిత్తిబియ్యము వి. చేటలో పోసి పెళ్ళికొడుకు పైనుంచి తిప్పి మంగలివాడి కిచ్చే బియ్యం. మిత్తిమిత్తి వి. మృత్యుంజయుడు, శివుడు. సాంబ.దేవ. 3 చావుకుచావు అని వ్యు. మిత్తిరాహుత్తి వి. ఒకజాతి కోడి. మిత్తివేటకాఁడు వి. శివుడు. అచ్చ.రా. అయోధ్యా. 115. మిత్తిసూఁడు వి. శివుడు. మృత్యువుకు శత్రువు అని వ్యు.

మిత్తి[2] వి. లతా విశేషం, ఒకజాతి తీగ. ఆం భా. 2.67.

మిత్తిక వి. మన్ను.

సం. మృత్తికా-. మట్టి ; ప్రా. మట్టిఆ, మట్టియా, మట్టీ, మిత్తిఅ ; పా. మత్తికా ; అ.బెం.ఒ. మాటి ; హిం. మాటీ, మాఁటీ, మట్టీ, మిట్టీ ; ల. మిట్టీ ; సిం. మెటి ; గు. మాటీ, మాఁటీ.

<సం. మృత్తికా.

మిత్తు చూ. మిత్తి[1]. విణ. మిక్కుటం, అధికం. కవిక. 4.72.

మిత్తురుఁడు వి. స్నేహితుడు, చెలికాడు. అచ్చ.రా.యు. 219.

సం. మిత్ర-. స్నేహితుడు, స్నేహం ; ప్రా.పా. మిత్త-. స్నేహితుడు ; ఉ. మీత్ ; నే. మిత్ ; అ. మిత, మితా ; పం. మిత్; మిత్రుడు ; సిం. మిత్రు-. స్నేహితుడు, బంధువు.

<సం. మిత్ర-.

మిత్రలాభం వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

సం. మిత్రలాభ-. స్నేహితులను సంపాదించటం, హితోపదేశంలోని ఒక భాగం.

<సం. మిత్రలాభ- (అర్థవిపరి.).

మిత్రవిందె వి. వగలాడి.

సం. మిత్రవింద-. అగ్ని, మిత్రవిందా. కృష్ణుని భార్య.

<సం. మిత్రవిందా.

మిదిల వి. జనకుని రాజధాని, విదేహనగరి.

సం. మిథిలా. ఒక నగరం ; ప్రా. మిదిలా.

<ప్రా. మిదిలా.

మిదిలదొర వి, జనకమహారాజు. అచ్చ.రా.కిష్కిం. 51.

మిద్ది రూ.చూ. మిద్దియ. వి. 1. భవంతి, రాతి కప్పుగాని, మట్టి కప్పుగాని కల ఇల్లు ; 2. బట్టీపొయ్యిమీద అంతస్థు.

మిద్దికడ్డీ వి. మిద్దె గోడలమీద వేసే అడ్డుకడ్డీ.

మిద్దియ రూ. మిద్ది, మిద్దె. వి. 1. ఉంగరం. శివ.సా. 336 ; 2. సౌధం, మేడ, హర్మ్యం. కువ.చ. 1.71 ; 3. డాబా, దద్దళం, మాడుపు మీద చదునుగా పలకలు కప్పి గచ్చు పూసిన కప్పు. అచ్చ.రా. సుందర. 9, యు. 280 ; 4. తామరపువ్వు మొ. వాటిలోని దుద్దు. దిమ్మె. నీలా. 3.37 ; 5. ఉంగరం మీద దిమ్మలా ఏర్పరచిన తదవయవ విశేషం ; 6. రాతిమేడ.

తు. మెత్తిగె. మేడ పైభాగానికి మెట్లు ; త. మెత్తై, మెత్తైవీటు. అంతస్తుగల ఇల్లు, పై అంతస్తు ; కో. మెద్. మేడమీది గది.

మిద్దె రూ.చూ. మిద్దియ. వి. 1. డాబా, దద్దళం. ఆము. 4.127 ; 2. సౌధం, మేడ, హర్మ్యం ; 3. ఉంగరం ; 4. తామరపువ్వు మొ. వాటిలోని దుద్దు, దిమ్మ ; 5. భవంతి, రాతికప్పుగాని మట్టికప్పుగాని గల ఇల్లు.

మిద్దెగూన వి. వాననీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే గుండ్రటి మట్టిగొట్టం. మిద్దెజుట్టు వి. తామరపువ్వులోని దుద్దులా ఉండే జుట్టు. మిద్దెతూము వి. వాన నీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే గుండ్రటి మట్టి గొట్టం. మిద్దెదోనె వి. వాననీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే గుండ్రటి మట్టిగొట్టం. మిద్దెపరం వి పిట్టగోడ. మిద్దెబొంగు వి. వాననీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే గుండ్రటి మట్టిగొట్టం.

మిన వి. కాంతి, వెలుతురు.

మినకర రూ.చూ. మిడుఁగురు. వి. అగ్నికణం, నిప్పురవ్వ. మినమిన వి. 1. ఎక్కువ మెరవటంలోని అనుకరణం. పండి.చ. 2.162 పు. ; 2. చూడటంలోని అనుకరణం. పద్మ. 9.88 ; 3. తళతళకాంతి. చంద్రాంగ. 3.53. మినమిననివాఁడు విణ. చక్కనై నున్ననైనవాడు, మేదురుడు. ఆం.బా. 3.10. మినమినమను అ.క్రి. తళతళ ప్రకాశించు. అష్టమ.క. 1.40 పు. 9 పం. <మినమిన+ అను. మినమినలాడు అ. క్రి. మినమినమని మెరయు. <మినమిన+-లు+ఆడు.

మినగిరి వి. ఒకరకం కలుపుమొక్క.

మినహా వి. 1. తక్కువ, తగ్గింపు ; 2. అసాధారణమయిన ; 3. మినాయింపులో చేరిన.

హిం. మిన్‌హా. తక్కువ చేయబడిన ; ఉ.అర. మిన్‌హా. తక్కువచేయబడిన, అన్నిటినుంచి విడదీయబడిన ;

క. మినాహా.

< ఉ. మిన్‌హా.

మినహాయించు(-ఇంచు³) రూ. మినాయించు. స.క్రి. 1. తీసివేయు, తగ్గించు ; 2. తోసివేయు. మినహాయింపు రూ. వినాయింపు. వి. తగ్గింపు, తీసివేత, వ్యవకలనం.

**మినాభూమి** వి. ఊరికి అనుకునిఉన్న గవర్నమెంటుభూమి, కావలిస్తే పట్టాలివ్వటానికి వీలైంది.

సం. భూమి-. నేల ; హిం.ఉ. మిన్‌హా. మిగులు ;

< ఉ. మిన్‌హా + సం. భూమి-.

**మినాయించు** రూ.చూ. మినహాయించు. స.క్రి. 1. తోసివేయు ; 2. తీసివేయు.

**మిను** రూ.చూ. మిన్ను. వి.బొ. అనా. ఆకాశం. వరాహ. 4.148.

మినుచూలు వి. నభస్వంతుడు, వాయువు. మినుజుట్టుదేవర వి. వ్యోమకేశుడు, శివుడు. మినుతేరులు వి బ.వ. వేల్పులు, గగనవీథి విహారులు. మినుత్రోవరులు వి.బ.వ. గగనవీథి విహారులు, వేల్పులు. మినునిను(గు రూ.చూ. మినునినుపు. వి. నభస్వంతుడు, వాయువు. మినునినుపు రూ. మినునిను(గు. వి. నభస్వంతుడు, వాయువు. అచ్చ.రా.యు. 30. మినుబావి వి. ఆకాశగంగ, సురదీర్ఘిక. మృత్యు. 1.11. మినుమానికము వి. చదలుకెంపు, సూర్యుడు. మినురతనము వి. నభోమణి, సూర్యుడు. ఆం.భా. 1.81. మినువా(క రూ. మిన్నువాక, మిన్వాక. వి. ఆకాశగంగ. పె.శకు. 1.13. మినువా(కతో(బుట్టువు వి. శూద్రుడు. సాంబ. మాన. 3. మినుసికగలా(డు విణ. శివుడు. ఆం.భా. 1.37 మినుసికదేవర వి. వ్యోమకేశుడు, శివుడు. మినుసికలా(డు వి. వ్యోమకేశుడు, శివుడు. మినుసికవలంతి రూ. మినుసిగవలంతి. వి. శివుడు. అచ్చ.రా.బాల. 68. మినుసికవా(డు విణ. శివుడు. అచ్చ.రా.యు. 527. మినుసిగదయ్యము వి. వ్యోమకేశుడు, ఈశ్వరుడు. మృత్యు. 2.32, ఆం.నా.సం.దేవ. 6. మినుసిగదేవర వి. వ్యోమకేశుడు, శివుడు. ఇందు. 2.50. మినుసిగవలంతి రూ.చూ. మినుసికవలంతి. వి. వ్యోమకేశుడు, శివుడు. మినుసిగవేల్పు వి. వ్యోమకేశుడు, శివుడు. మినుసిగవేల్పు జక్కి వి. వ్యోమకేశుని వాహనం, నంది.

**మినుకంత** చూ. మినుకు¹.

**మినుకారు** చూ. మినుకు¹.

**మినుకు¹** రూ. మిణుకు, మిన్కు¹. వి. 1. పస్తై, కాశిబొట్టు. భాగ. 9.42 ; 2. కిరణం. రామాభ్యు. 6.42 ; 3. ఒకరకం బంగారు నాణెం. పాండు 4.166 ; 4. తళతళకాంతి, కాంతి. వసు. 1.6 ; 5. తళుకు ; విణ. 1. స్వల్పమయిన. తాళ్ళ. సం. 11.3.112 ; 2. మినమిన కాంతికల. విజయ. 1.35 ; అ.క్రి. మినమిన ప్రకాశించు, తళతళ ప్రకాశించు. దశా. 3.145.

క. మిణ. మెరవటం, ప్రకాశించటం, మిణుకు, మెణుకు. ప్రకాశించు. మిను, మిని. మెరుపు, తళతళ కాంతి, మినుకు, మినుగు. ప్రకాశించు. మెరియు, మించు. ప్రకాశించు, మిన్. నక్షత్రం ; కొడ. మిన్న్-. (మిన్ని-). మెరియు, తళతళలాడు ; తు. మిణిమిణి. తళతళ మెరియు, ప్రకాశించు, మెను. ప్రకాశం, కాంతి, మిణుకు, మెణకు, మెణుకు. మెరవటం ; త. మిణుకుని, మెణ్కుని, మిణుకుని, మెన్చుని, మెంచుని, మించుని. మెరయు, ప్రకాశించు, తళతళలాడు, మినణ్ణుక. ప్రకాశించు, మిణుప్పు. మెరయు, మిన్. నక్షత్రం, మిణ్. మెరుపు, ప్రకాశం, కాంతి, మిణ్మిణి. మిణుగురు, మిణుంకు (మిణుంకి) ప్రకాశించు, మెరయు, మిణ్ణల్. వెలుగు, మెరిసే నాణెం మిణుక్కు. (మిణుక్కి). మెరుగుపెట్టు, అందంగా తీర్చు. మిణుక్కమ్, మిణుక్కల్. మెరపు, కాంతి, ప్రదర్శన, మిణ్. నక్షత్రం; మ. మిణుక్క. ప్రకాశించు, మెరియు, మిణ్ణల్. మెరుపు, మిన్ను. కాంతి, కర్ణాభరణాల్లో రాయి, మినుక్క. మెరియు, మిణుక్కుక. మెరుగుపెట్టు, మెరిసేటట్లుచేయు ; కో. మించ్-. (మించ్-). మెరియు, ప్రకాశించు, తళతళమను, మిన్. నక్షత్రం ; గోం. మింకో. మెరిసే నక్షత్రాలు; పర్జి. మిన్నల్. మెరుపు, మిడస్తానా, మిర్సుల్, మిర్కానా. మెరియు, ప్రకాశించు, మిడ్సా, మిర్పా. మెరుపు, మిర్కొ. మిడ్కొస్. నక్షత్రం ; కురు. బిన్కొ. నక్షత్రం ; మాల్తొ. బిండెక్. నక్షత్రం.

< మూ.ద్రా. *మిణ్.

మినుకంత విణ. కొంచెం, స్వల్పం. పరమ. 2.386. < మినుకు¹ + అంత. మినుకారు విణ. ప్రకాశించేటటువంటి. పరమ. 5.558. < మినుకు¹ + -ఆరు¹. మినుకుచునుండు (-ఉండు) అ.క్రి. మిడుకుచుండు. భాస్క.రా. అయోధ్యా. 199. మినుకుతెరువరులు వి.బ.వ. వేల్పులు. వేంక. ఆం. 20. మినుకుత్రోవరులు వి.బ.వ. వ్యోమగాములు, దేవతలు. మినుకుమినుకను రూ.చూ. మినుమినుకుమను. అ.క్రి. మినుక్కుమినుక్కని మెరయు. సారంగ. 1.124. మినుకుమినుకుమను రూ.చూ. మినుమినుకుమను. అ.క్రి. మినుక్కుమినుక్కుమని మెరయు. భాగ. 10పూ. 756. మినుకుమినుక్కను రూ.చూ. మినుమినుకుమను. అ.క్రి. మెరయు, ప్రకాశించు. మినుకుమినుక్కు వి. మినమినమనుకాంతి. రాజ.వి. 4.26. మినుకుమినుక్కుమను అ.క్రి. మినమినలాడు. మినుకురను రూ.చూ. మినుక్కురను. అ.క్రి. తళతళ ప్రకాశించు. < మినుకు¹ + అను. మినుకురు రూ.చూ. మినుక్కురు. వి. మెరవటంలో అయ్యే అనుకరణం. మినుమినుకను రూ. మినుమినుక్కను. అ.క్రి. మినుకుమినుకుమను. ఉ.హరి. 5.166. < మినుకు¹ + మినుకు¹ + అను, మినుమినుకుమను రూ. మినుకుమినుకను, మినుకుమినుకుమను, మినుకుమినుక్కను. అ. క్రి. నక్షత్రాలు మొ.వి స్వల్ప కాంతితో మెరయు. హర. 7.84. < మినుకు¹ + మినుకు¹ + అను. మినుమినుకు మినుకుమను అ.క్రి. నక్షత్రాలు మొ.వి కొంచెం కాంతితో ప్రకాశించు. పాండు. 5.188. < మిమకు¹ + మినుకు¹ + మినుకు¹ + అను. మినుమినుక్కను రూ.చూ. మినుమినుకను. అ.క్రి. మినుమినుకుమను. పి.శకు 1.118. < మినుకు¹ +

మినుకు[1] + అను. మినుమినుక్కు వి. మెరవటంలో అయ్యే అనుకరణం. హ.హరి. 5.166. < మినుకు[1] + మినుకు[1].

మినుకు[2] రూ. మిన్కు[2]. అ.క్రి. గొణుక్కొను. పండి.చ. 2.154 పు.; వి. వాక్కు, పలుకు, వేదవాక్కు. గౌ.హరి. పూ. 752 పం.

క. మినుకు. గొణుగు; తు. మిణ్కుని. అనంగి కారంగా హుంకరించు.

మినుకు(గొమ్మ(-కొమ్మ[2]) వి. సరస్వతి. అచలా. 2.41. మినుకు(జేడియ(-చేడియ) వి. సరస్వతి. పాండు. 5.174. మినుకుటూర్పులవా(డు విశ. వేదం నిశ్వాసంగా కలవాడు, విష్ణువు. పాండు. 1.213. మినుకుమందుచదువు వి. ఆయుర్వేదం. మినుకులదణి వి. 1. బ్రహ్మ; 2. సూర్యుడు. మినుకులబరణి వి. సూర్యుడు. పాండు. 5.185. మినుకులయిక్క (-ఇక్క) వి. 1. సూర్యుడు. అచ్చ.రా. కిష్కిం. 31; 2. బ్రహ్మ. మినుకులు వి.బ.వ. 1. వేదాలు; 2. వాక్కులు.

మినుక్కురను చూ. మినుక్కురు.

మినుక్కురు రూ. మినుకురు వి. తళతళ కాంతిలోని అనుకరణం. వసు. 4.128.

మినుక్కురను రూ. మినుకురను. అ.క్రి. తళుక్కుమని మెరయు. వసు. 4.128. < మినుక్కురు + అను.

మినుగురుపురుగు రూ.చూ. మిడు(గుఱు(బురువు. వి. రాత్రుల్లో అగ్గిలాగ మెరిసే ఒకరకం పురుగు.

మిను(గుఱు రూ.చూ. మిడు(గుఱు. వి. అగ్నికణం, పిడుగు.

మినుపపో(క చూ. మినుము.

మినుపసున్ని చూ. మినుము.

మినుమినుకను చూ. మినుకు[1].

మినుమినుకుమను చూ. మినుకు[1].

మినుమినుకుమినుకుమను చూ. మినుకు[1].

మినుమినుక్కను చూ. మినుకు[1].

మినుమినుక్కు చూ. మినుకు[1].

మినుము రూ. మిన్ము. వి. మాషసస్యం, ఒకరకం పైరు. భీమ. 3.57.

పర్జి. మీ(డ. మినుపులు; గ. మిన్‌దిక్. మినుకులు.

మినుపపో(క వి. భక్ష్యవిశేషం, ఒకరకం పిండివంట. హంస. 1.105. మినుపసున్ని వి. ఒకరకం తియ్యనిభక్ష్యం. మినుములు వి.బ.వ. ధాన్యవిశేషం, మాషాలు, ఉద్దులు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1384 (Phascolus mungo).

మిన్కు[1] రూ.చూ. మినుకు[1]. వి. 1. తళతళకాంతి, కాంతి. వసు. 1 6; 2. ఒకరకం బంగారునాణెం. శుక. 4.7; 3. కిరణం. హంస. 3.4; 4. పుస్తె, తాళిబొట్టు; 5. తళుకు; అ.క్రి. మినమిన ప్రకాశించు; విశ. మినమినకాంతికలది.

మిన్కుమిన్కుమను అ.క్రి. తళతళమను. కళా. 7.131.

మిన్కు[2] రూ.చూ. మినుకు[2]. అ.క్రి. గొణుగుకొను. పండి. చ. 2.154పు.; వి. వాక్కు, పలుకు, వేదవాక్కు. నీలా. 1.6.

మిన్కు(గొన (-కొన) వి. వేదాంతం, ఉపనిషత్తు. నీలా. 1.77. మిన్కులచదువరి వి. బ్రాహ్మణులు. వేదాలుచదివే వాడు. మిన్కులు రూ. చూ. మినుకులు. వి.బ.వ. 1. వేదాలు; 2. వాక్కులు.

మింది చూ. మీ(ద. విశ. మీది, పైభాగం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 644. క్రి.శ. 1150.

మిందె చూ. మీ(ద. వి. కాలిగుత్తివాపు.

మిన్న రూ. మిన్నా. విశ. 1. శ్రేష్ఠం, ప్రశస్తం. భార. అరణ్య. 3.179; 2. అధికం. అహల్యా. 1.34. 7; వి. 1. భూషణం. నగ. హర. 6. 113; 2. కాంతి. వేంక. పంచ. 4.370; 3. ధనం, నాణెం. ద్వి. పరమ. వి. 4.298. పం.; 4. అన్నుమిన్న మొ. వి. ఉ. రా. 1.316; 5. పాంచాలిక, బొమ్మ.

త. మిణ్ణాల్. ధనం, నాణెం.

మిన్నమిడు(గుఱులు వి. బ. వ. మెరిసే మిణుగురు పురుగులు. భార. అరణ్య. 3.179. మిన్నలమ్మ వి. మెరుము.

మిన్నక రూ.చూ. మిణ్ణక. అవ్య. 1. మాటాడక, ప్రతివచన మీయక. భార. ఆది. 4.148; 2. అనాయాసంగా, సులభంగా. భార ఆది. 8.36; 3. నిష్ప్రయోజనంగా. వ్యర్థంగా. భార.సభా. 2.133; 4. అప్రయత్నంగా, ప్రయత్నంలేక. భార. శాంతి. 4.374; 5. ఏమీచేయక, ప్రతిక్రియలేక. భీమ. 6.61; 6. కారణంలేక, నిష్కారణంగా. జైమిభా. 1.59.

మిన్నతి వి. గౌరవం. యయా. 5.143; వి బ.వ. ప్రగల్భ వచనాలు.

హిం. ఉ. అర. మిన్నత్. వినతి, ప్రార్థన.

< ఉ. మిన్నత్.

మిన్నందికొండ(దా(కు చూ. మిన్ను.

మిన్నందు చూ. మిన్ను.

మిన్నా రూ.చూ. మిన్న. వి. రత్నం. భాను. 4.38; విశ. శ్రేష్ఠం. అచలా. 3.31.

మిన్నీరు చూ. మిన్ను.

మిన్ను రూ. మిను, విను[2], విన్ను. వి. ఆకాశం. కు. సం. 1.52.

త. విణ్. ఆకాశం, స్వర్గం, మేఘం. విణ్ణు. ఆకాశం, మేఘం, స్వర్గం, గాలి, విణ్ణవణ్. స్వర్గవాసి, మ. విణ్ణు. ఆకాశం, స్వర్గం, విణ్ణవర్. దేవతలు; మాల్తో. బిన్యో. వరుణ దేవుడు. పో. చూ. త. మిన్;

పో. చూ. సం. వియత్.

< మూ. ద్రా. *విన్.

మింటముక్కిడివల రూ. చూ. మింటిముక్కిడివల. వి ఒకవల, చేపలుపట్టేవల. < మిన్ను + -అ[7] + ముక్కిడివల. మింట(బెట్టినదీపము వి. గొప్పతనం. < మిన్ను + -అ[7] + పెట్టినదీపము. మింటికా(పరులు వి. బ. వ. దివిషదులు. చంపురా. 2.3. < మిన్ను + -ఇ[3]- + యొక్క + కా(పరి + -లు. మింటికా(పురంబులవారు విశ. బ. వ. దివిషదులు, దేవతలు. ద్వి. పరమ. వి. 1.33. < మిన్ను + -ఇ[3] - + యొక్క + కా(పురంబులవారు. మింటికినేలకునూ(తపట్టు స.క్రి. అసాధ్యకార్యంచేయు. విప్ర. 4.28. < మిన్ను + - ఇ[3]- + కున్ + నేల + - కున్ +

సూ(త్రము + పట్టు. మింటికిమంటికిదారముపన్ను స.(క్రి. అసాధ్యకార్యం చేయు. ధర్మజ. 45పు. 11పం. <మిన్ను + -ఇ-$^3$- + -కున్ + మన్ను + -ఇ$^3$ + కున్ + దారము + పన్ను. మింటికిమంటికిసూ(త్రముపన్ను అ. (క్రి. అనందర్భాలోచనచేయు. సం. సూ(త్ర-. దారం. <మిన్ను + - ఇ$^3$- + మన్ను + - ఇ$^3$- + -కున్ + సం. సూ(త్ర- + - ము + పన్ను. మింటిచూలి వి. వాయువు. <మిన్ను + -ఇ-$^3$ + యొక్క + చూలు + -ఇ$^9$. మింటిచెట్టు వి. కల్పవృక్షం. < మిన్ను + - ఇ$^3$- + -ను + చెట్టు. మింటితెరువరి వి. **1**. అమరుడు. చం(ద్రాంగ ; **2**. ఖేచరుడు, సూర్యుడు : వి.బ.వ. దేవతలు. జాహ్నవీ. 1.138, <మిన్ను + -ఇ$^3$- + యొక్క + తెరువరి. మింటిపొడవగు అ.(క్రి. ఉన్నతమగు. తాళ్ల. సం. 5.75. <మిన్ను + - ఇ$^3$- + యొక్క + పొడవు + అగు. మింటిమానికము వి. అంబరమణి, సూర్యుడు. రామాభ్యు. 5.33. <మిన్ను + -ఇ$^3$- + యొక్క + మానికము. మింటిమాను వి. కల్పవృక్షం. వాల్మీ. 2.129. <మిన్ను + -ఇ$^3$- + యొక్క + మాను. మింటిముక్కిడివల రూ. మింటముక్కిడివల. వి. జాలవిశేషం, ఒకరకం వల. హంస. **4**.185. <మిన్ను + -ఇ$^3$- + -యొక్క + ముక్కిడివల. మింటిసికవేల్పు వి. వ్యోమకేశుడు, శివుడు. యయా. 5.138. <మిన్ను + -ఇ$^3$- + - యొక్క + సికవేల్పు. మిన్నందికొండ(దా(కు అ.(క్రి. మిక్కిలి ఆనందించు. విజయ. 2.20. <మిన్ను + -అందు + - ఇ$^{13}$ + కొండ + - ను + తా(కు. మిన్నందు అ.(క్రి. **1**. ఆకాశాన్నంటు, అతిశయించు. భార. ఉద్యో. 2.174 ; **2.** సంతోషంతో ఉప్పొంగు. పారి. 1.77. <మిన్ను + -అందు. మిన్నీరు వి. ఆకాశగంగ. కకుత్థ్స. **3**.5. <మిన్ను + నీరు. మిన్నుకొల(కు వి. సురదీర్ఘిక. ఆకాశగంగ. రామాభ్యు. 5.19. మిన్నుకొలను వి. సురదీర్ఘిక, ఆకాశగంగ. మిన్నుతలపై(బడినను అవ్య. (దు. ఎంతకష్టం కలిగినా. భార. (ద్రోణ. 2.245. మిన్నుదన్ను (-తన్ను) అ. (క్రి. సంతోషంతో ఉప్పొంగు. కాశ. 2.61. మిన్నుదా(కు (-తా(కు) వి. సంతోషంతో ఉప్పొంగు. హరి. పూ. **4**.20. మిన్నుమన్ను వి. భూమిఆకాశం, ద్యావాపృథువులు. మిన్నుమానికము వి. నభోమణి, సూర్యుడు. అచ్చ. రా. బాల. 205. మిన్నుముట్టు అ.(క్రి. **1.** ఆకాశాన్నంటు, సంతోషంతో ఉప్పొంగు. మను. 2.109 ; **2**. అతిశయించు. మిన్నుమోచు అ.(క్రి. ఆకాశాన్నంటు. పాండు. 3.153. మిన్నుమన్నులపొడవులు వి.బ.వ. అత్యున్నతాలు. తాళ్ల. సం. 9.249. మిన్నులబాయు అ.(క్రి. దుముకు. అతివేగంగాపోవు. తాళ్ల. నం. 5.119. మిన్నులమోచు అ.(క్రి. ఆకాశాన్నంటు. తాళ్ల. సం. **4**.16. మిన్నులాడు అ.(క్రి. కమ్ముకొను, విస్తరిల్లు. <మిన్ను + -లు + ఆడు. మిన్నులుముట్టు అ. (క్రి. **1**. సంతోషించు. కాశ. **4**.93 ; **2**. అతిశయించు. మిన్నులురాయు అ.(క్రి. ఆకాశాన్నంటు, చాలఎత్తైన. జైమినిభా. 1.57. మిన్నులువడ్డచోటు (-పడ్డచోటు) వి. ఆకాశం వాలిన చోటు, భూమి ఆకాశం కలిసినట్లు కనపడేచోటు, అతిదూరప్రదేశం. కాశీ. 2.156. మిన్నులొరయు అ.(క్రి. ఆకాశమంటు. రాజగో. 5.5. <మిన్ను + -లు + ఒరయు. మిన్నువా(క రూ.చూ. మినువా(క. వి. ఆకాశగంగ, స్వర్ణది. ఆం. నా. సం. దేవ. **33**. మిన్నువా(కతాలుపు రూ. మిన్నువా(క తాల్పు. వి. గంగాధరుడు, ఈశ్వరుడు. ఆం. నా. సం. దేవ. 6. మిన్నువా(కతాల్పు రూ.చూ. మిన్నువా(కతాలుపు. వి. గంగాధరుడు, శివుడు. మిన్నువా(కతో(బుట్టువు వి. శూ(ద్రుడు. మిన్నువా(కదారి వి. శివుడు. మిన్నువిరిగిమీ(ద(బడు అ.(క్రి. ఆపత్తు తటస్థించు. మిన్ను(వీల(గనార్చు అ.(క్రి. ఆకాశం పగిలేటట్లు అరుచు. ఉ. గట్టిగా అరుచు. ఉ. హరి. **4**.**246**. మన్ను(వేయు అ.(క్రి. బయలప్పళించు. నిర్వ. రా. 6.145. మిన్నెక్కు అ.(క్రి. ఆకాశాన్నంటు. రామాభ్యు. 8.**3**. మిన్ను + ఎక్కు. మిన్నేటికొడుకు వి. భీష్ముడు. భార. భీష్మ. **3**.**224**.(గంగాదేవికొడుకు). <మిన్ను + ఏఱు + -ఇ$^3$- + - యొక్క + కొడుకు. మిన్నేటితలవా(డు విణ. శివుడు, గంగాధరుడు. <మిన్ను + -ఇ$^3$ - + యొక్క + తలవా(డు. మిన్నేటితాలుపు వి. శివుడు. గంగాధరుడు. <మిన్ను + ఏఱు + -ఇ$^3$ - + యొక్క + తాలుపు. మిన్నేఱు వి. ఔ. ఆకాశగంగ. కు. సం. **4**.**44**. < మిన్ను + ఏఱు. మిన్వాక రూ.చూ. మినువా(క. వి. ఆకాశగంగ. నీలా. 2.76.

మిన్నెక్కు చూ. మిన్ను.

మిన్నేటికొడుకు చూ. మిన్ను.

మిన్నేటితలవా(డు చూ. మిన్ను.

మిన్నేటితాలుపు చూ. మిన్ను.

మిన్నేఱు చూ. మిన్ను.

మిన్ము రూ.చూ. మినుము. వి. మాషసస్యం, ఒకరకం పైరు.

మిన్వాక చూ. మిన్ను.

మిము చూ. మీరు.

మిమ్మటము విణ. మిక్కుటం, ముమ్మరం పాండు. **5**.**275**.

మిమ్ము చూ. మీరు.

మియా రూ. మియ్య, మియ్యా. వి. **1**. గౌరవపూర్వకంగా పదం చివర చేర్చబడే మాట. యయా. 1.19 ; **2**. స్వామి, యజమానుడు.

హిం.ఉ. మియా(. స్వామి, మునల్మాను, యజమాని ; పార. మియాన్. గౌరవపూర్వకంగా చేసే సంబోధనం. <ఉ. మియా(.

మియ్య రూ.చూ. మియా. వి. స్వామి.

మియ్యా రూ.చూ. మియా. వి. స్వామి.

మిరప వి. పోర్చుగీసు వారిచే మనదేశానికి తేబడిన (బెజిల్ దేశపు కాయపైరు, కాయలు వంటకాలు మొ. వాటిలో ఉపయోగిస్తారు (Capsicum annum).

మిరపకాం(డ రూ. మిరెపకాం(డ. వి. ఒకరకం చెట్టు (Scopolia kamdra). మిరపకాయ రూ. మిరెపకాయ. వి. బృహన్మరీచం, మిరపకాయ. మిరపకాయపంట్లు వి.బ.వ. రెండుచేతుల్లో రెండు పట్టుకొని మిరపకు నీళ్ళు పోయటానికి అనువుగా ఉండే నీళ్ళ కడవలు. మిరపగం(ద వి. సామాను తయారీకి ఉపయోగపడే కలప కలిగి తెల్లనిపూలు పూసే చెట్టు. మిరపపండురంగు వి. ముదురు ఎరుపురంగు,

పండుమిరపకాయరంగు. మిరపపండ్లరంగు రూ. మిరప్పండ్ల రంగు. వి. మిరప్పండురంగు, ముదురు ఎరుపురంగు. మిరపపూలంచు వి. ఒకరకం డిజైనులో నేసిన అంచు. మిరపపూలు వి. అంచులో నేసే ఒకరకం డిజైను. మిరపలం వి. మిరపచెట్టు మాదిరిగా పెరిగే ఒకరకం కలుపుమొక్క (Cronton). < మిరప + అలం. మిరప్పండ్లరంగు వి. ముదురు ఎరుపురంగు, పండు మిరపకాయ రంగు. < మిరప + పండు + -లు + - అ[13] + రంగు. మిరప్పూ అంచు వి. ఒకరకం డిజైనులో నేసిన అంచు < మిరప + పూ + అంచు[3].

మిరప్పండ్లరంగు చూ. మిరప.

మిరప్పూఅంచు చూ. మిరప.

మిరమిరలాడు అ.క్రి. దృష్టి చెదరు.

మిరాట్‌ఖ్లాకు చూ. మరాట్. వి. చేత్తో డిజైను అద్దే ఒకరకం కొయ్య అచ్చు.

మిరాశ రూ.చూ. మిరాశి. వి. ప్రాచీనరాజుల, కరణాల గ్రామాల సరిహద్దుల వివరాలు.

మిరాశి రూ. మిరాశ, మిరాశీ, మిరాసి, మిరాసీ. వి. 1. వంశ పారంపర్యంగా వచ్చే గ్రామోద్యోగం. ఆనంద. పీఠి. 37 ; 2. పారంపర్యంగా వచ్చే సొత్తు, హక్కు.

హిం. మీరాస్. ; మరా. మిరాస. ; ఉ.పార. మిరాసీ. ; అర. మిరాసీ,

< ఉ. మీరాసీ.

మిరాశిదారు రూ. మిరాసిదారు, మిరాసిదారుడు. వి. మిరాశి కలవాడు, వంశపారంపర్యంగా వచ్చే గ్రామోద్యోగం కలవాడు.

మిరాశీ రూ.చూ. మిరాశి. వి. ప్రాచీన రాజులకు, కరణాలకు సంబంధించిన సరిహద్దుల వివరాలు.

మిరాసి రూ.చూ. మిరాశి. వి. 1. స్వల్పతీరువగల భూమి ; 2. పారంపర్యంగా వచ్చిన సొత్తు ; 3. ఊరిఆసాముల ఇళ్ళను కుమ్మర్లు పంచుకొని వారికి కావలసిన కుండలను ఇచ్చే హక్కు.

మిరాసిదారు రూ.చూ. మిరాశిదారు. విణ. వంశ పారంపర్యంగా వచ్చే గ్రామోద్యోగం కలవాడు. చంద్రరే. 1.32. మిరాసిదారుడు రూ.చూ. మిరాశిదారు. వి. పంట కాలంలో గింజలు తీసుకొని గ్రామంలో కొన్ని ఇళ్ళకు మట్టిపాత్రలు సరఫరాచేసే హక్కును పంచుకొన్న కుమ్మరి.

మిరాసీ రూ.చూ. మిరాశి. వి. వంశపారంపర్యంగా సంక్ర మించే హక్కు.

మిరిచూపు వి. పైచూపు, ఊర్ధ్వదృష్టి.

మిరిజా రూ. మిరిజాయి, మిరుజా. వి. మగవాళ్ళు ధరించే పొడుగ్గా వదులుగా ఉండే జాకెట్టు.

హిం. మిర్‌జాయీ. జాకెట్టు, జెర్కిన్ ; ఉ.పార. మిర్‌జ్‌ఈ. పొడుగ్గా వదులుగా ఉండే, చేతులుగల స్వదేశీ రవికె.

< ఉ. మిర్‌జ్‌ఈ.

మిరిజాయి రూ.చూ. మిరిజా. వి. మగవాళ్ళు ధరించే, పొడుగ్గా వదులుగా ఉండే జాకెట్టు.

మిరిపిండి వి. ఎర్రని పూలుపూసే మొక్క.

మిరిమిడి రూ.చూ. మిఱిమిఱి. వి. 1. మిరుమిట్లు కొల్పటం, తళతళ, మెరుపు ; 2. మెరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

మిరియం వి. 1. నూలు చిలపకు అచ్చు అద్దిన రంగుచెక్క ; 2. రెండు రంగుల కలయిక.

ఇం. *Medium*. మధ్య, మాధ్యమమైన.

< ఇం. Medium.

మిరియము రూ. మిరెము, మిరెయము, మిర్యము. వి. 1. మరీచం, ఒకరకం సంబారు వస్తువు. దాక్షారామ శాసనం. క్రీ.శ. 1084 ; 2. మరీచిలత, మిరియంతీగ. ఉ.రా. 6.24 (Piper nigrum).

సం. మరీచ-, మిరికా. మిరియం ; ప్రా. మిరిఅ-, మరిచ- ; అ.మా. మిరియ- ; పా. మరిచ- ; ఒ. మిరియల్ ;

క. మెణసు, మెళసు, వెళసు ; తు. ముణచి, మెళసు ; త. అమిరమ్, అరిచమ్, అరిచు. మిరియం ; మ. మిళగు, ముళగు, మిర్జి. మిర్చి ; పర్జి. మిరి ; ఒరయాన్. మార్చ్, మిరిచ్.

< ప్రా. మిరిఅ-.

మిరియాలపేరు వి. మిరియాల్లాంటి బంగారుగుళ్ళతో తయారు చేసిన హారం, ఆభరణవిశేషం.

మిరియాలపేరు చూ. మిరియము.

మిరు రూ.చూ. మిట్టు. వి. మెట్ట, వర్షాధారంతో పండే నేల.

మిరునేల వి. మెట్ట, వర్షాధారంతో పండే నేల.

మిరుగు రూ.చూ. మెఱుగు. వి. 1. వాన మబ్బుల్లో తళుక్కున వెలిగే విద్యుత్తు ; 2. నిప్పురవ్వ.

మిరుజా రూ.చూ. మిరిజా. వి. మగవాళ్ళు ధరించే, పొడుగ్గా వదులుగా ఉండే జాకెట్టు.

మిరెపకాంగ్రడ చూ. మిరెము.

మిరెపకాయ చూ మిరెము.

మిరెము రూ.చూ. మిరియము. వి. 1. మరీచం, ఒకరకం సంబారువస్తువు ; 2. కారంగా ఉండే గింజలు కాసే తీగ (Piper nigrum).

మిరెపకాంగ్రడ రూ. మిరపకాంగ్రడ. వి. కంటకవృక్ష విశేషం, ఒకరకం ముళ్ళచెట్టు. < మిరెము + కాంగ్రడ. మిరెపకాయ రూ.చూ. మిరపకాయ. వి. బ్రహన్మరీచం, కారంగల ఒకకాయ. < మిరెము + కాయ.

మిరెయము రూ.చూ. మిరియము. వి. 1. మరీచం, ఒకరక మైన సంబారువస్తువు ; 2. మరీచిలత, మిరియపు తీగ.

మిర్గు వి. మృగశిరకార్తె.

సం మృగశీర్షా. అయిదోకార్తె, అయిదో నక్షత్రం.

< సం. మృగశీర్షా.

మిర్గుకత్తెర వి. మృగశిరకార్తెలో ఉన్ని కత్తిరించటం.

మిర్చి రూ. మిడ్చి. వి. 1. కారంగా ఉండే కాయలుకాసే మొక్క ; 2. మిరపకాయ (Capsicum frutescens).

మిర్చిరంగు రూ. మిడ్చిరంగు, మెర్మిరంగు. వి. 1.

మిరపపండు రంగు ; **2.** ఆరుద్రపురుగు రంగు. మిర్చిరేణి రేగులో భేదం.

**మిర్మిట్టులుగొల్పు** రూ.చూ. మిర్మిట్లుగొలుపు. స.క్రి. దృష్టిని చెదరజేయు.

**మిర్మిట్లు** రూ.చూ. మిఱుమిట్లు. వి.బ.వ. **1.** కళ్ళు ఎక్కువగా చలించటం ; **2.** మెరపు మొ. వాటిని చూడటంవల్ల కలిగే దృష్టి చలనం.

**మిర్మిట్లుగొను** రూ.చూ. మిఱుమిట్లుగొను. అ.క్రి. మెరపు మొ. వాటి ఎక్కువ కాంతిని చూడటంవల్ల దృష్టి మిక్కిలి చెదరు, కళ్ళు చీకట్లు కమ్ము. భాగ. 10 ఉ. 1306. **మిర్మిట్లుగొలుపు** రూ. మిర్మిట్టులుగొల్పు, మిర్మిట్లుగొల్పు, మిఱుమిట్టుగొలుపు, మిఱుమిట్టులుగొలుపు, మిఱుమిట్లుగొలుపు, మిఱుమిట్లుగొల్పు.స.క్రి. దృష్టిని చెదరజేయు. భాగ. 3.604.

**మిర్మిడి** రూ.చూ. మిఱిమిఱి. వి. **1.** తళతళ మెరుపు ; **2.** మెరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**మిర్మిరంగు** రూ.చూ. మిర్చిరంగు. వి. **1.** మిరపపండురంగు ; **2.** ఆరుద్రపురుగురంగు.

**మిర్యము** రూ.చూ. మిరియము. వి. మరీచం, ఒకరకం సంబారు వస్తువు.

**మిర్రు** రూ.చూ. మిట్టు. వి. మెట్టభూమి.

**మిర్రుకొయ్య** వి. దోనెకొయ్య, అచ్చు పోసిన పచ్చి పెంకును వంచే సాధనం. **మిర్రుపడవ** వి. ఎత్తుపల్లాలు. **మిర్రుమోము** వి. ఊర్ధ్వముఖం.

**మిఱిమిడి** రూ.చూ. మిఱిమిఱి. వి. దురవలోకప్రభ, చూడ శక్యంకాని వెలుగు. ఆం.భా. 1.82.

**మిఱిమిఱి** రూ. మిరిమిడి, మిర్మిడి, మిఱిమిడి. వి. **1.** తళతళ ఆం.పదా.సురా. 22 ; **2.** విద్యుత్తు. ఆం.పదా.సురా. 45.

**మిఱు**[1] రూ.చూ. మిట్టు. వి. ఉన్నతభూమి, మెట్ట. పి.శకు. 3.150 ; విశ. ఉన్నతం, సోయగం.

**మిఱుపల్లములు** వి.బ.వ. మిట్టపల్లాలు. తాళ్ల.సం. 5.115.

**మిఱు**[2] విశ. చలించేది. భాగ. 8.717.

**మిఱుమిట్టుగొలుపు** రూ.చూ. మిర్మిట్లుగొలుపు. స.క్రి. దృష్టిని చెదరజేయు. విజయ. 3.14. **మిఱుమిట్టులు** రూ.చూ. మిఱుమిట్లు. వి.బ.వ. **1.** కళ్ళు ఎక్కువగా చలించటం ; **2.** మెరపు మొ. వాటిని చూడటంవల్ల కలిగే దృష్టి చలనం. **మిఱుమిట్టులుగొలుపు (-కొలుపు)** రూ.చూ. మిర్మిట్లుగొలుపు. స.క్రి. దృష్టిని చెదరజేయు. **మిఱుమిట్లు** రూ. మిర్మిట్లు, మిఱుమిట్టులు. వి.బ.వ. **1.** మెరపు మొ. వాటిని చూడటం వల్ల కలిగే దృష్టి చలనం. కు.సం. 1.36 ; **2.** కళ్ళు ఎక్కువగా చలించటం. భోజ. 4.287. **మిఱుమిట్లుగొను (-కొను)** రూ. మిర్మిట్లుగొను. అ.క్రి. మెరపు మొ. వాటి ఎక్కువ కాంతిని చూడటంవల్ల దృష్టి మిక్కిలిచెదురు, కన్నులు చీకట్లు కమ్ము. భార.విరా. 4.114. **మిఱుమిట్లు గొలుపు** రూ.చూ. మిర్మిట్లుగొలుపు. స.క్రి. దృష్టిని చెదర జేయు. కళా. 8.41. **మిఱుమిట్లుగొల్పు** రూ.చూ. మిర్మిట్లు గొలుపు. స.క్రి. దృష్టిని చెదరజేయు. ఉ.రా. 4.189. **మిఱుమిట్లువోవు (-పోవు)** అ.క్రి. మిరుమిట్లుగొను. కు.సం. 1.36. **మిఱుమిఱు** విశ. మిక్కిలి చంచలమైంది, మిక్కిలి చలించేది. భాగ. 9.608.

**మిట్టు** రూ.చూ. మిట్టు. వి. మెట్ట.

**మిట్టిగాఁడు** చూ. మిట్టు.

**మిట్టు** రూ. మిరు, మిర్రు, మిఱు[1], మిట్టు. వి.ప్రా.అనా. మిట్ట, ఉన్నతభూమి. భార.విరా. 2.321.

**మిట్టిగాఁడు** వి. **1.** గర్వి, పొగరుబోతు ; **2** గజ్జి. **మిట్టుచూపు** వి. ఊర్ధ్వ దృష్టి, పై చూపు. **మిట్టెడు.** వి. శిఖరం.

**మిట్టెడు** చూ. మిట్టు.

**మిలమిల** వి. **1.** మృదు వస్తువులు మొ. వి మెదలటం, మెలగటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. భార.ద్రోణ. 1.386 ; **2.** తళతళకాంతి. భీమ. 1.117 ; **3.** తళతళ మెరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. శ్రీరం.మా. 2.254. ధ్వన్యను.

**మిలమిలన** వి. మిలమిలమనే కాంతి విశేషం. బహులా. 4.18. **మిలమిలమను** అ.క్రి. మిలమిలలాడు, మిలమిల ప్రకాశించు. వరాహ. 4.155. <మిలమిల + అను. **మిలమిల మెదలు** అ.క్రి. మిలమిల అని మెదలు. భార. మౌసల. 21. ధ్వన్యను. **మిలమిలలాడు** అ. క్రి. తళతళ ప్రకాశించు. అచ్చ.రా.సుందర. 22. <మిలమిల + -లు + ఆడు.

**మిలాయించు** స.క్రి. కలుపు, కూర్చు.

హిం. మిలానా. కలపటం.

<హిం. మిలా(నా) + -ఇంచు[3].

**మిలు** రూ.చూ. మీలు. వి.బ.వ. చేపలు.

**మిలువార్లదబ్బ** వి. దండెగాడి, ఎదగొర్రు, నొగలమీద బిగించిన అడ్డపట్టె.

**మిల్లి** రూ. మిళ్ళి, మిళ్లెన. వి. చాలా చిన్నగరిటె. ఆం.భా. 2.243.

క. మిణ్ణి, మిళ్ళి. గరిటె, తెడ్డు, పానపాత్ర ; తు మిళ్ళి. చిన్న లోహపాత్ర.

**మిల్లు** వి. మర, యంత్రం, మిషన్.

ఇం. *Mill.* మర, యంత్రం.

<ఇం. Mill.

**మిల్లునూలు** వి. మిల్లులో యంత్రాలమీద తయారైన నూలు.

**మిళిగె** వి. కొరడా, చేరుకోల. ప్రభు. 3.92 పు. 20 పం.

క. మిణి, మిళి, మిళిగె. తోలుతాడు, తోలుపట్టీ.

<క. మిళిగె.

**మిళ్ళి** రూ.చూ. మిల్లి. వి. **1.** చిన్నగరిటె ; **2.** పసిపిల్లలు ఆడుకొనే చిన్న చెంబు ; **3.** చిన్నది.

**మిళ్ళిగరిటె** వి. చాలా చిన్నగరిటె.

**మిళ్ళింతలు** వి.బ.వ. దగా, మోసం, వంచన.

**మిళ్లెన** రూ.చూ. మిల్లి. వి. చిన్నగరిటె.

**మివులు** రూ.చూ. మిగులు. క్రి.విశ.ద్రు. అత్యంతం. ప్రభా. 4.122.

**మిశనం** వి. ఇసుక, మసి మొ.వి చేర్చి కలిపిన మట్టి.

సం. మిశ్ర-. కలిసిన ; ప్రా. మిస్స-, మిస- ; పా. మిస్స-.

<సం. మి[శ-.

**మిశాన** వి. జీవనోపాధి, బతుకుతెరువు. నె. శా. దర్శి. 15. [క్రీ.శ. 1542.

**మి[శి** వి. బీరకాయ పీచులాగా చాయగల కత్తి, ఈజిప్టుదేశపు ఖడ్గం. ఖడ్గ. 65.

హిం. మిస్రీ, మిసీ. మి[దదేశ సంబంధమైన ; ఉ. మిస్రీ. ఈజిప్టుదేశ సంబంధమైన ; పార. మిస్రీ. ఈజిప్టు దేశపు కత్తి.

<ఉ. మి[సీ.

**మిష** వి. సాకు.

సం. మిష-, మృషా. అసత్యం, మిషేణ, మిషాత్, మిషతః. నెపంతో.

<సం. మిష- (అర్థవిపరి.).

**మిషనంచు** చూ. మిషను.

**మిషనాసుమాను** చూ. మిషను.

**మిషను** రూ. మిసను. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గం పైన అమర్చే యం[తం.

ఇం. *Mission.* యం[తం.

<ఇం. Mission.

**మిషనంచు** రూ. మిసనంచు. వి. మొగ్గ, ఏటవాలు గీరలు, ఒంటి కటారు వరసగా పడేట్టు నేసిన అంచు. <మిషను + అంచు³. **మిషనాసుమాను** రూ.చూ. బిషనాసుమాను. వి. పెద్దపడుగులో ఒకేసారి పోసే ఒకరకం ఆను. <మిషను + ఆసుమాను. **మిషనుకత్తి** రూ. మిసనుకత్తి. వి. డాబీ కోలల్ని పైకి లేపటానికి దిండు చ[క్రాన్ని, కొన్ని చోట్ల దిండు గాడిని గుంజే ఇనపరేకు. **మిషనుడాబీ** వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి వాడే ఒకరకం డాబీ. **మిషనునూలు** రూ. మిసనునూలు. వి. మిల్లులో యం[త్రాల మీద తయారైన నూలు.

**మిష్కత్** రూ.చూ. మిష్కతు. వి మహమ్మదీయుల పవి[త [గంథం.

**మిష్కతు** రూ. మిష్కత్. వి. మహమ్మదీయుల పవి[త [గంథం.

ఉ.అర. మషీఖత్, మష్యఖత్. పెద్దవాడు, ముసలివాఁడు, యువరాజులు, పండితులు, అధ్యక్షులు, [ప్రధాన పూజారులు.

<ఉ. మషీఖత్.

**మిస** వి. కాంతి విశేషం. ఒకరకం కాంతి. హంస. 2.98.

**మిసనంచు** చూ. మిసను.

**మిసను** రూ.చూ. మిషను. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యం[తం.

**మిసనంచు** రూ.చూ. మిషనంచు. వి. మొగ్గ, ఏటవాలు గీరలు, ఒంటికటారు వరసగా పడేట్టు నేసిన అంచు. <మిసను + అంచు³. **మిసనుకత్తి** రూ.చూ. మిషనుకత్తి. వి. డాబీ కోలల్ని పైకి లేపటానికి దిండుచ[క్రాన్ని కొన్నిచోట్ల దిండుగాడిని గుంజే ఇనపరేకు. **మిసనునూలు** రూ.చూ. మిషనునూలు. వి. మిల్లులో యం[త్రాలమీద తయారయిన నూలు.

**మిసమిస** వి. 1. మెరవటంలోని అనుకరణం. భాగ. 10ఉ. 676 ; 2. అధికకాంతి. సారంగ. 2.42, సమీర. 3.98.

క. మిసుగు. మెరియు, [ప్రకాశించు. వి. [ప్రకాశం. మెరుపు, మిసిసు. [ప్రకాశింపచేయు, మిసుని. మెరిసే లోహం, బంగారం ;

పో.చూ.[పా. మిసమిస-, మిసిమిస-. మెరుపు, [ప్రకాశం. **మిసమిసను** రూ.చూ. మిసమిసమను. అ.[క్రి. కాంతికలదగు. **మిసమిసమను** రూ. మిసమిసను. అ.[క్రి. మిసమిస [ప్రకాశించు. వరాహ. 2.45. గౌ.హరి.పూ. 1103 పం.< మిసమిస + అను. **మిసమిసలాడు** అ.[క్రి. నిండు బిగువుతో కళకళలాడు. <మిసమిస + -లు + ఆడు.

**మిసల్** రూ. మిస్సల్. వి. 1. ఉద్యోగం ; 2. కార్యాలయం.

హిం. మిసాల్. పోలిక, ఉదాహరణ, ఉపమానం, నీతివాక్యం ; ఉ.అర. మిస్ల్. చిన్నకథ, ఉపమానం, రూపకం. పొడుపుకథ, ఉద్యోగం, ఉదాహరణ, డిపార్టుమెంటు, స్టేషను ;

త. మిచల్.

<ఉ. మిస్ల్.

**మిసల్దార్లు** వి.బ.వ. ఉద్యోగులు.

ఉ.అర. మిసల్-దార్. మిసలు కలిగినవాడు.

**మిసాల్** వి. 1. సామ్యం. నె.శా. ఉదయగిరి. 27. [క్రీ.శ. 1661 – 62 ; 2. చి[తం, నమూనా.

హిం.ఉ. మిసాల్, నమూనా, ఉదాహరణ ; పార. మిసాల్ ; అర. మిసాల్.

<ఉ. మిసాల్.

**మిసి**[1] రూ.చూ. మిసిమి. వి. కాంతి విశేషం. హంస. 1.85.

**మిసిమిసి**[1] వి. అధికకాంతి. నవనాథ. 146 పు. 26 పం.

**మిసి**[2] వి. మత్స్య విశేషం. హంస. 4.187.

**మిసికల్లు** వి. ఒకరకం చేప.

**మిసిగు** అవ్య. మాటిమాటికి.

**మిసిమి** రూ. మిసి[1]. వి. 1. నవనీతం, వెన్న. శృం.నై 6.130 ; 2. కాంతివిశేషం, లావణ్యం. శృం.నై. 8.193 ; 3. పళ్ళకప్పు, చం[దాంగ. 5.49 ; 4. భాగ్యం ; సంపద రామలిం.శ. 48 ; విణ. 1. స్నిగ్ధం, నున్ననిది. రాజవా 5.87 ; 2. లావణ్యం ఉన్నది, తళతళలాడేది. ఉ.రా 5.270.

హిం. మిస్మీ, మిస్సీ. పళ్ళకప్పు ; ఉ. మిసీ. పళ్ళకప్పు ; పార. మిసీ. హిందూదేశంలో పళ్ళకు చేసుకొనే రంగు.

<ఉ. మిసీ.

**మిసిమింతలు** వి.బ వ. వెలవెలపోవటాలు.

**మిసిమింతుఁడు** వి. [శమనొందేవాడు, అలసినవాడు. భార. భీష్మ. 3.398.

**మిసిమింతురాలు** వి. [శమనొందేది, అలసినది. హర. 3.85.

**మిసిమిలా** విణ. దయాళువైన. విశ్వే. శ.

ఉ. బిస్మిల్లాహ్. బిస్మిల్. గాయపడినవాడు, అల్లాహ్. దేవుడు.

<ఉ. బిస్మిల్లాహ్.

**మిసిమిసి**[2] వి. మేక చేసే ధ్వనికి అనుకరణం. భాగ. 9.572.

**మిసుకు** రూ. మిసుగు. అ.క్రి. **1**. కదలు, చలించు. నిరంకు. 3.17 ; **2**. వడకు, భయపడు. పాంచాలీ. 5.52.

క. మిసుకు. కదలు ; తు. మిసుకుని ; తొ. మిస్క్.

మూ.ద.ద్రా. *మిచ్-/ *మిత్.

**మిసుగు** రూ.చూ. మిసుకు. అ.క్రి. **1.** కదలు, చలించు ; **2**. వడకు, భయపడు.

**మిసునమగ్గం** రూ. బిసనుమగ్గం, బిసమగ్గం, బినుమగ్గం. వి. ఒక రకం మగ్గం.

ఇం. *Mission*. యంత్రం.

< ఇం. Mission + మగ్గము.

**మిస్కొట్టు** అ.క్రి. వెళ్ళకుండా ఉండు.

ఇం. *Miss*. తప్పుకొను.

< ఇం. Miss + కొట్టు[1].

**మిస్సమ్మగడిచీర** వి. ఒకరకం నల్చదరపు గడిచీర.

**మిస్సియాన్** వి. సంఘం, సమాజం.

పో. మిస్సియాన్. ధర్మప్రచారక సంఘం; స్పా. మీసియోన్.

< పో. మిన్సయాన్.

**మిస్సల్** రూ.చూ. మిసల్. వి. **1**. ఉద్యోగం ; **2**. కార్యాలయం.

**మిహి** విణ. **1**. ప్రశస్తం, చొక్కం. మను. 4.28 ; **2**. స్నిగ్ధం, నున్ననిది. ఆం.భా. 2.252 ; **3**. కొత్త, నూతనం. ఆం.భా. 3.23.

ఉ. మిహ్. గొప్పదయిన ; పార. మిహ్. గొప్పదైన, మంచు ;

క. మిసుకు.

< ఉ. మిహ్.

**మిహిమల** వి. మేరుపర్వతం. ఉ.రా. 4.46.

**మీ**[1] చూ. మీరు.

**మీ-**[2] విణ. వృత్తిలో మీఁది శబ్దంలో తొలి అచ్చుమీది వర్ణాలు లోపించగా మిగిలిన రూపం. ఉదా. మీఁగడ, మీఁజేయి మొ.వి.

క. మీ, మే. ఉపరిభాగం ; త. మీ. ఉపరిభాగం, ఎత్తు.

**మీఁగడ** చూ. మీఁదు.

**మీఁగడకట్టు** చూ. మీఁదు.

**మీఁగడఁగట్టించు** చూ. మీఁదు.

**మీఁగడతెర** చూ. మీఁదు.

**మీఁగడపెరుగు** చూ. మీఁదు.

**మీఁగడిసుక** వి. మన్ను పాకంగా చేయటానికి మసితోపాటు కలిపే మెత్తని ఇసుక.

< మీఁగడ + ఇసుక.

**మీఁగండ్లమెకము** చూ. మీఁదు.

**మీఁగయి** చూ. మీఁదు.

**మీఁగాలు** చూ. మీఁదు.

**మీఁజెయి** చూ. మీఁదు.

**మీఁజేయి** చూ. మీఁదు.

**మీట** వి. **1**. ఏతంమాను కిందకి మీదకి ఆడటానికి ఆధారమైన చీల. ఆం.భా. 2.293 ; **2**. పంటచేలో తిరిగే ఎలుకల్ని పట్టటానికి పెట్టే ఒకరకం బోను ; **3**. బరువుల్ని మీటించే కొయ్య.

క. మీంటు. ఏతంమాను ; త. మింటి.

**మీటకోల** వి. ఆసుకొయ్యల్లో మొదటి కొయ్య, కోల కొయ్య.

**మీటరు**[1] వి. **1**. లెవల్ బాటలు, నేలమట్టం సరిచూడటానికి టీటి లాగా ఉపయోగపడే తాపీ పనివాళ్ళ పరికరం ; **2**. 100 సెంటిమీటర్ల ప్రమాణం.

ఇం. *Metre*. పొడవును కొలిచే ప్రమాణం.

< ఇం. Metre.

**మీటర్గడి పరికరం** వి. ఖద్దరునూలు, మీటరు పొడుగున చిలపలుగా చుట్టటానికి వాడే పనిముట్టు.

**మీటరు**[2] వి. కరెంటును కొలిచే సాధన విశేషం.

ఇం. Meter. నీళ్ళు, గాస్ మొ. వాటిని కొలిచే సాధన విశేషం.

< ఇం. Meter.

**మీటరుగేజి** వి. రెండుపట్టాలమధ్య మీటరు వెడల్పు దూరం ఉండే రైలుమార్గం.

ఇం. *Metre gauge*. మీటరు పరిమాణం.

< ఇం. Metre gauge.

**మీటర్గడిపరికరం** చూ. మీటరు[1].

**మీటింగు** వి. సమావేశం, సభ, కూటమి.

ఇం. *Meeting*. సమావేశం, కలయిక.

< ఇం. Meeting.

**మీఁటగు** చూ. మీఁటు.

**మీఁటు** స.క్రి. **1**. పెరకు, ఊడదీయు. కు. సం. 2.82 ; **2**. (తేలు) కుట్టు. సుమతి. 31 ; **3**. ఎగజిమ్ము. భీమ. 2.39 ; **4**. వీణ మొ. వాటిని వాయించు, మోగించు. భీమ. 5.103 ; **5**. తోయు, తట్టు, వేలితోకొట్టు. క్రీడా. 104 ; **6**. తీసివేయు, పోగొట్టు. విక్ర. 8.96 ; **7**. ఏయు, (బాణాదుల్ని) ప్రయోగించు. మధుసేనము. 1.145 ; **8**. విడచు, త్యజించు. కువ. చ. 4.71 ; **9**. పోగొట్టు, తేలికగా పోగొట్టు. నీలా. 1.12 ; వి. **1**. ఎదురుపాటు, ఉద్రేకం. భార. ఉద్యో. 4.407 ; **2**. సొగసు. వాల్మీ. 3.119, కకుత్స్థ. 3.143 ; **3**. వీణ. మొ. వాటిని మీటటం. వాల్మీ. 3.139 ; **4**. మల్లవిద్యా విశేషం. ప్రబంధ 786 ; విణ. **1**. (తత్కాలానికి) ఉచితం, తగినది. భాగ. 8.331 ; **2**. పెద్దదైన, గొప్పదైన. ఆము. 2.54 ; **3**. శ్రేష్ఠమైన. వసు. 1.111 ; **4**. అందమైన, ఒప్పైన. చంద్రాంగ. 1.8.

క. మిడి, మీటు, మింటు. వేలికొనలతో వీణ. మొ. వాటినివాయించు, పెరుకు, పైకెత్తు; తు. మీంటుని. ఎగజిమ్ము, మీటుని ; త. మీటు, మీట్టు. వీణ. మొ. వాటిని వాయించు. మీళ్, (మీట్ట్), మీట్టు. విడుదలచేయు ; మ. మిటిక్క, మీట్టుక, మీంటుక. లాగు, పెరుకు, మీటుంతుక, మిటుఌక. గొడ్డలి మొ. వాటితో చీల్చు.

మూ. ద. ద్రా. *మీళ్- మీణ్-, మీట్ట్-

<మీళ్-త్-.

మీఁటగు అ. క్రి. ఒప్పు. పాండు. 1.106.
<మీఁటు+అగు. మీఁటుకొను స.క్రి. చిమ్ము, విక్షేపించు. వైజ. 1.131. మీఁటుపుల్ల వి. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల. మీఁటుమిగులు అ.క్రి. మిక్కుటమగు, అధికమగు, అతిశయించు. వరాహ. 12.31.

మీద రూ. మీఁద. అవ్య. ద్రు. **1.** జరుగుచున్న. శా. శ. కో. పు. 236 ; **2.** పైన.

<మీఁదు+-అ[7].

మీద్ధ వి. నలికళ్ళపాము.

మీన చూ. మీట. వి. ఏతంలో ఒకభాగం.

మీనత్ వి. మామూలు, జీతం తీసుకోని పనివాళ్ళకు అభిమానంతో ఇచ్చే బహుమానం.

హిం. ఉ. ఈమాన్. విశ్వాసం, నమ్మకం, ధర్మం.

మీనమేషములు లెక్కపెట్టు అ.క్రి. (సోమరితనం మొ. వాటివల్ల) వృథాకాలక్షేపం చేయు.

సం. మీనమేష-. జ్యోతిశ్శాస్త్ర సంబంధిరాసులు.

<సం. మీనమేష-+-ము+-లు+లెక్క+పెట్టు.

మీనమేషములులెక్కయిడు అ.క్రి. (సోమరితనం మొ. వాటివల్ల) వృథాకాలక్షేపం చేయు. సింహా. శ. 23.

సం. మీనమేష-. జ్యోతిశ్శాస్త్ర సంబంధిరాసులు.

<సం. మీనమేష-+-ము+-లు+లెక్క+ఇడు.

మీనవల్లంకి రూ. మీనవల్లఁకి, మీనుల్లంకి, మీనువల్లంకి, వి. నీటిలోకిఉరికి చేపల్ని పట్టే ఒకానొకపక్షి.

సం. మీనవల్లికా. ఒకరకంపక్షి.

<సం. మీనవల్లికా.

మీనవల్లఁకి రూ. చూ. మీనవల్లంకి. వి. మీలముచ్చు, పక్షివిశేషం.

మీనా రూ మేనా[2]. వి. **1.** నేతలోపడే రంగుచుక్క ; **2.** చేతితోఅద్దే ఒకరకం కొయ్యఅచ్చు.

మీనాపనివాళ్ళు విణ. బ.వ. నేతబట్టలకు కొయ్యఅచ్చులతో రంగులు అద్దేపనివాళ్ళు. మీనాబార్డరు వి. ఒకరకం అంచు. ఇం. *Boarder*. అంచు. <మీనా + ఇం. Boarder. మీనాముతు వి. నేతలో మధ్యరంగులో వచ్చిన ముత్యంపేటు. మీనారంగు వి. చేతి అద్దకంలో ఒకరకం అచ్చుతో అద్దినరంగు.

మీనాఫ్ రూ. మీనాబు. వి. ఒకవిధమైన జూదం.

హిం. మునాఫ్. లంచం, ఉపయోగం, బేరం, భాగం ; ఉ. అర. మునాఫీ. లాభాలు, గెలుపులు, ఆదాయం, ఉపయోగాలు.

<ఉ. మునాఫీ.

మీనాబు రూ.చూ. మీనాఫ్. వి. ఒకవిధమైన జూదం.

మీను వి. **1.** మత్స్యం, చేప. భార. ఉద్యో. 2.52 ; **2.** జలజంతువు. దశా. 1.153.

క. మీన్. చేప ; కొడ. మిని ; తు. మీను ; త. మీన్. చేప ; మ. మీన్ ; కో. తొ. మిన్ ; గోం. మీన్ ; కొం. మీన్ ; కుఇ. మీను ; కువి. మీను ; గ. మీన్ ; మాల్తో. మీను.
పో. చూ. సం. మీన-. చేప.

మీనుటెక్కెమువాఁడు విణ. మీనకేతనుడు, మన్మథుడు. పల్నా. 2.91. మీనుడాల్దిట్టరి వి. మన్మథుడు, చేప జెండాగా కలవాడు. మీనుబిల్ల (-పిల్ల) వి. చురుకైనవాడు. మీనుముచ్చుపులుఁగు వి. మీలమల్లంకి, నీళ్ళలోఉరికి చేపల్ని పట్టే పక్షివిశేషం. మీనుమొసలిసిడెంబులమేటి వి. మన్మథుడు. సాంబ. దేవ. 8 మీనురూపురిక్క వి. రేవతి నక్షత్రం. మీనుల్లంకి రూ.చూ. మీనవల్లంకి. వి. నీటిలోకి ఉరికి చేపల్ని పట్టేఒకానొకపక్షి. మీనువల్లంకి రూ.చూ. మీనువల్లంకి. వి. నీటిలో ఉరికి చేపల్ని పట్టే ఒకరకం పక్షి. మీనుసిడెముమేటి వి. మన్మథుడు. మీల్ రూ.చూ. మీల. వి.బ.వ. చేపలు. సాంబ. స్థా. 66. మీలదొంగ వి. లకుముకిపిట్ట, నీళ్ళలో ఉరికి చేపల్ని పట్టే పక్షివిశేషం. మీలముచ్చ రూ.చూ. మీలమ్రుచ్చు. వి. నీళ్ళలో ఉరికి చేపల్ని పట్టే ఒకరకం పక్షివిశేషం. మీలమ్రుచ్చు రూ. మీలముచ్చు. వి. మీలదొంగ, మీనవల్లంకి, నీళ్ళలోఉరికి చేపలు పట్టే పక్షివిశేషం, వర్తిక. హంస. 3.12. మీలవల్లంకి చూ. మీనవల్లంకి. వి. నీళ్ళలోకి ఉరికి చేపల్ని పట్టే పక్షివిశేషం. మీలవల్లఁకి వి. మీలముచ్చు. ఆం. భా. 2.96. మీలు రూ. మిలు, మీల్. వి.బ.వ. చేపలు. సాంబ. స్థా. 66.

మీంద చూ. మీఁదు. అవ్య. ద్రు. **1.** తర్వాత. నె. శా. ఉదయగిరి శాసనం. 40. క్రీ.శ. 1514 ; **2.** నిమిత్తంగా. నె. శా. రావూరుశాసనం. క్రీ.శ. 1636.

మీస్దు రూ. మీఁదు. క్రి. విణ. మీదు. కొండపల్లిశాసనం. క్రీ.శ. 719.720.

కొడ. మిద. పైన ; త. మీతు. పైభాగం, ఎత్తైన ప్రదేశం ; మ. మీతిల్. పైన. పైభాగం, మీత్తల్, మీత్తు. పైభాగం ; కురు. మైతా, మ్లైతా, మైయ్యంతా, మన్యంతా. మిక్కలి పైదయిన, అత్యున్నతమైన ; మాల్తో. మెచ్. ఎత్తు.

మీఁద చూ. మీఁదు.

మీఁదఁజూచు చూ. మీఁదు.

మీఁదట చూ. మీఁదు.

మీఁదటికి చూ. మీఁదు.

మీఁదటుకు చూ. మీఁదు.

మీఁదటెత్తు చూ. మీఁదు.

మీఁదఁదెచ్చుకొను చూ. మీఁదు.

మీఁదపెడ చూ. మీఁదు.

మీఁదమిక్కిలి చూ. మీఁదు.

మీఁదమీఁద చూ. మీఁదు.

మీఁదమీఁదఁజవులు చూ. మీఁదు.

మీఁదమీఁదవుండు చూ. మీఁదు.

మీఁదవచ్చు చూ. మీఁదు.

మీఁది చూ. మీఁదు.

మీఁదికచ్చు చూ. మీఁదు.

మీఁదికడప చూ. మీఁదు.

మీఁదికి చూ. మీఁదు.

మీఁదికిదువ్వు చూ. మీఁదు.
మీఁదికిమీఁద చూ. మీఁదు.
మీఁదికిమీఁదజీవములుపోవు చూ. మీఁదు.
మీఁదికి(బ్రాకు చూ. మీఁదు.
మీఁదికివచ్చు చూ. మీఁదు.
మీఁదికెత్తు చూ. మీఁదు.
మీఁదికొమ్మ చూ. మీఁదు.
మీఁదికొయ్య చూ. మీఁదు.
మీఁదికోరు చూ. మీఁదు.
మీఁదిగాలి చూ. మీఁదు.
మీఁదిగుడ్లు చూ. మీఁదు.
మీఁదిగుండు చూ. మీఁదు.
మీఁదిపంచ చూ. మీఁదు.
మీఁదిప్రాణములుమీఁదనేపోవు చూ. మీఁదు.
మీఁదిమాట చూ. మీఁదు.
మీఁదిమిక్కిలి చూ. మీఁదు.
మీఁదిరోలు చూ. మీఁదు.
మీఁదిసాకిరి చూ. మీఁదు.

**మీఁదు** రూ.చూ. మీన్దు. వి.ఔ. **1**. ఉపరిభాగం, పై. భార. ఆది. 2.9 , **2.** ఉత్తరకాలం. భార.ఆది. 6.127 ; **3.** పంచమ్యర్థకప్రత్యయం, కంటె. పండి.చ. 3.241 ; **4.** ఉత్తరకాలఫలం, ఉదర్కం. భార.ఉద్యో. 4.12 ; **5.** పయి, పైకి. రం రా. అయోధ్యా. 139 పు. 16 పం. ; **6.** సప్తమ్యర్థకం, ఎడల. కాశీ. 4.15 ; **7.** భవిష్యత్కాలం. మను. 3.143 ; **8**. వశం అధీనత. ఆము. 4.204 ; **9.** అంతస్తు, మేడపైభాగం, నిలువు. యయా. 4.156 ; **10**. తృతీయార్థకప్రత్యయం, కరణార్థకం. కువ.చ. 2.102 ; **11**. దేవతాదులకోసం నియమించిన ముడుపు. శుకచ. 3.50 ; విణ. **1** అధికుడు, గొప్పవాడు. కు.సం. 4.427 ; **2.** పైది, మీదనున్నది. హరి.పూ. 1.57.

**మీఁగడ** యా. మింగడ, మింగిడి, మీవడ. వి. కాగిన పాలమీద తెట్టె, మండ, పెరుగుమీది తెట్టె, మస్తువు. శృం.నై. 6.129. త. మీక్కట్టై. మీగడ. < మీఁదు + కడ. **మీఁగడకట్టు** అ.క్రి. పాలుకాగి పైన తరకలుగట్టు. రాధా. 4.97. **మీఁగడగట్టించు(-కట్టించు)** స.క్రి. పెంపొందించు. **మీఁగడతెర** వి. భక్ష్య విశేషం. ప్రబంధ. 112. **మీఁగడపెరుఁగు** వి. మంగళ్యం, శ్రీఘనం, స్తన్యం. **మీఁగండ్లమెకము** వి. శరభం, ఊర్ధ్వలోచనం. **మీఁగయి** వి. పైచేయి. < మీఁదు + కయి[1]. **మీఁగాలు** వి.ఔ. పాదోపరిభాగం. కు.సం. 3.45. < మీఁదు + కాలు. **మీఁజెయి** రూ.చూ. మీఁజేయి. వి. చేతిపైభాగం. < మీఁదు + చెయి. **మీఁజేయి** రూ. మీఁజెయి. వి. చేతిపైభాగం. కాశీ. 5.226. < మీఁదు + చేయి. **మీఁద** రూ.చూ. మీద. అవ్య.ద్రు. పైన. **మీఁదఁజూచు** అ.క్రి. గర్వించు, ఔద్ధత్యం పొందు. భార. శాంతి. 4.435. < మీఁదు + -అ[7] + చూచు. **మీఁదట** క్రి.విణ. తర్వాత. **మీఁదటికి** అవ్య.ద్రు. తర్వాత. **మీఁదటుకు** వి. పెద్దటుకు, చిట్టటుకు పైన వేసిన విశాలమైన అటక. < మీఁదు + అటుకు. **మీఁదటెత్తు** వి. పైఎత్తు. తాళ్ల.సం. 10.267. < మీఁదు + -అ(యొక్క) + ఎత్తు[1]. **మీఁదఁదెచ్చుకొను** స.క్రి. పైనవేసుకొను, బాధ్యత వహించు. వర రా బాల.పు. 186. పం. 4. < మీఁదు + -అ[7] + తెచ్చుకొను. **మీఁదపెడ** వి. పాత్ర కుతికకుపైన ఉండే భాగం. < మీఁదు + -అ(యొక్క) + పెడ. **మీఁదమిక్కిలి** రూ.చూ. మీఁదుమిక్కిలి. విణ. కడుమిక్కిలి. తాళ్ల.సం. 14.262. < మీఁదు + -అ[7] + మిక్కిలి. **మీఁదమీఁద** అవ్య.ద్రు. ఉత్తరోత్తరా, ఒకదాని వెంట ఒకటిగా. కళా. 5.32. మీఁదు + -అ[7] + మీఁదు + -అ[7]. **మీఁదమీఁదఁజవులు(-చవులు)** వి.బ.వ. పైపై రుచులు. తాళ్ల.సం. 11.3.28. **మీఁదమీఁదవుండు (-ఉండు)** అ.క్రి. తేలికగా ఉండు. తాళ్ల.సం. 17.298. **మీఁదవచ్చు** అ.క్రి. దండెత్తు, యుద్ధానికి వచ్చు. రంగా.చ. 1.112. < మీఁదు + -అ[7] + వచ్చు. **మీఁది** వి. గునపం మీద పదును లేని కొన. **మీఁదికచ్చు** వి. ఆనులో మధ్య పీటకు బిగించిన మొదటికొయ్య. < మీఁదు + -ఇ[3]. + కచ్చు. **మీఁదికడప** పి. ఉత్తరాసి, దర్వాజా చట్రపు పైకమ్మి. < మీఁదు + -ఇ[3]- + కడప. **మీఁదికి** అవ్య. పైకి. < మీఁదు + -ఇ[3]- + -కున్. **మీఁదికిదువ్వు** స.క్రి. ఎగదువ్వు, పైకిదువ్వు. **మీఁదికిమీఁద** అవ్య. ద్రు. వెంటనే, శీఘ్రంగా. కు.సం. 2 201 **మీఁదికిమీఁదజీవములుపోవు** అ.క్రి. పైప్రాణాలు పైనేపోవు. కు.సం. 2.201. **మీఁదికిఁబ్రాకు(-ప్రాకు)** స.క్రి. ఎగప్రాకు. **మీఁదికివచ్చు** అ.క్రి. జోలికివచ్చు. **మీఁదికెత్తు** స.క్రి. ఎగనెత్తు, ఎత్తుకొను, ఎత్తు, పైకెత్తు. < మీఁదికిన్ + ఎత్తు[1]. **మీఁదికొమ్మ** వి. పైనున్నకొమ్మ. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + కొమ్మ. **మీఁదికొయ్య** వి. చట్రం. ఆను నిలుపుపట్టెకు బిగించినకొయ్య < మీఁదు + -ఇ[3]-(యొక్క) + కొయ్య. **మీఁదికోరు** వి. పాత్ర మూతి పైభాగం. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + కోరు. **మీఁదిగాలి** వి. కించులికం, వాయువు. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + గాలి. **మీఁదిగుడ్లు** వి. బ. వ. పైకివచ్చినట్లున్న కళ్ళు. < మీఁదు + -ఇ[3]- (యొక్క) + గ్రుడ్డు + - లు. **మీఁదిగుండు** వి. చేతి మగ్గం పన్నె బిగించిన పైచెక్క. పలచగా పొడుగ్గా ఉంటుంది. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + గుండు. **మీఁదిపంచ** వి. పైపంచ, అంగవస్త్రం. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + పంచ. **మీఁదిప్రాణములుమీఁదనేపోవు** అ.క్రి. పైప్రాణాలుపైనేపోవు. సం. ప్రాణ-. ఉసురు. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + సం. ప్రాణ + ము- + -లు + మీఁదు + -అ[7] + ఏ[3] + పోవు. **మీఁదిమాట** వి. తరువాతిమాట. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + మాట. **మీఁదిమిక్కిలి** రూ. మీఁదుమిక్కిలి. అవ్య. పయిపెచ్చు, అధికం. ప్రభా. 3.145. **మీఁదిరోలు** వి. చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లో పైతూము. < మీఁదు + -(యొక్క)ఇ[3]- + రోలు. **మీఁదిసాకిరి** వి. ఉత్తరసాక్షి. < మీఁదు + -ఇ[3]-(యొక్క) + సాకిరి. **మీఁదుకట్టు** రూ.చూ. మీఁదుగట్టు. స.క్రి. దేవతాదులకి సమర్పించటం కోసం డబ్బు ముడుపు

కట్టు, ఎప్పటికో ఎవరికోసమో ప్రత్యేకించు. **మీఁదుగట్టు (-కట్టు)** రూ. మీఁదుకట్టు. స.క్రి. దేవతాదులకు సమర్పించటం కోసం ధనం సిద్ధపరచి ఉంచు. **మీఁదుగడకట్టు** స.క్రి. మీదుకట్టు, ఎప్పటికో ఎవరికోసమో ఉంచు. పాండు. 4.167. **మీఁదుగా** అవ్య.క్రు. గుండా, ద్వారా. కాశీ. 3.111. < మీఁదు + అగు + -అ[7]. **మీఁదుతలంచు** స.క్రి. జరుగనున్నదాన్నిగూర్చి ముందే ఆలోచించు, దూరదృష్టితో మెలగు. ఉ.హరి. 4.198. **మీఁదుపరికింపక** అవ్య. జరుగనున్నదాన్నిగూర్చి ఆలోచింపక, దూరదృష్టిలేక. కళా. 2.85. **మీఁదుబెట్టు(-పెట్టు)** స.క్రి. పశువు మొదటి ఈతపాలను మొదటిసారి పిండి దేవుడికి ఆరగించటానికి ప్రత్యేకించు. **మీఁదుమిక్కిలి** రూ. మీఁదమిక్కిలి, మీఁదమిక్కిలి. విశే. పైపెచ్చు, అధికం. విజయ. 3.158. **మీఁదుమిగులు** అ.క్రి. **1.** విజృంభించు, చెలరేగు. భాగ. 10పూ. 1525 ; **2.** మించిఉండు, మట్టుమీరు. ప్రబోధ. 1.39 ; **3** పైపెచ్చు. ప్రబోధ. 5.21. **మీఁదులుచూచు** స.క్రి. సిగ్గు మొ. వాటివల్ల ఆకసంవైపు చూచు. పాండు. 4.171. **మీఁదులెత్తు** అ.క్రి. దేవతాదులకి సమర్పించటం కోసం నియమించి ఉంచు. కువ.చ. 2.26. < మీఁదు + -లు + ఎత్తు[1]. **మీదువోవు (-పోవు)** అ.క్రి. మీదుపెట్టు. కాశీ. 7.139. **మీఁదుసూచు (-చూచు)** అ.క్రి. జవాబు చెప్పలేకపోవు, బదులు చెప్పలేక ఆకాశంవైపు చూచు. గౌ. హరి. పూ. 124. **మీఁదెత్తు** అ.క్రి. దేవతాదులకి సమర్పించటంకోసం నియమించిఉంచు. పరమ. 1.139 ; వి. ఎత్తుకు పైఎత్తు. < మీఁదు + ఎత్తు[1]. **మీఁదెఱుఁగక** అవ్య. జరుగనున్నది కానక. ఉ.హరి. 2.189. < మీఁదు + ఎఱుఁగక.

**మీఁదెత్తు** చూ. మీఁదు.

**మీఁదెఱుఁగక** చూ. మీఁదు.

**మీర్** వి. సర్దారు, పాదుషా. పద్మ.యు. 4.

హిం మీర్. సర్దారు, ఒక బిరుదు ; ఉ. మీర్. అగ్రగణ్యుడు, నాయకుడు, సర్దారు, ప్రభువు ; పార. మీర్. చక్రవర్తి, ప్రభువు, నాయకుడు ; అర. అమీర్. ధనవంతుడు.

< ఉ. మీర్.

**మీరలు** చూ. మీరు.

**మీరాబాయి** వి. ఒకరకం నీలంరంగు, గాజునీలం.

హిం.గు. మీరాబాఈ. వ్యక్తినామం.

< హిం. మీరాబాఈ.

**మీరాబాయిపచ్చ** వి. ఒకరకం పచ్చరంగు.

**మీరాశిదారు** రూ. మిరాసిదారు, మిరాసిదారుడు. వి. వంశపారంపర్యంగా వచ్చే గ్రామోద్యోగం కలవాడు. ద.హిం. శా.సంపు. 10. 765.29. క్రీ.శ. 1678.

ఉ. మిరాసీదార్. మీరాసిగలవాడు ; పార. మీరాసీదార్. మీరాశిగలవాడు, వంశపారంపర్యంగా వచ్చే గ్రామోద్యోగం కలవాడు, మున్సబు, కరణం.

< ఉ. మీరాసీదార్.

**మీరి** వి. గడ్డపలుగులోని మొద్దువైపు.

**మీరు** రూ. ఈరు[2]. సర్వ.బ.వ. యుష్మదర్థక బహువచనం. భార.ఆది. 2.84.

క. నీమ్, నీన్, నింగళ్. మీరు ; కొడ. నింగ ; తు. ఈరు, నికులు, నింక్ళు ; త. నీమ్, నీర్, నీయిర్, నీవిర్, నీంకళ్ ; మ. నిజ్ఞళ్ ; కో. నీమ్ ; తొ. నుమ్ ; గోం. ఇమ్మట్, నిమెట్, మిరాట్ ; కొం. మీరు ; కుఇ. ఈరు, మీరు ; కువి. మింబు ; పర్జి.గ. ఈమ్ ; పెం. ఏప్, ఏపెజ్ ; మండ. ఈమ్ ; కొలా.నా. నీర్ ; కురు.మాల్తొ. నీమ్ ; బ్రా. నుమ్.

< మూ.ద్రా. *నీమ్.

**మిము** రూ.చూ. మిమ్ము. సర్వ.ద్రు. మీ శబ్దంయొక్క ద్వితీయా విభక్తి రూపం. నిర్వ.రా. 10.49. **మిమ్ము** రూ. మిము. సర్వ.ద్రు. మీ శబ్దం యొక్క ద్వితీయా విభక్తి రూపం. భార.ఆది. 2.34. **మీ[1]** సర్వ. మీరు శబ్దంయొక్క ద్వితీయాది విభక్త్యంగం. భార.ఆది. 7.209. **మీరలు** సర్వ బ.వ. యుష్మద్బహువచన వాచక శబ్దం, మీరు. భార.ఆది. 2.89. < మీరు + లు (పాయకంగా అమహద్బహువచన ప్రత్యయం).

**మీర్జా** వి. **1.** మీర్జాకుళ్ళాయి, రాజకుమారులు ధరించే టోపీ. వేణు.శ. 58 ; **2.** రాజవంశీయుల ఉపాధి ; **3.** మొగలు వంశస్థుల బిరుదు.

హిం. మిర్‌జా. రాజవంశంవారి బిరుదు, మొగలు వ్యక్తి ; ఉ. మీర్‌జా. రాజవంశంవారి బిరుదు, మొగలు వ్యక్తి ; పార. మీర్‌జా. రాజకుమారుడు, శూరుడు, రచయిత ;

క. మిర్‌జా. యువరాజు, సేనాని.

< ఉ. మీర్‌జా.

**మీర్జాకుళాయి** వి. రాజకుమారులు ధరించే టోపీ. వేణు. 58.

**మీఱఁబెట్టు** చూ. మీఱు.

**మీఱు** అ.క్రి. **1.** అతిశయించు. కు.సం. 4.105 ; **2.** విజృంభించు, చెలరేగు. ఉ.హరి. **3.58** ; **3.** జనించు, కలుగు. పారి. 1.56 ; **4.** గతించు, కడచిపోవు. ప్రభా. 5.72 ; **5.** కొనసాగు, సఫలమగు. ఇందు 3.14 ; **6.** ఒప్పు. నీలా. 1.1 ; స.క్రి. **1.** ఉల్లంఘించు. నిర్వ.రా. 1.164 ; **2.** అతిక్రమించు, మించు. నిర్వ.రా. 3.10 ; **3.** నిరసించు. వరాహ. 7.39.

క. మీఱ్, మీఱు, మీఱుని. అతిక్రమించు, అధిగమించు ; తు. మీరుని ; త. మీఱు. అధిగమించు, మిగులు, గొప్పదగు ; మ. మీఱుక. అధిగమించు ; కో. మీర్. అతిశయించు ; తొ. మీఱ్. నిరోధింపబడనిదగు ; గోం. వీర్. అధిగమించు ; కువి. మీజా. అధిగమించు, దాటు, మింజా. ఎదిరించు ; పో.చూ. త. వీఱు. ఎక్కువగు ; తొ. వీర్. పోటీచేయు.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *మీఱ్-/*వీఱ్.

**మీఱఁబెట్టు** స.క్రి. గర్వింపచేయు. సానంద. 5.16. < మీఱు + -అ[7] + పెట్టు.

**మీల్** చూ. మీను.

మీలదొంగ చూ. మీను.
మీలముచ్చు చూ. మీను.
మీల్రముచ్చు చూ. మీను.
మీలవల్లంకి చూ. మీను.
మీలవల్ల(కి చూ. మీను.
మీలు చూ. మీను.
మీశ్శె వి. ఈదు.
మీవడ రూ.చూ. మీఁగడ. వి. కాగిన పాలమీది తెట్టె, మండం, పెరుగుమీది తెట్టె, మస్తువు. వేంక.పంచ. 1.590.
మీస రూ. మీసము. వి. మీసం, పై పెదవిమీద పుట్టే వెండ్రుకల వరస. కు.సం. 10.101.

క. మీసె ; కొడ.తు. మీసె ; త. మీచై, వీచై ; మ. మీస ; కొం. మీసం ; కువి. మీసం ; కొలా. మీసల్ (బహు) ; ఒరయాన్. మిచీ, మిసీ, మీచా ;

పో.చూ. సం. శ్మశ్రు-. మీసం, ప్రా. మస్సు, మలసు ; జై.శౌ. మస్సు, మంసు, మాసు . అ.మా. మలసు, మలసూ ; పా. మస్సు. గడ్డం ; ఇం. మలసూణో ; మరా. మిసీ.

మీసకట్టు వి. మీసంయొక్క ఏర్పాటు. వేంక.మా. 1.135. మీసలపైతేనె రూ.చూ. మీసాలపైఁదేనియ. వి. అల్పసుఖం. నీతి.శ. 71. మీసలువడిపెట్టు స.క్రి. మీసాలు తిప్పు. సిం.ద్వా. 7.28.
మీసంగొటిగించు చూ. మీసము.
మీసంగొటిగించుకొను చూ. మీసము.
మీసంత్రిప్పు చూ. మీసము.
మీసము రూ.చూ. మీస. వి. పై పెదవిమీది వెండ్రుకల వరస. భార.అశ్వ. 3.87.

మీసంగొటిగించు అ.క్రి. అవమానించు. < మీసము + గొటిగించు. మీసంగొటిగించుకొను అ.క్రి. ఒకరకమైన ప్రతిజ్ఞ ప్రకారం మీసం తీసివేయు. మీసంత్రిప్పు స.క్రి. పౌరుషం ప్రదర్శించు. < మీసము + త్రిప్పు. మీసము నుల్చు స.క్రి. మీసం నులివేయు, మీసం తిప్పు. గౌ.హరి. ఉ. 1394. మీసముమీఁదికేలు వి. మీసంమీది చేయి, వయసు పౌరుషం, ప్రాభవం సూచించే చేష్ట. శుక. 2.378. మీసములుదీటు వి. పౌరుష సూచకంగా పురుషులు మీసం మీద చేయి వేయటం, మీసాలు దువ్వటం అలవాటు. కాశ. 2.26. మీసంబుపైఁగేలువైచు స.క్రి. పౌరుష సూచకమగు చేష్ట. హంస 2.240. మీసంబులు వడిపెట్టు స.క్రి. మీసాలు తిప్పు. మీసంమీదచెయ్యి వేయు స.క్రి. పౌరుషాన్ని ప్రదర్శించు. < మీసము + మీఁదు + -అ$^{7}$ + చెయ్యి + వేయు. మీసం మెలివేయు స.క్రి. పౌరుష సూచకంగా మీసం త్రిప్పు. < మీసము + మెలి + వేయు. మీసాలపై నిమ్మకాయలు నిలుపు అ.క్రి. పెద్దపెద్ద మీసాలు కలిగిఉండు. < మీసము + -లు + అ$^{13}$ పయిన్ + నిమ్మకాయ + -లు + నిలుపు. మీసాలపైఁ దేనియ రూ. మీసలపై తేనె. వి. అల్పసుఖం. మను. 2.65. < మీసము + -లు + పైన్ + తేనియ. మీసాలపోతు వి. మీసాల సంరంభం తప్పితే చేవసున్న అనటం. < మీసము + -లు + -అ$^{13}$ (యొక్క) + -పోతు. మీసాలబువ్వ వి. ఇంట్లో అంబలి తాగి, బయట సన్నన్నం తిన్నట్లు ప్రదర్శించటానికి మీసంపై అతికించుకొన్న మెతుకులు, పైకి పటారం లోన లొటారం వంటి పలుకుబడి. < మీసము + -లు + -అ$^{13}$(యొక్క) + బువ్వ. మీసాలమీఁదితేనె వి. అల్పసుఖం. తాళ్ల. సం. 7.6. < మీసము + -లు + -అ$^{13}$ (యొక్క) + మీఁదు + -ఇ$^{3}$ (యొక్క) + తేనె మీసాలు దువ్వు స.క్రి. పౌరుషం ప్రకటించు. హేమా. పు. 12. < మీసము + -లు + దువ్వు. మీసాలునివురు స.క్రి. పౌరుషం ప్రకటించు, మీసాలుదువ్వు. ఉ.క.ద్వి. 1467. < మీసము + -లు + నివురు. మీసాలువడిపెట్టు స.క్రి. పౌరుషం ప్రకటించు. ఉ.క.ద్వి. 385. < మీసము + -లు + వడిపెట్టు.
మీసంబుపైఁగేలువైచు చూ. మీసము.
మీసంబులు వడిపెట్టు చూ. మీసము.
మీసంమీద చెయ్యివేయు చూ. మీసము.
మీసం మెలివేయు చూ. మీసము.
మీసర వి. మృగశీర్ష నక్షత్రం.

సం. మృగశిరస్ ; ప్రా. మిగసిర-, మగసిర-. నక్షత్ర విశేషం ;

మ. మకయిరం.

< ప్రా. మిగసిర-.
మీసరము విణ. శ్రేష్ఠం. శశా. 4.119. సాంబ. మాన. 48.
మీసాలపై నిమ్మకాయలు నిలుపు చూ. మీసము.
మీసాలపైఁదేనియ చూ. మీసము.
మీసాలపోతు చూ. మీసము.
మీసాలబువ్వ చూ. మీసము.
మీసాలమీఁదితేనె చూ. మీసము.
మీసాలుదువ్వు చూ. మీసము.
మీసాలునివురు చూ. మీసము.
మీసాలువడిపెట్టు చూ. మీసము.
-ము$^{1}$ రూ.చూ. -బు. ప్రత్య. అదంతాలైన అమహన్న పుంసకాలకు బల్లిదాదులకు వచ్చే ప్రథమైక వచన ప్రత్యయం. భార. ఆది. 1.12.
-ము$^{2}$ ప్రత్య. కొన్ని తెలుగు సర్వనామాలకు వచ్చే ప్రథమా బహువచన ప్రత్యయం. ఉదా. మేము, మనము. భార. ఆది. 6.128.

< మూ.ద్రా. -*మ్.
-ము$^{3}$ ప్రత్య. ఉత్తమ పురుష బహువచన ప్రత్యయం. భార. ఆది. 2.144.

< ఏము/మేము.
-ము$^{4}$ ప్రత్య. ప్రథమాంతమైన అస్మచ్ఛబ్ద విశేషణాలకు బహుత్వంలో తరచుగా వచ్చే ఆగమం. భార. విరా. 5.344.

< ఏము/మేము.
-ము$^{5}$ ప్రత్య. ప్రార్థనాశీర్విధ్యాద్యర్థకాల్లో వచ్చే మధ్యమ పురుషైక వచన ప్రత్యయం. భార. ద్రోణ. 2.63.

< మూ.ద్రా.*మ్. (బహువచనానికి చెందిన ఈ మూల ద్రావిడ *మ్ తెలుగు కువి శాఖలో బహువచనానికి వేరే ప్రత్యయం వచ్చిన కారణంగా ఏకవచనంలోకి మారిపో

యింది).

-ము6 సర్వ. మూఁడు² శబ్దానికి వృత్తిలో ఆదేశంగా వచ్చే రూపం. కాశీ. 4.127. ఉదా. ముజ్జగం, ముచ్చిచ్చు మొ.వి.

ము- రూ.చూ. -బు. ప్రత్య. ప్రథమైక వచనేతర విభక్తి ప్రత్యయం పరమైనప్పుడు అదంతాలైన అమహన్నపుంస కాలకు బల్లిదాదులకు వచ్చే ఆగమం. భార. ఆది. 1.5.

ముఅజ్జల్ రూ. మొవజ్జాలు, మోజ్జాలు. వి. 1. స్త్రీధనం; 2. భర్తయొక్క గృహాన్ని ప్రవేశించక పూర్వమే అడుగదగిన ధనం; 3. వివాహ విచ్ఛేద సమయంలో అడుగదగిన ధనం.

హిం. ముఅవజా. పడ్డ నష్టానికి చెల్లు, ప్రతిచెల్లుకు చెల్లు, ప్రత్యుపకారం, ప్రాయశ్చిత్తం, మోజరా. అలవెన్సు, రిబేటు, చెల్లు; ఉ.అర. ముఅజల్. అప్పునిలిపి పెట్టటం.

< ఉ. మువజ్జల్.

ముకంరొతు రూ.చూ. మొఖంరౌతు. వి. ఒంటిమొఖంరాయి, ఒక వైపు చదునుగా, నున్నగా చెక్కబడిన రాయి.

ముకద్దమా రూ. మొకద్దమా, మొకద్ధమా, మొఖద్దమా, మొగ ద్ధమా. వి. గ్రామ వ్యవహారం; విణ. ప్రత్యేకమయిన.

హిం. మొకద్దమా. కారణం, చట్టం, ప్రయత్నం, కోర్టు వ్యవహారం, పని; మరా. ముకద్దమా; ఉ.అర. ముక ద్దమ, ముకద్దమత్. వ్యవహారం, విషయం, మొదటిభాగం, చట్టసంబంధమైన, కారణం, పదార్థం, పీఠిక, గ్రామ ముఖ్యుడు;

క. మొకద్దమే. వ్యవహారం, కేసు, యజమాని; త. మొకత్తమా.

< ఉ. ముకద్దమ.

ముకమాలు రూ.చూ. ముఖమల్లు. వి. ఒకరకం మేలు జాతి పట్టు.

ముకరం రూ.చూ. మొక్కరము¹. వి. 1. నిరోధం, ఆటంకం; 2. గడెమ్రాను, అడ్డగడియ, అర్గళం; 3. స్తంభం.

ముకాబిలా రూ. మొకాబిలా, మోకాబిలా. వి. సంప్రదింపు.

హిం.ఉ. ముకాబలా. ఎదుర్కొవటం, సమానత, విరోధం.

< ఉ. ముకాబలా.

ముకాము రూ. మకాము, మఖాము, ముఖాము, మొకాం, మొకాము, మొక్కాము, మొఖాం, మోకాం. వి. నివాసం, గృహం. భోజసుతా. 1.109.

హిం. ముకామ్. గృహం, ఉండేచోటు; మరా. ముక్కామ్, ముకామ్. ప్రయాణంలో నిలిచే స్థలం; ఉ. ముకామ్. కొన్నిరోజులుండటానికి ఏర్పరచుకొన్న వాస స్థానం; పార. ముకామ్, మకామ్. వాసస్థానం, గృహం; అర. ముకామ్. తాత్కాలిక వాసస్థానం.

< ఉ. ముకామ్.

ముకాసా రూ.చూ. ముఖాసా. వి. పన్ను లేకుండా ఇవ్వబడిన గ్రామం.

ముకిరీలు రూ.చూ. మొఖిరీలు. వి.బ.వ. అరటిపళ్ళలో ఒక రకం.

ముకు¹ రూ. చూ. ముక్కు¹. వి. 1. నాసిక. మను. 4.45; 2. పక్షిముక్కు; 3. చనుమొన.

ముకుగంబము(-కంబము) వి. ముక్కుదూలం. ముకుఁగమ్మి (-కమ్మి) .రూ.చూ. ముక్కుఁగమ్మి. వి. నత్తు, బేసరి ముకుఁగోళ్లు రూ.చూ. ముకుఁగ్రోళ్లు. వి.బ.వ. నాసాపు టాలు. ముకుఁగ్రోలు(-క్రోలు) రూ. ముక్కుగోలు. ముక్కు గ్రోలు. వి. ముక్కురంధ్రం. భాస్క.రా.యు. 857. ముకుఁగ్రోళ్లు రూ. ముకుఁగోళ్లు, ముక్కుఁగోళ్లు, ముక్కుఁ గ్రోళ్లు వి.బ.వ. నాసాపుటాలు. కాశీ. 4.274. ముకుచాయన్ అవ్య.ద్రు. ముక్కుకు తిన్నగా. వేంక. పంచ. 1.115. ముకుచిక్కారు రూ. ముకుసిక్కారు. ముకుసిగారు. వి. తాడు తోగాని తోలుతోగాని అల్లి ఎద్దుమూతికి తగిలించే అలం కారం, సిగమోర. ముకుచిలమ రూ. ముకుసిలము, ముగు సెలిమె. వి. సిగమోర, తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. ముకుఁజెఱమ(-చెఱమ) రూ.చూ. ముక్కుఁజెరమ. వి. నాసాపుటం. ముకుజోరు వి. ముక్కు చివర ఉండే సుడి, ఎద్దు పొగరుమోతు దవుతుంది. ముకుతాడు రూ.చూ. ముకుఁద్రాడు. వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాయకు కలిపి కట్టినతాడు. ముకుదండి వి. ముక్కు నడిమి ఎముక. ముకుదాడిమ వి. ఒకజాతి వృక్షం. ముకుదాడు రూ.చూ. ముకుఁద్రాడు. వి. గూద మూతికి అటూ ఇటూ కట్టినతాడు. ముకుదూల రూ. ముకుదొల. వి. కర్రు బిగించే నాగలి చివరిభాగం. ముకుదూలము రూ. ముక్కుదూలము. వి. ముక్కు నడిమి ఎముక. ముకుదొమ్మ వి. మత్స్యవిశేషం, ఒకరకం చేప. వేంక. పంచ. 1.284. ముకుదొల రూ.చూ. ముకుదూల. వి. కర్రుబిగించే నాగలి చివరిభాగం. ముకుఁద్రాటఁగాలుఁగుచ్చు అ.క్రి. అదేపనిగా తగాదాకు పిలుచు. < ముకు¹ + త్రాడు + -అ⁷ + కాలు¹ + గ్రుచ్చు. ముకుఁద్రాడు రూ. ముకుతాడు, ముకుదాడు, ముక్కుతాడు, ముక్కుఁద్రాడు. ముగదాడు, ముగుదాడు, మొగదాడు, మొగుదాడు. వి. ౙా. నాథం, ఎద్లకు ముక్కున గుచ్చేతాడు. భార.ఉద్యో. 3.220. ముకుపచ్చ వి. నాసికాచిహ్నం, ముక్కులోని మచ్చ. ముకుపుటాలదరు అ.క్రి. కోపం వచ్చినప్పుడు కలిగేభావంవల్ల ముక్కు ముందుభాగం చలించు. < ముకుపుటాలు + అదరు. ముకుపొడి రూ.చూ. ముక్కుపొడి. వి. నస్యం, ముక్కుపొడి. ముకుపొడుము రూ. చూ. ముక్కుపొడుము. వి. నస్యం, ముక్కుపొడి. ముకుపోఁగు రూ.చూ. ముక్కుపోఁగు. వి. 1. నత్తు; 2. అడ్డబాస. ముకుబంటి వి. ముక్కుకొలది. ముకు బంతి¹ వి. సిగమోర, తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం, ముకుతాడు. ముకుబంతి² రూ. ముక్కుబంతి, ముగబంతి, ముగుబంతి, మువబంతి, మూబంతి, మొగబంతి. వి. పశువులకు శైత్యంతో నాసా రంధ్రాల్లో కలిగే కేశావృతపిండరూపవ్యాధి విశేషం. హరి. పూ. 5.143. ముకుమచ్చ వి. ముక్కులోనిమచ్చ. ముకు మచ్చతత్తడి వి. ముక్కులో నలుపుఉన్న వాహనం, వృషభ వాహనం. ఉ. హరిశ్చ. 3.131. ముకుమందు వి. ముక్కురోగాన్ని పోగొట్టే నస్యవిశేషం. ఆము. 1.82. ముకుముంగర వి. ఒకరకం చెట్టు. ముకుసిక్కారు రూ.చూ.

ముకుచిక్కారు. వి. సిగమోర, తాడుతోగాని తోలుతోగాని అల్లి ఎద్దుమూతికి తగిలించే అలంకారం. **ముకుసినారు** రూ. చూ. ముకుచిక్కారు. వి. సిగమోర, తాడుతోగాని తోలు తోగాని అల్లి ఎద్దుమూతికి తగిలించే అలంకారం. **ముకు సిలమ** రూ.చూ. ముకుచిలమ. వి. సిగమోర, తాడుతోగాని తోలుతోగాని అల్లిమూతికి తగిలించే అలంకారం.

**ముకు**[2] రూ.చూ. ముక్కు[2]. అ.క్రి. **1.** నశించు ; **2.** శ్లేష్మో ద్రేకంతో ఊపిరాడక శ్వాసించు.

**ముకుగొయ్య (-కొయ్య)** రూ. ముక్కుగొయ్య, ముక్కుఁ గొయ్య. వి. శిక్షాసాధనం. సిం. ద్వా. **4.115.**

**ముకుటము** రూ. ముక్కుటము. వి. నారమడి, నారచీర.

సం. *ముకుట-*. కిరీటం, తురాయి, కొండకొన.

<సం. ముకుట- (అర్థవిపరి.).

**ముకుందుబల్లెము** వి. ఒకరకం బల్లెం. కృష్ణరా. 3.87.

సం. *ముకుంద-*. విష్ణువు.

<సం. ముకుంద-+బల్లెము.

**ముకులు** చూ. ముక్క. వి.బ.వ. నూకలు.

**ముకెము** వి. ముఖ్యం. తాళ్ల. సం. 10.188.

సం. *ముఖ్య-*. ముఖసంబంధమైన, ముఖ్యమైన ; ప్రా. *ముక్ఖ-*. ముఖ్యమైన ; నే. *ముఖియా*. గ్రామముఖ్యుడు.

<ప్రా. ముఖ్ఖ-.

**ముక్క** రూ. ముక్క[1]. వి. **1.** ఖండం, తునక. శ్రీనాథుని చాటువు. పల్నా. పు. 109 ; **2.** చిన్నమాట. రామలిం. శ. 57 ; **3.** తరక, కాల్చిననున్నాన్ని జల్లించగా వచ్చిన తుక్కు ; **4.** బేసి సంఖ్యలోనిరాయి ; **5.** ఉంట, కట్టుబడిలో పనికిరాని చిన్న రాతిముక్క ; **6.** పాళి, కలంపాళీ.

తు. *మురి*, నరకు, కోత, *మురుకు*. ముక్క ; త. *మురవు*. పగలు, కుండ. మొ. వి పగిలినస్థితి ; మ. *ముఱిక్క*. పగలగొట్టు, కోయు.

**ముక్కగూడు** వి. కమానుగూడు, త్రిభుజాకారంలో ఉండే గూడు. **ముక్కపడు** అ.క్రి. భంగపడు. **ముక్కపఱచు** రూ. ముక్కపఱుచు. స.క్రి. భంగపర్చు. వాల్మీ. **3.143.** **ముక్కపఱుచు** రూ.చూ. ముక్కపఱచు. స.క్రి. భంగపర్చు. **ముక్కపొందిక** వి. ఎల్లో నర్దుకొని పోవటం. **ముక్కపోవు** అ.క్రి. కుంఠితమగు. తాళ్ల. సం. 6.61. **ముక్కరుగు (-అరు(గు)** వి. ఒత్తరగు, గోడలకు చుట్టూ బలానికి కట్టిన ఎత్తు. తక్కువగా ఉంచే చిన్నఅరుగు. **ముక్కలు** వి.బ.వ. నాలిగింటిలో మూడుభాగాలు. నె. శా. ఆత్మకూరు. క్రీ. శ. **1285.**

**ముక్కచ్చి** చూ. మూ-.

**ముక్కచ్చిఎత్తు** చూ. మూ-.

**ముక్కచ్చికూర్పు** చూ. మూ-.

**ముక్కచ్చిచేయు** చూ. మూ-.

**ముక్కచ్చిచేర్చు** చూ. మూ-.

**ముక్కచ్చిదూయు** చూ. మూ-.

**ముక్కచ్చివేయు** చూ. మూ.

**ముక్కచ్చె** చూ. మూ-.

**ముక్కచ్చెఎత్తు** చూ. మూ-.

**ముక్కచ్చెకూర్పు** చూ. మూ-.

**ముక్కచ్చెచేయు** చూ. మూ-.

**ముక్కచ్చెచేర్చు** చూ. మూ-.

**ముక్కచ్చెదూయు** చూ. మూ-.

**ముక్కచ్చెవేయు** చూ. మూ-.

**ముక్కటము** చూ. మూ-.

**ముక్కటిచీల** రూ. చూ. ముక్కరచీర. వి. జంటనొగలబండి నొగలను ముందువైపు కలిపే ఇనపమేకు.

**ముక్కటించు** చూ. ముక్కు[1].

**ముక్కట్టు** చూ. ముక్కు[1].

**ముక్కట్టుతాడు** చూ. మూ-.

**ముక్కడి** రూ. ముచ్చడి. వి. ఉత్తరసర్కారులు, దక్కను మొ. చోట్ల అడవుల్లో సుమారు యాభై అడుగుల ఎత్తుపెరిగే చెట్టు (Schrebera swietenioides).

**ముక్కంటి**[1] చూ. మూ-.

**ముక్కంటి**[2] చూ. మూ-.

**ముక్కంటిచుక్క** చూ. మూ-.

**ముక్కంటిచెలి** చూ. మూ-.

**ముక్కంటితల** చూ. మూ-.

**ముక్కంటితలపువ్వు** చూ. మూ-.

**ముక్కంటితలపూవు** చూ. మూ-.

**ముక్కంటితొలిపట్టి** చూ. మూ-.

**ముక్కంటిపట్టి** చూ. మూ-.

**ముక్కంటిపండు** చూ. మూ-.

**ముక్కంటిపండుచెట్టు** చూ. మూ-.

**ముక్కంటిపండులమెక్కెడుదిండి(డు** చూ. మూ-.

**ముక్కంటిపేరిటికన్నులు** చూ. మూ-.

**ముక్కంటిమల** చూ. మూ-.

**ముక్కంటిమామ** చూ. మూ-.

**ముక్కంటిమావు** చూ. మూ-.

**ముక్కంటియమ్ములపొది** చూ. మూ-.

**ముక్కంటియావు** చూ. మూ-.

**ముక్కంటియిల్లు** చూ. మూ-.

**ముక్కంటివలిగట్టు** చూ. మూ-.

**ముక్కంటివాల్గంటి** చూ. మూ-.

**ముక్కంటివిల్లు** చూ. మూ-.

**ముక్కంటివెల(ది** చూ. మూ-.

**ముక్కంటిసంగాతి** చూ. మూ-.

**ముక్కంటిసుడి** చూ. మూ-.

**ముక్కంటిసొమ్ము** చూ. మూ-.

**ముక్క(డి** చూ. మూఁగు. వి. **1.** దుక్కచాలించి ఆహారం కోసం పోయేటప్పుడు అరకలన్నింటిని ఒక్కచోట పోగుచేసి ఒకటిగా చేర్చి నిల్పినట్టి ఆ అరకల కాడల మొత్తం ; **2.** అనేకులకు ఏకకాలంలో తగిలే వ్యాధి, ముంగడి, ముడిచె, కలరా, స్ఫోటకం. మొ. వ్యాధి విశేషం.

**ముక్కద్దము** చూ. ముక్కు[1].

**ముక్కద్దాలు** చూ. ముక్కు[1].

**ముక్కవ** వి. మరాసు ఇరవైనాలుగు పళ్ళుకొలత.

ముక్కనిచ్చు చూ. ముక్కు[3].
ముక్కనిపీట రూ.చూ. ముక్కునిపీట. వి. పోలుకఱ్ఱకు కాడి కట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క.
ముక్కనుమ చూ. మూ-.
ముక్కనుసామి చూ. మూ-.
ముక్కన్ను చూ. మూ-.
ముక్కన్నుసుడి చూ. మూ-.
ముక్కపురుగు చూ. ముక్కు[3].
ముక్కమ్మి చూ. ముక్కు[1].
ముక్కర రూ. ముక్కఱ, ముక్కెర, ముంగ[2], ముంగర, ముంగఱ. వి. 1. ముంగర, నాసికా భూషావిశేషం. రం.రా.బాల. 75పు. 5పం.; 2. ముక్కపోగు.
పర్జి. ముఙ్గమ్; కొలా. ముక్కెరమ్, ముక్కేరమ్. ముంగర. మొకరమ్. ముక్కుపుడక.
ముక్కు[1]+రాయి అని సూర్యరాయాంధ్ర నిఘంటువు.
ముక్కరచీర రూ. ముక్కటిచీల, ముక్కరచీల, ముక్కుచీల, ముక్కుజీల, ముక్కెరచీల. వి. జంట నొగలకాడి ముందు కలవటానికి బిగించిన ఇనపరేకు. ముక్కరచీల రూ.చూ. ముక్కరచీర. వి. జంటనొగల బండినొగలను ముందువైపు కలిపి కొట్టిన మేకు. ముక్కర చెవి వి. పుల్లిరుసు తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకు వచ్చేట్టు వేసినకొయ్య. ముక్కరతాడు రూ. ముక్కిడితాడు. వి. చెలివితాడు, మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చే తాడు. ముక్కరబండ వి. కామిరెకు ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకువచ్చిన రాయి. ముక్కరమాకు వి. కామిరెకె ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన కొయ్య. ముక్కరమాను రూ.చూ. ముక్కరమ్రాను. వి. కపిలబావి పుల్లిరుసుకు కట్టిన చట్రం. ముక్కరమ్రాను రూ. ముక్కరమాను, ముక్కుమాను, ముంగరమ్రాను. వి. కపిలబావి పుల్లిరుసుకు కట్టిన చట్రం.
ముక్కరము వి. నాసారంధ్రం, ముకుగోళ్ళు.
ముక్కు[1]+కారెము అని సూ.ని.
ముక్కర్ర చూ. మొక్క. వి. మొక్కచుట్టూ వేసే మొదటి పిలకలు.
ముక్కఱ రూ.చూ. ముక్కర. వి. ముంగర, ముక్కుకు పెట్టుకొనే ఒక నగ.
ముక్కలి చూ. మూ-.
ముక్కలిపీఁట చూ. మూ-.
ముక్కవాసన చూ. ముక్కు[3].
ముక్కవేయు చూ. ముక్కు[3].
ముక్కస రూ.చూ. ముక్కుస. వి. 1. ధాన్యం కొలత; 2. భూమికొలత, 60 సెంట్లు; 3. 3 కుంచాలు, 24 మానికలు.
ముక్కాఁక చూ. మూ-.
ముక్కాఁకయగు చూ. మూ-.
ముక్కాఁకలనాటితేఱు చూ. మూ-.
ముక్కాఁకలఁదేఱు చూ. మూ-.
ముక్కాఁకలుతీరినవాఁడు చూ. మూ-.
ముక్కాటిసుడి చూ. మూ-.
ముక్కాని చూ. మూ-.
ముక్కానిపీట రూ.చూ. ముక్కుపీట. వి. పోలుకఱ్ఱకు కాడికట్టే వైపు అడుగున వేసిన కొయ్యముక్క.
ముక్కాములగా చూ. ముక్కు[1].
ముక్కారు[1] చూ. మూ-.
ముక్కారు[2] రూ. ముగారు. వి. చిమ్మెట, మోటతొండం చివర చేసిన రంధ్రం.
ముక్కారుపంట చూ. మూ-.
ముక్కారుబండు చూ. మూ-.
ముక్కాలిపీఁట చూ. మూ-.
ముక్కాలు చూ. మూ-.
ముక్కాలుకొయ్య చూ. మూ-.
ముక్కాలుగడియ చూ. మూ-.
ముక్కాలుదుడ్డు చూ. మూ-.
ముక్కి రూ.చూ. ముక్కు[1]. వి. తాపీ చివర మొన తేలిన భాగం.
ముక్కిడి వి. ఒకచెట్టు (Schroebera swieuoides).
క. మొక్క. ఒకచెట్టు;
పో.చూ.నం. ముష్క, మొక్ష, ముష్కర. ఒకచెట్టు.
ముక్కిడిగాడు చూ. ముక్కు[1].
ముక్కిడితాడు చూ. ముక్కు[1].
ముక్కిడిదుడ్డు చూ. ముక్కు[1].
ముక్కిడిరోగము చూ. ముక్కు[1].
ముక్కిఁడి చూ. ముక్కు[1].
ముక్కిన వి. పోలుగఱ్ఱకు కాడి కట్టే వైపు అడుగున వేసిన కొయ్యముక్క.
ముక్కినపీట రూ.చూ. ముక్కుపీట. వి. పోలుగఱ్ఱకు కాడి కట్టే వైపు అడుగున వేసిన కొయ్యముక్క.
ముక్కిపోవు చూ. ముక్కు[3].
ముక్కింపురాయి చూ. ముక్కు[3]. వి. నల్లగా గరుగ్గా ఉండే రాయి.
ముక్కిరిచీర రూ.చూ. ముక్కరచీర. వి. జంటనొగల కాడి ముందు కలవటానికి బిగించిన ఇనపరేకు.
ముక్కివాసన చూ. ముక్కు[3].
ముక్కు[1] రూ. ముకు[1], ముక్క. వి. 1. నాసిక, చంచువు. కలకురుకాసనం. క్రీ.శ. 972, భార.ఆది. 5.177; 2. అగ్రభాగం. కాశీ. 4.3; 3. భక్ష్యవిశేషం. కాశీ. 7.185; 4. చట్రంమూలన చెక్కినసగం, కత్తెరగాది; 5. ఏదైనా వస్తువును నిలువుగా ఉంచటం; 6. నాడెచివర కొనదేలిన భాగం.
క. మూగు, మూసు, మూ. మూగు. ముక్కు; కొడ. ముకి; తు. మూకు, మూసిని, మూగు, మూకె; త. మూక్కు, మో. నాసిక, ముక్కువంటి భాగం. మూక్కన్. పెద్దముక్కువాడు; కువి. మూంగెల్లి, ముంగెలి; కొలా. ముంగడ్, ముక్క్, ముకూ్క, ముకుక్, ముచ్ల్. పక్షిముక్కు; గ. ముజన్, ముజాన్; కురు. ముఈఁ; మాల్తొ. మున్ను.

< మూ.ద్రా. *ముక్-/ *మూ.

ముక్కటించు అ.క్రి. ముక్కు శ్వాసను బిగపట్టు. పండి.చ. 5.371 ప. ముక్కట్టు రూ.చూ. ముక్కు కట్టు. వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపి వేసిన కట్టు. ముక్కద్దము వి. సులోచనం. < ముక్కు$^{1}$ + అద్దము. ముక్కద్దాలు వి.బ.వ. సులోచనాలు, కంటిఅద్దాలు. < ముక్కు$^{1}$ + అద్దము + -లు. ముక్కమ్మి వి. ముక్కుకు పెట్టుకొనే నగ. < ముక్కు$^{1}$ + కమ్మి. ముక్కాములగా అవ్య. ముక్కుమునుగునట్లుగా, సంపూర్ణంగా. < ముక్కు$^{1}$ + మునుగు. ముక్కిడిగాడు వి. కంది, పెసర మొ. వాటి పూత, (నుంకు) తిని పోయే కుమ్మరి పురుగు. ముక్కిడితాడు రూ.చూ. ముక్కరతాడు. వి. చెలివితాడు, మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు. ముక్కిడిదుడ్డు వి. పెద్దపైస. ముక్కిడిరోగము వి. ముక్కు ఎముకలకి వచ్చినరోగం. ముక్కఁడి విణ. 1. ముక్కులేని వాడు, ముక్కులేనిది. రామలిం. శ. 33, చంపూరా. 5.41 ; 2. చీటికి మాటికి ఏడ్చేవాడు ; 3. ముక్కుతో మాట్లాడే స్త్రీ ; 4. నడ్డిముక్కు. త. మూక్కలి. ముక్కులేంది. < ముక్కు$^{1}$ + -ఇఁడి. ముక్కుకట్టు రూ. ముక్కట్టు. వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపివేసిన కట్టు. ముక్కుకంబము వి. ముక్కుమధ్యనుండే ఎముక. ముక్కుకమ్మి రూ.చూ. ముక్కుఁగమ్మి. వి. ముక్కుకు పెట్టుకునే నగ. ముక్కుకొయ్య రూ.చూ. ముకుగొయ్య. వి. బాధాకరుడు. ముక్కుకొలికి వి. ఘంటాపదం, చర్వితం. ముక్కుకోఁతలు వి.బ.వ. చిక్కులుపెట్టటం. ముక్కుగాలి వి. స్వరం. ముక్కుగొట్టము వి. ముక్కుకి పెట్టుకొనే ఆభరణం. ముక్కుగోలు రూ.చూ. ముకుఁగ్రోలు. వి. ముక్కుచెరమ. ముక్కుఁగమ్మి (-కమ్మి) రూ. ముకుఁగమ్మి, ముక్కుకమ్మి. వి. నాసాభరణ విశేషం. చమ. 1.53. ముక్కుఁగోళ్లు రూ.చూ. ముకుఁగోళ్లు. వి.బ.వ. నాసాపుటాలు. ముక్కుఁగ్రోలు (-క్రోలు) రూ.చూ. ముకుఁగ్రోలు. వి. నాసాపుటం, ముక్కుచెరమ. కాశ. 2.146. ముక్కుఁగ్రోళ్లు రూ.చూ. ముకుఁగ్రోళ్లు. వి.బ.వ. నాసాపుటాలు. ముక్కుచీల రూ.చూ. ముక్కరచీర. వి. ముక్కెరకనం, జంటనొగల బండి నొగలను ముందువైపు కలిపే ఇనప లేక కొయ్య మేకు. ముక్కుజీరంగి వి. కంది, పెసర మొ. వాటి ఆకులు కాయలు తినే పొడుగాటి ముక్కున్న రెక్కల పురుగు. ముక్కుజీల (-చీల) రూ.చూ. ముక్కరచీర. వి. జంట నొగలను కాడి ముందు కలపటానికి బిగించిన ఇనపమేకు. ముక్కుఁజెరమ (-చెఱమ) రూ. ముకుఁజెఱమ, ముక్కుఁజెఱమ. వి. నాసాపుటం. రాజ.చ. 2.74. ముక్కుఁజెఱమ రూ.చూ. ముక్కుఁజెరమ. వి. నాసాపుటం. ముక్కుడుస్సిన పసరము వి. ముక్కుతాడు వదలిన పశువు (స్వేచ్ఛగా వదిలింది అనటం). వేంక.పంచ. 3.224. ముక్కుతాడు (-త్రాడు) రూ.చూ. ముకుఁద్రాడు. వి. 1. పంటెకు కింది వైపున ఆకుల చివర్లను కాముకు కలిపి కట్టిన తాడు ; 2. ముక్కు లోపలినుంచి దూర్చి కట్టే తాడు. ముక్కుతీరు వి. చక్కని ముక్కు. ముక్కుతుమ్మిడు వి. కంచెల్లో పెరిగి పచ్చని పూలు పూసే మొక్క (Leptadenia reticulata). ముక్కుతెగబారెడుచేయు అ.క్రి. కోపించు. ముక్కుతెవులు వి. ముక్కు రోగం. ముక్కుత్రాడు వి. ముక్కుకు నోటితో కలిపి కంతలుపడి పశువు నీళ్ళు తాగలేని జబ్బు. ముక్కుతోనేడ్చు (-ఏడ్చు) అ.క్రి. నసుగు. ముక్కుదాకాతిను స.క్రి. అతిగా తిను. ముక్కుదాడిమ వి. ఒక చెట్టు. హంస. 4.11. ముక్కుదారం వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపి కట్టిన తాడు. ముక్కుదారంకట్టు వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపి వేసిన కట్టు. ముక్కుదూలము రూ.చూ. ముకుదూలము. వి. ముక్కు మధ్య ఉన్న ఎముక. ముక్కుదొమ్మ వి. ఒకరకం చేప. ముక్కునగవ్వగట్టియాడ్చు (-ఈడ్చు) స.క్రి. అవమానించి లాగుకొనివచ్చు (గవ్వలు కట్టడం అవమాన సూచకం). దశా.వామ ప. 166. ముక్కునఁగోపముండు (-కోప ముండు) అ.క్రి. అతికోపిష్టియగు. గౌ.హరి. పూ. 1.566. పం. ముక్కుననీరెత్తు అ.క్రి. శిక్షకోసం ముక్కుతో నీరు పోయు. శేయూ. 3.201. ముక్కుననుండుగోపము (-ఉండు + కోపము) వి. శీఘ్రంగా వచ్చే కోపం. గౌ.హరి.పూ. 694. ముక్కుననూర్పు (-ఊర్పు) వి. కొనఊపిరి. తాళ్ల.సం. 9.29. ముక్కుననూర్పుగల్గు (-కల్గు) అ.క్రి. బ్రతికిఉండు. భార.విరా. 2.226. ముక్కుననూర్పుమోయు అ.క్రి. కొనఊపిరితో ఉండు. తాళ్ల.సం. 8.78. ముక్కున ప్రాణముండు అ.క్రి. అవసానదశలో ఉండు. ముక్కునబంటిగ అవ్య.ద్రు. ముక్కుదాకా, తలకుమించి (పూర్తిగా అందులో మునిగిపోవునట్లు). కు.సం. 12.197. ముక్కునవయ్యంగదిను స.క్రి. బాగాతిను. తాళ్ల.సం. 4.142. ముక్కునవ్రేలిడు అ.క్రి. ఆశ్చర్యపడు. వాశి.రా. 2.162. < ముక్కు$^{1}$ + నన్ + వ్రేలు + ఇడు. ముక్కునానోటా అవ్య. ఎక్కువగా. ముక్కుమూర్పుగాలి వి. కొనఊపిరి. తాళ్ల.సం. 8.57. ముక్కుఁదఱుగు (-తఱుగు) స.క్రి. శిక్షించు. గౌ.హరి.పూ. 1981-82. ముక్కుఁద్రాడు (-త్రాడు) రూ.చూ. ముకుఁద్రాడు. వి. నాథం, ముక్కుకు కట్టే తాడు. ముక్కుపచ్చలారని విణ. వయసురాని. చంద్రాంగ. 5.86. ముక్కుపచ్చలుకాకమునుపె అవ్య. చిన్నతనంలో. ముక్కుపచ్చలు మానని వి. పసితనంపీడని. రాధికా. 3.8. ముక్కుపట్టని ముత్యము వి. పెదవికి మించిన పళ్ళులాంటి పలుకుబడి. ముక్కువట్టుకొని కూర్చుండు రూ. ముక్కుఁబట్టుకొని కూర్చుండు. అ.క్రి. జపం చేసుకొనుచుండు. రామాభ్యు. 8.182. ముక్కుపట్టుకొను స.క్రి. 1. జపంచేయు ; 2. నిర్బంధించు. ముక్కుపీట రూ. ముక్కనిపీట, ముక్కానిపీట, ముక్కనపీట. వి. అరక, ఎత్తుపీట, గడ్డం, గుర్రంపీట, బండి నాగేలి, పోలుకర్రకు కాడి కట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క. ముక్కుపీనాసతీగె వి. కంచెల్లో పెరిగే ఒకరకం తీగ (Naravelia zeylanica). ముక్కుపుడక వి. ముక్కుకి పెట్టుకొనే ఆభరణం. ముక్కుపురిడి వి. ఒకరకం పిట్ట. ముక్కుపుల్ల వి. 1 ఒక రాయి వేసిన ముక్కుపుడక ; 2. బులాకి. ముక్కుపూరెడు వి. ఒకజాతి పూరేడుపిట్ట. ముక్కుపూరేడుపిట్ట వి. ఒకరకం

పిట్ట. ముక్కుపైఁగత్తి (-కత్తి) వి. భయంకరుడు, పనిపట్టించ గలవాడు. పండి.చ. 1.3.511 వ. ముక్కుపైఁ వ్రేలిడు అ.క్రి. ఆశ్చర్యపడు. పల్నా వ. 112. ముక్కుపైఁ వ్రేలు చెక్కు స.క్రి. ముక్కుపై వేలు వేసుకొను. ధర్మజ. 51.11. ముక్కుపైఁ వ్రేలువేసికొను అ.క్రి. ఆశ్చర్యపడు. ముక్కుపొడి రూ. ముకుపొడి. వి. నశ్యం. ముక్కుపొడిచాయ రూ. ముక్కుపొడిసాయ. వి. ముక్కుపొడి రంగు. ముక్కుపొడి సాయ (-చాయ) రూ.చూ. ముక్కుపొడిచాయ. వి. ముక్కు పొడి రంగు. ముక్కుపొడుము రూ. ముకుపొడుము. వి. నశ్యం. ముక్కుపోఁగు రూ. ముకుపోఁగు. వి. ముక్కుకమ్మి, నత్తు. ముక్కుబద్దలగు అ.క్రి. దుర్వాసనతో భరించలేక పోవు. ముక్కుబంతి రూ.చూ. ముకుబంతి$^{2}$. వి. 1. ముగుదుమ్మ, ముట్టెబంతి, విపరీతంగా తుమ్ములు, ముక్కులవెంబడి నీళ్ళు, చీమిడి కారటం, రోగం ముదిరితే తుమ్మినప్పుడు ముక్కునుండి కండలు పడతాయి. వీటిని ముగబంతికాయ లంటారు; 2. చలవవల్ల ఆవు ముక్కుకు వచ్చే రోగం. ముక్కుబ్రుర వి. ముకుత్రొర, ముక్కుకు నోటికి కలిపి కంతలు పడి పశువు నీళ్ళు తాగలేని జబ్బు. ముక్కుబెదురు అ.క్రి. దెబ్బ తగిలినప్పుడు ముక్కులోంచి రక్తం వచ్చు. ముక్కుమరిగె వి. పులుసు, చారు వడ్డించ టానికి వాడే మట్టిపాత్ర. ముక్కుమీఁదకొట్టిచేయించుకొను అ.క్రి. బలవంతంగా ఆ పని నిర్వర్తించుకొను. ముక్కు మీఁదకోపం వి. కోపిష్ఠి. ముక్కుమీఁదవేలిడు అ.క్రి. ఆశ్చర్యపడు. తాళ్ల.సం. 14.36. ముక్కుమీఁదవేలువేసు కొను అ.క్రి. ఆశ్చర్యపడు. ముక్కుముంగర$^{1}$ వి. ఒకానొక అడవిచెట్టు. ముక్కుముంగర$^{2}$ వి. ముక్కున పెట్టుకునే ఆభరణ విశేషం. ముక్కుమురికె వి. సిగమోర, తాడుతో గాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. ముక్కుముల్లు వి. ముక్కులో గుచ్చుకున్న ముల్లు, బాధకుడు, బాధకమైంది. రం.రా.ఉ. 148 వ. 19 పం. ముక్కుమూసికొను స.క్రి. 1. దుర్వాసనను భరించలేక పోవు; 2. తపస్సు చేసికొను. ముక్కుమొగంఎరుగకుండు అ.క్రి. ముఖపరిచయం లేకుండు. ముక్కుమొగంచదరమగు అ.క్రి. బాగా దెబ్బ తగులు. ముక్కుమొగముచూచు అ.క్రి. ఆదరించు. భీమ. 3.8. ముక్కుమొగముచూడక అవ్య. 1. మొగమాటం లేక. భీమ. 3.8; 2. మంచి చెడ్డ లాలోచించక. ముక్కుమొగమేడ (-ఏడ) అవ్య. ముక్కెక్కడిది, ముఖ మెక్కడి దనటం, అంత యోగ్యత ఎక్కడి దనటంలోని పలుకుబడి. గౌ.హరి.ఉ. 1056 పం. ముక్కు మొగంబాగుండు అ.క్రి. అందంగాఉండు. ముక్కుమోమెఱుఁగు స.క్రి. బాగా తెలిసికొను. అష్టమ.క. 2351. <ముక్కు$^{1}$ + మోము + ఎఱుఁగు. ముక్కుఁ బట్టుకొని కూర్చుండు రూ.చూ. ముక్కుపట్టుకొనికూర్చుండు. అ.క్రి. జపం చేస్తూ కూర్చొను. ముక్కులు$^{1}$ వి.బ.వ. చూచుకాలు. పక్షి ముక్కులు. ముక్కులు$^{2}$ వి.బ.వ. భక్ష్య విశేషం. కాశీ. 7.186. ముక్కులుపగిలిపోవు అ.క్రి. దుర్వాసన భరించలేక పోవు. ముక్కులోనికిచాలు అ.క్రి. చాలా తక్కువ అగు. ముక్కులో పొగలువచ్చు అ.క్రి. కారం ఘాటు నసాళాని కంటు. ముక్కులోవెంట్రుకపీకు అ.క్రి. మనస్సు చివుక్కు మను. ముక్కువాతనుండు అ.క్రి. చివరఉండు. తాళ్ల.సం. 8.41. ముక్కువాసం రూ. ముక్కోసం. వి. చుట్టంటి కొప్పును నిలిపే మూడు పొడుగు వాసాల త్రిభుజం. ముక్కువిఱుచు స.క్రి. నిరసించు. కవిక. 5.110. ముక్కు సరము వి. స్వరం. ముక్కుసిల రూ.చూ. ముక్కుసెల. వి. ముక్కు నరాల్లో నెత్తురు పేరుకొని బిగదీసుకుపోవటం. ముక్కుసీల రూ.చూ. ముక్కుసెల. వి. ముక్కు నరాల్లో నెత్తురు పేరుకొని బిగదీసుకుపోవటం. ముక్కుసెల రూ. ముక్కుసిల, ముక్కుసీల, ముగుసెల, మోరసెల. వి. ముక్కు నరాల్లో నెత్తురు పేరుకొని బిగదీసుకుపోవటం. ముక్కుసొట్టపోవు అ.క్రి. నష్టపోవు. ముక్కూచెవులూకోయు స.క్రి. అవమానపరచు. ముక్కూమొహంతెలియకుండు అ.క్రి. 1. అమాయకంగాఉండు; 2. అజ్ఞానంలోఉండు; 3. పరిచయం లేకుండు. ముక్కూమోమెఱుఁగు అ.క్రి. చిర పరిచితమగు. ముక్కోపము వి. శీఘ్రంగా వచ్చే కోపం. సం. కోప-. కోపం. <ముక్కు$^{1}$ + సం. కోప-. ముక్కోపి వి. ఎక్కువ కోపం కలవాడు, కలది. సం. కోపిన్. కోపం కలవాడు. <ముక్కు + సం. కోపిన్. ముక్కోసం రూ.చూ. ముక్కువాసం. వి. చుట్టంటి కొప్పును నిలిపే మూడు పొడుగు వాసాల త్రిభుజం.

ముక్కు$^{2}$ రూ. ముకు$^{2}$. అ.క్రి. 1. ముక్కటించు, శ్వాసాన్ని బిగబట్టు. చంద్రాంగ. 6.94; 2. మూలుగు.

క. ముక్కరె, ముక్కఱి. బాధపడు; తు. ముక్కురుని, ముక్కురు, మూలుగు; త. ముక్కు (ముక్కి-). బడలు, కృషిచేయు, ముక్కల్, ముక్కు. ప్రయాణంలో బడలటం; మ. ముక్కుక. అలయు, ముక్కల్, ముక్కమ్. బడలిక; కో. ముక్, ముక్య్. నొప్పులుపడు; బ్రా. ముక్కింగ్. నత్తి.

ముక్కుతూమూలుగుతూ అవ్య. అయిష్టంతో, బాధతో.

ముక్కు$^{3}$ రూ.చూ. ముక్కు. అ.క్రి. 1. (తడిచేత) చెడు. వేమ. 285; 2. సారహీనమగు.

క. ముఱికల్. అశుభ్రత, మురికి, ముగ్గు. కంపుకొట్టు, కంపు; తు. ముర్గుని. పులిసిపోవు; త. ముఱి- (-వ్-, -న్ట్-). చెడిపోవు, ముఱి (-ప్-, -త్త్-). పాలలాగా విరుగు; పర్జి. ముర్, ముర్రు, ముర్ర, మురట్. చెడిన.

ముక్కనిచ్చు స.క్రి. ముక్కపెట్టు, మగ్గనిచ్చు. <ముక్కు$^{3}$ + -అ$^{7}$ + ఇచ్చు. ముక్కపురుగు రూ.చూ. ముక్కు పురుగు. వి. తవుడు ముక్కినప్పుడు దానిలో పుట్టే పురుగు. ముక్కవాసన రూ.చూ. ముక్కువాసన. వి. ముక్కిపోయిన వాసన. ముక్కవేయు స.క్రి. పండవేయు, ముక్కించు. <ముక్కు$^{3}$ + -అ$^{7}$ + వేయు. ముక్కిపోవు రూ.చూ. ముక్కు పోవు. అ.క్రి. 1. ముక్కు. చెడిపోవు; 2. కాల్చులో కొన్ని కుండల అంచులు మొక్కపోవు. ముక్కివాసన రూ.చూ. ముక్కువాసన. వి. ముక్కిపోయిన వాసన. ముక్కుగొయ్య (-కొయ్య) రూ.చూ. ముకుగొయ్య. వి. నాశకుడు. అచ్చ.రా. యు. 204. ముక్కుఁగొయ్య రూ.చూ. ముకుగొయ్య. విణ. నాశకుడు, నాశకం. ద్వి. పరమ. వి. 2.101. ముక్కుపురుగు

రూ. ముక్కపురుగు. వి. తవుడు ముక్కినప్పుడు దానిలో పుట్టిన పురుగు, తవుటి పురుగు. ముక్కుపోవు రూ. ముక్కిపోవు. అ.క్రి. 1. కాల్పులో కొన్ని కుండల అంచులు మొక్కపోవు ; 2. ముగ్గు, చెడిపోవు. ముక్కులు వి.బ.వ. నూకలు. ముక్కువాసన రూ. ముక్కవాసన, ముక్కివాసన, ముగ్గువాసన, ముగ్గోసన. వి. ముక్కిపోయిన వాసన.

ముక్కుటపు పంచె చూ. ముక్కుటము.

ముక్కుటము రూ.చూ. ముకుటము. వి. నారమడి, క్షౌమం, నారచీర.

ముక్కుటపుపంచె వి. ఒకరకం పంచె.

ముక్కుటమూపురు చూ. ముక్కు[1]. సర్వ.బ.వ. సరిగా ముగ్గురు. ఉ.హరి. 6.37.

ముక్కుమాను రూ.చూ. ముక్కర్రమాను. వి. కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన కొయ్య.

ముక్కున చూ. మూ-.

ముక్కూచెవులూకోయు చూ. ముక్కు[1].

ముక్కూమొహంతెలియకుండు చూ. ముక్కు[1].

ముక్కూమోమెఱుగు చూ. ముక్కు[1].

ముక్కూరిపగచు చూ. ముక్కూరు.

ముక్కూరు చూ. ముక్కు[3]. అ.క్రి. అజ్ఞానాన్ని పొందు. భార. ఉద్యో. 2.222.

ముక్కూరిపగచు అ.క్రి. ఏడ్చు. భార. ఉద్యో. 2.222.

ముక్కెము వి. ప్రధానం.

నం. ముఖ్య-. ప్రధానమైనది.

<నం. ముఖ్య-.

ముక్కెర రూ.చూ. ముక్కర. వి. 1. స్త్రీలు ముక్కుపుడకకు బదులుగా ఒకపక్కన ధరించే పెద్ద వలయపు నగ; 2. ముక్కుపోగు.

ముక్కెరకన రూ.చూ. ముక్కెరకనం. వి. జంటనొగల బండి నొగలను ముందువైపు కలిపే కొయ్యమేకు. ముక్కెరకనం యా. ముక్కెరకన. వి. జంటనొగల బండినొగలను ముందువైపు కలిపే కొయ్యమేకు. ముక్కెరకొలుకులు రూ. ముచ్చెరకొలుకులు. వి.బ.వ. ముత్యంపేటు, జరీతోగాని కృత్రిమపు పట్టుతోగాని వరసగా 2, 6 పోగులతో నేసిన డిజైను. ముక్కెరచీల రూ.చూ. ముక్కరచీల. వి. జంటనొగల బండి నొగలను ముందువైపు కలిపి కొట్టిన మేకు.

ముక్కొంకులు చూ. మూ-.

ముక్కొటిక చూ. మూ-.

ముక్కొటిక గెలుపరి చూ. మూ-.

ముక్కొటికగెల్పరి చూ. మూ-.

ముక్కొడు చూ. కోడు. వి. సీటిపల్లం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 196. క్రీ.శ. 1177.

ముక్కొను చూ. ముందు.

ముక్కొమ్మొకము చూ. ముందు.

ముక్కొయ్యలు చూ. మూ-.

ముక్కోటి చూ. మూ-.

ముక్కోటికలకంటు చూ. మూ-

ముక్కోణంగూడు చూ. మూ-.

ముక్కోణపుబద్ద చూ. మూ-.

ముక్కోణమార్చి చూ. మూ-.

ముక్కోణము చూ. మూ-.

ముక్కోణంబద్ద చూ. మూ-.

ముక్కోండం చూ. మూ-.

ముక్కోనంపట్టె చూ. మూ-.

ముక్కోపము చూ. ముక్కు[1].

ముక్కోపి చూ. ముక్కు[1].

ముక్కోల చూ. మూ-.

ముక్కోసం చూ. ముక్కు[1].

ముక్తసరి రూ.చూ. ముఖసరు. వి. సంగ్రహం.

ముక్తసరు రూ.చూ. ముఖసరు. వి. సంగ్రహం.

ముక్తాయము రూ. ముక్తాయి. వి. 1. మద్దెలవాద్యపు ముగింపు. సమీర. 6.201 ; 2. ముగింపు.

ఉ. ముక్తా. విడిపడిన; పార. ముక్తాల. చిరిగిన, విడిపోయిన;

క. ముక్తాయ. మద్దెలముగింపు.

<ఉ. ముక్తా.

ముక్తాయింపు వి. 1. ముగింపు ; 2. వాద్యంతోను, ఆటతోను కూడిన పాట; 3. పాటవెనక వాద్యం.

ముక్తాయి రూ.చూ. ముక్తాయము. వి. మద్దెలవాద్యపు ముగింపు.

ముక్తాయింపు చూ. ముక్తాయము.

ముక్తియారు రూ.చూ. ముక్త్యారు. వి. సంపూర్ణాధికారంగల రాయబారి.

ముక్త్యార్ రూ.చూ. ముక్త్యారు. వి. స్వతంత్రుడు.

ముక్త్యారు రు. ముక్తియారు, ముక్త్యార్, మొక్త్యార్. వి. 1. సంపూర్ణాధికారం గల రాయబారి ; 2. పైవిచారణచేసే అధికారి ; 3. స్వతంత్రుడు.

హిం. ముఖ్తార్. ఏజంటు, డిప్యూటీ, అటార్ని ; ఉ. అర. ముక్‌తార్. ఏజంటు, ఎన్నుకోబడిన, స్వతంత్రమైన, అధికారం, పలుకుబడిగల, స్వతంత్రుడైన, వేరొకనికి బదులుగా సంపూర్ణాధికారంతో వ్యవహరించే ఏజెంటు ;

క. మెక్తియార్, మొక్తియార. పూర్తిగా, స్వతంత్రమైన, స్వాతంత్ర్యం. ఏజంటు, అటార్ని, సర్వాధికారంగల రాయబారి ; త. ముక్తియార్ ; మ. ముక్తియార్.

<ఉ. ముక్‌తార్.

ముక్త్యారునామా వి. పవరుపట్టా, అధికారపత్రం.

ఉ.అర. ముక్‌తార్-నామా. పవర్ ఆఫ్ అటార్నీ ;

క. మొక్త్యార్-నామా. ముక్త్యారునామాలు రిగ్యులేషన్‌ను అనుసరించి తగిన వెలగల ఛాపా కాగితాల మీద రాసిఉండవలెను.

<ఉ. ముక్‌తార్-నామా.

ముక్స రూ.చూ. ముక్కున. వి. 1. ధాన్యంకొలత, 3 కుంచాలు, 24 మానికలు ; 2. భూమికొలత, 60 సెంట్లు.

ముక్సా రూ.చూ. ముక్కున. వి. 1. ధాన్యంకొలత ; 3 కుంచాలు, 24 మానికలు ; 2. భూమికొలత, 60 సెంట్లు.

ముఖం వి. 1. నిరసనగా అనేమాట ; 2. మట్టు, గూన చివరి

వెడల్పాటి భాగం.

సం. ముఖ-. మోము, నోరు.

< సం. ముఖ- (అర్థవిపరి.).

**ముఖంరాయి** రూ.చూ. ముఖపురాయి. వి. ఒంటిరాయి, ఒకవైపున చదునుగా నున్నగా చెక్కబడిన రాయి. **ముఖంవాచేటట్టుతిట్టు** స.క్రి. బాగా తిట్టు. **ముఖంవెలవెలపోవు** అ.క్రి. మొగం తెల్లబడు. **ముఖంచాటుచేసుకొను** అ.క్రి. మొగం తప్పించుకొను. **ముఖంచెల్లు** అ.క్రి. సంకోచం లేకపోవు. **ముఖంమాడు** అ.క్రి. (అవమానాదులవల్ల) ముఖం నల్లబడు. **ముఖంమొత్తు** అ.క్రి. వినుగెత్తు.

**ముఖకవళికలు** వి.బ.వ. ముఖంలోని భావరేఖలు.

సం. ముఖ-. మోము.

< సం. ముఖ- + కవళికలు (మిశ్రస).

**ముఖచాళిక** వి. మల్లబంధవిశేషం. ఉ.హరి. 3.64.

సం. ముఖ-. మొగం.

< సం. ముఖ- + చాళిక. (మిశ్రస.).

**ముఖండి** వి. అధికారి.

**ముఖతః** వి. స్వయంగా.

సం. ముఖతః. నోటినుంచి.

< సం. ముఖతః (అర్థవిపరి.).

**ముఖదాక్షిణ్యం** వి. మొగమాటం.

సం. ముఖదాక్షిణ్య, ముఖకారుణ్యం.

< సం. ముఖదాక్షిణ్య-(అర్థవిపరి.).

**ముఖపాఠము** వి. నోటికి వచ్చినట్లు వల్లించిన పాఠం.

సం. ముఖపాఠ-. నోటికి సంబంధించిన పాఠం.

< సం. ముఖపాఠ-. (అర్థవిపరి.).

**ముఖపురాయి** రూ. ముఖంరాయి. వి. ఒంటిరాయి. ఒకవైపున చదునుగా నున్నగా చెక్కబడినరాయి.

**ముఖమంట్టపము** వి. అంతరాళికకు ముందుండే మండపం. నె.శా.దర్శి. క్రీ.శ. 1145.

సం. ముఖమండప-. ముందుండే మండపం.

< సం. ముఖమండప-.

**ముఖమంతచేసుకొను** అ.క్రి. సంతోషించు.

సం. ముఖ-. మొగం.

< సం. ముఖ- + -ము + అంత + చేసుకొను.

**ముఖమల్లు** రూ. మఖమల్, మఖమలు, మహమల్, ముకమాలు, ముఖమాలు, మొకమలు, మొకమాల్, మొకమాలు, మొకములు, మొఖమల్, మొఖ్‌మల్, మొగమాలు, మొలుమలు, మొహమల్, మొహమలు. వి. ఒకరకం మేలుజాతి పట్టు. పల్నా. పు. 17.

హిం. మఖ్‌మల్. ఒకరకం బహుమూల్య మృదు వస్త్రం ; మరా. మఖ్‌మల్. ఒకరకం మృదువస్త్రవిశేషం ; ఉ. ముఖ్‌మల్, ముఖముల్. ఒకరకం మృదువస్త్రం ; పార. ముఖ్‌మల్, ముఖ్‌మల్. బొచ్చు దుస్తులు.

< ఉ. ముఖ్‌మల్.

**ముఖమాలు** రూ.చూ. ముఖమల్లు. వి. ఒకరకం మేలుజాతి పట్టు. పల్నా. పు. 29.

**ముఖమింతచేసుకొను** అ.క్రి. చిన్నబుచ్చుకొను.

సం. ముఖ-. మొగం.

< సం. ముఖ- + -ము + ఇంత + చేసికొను.

**ముఖరం** రూ.చూ. మొక్కరము[1]. వి. 1. నిరోధం, ఆటంకం ; 2. గడెమ్రాను, అడ్డగడియ, అరళం ; 3. స్తంభం.

**ముఖలక్షణం** వి. అదృష్టం.

సం. ముఖలక్షణ-. మొగంగుర్తు,

< సం. ముఖలక్షణ- (అర్థవిపరి.).

**ముఖవచనం** వి. నేరుగా చెప్పినమాట.

సం. ముఖవచన-. నోటిమాట.

< సం. ముఖవచన-(అర్థవిపరి.).

**ముఖవీణ** రూ.చూ. ముఖవీణియ. వి. వాద్యవిశేషం. వీణాభేదం.

**ముఖవీణియ** రూ. ముఖవీణ, ముఖవీణె. వి. ఒకరకమైన వాద్యం. ప్రబంధ. 83.

సం. ముఖ-. ముఖ్యమైన, వీణా. వాద్యవిశేషం.

< సం. ముఖవీణా.

**ముఖవీణె** రూ.చూ. ముఖవీణియ. వి. వాద్యవిశేషం, వీణాభేదం. ప్రబంధ. 605.

**ముఖసరు** రూ. ముక్తసరి, ముక్తసరు. వి. సంగ్రహం.

హిం. ముఖ్తసర్. సంక్షేపించబడిన, చిన్న, కొంచెం, సంగ్రహించబడిన ; ఉ.అర. ముఖ్‌తసర్. సంగ్రహించబడిన, తగ్గించబడిన, సంక్షేపం, సంగ్రహం, తాత్పర్యం ; త. ముక్తసరు.

< ఉ. ముఖ్‌తసర్.

**ముఖానఉమ్మివేయు** స.క్రి. అవమానించు, నీచంగాచూచు.

సం. ముఖ-. మొగం.

**ముఖామి** వి. ముసద్ది, లేఖకుడు. కృష్ణరా. 2.118.

హిం ఉ.పార. ముకామీ. కార్యాలయంతో సంబంధం ఉన్న వాడు.

< ఉ. ముకామీ.

**ముఖాము** రూ.చూ. ముకాము. వి. బస, ఒకటే విభాగం.

**ముఖాసా** రూ. ముకాసా, మొఖాసా, మొఖాసీ. వి. 1. శిరవ లేని భూమి, మాన్యం. ద.హిం.శా.సం. 758. క్రీ.శ. 1658, గౌ.హరి. పూ. 66 ; 2. శిస్తు లేక గాని తక్కువ శిస్తు విధించికాని ఇచ్చిన గ్రామం.

హిం.ఉ.పార. ముకాస. పన్ను లేకుండా అనుభవించటానికి ఇవ్వబడ్డగ్రామం.

< ఉ. ముకాస.

**ముఖ్ఖీ** వి. కలంకారీ అద్దకానికి కొయ్యఅచ్చుమీద గుద్దే గూటం.

సం. ముఖ-. అగ్రభాగం ; ఒ. ముఖి. గుద్దు.

**ముగ** రూ.చూ. మూగ[2]. వి. అచ్చుతీసేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు.

**ముగండి** వి. 1. ఎక్కువమందికి ఒకేసారి వచ్చిన రోగం ; 2. దుక్క దాలించి ఆహారంకోసం వెళ్ళినప్పుడు ఒక్క దగ్గర పోగు చేసి నిలిపిన అరకల మొత్తం.

**ముగత** రూ.చూ. ముగుద. వి. మగనాలు, ముత్తైదువ.

**ముగదాడు** రూ.చూ. ముకుద్రాడు. వి. ముక్కుగుండా దూర్చికట్టే తాడు.

ముండ్లకంచియ చూ. ముల్లు.
ముండ్లకంచె చూ. ముల్లు.
ముండ్లకల్ల చూ. ముల్లు.
ముండ్లకుసుమ చూ. ముల్లు.
ముండ్లగొబ్బి చూ. ముల్లు.
ముండ్లతోటకూర చూ. ముల్లు.
ముండ్లపంది చూ. ముల్లు.
ముండ్లపైకూర్చున్నట్లు చూ. ముల్లు.
ముండ్లపొద చూ. ముల్లు.
ముండ్లబూరగ చూ. ముల్లు.
ముండ్లమండ చూ. ముల్లు.
ముండ్లము వి. మెుండెం, ఒకరకం చేప.
ముండ్లముటాకోరు చూ. ముంత.
ముండ్లములుచింత చూ. ముల్లు.
ముండ్లముస్తె చూ. ముల్లు.
ముండ్లవెదురు చూ. ముల్లు.
ముండ్లశేషణం చూ. ముల్లు.
ముండ్లసుత్తె చూ. ముల్లు.
ముండ్లుగండ్లుఅనక చూ. మల్లు.

**ముతక** రూ.చూ. ముదుక. విణ. మోటైన ; విణ. **1**. తల వెంట్రుకలకు పట్టిన జిడ్డు ; **2**. లావు ; **3**. మొరటు.

**ముతకదుప్పటి** వి. మందపు దారాలతో నేసిన దుప్పటి. **ముతకనూలు** రూ. ముదుగునూలు. వి. పోగు మందంగా ఉండే నూలు. **ముతకబట్టు(-పట్టు[1])** అ.క్రి. **1.** నూనె మొ. వాటిచే ముక్కువాసన పట్టు ; **2.** మైలపట్టు. **ముతకబడలు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **ముతకబుడమ** రూ. మోతకబుడమ. వి. వడ్లలో ఒకరకం. **ముతక్కలుపు** వి. పైరు పొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. < ముతక + కలుపు.

**ముతక్కలుపు** చూ. ముతక.

**ముతరాచ** రూ. ముతురాచ, ముత్తరాచ, ముత్తరాజ, ముత్తిరాచ, ముత్తిరాజు. వి. కిరాతభేదం, బోయల్లో ఒక తెగ, సవారీ మోసే శూద్ర జాతిభేదం. ప్రబంధ. 193.

**ముతవల్లీ** వి. మసీదు కోశాధికారి.

హిం. ముతవల్లి. మైనరయిన పిల్లవాడి సంరక్షకుడు; ఉ.అర. ముతావల్లీ, మసీదుయొక్క కోశాధికారి ;

త. ముతవల్లి.

< ఉ. ముతావల్లీ.

**ముతసద్ది** రూ.చూ. ముత్సద్దీ. వి. లేఖకుడు, వ్రాయసకాడు.

**ముతసద్దీ** రూ.చూ. ముత్సద్దీ. వి. లేఖకుడు, వ్రాయసకాడు.

**ముతస్సది** రూ.చూ. ముత్సద్దీ. వి. గణకుడు, గుమాస్తా.

**ముతాలీకు** వి. సంబంధి, ఆశ్రితుడు. నె. శా. 3 సంపు. ఉదయగిరి. క్రీ.శ. 1661-62.

మరా. ముతాలిక్ ; ఉ. ముతఅల్లిక్. ప్రతినిధి, నౌకరు ; పార. ముతఅల్లిక్. బంధువు, ఆశ్రితుడు ; అర. ముతఅల్లిక్. సంబంధి.

< ఉ. ముతఅల్లిక్.

**ముతుక** రూ.చూ. ముదుక. విణ. ముదుగు. వేంక.పంచ. 1.588.

**ముతురాచ** రూ.చూ. ముతరాచ. వి. సవారీ మోసే శూద్ర జాతి భేదం.

**ముత్త** రూ. ముత్తి[3]. విణ. **1**. ముసలి, వృద్ధుడైన ; **2.** ముదిరిన.

క. ముత్తు. ముసలితనం ; త. మూత్త. పెద్ద, వయసు మీరిన, గొప్ప ; మ. మూదు ;

సం. మూఢ-. తెలివిలేనిది, మందబుద్ధి, సొమ్మసిలినది.

**ముత్తయిదువ** రూ.చూ. ముత్తైదువ. వి. భర్త జీవించి ఉన్న స్త్రీ. < ముత్త + అయిదువ. **ముత్తవ[1]** రూ. ముత్తవ్వ. వి. **1.** ప్రపితామహి, పితామహుని తల్లి. బసవ. 3.402 పం. ; **2**. మాతామహుని తల్లి, తల్లిమాతామహి. < ముత్త + అవ్వ. **ముత్తవతల్లి** వి. వృద్ధ పితామహి. **ముత్తవ్వ** రూ.చూ. ముత్తవ[1]. వి. **1**. వృద్ధ పితామహి, పితామహి అత్త. ఆం.భా. 2.112 ; **2**. వృద్ధ మాతామహి తల్లి. **ముత్తాకు** వి. ముదురాకు. < ముత్త + ఆకు. **ముత్తాత** వి. **1**. ప్రపితామహుడు, పితామహుని తండ్రి. గౌ.హరి. పూ. 33 ప. ; **2**. మాతామహుని తండ్రి, తల్లి తాత, < ముత్త + తాత. **ముత్తైద** రూ.చూ. ముత్తైదువ. వి. వృద్ధురాలైన సువాసిని. **ముత్తైదువ** రూ. ముత్తయిదువ. ముత్తైద. వి. వృద్ధసువాసిని. శృం.నై. 6.14. < ముత్త + ఐదువ. **ముత్తో** వి. వృద్ధపితామహి. హర. 7.125 < ముత్త + అవ్వ.

**ముత్తకాయ** రూ. ముద్దకొయ్య. వి. **1**. పంటెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; **2**. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు ; **3**. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటం కింది దిమ్మ ; **4**. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు.

**ముత్తంచు** చూ. ముత్తియము. వి. ముత్యం పేటు పెట్టి నేసిన అంచు.

**ముత్తడము** వి. ఉత్తరిగ, భూషణం.

**ముత్తనియ్యవేలు** చూ. ముత్త. వి. జుట్టినవ్రేలు.

**ముత్తర** రూ.చూ. ముత్తరము. వి. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

**ముత్తరంగలు** చూ. మూ-.

**ముత్తరము** చూ. మూ-.

**ముత్తరాచ** రూ.చూ. ముతరాచ. వి. ఒక శూద్రజాతి.

**ముత్తరాజ** రూ.చూ. ముతరాచ. వి. ఒక శూద్రజాతి.

**ముత్తటి[1]** చూ. మూ-.

**ముత్తటి[2]** చూ. మూ-.

**ముత్తల** చూ. మూ-.

**ముత్తవ** రూ. ముత్తువ, ముత్తావ. వి. చిట్టాముదం చెట్టు, బల. ఆం.భా. 2.56.

**ముత్తవపులగము[1]** రూ.చూ. ముత్తవ్వపులగము. వి. బంజరుల్లో అడవుల్లో పెరిగే మొక్క (Pavonia odorata). **ముత్తవపులగము[2]** వి. ఎర్రని పూలు పూసే పెద్ద చెట్టు (Mimosa rubicaulis). **ముత్తవపులగము[3]** రూ. వి. బంజరుల్లోనూ, బాటల పక్కనా పెరిగే మొక్క

(Sida cordifolia). **ముత్తవపులగము**[4] రూ. ముత్తవ్వపులగ. వి. బంజరుల్లో పెరిగే మొక్క (Sida rhombofolia). **ముత్తవపులగము**[5] వి. చిట్టాముదం చెట్టు, బల.

**ముత్తవ్వపులగ** రూ.చూ. ముత్తవపులగము[4]. వి. బంజరుల్లో పెరిగే మొక్క (Sida rhombofolia).

**ముత్తవ్వపులగము**[1] రూ. ముత్తవపులగము[1], ముత్తుపులగము. వి. బంజరుల్లోనూ అడవుల్లోనూ పెరిగేమొక్క (Pavonia odorota).

**ముత్తవ్వపులగము**[2] వి. బంజరుల్లోను అడవుల్లోను పెరిగే ఒక రకం మొక్క (Sida ocuta).

**ముత్తవ్వబిరిబెండ** వి. కొండల్లో పెరిగేమొక్క (Abutilon indicum).

**ముత్తసూరి** రూ.చూ. మోతిచూరు. వి. జరీతోగాని కృత్రిమపు పట్టుతోగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను.

**ముత్తాకు** చూ. ముత్త.

**ముత్తాటిపండుదిను** చూ. మూ-.

**ముత్తాడు** చూ. మూ-.

**ముత్తాత** చూ. ముత్త.

**ముత్తాని** చూ. అని[4]. వి. ఏతం సిడెను బొక్కెనను కలిపే వెదురుగడ.

**ముత్తి**[1] వి. మోక్షం, నిర్వాణం. అచ్చ. రా. బాల. 11, నీలా. 1.118.

నం. ముక్తి-. మోక్షం; ప్రా. ముత్తి; అప. అ. మా. పా. ముత్తి.

<ప్రా. ముత్తి.

**ముత్తి**[2] రూ.చూ. ముత్తియము. వి. ముత్యం.

**ముత్తి**[3] రూ.చూ. ముత్త. విణ. 1. ముసలి, వృద్ధుడైన; 2. ముదిరిన.

**ముత్తిక**[1] వి. ముట్టడి. కువ. చ. 3.8.

**ముత్తికచేయు** స.క్రి. ముట్టడించు. **ముత్తికవేయు** స.క్రి. 1. ముగించు. వర. రా. యు.; 2. ముట్టడించు.

**ముత్తిక**[2] చూ. మూ-.

**ముత్తిగ** చూ. మూ-.

**ముత్తియపుగమ్మ** చూ. ముత్తియము.

**ముత్తియము** రూ. ముచ్చం, ముచ్చిం, ముచ్చెం, ముచ్యం. ముత్తి[2], ముత్తెము, ముత్యము. వి. ముత్యం. కు. సం. 4.97.

సం. ముక్తా, మౌక్తిక-. ముత్య-; ప్రా. ముత్తియ-, ముత్తా, జై. మహా. ముత్తియ-; శౌ. ముత్తియ-; పా. ముత్తకా, ముత్తా; అ. మా. ముత్తా, ముత్తియ-; పో. చూ. సం. ముక్తా, ప్రా. ముత్తా;

క. ముత్తు, ముత్యం. ముత్యం; కొడ. ముత్తి. ముత్యం; తు. ముత్తు. ముత్యం, బిందువు; త. ముత్తు. ముత్యం, ఆముదంగింజ, నూనెగింజ, గురువెందగింజ, ముత్తమ్. ముత్యం, శ్రేష్ఠమైన మరకతం; మ. ముత్తు. ముత్యం; కో. ముత్. (స్త్రీ) చెవిఆభరణం; తొ. ముత్. ముత్యం.

<ప్రా. ముత్తియ-.

**ముత్తియపుగమ్మ (-కమ్మ)** వి. స్త్రీభూషణ విశేషం, స్త్రీలు ధరించే ఒకరకం నగ. చెన్నబసవ. 2.207.

**ముత్తిరాచ** రూ.చూ. ముతరాచ. వి. బోయల్లో ఒకతెగ.

**ముత్తిరాచవాడు** విణ. బోయల్లో ఒకతెగకు చెందినవాడు.

**ముత్తిరాజు** రూ.చూ. ముతరాచ. వి. బోయల్లో ఒకభేదం.

**ముత్తు**[1] వి. ప్రార్థనాద్యర్థక మధ్యమ పురుషైక బహువచనాలకు ముజ్జు, నుజీ, కలజీ, పడుజీ మొ. ప్రత్యయాలకు ఆంధ్రవ్యాకర్తలేర్పరచిన సంకేతం.

**ముత్తు**[2] ప్రత్య. మువర్ణకం, అదంతాలైన అమహన్నపుంసకాలకు ప్రథమైక వచనంలో వచ్చే ప్రత్యయం. పార్వ. 4.163.

**ముత్తు**[3] వి. మూత్రపువాసన.

సం. మూత్ర-. నీరుడు; ప్రా. ముత్త-. కారటం.

<ప్రా. ముత్త-.

**ముత్తు**[4] వి. జరీగాని కృత్తిమపు పట్టుగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను.

సం. ముక్తా. ముత్యం; ప్రా. ముత్తా.

<ప్రా. ముత్తా-.

**ముత్తుకడ్డీ** వి. అంచు డిజైనులో రెండువైపులా ముత్యాలుపెట్టినేసిన సన్నపట్టె. **ముత్తుకమ్మి** వి. ముత్యమంత భాగంలో చిన్నదారపు పోగులు వరసగా పడేట్టు నేసిన కమ్మి. **ముత్తుగడిచీర** వి. ఒకరకం గళ్ళచీర. **ముత్తుపలక** వి. డిజైన్లు నేసేటప్పుడు పేటుదారాల్ని పైకి ఎత్తేకొయ్య చెక్క. **ముత్తుపేటు** రూ.చూ. ముత్యంపేటు. వి. జరీగాని కృత్రిమపు పట్టుగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను. **ముత్తుమండపం** వి. ఒకరకం చిన్నగడి నేత చీర. **ముత్తుసరికమ్మి** వి. మూడుగీరలు పెట్టి నేసినకమ్మి. **ముత్తుసరులు** వి.బ.వ. ఒకదినుసు వడ్లు.

**ముత్తునియ** చూ. మూ-.

**ముత్తునియలు** చూ. మూ-.

**ముత్తుపులగము** రూ. చూ. ముత్తవ్వపులగము[1]. వి. బంజరుల్లోనూ అడవుల్లోనూ పెరిగేమొక్క (Pavonia odorata).

**ముత్తుము** చూ. మూ-.

**ముత్తువ** రూ.చూ. ముత్తవ[2]. వి. చిట్టాముదం చెట్టు.

**ముత్తూము** చూ. మూ-.

**ముత్తెం** రూ.చూ. మొత్తము. వి. జంటనొగలబండి నొగలు ముందు వైపు కలిసేచోటు.

**ముత్తెంరంగు** చూ. ముత్తెము.

**ముత్తెపుజిప్ప** చూ. ముత్తెము.

**ముత్తెపుజుక్క** చూ. ముత్తెము.

**ముత్తెపుతీగె** చూ. ముత్తెము.

**ముత్తెపుదీగ** చూ. ముత్తెము.

**ముత్తెపుబంటి** చూ. ముత్తెము.

**ముత్తెపురిక్క** చూ. ముత్తెము.

**ముత్తెపురిక్కనెల** చూ. ముత్తెము.

**ముత్తెపుసవతు** చూ. ముత్తెము.

**ముత్తెము** రూ.చూ. ముత్తియము. వి. 1. ముత్యం. కు. సం. 4.99; 2. నిమ్మ, నారింజ మొ. పళ్ళలో ముత్యాల

లాగా ఉండే భాగం; విశ. ముక్తామయం. దశా. 1.7.

ముత్తెంరంగు వి. ఒకరకం ఎరుపురంగు. <ముత్తెము + రంగు. ముత్తెపుఁజిప్ప (-చిప్ప) వి. 1. శుక్తి, ముత్యాలుపుట్టే. (ఆలుచిప్పలాంటి) గుల్ల. గౌ. హరి. పూ. 666; 2. ముత్యం చిప్పలా ఉండే భక్ష్యవిశేషం. హంస. 1.105. ముత్తెపుఁజుక్క (-చుక్క) వి. చిత్తానక్షత్రం. ముత్తెపుతీఁగె రూ.చూ. ముత్తెపుఁదీఁగ. వి. కటశర్కర, గాంగేష్టి, ఒకానొక ఓషధి. ముత్తెపుఁదీఁగ (-తీఁగ) రూ. ముత్తెపుతీఁగె. వి. కటశర్కర, గాంగేష్టి, ఒకానొక ఓషధి. ముత్తెపుఁబంట (-పంట) వి. ముత్యాలుపండేది, చెరకు. సత్య. సాం. 3.54. ముత్తెపురిక్క వి. చిత్రానక్షత్రం. ముత్తెపురిక్కనెల వి. చైత్రమాసం, చాంద్రమాన మాసాల్లో మొదటిది. ముత్తెపునవతు వి. ముత్యంలా ఉండే చుక్క, చిత్రా నక్షత్రం. ముత్తెంపేటు రూ. చూ. ముత్యంపేటు. వి. జరీగాని కృత్రిమపు పట్టుగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను. < ముత్తెము + పేటు. ముత్తెలపందిళ్లు వి.బ.వ. ఒకమాదిరి వస్త్రాలు, వస్త్రాల్లో ఒకభేదం, ప్రబంధ. 272. ముత్తెసరము వి. ముత్యాలహారం. సం. సర-. హారం. <ముత్తెము + సం. సర-. ముత్తెసరి వి. 1. ముత్యాల హారం; 2. సస్యవిశేషం. ముత్తెసరులు వి.బ.వ. 1. ముత్యాలహారాలు. వసు. 1.93, అచ్చ. రా. బాల. 33; 2. ధాన్యవిశేషం, ఒకరకంవడ్లు. ప్రబంధ. 112; 3. ఒకమాదిరి వస్త్రాలు. ధనాభి. 3.37. ముత్తేలకమ్మి వి. ఒకరకం చీరకమ్మి. ముత్తేలజొన్న రూ. చూ. ముత్యాలజొన్న. వి. జల్లికంకి గుండ్రని గింజల రకాలు. ముత్తేలమంచం వి. మంచంకోళ్ళ సప్తర్షిమండలంలో మంచంకోళ్ళ మాదిరిఉండే నాలుగు చుక్కలు. ముత్తేలమ్మసీర రూ.చూ. ముత్యాలమ్మచీర. వి. ఒక వైపున ఎరుపు, మరొకవైపున నలుపురంగు బెత్తెడేసి వెడల్పున అంచుపెట్టి నేసిన చీర.

ముత్తెంపేటు చూ. ముత్తెము.

ముత్తెర రూ.చూ. ముత్తరము. వి. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

ముత్తెరువులాఁడి చూ. మూ-.

ముత్తెలపందిళ్లు చూ. ముత్తెము.

ముత్తెసరము చూ. ముత్తెము.

ముత్తెసరి చూ. ముత్తెము.

ముత్తెసరులు చూ. ముత్తెము.

ముత్తేలకమ్మి చూ. ముత్తెము.

ముత్తేలజొన్న చూ. ముత్తెము.

ముత్తేలమంచం చూ. ముత్తెము.

ముత్తేలమ్మసీర చూ. ముత్తెము.

ముత్తైద చూ. ముత్త.

ముత్తైదువ చూ. ముత్త.

ముత్తొవ రూ.చూ. ముత్తవ². వి. చిట్టాముదంచెట్టు.

ముత్తో చూ. ముత్త.

ముత్త్రోవ చూ. మూ-.

ముత్త్రోవద్రిమ్మరి చూ. మూ-.

ముత్యపురిక్క చూ. ముత్యము.

ముత్యమంతమాట చూ. ముత్యము.

ముత్యము రూ.చూ. ముత్తియము. వి. 1. మౌక్తికం. కు.సం. 8.52; 2. వెన్నెముకలేని జలచరాల శరీరంమీది కవచం.

ముత్యపురిక్క వి. చిత్రానక్షత్రం, చిత్త. ముత్యమంత మాట వి. కొలదిమాట (ధర్మజరాజన్యాయం). ముత్యంపేటు రూ. ముచ్చెంపేటు, ముత్తుపేటు, ముత్తెంపేటు. వి. జరీగాని కృత్రిమపు పట్టుగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను. ముత్యంపేటుదుప్పటి రూ. ముచ్చెంపేటుదుప్పటి. వి. ఒకరకం గడిచీర. ముత్యాలకుచ్చు వి. పారితథ్య విశేషం, వాలపాశ్య విశేషం. పల్నా.పు. 40. ముత్యాల జొన్న వి. జల్లికంకి గుండ్రని గింజల రకాలు. ముత్యాల తొడుగు వి. తెల్లని కుండలు వేసిన మశూచిక. ముత్యాల పందిరి వి. పచ్చలపందిరి, విరివిగా వినవచ్చే పలుకుబడి. పండి.చ. 290. ముత్యాలపేటంచు వి. జరీతోగాని కృత్రిమపు పట్టుతోకాని నేత నేసేటప్పుడు ముత్యమంత మేర పోగులు మలిపి వరసగా నేసిన అంచు. ముత్యాల ముగ్గులు వి.బ.వ. ముత్యాల కలయంపి. జానపద కథల ద్వారా వచ్చిన పలుకుబడి. ముత్యాలమ్మ(-అమ్మ) వి. ఒకానొక గ్రామదేవత. ముత్యాలమ్మచీర రూ. ముత్తేలమ్మ సీర. వి. ఒకవైపున ఎరుపు, మరొకవైపున నలుపు రంగు బెత్తెడేసి వెడల్పున అంచుపెట్టి నేసిన చీర. ముత్యాలు వి.బ.వ. గింజ గుండ్రంగా ఉండేధాన్య విశేషం.

ముత్యంపేటు చూ. ముత్యము.

ముత్యంపేటుదుప్పటి చూ. ముత్యము.

ముత్యాలకుచ్చు చూ. ముత్యము.

ముత్యాలజొన్న చూ. ముత్యము.

ముత్యాలతొడుగు చూ. ముత్యము.

ముత్యాలపందిరి చూ. ముత్యము.

ముత్యాలపేటంచు చూ. ముత్యము.

ముత్యాలముగ్గులు చూ. ముత్యము.

ముత్యాలమ్మ చూ. ముత్యము.

ముత్యాలమ్మచీర చూ. ముత్యము.

ముత్యాలు చూ. ముత్యము.

ముత్రాసికమ్మె వి. అడ్డపట్టె, కిటికీ చట్రం మధ్యఉన్న కొయ్య కమ్మి.

ముత్సది రూ.చూ. ముత్సద్దీ. వి. అకౌంటెంటు.

ముత్సద్ది రూ.చూ. ముత్సద్దీ. వి. అకౌంటెంటు.

ముత్సద్దీ రూ. మతసద్ది, ముతసద్దీ, ముతస్సది, ముత్సది, ముత్సద్ది, మునద్దీ. వి. అకౌంటెంటు, గణకుడు.

హిం.ఉ.అర. ముత్సద్దీ. అకౌంటెంటు, క్లర్కు, వ్యతిరేకించు, ప్రయత్నించు, ధైర్యంచేయు, ముఖంతిప్పు; మరా. ముత్సద్దీ. రాజనీతిజ్ఞుడు, రాజకీయవేత్త.

క. ముత్సద్ది, మునద్ది. అకౌంటెంటు, క్లర్కు, అనుభవంగల మనిషి, ఒక పబ్లిక్ ఆఫీసరు; త. ముచ్చుత్తి.

<ఉ. ముత్సద్దీ.

ముదం రూ.చూ. మదుగు. వి. చెరువు మొ. వాటినుంచి నీరు

పోయే మార్గం.
ముదనష్టమగు చూ. ముదనష్టము.
ముదనష్టము చూ. ముదిమి. రూ. ముదరష్టం. వి. 1. సంతానం లేకుండా ఉండటం; 2. ఎక్కువ నష్టం; 3. నీచం; 4. ఎవరైనా బంధువు చనిపోవటంద్వారా సంక్రమించిన ఆస్తి. సం. నష్ట-. కొరత.
ముదనష్టమగు అ.క్రి. పూర్తిగా చెడు. < ముదనష్టము + అగు.
ముదము రూ.చూ. ముదముద. వి. సంకోచం.
ముదముద రూ. ముదము. వి. సంకోచం.
ముదముదములు చూ. ముదిమి. వి.బ.వ. చెడినవాడు, చెడింది, దురవస్థను పొందినవాడు, దురవస్థను పొందింది. లక్ష్మీ. వి. 2.76.
ముదర రూ.చూ. ముదురు. విణ. లేతది కానిది, పెరిగినది.
ముదరకలుపు రూ.చూ. ముదురుకలుపు. వి. మలికలుపు. పైరు పొట్టకరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. ముదరగాల్వు (-కాల్వ) రూ.చూ. ముదురుకాల్వ. వి. ఆములో కుండలు ఎక్కువగా కాలటం.
ముదరకించు రూ. మదలకించు. స.క్రి. ఒక విషయాన్ని గట్టిగా అడుగు.
ముదరబెట్టు చూ. ముదురు.
ముదరష్టం రూ.చూ. ముదనష్టము. వి. 1. సంతానం లేకుండ ఉండటం; 2. ఎక్కువనష్టం; 3. నీచం; 4. ఎవరైనా బంధువు చనిపోవటంద్వారా సంక్రమించిన ఆస్తి.
ముదరా రూ.చూ. ముదల. వి. తగ్గింపు.
ముదల[1] రూ. ముజరా[2], ముదరా. వి. అంగీకారంతో ఇచ్చిన డబ్బు. తాళ్ల.సం. 15.242.
హిం.ఉ.మరా. ముజ్‌రా, తగ్గింపు; పార. మిజ్‌రాఈ. < ఉ. ముజ్‌రా.
ముదల[2] రూ. ముజరా[1]. వి. 1. లక్ష్యం, గురి. ఉ. హరి 4.269; 2. ఆజ్ఞ, ఉత్తరువు. రామాభ్యు. 6.157; 3. గనిమ చేరిక నేల.
క. ముదల్; త. ముతల్. ప్రారంభం, మొదటిది, హేతువు, శ్రేష్ఠతమం, అసలు, ఆధారం, స్థానం, మొదలు, ఖరీదు.
ముదలకించు స.క్రి. 1. ఎత్తిపొడుచు. పల్నా. 4.110; 2. వర్ణించు, ప్రశంసించు. ద్వి.పరమ. వి. 3.220 పు.; 3. ఎదుర్కొను, మార్కొను. కళా. 6.224. ముదలపెట్టు రూ. చూ. ముదలవెట్టు. స.క్రి. ఆజ్ఞాపించు. కళా. 1.192. ముదలవెట్టు(-పెట్టు) రూ. ముదలపెట్టు. స.క్రి. ఆజ్ఞాపించు. వరాహ. 10.5. ముదలించు స.క్రి. 1. ప్రశ్నించు, అడుగు. బసవ. 3.1147 పం.; 2. ఎదుర్కొను, వ్యతిరేకంగా చెప్పు, మార్కొను, ప్రతిఘటించు. నిర్వ.రా. 7.78; 3. ఆజ్ఞాపించు, శాసించు. రం.రా.కిష్కిం. 198 పు. 20 పం.; 4. సంతోషపెట్టు, సంతసింపచేయు. వేంక. పంచ. 1.14; 5. (బాణాదులు) ప్రయోగించు, ఏయు. మొల్ల. అరణ్య. 18.
ముదలించు చూ. ముదల[2].

ముదలియారు వి. తమిళశూద్రుడు.
త. ముతలియార్. తమిళదేశంలో ఒక శూద్రవర్ణం వారి పేర్లచివర చేరేపదం.
< త. ముతలియార్.
ముదాము వి. శాశ్వతమైన గ్రామపోలీసు.
హిం. ముదామ్. ఎల్లప్పుడు, ఎడతెగకుండా, సరిగ్గా, అయిపోకుండా, ఎప్పటి; ఉ. అర. ముదామ్. ఎల్లప్పుడూ, శాశ్వతమైన, ఎడతెగని, నిర్ణయించబడ్డ, మన్నికగల;
క. ముద్దాకు, ముద్దాము. స్థిరమైన, శాశ్వతమైన, అనుకూలమైన, స్పష్టంగా; త. ముతాం. శాశ్వతమైన. < ఉ. ముదామ్.
ముది రూ.చూ. ముదిమి. విణ. 1. వృద్ధు, ముసలివాడు. భార. సభా. 2.39; 2. ముదుసలిది, వృద్ధం, ముదిరినది. వి. ముదిమి, వార్ధక్యం. మను. 1.50.
ముదికాకి వి. బొంతకాకి, చెమురుకాకి, ఒకరకంకాకి. ముదిగంటివడ్లు వి.బ.వ. ఒకరకం వడ్లు. ముదిగారము వి. 1. మొరకుతనం, మూర్ఖత్వం; 2. గారాబం. ముదిగొరగ వి. ఈశ్వరుడు (నిరసించేటప్పుడు). ముదిగొరగలు వి.బ.వ. జంగాలు. బసవ. 6.165. ముదిజంత వి. మునలిగయ్యాళి. కళా. 3.127. ముదితనము వి. ముసలితనం, వార్ధక్యం. ముదితొక్కు వి. ముసలి. ముదిబండ వి. ఉత్తరౌతు, గోడల కట్టుబడికి పనికివచ్చేరాయి. ముదిమదితప్పు స.క్రి. వృద్ధాప్యం వల్ల మనఃస్తిమితం తప్పు. మను. 1.50. ముదిమాటలు వి.బ.వ. వయసుకి మించిన మాటలు. పరమ. 4.1397. ముదియది (-అది) విణ. ముసలిది. ముదిలంజవలపు వి. నిష్ప్రయోజనమైంది; శివముకుంద. 33. ముదివాఁడు విణ. వృద్ధుడు, ముదిమినొందిన వాడు. సమీర. 7.65.
ముదిత చూ. ముద్ద[2]. వి. 1. స్త్రీ, ఆడది. భార. ఆది. 4.160; 2. భార్య. దశా. 3.61.
ముదిని రూ. చూ. ముదినిక. వి. ఒకరకం కలుపుమొక్క, మదనబుడమ.
ముదినిక రూ. ముదిని, మొదనిక, మొదికిని. వి. ఒకరకం కలుపుమొక్క, మదనబుడమ.
ముదిమి చూ. ముదియు.
ముదిమివాఁడు చూ. ముదియు.
ముదియ రూ. చూ. ముద్ద[2]. వి. స్త్రీ. ఆడది. హరి. పూ 6.102.
ముదియనివారిలోఁబెద్ద చూ. ముదియు.
ముదియనివారు చూ. ముదియు.
ముదియు రూ. ముదుసు. అ.క్రి. 1. ముదిమినొందు, వార్ధక్యం పొందు. కు. సం. 2.36; శిథిలమగు, జీర్ణమగు. భార. శాంతి. 5.377.
క. ముదు (-ముత్తు-). వయసుమించిన, పురాతనమైన; తు. ముదియుని. శిథిలమగు; త. ముతు. వయసు మీరిన, ప్రాచీనమైన, ముత్తు-ఎయిల్. ప్రాచీనమైనకోట, దుర్గం, ముతాం. ప్రాచీనమైన, పరిపక్వమైన, పండిన, ముతియవన్, ముతియాన్. వృద్ధుడు, పెద్దవాడు,

అనుభవజ్ఞుడు, ముతియాల్. వృద్ధురాలు, ముతియోల్. వృద్ధురాలు, దేవత, ముతియోర్. మానసిక పరిపక్వత పొందినవారు, ముతిర్, (-వ్-,-స్ట్-). ముదురు, వార్ధక్యపు లక్షణాలు కలుగు, ముతిర్చి. పరిపక్వత, పండినస్థితి, పెద్దవయసు, అనుభవజ్ఞత, ముతిర్వు. పరిపక్వత, పెద్ద తనం, పెద్దవయసు, ముతువర్. కాలగతిలో నశించిన, శిథిలమైన, ముతువోర్. పెద్దలు, అనుభవజ్ఞులు, (రాజు, ఉపాధ్యాయుడు, తల్లి, తండ్రి, అన్న మొ. పెద్దలు, ముత్తైయల్. కారడవి. మూ (-ప్ప-, త్-). వృద్ధుడగు, పెద్దవయసు కలవాడగు, మూత్తు-అప్పన్. తాత, (తండ్రి తండ్రి), మూత్తవన్. పెద్దవాడు, వృద్ధుడు, ముదుసలి, మూత్తార్. వృద్ధులు, భర్తలు, అన్న, ముత్తాళ్. వృద్ధురాలు, అక్క, మొదటి భార్య, మూత్తోఌ్. వయసుమీరినవాడు, పెద్దవాడు, అన్న, గణపతి (శివుడి పెద్దకొడుకు). 48-64 మధ్యవయసువాడు. మూతాట్కళ్. తాత ముత్తాతలు, మూతు. వార్ధక్యం, మూత్తై. పాత, ప్రాచీనమైన, పురాతన, మూప్పర్. వృద్ధులు, పెద్దవారు, మూప్పన్. కులపెద్ద, పెద్దలు, మూప్పి. వయసులో పెద్దవారు, అధికారం, న్యాయకత్వం ; మ. ముతు. పెద్ద, ముత. అడవి, ముతిరుక. పెరుగు, పెద్దమనిషగు, ముతిర్పు. పరిపక్వత, ముత్తన్. వృద్ధుడు, మూత్తి. వృద్ధురాలు, అమ్మమ్మ, మామ్మ, మూక్క. పెరుగు. వయస్కుడగు ; తొ. మూఫ్- (మూత్-). పెరుగు ; కువి. మూ- పరిపక్వత, మూస్సెల. వృద్ధుడైనవ్యక్తి ; పర్జి. ముత్తక్. ముసలివ్యక్తి ; బ్రా. ముత్కున్. ప్రాచీనం, ప్రాచీనవస్తువు.

<మూ. ద్రా. *ముక్-/*ముత్-, *మూ-.

ముదిమి రూ. ముది, వి. ముసలితనం, వార్ధక్యం. భార. ఆది. 3.95. క. ముత్తు, ముది. ముసలితనం, ముసలి వయసు, ముదు, ముత్-. వయసుపెరుగు ; కొడ. ముది. ముసలి ; తు. ముది, ముదు. ముసలి, ప్రాచీనమైన ; త. ముతు. ప్రాచీనమైన ; మ. ముతు. పక్వమైన, ముసలి. ముదిమివాఁడు విణ. వృద్ధుడు ముదియనివారిలోఁబెద్ద వి. బ్రహ్మ. ముదియనివారు విణ.బ.వ. దేవతలు. ఆం. పదా. సుర. 38 ; విణ. ముసలితనం లేనివారు. ముదిసినవాఁడు విణ. ముసలివాడు. సాంబ. మాన. 4. ముదిసిముప్పుకాలము వి. వృద్ధాప్యం. శృం. నై. 1.108. ముదిసిముప్పున అవ్య. ద్రు. వృద్ధాప్యంలో, ముసలిముప్పున. శృం. నై. 4.129. ముదిసిముప్పునఁబడు (-పడు) న.క్రి. ముసలితనంలో కష్టాల పాలగు. ముదుక రూ. ముతక, ముతుక, ముదుకఁడు, ముదుగు. వి. వృద్ధుడు, ముసలివాడు. భార. ఆది. 4.231 ; విణ. 1. సాంద్రమైంది, చిక్కనిది. హరి. పూ. 5.143 ; 2. దళసరైనది, మోటైనది. రం. రా. యు. 318పు. 31పం. త. ముతుకు. దళసరి, సాంద్రత. ముదుకఁడు రూ. చూ. ముదుక. విణ. ముసలివాడు, వృద్ధుడు. భార. ఉద్యో. 4.246. ముదుకసరులు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. ముదుగోలు వి. ముతకగా ఉండటం. ముదుసరి రూ.చూ. ముదుసలి. విణ. వృద్ధుడు. ముదుసరితనము వి. వార్ధక్యం. ముదుసరిది విణ. ముసలిది. ముదుసలి రూ. ముదుసరి. ముసలి. ముసిలి, వి. 1. వృద్ధుడు, ముసలివాడు, వృద్ధురాలు,, వృద్ధం. భార. ఆది. 7.223 ; 2. పరిణతి చెందినది. పారి. 4.43. ముదుసలితనము వి. వృద్ధత్వం. ముదుసలిది విణ. వృద్ధస్త్రీ. ముద్ది[1] విణ. ముసలామె, వృద్ధాంగన. శుక. 3.21.

ముదిసినవాఁడు చూ. ముదియు.

ముదిసిముప్పుకాలము చూ. ముదియు.

ముదిసిముప్పున చూ. ముదియు.

ముదిసిముప్పునఁబడు చూ. ముదియు.

ముదిసెలి చూ. ముదియు. వి. కార్యకర్త. ద. హిం. గా. నంపు. 4. శా.సం. 996.

ముదు రూ.చూ. ముద్దె. వి. తామరపూవులోనిదుద్దు, కర్ణిక.

ముదుం రూ. చూ. మదుగు. వి. చెరువు మొ. వాటినుంచి నీరుపోయే మార్గం.

ముదుక చూ. ముదియు.

ముదుకఁడు చూ. ముదియు.

ముదుకసరులు చూ. ముదియు.

ముదుగ వి. గంజాం ప్రాంతంలో పెరిగే తీగ (Butea Frondosa).

ముదుగలుపు రూ.చూ. ముదురుకలుపు. వి. ములికలుపు, పైరు పొట్టకరుకు వచ్చినప్పుడు తీసేకలుపు.

ముదుగు రూ.చూ. ముదుక, విణ. 1. ముదుక దళసరి. బహుళా. 2.13 ; వి. మోటుమాట, కఠినోక్తి. వైజ. 3.93.

ముదుగుజల్లెడ వి. అస్త్రకారి సున్నం నుంచి ఇతర వస్తువుల్ని వేరుచేయడానికి వాడే చిన్న కళ్ళున్నజల్లెడ. దొడ్డుజల్లెడ, ముదుగునూకలు వి.బ.వ. గుండ్రనినూకలు ముదుగునూలు రూ.చూ. ముతకనూలు. వి. పోగుమందంగా ఉండేనూలు. ముదుగుపని వి. సారెమీద కాకుండ విడిగా చేత్తో చేసే మోటపని.

ముదుగోలు చూ. ముదియు.

ముదుటుంగరము రూ. ముదురవుంగరము, ముద్దుటుంగరము, ముద్దుటుంగ్రము. వి. ముద్దుటుంగరం, ప్రియమైన అంగుళీయకం. సారంగ. 3.22.

ముదురవుంగరము రూ. చూ. ముదుటుంగరము. వి. ముద్దువుంగరం. తాళ్ల. సం. 16.2.47.

ముదురు రూ. ముదర. అ. క్రి. 1. లేతదనం వీడి పరిణతినొందు. కు. సం. 5.168 ; 2. పెరుగు, వృద్ధిపొందు. కాశీ. 7.155 ; 3. హెచ్చు, అధికం. భోజ. 7.79 ; 4. ఒదుగు, ముడిగిఉండు. చంద్రాంగ. 6.96 ; 5. కంకుల్లోని గింజలు పూర్తిగా ముదురు ; 6. రంగు ముతకదనం ; విణ. 1. ముదిమి చెందినది, వృద్ధం. భార. శాంతి. 3.383 ; 2. లేతదనం వీడినది. హర. 1.20 ; 3. మిక్కుటం. ప్రబలినది, అతిశయించినది. విక్ర. 7.102.

క. ముదుడు, ముదురు, మ్కుదు. ఎండిపోవు, వడలిపోవు. <మూ.ద్రా. *ముత్/- ముచ్, *ముచ్/- *మూ-/ముయ్-.

ముదరఁబెట్టు స.క్రి. ముదిరేటట్లుచేయు. <ముదురు +

-అ[7] + పెట్టు. **ముదురుకలుపు** రూ. ముదరకలుపు, ముదుగలుపు, ముదురుగల్పు. వి. మలికలుపు, పైరు పొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. **ముదురుకాల్పు** రూ. ముదురుగాల్పు వి. ఆములో కుండలు ఎక్కువగా కాలటం. **ముదురుగల్పు** రూ.చూ. ముదురు కలుపు. వి. మలికలుపు, పైరు పొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు. **ముదురుగాల్పు (-కాల్పు)** రూ.చూ. ముదురుకాల్పు. వి. ఇటిక మొ.వి ఎక్కువగా కాలటం. **ముదురుగులాబి** వి. ఒకరకం గులాబి రంగు. **ముదురు(జదువులబావన(-చదువులబావన)** వి. బ్రహ్మ. చిత్రభా. 5.43. **ముదురు(జదువులు(-చదువులు)** వి.బ.వ. వేదాలు, ప్రాచదువులు. కకుత్థ్స. 1,222. **ముదురునీలం** వి. 1. నలుపులో తెలుపువన్నె కలిసిన రంగు ; 2. ఒక రకం నీలం రంగు. సం. నీల-. నల్లన. **ముదురు(దనము (-తనము)** వి. వార్ధకం. ముసలితనం. భార. ఆను. 2.21. **ముదురుప్రాయము** వి. వార్ధక్యం, ముసలితనం. కళా. 6.203. **ముదురుమానిసి** వి. వృద్ధుడు. కువ.చ. 2.148. **ముదురుమొగ్గ** వి. పూయటానికి సిద్ధమైన మొగ్గ.

**ముదుసరి** చూ. ముదియు.

**ముదుసరితనము** చూ. ముదియు.

**ముదుసరిది** చూ. ముదియు.

**ముదుసలి** చూ. ముదియు.

**ముదుసలితనము** చూ. ముదియు.

**ముదుసలిది** చూ. ముదియు.

**ముదుసు** రూ.చూ. ముదియు. అ.క్రి. ముసలితనం పొందు. తాళ్ల.సం. 1ర.1.18.

**ముద్ద**[1] వి. 1. పిండం. ఉండ. కు.సం. 8.99 ; 2. కబళం, కడి. భార.ఉద్యో. 4.208; 3. మట్టిపొయ్యికి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టిఉబ్బ; 4. సుత్తెతల ; 5. గుండ్రటిగడ్డ ; 6. సంకటి ; 7. రాటి తిరగడానికి రాటి నూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు.

క. ముద్ది, ముద్దె. కబళం, ఉండ, ముద్ద ; తు. ముత్తమ్. ముద్ద, కబళం, కడి ; త. ముత్తమ్. ముద్ద, కబళం, కడి, మొత్తమ్. కడి, కబళం, ఉండ, ముత్తై.

**ముద్దకంకి** వి. దగ్గర దగ్గరగాఉన్న కంకి. **ముద్దకట్టు** స.క్రి. పాకం మట్టిని ముద్దలుగాచేయు , అ.క్రి. 1. ముద్దగా అగు ; 2. చిముడు, మెత్తబడు ; 3. పేరుకొను. **ముద్దకమ్మర** వి. రాయి కరిగించి ఇనుముచేసే ఒకజాతి. **ముద్దకమ్మరి** వి. రాయి కరిగించి ఇనుముచేసే కమ్మరి. **ముద్దకమ్మి** వి. 1. రంగునూలుతో నేసిన ఒకరకం కమ్మి ; 2. రంగడుకమ్మి. **ముద్దకర్ని** వి. దొడ్డుకర్ణి, పెద్దసైజుకరిణి. **ముద్దకవ్వము** వి. మానిబిళ్ళ తగిలించిన కవ్వం. **ముద్దకాయ** రూ.చూ. ముద్దకొయ్య. వి. 1. పంటెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; 2. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటంకింది దిమ్మ ; 4. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు. **ముద్దకూడు** వి. కబళాన్నం, మాధూకరాన్నం. వేణు. 41. **ముద్దకొట్టు** స.క్రి. పాకం మట్టిని ముద్దలుగా చేరు. **ముద్దకొయ్య** రూ. ముత్తకాయ, ముద్దకాయ, ముద్దగాయ్, ముద్దగొయ, ముద్దగొయ్య. వి. 1. పంటెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; 2. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటంకింది దిమ్మ ; 4. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **ముద్దకొఱ్ఱ** వి. ఒకరకం కొఱ్ఱ. **ముద్దకొలిమి** వి. రాయి ఇనుముగా కరిగే కలిమి. **ముద్దఖర్జూరము** వి. ఉబ్బలి, హింతాలం. **ముద్దగ** క్రి.విశే.ద్రు. బాగుగా, మంచిగ, ముచ్చటగ. **ముద్దగండము** వి. పొరపోవటం, తింటూండగా ఉన్నట్టుండి పొరపోయినప్పుడు ప్రాణాపాయకరం కావటం. **ముద్దగాయ్** రూ.చూ. ముద్దకొయ్య. వి. 1. పంటెకు నూలుచుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; 2. రాటి తిరగటానికి రాటి నూలనికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటంకింది దిమ్మ ; 4. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు. **ముద్దగించు** అ.క్రి. ఘనీభవించు, గడ్డకట్టు, పేరుకొను. పండి.చ.1.3. **ముద్దగిట్ట** రూ. ముద్దగొట్టె. వి. ముద్దగా గట్టిగా చీలికనందు తక్కువగా ఉన్న గిట్ట. **ముద్దగీయు** అ.క్రి. పాత్రలు చేయటానికి వీలుగా సారెపై తగినంత మట్టిముద్దను సరిగా అమర్చుకొను **ముద్దగుడుచు (-కుడుచు)** స.క్రి. ముద్దులాడు, సమానమగు. రుక్మా.చ. 3.159. **ముద్దగూటం** రూ. ముద్దిగూటం, మొద్దుగూటం. వి. 1. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 2. రాటితిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం. **ముద్దగొట్టె** రూ.చూ. ముద్దగిట్ట. వి. ముద్దగా గట్టిగా చీలిక నందు తక్కువగా ఉన్న గిట్ట. **ముద్దగొయ(-కొయ్య)** రూ.చూ. ముద్దకొయ్య. వి. 1. పంటెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; 2. రాటి తిరగిటానికి రాటినూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటం కిందిదిమ్మ ; 4. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు. **ముద్దగొయ్య(-కొయ్య)** రూ.చూ. ముద్దకొయ్య. వి. 1. పంటెకు నూలుచుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు ; 2. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు ; 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటంకింది దిమ్మ ; 4. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు. **ముద్దగొయ్యకోల** వి. ముద్దగొయ్యకు బిగించిన చువ్వ. **ముద్దగోలు(-కోలు[4])** రూ. ముద్దుగోలు. వి. పంటెకు నూలుచుట్టటానికి ఊనికగా పెట్టే మట్టిముద్ద. **ముద్దచెండు** వి. గుండ్రంగా ఎత్తుగాఉండే మూపురం. **ముద్దచోడి** వి. చోడిలో ఒకరకం. **ముద్దజొన్న** వి. కంకిముద్దగా ఉండే ఒకరకంజొన్న. **ముద్దంచు** వి. 1. బెత్తెడు వెడల్పుకు పైగా రంగులో నేసిన మామూలంచు ; 2. వేలెడు వెడల్పు కడ్డీలు పడేట్టు నేసిన అంచు. <ముద్ద[1] + అంచు[3]. **ముద్దతమిదె** వి. ఒకరకం రాగిపంట. **ముద్దపచ్చజొన్న** వి. జొన్నలో ఒకరకం. **ముద్దపప్పు** వి. వండినపప్పు. **ముద్దపాకం** వి. 1. కక్కసట, జీడుపాకం, మంచిజిగురుగల పాకం ; 2. పాత్రల తయారీకి అనువుగాఉన్న చిక్కటిపాకం

లోని బురదమట్టి. **ముద్దపొదుగు** వి. రెండుచన్నుల పొదుగు. **ముద్దప్పమంచం** రూ.చూ. ముద్దాపమంచం. **వి.** సప్తర్షి మండలంలో మంచంకోళ్ళలా ఉండే నాలుగు చుక్కలు, వాటి వెనుక వరసగా మరి మూడు చుక్క లుంటాయి. వాటిని దొంగ లంటారు. **ముద్దబీగము** వి. కప్పళాళం. **ముద్దమట్టి** వి. బురదమట్టి, చిక్కటి పాకంలో ఉన్న అడుసు. **ముద్దమన్ను** వి. కుండలు తయారీకి చెరువులో దొరికే బంకమట్టి. **ముద్దయెత్తు** (-ఎత్తు[1]) స.క్రి. తిను. **ముద్దలవంగపట్ట** వి. దాల్చినచెక్క. **ముద్దవాయువు** వి. కాళ్ళు చేతులూ ముద్దలుగా కట్టుకునే వాతరోగం. **ముద్దసద్ద** వి. సజ్జ, సజ్జలో ఒకరకం. **ముద్దసన్నం** వి. ఒకరకం వడ్లు. **ముద్దసంపెంగ** వి. తోటల్లో పెంచబడే సువాసనగల పూలు పూసే చెట్టు (Artabotrys odoratissimus) **ముద్దసుత్తి** రూ. ముద్దసుత్తె. వి. ఒకరకం సుత్తె, రాతి పనివాళ్ళు వాడే సుత్తి. **ముద్దసుత్తె** రూ.చూ. ముద్దసుత్తి. వి. ఒకరకం సుత్తి, రాతి పనివాళ్ళు వాడే సుత్తి. **ముద్దాపమంచం** రూ. ముద్దప్పమంచం. వి. సప్తర్షిమండలంలో మంచంకోళ్ళ మాదిరి ఉండే నాలుగు చుక్కలు, వాటి వెనక వరసగా మరి మూడు చుక్క లుంటాయి. వాటిని దొంగ లంటారు. **ముద్దాముదాలు** వి.బ.వ. ఆముదాల్లో ఒకరకం. < ముద్ద[1] + ఆముదము + -లు. **ముద్దీపట్టు** వి. సారె పలక మీది మట్టిముద్దను మీదకి సాగునట్లు పట్టే పట్టు. **ముద్దేయు** స.క్రి. పాకం మట్టిని సారె పలకమీద వాట తయారీకి ముద్దగా పెట్టు. < ముద్ద[1] + వేయు.

**ముద్ద**[2] రూ. ముదియ, ముద్దియ[1]. విశ. 1. ముగ్ధ, అమాయకురాలు, గోల. భార.విరా. 1.103 ; 2. స్త్రీ. కాశీ. 2.43.

సం. ముగ్ధా. అందమైన యువతి ; ప్రా. ముద్ధా, ముదిఅ, ముదియా. స్త్రీ, ఆడుది ; అ.మా. ముద్ధా ; పా. ముద్ధా ; అప. ముద్ధ.

< ప్రా. ముద్ధా.

**ముద్దరాలు** విశ. ముగ్ధ, గోల. కు.సం. 6.15 ; వి. స్త్రీ, ఆడుది. కాశీ. 2.43. < ముద్ద[2] + ఆలు. **ముద్దతికము** వి. ముగ్ధాత్వం, ముద్దరాలితనం. కేయూ. 3.223.

**ముద్దగు** చూ. ముద్దు.

**ముద్దట** చూ. ముద్ద[1]. వి. పిడక. శివ.సా. 293.

**ముద్దతు** వి. అవధి, కాలపరిమితి.

హిం. ముద్దత్. కాలావధి, కొంతకాలం ; ఉ.అర. ముద్దత్, కొంతకాలం, ప్రాచీనం, పూర్వం, చాలాకాలం ;

క. ముద్దతు, ముద్దత్తు. కొంతకాలం, ఒక టన్ను.

< ఉ. ముద్దత్.

**ముద్దతుకౌలు** వి. తాత్కాలికమైన నిబంధన ప్రకారం ఒప్పుకున్న కౌలు. **ముద్దతుక్రయము** వి. నిబంధన ప్రకారం అపరాధ రుసుంతో కూడిన అమ్మకం. **ముద్దతుహుండీ** వి. ఒడంబడిక చేసుకున్న సమయం తరవాత చెల్లించిన రుసుం.

**ముద్దయ్య** చూ. ముద్దు.

**ముద్దర** వి. 1. అచ్చు, చప్పు, ముద్దు, మొహరు (వేళ్ళతో అంకురాకారంగాపెట్టే ముద్ర) ; 2. అచ్చుగా వాడే కొయ్యదుంప, కొయ్యతుండు ; 3. గింజలు దొంగలు ఎత్తుకుపోతే తెలుసుకోవటానికి ధాన్యం రాసిమీద ఒక పలకతో వేసే గుర్తు.

సం. ముద్రా. గుర్తు, ముద్ర ; ప్రా. ముద్దా, ముద్దియా, ముద్దయ- ; పా. ముద్దా.

< సం. ముద్రా.

**ముద్దరపలక** వి. ముద్దర వేసే పలక. **ముద్దరబల్ల** వి. ముద్దరవేసే బల్ల. **ముద్దరవేయు** అ.క్రి. గింజలు దొంగలు ఎత్తుకుపోతే తెలుసుకోవటానికి ధాన్యం రాసిమీద ఒక పలకతో గుర్తువేయు.

**ముద్దాడు** చూ. ముద్దు.

**ముద్దాపమంచం** చూ ముద్ద[1].

**ముద్దాముదాలు** చూ. ముద్ద[1].

**ముద్దాయి** రూ.చూ. ముద్దాయీ. వి. నేరం మోపబడినవాడు.

**ముద్దాయీ** రూ. ముద్దాయి. వి. ప్రతివాది.

హిం. ముద్దాఈ. వాది, ఫిర్యాది, శత్రువు, వాజ్యగాడు ; మరా. ముద్దఈ ; ఉ.అర. ముద్దఈ. వాది, ఫిర్యాది, వ్యాజ్యగాడు, శత్రువు, మనవిచేసేవాడు ;

క. ముద్దాఇ. వాది ; త. ముత్తాయి.

< ఉ. ముద్దఈ.

**ముద్ది**[1] చూ. ముదియు.

**ముద్ది**[2] వి. ఇడుమ, ఆపద, విపత్తు.

**ముద్దిగూటం** రూ.చూ. ముద్దగూటం. వి. 1. రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యముద్దు ; 2. రాటి తిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం.

**ముద్దించు** స.క్రి. బట్టీలో కాల్చటానికి ఇటుకలు పేర్చు.

**ముద్దిడు** చూ. ముద్దు.

**ముద్దిడుకొను** చూ. ముద్దు.

**ముద్దియ**[1] రూ.చూ. ముద్ద[2]. వి. 1. స్త్రీ, ఆడుది. భార.విరా. 1.315 ; 2. ముగ్ధ, గోల. ఆం.భా. 2.105.

**ముద్దియ**[2] రూ.చూ. ముద్దె. 1. పద్మ బీజకోశం, కర్ణిక. విజయ. 3.92 ; 2. ముద్దియ.

**ముద్దీటె** చూ. ముద్దు.

**ముద్దీపట్టు** చూ. ముద్ద[1].

**ముద్దు** వి. 1. సొంపు, చక్కదనం, ఇంపు, మనోహరత్వం. భార.ఆది. 3.27 ; 2. ప్రేమ. ఉ.హరి. 5.54 ; 3. ముద్దువచ్చే పని, ఇంపుకలిగించే పని. కళా. 6.200 ; 4. చుంబనం. ఆం.భా. 2.180 ; 5. ఆదరం ; విశ. 1. ప్రేమాస్పదం, అనుగు. నిర్వ.రా. 3.10 ; 2. మనోజ్ఞమైంది, సుందరమైంది. ఉ.హరి. 5.59.

క. ముత్తు, ముద్దు. చుంబనం, ముద్దిడు. చుంబించు, ముండు. ముద్దుపెట్టుకొను, చుంబించు ; కొడ. ముత్త. ముద్దు ; తు. ముత్త, ముత్తు, ముద్ద, ముద్దు. ముద్దు ; త. ముత్తు, ముత్తమ్. ముద్దు, ముత్తు (ముత్తి-), ముత్తమ్ఇటు. ముద్దిడు ; మ. ముత్తమ్, ముత్తి, ముత్తు. ముద్దు, ముత్తుక, మొత్తుక. ముద్దిడు ; పర్జి. మోట్ట్. ముద్దు ; కొలా. ముద్. ముద్దు, ముద్ ఇ-ద్-.

ముద్దిడు ;

సం. ముద్రా. గుర్తు, సీలు, సంజ్ఞాక్షరాలున్న ఉంగరం.

ముద్దగు అ.క్రి. అందగిల్లు, ముద్దారు. < ముద్దు + అగు. ముద్దయ్య వి. కుమారస్వామి. < ముద్దు + అయ్య. ముద్దాడు స.క్రి. 1. ముద్దుపెట్టుకొను, చుంబనంచేయు. కు.సం. 3.74 ; 2. చుంబనాది పూర్వకంగా లాలించు. < ముద్దు + ఆడు. ముద్దిడు స.క్రి. ముద్దుపెట్టుకొను, చుంబించు. రాజ.వి. 1.3. < ముద్దు + ఇడు. ముద్దిడుకొను స.క్రి. ముద్దుపెట్టుకొను. ఇందు. 2.17. ముద్దీఁటె వి. ఏనుగును పొడిచే బరిగోల, ముల్లుకోల. < ముద్దు + ఈఁటె. ముద్దుగా అవ్య.క్రియా. అందంగా, మనోజ్ఞంగా. < ముద్దు + అగు + -అ[7]. ముద్దుగారు (-కాఱు[1]) అ.క్రి. మనోజ్ఞంగాఉండు. ముద్దుగునియ స.క్రి. ముద్దులుగుడుచు. తాళ్ల.సం. 9.101. ముద్దుగుమ్మ వి. మనోజ్ఞురాలు, స్త్రీ. రసిక. 4.39. ముద్దుగురియు (-కురియు) అ.క్రి. మనోజ్ఞంగా ఉండు, ముద్దులొలుకు. శృం.నై. 2.113. ముద్దుగైకొను (-కైకొను) అ.క్రి. చుంబనంచేయు. ముద్దుగొను (-కొను) అ.క్రి. ముద్దుపెట్టుకొను. ముద్దుచేయు స.క్రి. 1. గారాబం చేయు. తాళ్ల.సం. 11.32 ; 2. ముచ్చటపడు, ఆదరంతో వాత్సల్యంతో చూచు. విప్ర. 1.12. ముద్దుటుంగరము రూ.చూ. ముదుటుంగరము. వి. ప్రియమైన అంగుళీయకం. < ముద్దు + ఉంగరము. ముద్దుటుంగ్రము (-ఉంగ్రము) రూ. చూ. ముదుటుంగరము. వి. ముద్దుటుంగరం, ప్రియమైన అంగుళీయకం. ముద్దుపట్టి వి. గారాబుకూతురు. ముద్దుపెట్టుకొను అ.క్రి. చుంబనంచేయు. ముద్దుప్రాలు రూ.చూ. ముద్దుఁబ్రాలు. వి. బ. వ. ధాన్య విశేషం. ముద్దుబిడ్డ వి. గారాబు కూతురు లేదా కొడుకు. ముద్దుముచ్చటలు వి.బ.వ. ఆశలు, ముచ్చట్లు. ముద్దుముద్దు విణ. జిలిబిలి. ముద్దుమురిపెం వి. గారాబం. ముద్దుమొగము వి. అందమైన ముఖం. ముద్దుఁబ్రాలు రూ. ముద్దుప్రాలు, వి బ.వ. ఒకదినుసువడ్లు. ముద్దురాలు వి. ముద్దుగుమ్మ. < ముద్దు + ఆలు. ముద్దులగుమ్మ వి. ముద్దుగుమ్మ. అంద గత్తె. నిరంకు. 2.35. ముద్దులాడు స.క్రి. ముచ్చటలాడు, ముచ్చటలుచెప్పుకొను. పండి.చ. 2. 5.290పు. < ముద్దు + -లు + ఆడు. ముద్దులాఁడి వి. ముద్దుగుమ్మ. < ముద్దు + -లు + -ఆఁడి. ముద్దులాఁడు వి. 1. ముద్దులొలికే బాలుడు. జైమినిభా. 8.38 ; 2. మనోజ్ఞుడు. భాగ. 10 పూ. 1253. < ముద్దు + -లు + -ఆఁడు. ముద్దులుగారు (-కాఱు[1]) అ.క్రి. ముచ్చటగా ఉండు. హంస. 3.24. ముద్దులుగునియు స.క్రి. ముచ్చటలాడు. తాళ్ల.సం. 3.443. ముద్దులుగులుకు(-కులుకు) రూ. ముద్దులుగుల్కు. విణ. ముచ్చటయిన. పారి. 2.58. ముద్దులుగుల్కు రూ.చూ. ముద్దులుగులుకు. అ.క్రి. మనోజ్ఞంగా ఉండు. కవిక. 6.207. ముద్దులుచిలుకు అ.క్రి. ముద్దులొలుకు. విజయ. 2.40. ముద్దులునటించు అ. క్రి. ముద్దులుగూర్చు. ముద్దులుమూటగట్టు అ.క్రి. మనోజ్ఞంగా ఉండు. (శ్రీనివాస విలాపం). ముద్దులొలుకు అ. క్రి. గారాబంచిందు. < అ.క్రి. గారాబంచిందు. < ముద్దు + -లు + ఒలుకు.

ముద్దువెట్టు(-పెట్టు) స.క్రి. చుంబనం చేయు. హంస. 5.174.

ముద్దుగలకాళ్లపురుగు చూ. మూ-.

ముద్దుగలతల్లులబిడ్డఁడు చూ. మూ-

ముద్దుగలము చూ. మూ-.

ముద్దుగులము చూ. మూ-.

ముద్దుగోలు రూ.చూ. ముద్దగోలు. వి. పంటెకు నూలు చుట్టటానికి ఊనికగా పెట్టే మట్టిముద్ద.

ముద్దుఁడు రూ. మొద్దఁడు, మొద్దు, మ్రొద్దు. వి. 1. ముగ్ధ, గోల, బేల. ఉ.హరి. 3.100 ; 2. బుద్ధిహీనుడు. కాంబేల్. 4.66.

సం. ముగ్ధ-. అమాయకమైన ; ప్రా. ముద్ధ-. మూఢుడు, అవివేకి ; అ.మా.పా.అప. ముద్ధ-. వివేకం లేకపోవటం.

< ప్రా. ముద్ధ-.

ముద్దె రూ. ముదు, ముద్దియ[2]. వి. తామరపూవులోని దుద్దు, కర్ణిక. వేంక.పంచ. 24.154.

సం. ముద్రా. ముద్రికా, గుర్తు ; ప్రా. ముద్దిఅ. ముద్దగ-, ముద్దయ, ముద్దా. మోహరు, అంగవిన్యాస విశేషం, అంగుళీయకం ; అ.మా. ముద్దా, ముద్దియా, ఉంగరం, మోహరు ; పా. ముద్దా, ముద్దికా. ముద్ర ; అప. ముద్ద. ముద్ర ;

క. ముద్దిగె ; కొడ. మొదిర ; త. మోతిరమ్ ; మ. ముద్దిర, మోతిరిం ; కుఇ.కువి. ముది.

< ప్రా. ముద్దిఅ.

ముద్దెర వి. వైష్ణవ గురువులచే శంఖచక్రాలు చేతులపై ముద్రవేయించుకొని వైష్ణవం స్వీకరించటం.

సం. ముద్రా. గుర్తు.

< సం. ముద్రా.

ముద్దేయు చూ. ముద్ద[1].

ముద్రకర్త వి. ఆయాస్థలాల్లో గురువుల దగ్గర తాబేదారుగా ఉండేవాడు. తాళ్ల.సం. 8.26.

సం. ముద్రాకర్తృ. ముద్రవేసేవాడు.

< సం. ముద్రాకర్తృ.

ముద్రగడ వి. రాజదండం.

సం. ముద్రా-. సీలు.

< సం. ముద్రా + గడ.

ముద్రగరిటె వి. దేశాయీలు మొ. వారి ముందర బిరుదుగా తీసుకొని పోయే గంటలున్న ఇత్తడి గరిటె.

సం. ముద్రా. సీలు.

< సం. ముద్రా + గరిట.

ముద్రణాయంత్రము వి. అచ్చుయంత్రం.

సం. ముద్రణ-. అచ్చు, యంత్ర-.

< సం. ముద్రణయంత్ర-.

ముద్రపుచ్చు స.క్రి. నైవేద్యం అర్పించు. బసవ. 7.199.

సం. ముద్ర-. సీలు.

< సం. ముద్ర + పుచ్చు.

ముద్రమానుసులు వి.బ.వ. ఆయాస్థలాల్లో గురువులదగ్గర

తాబేదారుగా ఉండేవారు. తాళ్ల.సం. 6.62.

సం. ముద్రా. సీలు.

<సం. ముద్రా + మానిని + -లు.

**ముద్రారాక్షసము** వి. అచ్చుతప్పు.

సం. ముద్రారాక్షస-. విశాఖదత్తుడు సంస్కృతంలో రచించిన నాటకం.

<సం. ముద్రారాక్షస-(అర్థవిపరి.).

**ముద్రారోహణముసేయు(-చేయు)** అ.క్రి. నిశ్చితార్థ మొనర్చుకొను. కు.సం. 7.139.

సం. ముద్రారోహణ-. ముద్రయొక్క ఆరోహణం.

<సం. ముద్రారోహణ + -ము + చేయు.

**మున్** రూ.చూ. మున్ను[2]. విణ. ముందు. కు.సం. 1.72.

**ముక్కొను** అ.క్రి. ముందుకొను. <మున్ + కొను. **ముక్కొమ్ముమెకము** వి. మనుబోతు, ఋశ్యమృగం. <మున్ + కొమ్ము + మెకము. **మున్కలి** రూ. మునుకలి. వి. ముందు, అగ్రభాగం. లక్ష్మీ. వి. 5.80. **మున్కలుగు** రూ.చూ. మునుకలుగు. అ.క్రి. తొలుతటివాడగు, ముందువాడగు. **మున్కల్గు** రూ.చూ. మునుకలుగు. అ.క్రి. తొలుతటివాడగు, ముందువాడగు. పారి. 2.53. **మున్కొను** రూ. మునుకొను[1]. అ.క్రి. **1.** ముందుపడు, ఎదురుపడు. కు.సం. 1.113 ; **2.** ప్రారంభించు, మొదలుపెట్టు. భోజ. 5.218 ; **3.** పూను, ఉద్యమించు ; **4.** హెచ్చరికతో ఉండు, జాగరూకుడై ఉండు ; స.క్రి. ముందుపెట్టుకొను, పురస్కరించుకొను. మార్క. 8.26. **మున్గలుగు** రూ.చూ. మునుకలుగు. అ.క్రి. ముందువాడగు. <మును + కలుగు. **మున్గల్గు** రూ.చూ. మునుకలుగు. అ.క్రి. ముందువాడగు. **ముంగారికొమ్ము** రూ.చూ. మునిగోరకొమ్ము. వి. కొన ముందుకు వంగినకొమ్ము. **ముంగారిపత్తి** రూ.చూ. ముంగారుపత్తి. వి. ఏడాదిలో మొదటి పంటగా పండించే పత్తి. <మున్ + కారు[1] + -ఇ[3] + పత్తి. **ముంగారుపత్తి** రూ. ముంగారిపత్తి. వి. ఏడాదిలో మొదటి పంటగా పండించే పత్తి. <మున్ + కారు[1] + పత్తి. **ముంగారు[2]** వి. ముందుకారు, అదనుప్రారంభం. <మున్ + కారు[1]. **ముంగారుముంపు** వి. తొలకరివాన. తాళ్ల.సం. 15.230. **ముంగాలు** వి.ఔ. **1.** పాదాగ్రం. ప్రపదం. మను. 4.115 ; **2.** ఇటికబట్టీ కింది ముందు భాగం. <మున్ + కాలు[2]. **ముంగురుమొటికలు** వి.బ.వ. ధాన్యభేదం. ప్రబంధ. 112. **ముంగురులు** వి.బ.వ. అలకలు, నొసటపై ఆడే ఉంగరాల వెంట్రుకలు. శృం.నై. 7.187. <మున్ + కురులు. **ముంగేలు** వి.ఔ.ఆనొ. ముంజేయి, ప్రకోష్ఠం. కృ.శకు. 3.50. < మున్ + కేలు. **ముంగొంగు** రూ. మునికొంగు, మునిగొంగు. వి. చెరగుకొన, మునికొంగు. పల్నా. పు. 75. <మున్ + కొంగు. **ముంగొంగుపసిఁడి** వి. తన చేలాంచలంలో ముడివేసిన బంగారంలా సులభమైన పదార్థం, అందుబాటులో ఉన్న అమూల్య వస్తువు. జైమినిభా. 1.116. **ముంగొంగులతండ్రి** వి. పీతాంబరుడు, మహావిష్ణువు. **ముంగొన** వి. ముందటికొన. రామాభ్యు. 2.80. <మున్ + కొన. **ముంగోపము** రూ. ముక్కోపము. వి. ఓర్పులేక తటాలున వచ్చే కోపం. ఉ.రా. 3.7. సం. కోప-. రోషం ; క. ముంగోపవు. శీఘ్రకోపం. <మున్ + సం.కోప- + -ము. **ముంగోపి** రూ. ముక్కోపి. విణ. ఓర్పు లేక తటాలున కోపపడేవాడు. పాంచాలీ. 2.53. సం. కోపిన్. కోపం కలవాడు ; క. ముఁగోపు. శీఘ్రకోపి ; త. మున్‌గోపి. <మున్ + సం. కోపిన్. **ముంగోరు** వి.ఔ. కొనగోరు. కృ.శకు. 3.157. <మున్ + కోరు[3]. **ముంగోఱ** వి. మునిపల్లు. కకుత్స. 4.105. <మున్ + కోఱ. **ముంగోల** రూ.చూ. మునికోల. వి. మునికోల, పశువుల్ని తోలే కర్ర, తోత్రం. <మున్ + కోల. **ముంగోలు** విణ. మొదటిది. కవిక. 4.128. **ముంజివర** వి. నేత పడుగులో అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం. <మున్ + చివర. **ముంజీఁకటి** వి. మొదటి చీకటి. <మున్ + చీఁకటి. **ముంజీతము** వి. పనికి ముందుగానే ఇచ్చే జీతం. తాళ్ల.సం. 9.219. <ముందు + జీతము. **ముంజూరు** వి. చూరు ముందటిభాగం, వాచూరి. పల్నా.పు. 2.110. <మున్ + చూరు. **ముంజెయి** రూ.చూ. ముంజేయి. వి. మనికట్టు వరకు ఉన్న మోచేతి కిందిభాగం, ప్రకోష్ఠం. ఆం.భా. 2.138. <మున్ + చెయి. **ముంజెయ్యి** రూ.చూ. ముంజేయి. వి. మనికట్టువరకు ఉన్న మోచేతి కిందిభాగం. ప్రకోష్ఠం. <మున్ + చెయ్యి. **ముంజెరమ** వి. నాసాపుటం. <మున్ + చెరమ. **ముంజెఱఁగు** రూ.చూ. మునిచెఱఁగు. వి. మునిచెరగు, వస్త్రంయొక్క ముందటి చెరగు. <మున్ + చెఱఁగు. **ముంజే** రూ.చూ. ముంజేయి. వి. ప్రకోష్ఠం. భార. ఉద్యో. 3.300. **ముంజేకోక** వి. వేటకాడు డేగ మొ. వి వాడేటప్పుడు దెబ్బతగలకుండా ముంజేతికి కట్టిన వస్త్రం. ప్రబంధ. 78. **ముంజేత** అవ్య. ముందుగా. <మున్ + చేయి + -అ[7]. **ముంజేతికంకణము** వి. స్పష్టంగా కనిపించేది. తాళ్ల.సం. 15.201. సం. కంకణ-. వలయం. <ముందు + చేయి + -ఇ[3] + సం. కంకణ- + -ము. **ముంజేతిదర్పణము** వి. అరచేతి మాణిక్యం వంటిది. స్పష్టంగా కనిపించేది. రాధా. 1.54. సం. దర్పణ-. అద్దం. <మున్ + చేయి + -ఇ[3] + సం. దర్పణ + -ము. **ముంజేయి** రూ. ముంజెయి, ముంజెయ్యి, ముంజే. వి. మణికట్టువరకు ఉండే మోచేతి కిందిభాగం. భార. ఉద్యో. 3.60. <మున్ + చేయి. **ముందల[1]** వి. **1.** శిరఃపురోభాగం, తలముందరి భాగం. భార. విరా. 1.308 ; **2.** తలముందటి జుట్టు. భార. ఉద్యో. 1.347. **ముందరికట్టులు కట్టు** స.క్రి. కాళ్ళూ చేతులూ ఒకచోటికి వచ్చేటట్లు మనిపినికట్టు. కు.సం. 2.79. **ముందలచీర** వి. తలపాగా, ఉష్ణీషం. భార. విరా. 5.218. **ముందలబట్టు** రూ.చూ. ముందలపట్టు. వి. తలముందున్న జుట్టు పట్టుకొని చేసే పోరు. పాంచాలీ. 4.24. **ముందలపట్లకుతొడగు** అ.క్రి. కొట్లాటకు దిగు. పాంచాలీ. 4.24. **ముందలపొయ్యి** రూ.చూ. ముంగలపొయ్యి. వి. మంటపెట్టటానికి ఆముకుముందు ఆముగోడ మధ్యభాగంలో గుండ్రంగా ఏర్పరచిన సందు. **ముందలవట్టు(-పట్టు[1])** రూ. ముందలపట్టు. స.క్రి. తలముందుభాగం పట్టుకొను. పారి. 5.38. **మున్మనుమరాలు** రూ.చూ. మునిమనుమరాలు. వి.

మునిమనుమరాలు. **మున్మన్మకుఱ్ఱ** వి. చిన్నవయసువాడైన మనుమడు. పాండు. 4.267. < ముని[1] + మనుమఁడు + కుఱ్ఱ. **మున్మాపు** రూ.చూ. మునిమాపు. వి. ప్రదోషకాలం, **మున్మట్ట** అవ్య.ద్రు. పూర్తిగా. భాస్కరా. కిష్కిం. 96. **మున్మను** వి. ముందుముందు. భార. అను. 5.183. **మువ్వెనుకలు** వి.బ.వ. పూర్వాపరాలు, గతకాలమూ వచ్చే కాలమూ. విప్ర. 4.74. **మున్మనుమఁడు** వి. మునిమనుమడు. మను. 2.9. < మును[1] + మనుమఁడు. **మువ్మోటు** విఙ. మూర్ఖుల్లో మొదటివాడు, మూర్ఖాగ్రేసరుడు, అతి మోటువాడు. గౌ.హరి. ఉ.650 పం.

**మునక** రూ.చూ. మునుక. వి. స్నానం.

**మునకేయు** అ.క్రి. నిండుగాఉండు. < మునక + వేయు.

**మునకాలకర్ర** రూ.చూ. ములుకోలుకర్ర. వి. ములుగోల, దుక్కికోల, ముల్లుగట్టె, అరకకు కట్టిన ఎడ్లనుతోలే పొడుగు కర్ర, దీనిచివరి చిన్నముల్లు (మేకు) వేస్తారు.

**మునకేయు** చూ. మునక.

**మునగ** రూ. మునుగ, ములక[2], ములగ. ములుక[3], ముల్గ. వి. 1. శిగ్రుశలాటువు, మునగకాయ. భార. అను. 3.189; 2. శిగ్రువు, ఒకానొకచెట్టు. శుక. 2.408 (Horinga plerygosperma).

క. నుగ్గె, నుగ్గి. ములగ; తు. నురిగె, నుర్గె. మునగచెట్టు; త. మురుంకై. మునగచెట్టు (Moringa pterygosperma); మ. మురిన్న. మునగచెట్టు (Hyperantheramoringa); పర్జి. ముంగ, ములంగ. మునగచెట్టు.

**మునగపూజిట్టువ** వి. పక్షివిశేషం. హంస. 3.12. **మునగపొడ** వి. తమలపాకు తెగులు. **మునగబెండునార** వి. మునగచెట్టు బెరడునుంచి తీసిన నార.

**మునమున** వి. కోపం మింగుకొని రుసరుసలాడటం.

**మునశీబు** రూ.చూ. మునసబు. వి. గ్రామ న్యాయాధికారి, గ్రామ మునసబు.

**మునస** రూ. మణస, మున్స. వి. ఏతంమాని మీది అరభాగం, మీట.

**మునసప్** రూ.చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామ మునసబు.

**మునసపు** రూ.చూ. మునసబు. వి. 1. గ్రామాధికారి, అధ్యక్షుడు; 2. న్యాయాధికారి.

**మునసఫ్** రూ.చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామ మునసబు.

**మునసఫు** రూ.చూ. మునసబు. వి. గ్రామ న్యాయాధికారి, గ్రామ మునసబు.

**మునసబు** రూ. మునశీబు, మునసప్, మునసపు, మునసఫ్, మునసఫు, మునసీప్, మునిషీబు, మునిసిపు, మునిసీప్, మునిసీపు, మున్సఫు, మున్‌సిఫు, మున్సీపు, మున్‌సీబు. వి. 1. గ్రామన్యాయాధికారి, గ్రామమునసబు; 2. న్యాయాధికారి.

హిం. ఉ. అర. మున్‌సిఫ్. జడ్జి, న్యాయాన్ని పంచేవాడు, మధ్యవర్తి, తగిన, నిష్పక్షపాతమైన;

క. మునసపు, మునసీపు; త. మునసీఫు, మునిచీప్పి. గ్రామాధికారి, డిస్ట్రిక్టు మునసబు; మ. మున్‌సిఫ్, మున్‌సిప్పి.

< ఉ. మున్‌సిఫ్.

**మునసీప్** రూ.చూ. మునసబు. వి. గ్రామ న్యాయాధికారి, గ్రామ మునసబు.

**మునాది** వి. 1. ఉదయం సాయంకాలం మసీదులో గొంతెత్తి ప్రార్థన చేసేవాడు; 2. ప్రకటన, చాటింపు.

హిం.ఉ.అర. మునాదీ. చిన్నడోలు, ప్రకటన, చాటింపు.

< ఉ. మునాదీ.

**మునాఫ** రూ. మునాబ. వి. కౌలు, భూకామందుకు డబ్బుగాని పంటగాని 'ఇంత' ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం.

ఉ. మునాఫ. వ్యవసాయలాభం, లాభం.

< ఉ. మునాఫ.

**మునాఫాకిచ్చు** స.క్రి. కౌలుకిచ్చు.

ఉ. మునాఫా. లాభం, ఫలం, వ్యవసాయలాభం.

< ఉ. మునాఫా + -కున్ + ఇచ్చు.

**మునాబ** రూ.చూ. మునాఫ. వి. కౌలు, భూకామందుకు డబ్బుగాని పంటగాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే సేద్యం.

**మునాలు** వి. రెంటికెదురుగా ఒకటి చొప్పున పచ్చిటికలను ఆరబెట్టే పద్ధతి.

**మునాసబు** వి. 1. వివేకం; 2. రావలసింది.

హిం. మునాసిబ్. తగిన, సరైన, పొందికైన, అనుకూలమైన, ఉపాయం; ఉ.అర. మునాసిబ్. తగ్గిన, సరైన, అనుకూలమైన, పొందికైన;

క, మునాసబు. తగిన, సరైన, రావలసిన, పొందికైన; త. మునాచిప్. తగిన, శిస్తు మినహాయింపు.

< ఉ. మునాసిబ్.

**ముని** రూ.చూ. మున్ను. విఙ. మును శబ్దానికి వృత్తిలో ఉత్తరపదం పరమైనప్పుడు వికల్పంగా అయ్యే రూపం. ఉ. మునికాళ్ళు, మునిపండ్లు, మునిమాపు మొ.వి.

**మునికాలు** రూ.చూ. మునిగాలు. వి.ఔ. 1. పాదాగ్రం, కాలికొన. నృసింహ. 2.81; 2 అగ్రపాదం, ముందరికాలు. **మునికొంగు** రూ.చూ. ముంగొంగు. వి. చెరగుకొంగు. **మునికోల** రూ. ముంగోల, ములుకోల, ములుగోల, ముల్లుకోల. వి. 1. ఆరెగోల, వృషభాదుల్ని నడపటంకోసం పొడిచే కర్ర. భార. ద్రోణ. 3.228; 2. తోత్రం, కొరడా. భార. కర్ణ. 1.169. **మునిగట్టుచివర(-కట్టుచివర)** రూ. మునిగట్టుసివర. వి. మగ్గం దండెదగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ. **మునిగట్టుసివర** రూ.చూ. మునిగట్టు చివర. వి. మగ్గం దండెదగ్గర నేతపడుగులో దూర్చినచువ్వ. **మునిగాలు(-కాలు[2])** రూ. మునికాలు. వి.ఔ. 1. పాదాగ్రం, కాలికొన. భార. విరా. 2.250; 2. అగ్రపాదం, ముందరికాలు. రాజ.చ. 2.75. **మునిగుత్త** వి. బాకీ చెల్లుబాటుకు భూమిపై ఇవ్వబడ్డ అధికారం: 1. అప్పు చెల్లేదాకా

భూమిపై ఇవ్వబడ్డ అనుభవాధికారం; 2. బాకీ తీర్మాన నిమిత్తం భూస్వామ్యాన్ని గుత్తకివ్వటం; 3. బాకీ తీర్మా నం కోసం భూమిపై ఇచ్చిన అనుభవాధికారం; 4. అప్పు తీర్చటానికై భూమిపై ఇచ్చిన మాత్రాధికారం. మునిగూటం వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య. మునిగొంగు(-కొంగు) రూ.చూ. ముంగొంగు. వి. చెరగు కొంగు. శక. 1.281. మునిగోరకొమ్ము రూ. ముంగారికొమ్ము. వి. కొనముందుకు వంగిన కొమ్ము. మునిచీకటి వి. ప్రొద్దు క్రుంకిన వెంటనే వచ్చిన పల్చని చీకటి. దశా. 8.223. ఆం.భా. 1.146. మునిచీఁకటుల విచ్చు మొగ్గ రూ. చూ. మునుచీఁకటుల విచ్చు మొగ్గ. వి. చంద్రుడు. మునిచెఱఁగు రూ. ముంజెఱఁగు. వి. ముం గొంగు. శక. 3.117. ముని[1] + చెఱఁగు. మునిపంట నొత్తు స.క్రి. దంతక్షతమొనర్చు. కళా. 7.169. < ముని + పల్లు + - అ[7] + ఒత్తు. మునిపల్లు వి. ౙా. ముందు భాగంలో ఉండేపళ్ళు. కు.సం. 2.79. మునిపొంటె వి. రెండుపూటలా నాగలికి కాని మోటుకుగాని ఒకేజత ఎద్దుల్ని కట్టటం. మునిబ్రాహ్మణులు వి.బ.వ. బ్రాహ్మణుల్లో ఒకశాఖ. మునిమనుమఁడు వి. 1. ప్రపౌత్రుఁడు, పౌత్రుని పుత్రుఁడు. వేం. మా. 5.137; 2. పౌత్రిపుత్రుడు, దౌహిత్రుని పుత్రుడు, దౌహిత్రి పుత్రుడు. మునిమనుమరాలు రూ. మున్మనుమరాలు. వి. 1. పౌత్రుని పుత్రిక, మనుమని కూతురు; 2. పౌత్రిపుత్రిక, మనుమరాలి కూతురు; 3. దౌహిత్రుని పుత్రిక; 4. దౌహిత్రి పుత్రిక. మునిమాపు రూ. మునుమాపు, మున్మాపు. వి. ప్రదోషకాలం, సాయంసంజ. నిర్వ. రా. 9.84. మునిమీసము వి. అప్పుడే మొలుస్తున్న మీసం. మునిముక్కట్టు వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపి వేసినకట్టు. మునిముక్కు రూ. మునుముక్కు. వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. మునిముంగల వి. మొట్టమొదట, ఎట్ట ఎదుట. మునిముచ్చు రూ. మునిముచ్చు. వి. 1. పశ్యతో హరుడు, పచ్చెకాడు, చూస్తుండగా దొంగిలించేవాడు. వరాహ. 11.57; 2. పశ్యతో హరురాలు, పచ్చెకత్తె. కళా. 3.188. మునిముట్టు క్రి.విశే. మిక్కిలి. మునిమునిచీకటి వి. ముంజీకటి. దశా. 3.223. మునిమునిమీసము వి. నూనూగు మీసం. ప్రబంధ. 29. మునిముచ్చు రూ.చూ. మునిముచ్చు. వి. దొంగవేషం వేసే మునులు, వంచకు లైన మునులు. మను. 2.73. మునియేఁడు (-ఏఁడు) రూ. మున్నేఁడు. వి. ౙా. నిరుటికి పూర్వపు సంవత్సరం, ముందటేడు. అష్టమ. క. 1.34పు. 11పం. మునివాకిలి రూ. మునోకిలి. వి. 1. సింహద్వారం, ఇంటిలోని మొట్టమొదటి ద్వారం; 2. ముందువాకిలి. మునివాఁడు విశే. ముందు వాడు. శాఖ. సం. 7.108. మునివ్రేలు వి. ౙా. వేలికొన, అంగుళ్యగ్రం. నిర్వ. రా. 7.82. మునెంచు వి. అంచులో చిట్టచివరి భాగం. < ముని + అంచు[3]. మునోకిలి రూ.చూ. మునివాకిలి. వి. సింహద్వారం, ఇంటిలోని ప్రధానద్వారం.

మునిఁగించు చూ. మునుఁగు.

మునిఁగిపోవు చూ. మునుఁగు.

మునిమనోహరాలు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

సం. మునిమనోహర-. మునులమనస్సును హరించే.

< సం. మునిమనోహర- + ము + -లు (అర్థవివరి.).

మునిమోదుగ రూ.చూ. ములుమోదుగ. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు.

మునిశి రూ.చూ. మునిషీ. వి. 1. లేఖకుడు; 2. భాషనేర్పే ఉపాధ్యాయుడు.

మునిషి రూ.చూ. మునిషీ. వి. 1. లేఖకుడు; 2. ఉర్దూభాష నేర్పే ఉపాధ్యాయుడు.

మునిషీ రూ. మునిశి, మునిషి, మున్షి, మున్షీ. వి. చదువు చెప్పేవాడు, బోధకుడు, లేఖకుడు, వ్రాయసకాడు. వేణు. 16.

హిం. మున్శీ. గౌరవసూచకమైన ఉపాధి; మరా. మున్శీ. దుబాసి, ఉపాధ్యాయుడు; ఉ. మున్షీ. లేఖకుడు, గౌరవసూచకమైన ఉపాధి.; పార. మున్షీ. లేఖకుడు, గ్రంథకర్త, ఉపాధ్యాయుడు; అర. మున్షీ. ఉపాధ్యాయుడు.

< ఉ. మున్షీ.

మునిషీబు రూ. చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామమునసబు.

సం. మనుష్యచికిత్సా. మనిషికి చేసే వైద్యం.

మునిసిపు రూ.చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామమునసబు.

మునిసీప్ రూ. చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామమునసబు.

మునిసీపు రూ. చూ. మునసబు. వి. గ్రామన్యాయాధికారి, గ్రామమునసబు.

మునీబు వి. 1. డిప్యూటీని నియమించే ఒకఉద్యోగి; 2. వర్తకసంబంధమైన అడితేదారుడు.

హిం. మునీబ్. సహాయకుడు, లెక్కలు వేసేవాడు, అసిస్టెంటు; మరా. మునీమ్. ఉ. అర. మునీబ్. మానేజరు, యజమాని, ప్రిన్సిపాల్, క్లయింటు, నియా మకుడు, రక్షకుడు.

< ఉ. మునీబ్.

మును రూ.చూ. మున్ను. వి. 1. ముందు, పూర్వం. భార. ఆది. 3.19; 2. మొదలు, ప్రారంభం. భార. విరా. 5.124; 3. తుద, అగ్రం. హరి. పూ. 4.16; 4. పురో భాగం, ముందువైపు. పారి. 1.104.

మునుకడ రూ. మునుగడ. వి. 1. ప్రథమసమయం, మొదటివేళ, తొలుదొల్త. కాశీ. 5.158; 2. పురోభాగం, ముందువైపు. వేంక. పంచ. 3.324. మునుకలి రూ.చూ. ముక్కలి. వి. ముందు, అగ్రభాగం. మునుకలుగు రూ. మునుకల్గు, ముక్కలుగు, ముగ్గలుగు, ముగ్గలు. అ.క్రి. తొలుతటివాడగు, ముందువాడగు. మను. 3.70. మునుకల్గు రూ.చూ. మునుకలుగు. అ.క్రి. తొలుతటివాడగు, ముందు వాడగు. మునుకొనిపోవు అ.క్రి. ముందుకుపోవు. హరి. ఉ. 10.282. మునుకొను[1] రూ.చూ. ముక్కొను. అ.క్రి. 1. పూను, ఉద్యమించు, ప్రయత్నించు. భార. విరా.

5.387 ; **2.** ముందగు, తలకడుచు. హరి. ఉ. 2.150 ; **3.** హెచ్చరికతోనుండు, జాగరూకుడై ఉండు. భాగ. 10పూ. 210 ; **4.** ప్రారంభించు. వాల్మీ. 3.27 ; స.క్రి. ముందు పెట్టుకొను, పురస్కరించుకొను. భీమ. 8.26. **మునుకోలు** వి. మునుకోవటం. **మునుగట్టు** వి. ఉదయాద్రి, పూర్వ పర్వతం. హ.స. 4.33. <మును[1] + గట్టు. **మునుగడ** రూ.చూ. మునుకడ. వి. **1.** ప్రథమసమయం, మొదటివేళ, తొలుదొల్త ; **2.** పురోభాగం, ముందువైపు. **మునుచీ(కటుల విచ్చుమొగ్గ** రూ. మునిచీ(కటుల విచ్చుమొగ్గ. వి. చంద్రుడు. వేంక. ఆం. 11. **మునుచు[2]** అ.క్రి. మునుకొను, ముందు పడు. వసు. 4.43. **మునుపడు** అ. క్రి. మునుకొను, ముందగు. భాగ. 10పూ. 459. **మునుపు[1]** స.క్రి. మునుకొనచేయు, పొడచూపచేయు. ద్వి. పరమ. వి. 4.295పు. **మునుపు[2]** రూ.చూ. మున్పు. విశ. **1.** అతిశయిల్లిన, బలవత్తరమైన. రం. రా. అయోధ్యా. 138పు. 8పం, ; **2.** దట్టమైన, సాంద్రమైన. నవనాథ. 2.105పు. 2పం. ; **3.** తొల్తటిది, పూర్వపుది. దశా. 1 166 ; వి. ఔ. **1.** పూర్వం' ముందు. వరాహ. 9.3 ; **2.** మొదలు, ప్రారంభం. విక్ర. 2.46. **మునుపువెనుకలు** వి. బ. వ. పూర్వ పరాలు. తాళ్ల. సం. 10.47. **మునుమాట** వి. సంధ్యా సమయం. **మునుమాపు** రూ.చూ. మునిమాపు. వి. ప్రదోష కాలం, సాయింసంజ. **మునుముక్కు** రూ.చూ. మునిముక్కు. వి. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టినకొన. **మునుముట్టనెచెప్పు** స. క్రి. మునుముందుగనే చెప్పు. ఉ. హరి. 5.185. **మునుముట్టు** అ.క్రి. **1.** మొదలుతాకు, మొదలంటు. భార. అను. 3.182 ; **2.** సాంతమగు, తుదతాకు. భీమ. 4.139 ; **3.** మూలం అంటేటట్లుగా, సమూలంగా. కళా. 3.28. **మునుముందు** వి. బాగాముందు, మొట్టమొదట. **మునుమున్ను** వి. మొట్టమొదట. **మునువెనుక తెలియక** అవ్య. బాగోగులు తెలియక. శుక. 1.270.

**మునుంలాక** చూ. మునుము.

**మునుక** చూ మును(గు.

**మునుకు[1]** రూ. మున్కు[1]. అ.క్రి. **1.** ఎదుటివానికి వినబడకుండ ఉచ్చరించు, గొణుగు. రం. రా. ఉ. 70పు. 14పం. ; **2.** సంలాపించు, పలుకు, పచించు. శృం. నై. 3.42 ; **3.** ప్రతివచనమిచ్చు, మారుపల్కు. భోజ. 5.66.

క. మిణుకు. లోగొంతుతో మాట్లాడు, గొణుగు ; తు. ముణుముణు. గొణుగు ; త. మిణుమిణు (-ప్పి-త్-). మెల్లగా మాట్లాడు, గొణుగు, అస్పష్టంగా చెప్పు ; మ. మిణుమిణుక్క. గొనుగు, అస్పష్టంగా మాట్లాడు ;

పో. చూ. సం. మిణమిణా-. ముక్కుతో (అస్పష్టంగా) మాట్లాడు ; ప్రా. ముణుముణై. గొణుగు ; మరా. మిణ్మిణా. నెమ్మదిగా, అస్పష్టంగా మాట్లాడు.

**మునుకు[2]** రూ. మున్కు[2]. అ.క్రి. సంతాపించు ; భాస్క. రా. యు. 2345 . వి. సంతాపం.

క. ముని; ఇష్టపడకుండు, కోప్పడు ; తు. మునిపు. కోపం, అసహ్యం ; త. ముని (-వ్-, -న్త్-). ఇష్టపడక పోవు, కోపగించుకొను, మునైవు. అయిష్టం, కోపం, అసహ్యం ; మ. ముniయుక. చిరచిరలాడు, అసహ్యపడు ; గోం. ముంగ్‌సాంగ్‌యేతానా. మిక్కిలి కోపగించుకొను.

**మునుకుడు** వి. కోయంబత్తూరు నుంచి తిరునల్వేలి వరకు కొండల్లో పెరిగే మొక్క (Limonla alata).

**మునుకువ** వి. పూనిక. యయా. 3.16.

**మునుకొను** చూ. మునుము.

**మునుకోల** రూ. మునికోల. వి. కొరడా, కశ. కు.సం. 4.83.

**మునుగ** రూ.చూ. మునగ. వి. మునగ.

**మునుగుతామర** రూ. మునుగుదామరము. వి. గడ్డి బీడుల్లో పెరిగి ఎర్రని పూలు పూసే మొక్క (Mimosa rubicaulis).

**మునుగుదామరము** రూ.చూ. మునుగుతామర. వి. గడ్డి బీడుల్లో పెరిగి ఎర్రని పూలు పూసే మొక్క (Mimosa rubicaulis).

**మును(గంగ(బాఱు** చూ. మును(గు.

**మును(గంబాఱు** చూ. మును(గు.

**మును(గ(బడు** చూ. మును(గు.

**మును(గు** రూ. ముదు(గు, ముణు(గు, ముగ్గు. అ.క్రి. **1.** (జలాదుల్లో) మగ్నమగు. భార.ఆది. 4.218 ; **2.** పూర్ణమగు. కు.సం. 1.12 ; **3.** కప్పబడు, ఛన్నమగు, ఆవృతమగు. భార.విరా. 2.222 ; **4.** లగ్నమగు, సక్తమగు. భార.అను. 5.416 ; **5.** నశించు, చెడు. పండి.చ. 4.273 పు. ; **6.** గుచ్చుకొను, నాటు. ఉ.హరి. 1.42 ; **7.** అడగు, క్రుంగు. కాశీ. 3.6 ; **8.** స్నానంచేయు, మునకచేయు. కాశీ. 3.16 ; **9.** క్రుంగు, అస్తమించు. కుచే. 2.90 ; **10.** తీరు, ఉపశమిల్లు. మైరా. 3.143 ; వి. స్నానం, మునగటం. అచ్చ.రా.బాల. 3.44 పు.

క. మున్, ముళుగు, ముఱుగు, ముఱిగు, ముళుకు, ముఱింకు, ముళుంకు, ముళుంగు, మునుగు, మునగు, మునిగు. మునుగు, క్రుంగు, అస్తమించు ; కొడ. ముజ్జ్. మునుగు ; తు. ముర్కని, ముళుగుని, ముణుగుని. మునుగు, క్రుంగు ; త. ముళుకు (ముళుకి-). మునుగు, ముళుక్కు. ముంచు, ముళుచు. (నీటిలో) మునుగు ; మ. ముళుకుక. నీటి అడుక్కు పోవు, మునుగు, ముణ్ణుక. మునుగు, ముక్కుక. మునుగు ; గోం. మురుగానా. మునుగు ; కుఇ. ముంజ (ముంజి-). ముంచు ; కువి. మ్రూఖలి. ముంచు ; పర్జి. ముల్గ్-, ములి-. మునుగు ; కొలా. ముజ్గ్. మునుగు ; నా. ముజ్గ్. మునుగు.

<మూ.ద్రా. *ముట్-.

**ముని(గించు** రూ. ముణిగించు. స.క్రి. మునిగేటట్లుచేయు, ముంచు, నశింపచేయు. శృం.నై. 2.135. <మును(గు + -ఇంచు[3]. **ముని(గిపోవు** అ.క్రి. నష్టమగు. <మును(గు + -ఇ[13] + పోవు. **మునుక** రూ. ముణక, మునక, మున్క. వి. **1.** మునగటం, స్నానం. విజయ. 1.55 ; **2.** మునక వేయటం. **మును(గంగ(బాఱు** రూ.చూ. మును(గంబాఱు. అ.క్రి. మునగడానికి సిద్ధంగా ఉండు. <మును(గు +

-అ[7] + అగు + -అ[7] + పాటు[2]. **మును(గంబాటు** రూ. మును(గంగ(బాటు. అ.క్రి. మునగటానికి సిద్ధంగాఉండు. హరి.ఉ. 7.130. **మును(గ(బడు** అ.క్రి. మునుగు, మగ్న మగు. భాస్క.రా యు. 9.40. <మును(గు + -అ[7] + పడు. **మును(గుకోడి** వి. పక్షి విశేషం. హంస. 3.12. **మును(గుడుపడు (-పడు)** అ.క్రి. మునకపొందు, మునుగు. తాళ్ల.సం. 11.3.164. **మును(గువా(డు** విశ. అప్లుతుడు, స్నాతుడు. **మునుచు**[1] రూ.చూ. ముంచు. స.క్రి. మునగ చేయు, మగ్నంకావించు.

**మునుచు**[1] చూ. మును(గు.

**మునుతికరక** వి. చిత్రికచెట్టు (Bursera serrata).

**మునుమాటు** చూ. మూ-. వి. మూడుసార్లు, ముమ్మారు. జాహ్న. 3.86.

**మునుమాడు** చూ. మునుము.

**మునుమార** చూ. మునుము.

**మునుమిడి** చూ. మునుము.

**మునుమిడు** చూ. మునుము.

**మునుము** రూ. మున్ము, ములుము. వి. **1.** ఎదురు. భార.విరా. 5.110 ; **2.** పురోభాగం, ఎదుటిచోటు. భార.భీష్మ. 2.213 ; **3.** సేనాముఖం. భార.భీష్మ. 2.373 ; **4.** వరస, పంక్తి. భార.కర్ణ. 2.6 ; **5.** వస్తు సమూహం. పండి.చ. 2.162 ప. ; **6.** వార్ధక్యం, ముదిమి. భోజ. 4.134 ; **7.** కోసే పైరుకు ముందున్న పైరు. ఆం.భా. 3.32 ; **8.** తరచుదనం ; **9.** కరుకు, ఆకు కప్పు పేర్పులోని మూరెడు పన ; **10.** ఒక మనిషి పైరు కొయ్యటానికి వదిలిన చాళ్ళు, కోత పనిలో ఒక మనిషి వాటా ; **11.** నేత సాగులో దండె దగ్గర నుంచి చివరి దాకా చాపిన పడుగు ; విశ. తరచు, అధికం. హరి.ఉ. 9.41.

**మునుంలాక** రూ.చూ. మునుములాక. వి. నేత పడుగులో దండె దగ్గర దూర్చిన వెదురుబద్ద **మునుకొను**[2] అ.క్రి. **1.** వరసపెట్టు. భాస్క.రా.సుం. 470 ; **2.** వాక్యాలంకారంగా కొన్నిచోట్ల ఉపయోగింపబడుతుంది. భాస్క.రా.యు. 1449 ; **3.** అతిశయించు. విప్ర. 3.53. **మునుమాడు** స.క్రి. వరసపెట్టు. బసవ. 6.163. <మునుము + ఆడు. **మునుమార** అవ్య.ద్రు. పూర్తిగా. పండి.చ. 1.4.508 ప. <మునుము + ఆరు[1] + -అ[7]. **మునుమిడి** క్రి.విశ. చక్కగా, బాగా. **మునుమిడు** రూ.చూ. మున్మిడు. అ.క్రి. వరసపెట్టు. భార.ద్రోణ. 2.164 ; స.క్రి. ఎదిరించు, మార్కొను. రం.రా.బాల. 31 పు. 31 పం. < మునుము + ఇదు **మునుముకొను** అ.క్రి. వరసపెట్టు. భార.శాంతి. 3.447. **మునుముచివ్వ** రూ. మునుముసివ. వి. నేత పడుగులో దండెకు అవతల దూర్చిన కర్ర. **మునుములాక** రూ. మునుంలాక, మునుములేక, మునులాక. వి. నేతపడుగులో దండె దగ్గర దూర్చిన వెదురుబద్ద. **మునుములేక** రూ.చూ. మునుములాక. వి. నేత పడుగులో దండె దగ్గర దూర్చిన వెదురుబద్ద. **మునుముసివ** రూ.చూ. మునుముచివ్వ. వి. నేత పడుగులో దండెకు అవతల దూర్చిన కర్ర. **మునుంపురుగు** వి. మొక్కమునుం, ఆకు కొసలు తినే ఎర్రగొంగళి పురుగు. **మునులాక** రూ.చూ. మునుములాక. వి. నేత పడుగులో దండె దగ్గర దూర్చిన వెదురుబద్ద.

**మునుంపురుగు** చూ. మునుము.

**మునులయిల్లు (-ఇల్లు)** వి. ఆకుటిల్లు.

**మునులాక** చూ. మునుము.

**మునెంచు** చూ. ముని.

**మునోకిలి** చూ. ముని.

**మున్క** రూ.చూ. మునుక. వి. **1.** మునగటం, స్నానం ; **2.** మునక వేయటం.

**మున్కలువెట్టు (-పెట్టు)** అ.క్రి. మునుగు. మను. 6.112.

**మున్కు**[1] రూ.చూ. మునుకు[1]. అ.క్రి. **1.** ఎదుటివానికి వినబడకుండా ఉచ్చరించు, గొణుగు. మార్క. 5.127 ; **2.** పలుకు, వచించు. పాండు. 1.6 ; **3.** ప్రతివచనమిచ్చు, మారుపలుకు.

**మున్కు**[2] రూ.చూ. మునుకు[2]. వి. సంతాపం.

**మున్గు** రూ.చూ. మును(గు. అ.క్రి. **1.** (జలాదుల్లో) మగ్నమగు. హర. 4.41 ; **2.** స్నానంచేయు, మునకవేయు. పాండు. 4.196 ; **3.** పూర్ణమగు ; **4.** కప్పబడు, ఛన్నమగు, ఆవృతమగు ; **5.** నశించు, చెడు ; **6.** లగ్నమగు, సక్తమగు ; **7.** అడగు, క్రుంగు ; **8.** క్రుంకు, అస్తమించు ; **9.** తీరు, ఉపశమిల్లు ; **10.** గుచ్చుకొను, నాటు ; వి. స్నానం, మునగటం.

**ముంత** వి. **1.** మానిక, కుంచంలో నాలుగో భాగం. నె.శా. C.P. 23. క్రి.శ. 1348 ; **2.** దార్వ్యాది కలశం, చెంబు. ఉ.హరి. 3.48 ; **3.** చట్టి, చిన్నమట్టిపాత్ర ; **4.** బుడ్డిపై ఉన్న గుమ్మటం లాంటి భాగం ; **5.** ఒకవిధమైన కంచు చెంబు ; **6.** ఒక కొలత పాత్ర మూడు శేర్లు ; **7.** రాట్నం రెండు చక్రాలను వేరుచేసే కొయ్య.

క. ముందె. కూజాలాంటి ఇత్తడి పాత్ర ; త. ముంతై. చిన్న పాత్ర, మొంతై. చిన్న మట్టిపాత్ర లేక మట్టిపాత్ర ; మ. మొంత, మోంత ; కుఇ. మూత ; కువి.మూంత.

**ముంతఖర్జూరము** వి. మెత్తగా నానబెట్టిన ఖర్జూరపు పండు. **ముంతగజ్జనము** వి. ఒకరకం పొద (Echites frutescens). **ముంతగూడు** వి. గొబ్బగూడు, పచ్చిగోడలో డబ్బు దాచుకోవటానికి చిన్న ముంత నమర్చిన గూడు. **ముంతతొట్టి** రూ.చూ. ముంతతొట్టె. వి. కలశం, బంగళా కప్పుమూలల్లో బోర్లించే మట్టిపాత్ర. **ముంతతొట్టె** రూ. ముంతతొట్టి. వి. బంగళాకప్పు మూలల్లో బోర్లించే మట్టిపాత్ర. **ముంతనీళ్లనేమునుగుబ్రతుకు** వి. అతిసంకుచితమైన జీవితం. తాళ్ల. సం. 1పు. 151. **ముంతపప్పు** వి. చిన్నమట్టిపిడతలో నిప్పువేసి పప్పుమీదను పెట్టి వేడిచేసి అప్పటికప్పటికి అమ్మే వేరుసెనగపప్పు. **ముంతపాటునకైన** అవ్య. ద్రు. తాగటానికైనా. నిరంకు. 2.123. **ముంతపొగ** వి. ముంతలో నిప్పువేసి అందులో మిరపకాయలు వేసి పెట్టిన పొగ. **ముంతపొగపెట్టు** అ.క్రి. పిశాచబాధ తొలగటం కోసం ముంతలో వేసిన మిరపకాయల పొగపెట్టు. శుక. 2.115. **ముంతపోత** వి. కుండపోత, కడవలతో కుమ్మరించినట్టు వాన కురిసేతీరు. **ముంతబాణం** వి. ఒకరకం

చిచ్చుబుడ్డి. **ముంతమామిడి** వి. 1. అగ్రబీజం, జీడిమామిడి. కృ. శకు. 3.33; 2. మామిడిలో ఒకరకం. త. ముంతిరి. జీడిమామిడి. (Anacardium accidentale). ముంతిరికై; మ. ముణ్దిరి. **ముంతరాయి** వి. చిన్న చిన్న మూతులున్న పాత్రల్ని సర్సటానికి ఉపయోగించేరాయి. **ముంతరౌతు** వి. చిన్న చిన్న మూతులున్న పాత్రల్ని సర్సేదానికుపయోగించే రాయి. **ముంతల(బోసినట్లు** అవ్య. కుంభవృష్టిగా, ఎక్కువగా అనటం. పాండు. 3.91. **ముంతలోవి** వి. మూడున్నరశేర్ల బియ్యం ఉడికే మట్టిపాత్ర. **ముంతల్రాయి** వి. చిన్నచిన్న మూతలున్న పాత్రల్ని సర్సడానికి ఉపయోగించేరాయి. **ముంతవాటు** వి. ముంతలో వేసి దాచటం. నిరంకు. 2. 123.

**ముందట** చూ. ముందు.

**ముందటిపంది** చూ. ముందు.

**ముందటిపీట** చూ. ముందు.

**ముందటే(డు** చూ. ముందు.

**ముందడి** వి. 1. దౌర్భాగ్యుడు; 2. దుష్టుడు; 3. అనాథ; 4. లంజె.

**ముందడుగువేయు** చూ. ముందు.

**ముందర** రూ. ముందరు. ముందఱ, ముందఱు, ముందల². వి. ౙౌ. 1. ఉదర్కరం, ఉత్తరకాలఫలం. భార. ఆది. 6.174; 2. మొదటికాలం, పూర్వం, మునుపు. భార. ఆది. 7.241; 3. ముందు, ముందుభాగం, పురోభాగం, హరి. పూ. 5.160; 4. భవిష్యత్కాలం, ఆగామికాలం. భాస్క. రా. యు. 716; 5. వెనక. నీలా. 1.100.

తు. ముంగణ. ప్రాధాన్యం; త. మున్నర్. ముందర; మ. మున్నర్. జంతువుల ముందరిభాగం.

**ముందరడుగువెనకపెట్టు** (-అడుగువెనకపెట్టు) అ. క్రి. వెనుదీయు. ఆం. భా. 3.105. **ముందరదాపులు** వి.బ.వ ఆములో కాలేకుండలకు దెబ్బతగలకుండా మొగదాల పొయ్యిల దగ్గర ఆపుగా పెట్టిన ఓటికుండలు. **ముందరవెనుకలగు** అ.క్రి. తలక్రిందులగు. తాళ్ల. సం. 4.49. **ముందరిల్లు** వి. పెద్దఇళ్ళల్లో మొగదల ఉండే పెద్దహాలు. <ముందర + ఇల్లు.

**ముందరిచిరతతాడు** చూ. ముందరు.

**ముందరిల్లు** చూ. ముందర.

**ముందరు** రూ.చూ. ముందర. వి. ౙౌ. 1. ఉదర్కరం, ఉత్తరకాలఫలం; 2. మొదటికాలం; 3. ముందు, ముందుభాగం, పురోభాగం; 4. భవిష్యత్కాలం, ఆగామికాలం; 5. వెనక.

**ముందరిచిరతతాడు** వి. కుచ్చుతాడుకూ మగ్గం నిలుపు పట్టెకూ కట్టిన పక్కదారం.

**ముందఱ** రూ.చూ. ముందర. వి. ౙౌ. 1. ముందుకాలం, పూర్వకాలం. భార. ఆది. 6.195; 2. ఎదుటిప్రదేశం. కు. సం. 8.16; 3. మొదటికాలం. భార. విరా. 3.126; క్రి. విశ. ద్రు. మొదట. భార. ఆది. 7.117.

**ముందఱికాళ్లకుబందములువేయు** చూ. ముందఱు.

**ముందఱిమ్రాను** చూ. ముందఱు.

**ముందఱు** రూ.చూ. ముందర. వి. ౙౌ. 1. ముందుకాలం పూర్వకాలం. కు. సం. 2.12; 2. ఎదుటిప్రదేశం. కు.సం. 8.16; 3. మొదటికాలం.

**ముందఱికాళ్లకుబందములువేయు** అ. క్రి. రాబోయేదానికి అడ్డుచెప్పు. <ముందఱు + -ఇ³ + కాళ్లకు బందములు వేయు. **ముందఱిమ్రాను** వి. అరిణ (తాటిదోనె) నిలపటం కోసం అడ్డంగా కట్టబడిన మాను. <ముందఱు + -ఇ³ + మ్రాను.

**ముందల²** రూ.చూ. ముందర. వి. 1. క్రమం; 2. ముందు.

**ముందాడి** చూ. ముందు.

**ముందిడుకొను** చూ. ముందు.

**ముందు** వి. ౙౌ. 1. పూర్వకాలం. భార. విరా. 3.62; 2. ముంగల, సమ్ముఖం. భార. విరా. 4.7; 3. పురోభాగం. భార. ద్రోణ. 4.94; 4. ఆగామికాలం, భవిష్యత్కాలం. భాగ. 10ఉ. 481; 5. ఉదర్కం, ఉత్తరకాలఫలం. నీతి. 43.

క. మున్దు. అగ్రభాగం; త. మున్తు. ప్రారంభం, ప్రాచీనత, ప్రాధాన్యం.

**ముందట** అవ్య. ద్రు. ఎదుట. **ముందటిపంది** వి. ఆదివరాహం. అచ్చ. బా. 3.45. **ముందటిపీట** వి. అసుల్లో మొదటిపీట. **ముందటే(డు** వి. కడచిన సంవత్సరానికి ముందు సంవత్సరం. పరారి. వేమ. 1.169. <ముందు + -ఇ³- +. ఏ(డు. **ముందడుగువేయు** అ. క్రి. ఉవ్విళ్ళూరు. ధర్మజ. 25.2. <ముందు + అడుగు¹ + వేయు. **ముందాడి** రూ. ముందోడి. వి. మొదలు. **ముందిడుకొను** స.క్రి. పురస్కరించు. <ముందు + ఇడుకొను. **ముందుకలుపు** రూ. ముందుగల్పు. వి. తొలికలుపు, నారుమడిలో తీసేకలుపు, మొక్క నాటుకొన్న తరవాత తీసే మొదటికలుపు. **ముందుకువచ్చు** అ.క్రి. 1. అభివృద్ధికి వచ్చు; 2. అన్నపానాదులకు వీలుకలుగు; 3. గర్భిణియగు. **ముందుకొను** అ.క్రి. 1. వ్యాపించు. ఉ.రా. 8.168; 2. ముందగు. **ముందుకొయ్య** వి. తలపీటకు ఉండేకొయ్య. **ముందుగల్పు (కల్పు)** రూ.చూ. ముందుకలుపు. వి. మలికలుపు, పైరు పొట్ట కరుక్క వచ్చినప్పుడు తీసేకలుపు. **ముందుచివ్వ** రూ. ముందుసివ. వి. మగ్గం దండెదగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ. **ముందుచూపు** వి. దూరదృష్టి. **ముందుపడు** అ.క్రి. ముందగు, మునుకొను. **ముందుబల్ల** వి. అసుపీటల్లో మొదటిపీట. **ముందువెనుకలు** వి.బ.వ. ముందూ వెనుకాభాగాలు. **ముందుసివ** రూ.చూ. ముందుచివ్వ. వి. మగ్గం దండెదగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ. **ముందేరు** వి. దున్నుతున్న నాగళ్ళ వరుసలో మొదటిమడక. <ముందు + ఏరు¹. **ముందోడి** రూ.చూ. ముందాడి. వి. మొదలు.

**ముందేరు** చూ. ముందు.

**ముందోడి** చూ. ముందు.

**మున్న** రూ.చూ. మన్నె. వి. సముద్రతీరంలో పెరిగి పచ్చని పూలుపూసే మొక్క (Crotalaria laburnifolia).

**మున్నటియట్ల** చూ. మున్ను.

**మున్నడి** చూ. మున్ను.
**మున్నమర్చు** చూ. మున్ను.
**మున్నరక** చూ. మున్ను.
**మున్నరిక** చూ. మున్ను.
**మున్నాటికాకర** వి. లేత ఎరుపురంగు కలప కలిగి కొండల్లో పెరిగే చెట్టు (Melia composita).
**మున్నాడి** చూ. మున్ను.
**మున్నాడు** చూ. మున్ను.
**మున్నిటిజన్మము** చూ. మున్ను.
**మున్నటివెనకలు** చూ. మున్ను.
**మున్నిడు** చూ. మున్ను.
**మున్నీటికన్నె** చూ. మున్నీరు.
**మున్నీటిగరిత** చూ. మున్నీరు.
**మున్నీటిగౌరు** చూ. మున్నీరు.
**మున్నీటిచూలి** చూ. మున్నీరు.
**మున్నీటినడిమివా(డు** చూ. మున్నీరు.
**మునీటిపట్టి** చూ. మున్నీరు.
**మున్నీటిమొలనూలిమగువ** చూ. మున్నీరు.
**మున్నీటిమొలనూలిమగువచూలి** చూ. మున్నీరు.
**మున్నీటియగ్గి** చూ. మున్నీరు,
**మున్నీటిరాచూలి** చూ. మున్నీరు.
**మున్నీటిరాణి** చూ. మున్నీరు.
**మున్నీరు** వి. ౙా. అనా. మొదటినీరు, సముద్రం. భార. అరణ్య. 3.46.

క. మున్నీర్. సముద్రం; త. మున్నీర్. సముద్రం, భూమియొక్క సృష్టి, రక్షణలయం లక్షణాలుగా గలది, నది, వర్షం, ఊట అనే మూడు రకాల నీరు.

< మూ.ద.ద్రా. *మున్నీర్.

**మున్నీటికన్నె** వి. లక్ష్మి. రాజవా. 1.4. < మున్నీరు + ఇ$^{3}$- + కన్నె. **మున్నీటిగరిత** వి. సముద్రుని ఇల్లాలు, గంగ. ఉ.హరి. 2.144. < మున్నీరు + -ఇ$^{3}$- + గరిత. **మున్నీటిగౌరు** వి. ఐరావతం. < మున్నీరు + -ఇ$^{3}$- + గౌరు. **మున్నీటిచూలి** వి. 1. క్షీరసాగరకన్య; 2. కడలికొడుకు, చంద్రుడు. < మున్నీరు + -ఇ$^{3}$- + చూలు + -ఇ$^{9}$. **మున్నీటినడిమివా(డు** విణ. 1. విష్ణువు; 2. సముద్రంమధ్యలో ఉన్న వాడు. < మున్నీరు + -ఇ$^{3}$- + నడిమి + వా(డు. **మున్నీటిపట్టి** వి. 1. సాగరకన్యక, లక్ష్మి; 2. సాగర పుత్రుడు, చంద్రుడు. సాంబ. దేవ. 10. < మున్నీరు + -ఇ$^{3}$- + పట్టి. **మున్నీటిమొలనూలిమగువ** సముద్రరశన, భూకాంత. < మున్నీరు + -ఇ$^{3}$ + మొలనూలు + -ఇ$^{3}$- + మగువ. **మున్నీటిమొలనూలిమగువచూలి**(-చూలు + ఇ$^{8}$) వి. భూపుత్రి, సీత. ఉ. రా. 6.19. **మున్నీటియగ్గి** వి. బడబానలం. < మున్నీరు + - ఇ$^{3}$ - + అగ్గి. **మున్నీటిరాచూలి** వి. 1. చంద్రుడు. ఆం.భా. 1.37; 2. క్షీరసాగరకన్య, లక్ష్మి. < మున్నీరు + -ఇ$^{3}$- + రా(చ) + చూలు + -ఇ$^{9}$. **మున్నీటిరాణి** వి. సముద్రకాంత, గంగ. యయా. 2.47. < మున్నీరు + -ఇ$^{3}$- + రాణి.

**మున్ను** రూ. మున్, ముని, మును. వి. ౙా. 1. ముందు, పూర్వం. భార.ఆది. 2.8; 2. తొలి, మొదలు. భార.విరా. 4.248; 3. పూర్వజన్మం. భార.భీష్మ. 1.197; విణ. 1. ముందువాడు, అగ్రేసరుడు, ముందున్నది. భార.భీష్మ. 1.134; 2. తొలుతటిది, తొలిజన్మంలోనిది. ప్రబోధ. 4.27.

క. మున్. ముందున్నది, ఎదుటఉన్నది, ముంచ. ముందున్న వ్యక్తి, నాయకుడు, మున్న, మున్నమ్, మున్నల్. ముందు; కొడ. మిన్న. ఎదుట; తు. ముండన. ముందు, మొదటిది; త. మున్. ముందు, పూర్వం. మున్నె. ముందు, ఎదురు, ముత్తై. ముందు, ఎదురు, ముంతి. పూర్వం, మున్ను; మ. మున్, మున్నమ్. మొట్టమొదటి, ముందు, ముంపిల్. ముందు. ఎదురు; కో. మున్-, ము-. ముందు; తొ. ముద్క్. ముందు, ఎదురు, వచ్చే ఏడాది; గోం. మున్నె. పూర్వం, ముందు; పర్జి. మునవంద. ముందువేలు, మున్ని. పూర్వం, ముందు; కొలా. ముత్. పూర్వం, మునుపు, ముత్తసల్. వచ్చే ఏడాది; నా. ముంద్. పూర్వం; గ. ముందేల్. ముందు; కురు. ముంధ, ముంద్. మొదటి, పూర్వం, మునుపు; మాల్తొ. ముంది. పూర్వం, మునుపు; బ్రా. మొన్. ముందు భాగం, ఎదుట; పో. చూ. త. ముతల్.

< మూ.ద్రా. *మున్.

**మున్నటియట్ల** అవ్య. ఎప్పటిలాగ. < మున్ను + -ఇ$^{3}$- + అట్లు + -అ$^{6}$. **మున్నడి** క్రి.విణ. ముందుగా. రం.రా. అయోధ్యా. 129 పు. 16 పం.; విణ. అగ్రేసరుడు. కృ. శకు. 3.56; త. అటి. అడుగు. < మున్ను + త. అటి. **మున్నమర్చు** అ.క్రి. ముందుపెట్టు, అడుగువెట్టు, అందరి ముందూ దూషించు. పండి.చ. 3.214 పు. < మున్ను + అమర్చు. **మున్నరక** వి. 1. ధైర్యం. కకుత్థ్స. 4.71; 2. కష్టస్థితి. విజయ 3.143; 3. తొలిదుక్కి. ఆం.భా. 2.233. < మున్ను + అరక. **మున్నరిక** వి. ప్రస్తావన (ముందు మాట). నీలా. 2.101. **మున్నాడి** క్రి.విణ. ముందుగా. భార.అశ్వ. 2.152. కావ్యా. చూ. 3.41. త. మున్నాడి. **మున్నాడు** అ.క్రి. ముందుపోవు. హర. 9.41. < మున్ను + ఆడు. **మున్నిటిజన్మము** వి. పూర్వజన్మం. తాళ్ల. సం. 5.236. సం. జన్మన్. పుట్టుక. < మున్ను + -ఇ$^{3}$ + సం. జన్మన్ + -ము. **మున్నిటివెనకలు** వి.బ.వ. పూర్వాపరాలు. తాళ్ల.సం. 17.368. < మున్ను + -ఇ$^{3}$- + వెనక + -లు. **మున్నిడు** అ.క్రి. లోగొను. స.క్రి. వశపరచు. < మున్ను + ఇడు. **మున్నుపు** వి. పూర్వం. పరమ. 2.1133. **మున్నెరిక** రూ. చూ. మున్నెటిక. వి. వలకాక, విరహతాపం. **మున్నెటిక** రూ. మున్నెరిక. వి. పూర్వానురాగం, పూర్వానురాగంవలన కలిగిన సంతానం. రసిక. 3.87. నీలా. 2.101. < మున్ను + ఎటుక. **మున్నెటికము** వి. గడుసుదనం. < మున్ను + ఎటుక. **మున్నే(డు** రూ. చూ. మునియే(డు. వి. నిరుటికి తొలియేడు. < మున్ను + ఏ(డు. **మున్నొరగు** వి. ఒరుగు దిండు. పాండు. 3.160. < మున్ను + ఒరగు.

**మున్నూర్వురు** చూ. మూ-.

మున్నాఋ చూ. మూ-.
మున్నాలు చూ. మూ-.
మున్నెరిక చూ. మున్ను.
మున్నెఱిక చూ. మున్ను.
మున్నెఱికము చూ. మున్ను.
మున్నే(డు చూ. మున్ను.
మున్నొరగు చూ. మున్ను.
మున్ను రూ. మునుపు[2]. విశ. 1. తొల్లటిది, పూర్వపుది, పండి. చ. 2.169 పు. ; 2. దట్టమైంది, సాంద్రమైంది. వి. 1. పూర్వం, ముందు ; 2. మొదలు, ప్రారంభం.
త. మున్ను.
మున్మిడు చూ. మున్మ.
మున్మ రూ.చూ. మునుము. వి. 1. తరచుదనం. విష్ణువు. పూ. 3 ; 2. ఎదురు ; 3. పురోభాగం, ఎదుటిచోటు ; 4. సేనాముఖం ; 5. వస్తుసమూహం ; 6. వార్ధక్యం, ముదిమి ; 7. కోసేపైరుకు ముందున్న పైరు ; విశ. తరచు, అధికం.
మున్మిడు రూ. మునుమిడి. అ.క్రి. వరసపెట్టు. కు.సం. 1.94 ; స.క్రి. ఎదిరించు, మార్కొను. < మున్మ + ఇడు.
మున్షి రూ.చూ. మునిషీ. వి. 1. లేఖకుడు ; 2. భాష నేర్పే ఉపాధ్యాయుడు.
మున్షీ రూ.చూ. మునిషీ. వి. 1. లేఖకుడు ; 2. భాష నేర్పే ఉపాధ్యాయుడు.
మున్స రూ.చూ. మునస. వి. సిడెకు గడకట్టేవైపునున్న భాగం, సిడె ముందుభాగం.
మున్సిపు రూ.చూ. మునసబు. వి. 1. గ్రామాధికారి, అధ్యక్షుడు ; 2. న్యాయాధికారి.
మున్సఫు రూ. చూ. మునసబు. వి. గ్రామ న్యాయాధికారి, గ్రామమునసబు.
మున్సిఫు రూ. చూ. మునసబు వి. గ్రామ న్యాయాధికారి, గ్రామమునసబు.
మున్సీబు రూ. చూ. మునసబు. వి. గ్రామ న్యాయాధిపతి గ్రామమునసబు.
ముఫ్తి వి. న్యాయాధికారి.
హిం. ఉ. అర. ముఫ్తీ. న్యాయం చెప్పేవాడు, టర్కీ తెగలలో ప్రధాన న్యాయాధికారి.
త. ముఫ్తి, మూఫ్తి.
< ఉ. ముఫ్తీ.
ముప్పక్కజెముడు చూ. మూ-.
ముప్పటిలు రూ. ముప్పటిల్లు. అ.క్రి. కాగి కొంచెం చల్లారు, కవోష్ణమగు. సిం.ద్వా. 3.42.
ముప్పటిల్లు రూ. చూ. ముప్పటిలు. అ. క్రి. కాగి కొంచెం చల్లారు, కవోష్ణమగు.
ముప్పట్టికమ్మి చూ. మూ-.
ముప్పం(డు చూ. మూ-.
ముప్పదార్గురు చూ. మూ-.
ముప్పదాఋ చూ. మూ-.
ముప్పదాఋగురు చూ. మూ-.
ముప్పది చూ. మూ-.
ముప్పదితిప్పలుపెట్టు చూ. మూ-.
ముప్పదిపాట చూ. మూ-.
ముప్పదియాఋగురు చూ. మూ-.
ముప్పదియాఱేండ్లది చూ. మూ-.
ముప్పదిరెంటిగుంపు చూ. మూ .
ముప్పదిరెండాయుధములు చూ. మూ-.
ముప్పదిరెండువేళలు చూ. మూ-.
ముప్పదివాట చూ. మూ-.
ముప్పందుము చూ. మూ-.
ముప్పన్నం చూ. మూ-.
ముప్పయి చూ. మూ-.
ముప్పరువునేల చూ. మూ-.
ముప్పర్జు వి. చితా ఆవర్జాలు లేని వరస పద్దుల పొత్తం.
హిం.ఉ. ఫర్జ్. పద్దు.
ముప్పర్వునేల చూ. మూ-.
ముప్పాతిక చూ. మూ-.
ముప్పావు చూ. మూ-.
ముప్పావులా చూ. మూ-.
ముప్పి రూ.చూ. ముప్పు. వి. 1. ఆపద ; 2. ముదిమి ; 3. మోసం ; 4. దురదృష్టం.
ముప్పిడి[1] చూ. మూ-.
ముప్పిడి[2] చూ. ముంపు. వి. నీటివరద.
ముప్పిర చూ. మూ-.
ముప్పిరి చూ. మూ-.
ముప్పిరిగొను చూ. మూ-.
ముప్పిరిగొల్పు చూ. మూ-.
ముప్పిరిచేప చూ. మూ-.
ముప్పిరివడు చూ. మూ-.
ముప్పిరివడ్డి చూ. మూ-.
ముప్పు రూ. ముప్పి, మొప్పు. వి. 1. హాని, చేటు, ఆపద. భార.విరా. 1.125 ; 2. ముదిమి, వార్ధక్యం. హరి.పూ. 7.42 ; 3. దురదృష్టం ; 4. మోసం.
తు. ముప్పు. ముదిమి అయిన, వార్ధక్యం, దురదృష్టం, నాశం ; త. మూ(-ప్పు-, -త్తు-). ముదుసలి అగు, ముదిమి ; మ. మూప్పు. వార్ధక్యం, జ్యేష్ఠత.
ముప్పుకోడె వి. ప్రాయంలో ఉన్న కోడె. ముప్పుతిప్పలు పెట్టు అ.క్రి. నానా కష్టాలు పెట్టు. ముప్పునకగు స.క్రి. కష్టకాలంలో పనికివచ్చు. రామాభ్యు. 7.119. ముప్పున కందు స.క్రి. కష్టకాలంలో పనికివచ్చు. ముప్పుమూడు అ.క్రి. కీడుకలుగు.
ముప్పురి చూ. మూ-.
ముప్పురిఅతుకు చూ. మూ-.
ముప్పురిగొను చూ. మూ-.
ముప్పురిగొల్పు చూ. మూ-.
ముప్పురిజొన్న చూ. మూ-.
ముప్పురిదారం చూ. మూ-.

ముప్వరిసద్ద చూ. మూ-.

ముప్వరుటాలు చూ. మూ-.

ముప్పూట చూ. మూ-.

ముప్పె చూ. ముప్పు. వి. 1. వ్యాధుడు, బోయ ; 2. కోయ వాడు.

ముప్పెట్టు చూ. మూ-.

ముప్పెట్టువెట్టు చూ. మూ-.

ముప్పేటకమ్మి చూ. మూ-.

ముప్పేటపేరు చూ. మూ-.

ముప్పే(ట[1] చూ. మూ-.

ముప్పే(ట[2] చూ. మూ-.

ముప్పే(టలా(డు చూ. మూ-.

ముప్పై చూ. మూ-.

ముప్పొం చూ. మూ-.

ముప్పొంగు చూ. మూ-.

ముప్పొత్తులు చూ. మూ-.

ముప్పొద్దులు చూ. మూ-.

ముప్పొకల(బోవు చూ. మూ-.

ముప్పొకలా(డు చూ. మూ-.

ముప్పొకలు చూ. మూ-.

ముప్పొగు చూ. మూ-.

ము(ప్పొద్దు చూ. మూ-.

ము(ప్పొల్లు చూ. మూ-.

ముఫసల్ రూ. మఫున, మొఫసల్. విణ. (ప్రత్యేకమైన. వి, పల్లెటూరు.

హిం. ముఫస్సల్. వివరమైన, పట్టణంలో ఒకపేట ; ఉ.అర. ముఫస్సల్. (ప్రత్యేకమైన, నిండా, తగిన వివరమైన, వేరుగా, (ప్రత్యేకంగా, సంపూర్తిగా, విస్తారంగా ;

త. మొపసిల్.

< ఉ. ముఫస్సల్.

ముఫ్త రూ. ముఫ్ఫత్. అవ్య. (శమలేక, తేరగా.

హిం. ముఫ్త్. వ్యర్థం, నష్టం, (శమింపకయే ; ఉ. ముఫ్త్. ఖర్చు లేక వ్యర్థం, నిరుపయోగం, నష్టం ; పార. ముఫ్త్-. తేరగా, (శమలేక.

< ఉ. ముఫ్త్.

ముఫ్ఫత్ రూ.చూ. ముఫ్త-. అవ్య, తేరగా.

ముబాదల రూ.చూ. ముబాదలా. వి. నిర్ణయించిన కూలికంటె నేతపని వాడికి చెట్టి అదనంగా ఇచ్చిన రొక్కం.

ముబాదలా రూ. ముబాదల. వి. 1. మార్పు ; 2. నిర్ణయించిన కూలికంటె నేతపనివాడికి చెట్టి అదనంగా ఇచ్చిన రొక్కం.

హిం.ఉ.పార. ముబాద్‌లా. మార్పు, ఇచ్చి పుచ్చుకోవటం ; అర. ముబాదలత్.

< ఉ. ముబాద్‌లా.

ముబ్బడి చూ. మూ-.

ముబ్బడించు చూ. మూ-.

ముబ్బాగమంచు చూ. మూ-.

ముబ్బాములు చూ. మూ-.

ముబ్బానవాల్గీము చూ. మూ-.

ముబ్బె వి. పక్కపిరుదు.

ముబ్బేడ చూ. మూ-.

ముభావము విణ. తెలియని : వి. అయిష్టాన్ని తెలియచేస్తూ మాట్లాడకుండా ఉండటం.

సం. ముఖ-. ముఖం, భావ-. అభి(ప్రాయం ; హిం. ముఁహ్.

< హిం. ముఁహ్ + సం. భావ- + -ము.

ముభావముగానుండు అ.(కి. మాట్లాడకుండా ఉండు.

ముంపించు చూ. ముంచు[1].

ముంపిరి చూ. ముంచు[1].

ముంపు చూ. ముంచు[1].

ముంపుగొను చూ. ముంచు[1].

ముమ్మడి చూ. మూ-.

ముమ్మడిగొను చూ. మూ-.

ముమ్మడించు చూ. మూ-.

ముమ్మడినలుమడివాసి చూ. మూ-.

ముమ్మడుగు చూ. మూ-.

ముమ్మనుమ(డు రూ.చూ. మునిమనుమ(డు. వి. మనుమని కొడుకు.

ముమ్మరమగు చూ. ముమ్మరము.

ముమ్మరము విణ. అధికం, మిక్కుటం, తీ(వం. భాగ. 10 పూ. 1214 ; వి. సాం(ద్రత, చిక్కన, తరచు. యయా. 4.13.

త. ముమ్మరమ్. తీ(వత, ఉ(ద్రికత.

ముమ్మరమగు అ.(కి. 1. దట్టమగు ; 2. హెచ్చగు. < ముమ్మరము + అగు. ముమ్మరముగా (కి. విణ. (ప్ర. మిక్కిలి అతిశయంగా, ఉ(గ్రంగా. ముమ్మరించు అ.(కి. అతిశయించు. తపతి. 3.24. < ముమ్మరము + -ఇంచు[3].

ముమ్మరించు చూ. ముమ్మరము.

ముమ్మలు చూ. మూ-.

ముమ్మా(డు చూ. మూ-.

ముమ్మాయి వి. కంకిపొట్టు వదలని జొన్నగింజలు.

ముమ్మారు చూ. మూ-.

ముమ్మాలు చూ. మూ-.

ముమ్మాటె అవ్య. ఆశ్చర్య (ప్రశంసాదుల్ని తెలిపే పదం. శశా. 5.29.

ముమ్మానములు చూ. మూ-.

ముమ్మూడు చూ. మూ-.

ముమ్మూల చూ. మూ-.

ముమ్మూలటా చూ. మూ-.

ముమ్మొంగి వి. ద్వీపవిశేషం, ఒకానొక దీవి. శుక. 3.8.

ముమ్మొన చూ. మూ-.

ముమ్మొనకత్తి చూ. మూ-.

ముమ్మొనకత్తిజోదు చూ. మూ-.

ముమ్మొనకైదువు చూ. మూ-.

ముమ్మొనయడిదంపుసామి చూ. మూ-.

ముమ్మొనయలు(గుమేటి చూ. మూ-.

ముమ్మొనవాలు చూ. మూ-.

ముమ్మొనవాలుదంట చూ.మూ-.
ముమ్మొనవాలుదాలుపు చూ.మూ-.
ముమ్మొనవాలుదాల్పు చూ.మూ-.
ముమ్మొనవాల్దంట చూ. మూ-.
ముమ్మోటు చూ.మూ-.
ముయి చూ. మూయు. ని. మూత. తాళ్ల.సం. 14.270.
ముయిసేద్యం రూ.చూ. మొగుసేద్యం. వి. ఉమ్మడిసేద్యం, చిన్నరైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం.
ముయ్యగ్గి చూ. మూ-
ముయ్యంచు చూ. మూ-.
ముయ్యంచుతుంగ చూ. మూ-.
ముయ్యడ చూ. మూ-.
ముయ్యనికుట్టు చూ. మూ-.
ముయ్యందము చూ. మూ-.
ముయ్యబట్టు చూ. ముయ్యు.
ముయ్యలి చూ. మూ-.
ముయ్యలికుట్టు చూ. మూ-.
ముయ్యలు చూ. ముయ్యి. వి.బ.వ. 1. బంధువులు మిత్రులు వివాహాది శుభకార్యాల్లో కొంతపైకం కొన్నివస్తువులు కట్న రూపంగ చదివించినవి ; 2. బహుమతులు.
ముయ్యాకుపొన్న చూ. మూ-.
ముయ్యాకు(బొన్న చూ. మూ-.
ముయ్యాఱు చూ. మూ-.
ముయ్యి వి. 1. చదివింపు, వధూవరులకు వివాహ సమయంలో బంధు మిత్రులు ఇచ్చే బహుమతులు, కానుకలు మొ.వి ; 2. పొత్తుల సేద్యం.
ముయ్యికిముయ్యి వి. బదులుకు బదులు.
ముయ్యాడు చూ. మూ-.
ముయ్యు రూ.చూ. మూయు. స.క్రి. కప్పు. తాళ్ల.సం. 12.327.
ముయ్యబట్టు స.క్రి. సలపతో వాట అడుగు భాగాన్ని మూయగొట్టు.
ముయ్యారు చూ. మూ-.
ముయ్యెర[1] చూ. మూ-.
ముయ్యెర[2] వి. 1. ఊదర ; 2. బహుమతి.
ముయ్యరపెట్టు(-పెట్టు) అ.క్రి. 1. ఎలుకలు పందికొక్కులను పొగపెట్టి చంపు ; 2. చీకటిలోఉంచు.
ముయ్యెలగుట్ట చూ.మూ-.
ముయ్యేడు చూ.మూ-.
ముయ్యేరు చూ.మూ-.
ముయ్యేఱు చూ.మూ-.
మురక వి. 1. సగం, సంకటి ముద్దలో సగం, రొట్టెలో సగం ; 2. చక్కలాల ముక్కలు, పొలుకు ; 3. నేల, పొలం.
మురకటము వి. విముఖతతో ముఖం పక్కకి తిప్పుకోవటం.
మురకటించు రూ.చూ. ముఱకటించు. స.క్రి. తిప్పు ; అ.క్రి. (నడిచేటప్పుడు) చలించు, కదలు, ఊగాడు.
మురకటించు చూ. మురకటము.
మురకము చూ. ముర్వు[2]. వి. 1. నిక్కు, ఉద్ధతి ; 2. నేల, పొలం ; 3. సగం.

మురగబెట్టు చూ. మురుగు[2].
మురగేయు చూ. మురుగు[2].
మురటి వి. తోక. ఆం. పదా. 5.7.
మురడించు అ.క్రి. అతిశయించు, పెంపెక్కు. నవనాథ. 1.52 పు. 20 పం.
మురదంగికుండ రూ.చూ. మృదంగంకుండ.వి. మద్దెలకు వాడే కుండ.
మురదండమేఘం వి. సూర్యుడు కనబడకుండా ఆవరించినమబ్బు.
మురదారుసింగు వి. కంకుష్ఠం, వృక్షవిశేషం.
హిం. ముర్‌దర్. శ్రీకృష్ణుడు.
మురబ్బ రూ. మురబ్బా, మురబ్బీ. వి. 1. పెంకితనం ; 2. అల్లంమురబ్బా అనే లేహ్యం ; 3. ఊరగాయ.
హిం. మురబ్బా. కిచ్చిలి పళ్ళతో చేసిన ఒకవిధమైన మిఠాయి; ఉ.అర. మురబ్బా. నిలవఉంచబడింది, మిఠాయి.
త. మురప్పా.
<ఉ. మురబ్బా.
మురబ్బా రూ.చూ. మురబ్బ. వి. 1. పెంకితనం ; 2. అల్లం మురబ్బా అనే లేహ్యం, పళ్ళు మొ. వాటిల్లో చక్కెర మొ. వాటిని వేసి చెడకుండా తయారుచేసిన పదార్థం.
మురబ్బీ రూ.చూ. మురబ్బ. వి. 1. పెంకితనం; 2. అల్లం మురబ్బా అనే లేహ్యం ; 3. పొగరుమోతుతనం.
మురము వి. అందుగు, చిల్ల, వృక్షవిశేషం.
సం. మురా. గంధద్రవ్య విశేషం.
మురముర వి. 1. మూలగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. భాస్క.రా.యు. 1449 ; 2. మెరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. సమీర. 6.169 ; 3. అణగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.
మురమురమను(-అను) స.క్రి. కోపవికారం చూపు.
మురమురలాడు స.క్రి. కోపవికారాన్ని చూపు. <మురముర +-లు+ఆడు.
మురమురాలు వి.బ.వ. వేచిన ఉప్పుడుబియ్యం.
మురళించు రూ. మురాళించు. స.క్రి. 1. తిరస్కరించు. గౌ.హరి.పూ. 666 పం ; 2. (బట్టలు) నీరు పోయేటట్లు పిడుచు. శ్రీరం.మా. 10.32 ; 3. అదుము, నొక్కు. ప్రబంధ. 78.
మురాటి చూ. మరాటి. వి. ఉదజ హరితామ్లం (Hydrocloric acid).
మురాదొల్ల వి. సువాసనగల ఒకరకం ధాన్యవిశేషం.
మురామాంసి వి. సుగంధద్రవ్య విశేషం.
మురాయించు రూ. మొరాయించు, మోరాయించు. అ.క్రి. అతిశయించు. హర. 4.89.
త. ముఱు. దుఃఖం.
మురాయింపు రూ. మొరాయింపు. వి. బుకాయింపు, మొరాయింపు.
మురాయింపు చూ. మురాయించు.
మురాళము వి. దిగదుడుపు, మురాళించటం.
మురాళించు రూ.చూ. మురళించు. స.క్రి. దిగదుడుచు.
మురాళింత వి. దిగదుడుపు. మురాళింపు వి. దిగదుడుపు.

**మురాళించు** చూ. మురాళము.

**మురాళింత** చూ. మురాళము.

**మురాళింపు** చూ. మురాళము.

**మురి**[1] రూ.చూ. ముఱి. వి. **1.** కండకావరం, గర్వం. అచ్చ.రా.కిష్కిం. 32 ; **2.** నడకలోని కులుకు.

**మురికా(డు** వి. గర్విష్ఠి. నిర్వ.రా. 6.127.

**మురి**[2] రూ.చూ. మురియ. వి. **1.** చిన్న ముక్క, గుడ్డలో నగం ; **2.** పత్తి రాట్నం నిలువుల మధ్య రూళ్ళక(ర మాదిరిగా ఉండే కట్టె.

**మురికొను** స.(క్రి. ఖండించు. ఉ.రా. 6.10. **మురిబొంత** వి. **1.** ఒకరకం చేప ; **2.** మొసలి. త. ముఠి. పొట్టిచేప. **మురిమురి** (క్రి.విశ. కొంచెం, చాలా కొంచెం. **మురిమురి చీ(కటి** వి. కొంచెం చీకటి, చీజీకటి. **మురిమొండెము** వి. చిన్న మొండెం.

**మురి**[3] రూ.చూ. పురి. వి. తాడు పేనటంలో తప్పే మెలిక.

**మురికి** రూ. చూ. ముఱికి. వి. మాలిన్యం ; విశ. మలినమైన.

**మురికిచవుడు** వి. పీతిచవుడు, పసుపురంగులో ఉండే ఒకరకం చవిటినేల. **మురికితుమ్మ** రూ. ముర్కి-తుమ్మ. వి. ముళ్ళు కలిగిన ఒకరకం సుగంధ (ద్రవ్యాన్నిచ్చే సువాసన గల పూలు పూసే ముళ్ళుగల చెట్టు. **మురికితెవులు** వి. జొన్న, చెరుకు మొ. పైర్ల కణుపుల దగ్గర మొక్క విరిగి పైరు కూలబడిపోయే తెగులు. **మురికిదుంప** వి. కనుపతీగ (Stemona minor). **మురికిదొమ్మ** వి. నోటి వెంబడి చొంగ కారే దొమ్మ. **మురికిమల్లె** రూ. మురిమల్లె. వి. లేత పసుపురంగు గల మెత్తని కలప నిచ్చే చెట్టు (Olax scandens). **మురిక్కాలవ** రూ.చూ. ముఱికికాలువ. వి. **1.** మురుగునీళ్ళు పోయే దారి ; **2.** పంటచేల నుంచి నీరు పోయే కాలవ.

**మురిక్కాలవ** చూ. మురికి.

**మురించు** రూ.చూ. మురియించు. స.(క్రి. తిప్పు. వేంక.పంచ. 3.153.

**మురిడీగొలుసు** వి. హస్తభూషా విశేషం, ముంజేతికి ధరించే బంగారు మెలిక గొలుసు. రసిక. 1.75.

**మురిపము** చూ. మురియు[1].

**మురిపి** విశ. వక్రమైంది. కు.సం. 6.37.

త. మురిప్పు. పగలటం.

**మురిపించు** చూ. మురియు[1].

**మురిపెము** చూ. మురియు[1].

**మురిమల్లె** రూ.చూ. మురికిమల్లె. వి. లేత పసుపురంగు గల మెత్తని కలప నిచ్చే చెట్టు.

**మురియ** చూ. మురియు[2].

**మురియ(బడు** చూ. మురియు[1].

**మురియించు** చూ. మురియు[1].

**మురియు**[1] రూ. ముఱియు[1]. అ.(క్రి. **1.** ఒప్పు, (ప్రకాశించు. కు.సం. 11.131 ; **2.** గర్వించు. బసవ. 7.698 పం. ; **3.** నడిచేటప్పుడు కులుకు, కులుకు. భార.కర్ణ. 2.66 ; **4.** తిరుగుడుపడు, తిరుగు. శృం.నై. 2.99 ; **5.** సంతోషించు, సంతోషంతో ఉప్పొంగు.

క. ముఱుకు, మురుక్క, ముకుక్క. గర్వం, అతిశయం ; కొడ. మురి. అగౌరవపరచు ; తు. ముర్తాప, ముర్తాయ. గర్వం, అతిశయం, పొగరు, మూర్ఖత్వం ; త. మురుక్కు (మురుక్క-). గర్వించు, అంగీకరించకపోవు, కోపించు, మురిప్పు. గర్వం, కర్కశత్వం, ముఱుక్కు, ముఱుకు. గర్వించు ; మ. మురుకుక. బిరుసెక్కు, గట్టిపడు ; కో. మురుకక. తిరస్కరించు ; తొ. ముఱ్. కోపించు, దుఃఖించు.

**మురిపము** రూ. మురిపెము, మురుపు[1]. వి. **1.** విలాసం, చక్కదనం, సౌందర్యం. కు. సం. 8.101 ; హరి. 1.57 ; **2.** నడకలోని కులుకు. శృం.నై. 2.56 ; **3.** శృంగార గర్వం. భాగ. 10 పూ. 1171 ; **4.** సంతోషం. చంద్రభా. 2.79 ; **5.** గర్వం. విశ. **1.** విలాసంగలది, చక్కదనంగలది. వి(క. 6.44 ; **2.** కులుకుగలది. మను. 6.30. **మురిపించు** స.(క్రి. **1.** ఆశపెట్టు ; **2.** తిప్పు. < మురియు[1] + -ఇంచు[1]. **మురిపెము** రూ.చూ. మురిపము. వి. **1.** నడకలోని కులుకు. శృం.నై. 2.56 ; **2.** సంతోషం. పల్నా.పు. 47 ; **3.** చక్కదనం. పల్నా.పు. 72 ; **4** శృంగారగర్వం. శ్రీ.శృం. 23 ; **5.** విలాసం ; **6.** గర్వం ; విశ. **1.** కులుకుగలది ; **2.** విలాసంకలది, చక్కదనం కలది. **మురియ(బడు** అ.(క్రి. అతిశయించు. నార.పంచ. 1.174. < మురియు[1] + -అ[7] + పడు. **మురియించు** రూ. మురించు. స.(క్రి. **1.** మురియచేయు, తిప్పు. భార.సౌప్తి. 1.16 ; **2.** మురియచేయు, సంతోషపర్చు. కృ.శకు. 3.113. క. మురి. మెలితిప్పు, మురిపు. తిప్పు, మురుచు. తిప్పు, మెలితిప్పు, మోరుక్క. అహంభావం, తలతిరుగుడు. < మురియు[1] + -ఇంచు[3]. **మురిసిపడు** అ.(క్రి. **1.** విచ్చిపోవు. హర. 3.92 ; **2.** సంతోషపడు. < మురియు[1] + -ఇ[13] + పడు.

**మురియు**[2] రూ. ముఱియు[2]. అ.(క్రి. **1.** తెగు, ఖండితమగు, కు.సం. 11.131 ; **2.** భగ్నమగు, విరుగు. భార.కర్ణ. 1.162 ; **3.** తెగు. హరి.ఉ. 2.60 ; **4.** ఊడు, సడలు. పి.శకు. 3.176 ; **5.** పాకంచెడు.

క. మురి. విరుచు, బద్దలుచేయు, ముఱి. బద్దలగు ; కొడ. మురి, ముర్య్-, ముర్ప్. ఖండించు ; తు. మురి. కోత, నరుకు, మురిని. (కాయగూరలవలె) కోయు, తరుగు, మూరుని. తెగు ; త. మరవు. తెగు, ఖండితమగు, విరుగు, మురిప్పు. పగులు, విరుగు, మురియల్. ముక్క, మురివు. విరుచు, ఖండించు, తుంపు, మురి ; మ. ముఱిక్క, మూరుక. విరుచు, తెంచు, ఖండించు, ముక్కలుచేయు ; కో. మర్య్. ఖండించు ; తొ. మర్య్. ఖండించు ; కుఇ. ముడ్ప. క(ర కోయు ; కొలా. మర్క్. ముక్కలుచేయు ; నా. మర్. ఖండించు ; మాల్తొ. మర్క్. ముక్కలుచేయు, ఖండించు ;

పో.చూ. (ప్రా. మురియ. విరిగిన, నశించిన.

మూ.(ద్రా. *మూర్-, ముర్-వ్-మూత్. *ముత్-వ్-.

**మురియ** రూ. మురి[2], మురు, ముఱియ. వి. ఖండం. ముక్క. భార.స్త్రీ. 2.3. క.తు.త.మ. మురి. ముక్క, నగం,

నూక. మురిసిపోవు అ.క్రి. 1. ఛిన్నమగు, ముక్కలగు. హరి.ఉ. 9.214 ; 2. కులుకు ; 3. ముచ్చటపడు. <మురియు[2]+-ఇ[13]+పోవు.

**మురిసిపడు** చూ. మురియు[1].

**మురిసిపోవు** చూ. మురియు[2].

**మురీలు** చూ. మురి[2]. రూ. ముఱ్ఱెలు. వి.బ.వ. బొరుగులు, మురమరాలు, పేలాలు.

**మురు** రూ.చూ. మురియ. వి. తునక, ముక్క.

**మురుకు** రూ.చూ. ముర్వు[2]. వి. 1. మురుగు, బంగారు కడియం ; 2. చిన్నదిగా చేసిన గట్టి మణుబూవు.

**మురుకోక్కడు** చూ. మురుగు[2].

**మురుగడ** చూ. మురుగు[2].

**మురుగు[1]** రూ.చూ. ముర్వు[2]. వి. 1. బంగారు కడియం, ముంజేత ధరించే ఆభరణ విశేషం. అచ్చ.రా.బాల. 87, శ్రీరం.మా. 9.5 ; 2. అల్లిక నేసిన బంగారు కమ్మి ; 3. చెవి పోగు.

**మురుగు[2]** రూ.చూ. ముఱుగు. స.క్రి. కుళ్ళు ; వి. మురికి.

**మురగబెట్టు** స.క్రి. ఒరలు, తొట్లు మొ.వి చేయటానికి వాడే మట్టిలో పొట్టు కలిపి వారం రోజులు మగ్గపెట్టు. <మురుగు[2]+-అ[7]+పెట్టు. **మురగేయు** స.క్రి. ఒరలు, తొట్లు మొ.వి చేయటానికి వాడే మట్టిలో పొట్టు కలిపి వారం రోజులు మగ్గపెట్టు. < మురుగు[2] + వేయు. **మురుకోక్కడు** వి. మాగాణి నుంచి పోయే మురుగునీరు బయటనిల్చే ప్రదేశం. <మురుగు[2]+కోడు. **మురుగడ** వి. కుళ్ళు. **మురుగుడు** విణ. కుళ్ళిన, కంపెత్తిన. **మురుగుడుచేప** వి. ఒక రకం చేప. **మురుగుడుతీగె** వి. బండి మురుదుడు తీగ (Calycopten's floribunda). **మురుగుడుతెవులు** వి. ఉలవ, పెసర మొ. కాయపైర్ల తెగులు. **మురుత్రోవ** రూ.చూ. ముఱుత్రోవ. వి. దుర్గంధపు తోవ.

**మురుండము** వి. క్షుద్రజలజంతు విశేషం. హంస. 4.186.

క. మురుటు, మురుంటు. సంకోచించటం.

**మురుత్రోవ** చూ. మురుగు[2].

**మురుదారసింగి** వి. ఒకరకమైన గైరికాది ధాతువు.

హిం.ఉ. ముర్ దార్. చనిపోయిన, మృతమైన.

**మురుపు[1]** రూ.చూ. మురిపము. వి. 1. సంతోషాతిశయం ; 2. ఇష్టం.

**మురుపు[2]** రూ.చూ. మురువు[1]. వి. కాంతి, వెల్తురు.

**మురుమామిడి** వి. కొరివిచెట్టు, అడవుల్లో పెరిగే చెట్టు (Hemigyrosa canescens).

**మురుము** వి. అందుగు, నల్లకి.

**మురుమురాలు** వి.బ.వ. ధాన్యం ఉడకపెట్టి దంచి వేయించిన బియ్యం.

**మురువనడ** చూ. మురువు[1].

**మురువు[1]** రూ. మురుపు[2], ముర్వు[1]. వి. 1. గర్వం, సౌందర్య గర్వం. హరి.ఉ. 9.55 ; 2. సౌందర్యం, చక్కదనం. హర. 4.11 ; 3. విధం, రీతి. శివరా. 1.61 ; 4. శోభ, కాంతి. జైమినిభా. 1.136 ; 5. నాట్యగతివిశేషం. ప్రబంధ. 108 ; విణ. 1. అతిశయించినది. జైమినిభా. 8.213 ; 2. సుందరం, చక్కనిది. రసిక. 5.133.

క. మురువు. చుట్టూతిరుగు.

**మురువనడ** వి. ప్లుతగతివిశేషం.

**మురువు[2]** రూ.చూ. ముర్వు[2]. వి. 1. బంగారుకడియం, ముంజేతికి ధరించే ఆభరణవిశేషం. నీలా. 1.75 ; 2. కర్ణాభరణవిశేషం.

**ముర్కితుమ్మ** రూ.చూ. మురికితుమ్మ. వి. ముళ్ళు కలిగి ఒకరకం సుగంధద్రవ్యాన్నిచ్చే సువాసనగల పూలుపూసే ముళ్ళగల చెట్టు (Acacia Farnesiana).

**ముర్గు** రూ.చూ. ముర్వు[2]. వి. 1. ముంజేతినగ ; 2. అల్లిక వేసిన బంగారు కమ్మి.

**ముర్దగంకుండ** రూ.చూ. మృదంగంకుండ. వి. మృదంగానికి వాడే కుండ.

**ముర్ర** వి. తెరచాపకింద అంచు.

పో. అమూరా. తెరచాపల మూలకొసలను గట్టిగా కట్టిఉంచే తాడు ; స్పా. అమారా. ఓడదూలం. అమూరాదా. ఓడలోపలి అంచు, మూరో. గోడ, అలంగం. <పో. అమూరా.

**ముర్రు** రూ.చూ. ముఱ్ఱు[2]. వి. గింజలో ఏర్పడి గట్టిపడుతున్న పాలు.

**ముర్రుగాయ(-కాయ)** వి. 1. దోరకాయ, పండబారిన వేరుసెనగ, అలచంద, పెసర మొ. వాటి కాయ ; 2. పలుకులేని వడ్లగింజ. **ముర్రుగాలు(-కాలు[2])** వి. మోకాళ్ళవాపు. **ముర్రుబాలు(-పాలు)** రూ.చూ. ముఱ్ఱుపాలు. వి. 1. గేదె ఈనిన ఐదురోజులదాకా ఇచ్చే పాలు ; 2. ఈనకముందు పితికితే వచ్చే పాలు.

**ముర్వు[1]** రూ.చూ. మురువు[1]. వి. 1. గర్వం, సౌందర్య గర్వం ; 2. సౌందర్యం, చక్కదనం ; 3. విధం, రీతి ; 4. శోభ, కాంతి ; 5. నాట్యగతివిశేషం ; విణ. 1. అతిశయించినది ; 2. సుందరమైన, చక్కనైన.

**ముర్వు[2]** రూ. మురుకు, మురుగు[1], మురువు[2], ముర్గు. వి. 1. కర్ణాభరణవిశేషం. ఇందు. 5.82 ; 2. బంగారు కడియం, ముంజేతికి ధరించే ఆభరణవిశేషం.

క. మురు, మురు, మురుగు, మురువు, మురుపు. చెవికి ముక్కుకి కలిపి పెట్టుకొనే తీగలాంటి ఆభరణం ; తు. మురు. చెవిపోగు, మురుగి. (వెండి) కంకణం ; త. మురుకు. పైచెవికి పెట్టుకొనేనగ, మురుగు ; కువి. ముర్మ. ముక్కుకి పెట్టుకొనే నగ ;

పో.చూ.ప్రా. మురవి. ఆభరణ విశేషం.

**ముఱ** వి. 1. పొయలు ; 2. బెక్కు ; 3. అల్పం.

**ముఱకటము** రూ. ముఱకాటము. వి. తిప్పటం, మురకటించటం.

క. ముఱుకు. కొత్తరూపాన్నిచ్చు, మెలిపెట్టు, తిప్పు ; కొడ. ముర్. బిగించు ; త. ముఱుక్కు. మెలితిప్పు, తిప్పు ; మ. ముఱుకుక. మెలితిప్పు. తిప్పు.

**ముఱకటించు** రూ. మురకటించు, మురకాటించు. అ.క్రి. (నడిచేటప్పుడు) చలించు, కదలు, ఊగాడు. పండి.చ.

2.101 పు. ; స.క్రి. తిప్పు. భార.అను. 1.221. <ముఱకటము + -ఇంచు[3].

**ముఱకటించు** చూ. ముఱకటము.

**ముఱకము** వి. అతిశయం, హెచ్చు, ఉద్ధతి, నిక్కు. భీమ 3.57.

క. ముఱక, ఒయ్యారం.

**ముఱకాటము** రూ.చూ. ముఱకటము. వి. తిప్పటం.

**ముఱకాటించు** రూ.చూ. ముఱకటించు. అ.క్రి. (నడిచేటప్పుడు) చలించు, కదలు ; స.క్రి. తిప్పు. <ముఱకాటము + -ఇంచు[3].

**ముఱకాటించు** చూ. ముఱకాటము.

**ముఱముఱ** వి. 1. కోపం వెల్వరించటంలో అయిన అనుకరణం. గౌ. హరి. పూ. 1149. ధ్వన్యను ; 2. పట్టుబట్ట మొ.వాటి వలన కలిగే ధ్వనికి అనుకరణం. ద్వి. సార. చ. 1.35 ప.

క. మొఱె. బిగ్గరగా అరచు, కేకలుపెట్టు ; త. ముఱుముఱు(-ప్పు-, -త్తు-), మొఱుమొఱు(-ప్పు-, -త్తు-), మొఱుమొఱు. మూలుగు, సణుగు, గొణుగు ; మ. ముఱుముఱుక్క. మూలుగు ; కో. ముర్గ్-. గుర్రుమను ; తొ. ముఱ్స్. గుర్రుమను ; గోం. మొహ్చానా. అరుచు ; కుఇ. ముస్క. అరుచు ; కువి. మొఖలి. అరుచు ; పర్జి. మొక్క్. బిగ్గరగా అరుచు ; పో.చూ.త. మురల్.

**ముఱముఱమను (-అను)** అ.క్రి. కోపవికారాన్ని చూపు. **ముఱముఱలాడు** అ.క్రి. కోపవికారం చూపు, మురమురమను. <ముఱముఱ + -లు + ఆడు.

**ముఱి** రూ. మురి[1]. విణ. 1. కుత్సితం. భాస్క.రా.అరణ్య. 2.400 ; 2. అల్పం. ఆం.భా. 1.146 ; వి. 1. గర్వం, మదం. నీలా. 1.3 ; 2. నడకలోని కులుకు రసిక. 4.40 ; 3. శౌర్యం ; 4. పౌరుషం ; 5. క్రౌర్యం.

**ముఱికాఁడు** వి. గర్వితుడు. నిర్వ.రా. 6.127. **ముఱిచీకటి** వి. 1. చిమ్మచీకటి. భార.విరా. 3.195 ; 2. కుత్సితం. భాస్క.రా.అరణ్య. 2.400 ; వి. శౌర్యం. అచ్చ.రా.బాల. 45. **ముఱిప్రోవు** వి. అల్పులగుంపు. భార. విరా. 4.253. **ముఱిముఱి** విణ. కొంచెం కొంచెం. భార. విరా. 3.196. **ముఱిముఱిచీఁకటి** వి. గబ్బుచీకటి.

**ముఱికి** చూ. ముఱుగు. రూ. మురికి. వి. 1. మాలిన్యం, మొదుక, మూర్ధమలం. భార.అను. 5.167 ; 2. కశ్మలోదకం. వేమ. 1.34.

**ముఱికికాలువ** రూ. మురిక్కాలవ. వి. మురికినీరు పోయే కాలువ. **ముఱికిగుంట** వి. పీతిరిగుంట. **ముఱికిచెమట** వి. కొంచు. **ముఱికినాఁడు** చూ. ములికినాఁడు. వి.బౌ. ఒకానొకదేశం, ఆంధ్రదేశంలో ఒకానొక ప్రాంతం. విజ్ఞా. 2.59. హిం.ఉ. ముల్క్. దేశం.

**ముఱియ** చూ. ముఱియు[2].

**ముఱియించు** చూ. ముఱియు[2].

**ముఱియు[1]** రూ.చూ. మురియు[1]. అ.క్రి. 1. గర్వించు. భార. ద్రోణ. 1.173 ; 2. సంతోషించు. విక్ర. 882.

**ముఱియు[2]** రూ.చూ. మురియు[2]. అ.క్రి. 1. విరుగు. హరి.ఉ. 2.54 ; 2. తెగు, ఖండితమగు. రం.రా.యు. 356 పు. 17 పం.

**ముఱియ** రూ.చూ. మురియ. వి. ఖండం. అచ్చ.రా. అరణ్య. 118. **ముఱియించు** స.క్రి. ముఱియచేయు, ఖండించు, నరకు. ద్వి. పరమ. వి. 2.66పు. <ముఱియు[2] + -ఇంచు[3].

**ముఱు** రూ.చూ. ముఱ్ఱు[2]. వి. ఆవు మొ. వి. ఈనిన తర్వాత మూడు రోజుల వరకు ఇచ్చేపాలు.

**ముఱుకు** చూ. ముఱుగు.

**ముఱుగు** రూ. మురుగు[2]. అ. క్రి. 1. మురికగు. బసవ. 4.42 ; 2. చదియు, నలగు. మార్క. 2.41 ; 3. కుళ్ళు. మార్క. 2.155.

క. ముఱికల్. మురికి, ముగ్గు. మురికగు ; త. మురి. పాడగు ; గోం. ముడ్త్క్. మాగబెట్టు ; కొలా. ముర్. మురికి, ముర్, ముర్రు. మురికి ;

మూ. ద. ద్రా. మూ. మ. ద్రా. *ముట్/ముర్-.

<మూ. మ. ద్రా.*ముట్.

**ముఱుకు** వి. మాలిన్యం ; విణ. మలినమైన. **ముఱుగుడు** వి. మురిగినది. కుళ్ళినది. మను. 4.37. **ముఱుత్రోవ** రూ. మురుత్రోవ, దుర్గంధపు మార్గం. ఆము. 6.17. <ముఱుగు + త్రోవ. **ముఱుమొండెము** వి. దుర్గంధపు మొండెం. పండి. చ. 5.344పు. <ముఱుగు + మొండెము.

**ముఱుత్రోవ** చూ. ముఱుగు.

**ముఱుమొండెము** చూ. ముఱుగు.

**ముఱుపు** స.క్రి. గిల్లు. కు. సం. 5.139.

క. మురువు. గుండ్రంగా తిరుగు.

**ముఱ్ఱట** రూ. ముఱ్ఱాట. వి. చిమ్మనగొట్టంలో నీరు చల్లుకొనే ఆట. కు. సం. 9.70.

<ముఱ్ఱి + ఆట.

**ముఱ్ఱటలాడు** రూ. ముఱ్ఱాటలాడు. అ. క్రి. చిమ్మనగొట్టంతో నీళ్ళు చల్లుకుంటూ జలక్రీడలాడు. కు.సం. 9.52. <ముఱ్ఱట + -లు + ఆడు.

**ముఱ్ఱాట** రూ. చూ. ముఱ్ఱట. వి. చిమ్మనగొట్టంతో నీరు చల్లుకొనే ఆట, గ్రామదేవత కోసం వసంతం.

**ముఱ్ఱాటలాడు** రూ.చూ. ముఱ్ఱటలాడు. అ.క్రి. చిమ్మనగొట్టంతోనీళ్ళు చల్లుకుంటూ జలక్రీడలాడు. కుసం. 9.60. <ముఱ్ఱాట + -లు + ఆడు.

**ముఱ్ఱి** చూ. ముఱుగు[2]. వి. మురికి.

**ముఱ్ఱు[1]** అ.క్రి. ముట్టు, ఎదుర్కొను. కొరవికాసనం. క్రీ. శ. 892,922.

**ముఱ్ఱు[2]** రూ. ముర్రు, ముఱు. వి. 1. కొవ్వు. సానంద 2.41 ; 2. ఆవులు మొ. వి. ఈనిన తరవాత మూడురోజులవరకు ఇచ్చేపాలు. ఆం. భా. 2.258.

త. ముఱ్ఱు. పరిపూర్ణత.

**ముఱ్ఱుపాలు** రూ. ముర్రుబాలు. వి. బర్రెగాని ఆవుగాని ఈనినరోజున ఇచ్చేపాలు, జున్నుపాలు. **ముఱ్ఱుపాలువదిలించు** అ.క్రి. పొగరడచు. **ముఱ్ఱుఁబాము(-పాము[1])** వి. మాతులాహి,

సర్ప విశేషం. ఒకజాతిపాము. త. ముఙ్ఞు. ముదుసలి. **ముఙ్ఞుబాలమంకు(-పాలమంకు)** వి. చిన్నతనపు మొండితనం. తాళ్ల.సం. 8.37. **ముఙ్ఞు(బాలు(-పాలు[2])** రూ. ము(రుబాలు. వి.బ.వ. **1**. ఆవు మొ. వి ఈనిన తరవాత మూడురోజుల వరకు ఇచ్చేపాలు; **2**. స్త్రీలు (పసవించే ముందు వచ్చే పాలు.

**ముల్తెలు** రూ.చూ. మురీలు. వి.బ.వ. మరమరాలు.

**ములక**[1] రూ.చూ. ములుక[2]. వి. ఒకరకం వాకుడులాంటి అల్ప వృక్షం. వేమ. 3.268.

**ములక**[2] రూ.చూ. మునగ. వి. అర్భుదఫలి, మునగ. హంస. 4.132. (Moringa pterygosperma).

**ములకముండ్లలం** వి. ఒకరకం ముళ్ళకలుపు మొక్క (Solanuni ferox).

**ములకలిపున్నమి** రూ. చూ. మొలకలపున్నమి. వి. చైత్ర మాసంలో వచ్చే పూర్ణిమ.

**ములకాలకఙ్జ** రూ. చూ. ములుకోలకఙ్జ. వి. ములుకోల. (ఉత్తరసర్కారుల్లో వాడుక).

**ములగ** రూ.చూ. మునగ. వి. అర్బుదఫలి, మునగ. హంస. 4.132 (Moringa pterygosperma).

**ములముల** వి. (పుష్పాలు) వికసించటంలో అనుకరణం. ద్వి. పరమ. వి. 5 434. పం. ధ్వన్యను.

**ములసాయిదబ్బ** వి. రాకబద్ద, పంగనాఉన్న ఉసికర్రల మీద పొడుగ్గా పరచిన కర్ర.

**ములాసాపాగ** వి. ఒకరకం తలపాగ. సుదంతా. 3.164.

**ములికి** రూ. చూ. ముల్కి[1]. వి. బాణపు అలుగు. భీమ. 4.127; **2**. బాణం. శృం. నై. 2.109; **3**. బొంగరం ముల్లు, బొంగరం మొనకు గుచ్చబడి ఉండే ఇనపముక్క. ద్వి. పరమ. వి. 3.148పు; **4**. మనసున నాటిన మాట; **5**. వంగిన కొనగల ముల్లు; **6**. చిన్నకూచి చీల; **7**. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్య పుల్ల; **8**. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి అంచు చివర గుచ్చేసన్నటి లోహపు ముక్క; **9**. పట్టంచుకు తెల్లంచుకు మధ్యనేసిన గోరంత చిన్నబొగిడి; **10**. నారవడికే కదురు కిందికొసకు వేసినముల్లు; **11**. కదురు ఊచకు కింద బిగించిన మేకు.

**ములికిపెట్టు** వి. పట్టంచుకు తెల్లంచుకు మధ్యనేసిన గోరంత చిన్నబొగిడి.

**ములికినా(డు** రూ. చూ ముల్కినా(డు. వి. ఒకానొకదేశం, తెలుగుదేశంలోని ఒకానొక (ప్రాంతం. (క్రీడా. 102.

**ములిగిలిపార** వి. దోకుడుపార, గడ్డిచెక్కే పనిముట్టు.

**ములిపొచ్చి (-పచ్చి)** వి. పచ్చిపచ్చి, కొద్దిపచ్చి.

**ములివాడ** వి. నల్లగాఉండే చిన్న చేప.

**ములు** రూ. ముల్ల, ముల్లు, మొల్ల[4], మొళ. వి. బొ. **1**. (త్రాసు ముల్లు, తూనికలో బరువుల తారతమ్యాల్ని సూచించటం కోసం (త్రాసుమధ్య ఉండే వాడిగల సూక్ష్మావయవ విశేషం. భార. అది. 4.95; **2**. ఒకవస్తువుయొక్క వాడియైన చివర. కేయూ. 3.115; **3**. బాణాగ్రం, అలుగు. జైమినిభా. 3.7; **4**. నఖాగ్రం. విక్ర. 8.7; **5**. నివ్వరి మొ. ధాన్యపుగింజల కొనకి ఉండే సూక్ష్మావయవ విశేషం, శూకం. ఆము. 1.66; విశ. సన్నని మొనకలది. ద్వి. పరమ. వి. 3.148పు.

క. ముళ్, ముళు, ముళ్ళు. ముల్లు, సూదిమొన; కొడ. ముళ్ళి. ముల్లు; తు. ముళ్ళు. ముల్లు, ముల్లుపొద, చేపఎముక, ముళ్ళడె. ముళ్ళనేల; త. ముల్. ముల్లు, వాడిఅయినది, సూదికొన; మ. ముళ్. వాడైన, చివర, సూదికొన, ముల్లు; కో. ముళ్. ముల్లు; కువి. ముల్లు. సూది; పో. చూ. త. ముళై.

< మూ. (ద్రా. *ముళ్.

**ములుకట్టె** రూ.చూ. ముల్లుగట్టె. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర. **ములుకత్తి** రూ.చూ. ములుగత్తి. వి. ముల్లుతీసేకత్తి. **ములుకుట్టుకర్ర** రూ.చూ. ములుగట్టు కర్ర. వి. నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర. **ములుకోరింత** రూ. ములుకోరింద. వి. అడవుల్లో పెరిగే పెద్దతీగ (Acacia pennata). **ములుకోరింద** రూ. చూ. ములుకోరింత. వి. అడవుల్లో పెరిగే పెద్దతీగ (Acacia pennata). **ములుకోల** రూ. చూ. మునికోల. వి. **1**. వృషభాదుల్ని నడపటానికి ఉపయోగపడే ముల్లున్నకర్ర, ఎడ్లనుపొడిచే మునుకోల. భార. అరణ్య. 1.84; **2**. గుర్రాలను తోలటానికుపయోగించే సాధనం. హరి. పూ. 2.224. **ములుకోలకట్టె** వి. గొడ్లను తోలటానికి వాడే పొడుగాటికర్ర. **ములుకోలకఙ్జ** రూ. ములకాలకఙ్జ. వి. ములుకోల. **ములుగట్టుకర్ర** రూ. ములుకుట్టుకర్ర. వి. నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టేకర్ర. **ములుగట్టుగుది** వి. చేడుకర్రకు లేదా చేడుబద్దకు చివర కట్టినదారం. **ములుగట్టుతాడు** వి. నేతబట్టమీద చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం. **ములుగట్టుబద్ద** రూ. ములుగుటుబద్ద. వి. దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద. **ములుగట్టుబొందు** వి. చేడుకర్రల బిగింపుకు దారాలకు వేసే లోహపుచుట్టు. **ములుగట్టె** రూ.చూ. ముల్లుగట్టె. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర. **ములుగత్తి** రూ. ములుకత్తి. వి. ముల్లు తీసుకోవటానికి ఉపయోగించే చిన్నకత్తి. వేంక. పంచ. 1.598. **ములుగంప** వి. ముళ్ళ కంప. **ములుగర్ర(-కఙ్జ)** రూ.చూ. ముల్లుగర్ర. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగాటి కర్ర. **ములుగుటుబద్ద** రూ.చూ. ములుగట్టుబద్ద. వి. దోనెముందర నేసిన గుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద. **ములుగుట్టుపూజు** వి. చేడుకర్రలమధ్య రెంటినీ బిగించే పైతాడు. **ములుగట్టుబర్ర** వి. దోనెముందర నేసిన గుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర. **ములుగుత్తి** రూ. ముల్గుత్తి. వి. ఒకరకం చోర సాధనం, దొంగవాని పనిముట్టు. చెన్నబసవ. 3.294. **ములుగొట్టం** వి. చేడుముళ్ళు వేసుకొనే వెదురుగొట్టం. **ములుగొలిమిడి** వి. ఇక్షురం. ఒక జాతి గొబ్బి, హంస. 4.10 (Copparis spnosia). **ములుగొవింద** వి. ముళ్ళ

గోరింట బాటల పక్కన కంచెల్లోను పెరిగి తెలుపు పసుపు పూలుపూసే ముళ్ళుగలమొక్క (Barleria prioniliis). ములుగోగు వి. ఒకరకం చెట్టు (Hibiscus suratensis). ములుగోధుమ వి. గోధుమలో ఒకరకం. ములుగోరంట రూ.చూ. ముళ్ళగోరింట. వి. బాటలపక్కన, కంచెల్లోను పెరిగి తెల్లని పసుపుపూలు పూసే ముళ్ళుగల మొక్క (Balania prionitis). ములుగోరఁట రూ. ముళ్ళగోరింట. వి. ఝింటి, పచ్చని పూలుకలిగి ముళ్ళున్న ఒకజాతి పూల మొక్క. హంస. 4.4 (Barleria cristata). ములుగోల (-కోల) రూ.చూ. ములుకోల. వి. 1. కొరడా; 2. ఆరెగోల, వృషభాదుల్ని నడపటంకోసం పొడిచే కఱ్ఱ. ములుచంద్ర వి. వృక్షవిశేషం. ద్వి.సా.చ. 2.662. ములుచింత రూ. ముల్లుచింత. వి. ఒకరకం కూరాకు. పరమ. 5.185 ములుచుట్టు వి. సన్నని మొనగల తిరుగుడుచీల. మృత్యు. 1.6. ములుచూపు రూ.చూ. ములుసూపు. అ.క్రి. 1. అతిశయించు. వరాహ. 4.159; 2. పూను, యత్నించు. పి.శకు. 4.166. ములుజీలుగ వి. సీమతుమ్మచెట్టు, పచ్చని పూలుపూసే చిన్నచెట్టు (Parkinsonia aculeata). ములుజెముడు వి. సింహుండభేదం, ఒకానొకజాతి జెముడు, అలంబుషం. ములుతారు రూ. ములుదారు. వి. ముళ్ళకంపలతో ఏర్పరచిన అవరం, ముళ్ళకోరడి. రామే. 5.81. ములుతుమికి రూ.చూ. ముళ్ళతుమికి. వి. ఎఱ్ఱగొందచెట్టు, ఆకుపచ్చ పూలుపూసే ముళ్ళుగల చెట్టు (Diospyros montana). ములుతోఁటకూర వి. ముళ్ళతోటకూర. ములుత్రాసు వి. చిన్నత్రాసు, తప్పుడు తక్కెడ. ములుదారు రూ.చూ. ములుతారు. వి. ముళ్ళకంపలతో ఏర్పరచిన ఆవరం, ముళ్ళకోరడి. ములుదోరణము వి. తోరణంలా అమర్చిన ముళ్ళవరగ, చోరసాధన విశేషం. వేంక. పంచ. 3.199. ములుదోస వి. రోమశి, ముళ్ళున్నదోస. ఆం.భా. 1.71. ములుదోసతీఁగె వి. ముళ్ళున్న దోనకాయలు కాసే తీగ. ములుపంది వి. ముళ్ళపంది, సూకరం. ములుపురుగు రూ.చూ. ములుపుర్వు. వి. తేలు, వృశ్చికం. ములుపుర్గు రూ.చూ. ములుపుర్వు. వి. తేలు, వృశ్చికం. ములుపురువు రూ.చూ. ములుపుర్వు. వి. తేలు, వృశ్చికం. ములుపుర్వు రూ. ములుపురుగు, ములుపుర్గు, ములుపురువు. వి. తేలు, వృశ్చికం, ముల్లు, (కొండెం) కల పురుగు. ములుబంతి వి. చెండులా ముళ్ళతో ఏర్పరచిన దొంగవాని పనిముట్టు, గద్దగోరు, చోరసాధనం. పరమ. 4.184. హరిశ్చ. 5.111. ములుబూరుగు రూ.చూ. ములుబూర్గు. వి. శాల్మలీభేదం, ఒకజాతి బూరుగుచెట్టు. ములుబూర్గు రూ. ములుబూరుగు. వి. ఒకజాతి బూరుగుచెట్టు. వాల్మీ. 2.82. ములుమోదుగ రూ.చూ. ముల్ముఱ్ఱోంతువు. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Erythrina rohitaka). ములుమోదుగు రూ.చూ. ముల్ముఱ్ఱోంతువు. వి. రోహితక వృక్షం. హంస. 4.11, అచ్చ.రా.యు. 364 (Andersoria Rohitaka). ముల్ముఱ్ఱోంతువు రూ. మునిమోదుగ, ములుమోదుగ, ములుమోదుగు, ముళ్ళమోదుగ. వి. ములుమోదుగు. పిఠాపురం శాసనం. 1024. E.P. Ind. 5.90 పు. (Erythrina rohitaka). ములువడ్లు వి.బ.వ. గోధుమలు, యవలు. ములువాలుగ వి. ఒకజాతి చేప. ములువెంపలి రూ. ముళ్ళవెంపలి. వి. కంటకపుంజి, ఒకజాతి చిన్నమొక్క. హంస. 4.10. (Trephosia spinosa). ములువెలఁగ వి. చతురశ్రికం, ఒకజాతి గడ్డిదుంప. ములువెలమ వి. వికంతం, స్వాదుకంటకం. ఆం.భా. 2.46. ములువేగి వి. వృక్షవిశేషం. హంస. 4.11. ములుసూపు రూ. ములుచూపు, ముల్లుచూపు, ముల్లుసూపు. అ.క్రి. 1. త్రాసుముల్లు బరువు వైపురంగు. భార.ఆది. 4.95; 2. పూను, యత్నించు. ములుస్తై వి. ఒకరకం ఉచ్చిత. హంస. 4.10. ముల్గట్టె రూ.చూ. ముల్లుగట్టె. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగు కఱ్ర, దీని చివర చిన్న ముల్లు (మేకు) వేస్తారు. ముల్గఱ్ఱ రూ.చూ. ముల్లుగఱ్ర. వి. అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగాటి కఱ్ర, దీనిచివర ముల్లు (మేకు) ఉంటుంది. ముల్గుత్తి రూ.చూ. ములుగుత్తి. వి. ఒకరకం చోరసాధనం, దొంగవాని పనిముట్టు. ముల్తొలిక వి. మత్స్యవిశేషం, ఒకజాతి చేప. ప్రబంధ. 195.

ములుం రూ.చూ. ములుము. వి. ఎత్తుగాఉన్న పొలానికి నీరు సరఫరా చేసే కుంట.

ములుక[1] వి. నిర్దయత. అచ్చ.రా. ఆరణ్య. 98.

ములుక[2] రూ. ములక[1], మోళంగి. వి. కంటకి, వార్తాకం, ముళ్ళవంగ. కు.సం. 2.60.

ములుకపూవన్నెలు వి.బ.వ. వస్త్రవిశేషం. ధనా. 3.38.

ములుక[3] రూ.చూ. మునగ. వి. మునగచెట్టు.

ములుకు విశ. 1. ప్రకాశమానం. ద్వి. పరమ. వి. 3.191; 2. తీక్ష్ణమైంది, వాడియైనది. కృ.శకు. 2.132; వి. 1. తూగ్గుండు చివరి మొనదేలిన భాగం; 2. పెంకు కోతకు వాడే మొనగల సాధనం.

ములుగ వి. గరియ, గరుగు, వృక్షవిశేషం.

ములుగు[1] రూ. మూలుగు[1], మూల్గు[1]. అ.క్రి. 1. మూలుగు. ఉ.హరి. 6.77; 2. మొరయు, ధ్వనించు. క్రీడా. 226; వి. మూలగటం, ఖేదధ్వని.

క. మూలుగు, ములుకు. మూలుగు, బాధపడు, ములుకు. నొప్పులుపడు; త. ముణంగ; మ. మూళుక. మూలుగు, మెరయు, బాధపడు; కువి. మూల్గ్. చిరచిరలాడు, మూరీకీ. గుర్రుమని ధ్వనిచేయు.

ములుగు[2] వి. భాండారం, బొక్కసం. భల్లా. 1.

సం. మూల-, మూలక-. మూలధనం.

<సం. మూలక-.

ములుగు[3] రూ.చూ. ములుఁగు. వి. పాపమీను, శృంగి, ఒకజాతి ఆడచేప.

ములుగు[4] వి. కుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట.

ములుగుడు వి. ఒకరకం చెట్టు (Morinda umbellata).

ములుచ రూ. ముల్చ. వి. 1. మూఢుడు. జైమినిభా. 5.59; 2. ధూర్తురాలు. తాళ్ల. సం. 17.174; 3. మూర్ఖుడు. యయా. 3.89; 4. ధూర్తుడు. ఆం.భా. 3.7, విశ. మోటై. నది. అచ్చ.రా.యు. 103.

**ములుచ(దనము(-తనము)** వి. మూర్ఖత్వం. హంస. 2.236.

**ములుము** రూ. ములుం. వి. 1. బావుల నీరు పారించి పండించే పొలం, కోతకోసిన పొలం; 2. కోసే పైరుకు ముందున్న పైరు; అ.క్రి. ఎత్తుపల్లాలు లేకుండా చదునుగా ఉండు.

**ముల్కాసు** వి. అల్లిక. పాండు. 2.229.

**ముల్కి**[1] రూ. ములికి, మొలికి, మొల్కి. వి. 1. బాణం. భార. శాంతి. 2.100; 2. బాణపుటలుగు; 3. బొంగరంముల్లు; 4. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చినకొయ్య; 5. పట్టంచుకు, తెల్లంచుకు మధ్య నేసిన గోరంత చిన్న బొగిడి; 6. నారవడికే కదురు కిందికొనకు వేసినముల్లు; 7. చేదు చివరి ఇనపమొన; 8. ఉన్నికదురు ఊచకు కింద బిగించిన మేకు.

**ముల్కి**[2] రూ. ముల్కీ. విశ. రెవిన్యూ సంబంధమైన.

హిం. ముల్క్. దేశం, ప్రాంతం, ప్రదేశం; మరా. ములూఖ, ముల్క. దేశం, ప్రాంతం; ఉ. అర. ముల్కీ. సివిల్, రాజకీయ సంబంధమైన, దేశానికి సంబంధించిన, భూమి లేక రెవెన్యూ వ్యవహారాలకు సంబంధించిన;

క. ఇల్లు, స్వదేశీయమైన; త. రెవిన్యూ విషయ సంబంధమైన, స్వజాతీయమైన.

<ఉ. ముల్కీ.

**ముల్కినా(డు** రూ. ములికినా(డు. వి. ఒకానొక దేశం. క్రీడా. 22.

హి.ఉ. ముల్క్. దేశం, ప్రాంతం.

<ఉ. ముల్క్+నా(డు[2].

**ముల్కీ** రూ. చూ. ముల్కి[2]. విశ. పన్నుల సంబంధమైన.

**ముల్కు**[1] వి. దేశం.

హిం. ముల్క్; మరా. ములూఖ, ముల్క్. దేశం, రాజ్యం; ఉ. ముల్క్; పార. ముల్క్; అర. ముల్క్. ప్రాంతం, దేశం, రాష్ట్రం.

<ఉ. ముల్క్.

**ముల్కు**[2] రూ.చూ. మలక[2]. వి. తురుష్కుడు, మహమ్మదీయుడు.

**ముల్కేపానవాన్ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం.ఉ. ముల్క్. దేశం, శాహ్. రాజు, నవాబ్. దయాళువు, ఖాన్. స్థానం.

మల్కేపానవాజ్ఖాన్కు సంబంధించిన.

**ముల్గ** రూ.చూ. మునగ. వి. అర్బుదఫలి, మునగచెట్టు.

**ముల్గట్టె** చూ. ములు.

**ముల్గ్రర** చూ. ములు.

**ముల్గు** రూ.చూ. మలు(గు. వి. పాపమీను, శృంగి, ఒకజాతి ఆడచేప.

**ముల్గుత్తి** చూ. ములు.

**ముల్చ** రూ.చూ. ములుచ. విశ. 1. మూఢుడు. పరమ. 3.198; 2. మూర్ఖుడు; 3. మోటైన; 4. ధూర్తుడు.

**ముల్తి** రూ.చూ. ముల్తీ. వి. అట్టేపెట్టటం.

**ముల్తీ** రూ. ముల్తి. వి. అట్టేపెట్టటం.

హిం. ముల్తవీ. వాయిదా వేయబడ్డ; ఉ.అర. ముల్తవీ. ఆలస్యం చేయబడ్డ, పెండింగ్, వాయిదా వేయబడ్డ, పెంచిచెప్పటం, ఎన్నో దినాలుగా జరిగిన.

<ఉ. ముల్తవీ.

**ముల్తొలిక** చూ. ములు.

**ముల్నీళ్ళముంత** వి. కొన్ని కులాలవారు అరివేణికి వాడే మట్టి పాత్ర.

**ముల్ల** రూ.చూ. ములు. వి. 1. పత్తినుంచి గింజలు వేరుచేసే పనిముట్టు; 2. అచ్చు కట్టేటప్పుడు పన్నె గూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల; 3. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క; 4. నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల; 5. ఉన్ని కదురు ఊచకు కింద బిగించిన మేకు; 6. చేదు చివరి ఇనప మొన.

**ముల్లంగి** వి. ఒకజాతి దుంప, హస్తికంద. భార.అను. 2.379 (Raphanus safivas).

సం. మూల-, మూలక-; ప్రా. మూలగ-, మూలయ. కంద విశేషం, శాకభేదం; అ. మా. మూలగ-. కంద విశేషం.

క. ముల్లంగి, మూలగె, మూలంగె; తు. ముల్లంగి, మూలంగి, మూలెంగి.

<ప్రా. మూలగ-.

ముల్లంగిపిట్ట వి. ఒకరకం పిట్ట.

**ముల్లడ(చు** చూ. ముల్లు.

**ముల్లముస్తె** చూ. ముల్లు.

**ముల్లంపిడుం** చూ. ముల్లు. వి. బొంగు ముళ్ళు ఎక్కువగాఉండే ఒకరకం వెదురు, రమారమి 50 అడుగుల ఎత్తువరకు పొదగా పెరిగే తృణ విశేషం. చీల్చిన గడలతో చాపలు, బుట్టలు, విసనకర్రలు మొ. వి అల్లుతారు. గడలు వాసాలుగా గుంజలుగా సర్వసాధారణంగా వాడుకలో ఉన్నాయి (Bambusa arudinace).

**ముల్లా** రూ.చూ. మొల్లా. వి. 1. ముస్లిం పండితుడు; 2. ముస్లిం మతగురువు, మౌల్వీ.

ముల్లాఇనాం వి. ముస్లిం పండితుని కిచ్చే ఇనాం, డబ్బు. హిం.ఉ. ముల్లా. ముస్లిం పండితుడు, ఇనామ్. బహుమతి. <ఉ. ముల్లాఇనామ్. ముల్లామాన్యం వి. ముస్లిం పండితుల కిచ్చే భూమి.

**ముల్లాకుడాయి** చూ. ముల్లు.

**ముల్లాడించు** చూ. ముల్లు.

**ముల్లాను** చూ. ముల్లు.

**ముల్లార్చి** చూ. ముల్లు.

**ముల్లిగొర్రె** వి. చెవులు లేని గొర్రె.

**ముల్లిడు** చూ. ముల్లు.

**ముల్లియ** రూ. ముల్లె. వి. మూట. బసవ. 2.384.

సం. మూల-, మూల్య-. వెల, కిమ్మత్తు; ప్రా. ముల్లియ-. ముల్ల, మొల్లం; జై.శౌ. మల్ల; అ.మా. ముల్లం. ములువ, ఖరీదు;

తు. మోళు. విలువ; కుఇ. ముల, మొల. కన్యా శుల్కం; పర్జి. మొల్ల. ఖరీదు.

<ప్రా. ముల్లియ.

**ముల్లు** రూ.చూ. ములు. వి.ఔ. **1.** కంటకం, కొన్ని వృక్ష లతాదులకు కలిగే వాడిఅయిన సూక్ష్మావయవ విశేషం. భార.ఆది. 6 116; **2.** కంటకుడు (క్షుద్రశత్రువు). రం.రా.ఉ. 146 పు. 29 పం.; **3.** ఒక వస్తువుయొక్క వాడిఅయిన అగ్రభాగం. మను. 3.34, ప్రభు. 3.92 పు.; **4.** శూకం, నివ్వరి మొ. ధాన్యం గింజల చివర ఉండే సూక్ష్మావయవం. ఆము. 1.67; **5.** ముళ్ళపంది మెడమీద ఉండే బలిష్ఠమైన వాడిఅయిన రోమం, శలలం. ఆము. 8.84; **6.** త్రాసు ముల్లు, తూనికలో బరువుల తార తమ్యాన్ని సూచించే త్రాసుకు మధ్యలో ఉండే అవయవ విశేషం; **7.** సన్నని మొన; **8.** అచ్చు కట్టేటప్పుడు పన్నె గూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల; **9.** నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క; **10.** నాడెలో పేకదారం కండె ఇనపపుల్ల; **11.** ఉన్ని కదురు ఊచకు కింద బిగించిన మేకు; **12.** చేడు చివరి ఇనప మొన; **13.** తలలేని మేకు, పెంకు కోతకు వాడే మొనగల సాధనం; **14.** కైవారంలోని మొనదేలిన రేకుముక్క; **15.** తూగ్గుండు చివరి మొనదేలిన భాగం.

**ముంట(జీల్చు (-చీల్చు)** స.క్రి. నార లోనగు వాటి నలుసులు పోయేటట్లుగా సన్నగా తీయు. <ముల్లు+-ఇ్+చీల్చు. **ముంటికంప** వి. ముంటిచెట్టు కంప. **ముంటికొను** అ.క్రి. వివరాలు తెలియు. తాళ్ల.సం. 14.298. **ముంటిగంటి తెలియు** అ.క్రి. వివరాలు తెలియు. వేంక.పంచ. 1.37. **ముంటిమొననిల్చినట్టులుండు** స.క్రి. అతికష్టంమీద ఉండు, ముళ్ళమీద ఉన్నట్టు ఉండు. ప్రబంధ. 727. **ముండ్లకంచియ** రూ.చూ. ముండ్లకంచె. వి. ముండ్లకంప వెలుగు. **ముండ్ల కంచె** రూ. ముండ్లకంచియ. వి. ముండ్లకంప వెలుగు. **ముండ్లకల్ల** వి. ఆము కాల్చటానికి వాడే ముండ్లకంప. **ముండ్లకుసుమ** వి. చెందు ముళ్ళలో ఉండే రకం. **ముండ్ల గుంపు** వి. **1.** ముళ్ళపొద; **2.** లంజెల సమూహం. **ముండ్లగొబ్బి** వి. ముళ్ళగోరింట (Barleria priontis) **ముండ్లతోటకూర** వి. కాడకు ముళ్ళుండే ఒకరకం కూర. దీన్నే గొగ్గలికూర అంటారు. **ముండ్లపంది** వి. ఏదుపంది, శల్యం. **ముండ్లపైకూర్చున్నట్లు** అవ్య. అశాంతిగా. **ముండ్ల పొద** వి. ఒకవిధమైన ముళ్ళపొద, సన్ననిముల్లు. **ముండ్ల బూరగ** వి. పరుపులు మొ. వాటికి ఉపయోగించే దూది నిచ్చే చెట్టు (Bambax malabaricum) **ముండ్లమండ** వి. ముళ్ళతో కట్టిన వెలుగు. **ముండ్లములుచింత** వి. ఒకానొక కూరాకు చెట్టు. పరమ.వి. 8.581. **ముండ్లముస్తె** వి. సముద్రతీరంలో పెరిగే తీగ (Solanum trilobatum). **ముండ్లవెదురు** వి. గృహాది నిర్మాణాలకు తడికలు మొ. వి అల్లటానికి ఉపయోగపడే గడల నిచ్చే పొద. (Bambus arundinacea). **ముండ్లశేషణం** వి. దాలిరి, పదును చేసే పనిముట్టు, ఒకవైపు పళ్ళున్న ఉక్కుదిమ్మ. **ముండ్లుగండ్లుఅనక** అవ్య. రాయిరప్ప గమనించక, కష్టాల్ని లెక్కించక. భార. అరణ్య. 6.161. **ముల్లడ(చు** అ.క్రి. ముళ్ళుగుచ్చి ఆనవాలుచేయు, ముళ్ళకంపపైన పేర్చు. పాండు. 4.149. <ముల్లు+అడ(చు. **ముల్లముస్తె** వి. ముల్లుచింత, శుండ. (ఒకజాతిచింతచెట్టు). **ముల్లాకుఱాయి** వి. ఒకరకంరాయి, పత్త్రపరశు భేదం. <ముల్లు+ఆకు ఱాయి. **ముల్లాడించు** స.క్రి. ఉలితోచెక్కు, మలచు. <ముల్లు+ఆడించు. **ముల్లాను** వి. ముల్లుకఱ్ఱతో పొడుపు తిని నడిచేది. <ముల్లు+ఆను. **ముల్లార్చి** వి. ముల్లులో మొనదేలిన గుండ్రటి అర్చి. <ముల్లు+ఆర్చి **ముల్లిడు** అ.క్రి. కంచెవేయు, పొలంచుట్టూ ముళ్ళకంపల్ని పాతు. ఆము. 4.219. <ముల్లు+ఇడు. **ముల్లుకట్టుతాడు** వి. చేడుబద్దకు చివర కట్టినదారం. **ముల్లుకట్టె** రూ.చూ. ముల్లుగట్టె. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగు కర్ర. **ముల్లుకఱ్ఱ** వి. మునికోల, కొరడా. **ముల్లుకోల** రూ.చూ. మునికోల, వి. **1** కొరడా; **2** వృషభాదుల్ని నడపటం కోసం పొడిచేకర్ర. **ముల్లుగట్టుసివర** వి. మగ్గానికి అమర్చేపడుగు మొదటిభాగం దూర్చిన పొడుగాటి బెత్తం. **ముల్లుగట్టె** రూ. ములుకట్టె, ములుగట్టె, ములుకట్టె, ముల్గట్టె. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర. **ముల్లుగర్ర** రూ. ములుగర్ర, ముల్గర్ర. వి. ములుకోల, అరకకు కట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర, దీనిచివరముల్లు (మేకు) కొట్టిఉంటుంది. **ముల్లుగోరింట** రూ.చూ. ముళ్ళ గోరింట. వి. **1** ముదురు పసరురంగు, ముళ్ళగోరింటపువ్వు రంగు; **2.** బంగారం మాదిరి పసుపువన్నె. **ముల్లుచింత** రూ చూ. ములుచింత. వి. ఒకజాతికూరాకు. ద్వి. పరమ. వి. 8.581. **ముల్లుచూపు** రూ.చూ. ములుసూపు. అ.క్రి. **1.** అతిశయించు. విక్ర. 1.20; **2.** త్రాసులో ఉంచిన వస్తువుల తగ్గు మొగ్గుల్ని సూచించు, మొగ్గునుచూపు. **ముల్లుడబ్బి** వి. నేతఅయిన తరవాత చేడుముళ్ళు వేసుకొనే డబ్బి. **ముల్లుతోటకూర** రూ. ముళ్ళతోటకూర. వి, 2, 3 అడుగులెత్తు పెరిగే కాడలు ఎర్రగా ఉండి కూరగా ఉప యోగపడే ముళ్ళ కలుపుమొక్క. (Anasanfus spinosus). **ముల్లుపుచ్చికొట్టడ(చు** రూ. ముల్లుపుచ్చికొట్టడ(చు. అ.క్రి. తక్కువబాధను తొలగించటానికి పోయి మరింత ఎక్కువబాధను కల్పించు. ఉ. హరి. 5.103. **ముల్లుపుచ్చి పదరడ(చు** అ.క్రి. ఒకకీడును తొలగించు కొనబోయి మరింత పెద్దబాధ కలిగించుకొను. బసవ. 183. **ముల్లుబొట్ట** వి. అకు. విడపకుండా ఎన్ను లేర్పడుతున్న మొక్కదశ. **ముల్లుబోయు (-పోయు)** అ.క్రి. తిరుగలి మొ. వాటికి గంట్లు పోయు. **ముల్లుముంట(బుచ్చు** స.క్రి. చెడును చెడుతోనే సాధించు. <ముల్లు+ముల్లు+-ఇ్+-పుచ్చు. **ముల్లు పుచ్చికొట్టడ(చు** రూ.చూ. ముల్లుపుచ్చికొట్టడ(చు. అ.క్రి. మునుపటికంటె ఎక్కువ బాధకలుగు. **ముల్లుసజ్జ** రూ. ముల్లుసద్ద. వి. సజ్జల్లో ఒకరకం. **ముల్లుసద్ద** రూ.చూ. ముల్లుసజ్జ. వి. ఒకరకం సజ్జ. **ముల్లుసూపు (-చూపు)** రూ.చూ. ములుసూపు. అ.క్రి. **1.** అతిశయించు. విక్ర. 1.20; **2.** త్రాసులో ఉంచిన వస్తువుల తగ్గు మొగ్గుల్ని సూచించు,

మొగ్గుచూపు. భాగ. 10ఉ. 10. ముల్లాచ రూ. చూ. ముల్లాచి. వి. ఒకరకం గడ్డి. హంస. 5.45. ముల్లాచి రూ. ముల్లాచ. వి. ఒకరకం గడ్డి. ప్రబంధ. 201. ముళ్ళ కంప వి. 1. ముళ్ళతో ఉన్న ఎండుకొమ్మల సమూహం; 2. చిక్కులు; 3. ఆముదాల్పులో వాడే కంపకట్టెలు. ముళ్ళకంపలోచిక్కుకొను అ.క్రి. చిక్కుల్లోపడు. ముళ్ళగొర్రు వి. పలుగొర్రు, మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి విత్తిన తరవాత కలుపు గడ్డిపోవటానికి తోలే పరికరం. ముళ్ళ గోరంకి వి. ముదురుఎరుపు రంగులో తెల్ల చాయ. ముళ్ళగోరింట రూ.చూ. ములుగోరంట, ములుగోర ముల్లుగోరింట, ముళ్ళగోరింత. వి. 1. ముదురు పసరు రంగు, ముళ్ళగోరింట పువ్వురంగు; 2. బంగారం మాదిరి పసుపువన్నె. ముళ్ళగోరింత రూ.చూ. ముళ్ళగోరింట. వి. 1. ముదురు పసరు రంగు. ముళ్ళగోరింట పుష్పరంగు; 2. బంగారం మాదిరి పసుపు వన్నె. ముళ్ళతుమికి రూ. ములుతుమికి. వి. ఎర్రగొదచెట్టు, ఆకుపచ్చ పూలుపూసే ముళ్ళచెట్టు (Diospyros mcntana). ముళ్ళతోటకూర రూ.చూ. ముల్లుతోటకూర వి. తోటకూరలో ఒకరకం, 2, 3 అడుగులు ఎత్తుపెరిగే మొండిరకం ముళ్ళకలుపు మొక్క. (Amaranfas spinosu ). ముళ్ళముస్తె వి. ఉత్తర సర్కారులు, దక్కను, కర్ణాటక ప్రాంతాల్లోని సముద్ర తీరంలో పెరిగే తీగ (Solanum trilobatum). ముళ్ళమోదుగ రూ. చూ. ములుమ్రోంతువు. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Erythrina suberosa). ముళ్ళవంకాయ వి. తొడిమెకు ముళ్ళుండి కాయతెల్లగా గుండ్రంగా ఉండే వంకాయ. ముళ్ళవంగ వి. కత్తెరవంగ. ముళ్ళవెంపలి రూ. ములువెంపలి. వి. సముద్ర తీరంలోని బంజరుల్లోను కొండల మీద పెరిగే ముళ్ళుగల మొక్క (Tephrosia sp.nosa). ముళ్ళకొక్కిత వి. ఎర్రబిక్కచెట్టు, ముళ్ళు కలిగినచెట్టు (Gandenia turgida). ముళ్ళకోరింత వి. కొండలమీద అడవుల్లోను పెరిగే ముళ్ళుగల తీగ (Acacia pennata). ముళ్ళకోరింద వి. నీలగిరుల్లో పెరిగే ముల్లుగలతీగ (Toddalia aculeata). ముళ్ళ గుంత రూ.చూ. ముళ్ళగోరంట. వి. బాటల పక్కన కంచెల్లోను పెరిగి తెలుపు పసుపుపూలు పూసే ముళ్ళుగల మొక్క (Barleria prionitis). ముళ్ళగొంత రూ.చూ. ముళ్ళగోరంట. వి. బాటలపక్కన, కంచెల్లోను పెరిగి తెలుపు, పసుపు పూలుపూసే ముళ్ళుగల మొక్క (Barleria prionitis). ముళ్ళగోరంట రూ. ములుగోరంట, ముళ్ళగుంత, ముళ్ళగొంత. వి. బాటలపక్కన కంచెల్లోను పెరిగి తెలుపు, పసుపు పూలు పూసే ముళ్ళుగల మొక్క (Barleria prionitis). ముళ్ళపెండలము వి. అడవి గెనుసుతీగ, ఆకుపచ్చని సువాసనగల పూలు పూసే తీగ (Dioscorea pentaphylla). ముళ్ళమాను వి. ఒరిస్సాలో పెరిగే చిన్నచెట్టు (Flacourtia cataphracta). ముళ్ళవెదురు వి. నదనపువెదురు, గృహాది నిర్మాణాలకు ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Bambusa arundinacea).

ముల్లాచ చూ. ముల్లు.
ముల్లాచి చూ. ముల్లు.
ముల్లె రూ.చూ. ముల్లియ. వి. 1. మూట, ధనం, ముడుప; 2. కంబళిలో ధాన్యం పోసి కట్టుకొన్న మూట; 3. పదివేల దసలికాయలు.

ముల్లెకట్టు వి. చెరువులు నాలుగూ చేర్చి కట్టినకట్ట; అ.క్రి. 1. డబ్బును జాగ్రత్తచేయు; 2. డబ్బును ముడుపుగా కట్టు. ముల్లెవిప్పువాడు విణ. మూటలదొంగ.

ముల్లెవలు వి. ఎద్దుల దాణాగా ఉపయోగించే ఒక రకం ధాన్యం. సం. యవ-. ధాన్యవిశేషం.
ముల్లోకము చూ. మూ-.
ముళ్ళకంప చూ. ముల్లు.
ముళ్ళకంపలోచిక్కుకొను చూ. ముల్లు.
ముళ్ళగొర్రు చూ. ముల్లు.
ముళ్ళగోరంకి చూ. ముల్లు.
ముళ్ళగోరింట చూ. ముల్లు.
ముళ్ళగోరింత చూ. ముల్లు.
ముళ్ళతుమికి చూ. ముల్లు.
ముళ్ళతోటకూర చూ. ముల్లు.
ముళ్ళపేరు చూ. ముడి[1].
ముళ్ళమాటలు చూ. ముడి[1]
ముళ్ళమారి చూ. ముడి[1].
ముళ్ళముస్తె చూ. ముల్లు.
ముళ్ళమోదుగ చూ. ముల్లు.
ముళ్ళయతి చూ. ముడి[1].
ముళ్ళవంకాయ చూ. ముల్లు.
ముళ్ళవంగ చూ. ముల్లు.
ముళ్ళవెంపలి చూ. ముల్లు.
ముళ్ళు చూ. ముడి[1].
ముళ్ళకొక్కిత చూ. ముల్లు.
ముళ్ళకోరింత చూ. ముల్లు.
ముళ్ళకోరింద చూ. ముల్లు.
ముళ్ళగుంత చూ. ముల్లు.
ముళ్ళగొంత చూ. ముల్లు.
ముళ్ళగోరంట చూ. ముల్లు.
ముళ్ళపెట్టు చూ. ముడి[1].
ముళ్ళపెండలము చూ. ముల్లు.
ముళ్ళమాను చూ. ముల్లు.
ముళ్ళవెదురు చూ. ముల్లు.
ముళ్ళవేయు చూ. ముడి[1].
ముచ్చిలు రూ. ముచ్చిలు. స.క్రి. దొంగిలించు. కొరవిశాసనం. క్రీ.శ. 892-922. ముచ్చిలు పదం యొక్క కృతక ప్రామాణికరూపమే ముచ్చిలు.

< మూ.ద్రా. *ముాయ్-/*ముచ్-.

మూ- రూ.చూ. మూన్డ్. విణ. వృత్తిలో మూడుశబ్దానికి మీది వర్ణం లోపించగా మిగిలినరూపం అని వ్యాకర్తలు. మూ శబ్దం మూడుకు పర్యాయంగా భావించవచ్చు. మను. 4.73.

**ముక్కచ్చి** రూ. ముక్కచ్చె. వి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒక చోటికి చేర్చిన రెండు అనులున్న భాగం. <మూ+కచ్చి. **ముక్కచ్చిఎత్తు** రూ. ముక్కచ్చె ఎత్తు. స.క్రి. సరి చేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒక చోటికి చేర్చు. **ముక్కచ్చి కూర్పు** రూ. ముక్కచ్చెకూర్పు. వి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒకచోటికి చేర్చిన రెండు అనులున్న భాగం. **ముక్కచ్చిచేయు** రూ. ముక్కచ్చెచేయు. స.క్రి. **1**. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులు ఒకచోటికి చేర్చు ; **2**. సరిచేసిన పడుగులో మూడు కచ్చులు మిగిల్చి తక్కినవి తీసివేయు. **ముక్కచ్చి చేర్చు** రూ. ముక్కచ్చెచేర్చు. అ.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒక చోటికి చేర్చు. **ముక్కచ్చిదూయు** రూ. ముక్కచ్చెదూయు. స.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒకచోటికి చేర్చు. **ముక్కచ్చివేయు** రూ.చూ. ముక్కచ్చెవేయు. స.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒకచోటికి చేర్చు. **ముక్కచ్చె** రూ.చూ. ముక్కచ్చి. వి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒకచోటికి చేర్చిన రెండు అనులున్న భాగం. <మూ-+కచ్చె. **ముక్కచ్చెఎత్తు** రూ.చూ. ముక్కచ్చిఎత్తు. స.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒకచోటికి చేర్చు **ముక్కచ్చెకూర్పు** రూ.చూ. ముక్కచ్చికూర్పు. వి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒకచోటికి చేర్చిన రెండు అనులున్న భాగం. **ముక్కచ్చెచేయు** రూ.చూ. ముక్కచ్చి చేయు. స.క్రి. **1.** సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులు ఒకచోటికి చేర్చు ; **2**. సరిచేసిన పడుగులో మూడు కచ్చులు మిగిల్చి తక్కినవి తీసివేయు. **ముక్కచ్చె చేర్చు** రూ. చూ. ముక్కచ్చి చేర్చు. స.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో రెండు అనులున్న భాగాన్ని ఒకచోటికి చేర్చు. **ముక్కచ్చెదూయు** రూ.చూ. ముక్కచ్చి దూయు. స.క్రి. ముక్కచ్చిలాకలు తీసివేయు. **ముక్కచ్చె వేయు** రూ. ముక్కచ్చి వేయు. స.క్రి. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒకచోటికి రెండు అనులున్న భాగం చేర్చు. **ముక్కటము** వి. అముదం, ఆవునేయి, నువ్వులనూనె చేర్చి శిశువులకు పెట్టే ఆహారం. సం. కటు-. ఏనుగుచెక్కలి, తృణం, చాప, కాలకూటవిషం, లవణం, సొంటి. <మూ-+సం. కటు-+-ము. **ముక్కట్టుతాడు** వి. పంటెకు కిందిపైపున ఆకులచివర్లను కామకు కలిపి కట్టిన తాడు. <మూ-+కట్టు+త్రాడు. **ముక్కంటి**[1] వి. త్రిలోచనుడు, శివుడు. భార.అరణ్య. 1.334. ఉ.హరి. 2.142. క. ముక్కణ్ణ. శివుడు ; త. ముక్కణ్ణన్. <మూ-+కన్ను+-ఇ[9]. **ముక్కంటి**[2] వి. మూడు కుంటల భూపరిమాణం. E.I. 4?. <మూ-+కుంట+-ఇ[9]. **ముక్కంటిచుక్క** వి. ఆర్ద్రానక్షత్రం. **ముక్కంటిచెలి** వి. కుబేరుడు, త్ర్యంబకసఖుడు. **ముక్కంటితల** వి. శివుని తల. **ముక్కంటితలపువ్వు** రూ.చూ. ముక్కంటితలపూవు. వి. చంద్రుడు. **ముక్కంటితలపూవు** రూ. ముక్కంటితలపువ్వు. వి శివునిసిగపువ్వు, చంద్రుడు. **ముక్కంటితొలిపట్టి** వి. వినాయకుడు, శివుని మొదటి కుమారుడు. **ముక్కంటిపట్టి** వి. **1**. గణపతి ; **2**. కుమారస్వామి, వ్యు. శివకుమారుడు. **ముక్కంటిపండు** వి. కొబ్బరికాయ. మూడుకన్నులుగల పండు. ప్రబంధ. 163. **ముక్కంటిపండుచెట్టు** వి. కొబ్బరి చెట్టు. **ముక్కంటిపండులమెక్కెడుదిండీఁడు** వి. వినాయకుడు. **ముక్కంటిపేరిటికన్నులు** వి.బ.వ. రుద్రాక్షలు. **ముక్కంటిమల** వి కైలాసం. చంపూరా. 5.56. **ముక్కంటిమామ** వి. హిమవంతుడు, శివునిమామ. **ముక్కంటిమావు** వి నంది, శివవాహనం. **ముక్కంటియమ్ములపొది** వి. సముద్రం, త్రిపురాసురసంహార సందర్భంలో సముద్రం శివుడికి అమ్ములపొది అయ్యింది. **ముక్కంటియావు(-ఆవు)** వి. **1**. ఆచ్చుబెద్దు ; **2**. నందీశ్వరుడు. **ముక్కంటియిల్లు(-ఇల్లు)** వి. కైలాసం, శివుని నివాసం. **ముక్కంటివలిగట్టు** వి. కైలాసం. **ముక్కంటివాల్గంటి** వి. పార్వతి, భవాని. మను. 6.58. **ముక్కంటివిల్లు** వి. బంగారుకొండ, మేరుపర్వతం, శివుని ధనువు. **ముక్కంటివెలఁది** వి. పార్వతి. **ముక్కంటి సంగాతి** వి. కుబేరుడు, శివుని మిత్రుడు. **ముక్కంటిసుడి** రూ.చూ. ముక్కాణిసుడి. వి. **1**. నొసటి మీద పైన ఒకటి కింద రెండుగా ఉన్నసుళ్ళు ; **2**. నొసట మూడో కన్ను లాగా ఉన్న సుడి. ఈ లక్షణం ఉన్న పశువు పవిత్ర మైనది. **ముక్కంటిసొమ్ము** వి. పాము, శివాభరణం. వేంక. ఆం. 102. **ముక్కనుమ** వి. కనుమ పండుగకు మర్నాడు. <మూ-+కనుమ. **ముక్కనుసామి** వి. ముక్కంటి, శివుడు. అచ్చ.బా. **4.59** పు. **ముక్కన్ను** వి. **1**. మూడుకన్నులు. పండి.స. 1.73 పు. వీర. వి. 2 182 ; **2**. మూడోకన్ను. <మూ-+కన్ను. **ముక్కన్నుసుడి** రూ.చూ. ముక్కాణి సుడి. వి. **1**. నొసటి మీద పైన ఒకటి కింద రెండుగా ఉన్న సుళ్ళు ; **2**. నొసట మూడోకన్నులాగా ఉన్న సుడి (ఈ లక్షణం ఉన్న పశువు పవిత్రమైనది). **ముక్కలి** వి. ముక్కాలిపీట. విప్ర. 4.82. <మూ-+కాలు[2]+-ఇ[9]. **ముక్కలిపీఁట** రూ. ముక్కాలిపీట. వి. మూడు కాళ్ళమర్చిన ఎత్తుబల్ల. యయా. **4.93**. **ముక్కాఁక** వి. గొప్పతాపం. ప్రభు. **4.135** పు. **13** పం. మూడుకాకల సమూహం. <మూ-+కాఁక. **ముక్కాఁకయగు(-అగు)** అ.క్రి. మిక్కిలి కష్టమగు. వర.రా.యు.పు. 311 పం. 16. **ముక్కాఁకల నాటితేఱు** అ.క్రి. మిక్కిలి సమర్థుడగు, అత్యంత ప్రవీణుడగు. జైమినిభా. 1.87. **ముక్కాఁకలఁదేఱు** అ.క్రి. మిక్కిలి సమర్థుడగు. భాస్క.రా.యు. 817. <మూ-+కాఁక+-లు+-అ[7]+తేఱు. **ముక్కాకలుతీరినవాఁడు** విశ. మూడు మారులు కాల్చబడి గడిదేరినవాడు. అనగా అతి సమర్థుడు. **ముక్కాణిసుడి** రూ. ముక్కంటిసుడి, ముక్కన్నుసుడి. వి. **1**. నొసటి మీద పైన ఒకటి కింద రెండుగా ఉన్న సుళ్ళు ; **2**. నొసట మూడో కన్నులాగా ఉన్న సుడి. ఈ లక్షణం ఉన్న పశువు పవిత్రమైంది. **ముక్కాని** వి. మూడుకానులు. ఆం.భా. 2.272. <మూ-+కాను+-ఇ[9]. **ముక్కారు**[1] వి. **1**. మూడుకాలాలు. నె.శా. కావలి. 42, కాశీ. 7.26 ;

2. ముక్కారుపంట, తొలుకారు. < మూ- + కారు[1]. ముక్కారుపంట వి. తొలికారు. ముక్కారు(బండు(-పండు) అ.క్రి. సంవత్సరానికి మూడు పంటలు పండు, సమృద్ధిగా పండు. శుక. 2.145. ముక్కాలిపీ(ట రూ.చూ. ముక్కలి పీ(ట. వి. మూడుకాళ్ళపీట. వైజ 3 74. ముక్కాలు వి. 1. ముప్పాతిక. రాజ వి. 3.65. 2. మూడుకాళ్ళు. < మూ- + కాలు[2]. ముక్కాలుకొయ్య వి. ఆసు పోసిన నూలు మూడు జేనల పొడుగు ఉదనంగా రావటానికి బిగించిన కొయ్య. ముక్కాలుగడియ వి. త్రిపాద ఘటిక. ముక్కాలుదుడ్డు వి. మూడుపైసలు. ముక్కుస రూ. ముక్కుప, ముక్స, ముక్సా. వి. మూడు కుంచాలు. బసవ. 2.433. < మూ- + కుంచము. ముక్కొంకులు వి.బ.వ. మూడు వంకరలు. బసవ. 3.564. < మూ- + కొంకులు ముక్కొటిక వి. త్రిపురాలు. < మూ- + కొటిక. ముక్కొటికగెలుపరి రూ. ముక్కొటిక గెల్పరి. వి. త్రిపురారి, శివుడు. అచ్చ.బా. 4.61 పు. ముక్కొటికగెల్పరి రూ.చూ. ముక్కొటిక గెలుపరి. వి. త్రిపుర జేత, శివుడు. ముక్కొమ్ముమెకము వి. మనుబోతు. < మూ- + కొమ్ము + మెకము. ముక్కొయ్యలు వి.బ.వ. మూడు తునకలు. కు.సం. 11.40. < మూ- + కొయ్యలు. ముక్కోటి వి. వైకుంఠ ఏకాదశి, ధనుర్మాస శుక్ల ఏకాదశి. రాజవా. 1.35. సం కోటి-. సంఖ్యా విశేషం, 100 లక్షలు. < మూ- + కోటి. ముక్కోటికలకంటు వి. శివుడు. ఆం. పదా. 1.10. ముక్కోణంగూడు వి. కమానుగూడు, త్రిభుజాకారంలో ఉండే గూడు సం. కోణ-. మూల. < మూ- + సం. కోణ- + -ము + గూడు. ముక్కోణపుబద్ద రూ.చూ. ముక్కోణంబద్ద. వి. లోగిలింటి వాసాల అంచుమీదగాని కప్పు తడిక అంచుమీదగాని వేసే కోతబద్ద. ముక్కోణ మార్చి వి. ఇరకపుమాను, త్రిభుజాకారంలో ఉండే ఆర్చి. < ముక్కోణము + ఆర్చి. ముక్కోణము వి. త్రికోణం. సం. కోణ-. మూల; క. ముక్కోణవ్ర. మూడుకోణాలు; త. ముక్కోణమ్. < మూ- + సం. కోణ- + -ము. ముక్కోణం బద్ద రూ. ముక్కోణపుబద్ద వి. లోగిలింటి వాసాల అంచు మీదగాని కప్పుతడిక అంచుమీదగాని వేసే కోతబద్ద. < ముక్కోణము + బద్ద. ముక్కోండం వి. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే మూడుకాళ్ళపీట. ముక్కోనంపట్టె వి. ఓడ చౌకట్టులోనిపట్టె. సం. కోణ-. మూల. < మూ- + సం. కోణ- + -ము + పట్టె. ముక్కోల వి. త్రిదండం. భాస్క.రా.అరణ్య. 282. త. ముక్కోల్. త్రిదండం. < మూ- + కోల. ముగ్గడ్డలు వి.బ.వ. 1. మూడుదుంపలు; 2. నీరుల్లి, వెల్లుల్లి, ముల్లంగిదుంపలు. < మూ- + గడ్డ + -లు. ముగ్గుట్ట వి.బ.వ. మూడు గుట్టలు. EI XIV 25. క్రీ.శ. 1548 < మూ- + గుట్ట. ముగ్గోడి వి. పాత్రనిలకటానికి ఆధారంగా పొయ్యికి పైన పెట్టే మూడుగుబ్బలు. < మూ- + గోడి. ముగ్గోరంచు వి. మూడుగీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. < మూ- + గోరు + అంచు[3]. ముంగోరు[1] వి.బ.వ. మూడు కారులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 274. క్రీ.శ. 1290. < మూ- + కారు[1]. ముంగోరు[1] వి. పంటను ఆసామి రెండు భాగాలు, సాగుచేసిన రైతు ఒకభాగం పంచుకొనే పద్ధతి. < మూ- + కోరు[2]. ముచ్చటులు రూ.చూ. ముచ్చట్లు. వి.బ.వ. మూడుప్రదేశాలు. ముచ్చట్లు రూ. ముచ్చటులు. ముచ్చాటులు. వి.బ.వ మూడుప్రదేశాలు. విజ్ఞా. ఆచార 67. < మూ- + చోటు + -లు. ముచ్చంద్దిసీమ వి. మూడు సందులు, ఎల్లలు కలిసినచోట. EI IV 228. క్రీ.శ. 1202. ముచ్చవలము వి. మూడుచవలాలు. < మూ- + చవలము. ముచ్చవుకము రూ.చూ. ముచ్చొకము. విణ. పంద్రెండు. < మూ- + చవుకము. ముచ్చాయలు వి.బ.వ. మూడురంగులు. త్రివర్ణాలు. కువ.చ. 2.42. < మూ- + చాయ + -లు. ముచ్చాలింపు వి. మూడోసారి దున్నటం. < మూ- + చాలు + -ఇంపు. ముచ్చాలు వి. మూడోసారి దున్నటం. < మూ- + చాలు. ముచ్చాలుదుక్కి వి. మూడోసారి దున్నటం. ముచ్చిచ్చు వి. 1. గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని అనే యజ్ఞంలోని అగ్నిత్రయం. భార. భీష్మ. 2.277 : 2. ముక్కాక. భాగ. 9.47. < మూ- + చిచ్చు. ముచ్చిచ్చుననువేగు అ.క్రి. ఆందోళనచెందు, నిప్పులపైనున్నట్లు అగు. పాండు. 4.149. ముచ్చిముమ్మాటికి అవ్య.క్రదు. తప్పనిసరిగా మూడుసార్లు. ముచ్చిమూ(డు మాటలు వి.బ.వ. మూడుముక్కలు. సంగ్రహం. ముచ్చివుక వి. ముద్దుగులం, మూడు పావలాలు; వరహాలో 14వ వంతు. < మూ- + చివుక. ముచ్చుట్టు వి. మూడుచుట్టులు. హరి.ఉ. 10 233. < మూ- + చుట్టు. ముచ్చుట్లుసుట్టు స.క్రి. మూడుసార్లు ప్రదక్షిణంచేయు. పండి.చ. 1.1.175. < ముచ్చుట్టు + -లు + చుట్టు. ముచ్చెమటలు పోయు అ.క్రి. అతిగా చెమటలు పట్టు. మూ- + చెమట + -లు + పోయు. ముచ్చెలక వి. దుగులముబేడ, నాలుగణాలు. < మూ- + చెలక, ముచ్చెవక వి. మూడుపావలాలు. < మూ- + చెవక. ముచ్చోటులు రూ చూ. ముచ్చట్లు. వి.బ.వ. మూడు ప్రదేశాలు, పాదాలు, హస్తాలు, ముఖం. విజ్ఞా. 1.79. < మూ- + చోటు + -లు. ముచ్చౌకము సర్వ. మూడు నాలుగులు, పన్నెండు. అచ్చ రా. కిష్కిం. 23. < మూ- + చౌకము. ముజ్జగము వి. మూడులోకాలు. శృం.నై. 3.161. సం. జగత్, ప్రపంచం. < మూ- + సం. జగత్ + ము. ముజ్జగములు వి.బ.వ, మూడు లోకాలు. భీమ. 2.16. సం, జగత్. ప్రపంచం. < మూ- + సం. జగత్ + -లు. ముజ్జిడ్డు వి. 1. పెద్దచీకాకు; 2. పెద్దచీకటి < మూ- + జిడ్డు. ముత్తర రూ. చూ. ముత్తరము. వి. 1. మూడుతరాలు; 2. మూడు వరసలు; 3. మూడు పురుషాంతరాలు. ముత్తరంగలు వి. బ. వ. కడుపుమీది త్రివళులు. కు. సం. 6.110. సం. తరంగ-. అల. < మూ- + సం. తరంగ- + -లు. ముత్తరము రూ. ముత్తర, ముత్తెర, మెత్తర. వి. 1. మూడు వరసలు. మను. 4.46 ; 2. మూడు విధాలు. ప్రబంధ. 27 ; 3. మూడు పురుషాంతరాలు. శుక. 2.442. < మూ- + తరము. ముత్తటి[1] వి. కాలత్రయం. అచ్చ.రా.బాల. 117. < మూ- + తటి[1]. ముత్తటి[2] వి. స్త్రీల కడుపుమీద ఉండే మూడుముడతలు, వళిత్రయం. అని. 2.56. < మూ- + తటి[3]. ముత్తల వి. మూడుచోట్లు. < మూ- + తల(ము). ముత్తాటిపండుదిను అ.క్రి. చిరకాలం జీవించు.

పాండు. 4.267. **ముత్తాడు** వి. 1. తనునాటిన తాటిటెంక నుంచి మొలచిన తాటి టెంకనుంచి పుట్టిపెరిగిన తాటిచెట్టు. పాండు 4.267 ; 2. మూడుతరాల తాటిచెట్టు. < మూ- + తాడు. **ముత్తిక²** రూ. ముత్తిగ. వి. మూడుముఖాలు. వర.రా.యు. పు. 147. పం. 10. < మూ- + తిగ. **ముత్తిగ** రూ.చూ. ముత్తిక². నం. తొమ్మిది. రసిక. 3.47. **ముత్తునియ** వి.బ.వ. మూడుముక్కలు. భార.ద్రోణ. 1.353. < మూ- + తునియ. **ముత్తునియలు** వి.బ.వ. మూడుముక్కలు. కు.సం. 11.193. < మూ- + తునియ + -లు. **ముత్తుము** రూ. ముత్తూము. వి. 1. పన్నెండు కుంచాల ధాన్యపుమానం, ఆఢకత్రయం. ద.హిం.శా. 4.1016 ; 2. ముప్పై కుంచాల భూపరిమాణం, మూడుఎకరాలు. < మూ- + తూము². **ముత్తూము** రూ.చూ. ముత్తుము. వి. 1 ధాన్యంకొలత, 3 తూములు ; 2. భూమికొలత 30 కుంటలు, 3 ఎకరాలు. **ముత్తెరువులాఁడి** వి. ఆకాశగంగ, మూడుమార్గాలుగలది. < మూ- + తెరువు + -లు + -ఆఁడి. **ముత్త్రోవ** వి.బ.వ. మూడు తోవలు. < మూ- + త్రోవ. **ముత్త్రోవద్రిమ్మరి(-త్రిమ్మరి)** వి. గంగానది, త్రిపథగ. ఆం.నా.నం.దేవ. 31, < మూడు + త్రోవలు + త్రిమ్మరి. **ముద్దుగల కాళ్లపురుగు** వి. షట్పదం, తుమ్మెద. < మూ- + దుగల + కాళ్లపురుగు. **ముద్దుగల తల్లుల బిడ్డఁడు** వి. కుమారస్వామి, షాణ్మాతురుడు. < మూ- + దుగుల + తల్లుల బిడ్డఁడు. **ముద్దుగలము** రూ. ముద్దుగులము. వి. ఆరుబేడలు. < మూ- + దుగలము. **ముద్దుగులము** రూ. చూ. ముద్దుగలము. వి. మూడు దుగలాలు, పన్నెండణాల. **మున్నూర్ద్వురు** సర్వ. మూడువందలమంది, త్రిశత సంఖ్యాకులు. ద.హిం.శా. సంపు. 4. శా.నం. 989. < మూ- + నూర్వ్వురు. **మున్నూఱు** సర్వ.ఔ. మూడు వందలు, త్రిశతి. భార. ఆది. 1.65. క. మున్నూఱు. మూనూఱు. మూడువందలు ; కొడ. మున్నురి. మూడు వందలు ; తు. మున్నూరు. మూడువందలు ; త. మున్నూఱు. మూడువందలు ; మ. మున్నూఱు. మూడు వందలు ; కో. ము.ను.ర్. మూడువందలు ; తొ, ము-ను.ర్. మూడు వందలు. < మూ- + నూఱు² **మున్నూలు** విణ. మూడు నూలులు కలది, మూడు పోగులు చేర్చి నేసినది. రంగా. చ. 2.10. < మూ -+ నూలు¹. **ముప్పక్కజెముడు** వి. పెద్దజెముడుచెట్టు (Euphorbia tortilis). < మూ - + పక్క + జెముడు. **ముప్పటికమ్మి** వి. మూడు పట్టెలుగా నేసిన కమ్మి. < మూ- + పట్టి + కమ్మి. **ముప్పంద్రు** సర్వ. బ.వ. ముప్పైమంది, ముప్పదికి మహన్మహత్యర్థక బహువచనాంబాదేశం. భార. సభా. 2.121, ద. హిం. శా. సంపు. 4. శా.నం. 1248. త. ము. ప్పతు. ముప్పయ్ ; మ. ముప్పతు. ముప్పయ్ ; కో. ముప్పద్. ముప్పయి రోజులు ; తొ. ముపాథ్. ముప్పయ్, ముప్పయ్‌రోజులు ; కుఇ. ముపట్టు. పన్నెండు డజన్లకి మూడురెట్లు. **ముప్పదార్గురు** రూ.చూ. ముప్పదాఱుగురు. సర్వ.ఔ. ముప్పైఆరు మంది. < ముప్పది + అర్గురు. **ముప్పదాఱు** సర్వ. ముప్పై ఆరు. భార. ద్రోణ. 2.208. < ముప్పది + ఆఱు. **ముప్పదాఱుగురు** రూ. ముప్పదార్గురు, ముప్పదియాఱుగురు, సర్వ. ముప్పైఆరుమంది. ఉ.రా. 4.289, < ముప్పది + ఆఱుగురు. **ముప్పది** రూ. ముప్పయి. ముప్పై. సర్వ.ఔ. మూడుపదులు. ద.హిం.శా. 4. 1015, భార ఆరణ్య. 201. త. ముప్పత్తు. ముప్పై < మూ- + పది. **ముప్పదితిప్పలుపెట్టు** అ.క్రి. నానా కష్టాలుపెట్టు. **ముప్పదిపాట** రూ.చూ. ముప్పదివాట. వి. మూడుపదుల సంఖ్యగల పాటలు. **ముప్పదియాఱుగురు** రూ. చూ. ముప్పదాఱుగురు. సర్వ. ముప్పైఆరుమంది. **ముప్పదియాఱేండ్లది** విణ. 1. మిక్కిలి ఇచ్ఛగలది ; 2. ముప్పైఆరేళ్ళ వయస్సు గలది. **ముప్పదిరెంటిగుంపు** వి. ముప్పైరెండుచుక్కలున్న నక్షత్రం, రేవతీనక్షత్రం. **ముప్పదిరెండాయుధములు** వి. బ. వ. బాణం, కటాం, తోమరం మొ. ముప్పైరెండు ఆయుధాలు. సం. ఆయుధ-. కత్తి మొ. యుద్ధపరికరాలు. < ముప్పది + రెండు + సం. ఆయుధ- +- ము +- లు. **ముప్పది రెండువేళలు** వి.బ.వ. ఎల్లప్పుడు, అన్నిసమయాలు. తాళ్ల. నం. 9.170. **ముప్పదివాట (-పాట)** రూ. ముప్పదిపాట. వి. మూడుపదుల సంఖ్యగల పాటలు. ద్వి. పరమ. వి. 3.231పు. **ముప్పందుము** రూ. ముప్పన్నుం. వి. ముప్పైతూముల ధాన్యం. < మూ- + పందుము. **ముప్పన్నుం** రూ.చూ. ముప్పందుము. వి. 1. ధాన్యం కొలత. 30 తూములు ; 2. భూమికొలత, 480 కుంటలు లేదా 12 ఎకరాలు, 300 కుంటలు లేదా, $7\frac{1}{2}$ ఎకరాలు, 480 మానికలు లేదా 30 ఎకరాలు. **ముప్పయి** రూ.చూ. ముప్పది. సర్వ. మూడుపదులు. **ముప్పరువునేల** రూ.చూ. ముప్పర్వునేల. వి. మూడుకోసుల దూరం. **ముప్పర్వునేల** రూ. ముప్పరువునేల. వి. మూడుకోసుల దూరం. ఆం.భా. 2.7. < మూ- + పరువు + నేల. **ముప్పాతిక** వి. ఒక వస్తువులోని నాలుగు భాగాల్లో మూడుభాగాలు, మూడు పాతికలు. రత్న. 54. ఆం. భా. 2.272. < మూ- + పాతిక. **ముప్పావు** వి. ఒకవస్తువులోని నాలుగువంతుల్లో మూడువంతులు, మూడుపావులు. < మూ- + పావు. **ముప్పావులా** వి. ఒకరూపాయిలో నాలుగో వంతులో మూడువంతులు, మూడుపావులాలు. < మూ- + పావులా. **ముప్పిడి¹** వి. మూడుపిడులుకలబాకు, కటారి. వరాహ. 4.86, గా. హరి.ఉ. 8 ; విణ. దీర్ఘం, పెద్దది. ద్వి. పరమ. వి. 2.94. < మూ- + పిడి¹. **ముప్పిర** వి. 1. మూడు పిరలు ; 2. కానీలో మూడోవంతు. < మూఁడు + సిర. **ముప్పిరి.** రూ. ముప్పురి, వి ముప్పేట, త్రిసూత్రి. భార. < మూ- + పిరి. **ముప్పిరిగొను (-కొను)** రూ. ముప్పురిగొను. అను. 1.376. అ.క్రి. 1. పెనుగొను. చుట్టుకొను పండి. చ. 1.2.284పు ; 2. మూడుపిరులుగా పెనగొను. భార. విరా. 3.220 ; 3. అతిశయించు. రం.రా.యు. 361పు. 15 పం. **ముప్పిరిగొల్పు (-కొల్పు)** రూ.చూ. ముప్పురిగొల్పు. స.క్రి. మూడు పిరులు కలిగేటట్లు చేయు, త్రిగుణితంచేయు. బసవ. 7-319 పం. **ముప్పిరిచేప** వి. ఒకరకం చేప. **ముప్పిరివడు (-పడు)** అ.క్రి. మూడు దొంతర్లుగాపడు. కు.సం. 12.27. **ముప్పిరివడ్డి** వి. మూడురెట్లువడ్డి. తాళ్ల.నం. 5.330. ముప్పురి

రూ.చూ. ముప్పిరి. విణ. మూడుపేటలుకలది, త్రిసూత్రం. బిల్హ. 3.73 ; వి. 1. మూడు మెలికలు ; 2. మూడుపోగులు కలిపి పురిపెట్టిన నూలు. ముప్పిరిఅతుకు వి. అచ్చుతికే టప్పుడు రెండుపోగులు కొలికి వేసి మరొకపోగు కొలికిలోకి దూర్చి అతకటం. ముప్పిరిగొను(-కొను) రూ.చూ. ముప్పిరి గొను. అ. క్రి. మూడుమెలికలు కలదగు. చంద్రికా. 2.18. ముప్పిరిగొల్పు(-కొల్పు) రూ. ముప్పిరిగొల్పు. స.క్రి. మూడు పురులతో తాడుపేను. బసవ. 7.190. ముప్పిరిజొన్న వి. ఒకరకం జొన్న. ముప్పిరిదారం వి. మూడుపోగులకు పురి పెట్టిన దారం. ముప్పిరిసద్ద వి. కంకిమూడు మెలికలుతిరిగి ఉండేరకం. ముప్పురుటాలు వి. జొ. పురుటి మూడవనాటి బాలింతరాలు. పి. శకు. 4.62. <మూ-+పురుడు +-ఇ[3] + ఆలు. ముప్పూ(ట వి. మూడు పూటలు. బసవ. 2.109పం. <మూ-+పూ(ట. ముప్పెట్టు వి. మూడు చుట్లు. <మూ-+పెట్టు. ముపెట్టువెట్టు (-పెట్టు) అ.క్రి. స.క్రి. మూడుచుట్లుతిరుగు. పండి. చ. 1.41పు. ముప్పేట[1] విణ. మూడుపేటలుకలది. సమీర 2.222 : వి. త్రిసూత్రి. ఆం. భా. 2.295. <మూ-+పేట. ముప్పేట[2] విణ. కొంతవరకు ముదిరినది (కొబ్బరికాయ). ముప్పేటకమ్మి వి. మూడు పట్టెలు వరసగా నేసిన కమ్మి. < మూ- + పేట + కమ్మి. ముప్పేటపేరు ని. త్రిసరం. <మూ-+పేట+పేరు. ముప్పేటలాడు అ.క్రి. సంతో షంతో ఉప్పొంగు. మృత్యు. 3.19. <ముప్పేట+-లు+ఆడు. ముప్పై రూ.చూ. ముప్పది. వి. ముప్పది. ముప్పొం రూ.చూ. ముప్పోగు. వి. మూడుపోగుల దారం. ముప్పొంగు అ.క్రి. ఉప్పొంగు, మూడుపొంగులు పొంగు. ద్వి. సార. చ. 3.343పం. <మూ-+పొంగు. ముప్పొ త్తులు వి.బ.వ. 1. త్రిరావృత్తమైన సంబంధం, మూడు కలయికలు ; 2. అశ్రద్ధ. ముప్పొద్దులు వి.బ.వ. మూడు పూటలు. <ము- + ప్రొద్దు+-లు. ముప్పోకల(బోవు అ.క్రి. మూడుమార్గాల్లో తిరుగు. <మూ-+ పోక+ లు+-అ[7]+పోవు. ముప్పోకలా(డు విణ. త్రిగుణాత్మకుడు, మూడుతోవలు తొక్కినవాడు. భాగ. 10ఉ. 791. <మూ-+పోక +- లు+- అ[1]+వా(డు. ముప్పోకలు వి.బ.వ. ఎక్కువతోవలు. భాగ. 8.552. <మూ-+ పోక+-లు. ముప్పోగు రూ. ముప్పొం, మూటపోగు. వి. మూడుపోగులదారం. <మూ-+ పోగు. ముప్రొద్దు వి. మూడుపూటలు. బసవ. 5.909పం. <మూ- + ప్రొద్దు. ముప్రోళ్లు వి.బ.వ. త్రిపురాలు. పండి. చ. 3.225. పు. <మూ-+ప్రోలు+-లు. ముబ్బడి రూ.చూ. ముమ్మడి. విణ. మూడురెట్లున్నది, త్రిగుణితం. <మూ-+-బడి[1]. ముబ్బడించు రూ.చూ. ముమ్మడించు. అ.క్రి. మూడురెట్లు కలదగు. <ముబ్బడి +-ఇంచు[3]. ముబ్బాగ మంచు వి. చీరవెడల్పులో మూడోవంతు మేరకు నేసిన అంచు. <మూ- + భాగము + అంచు[3]. ముబ్బాములు వి.బ.వ. పెక్కుకష్టాలు. భాస్క. రా. యు. 820. <మూ-+బాము-+లు. ముబ్బాసవాల్గీము వి. సూర్యుడు, త్రయీతనువు. ఆం. పదా. సుర. 21. ముబ్బేడ వి. మూడుబేడలు. <మూడు-+బేడ. ముమ్మడి రూ. ముబ్బడి. విణ. 1. మూడురెట్లు కలది, త్రిగుణితం, మూడోది. వలి వేరు. శాసనం. క్రీ.శ. 1043 ; భోజ. 1.33 ; 2. కలసిచేసినది. < మూ-+ మడి[3]. ముమ్మడిగొను (-కొను) అ. క్రి. మూడురెట్లు కలదగు, మూడు మడుగులు కలదగు. నవనాథ. 1.26పు. 10పం. ముమ్మడించు రూ. ముబ్బడించు. అ.క్రి. ముమ్మడిగొను, ముమ్మడగు, మూడుపొర్లతోకూర్చు. తాళ్ల. సం. 12.237. <ముమ్మడి +-ఇంచు[3]. ముమ్మడినలుమడివాసి వి. మూడింతలు, నాలుగింత లెక్కువ. ప్రభా. 3.118. ముమ్మడు(గు వి. మూడురెట్లు. భార. ఆది. 1.81. <మూ-+మడు(గు. ముమ్మఱు రూ.చూ. ముమ్మాఱు. వి. మూడుపర్యాయాలు. రేప-అ-101. ముమార్మ రూ. చూ. ముమ్మాఱు. వి. మూడుసార్లు. ముమ్మాఱు రూ. ముమ్మఱు, ముమ్మారు. వి. మూడుపర్యాయాలు, మూడుతడవలు భార. అను. 3.284. <మూ-+మాఱు. ముమ్మాసములు వి.బ.వ. మూడునెలలు. జైమినిభా. 8.99. సం. మాస-. నెల. <మూ-+సం. మాస- +- ము +- లు. ముమ్మూ(డు సర్వ. మూడుముళ్ళు, తొమ్మిది, త్రిరావృత్తమైన త్రిసంఖ్య. హరి. ఉ. 8.105. <మూ- + మూ(డు. ముమ్మూల వి. మూడు కోణాలు కలది. ఉ.హరి. 2.122. <మూ+మూల[2]. ముమ్మూలలా వి. మూడు మూలలుకల రత్నం. ఉ.రా. 6.127. ముమ్మొన వి. 1. మూడు మొనలు. పండి.చ. 4.259 పు. ; 2. మల్లవిద్యా విశేషం. హంస. 1.206 ; విణ. మూడు మొనలు కలది. <మూ-+మొన. ముమ్మొనకత్తి వి. 1. మూడు మొనలు కల కత్తి ; 2. త్రిశూలం. ముమ్మొనకత్తిజోదు వి. శివుడు. ముమ్మొనకైదువు వి. మూడు మొనలు కల ఆయుధం, త్రిశూలం. ఉ.రా. 7.38. ముమ్మొనయడిదంపుసామి వి. త్రిశూలం ఆయుధంగా కల ప్రభువు, శివుడు. ముమ్మొన యలు(గుమేటి వి. త్రిశూలం ఆయుధంగా కలవాడు, శివుడు. ముమ్మొనవాలు వి. త్రిశూలం. నీలా. 1.13, ఉ.రా. 7.143. ముమ్మొనవాలుదంట రూ. ముమ్మొనవాల్దంట. వి. త్రిశూలం ఆయుధంగా కల యోధుడు, శివుడు. ముమ్మొనవాలుదాలువు రూ.చూ. ముమ్మొనవాలుదాల్పు. వి. శివుడు. ముమ్మొన వాలుదాల్పు రూ. ముమ్మొనవాలుదాలువు. వి. త్రిశూల ధరుడు, శివుడు. ఆం.నా.సం.దేవ. 6. ముమ్మొనవాల్దంట రూ.చూ. ముమ్మొనవాలుదంట. వి. శివుడు, త్రిశూలం ధరించినవాడు. ముమ్మోటు విణ. మిక్కిలి మోటువ్యక్తి. < మూ- + మోటు. ముయ్యగ్గి వి. అగ్నిత్రయం, త్రేతాగ్నులు. <మూ-+అగ్గి. ముయ్యంచు వి. 1. వస్త్ర విశేషం. సిం.ద్వా. 3.206 ; 2. మూడంచులు, మూడు మూలలు. <మూ- + అంచు[3]. ముయ్యంచుతుంగ వి. మూడంచులతుంగ. భార. మౌసల. 54. ముయ్యడ వి. ఆరు మానికలు. ఆం.భా. 2.270. < మూ- + అడ్డ. ముయ్యనికట్టు రూ. ముయ్యలికట్టు, ముయ్యెలగట్టు. వి. మూడు ఎల్లలు కలిసిన తావు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1255. నందంపూడి శాసనం. క్రీ.శ. 1054. ముయ్యందము

విణ. మూడందాలు కలది. నిర్వ.రా. 8.62. <మూ-+అందము. ముయ్యలి వి. మూడు ఎల్లలు. వేములూర్వాడు కానసం. క్రీ.శ. 945-70. <మూ-+ఎల్ల. ముయ్యలికట్టు రూ.చూ. ముయ్యనికట్టు. వి. మూడు ఎల్లలు కలిసిన తావు. ముయ్యాకుపొన్న రూ. ముయ్యాకు(బొన్న. వి. త్రిపర్ణిక, ఒకరకం చిన్నచెట్టు. హంస. 4.10 (Pseudarthria viscida). <మూ- + ఆకు + పొన్న. ముయ్యాకు(బొన్న (-పొన్న) రూ.చూ. ముయ్యాకుపొన్న. వి. ముప్పంచాకు, సాలపర్ణి. ముయ్యాలు సర్వ. పద్దెనిమిది. భాస్క.రా.యు. 1076. <మూ-+ఆఱు. ముయ్యాడు విణ. మూడు వయస్సులు కలవాడు, యువకుడు, యౌవనవంతుడు. పాండు. 4.261. <మూ-+ఈడు. ముయ్యూరు వి.బ.వ. గ్రామత్రయం, మూడు ఊర్లు. కాశీ. 7.192. <మూ-+ఊరు. ముయ్యెర[1] వి. నీలి కూసం విడిచిన తరవాత పది రోజులకు దసలి పురుగు విడిచే కూసం. ముయ్యెలగట్ట రూ.చూ. ముయ్యనికట్టు. వి. 1. మూడు గ్రామాల హద్దులు కలిసిన చోటు. కొంకుదురు శాసనం. క్రీ.శ. 1430 ; 2. మూడు దారాలు కలిసిన చోటు. మను. 3.34. ముయ్యేడు సర్వ. ఇరవైఒకటి. భార.ఆది. 1.79. <మూ-+ఏడు. ముయ్యేరు రూ.చూ. ముయ్యేఱు. వి. మూడు మార్గాల్లో ప్రవహించేది. ముయ్యేఱు రూ. ముయ్యేరు. వి. మూడు మార్గాల్లో ప్రవహించేది. గౌ.హరి. ఉ. 4 పం. <మూ-+ఏఱు. ముల్లోకము వి. ప్రపంచం. సం. లోక-. ప్రపంచం. <మూ-+సం. లోక-+-ము. మువ్వ రూ. మూగ[1], మూవీ[2], మొవ్వ[1]. వి. మొనను మూడు సందులుగల పెద్దగజ్జె, కింకిణి. కు.సం. 8.179, ద.హిం.కా.సంపు. 5. శా.సం. 1081, క్రీ.శ. 1132. కొలా. ముజ్గ్. గజ్జె, మువ్వ. చిరుగంట, నూపురంలో గంట. <మూ-+-వ. మువ్వకోడియ రూ. మువ్వకోడె. వి. కాడికి గంతకు కొత్తగా అలవర్చిన ఎద్దు. మువ్వకోడె రూ.చూ. మువ్వకోడియ. వి. మువ్వపసరం. కాడికి గంతకు కొత్తగా అలవర్చిన ఎద్దు. మువ్వగలవన్నె మెకము వి. పెద్దపులి. మువ్వంక విణ. 1. మూడు వంకలు కలది. పాండు. 4.134, ఘటికా. 1.128 ; 2. మూడు వైపులు. తాళ్ల.సం. 7.153. <మూ-+వంక. మువ్వంకపట్టిన వి. త్రిశూలం. నిరంకు. 3.12. మువ్వంకమురుపు వి. త్రిభంగిమలోని అందం, నాట్యంలో నిలబడే ఒక తీరు. పాండు. 4.134. మువ్వంకమేను వి. త్రిభంగిమ, ముడుచుకొన్న శరీరం. తాళ్ల.సం.పు. 62. మువ్వంచ వి. మూడు పంచలు. భార.ఉద్యో. 1.93 ; విణ. మూడు పంచలు కలది. <మూ-+పంచ. మువ్వంచాకు వి. ముయ్యాకు పొన్న. <మూ-+పంచ+ఆకు. మువ్వంచు వి వృక్ష విశేషం. ద్వి.సా.చ. 2.656 పం. <మూ+వంచు. మువ్వంటులనాడు వి. చిన్నతనం. <మువ్వంటులు+-అ[7]+ఆడు. మువ్వంటులు వి.బ.వ. నెలపురుడు. హరి.పూ. 8.58. <మూ-+అంటు+-లు. మువ్వదోనె వి. అడుగున ఒంటి పలకగల దోనె. మువ్వన్నియవేల్పు వి. సూర్యుడు. ఘటికా. 2.134. <మూ-+వన్నియ+వేల్పు. మువ్వన్నె విణ. మూడు రంగులు కలది. హర. 5.55. మువ్వన్నెకాఁడు వి. సూర్యుడు. మువ్వన్నెమెకము రూ. మువ్వన్నెమెగము. వి. పులి, మూడు రంగులుకల జంతువు. కాశీ. 2.146. మువ్వన్నెమెగము రూ.చూ. మువ్వన్నెమెకము. వి. పులి, చిత్రకాయం. మను. 1.59. మువ్వన్నెవిల్లు వి. ఇంద్రధనుస్సు. పాండు. 4.35. మువ్వపసరము వి. కాడికి గంతకు కొత్తగా అలవర్చిన ఎద్దు. మువ్వీసము వి. 1. రూపాయిలో పదహారు భాగాల్లో మూడు భాగాలు. ఆం.భా. 2.272 ; 2. ఒక వస్తువులోని పదహారు భాగాల్లో మూడు భాగాలు. <మూ-+వీసము. మువ్వెట్టి వి. మూడు రకాలైన కూలిలేని సేవలు. భాస్క.రా.యు. 54. <మూ-+వెట్టి. మువ్వెట్టిగొను (-కొను) స.క్రి. వెట్టిచాకిరి చేయించుకొను, దాసులుగా చేసుకొను. పండి.చ. 2.1. 119పు. మువ్వెత వి. మూడురకాలైన బాధలు. గౌ.హరి.ఉ. 1264పం. <మూ-+వెత. మువ్వెలుఁగు వి. 1. సూర్యుడు. కళ్త్వ. 3.85 ; 2. త్రేతాగ్నులు, మూడగ్నులు. విజయ. 3.177. <మూ-+వెలుఁగు. మువ్వేలుపులయిక్క రూ.చూ. మువ్వేల్పుటిక్క. వి. సూర్యుడు. అచ్చ.రా.బాల. 182. <మూ-+వేలుపులఇక్క. మువ్వేలుపులు వి.బ.వ. త్రిమూర్తులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. <మూ-+వేలుపు+-లు. మువ్వేల్పుటిక్క రూ. మువ్వేలుపులయిక్క. వి. సూర్యుడు. ముకుంద. 1.34 పు. 2 పం. <మూ-+వేల్పు+ఇక్క. మూనాళ్లు రూ.చూ. మూనాళ్ళు. వి.బ.వ. మూడు రోజులు. సమీర. 3.173. మూనూరు రూ. మూనూఱు. సర్వ. మూడువందలు. పాలపట్టు శాసనం. క్రీ.శ. 8వ శతాబ్ది. మూనూఱు రూ.చూ. మూనూరు. సర్వ. మూడు వందలు. మాలెపాడు శాసనం. క్రీ.శ. 971. మూవంకలు వి.బ.వ. అన్నివిధాలు. తాళ్ల.సం. 10.47. మూవరుస వి. మూడు పంక్తులు. తాళ్ల.సం 10.31.

**మూకగీతలు** వి.బ.వ. ఒక నమూనాకోసం గీసిన గీతలు.

సం. మూక-. మూగవాడు, దీనుడు, చెడ్డ స్థితిలో ఉన్నవాడు.

<సం. మూక-.+గీఁత+-లు.

**మూకంచు** వి. 1. చిన్న పట్టె మాదిరిగా నేసిన మామూలంచు ; 2. బోడంచు, గుండంచు.

సం. మూక-. మూగవాడు, దీనుడు, చెడ్డ స్థితిలో ఉన్నవాడు.

<సం. మూక-+అంచు[3].

**మూకట** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టిపళ్ళెం.

మూకటరాయి రూ. మూకిట్రాయి, మూకుడ్రాయి, మూకుల్లరాయి. వి. మూకట్లు నర్సటానికి వాడే రాయి.

**మూకటి** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టిపళ్ళెం.

**మూకడు** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టిపళ్ళెం.

**మూకాలతీగ** వి. ఒకరకం కలుపుమొక్క.

నం. మూక-. మూగఅయిన, దీనమయిన, చెడ్డస్థితిలో ఉన్న.

< నం. మూక- + -ము + -బు + అ[11] + తీఁగ.

**మూకిజాడి** వి. నలుపురంగులో ఉన్న ముదురుగొఱ్ఱె ఉన్నితో నేసిన గొంగడి.

**మూకిఱ్ఱాయి** చూ. మూకిడి.

**మూకిడి** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టిపళ్ళెం.

**మూకిఱ్ఱాయి** రూ.చూ. మూకటరాయి. వి. మూకట్లు సర్పటానికి వాడేరాయి.

**మూకుటు** రూ.చూ. మూఁకుడు. వి. మూతగా వాడే మట్టి పాత్ర.

**మూకుడి** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టి పళ్ళెం.

**మూకుడిచిప్ప** రూ.చూ. మూఁకుడుచిప్ప. వి. గుండ్రంగా చిప్పలాగా ఉండే మట్టి మూకుడు.

**మూకుఱ్ఱాయి** చూ. మూఁకుడు.

**మూకుల్లరాయి** చూ. మూఁకుడు.

**మూకొడి** చూ. మూఁకొను. వి. పొగడచెట్టు, సువాసనగల చిన్న గుండ్రని పూలుపూసే చెట్టు (Schrebera scirietenioides).

**మూకొను** రూ.చూ. మూఁకొను. స.క్రి. వాసనచూచు. తాళ్ల. సం. 18.529.

**మూగ**[1] రూ.చూ. ముప్వ. వి. ఎద్దు మొ. వాటి మెడ పట్టెడకు వేసే పెద్దసైజు గజ్జె.

**మూగకోడె** వి. మదించిన కోడె.

**మూగ**[2] రూ. ముగ. వి. అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు.

నం. ముఖ-. మోము.

**మూగఎంటి** వి. అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు. **మూగసరి** వి. అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు. **మూగసరిఅతుకు** వి. అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు. **మూగాసు** వి. మూగపడుగు పోసే అసు.

< మూగ[2] + ఆసు.

**మూగట** రూ.చూ. మూఁకుడు. వి. పాత్రలమీద మూతగా వాడే మట్టిపాత్ర.

**మూగటి** రూ.చూ. మూఁకుడు వి. పాత్రలమీద మూతగా వాడే మట్టి పళ్ళెం.

**మూగబంతి** చూ. మూగ[2]. వి. క్రొరబంతి, తడిసిన కళ్ళం గట్టిపడేట్టు తొక్కించటానికి కట్టిన బంతి.

**మూగాము** చూ. మూఁగ[1]. వి. విడవకుండా మబ్బుకప్పి వానకురవని స్థితి.

**మూగారు** రూ.చూ. ముక్కారు[2]. వి. చిమ్మెట, మోట తొండం చివర వేసిన రంధ్రం.

**మూగాసు** చూ. మూగ[2].

**మూగినేత** రూ.చూ. ముంగినేత. వి. **1.** రెండుమూడు రంగులు కలిపి నేసిన గడినేత ; **2.** నిలువుకు పెట్టినన్ని రంగులు పేకకు కట్టి నేసిన ఒకరకం నేత.

**మూగీలు** రూ.చూ. మూగేలు. వి. చుంచు.

**మూగురు** రూ.చూ. ముప్వురు. వి.బ.వ. ముగ్గురు.

**మూగేలు** రూ. మూగీలు. వి. గంధమూషిక, చుంచు.

< మూఁగ + -ఏలు.

**మూఁక** చూ. మూఁగు.

**మూఁకగట్టు** చూ. మూఁగు.

**మూఁకగమికాఁడు** చూ. మూఁగు.

**మూఁకలుగట్టు** చూ. మూఁగు.

**మూఁకలుగొను** చూ. మూఁగు.

**మూఁకవిప్పు** చూ. మూఁగు.

**మూఁకసేయు** చూ. మూఁగు.

**మూఁకు** రూ.చూ. మూఁకుడు. వి. మట్టిమూత.

**మూఁకుడు** రూ. మూకట, మూకటి, మూకడు, మూకిడి, మూకుటు, మూకుడి, మూగట, మూగటి, మూఁకు. వి.బొ. **1.** కుండమీద మూయటానికి ఉపయోగించే మట్టిపాత్ర. శరావం. కాశీ. 1.138 ; **2.** మూత. పాండు. **4.231** ; **3.** కదురుకు బిగించిన గిలకలాంటి కొయ్యతునక.

క. ముక్కు. ఒకరకం పాత్ర, కుండ.

< మూఁత + కుడుక.

**మూకుఱ్ఱాయి** రూ.చూ. మూకటరాయి. వి. మూకట్లు సర్పటానికి వాడే రాయి. **మూకుల్లరాయి** రూ.చూ. మూకటరాయి. వి. మూకట్లు సర్పటానికి వాడే రాయి. **మూఁకుడుచిప్ప** రూ. మూకుడిచిప్ప. వి. అన్నం తినటానికి వాడే మూకుడులాంటి మట్టిపళ్ళెం. **మూఁకుడుతూకు** వి. ఇడ్లీచట్టి పైభాగంలోని మూకుడును పట్టుకోటానికి ఉండే మట్టికాడ.

**మూఁకొను** రూ. మూకొను. స.క్రి. వాసనచూచు. పల్నా. 322. తాళ్ల.సం. 7.233.

**మూఁగ**[1] రూ. ముంగ[3], మూఁగి, మూప[1]. విణ. **1.** మాట్లాడలేనివారు. భార.అరణ్య. 1.301 ; **2.** మూగవాడు, మూగది. వసు. **3.134** ; **3** పేగకుండా మిగిలిన ధాన్యం.

నం. మూక-, మూగ ; ప్రా. మూగ- ; అ.మా. మూఅఅ, మూయ, మూయగ- ; పా. మూగ- ; క. మూంగ, మూగ, మూగవాడు ; త. మూంక్కై, మూంక్కైయాన్. మూగవాడు, మూంకర్. మూగవాళ్ళు.

< ప్రా. మూగ-.

**మూఁగకంకులు** వి.బ.వ. గింజలు పట్టని కంకులు. **మూఁగకట్టు** వి. కాశిరాయి కట్టుబడి, చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి. **మూఁగకలలు** వి.బ.వ. వ్యర్థపు కోర్కెలు. **మూఁగచెవిటిముచ్చట** వి. ఎవరికి బోధపడని విషయం. మొల్లరా. పీఠి. **మూఁగదయ్యము** వి. మూకపిశాచం. వాల్మీ. 3.118. **మూఁగదూడ** వి. పాలు విడిచిన దూడ. **మూఁగదెబ్బ** వి. గాయం బయటికి కనుపించకుండ లోపలనే కండ నలిగి బాధపెట్టే దెబ్బ. **మూఁగనోము** వి. మౌనవ్రతం. **మూఁగపోవు** అ.క్రి. **1.** మౌనంతాల్చు, మాట్లాడకుండు ; **2.** ఉపేక్షించు. **మూఁగబిట్టుకోడి** వి. ఒకరకం పుంజు. **మూఁగమొగ్గలు** వి.బ.వ. వికసించని మొగ్గలు. **మూఁగయల్క**

(-అల్క) వి. అలిగి మాటా పలుకూ లేకుండా కూర్చోటం. రాజగో. 2.75. మూఁగరాయి రూ. మోగరాయి. వి. దొంటురాయి, సాధారణంగా పునాదులు నింపటానికి (కొన్నిసమయాల్లో గోడల కట్టుబడికి) వాడబడే చెక్కని రాయి. మూఁగవాఁడు విణ. నాలుకలేనివాడు. మూఁగెండ వి. సూర్యుడు మబ్బుచాటున ఉండి కలిగించే ఎండ. <మూఁగ[1]+ఎండ.

మూఁగ[2] వి. ఒకానొక చెట్టు. పి.శకు. 2.14.

మూఁగ[3] వి. 1. దోమ. గౌ.హరి.పూ. 2060 పం; 2. పక్షి విశేషం. హంస. 3.12.

త. మూక్కన్. పక్షివిశేషం.

మూఁగ[4] చూ. మూవ[1]. వి. 1. మువ్వ. నవనాథ. 4.187 పు. 2 పం.; 2. ఫలహార విశేషం. హంస. 1.105.

పర్జి. మూవ. మువ్వ; కొలా. ముంగె. అందెమువ్వ; నా. ముంగె.

మూఁగతీఁట చూ. మూఁగు.

మూఁగపోఁత చూ. మూఁగు.

మూఁగఁబడు చూ. మూఁగు.

మూఁగఁబాఱు చూ. మూఁగు.

మూఁగవేయు చూ. మూఁగు.

మూఁగి రూ.చూ. మూఁగ[1]. విణ. మూగవాడు.

మూఁగిమూసానమ్మ రూ.చూ. ముంగిమూసానమ్మ. వి. మాటలాడనిది.

మూఁగికొను చూ. మూఁగు.

మూఁగితువాలు చూ. మూఁగు.

మూఁగితువ్వాలు చూ. మూఁగు.

మూఁగినేఁత చూ. మూఁగు.

మూఁగు రూ. మూవు. అ.క్రి. 1. గుంపుగూడు, సంఘీభవించు. భార. ఆది. 4.169; 2. అతిశయించు. భార. భీష్మ. 1.136; 3. వ్యాపించు. ఉ.హరి. 1.147; 4. కవియు. కళా. 3.17; స.క్రి. ఆవరించు, చుట్టుకొను. ఉ.హరి. 4.137; వి. ఒకపొర అచ్చుతికిన పట్టుపడుగు ఒక పంచెల చాపుకుగాని చీరకుగాని సరిపోయే పడుగు.

క. ముకరు, ముక్కరు, ముక్కురు. వచ్చిపడు; త. మూమ్. వ్యాపించు, మూచు, మూత్. ముసురు, వ్యాపించు, మూచు (మూచి). మూగు, పోగుపడటం; గోం. మొఇ. కవియు; గ. మూంగేర్, మూంగిప్ర్. మూగు.

<మూ.ద్రా. *మూయ్-/మూ.

మూఁక వి. 1. సేన, దండు. భార. ఆది. 8.200; 2. సమూహం. వసు. 2.71, త. మూకై. పెద్ద అల్లరిమూక. మూఁకగట్టు(-కట్టు) అ.క్రి. గుంపుగూడు. తాళ్ల.సం. 16-2-85. మూఁకగమికాఁడు వి. విష్వక్సేనుడు, సేనా సమూహాధిపతి. తాళ్ల.సం. 6.64. మూఁకలుగట్టు అ.క్రి. గుంపుగూడు. రం.రా.అరణ్య. 148 పు. 20 పం. మూఁకలుగొను(-కొను) అ.క్రి. సమూహాలుగా ఉండు, గుంపుగూడు. పి.శకు. 2.14. మూఁకవిప్పు విణ. తొలగించేది. ఉ.హరి. 1.131, మను. 4.108. మూఁకసేయు(-చేయు) అ.క్రి. మూగు. రాజగో. 2.14. మూఁగతీఁట వి. దట్టంగా పేలిన తీట. మూఁగపోఁత వి. పొల్లుతో ఉన్న ధాన్యం. ఆం.భా. 2.238, మూఁగఁబడు అ.క్రి. 1. చుట్టుకొను. పారి. 4.5; 2. గుంపుగూడు. నిరంకు. 4.93. <మూఁగు+-అ[7]+పడు. మూఁగఁబాఱు అ.క్రి. మూగు, ఉ.హరి. 4.92. <మూఁగు+-అ[7]+పాఱు[3]. మూఁగవేయు స.క్రి. లోహ సామగ్రి బెజ్జాల్ని సుత్తితో మూత పడేలట్లు కొట్టు. <మూఁగు+-అ[7]+వేయు. మూఁగికొను స.క్రి. చుట్టుకొను, ఆవరించు. ఉ.రా. 3.269. <మూఁగు+-ఇ[11]+కొను. మూఁగితువాలు రూ.చూ మూఁగితువ్వాలు. వి ఒకరకం తువ్వాలు. మూఁగితువ్వాలు రూ. మూఁగితువాలు. వి. ఒక రకం తువ్వాలు. మూఁగినేఁత రూ.చూ. ముంగినేత. వి. 1. రెండు మూడు రంగులు కలిపి నేసిన గడినేత; 2. నిలువుకు పెట్టినన్ని రంగులు పేకకుకూడా పెట్టి నేసిన ఒకరకం నేత.

మూఁగెండ చూ. మూఁగ[1].

మూచూచు స.క్రి. మూర్కొను. ఆఘ్రాణించు, వాసనచూచు. భార. అను. 4.109.

క. మూసు. వాసనచూచు, కొడ. మున్. ముని; తు. మూసుని. వాసనచూచు, గమనించు; త. ముక(-ప్పు-, న్). ముకర్(-వ్-, న్). వాసనచూచు, మూచు; మ. ముకక్క, ముకరుక. వాసనచూచు. ముద్దుపెట్టుకొను; కో. ముత్, ముయ్. వాసనచూచు.

<మూతి+చూచు.

మూచూడ్డానికిలేకుండు అ.క్రి. బొత్తిగా లేకుండు.

మూచూడ్డానికిలేకుండు చూ. మూచూచు.

మూజబాని రూ.చూ. మూజబానీ. విణ. నోటిమాటగా.

మూజబానీ రూ. మూజబాని, మూజమానీ, మూజుమాని, మూజువాణి, మూజువాని, మూజువానీ. విణ. నోటిమాటగా.

హిం.ఉ.అర. ముహ్‌జబానీ. నోటిమాటగా చెప్పే విషయం లేదా సాక్ష్యం;

త. మూజువాతి.

<ఉ. ముఁహ్‌జబానీ.

మూజుమానీ రూ.చూ. మూజబానీ. విణ. నోటిమాటగా.

మూజుమాని రూ.చూ. మూజుబానీ. వి. నోటిమాట.

మూజువాణి రూ.చూ. మూజుబానీ. విణ. నోటిమాటగా.

మూజువాని రూ.చూ. మూజుబానీ. విణ. నోటిమాటగా.

మూజువానీ రూ.చూ. మూజబానీ. విణ. నోటిమాటగా.

మూట వి. 1. సరుకులు పోగుచేసి కట్టిన ముడి. హర. 1.20; 2. పడుగులో అతికిన పేటుపోగులు బిరుగా ఉండటానికి దండెమీదనుంచి వేలాడదీసి చివరకట్టిన బరువు.

క. మూడె. రాగి మొ. కంకులకట్ట, తలగడ, దిండు, మూటె, మొట్టె, మట్టె. తోలుసంచి; తు. మొట్టె. కట్ట; త. మూట్టై. మూట; మ. మూట, మూడ; పర్జి మూట. ధాన్యం వేసుకొనే బుట్ట.

మూటకట్టలుగట్టు(-కట్టు) స.క్రి. కాళ్ళూ చేతులు బంధించి మూటలాగా కట్టు. జైమినిభా. 2.23. మూటకట్టు అ.క్రి. మూటగా కట్టు. శివ.సా. 289; వి. మూటకట్టటం. వి.క్రి.

1.77. మూటకాయ వి. పత్తికాయ పగలని తెగులు. మూటకూడు వి. 1. దారిలో తినటానికి అన్నాన్ని సాదకాలను ఒకటిగానే కట్టిన మూట; 2. శవాన్ని మోసేటప్పుడు దింపుడు కళ్ళందగ్గర పెట్టే అన్నం. మూటఁగట్టుకొను(-కట్టుకొను) స.క్రి. 1. సొగసుగాఉండు; 2. కూడబెట్టుకొను. మూటలు ముడియలు వి బ.వ. మూటాముల్లె. పండి చ. 2.5. 361ప. మూటముల్లె రూ. మూటాముల్లె. వి. మూట మొ. సామాను. మూటలుచూచి పీటలువేయు అ.క్రి. ఉన్న డబ్బును చూచి సత్కరించు. మూటలుమోయు అ.క్రి. కొండేలుచెప్పు. మూటలు వేయువాఁడు విశ. చాడీలు చెప్పేవాడు. మూటాముల్లె రూ.చూ. మూటముల్లె. వి. మూట మొ. సామాను. మూటాయిటిదూది వి. అశాశ్వతం.

మూటం వి. అంచులో మొదటిభాగం, పడుగువైపుది.

మూటపోగు చూ. మూఁడు[1].

మూటబడి చూ. మూఁడు[1].

మూటబిగువు చూ. మూఁడు[1]

మూటము రూ.చూ. ముటము. వి. 1. ముద్దపిడక; 2. వంట చెరకు, కట్టెలు.

మూటాముల్లె చూ. మూట.

ముటాయిటిదూది చూ. మూట.

మూటికిఁ దెగించు చూ. మూఁడు[1].

మూటికి ముడివేయు చూ. మూఁడు[1].

మూటికీ ముమ్మాటికి చూ, మూఁడు[1].

మూటింకం చూ. మూఁడు[1].

మూటిలెక్క పచరించు చూ. మూఁడు[1].

మూటు చూ. మూయు. వి. ఆవం పైకప్పు.

మూడం రూ.చూ. మోడం. వి. మబ్బు ఆకాశంలో తెరలు తెరలుగా కూడుకొని కనపడే నీటిఆవిరి, వానమబ్బు.

మూడమంచు వి. హిమాని, దట్టమైన మంచు, లోకాన్ని మూఢంగా చేసే మంచు. భార. విరా. 5.169.

సం. మూఢ-. తెలివిలేని, మందబుద్ధి.

<సం. మూఢ- + మంచు.

మూడ్లు చూ. మూర.

మూండు రూ.చూ. మూన్ఱు. సర్వ. రెండున్నొకటి. కు.సం. 6.157.

మూఁటికి చూ. మూఁడు[1].

మూఁడంకెవేయు చూ. మూఁడు[1].

మూఁడవకంటికిఁ దెలియకుండ చూ. మూఁడు[1].

మూఁడవకంటివేల్పు చూ. మూఁడు[1].

మూఁడవకన్నుతెఱచు చూ. మూఁడు[1].

మూఁడవకొలము చూ. మూఁడు[1].

మూఁడవకొలముమనిషి చూ. మూఁడు.

మూఁడవచెవిలోఁబడకుండ చూ. మూఁడు[1].

మూఁడవతొలుపల్కు చూ. మూఁడు[1].

మూఁడవమూల చూ. మూఁడు[1].

మూఁడవహస్తము చూ. మూఁడు[1].

మూఁడవహస్తమువారు చూ. మూఁడు[1].

మూఁడాకులతీగ చూ. మూఁడు[1].

మూఁడాకులతీవ చూ. మూఁడు[1].

మూఁడాకులలం చూ. మూఁడు[1].

మూఁడారుగాలాలు చూ. మూఁడు[1].

మూఁడి రూ.చూ. ముడ్డి[5]. వి. ముడ్డి, గుదం. గౌ. హరి. 1204పం.

మూఁడిగాలి రూ. చూ. ముడిగాలి. వి. అపానం. మూఁడిచొచ్చివాతవెడలువాఁడు విశ. కపటి, మోసగాడు. కళా. 2 85. మూఁడిచొచ్చివాతవెళ్లునట్టి అవ్య. అతిఉపాయశాలి (నిరసనలో ఉపయోగించేమాట). కళా. 2.79.

మూణ్టు రూ.చూ. మూన్ఱు. సర్వ. మూడు. వలిచేరుశాసనం. క్రీ.శ. 1043.

మూఁడు[1] రూ.చూ. మూన్ఱు. సర్వ. మూడు. భార. ఆది.1.80.

మూటపోగు రూ.చూ. ముప్పోగు. వి. మూడుపోగుల దారం. మూటబడి వి. మూడుభాగాల దిగుబడి లభించేది. మూటబిగువు వి. త్రపీటాన్ని మోసేగుజ్జు, మూడుకొయ్యల కలగుజ్జు. మూటికిఁదెగించు (-తెగించు) అ.క్రి. అన్నిటికీ తెగించు. మూటికిముడివేయు అ.క్రి. మొండికెత్తు, అన్నిటికీ తెగించు. మూటికీముమ్మాటికి అవ్య. ద్రు. తప్పకుండా. మూటింకం వి. మూడు అంకెలాగ ముడుచుకొని పడుకోవటం. మూటిలెక్కపచరించు అ.క్రి. ముడుచుకొను, మూడంకెవేయు. పాండు 4.5. మూఁటికి అవ్య. దాహానికి. < మూఁడు + -ఇ[3] + కున్. మూఁడంకెవేయు అ. క్రి. ముడుచుకొని పరుండు. < మూఁడు + అంకె + వేయు. మూఁడవకంటికిఁదెలియకుండ అవ్య. ద్రు. ఎవరికీ తెలియకుండా, అతిరహస్యంగా. మూఁడవకంటివేల్పు వి. శివుడు, ముక్కంటి. కాశ. 4.99. మూఁడవకన్నుతెఱచు అ.క్రి. కోపగించు. మూఁడవకొలము వి. వైశ్యకులం. మూఁడవకొలము మనిషి వి. వైశ్యుడు. మూఁడవచెవిలోఁబడకుండ క్రి. విశ. ద్రు. ఇతరులకు తెలియకుండు. మూఁడవతొలుపల్కు వి. సామవేదం. యయా. 2.50. మూఁడవమూల వి. వాయవ్యం. మూడవహస్తము వి. చాదస్తం. మూఁడవహస్తమువారు విశ.బ.వ. వైదికులు. మూఁడాకులతీగ రూ. రూ. మూఁడాకులతీవ. వి. రెమ్మరెమ్మకుమూడేసిఆకులుండే ఒకరకం పాకుడుకలుపుమొక్క. < మూడు + ఆకులతీగ. మూఁడాకులతీవ రూ.చూ. మూఁడాకులతీగ. వి. రెమ్మరెమ్మకు మూడేసిఆకులుండే ఒకరకం పాకుడు కలుపుమొక్క. మూఁడాకులలం వి. మూడాకులతీగ, రెమ్మ రెమ్మకు మూడేసి ఆకులుండే ఒకరకం పాకుడు కలుపుమొక్క. మూఁడారుగాలాలు వి.బ.వ. ఎల్లవేళలు. సం. కాల-. సమయం, వేళ. <మూఁడు + ఆఱు + సం. కాల- + -ము + లు. మూఁడుకటారి వి. మూడంచులున్నకటారి. మూఁడుకన్నులయ్య వి. శివుడు, ముక్కంటి. మూఁడుకన్నులవాఁడు విశ. శివుడు, త్రిలోచనుడు. పి. శకు. 3.31. మూఁడుకన్నులవేల్పు వి. శివుడు, త్రినేత్రుడు. శృం. నై. 4 23. మూఁడుకన్నులసామి వి. ముక్కంటి, శివుడు. మూఁడుకాళ్లముసక చూ. మూఁడుకాళ్లముసలి. వి. అతివృద్ధు. జైమినిభా. 4.46. మూఁడుకాళ్లముసలి రూ. మూఁడుగాళ్లముసలి. విశ. నడవటానికి ఓపిక లేనంతటి

మిక్కిలి ముసలి, పండువృద్ధుడు, మూడోకాలైన కర్రను ఊతగా చేసికొని నడిచే వృద్ధుడు. శృం. నై. 1.109. **మూఁడుగాళ్లముసలి** రూ. చూ. మూఁడుకాళ్లముసలి. వి. పండువృద్ధుడు. చంద్రాంగ. 3.130. **మూఁడుచెక్కలదిండు** వి. బంకదిండు. **మూఁడుచెరువులనీళ్లు తాగించు** స. క్రి. నానాతిప్పలూ పెట్టు. **మూఁడుజాలు** వి.బ.వ. మూడు యామాలు. హరి. పూ. 99. <మూఁడు + జాము + -లు. **మూఁడునాడెలనేత** వి. అంచుల్లో వేరేరంగు పేక దారాలు పెట్టి డిజైన్లు పువ్వులు, మొగ్గలు ఆకులు మొ. వి పడేట్టు నేసేనేత. **మూఁడు నాడెల షర్టింగు** రూ. మూన్నాళ్ళె షర్టింగు. వి. మూడు నాడెలతో నేసిన ఒక రకం చొక్కాగుడ్డ. **మూఁడునొకటి** వి. నాలుగు. **మూఁడు పూవులాఱుకాయలు** వి.బ.వ. అభివృద్ధి. **మూఁడుపూవులూఆరు కాయలు** వి.బ.వ. అతిసమృద్ధి. **మూఁడుమాటలకాఱుతప్పలు** వి.బ వ. తప్పొప్పులెరుగని అమాయకులు. **మూఁడుమాటల కాఱుతప్పలుతెలిసినవాఁడు** విణ. మిక్కిలి ప్రతిభాశాలి. కళా. 5.219. **మూఁడుమాటలతోముడివెట్టు** స. క్రి. సంగ్రహంగా ముగించు. **మూఁడుమాటలాఱుతప్పలు** వి. బ. వ. ఎక్కువ తప్పులు. **మూఁడుముక్కలాట** వి. పేకాటలో ఒకరకం. **మూఁడుముక్కలు** వి.బ.వ. పేకముక్కలు. **మూఁడుముళ్లుపడు** అ. క్రి. వివాహమగు. **మూఁడుమూఁడులోకాలు** వి.బ.వ. విభిన్న భావాలు కలవారు, విచిత్రమైనవారు. **మూఁడు మూతలకుండ** వి. జింకలు, నక్కలు మొ. జంతువులు రాకుండా సున్నంపూసి బొగ్గు చుక్కలు పెట్టి తోటల్లో ఉంచిన మట్టిపాత్ర. **మూఁడుమూలజెముడు** వి. ముక్కోణం ఆకారంగా ఉండే మూలల్లో ముళ్ళుండే కొమ్ములుకలిగి సుమారు ఏడడుగుల ఎత్తు పెరిగే మొక్క (Euphorbia trigona). **మూఁడుమూసిఆరుఅతికినా** అవ్య. ఎన్ని అతుకులు వేసినా. **మూఁడుమెచ్చులుమెచ్చు** స.క్రి. బాగా మెచ్చుకొను. విప్ర. 4.12. **మూఁడులాకలకమ్మి** రూ. మూళ్ళాకలకమ్మి. వి. ఒకరకం చీరకమ్మి, చీరపడుగును మూడుపాయలుగా విడదీసి రంగుపోగులతో నేసిన కమ్మి. **మూఁడులోకములకుముల్లు** వి. త్రిలోక కంటకుడు. **మూఁడే మాటలు** వి.బ.వ. సంగ్రహంగా ఉండేది. శుక. 2.307. <మూఁడు[1] + -ఏ[3] + మాట + -లు. **మూఁణ్ణాలుగురోజులు** వి.బ.వ. కొద్దిరోజులు. < మూఁడు + నాలుగు + రోజు + -లు. **మూఁణ్ణెల్లసన్నం** వి. కాశీపిచోడీలు. **మూన్నాళ్ళ పట్టపగలు** వి. మూడురోజుల మధ్యాహ్నం, అల్పకాల భోగం. **మూన్నాళ్ళముచ్చట** వి. మూడురోజుల మధ్యాహ్నం, స్వల్పకాలభోగం. **మూన్నాళ్ళు** రూ. మూన్నాళ్లు. వి.బ.వ. మూడురోజులు. కాశీ. 2.72. **మూన్నాళ్ళెషర్టింగు** రూ.చూ. మూడునాడెల షర్టింగు. వి. మూడునాడెలతో నేసిన ఒకరకం చొక్కాగుడ్డ. **మూన్నూలు** రూ. చూ. మున్నూలు. వి. ముప్పిరి. <మూఁడు[1] + నూలు[1]. **మూన్నె లలు** వి.బ.వ. మూడునెలలు. మార్క. 3.199, జైమినిభా. 8.209. <మూఁడు[1] + నెల + -లు. **మూళ్ళాకలకమ్మి** రూ.చూ. మూఁడులాకలకమ్మి. వి. ఒకరకంచీరకమ్మి, చీర పడుగును మూడుపాయలుగా విడదీసి రంగు పోగులతో నేసినకమ్మి. <మూఁడు[1]>లాకలకమ్మి.

**మూఁడు[2]** అ.క్రి. (చేటు మొ. వి) సంభవించు, కలుగు. భార ద్రోణ. 5.119.

క. మూడు. పుట్టు, కలుగు, సంభవించు ; తు. మూడు. పుట్టు, ఆధారం, మూడుని. పుట్టు, మూడావునీ. పుట్టు ; త. మూటు. మూలం, కారణం ; మ. మూటు. పాత్రాదుల అడుగుభాగం.

**మూఁడుచు** రూ. చూ. మూఁడ్చు. స.క్రి. కలిగించు, సంభవింపచేయు. **మూఁడ్చు** రూ. మూఁడుచు. స. క్రి. కలిగించు, సంభవింపచేయు. శృం. నై. 2.34. తు. మూడావుని.

**మూఁడు[3]** అ.క్రి. ముగియు. విష్ణుపు. 7.866.

క. ముడి. తుదికిచేరు, తుద, నాశనం, ముడిపు. ముగియు ; తు. ముడుసుని. వినియోగించు, తిను ; త. ముటి(-వ్-, న్త్-). ముగియు, చచ్చు, మూటు. క్లిష్టదశకుచేరు ; మ. ముటియుక. ముగియు, ముటిష్వ. నాశనం ; కో. ముడ్చ్. పూర్తిచేయు.

మూ.ద.ద్రా. *ముట్-, *మూట్.

**మూఁడేమాటలు** చూ. మూఁడు[1].

**మూఁణ్ణాలుగురోజులు** చూ. మూఁడు[1].

**మూఁణ్ణెల్లసన్నం** చూ. మూఁడు[1].

**మూఁడ్చు** చూ. మూఁడు[2].

**మూతము** వి. రూపు, ఆకృతి.

సం. మూర్తి-. ఆకారం, దేహం ; ప్రా. ముత్తి ప్రతిబింబం, ఆకారం, దేహం.

<ప్రా. ముత్తి.

**మూతి** చూ. మూయు. వి. **1**. పైపెదవీ కిందిపెదవీ, మూతలా ఉండే భాగం. భార.విరా. 2.236 ; **2**. మీసం, గడ్డం, శృంగ్రశుప. భాగ. 10పూ. 1770 ; **3**. పాత్రలకు తెరుచుకొని ఉండే ముఖభాగం ; **4**. గునపంలోని పదునైన భాగం, మొన ; **5**. కిందపెదవి, గూడచివరి సన్నని భాగం ; **6**. కొస, దూలం చివరి భాగం ; **7**. వానం చివరి భాగం ; **8**. సున్నపుబట్టీ పైభాగం ; **9**. పంకాబట్టీకున్న పొయ్యి.

క. మునడి, మునుడి, మునుళి, మూతి, మోతి. నోరు, ముట్టె ; తు. ముసుంటు, ముసుండు. ముఖం ; త. మూంచి. మొగం, మూంచై. పొడవైన ముఖం ; మ. మూచ్చు, ముచ్చి, ముఞ్ఞి, మొఞ్ఞి, మొత్తి, మోంత. మొగం ; కో. మొంద్, ముచ్ల్. నోరు ; తొ. మున్. మొగం, ముందుది, పూర్వకాలం, ముతుఫ్. ముక్కు ; కొం. మూజి. ముక్కు ; కొలా. ము.తి. నోరు ; నా. మూతి. నోరు.

**మూతికట్టు** వి. **1**. కుండకట్టు, బండికుండకు చుట్టూ కట్టిన ఇనపరేకు ; **2**. ఉగ్గం ; **3**. గూడమూతికి రెండు వైపులా తాడుకట్టే చోటు ; **4**. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కాముకు కలిపి వేసిన కట్టు. **మూతికూన** రూ. మూతిగూన. వి. సన్నగా ఉన్నవైపున కడియంలాగా ఉండే పెంకు. **మూతిగిరిపు** స.క్రి. అసంతృప్తిని ప్రకటించు

శాఖ్ల.సం. 6.156. మూతిగూన రూ.చూ. మూతికూన. వి. ఇంటి చూరుపైన ముందుభాగం అంచులో అందంగా ఉండటానికి పెట్టిన గుండ్రటి పెంకు. మూతిచిక్కం వి. సిగమోర, తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. మూతినాకుడుకుక్క వి. ఇచ్చకాలాడే వ్యక్తి. మూతినాకుడుమాటలు వి బ.వ. ఇచ్చకపుమాటలు, కల్లబొల్లికబుర్లు. మూతినాకుళ్లు వి.బ.వ. మొగం ముందరి మాటలు, కల్లబొల్లి మాటలు, ఇచ్చకం మాటలు. మూతినాకే రకం వి. ఇచ్చకాలాడే వ్యక్తి. మూతిపుటిక వి. చిక్కం. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికి వేసే జల్లిబుట్ట. మూతిపెంక వి. ఇంటిచూరుపై ముందుభాగం అంచుతో అందంగా ఉండటానికి పెట్టిన గుండ్రని పెంకు. మూతిబుంగ వి. చిక్కం, పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికి వేసే జల్లిబుట్ట. మూతిబుట్ట రూ. మూతిబుట్టి, మూతిబుట్టె. వి. చిక్కం, పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికి వేసే జల్లిబుట్ట. మూతిబుట్టి రూ.చూ. మూతిబుట్ట. వి. చిక్కం, పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికి వేసే జల్లిబుట్ట. మూతిబుట్టె రూ.చూ. మూతిబుట్ట. వి. చిక్కం, పశువులు మెయ్యకుండా ఉండటానికి మూతికి కట్టే జల్లిబుట్ట. మూతిముట్టు స.క్రి. 1. మూతతో ముట్టు, వాసన చూచు. శివరా. 2.107 ; 2. తిను, భక్షించు. ఘటికా. 1.74. మూతిముడుచు అ.క్రి. 1. అసహ్యపడు ; 2. అసంతృప్తిని తెలుపు. మూతిముడుచుకొను అ.క్రి. అయిష్టంతో మూతి బిగించుకొను, ముఖం ముడుచుకొను. మూతిముప్పడివ్యవహారము వి. దాపరికంగా చేసేపని. మూతివిచ్చు అ.క్రి. వికసించు. పాండు. 1.183. మూతివిఱుచు అ.క్రి. 1. అసంతృప్తినీ అయిష్టతను కనబరచు ; 2. ఇష్టం లేకుండు. శివ.సా. 289. మూతులుకట్టుకొను అ.క్రి. ఎవరికీ చెప్పక నోరు మూసుకొని ఉండు. <మూతి + -లు + కట్టుకొను. మూతులుకట్టుగా అవ్య.క్రి. మూటకట్టినట్లు, గట్టిగా. మూతులునాకు అ.క్రి. శుష్క ప్రియాలాడు, వంతలాడు. పాండు. 4.196. <మూతి + -లు + నాకు మూతొర వి. ఒరగాది పైభాగం. <మూతి + ఒర.

మూతులుకట్టుకొను చూ. మూతి.

మూతుకట్టుగా చూ. మూతి.

మూతులునాకు చూ. మూతి.

మూతొర చూ. మూతి.

మూదల(-తల$^{2}$) వి. 1. ప్రమాణం నిర్ణాయకం, రుజువు. భార.విరా. 1.4 ; 2. సంబంధించినది. భాగ. 6.313.

క. మూదలె. ఎత్తిపొడుపు ; త. ముకతలై ; ప్రతిఘటన.

మూదలిక వి. తార్కాణం, రుజువు మూదలించు స.క్రి. 1. తాకు, కవియు. కు.సం. 12.21 ; 2. స్మరింపచేయు. భార.ఉద్యో. 3.59 ; 3. ఎత్తిపొడుచు, ముదలకించు. భార భీష్మ. 3.113 ; 4. ఎచ్చరించు. భార.కర్ణ. 2.19 ; 5. పుట్టించు. కాశీ. 5.319. క. మూదలిసు. ఎత్తిపొడుచు, ప్రతిఘటించు ; త. ముతలి(-ప్పి-, త్త్), మూదలి. <మూదల + -ఇంచు$^{3}$

మూదలిక చూ. మూదల.

మూదలించు చూ. మూదల.

మూదేవి వి. 1. పెద్దమ్మ, దరిద్రదేవత ; 2. ఏడుపు మొగంతో ఉండేవాడు.

క. మూదేవి. జ్యేష్ఠాదేవి ; కొడ. ముత్తయ్. ముత్తవ్వ ; త. మూతియాళ్. పెద్దస్త్రీ, దయ్యంపట్టినస్త్రీ. మూత్తాళ్. వృద్ధస్త్రీ. పెద్దక్క, మొదటిభార్య, మూత్తాడి. వృద్ధురాలు ; మ. ముత్తి. వృద్ధురాలు, ముత్తాచ్చి. మూమ్మ.

మూన వి. 1. తుషసమేతధాన్యం. ఆం.భా. 2.238 ; 2. నాటేవరిమొక్క ; 3. రాగి, జొన్న, సజ్జ మొ. వాటిని తూర్పార పట్టినప్పుడు దూరంగా పడే పొట్టు ; 4. తరక, కాల్చిన సున్నాన్ని జల్లించగా వచ్చిన తుక్కు ; 5. వస్త్రగాలితం చేయగా రాలకుండా నిలిచిన పదార్థం.

త. మూన. పొల్లు.

మూనకుప్ప వి. తూర్పార పోసేటప్పుడు మేలురాని దగ్గరపడే పొట్టు, ధాన్యం కలిసిన కుప్ప. మూనగాయ (-కాయ) వి. దోసకాయ గిజరు (గింజ) తీసి తరిగి వండిన కూర. మూనదిరుగు(-తిరుగు) అ.క్రి. నాటిన వరిమొక్క వేళ్ళుపారి బాగా నాటుకొను.

మూను$^{1}$ రూ.చూ. మూన్ఱు. సర్వ. మూడు. నలజనంపాడు శాసనం. క్రి.శ. 928.

మూను$^{2}$ చూ. మూన. స.క్రి. వస్త్రగాలితంచేయు, వడపోయు.

మూను$^{3}$ వి. పైన మొత్తంగా కనిపించే రంగు.

మూత్ర చూ. మూయు. వి. 1. మూయటం. హంస. 2.63 ; 2. మూయటానికి సాధనమైన మూకుడు మొ. వి. ఆం.భా. 1.79 ; 3. అడ్డం. ఆం.భా. 1.79 ; 4. సీసాకు వేసే బిరడా ; 5. కనురెప్పమూత ; 6. ఇంటికొప్పుకు చూరుకు మధ్య ఉండే భాగం ; 7. రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప ; 8. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క ; 9. మగ్గం సొరుగు మీద బిగించిన చెక్క ; 10. బట్టీపొయ్యిని మూస్తూ కట్టిన తాత్కాలికపు రాతికట్టడం.

క. ముచ్చె. మూత ; కొడ. ముచ్చి. ; తు. ముచ్చు, ముచ్చుల, ముచ్చి. ముచ్చు.

మూత్రకుండ వి. సారాయి బట్టీలో బద్దుబుడ్డికి పెట్టిన పెద్ద రంధ్రానికి సరిపడినట్లు పెట్టే చిన్న మట్టిపాత్ర. మూత్రకూటు వి. పైన చెక్కలు పరిచి మూత పెట్టిన కూటు. మూత్రచెక్క వి. మరమగ్గం సొరుగుకు చివరనాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. మూత్రతలుపు వి. ఏకాండం తలుపు. ఒకేచెక్కతో చేసిన తలుపు. మూత్రపట్టె వి. అతుకుచెక్క, తలుపురెక్క అంచున పెచ్చుగా బిగించిన పలచటి రేపరుబద్ద. మూత్రపడు స.క్రి. మూసికొనిపోవు. మూత్రపని వి. గోడలు, దర్వాజాలు మొ.వి కట్టటం. మూత్రపలక వి. 1. గందప్పట్టె, తలుపురెక్కమీద అడ్డంగా బిగించే కొయ్యబద్ద ; 2. మునుగుచెక్క, కుసి తగిలించటానికి రంధ్రం ఉంచి దర్వాజాపై కమ్మిమీద

పరచిన చెక్క. **మూఁతపొడుపు** వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146. **మూఁతబండ** వి. 1. ఠానబండ, దర్వాజా ఉత్తరాసిమీద పరచే బండ; 2. సమాధిమీద కప్పుగా పెట్టే విశాలమైన రాయి; 3. సన్‌షేడుగా వేసిన బండ. **మూఁతబల్ల** వి. ఇంటి ముంజూరును మూసే బల్ల. **మూఁతమగ్గం** వి. ఒకరకం మరమగ్గం, తొట్టిక చివర మూతచెక్క బిగించినది. **మూఁతముప్పిడి** వి. దాపరికం. **మూఁతమునర** వి. ఒళ్ళంతా బిళ్ళలుకట్టి అవి చితికి చీముకారి కంటినుంచి రక్తం కారుతుండగా గడగడ వణికించే కలరావంటి ఒకరకం జబ్బు. **మూఁతమూకుడి** వి. కడవలు, పాలముంతలు మొ. వాటిమీద మూతగా వాడే మూకుడు. **మూఁతయిల్లు(-ఇల్లు)** వి. గాలిరాని కొంప. **మూఁతరాయి** వి. దానబండ, దర్వాజా ఉత్తరాసిమీద పరిచే బండ. **మూఁతలు** వి. బ. వ. చెవికి తగిలించుకొనే పెద్ద నగలు.

**మూన్నాళ్ళపట్టపగలు** చూ. మూఁడు[1].
**మూన్నాళ్ళముచ్చట** చూ. మూఁడు[1].
**మూన్నాళ్ల** చూ. మూఁడు[1].
**మూన్నాళ్ళపర్తింగు** చూ. మూఁడు[1].
**మూన్నూలు** చూ. మూఁడు[1].
**మూన్నెలలు** చూ. మూఁడు[1].

**మూన్ట్** రూ. మూ-, మూణ్ణు, మూండు, మూఁడు[2], మూను[1]. సర్వ. మూడు. సెలపాడు కానసం. క్రీ.శ. 745, 801.

క. మూఱు; కొడ. మూందు; తు. మూజి; త. మూన్ఱు; మ. మూన్ను; కో. మూంద్; తొ. మూద్; గోం. మూంద్; కొం. ముంఁడి; కుఇ. మూంజి; పర్జి. మూఁదు(క్); కొలా. మూందిజ్; నా. మూంది; గ. మూండ్; కురు. మూంద్; బ్రా. ముసిట్.

< మూ.ద్రా. మూన్ త్.

**మూపరం** రూ. చూ. మూపురము. వి. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగాఉన్న భాగం.

**మూపురము** చూ. మూఁపు. రూ. ఊపురము, మూపరం, మూఁపురము, మోపురం. వి. 1. ఎడ్ల మెడవెనక ఎత్తుగా ఉండే భాగం; 2. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం.

**మూబంతి** రూ.చూ. ముకుబంతి[2]. వి. ముట్టెబంతి, ఒకరకం రోగం.

**మూఁపు** వి. భుజశిరస్సు. కు.సం. 2.72.

క. ముడుపు, ముడుహు, ముయ్, ముయిబు, ముయువు, మయ్యూ. మూపు; తు. ముడు. భుజస్కంధం; త. మెయ్‌మ్పు). భుజం; మ. ముఅప్పు; కో. ముడి. భుజస్కంధం; కుఇ. మోపా. చేతి పైభాగం.

**మూఁపునగట్టినచద్ది** వి. కొంగుపసిడి. తాళ్ల. సం. 7.6. **మూఁపునఁగండలిచ్చు** అ.క్రి. 1. మొక్కుబడిగా దేవుడికి గండదీపాలనెత్తు. పండి. చ. 2.471 పు.; 2. మూపుమీది కండలు కోసి ఇచ్చు. పాండు. 3.77. **మూఁపులుమూఁడగు** అ. క్రి. 1. ఉప్పొంగు. వేంక. పంచ. 3.130 పు.; 2. భుజములుప్పొంగు. విజయ. 3.169. < మూఁపు + -లు + మూఁడు[1] + అగు.

**మూఁపురపుటెద్దు** చూ. మూఁపురము.
**మూఁపురపుమెకము** చూ. మూఁపురము.
**మూఁపురము** రూ.చూ. మూపురము. వి. ఎద్దు భుజశిరం.

**మూఁపురపుటెద్దు(-ఎద్దు)** వి. అంబోతు, అచ్చుటెద్దు.
**మూఁపురపుమెకము** వి. ఎద్దు, ఆలపోతు.

**మూయనివాకిలి మూసినట్లుగ** చూ. మూయు.
**మూయి** చూ. మూయు.
**మూయించు** చూ. మూయు.

**మూయు** స. క్రి. 1. మూతపెట్టు. భార. ఆది. 6.272; 2. కప్పు, ఆచ్ఛాదించు. శృం.నై. 7.63; అ.క్రి. 1. మూతపడు. భార.ఆరణ్య. 1.270; 2. ముకుళించు, ముగుడు. గౌ.హరి.పూ. 551 పం.

క. ముచ్చు. మూయు. ముచ్చక. మూయటం, ముచ్చలు. మూయటం; త. మూడు. మూయు, మూయ్ (మూయ్-న్-, మూయ్-ఇన్). మూయు. నింపు, కమ్ము, మూత. మూఙ్. ముడుచుకొను; తొ. మోజ్. దాచు; గోం. మొఇ. మూతపెట్టు; కుఇ. ముస్థా (ముస్). మూయు, కప్పిపెట్టు, సమాధిచేయు; కువి. ముహ్. సమాధిచేయు; పర్జి. మూయ్. మూసికొను; కొలా. ముయ్. దాగుకొను; నా. ముయ్; గ. మూయ్-/మూయ్క్-(మూయ్-త్). మూయు; కురు. ముంఢ్. కప్పు; మాల్తొ. ముస్గ్, మూయబడు.

< మూ.ద్రా. *మూ-/ముయ్/మూయ్-.

**మూయనివాకిలి మూసినట్లుగ** అవ్య. ద్రు. అతివేగంగా, దూసుకొని బలమంతా ఉపయోగించి. **మూయి** వి. కప్పు. మూత. ఆం.భా. 1.86. **మూయించు** స.క్రి. మూయచేయు. చంపూరా. 4.66. < మూయు + -ఇంచు[3]. **మూసికొనివచ్చు** అ.క్రి. కమ్ముకొని ఆవరించు. < మూయు + -ఇ[11] + కొను + -ఇ[13] + వచ్చు. **మూసికొను** స.క్రి. చుట్టుకొను. భార. విరా. 5.250 < మూయు + -ఇ[11] + కొను. **మూసినకన్ను తెరవలేకపోవు** అ.క్రి. స్పృహలేక పడియుండు. **మూసిన గంతలు** వి.బ.వ. కనుమూసి గంతలు, బాలక్రీడ. **మూసిన ముత్తెము** రూ. చూ. మూసినముత్యము. వి. 1. అణగిమణగి ఉండటం. తాళ్ల. సం. 18.455; 2. ఎక్కువ జాగ్రత్తగా ఉండటం. సారంగ. 3.53; 3. ఏమీతెలియని అమాయకురాలు. శుక. 2.136; **మూసినముత్యము** రూ. మూసినముత్తెము. వి. 1. అణగిమణగి ఉండటం. తాళ్ల.సం. 17.75; 2. తెలిసికూడా తెలియనట్లు నటించేవాడు; 3. ఎక్కువగా మాట్లాడనివాడు. **మూసిన మురికి** విణ. అప్రయోజకుడు. హంస. 5.113. **మూసిన మేను** వి. లోపలి శరీరం. తాళ్ల. సం. 10.41. **మూసిన వాయనం** వి. పెళ్ళిసమయాల్లోనూ తీర్థాలసమయాల్లోనూ చేటల్లో మంగళద్రవ్యాలు పెట్టి పైన చేటమూసి ముత్తైదువకు ఇచ్చే వాయనం. **మూసిపెట్టు** స.క్రి. ఏదైనా సంగతిని రహస్యంగా ఉంచు. < మూయు + -ఇ[13] + పెట్టు. **మూసి ముల్లడఁచు** స.క్రి. ధాన్యాదుల్ని గాదుల్లో వేసి మూతవేసి. జాగ్రత్తపరచటానికి మెత్తువేయు. పాండు. 4.149. < మూయు + -ఇ[13] + ముల్లు + అడఁచు.

**మూర** రూ. మూళ. వి. **1.** హస్తప్రమాణం, రెండు జేనల కొలత. కాశీ. 1.53 ; **2.** నిడుపైనది.

కొడ. మొళ్, ముర, మొర ; తు. ముర, మొర, మురంగె, మొరంగె ; త. ముழమ్. మూర ; మ. ముழమ్ ; కో. మొళ్మ్. మూర ; పర్జి. మూర. మూర ; కొలా. ము,ర. మోచేయి.

**మూర్లు** వి.బ.వ. మూరకు బహువచనం. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 70. క్రీ.శ. 1277. <మూర + -లు. **మూరకొక్కండును జేనకొక్కండునుగా** అవ్య. క్రదు. దగ్గర దగ్గరగా. ఆము. 4.35. **మూరకొయ్యలు** వి.బ.వ. అను పొడుగుపీటకు బిగించిన కొయ్యలు. **మూరకోక** వి. బార చాప. **మూరకోల** వి. **1.** గజంబద్ద ; **2.** అరగజంబద్ద, మోరకొలతగలబద్ద. **మూరగుంజ** వి. **1.** శంకు, శాస్త్ర పద్ధతిలో చెక్కిన గృహ నిర్మాణానికి ఓంప్రథమంలో ఈశాన్యమూలన పాతే కొయ్య ; **2.** ఉన్ని పడుగు తోడే టప్పుడు మూర కొలుచుకోవటానికి బిగించిన అనుగూటం. **మూరగూటం** వి. ఉన్ని పడుగు తోడేటప్పుడు మూర కొలుచు కొనటానికి బిగించిన ఆనుగూటం. **మూరటబారట** క్రి.విణ. క్రదు. దీర్ఘంగా, పొడుగ్గా. తాళ్ల.సం. 11.3.53. **మూరంటు** (-అంటు²) వి. అచ్చుతీసిన పడుగుమీద కొలతను బట్టి వేసిన గుర్తు. **మూరంటువేయు** అ.క్రి. అచ్చుతీసిన పడుగు మీద కొలతనుబట్టి గుర్తువేయు. **మూరపుల్ల** వి. అచ్చుతీసిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద. **మూరపెంకు** వి. గొట్టాల్లాగా సారెమీద తయారుచేసి మధ్యగా కోసి ఇంటి కప్పుకు వాడే మట్టిపెంకు. **మూరెంట** అవ్య. ప్రతిమూరకు, మూర పొడవు నేల కాగానే, పండి.చ. 2.5.480 వ. **మూర్లకడవ** వి. పప్పు, చారు కాచుకోవ టానికి వాడే చిన్న మట్టిపాత్ర.

**మూరటిలు** రూ.చూ. మూరటిల్లు. అ.క్రి. మోగు.

**మూరటిల్లు** రూ. మూరటిలు. అ.క్రి. మోగు. శ్రీరం.మా. 10.114.

క. మూరి. చలించు, కదలు్చ.

**మూరతము** రూ.చూ. మూరుతము. వి. ముహూర్తం.

**మూరి** చూ. మూరు.

**మూరితి** వి. **1.** ప్రతిమ, విగ్రహం ; **2.** దేహం.

సం. మూర్తి-. స్వరూపం, దేహం, ప్రతిమ ; ప్రా. అ.మా. ముత్తి. రూపం, ప్రతిబింబం, దేహం ;

క. మూరుతి. స్వరూపం, ఆకారం ; తు. మూర్తి, మోర్తి ; కుఇ. ముర్తి ; పర్జి. ముంత్.

<సం. మూర్తి-.

**మూరిపోవు** చూ. మూరు.

**మూరిబుచ్చు** చూ. మూరు.

**మూరిబోవు** చూ. మూరు.

**మూరివోవు** చూ. మూరు.

**మూరు** అ.క్రి. **1.** అతిశయించు. భోజసు. 3.90 ; **2.** నందడించు. విష్ణుపు. 7.100 ; **3.** ముదురు.

త. మూరి. బలం, గొప్పతనం, మురంచు (మురంచి). పరిపూర్ణమగు, అతిశయించు.

**మూరి** వి. **1.** చిత్తవిభ్రమం. కు.సం. 8.124 ; **2.** అతిశయించు. **మూరిపోవు** రూ.చూ. మూరిబోవు. స.క్రి. అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు. **మూరిబుచ్చు(-పుచ్చు)** స.క్రి. **1.** వర్ధిల్లచేయు, విజృంభింపచేయు. సిం.ద్వా. 4.218 ; **2.** సంతోషపెట్టు. కావ్యా. సం. 4.44, **మూరిబోవు (-పోవు)** రూ. మూరిపోవు, మూరివోవు. అ.క్రి. **1.** అతిశయించు. భార.శాంతి. 3.337 ; **2.** వర్ధిల్లు. హరి.ఉ. 6.10, మార్క. 6.235 ; **3.** సఫలమగు, సిద్ధించు. మార్క. 7.185 ; **4.** సంతోషించు. హరి.పూ. 3.45 ; **5.** విజృంభించు. హరి. ఉ. 4.43 ; **6.** దృఢ మగు. పి.శకు. 4.86 ; **7.** నశించు, చెడు. భాగ. 9.135 ; **8.** సంకోచించు. కావ్యా.సం. 3.122. **మూరివోవు (-పోవు)** రూ.చూ. మూరిబోవు. అ.క్రి. విజృంభించు. మార్క. 6. శివరా. 1.92.

**మూరుకొండ** రూ.చూ. మూర్కొండ. వి. రూపగంధ, ఒకరకం ఓషధి విశేషం.

**మూరుకొను** రూ.చూ. మూర్కొను. స.క్రి. ఆఘ్రాణించు, వాసనచూచు. భార.అను. 4.77.

**మూరుతము** రూ. మూరతము, మూర్తము. వి. శుభకాలం, 12 క్షణాలు. అచ్చ.రా.అయోధ్యా. 47, సీలా. 3.78.

సం. ముహూర్త. క్షణం, నిమేషకాలం, లిప్త ; ప్రా. ముహుత్త-, ముహుత్తాగ-.

<సం. ముహూర్త-.

**మూరెంట** చూ. మూర.

**మూర్కొండ** రూ. మూరుకొండ. వి. రూపగంధ.

**మూర్కొను** రూ. మూరుకొను. స.క్రి. ఆఘ్రాణించు. భార. విరా. 1.286.

తు. మూసుని. వాసనచూచు ; త. ముక (-ప్ప-, -న్త-), ముకర్ (-వ్-, -న్త-). వాసనచూచు, మో (-ప్ప-, -న్త-), మూచు (మూచి). వాసన పసికట్టు ; మ. ముకక్క, ముకరుక. వాసనచూచు, ముద్దుపెట్టుకొను.

**మూర్తంకోక** చూ. మూర్తము.

**మూర్తంగెడ** చూ. మూర్తము.

**మూర్తపుగుడ్డలు** చూ. మూర్తము.

**మూర్తమాడు** చూ. మూర్తము.

**మూర్తము** రూ.చూ. మూరుతము. వి. ముహూర్తం.

**మూర్తంకోక** వి. పెళ్ళి ముహూర్తానికి పెళ్ళికూతురు కట్టు కొనే తెల్లచీర. <మూర్తము + కోక. **మూర్తంగెడ** వి. శంకు, శాస్త్రపద్ధతిలో చెక్క గృహ నిర్మాణానికి ఓంప్రథ మంలో ఈశాన్య మూలన పాతే కొయ్య. <మూర్తము + గెడ. **మూర్తపుగుడ్డలు** రూ.చూ. ముహూర్తపు గుడ్డలు. వి. పెళ్ళి లగ్గానికి పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే బట్టలు. **మూర్తమాడు** అ.క్రి. విశ్రమించు. కాశ. 1.35 క. మూర్తమాడు. కూర్చుండు, విశ్రమించు. <మూర్తము + ఆడు. **మూర్తంపంచె** వి. పెళ్ళి ముహూర్తానికి పెళ్ళికొడుకు కట్టుకొనే పంచె, తలంబ్రాల పంచె. <మూర్తము + పంచె.

**మూర్తంపంచె** చూ. మూర్తము.

**మూర్తి** వి. **1.** గొప్పతనం, మహత్త్వం. భార.విరా. 1.276 ;

**2.** నేసిన ఒక బట్ట; **3.** సారెమీద కుమ్మరి మట్టితో ఏర్పరచుకొన్న పాత్ర ఆకారం.

నం. మూర్తి-. స్వరూపం, దేహం, ప్రతిమ, గట్టితనం. <నం. మూర్తి- (అర్థవిపరి.).

**మూర్లకడవ** చూ. మూర.

**మూల** రూ. మొల్ల[2]. వి. **1.** విదిక్కు, దిఙ్మధ్యం. భార.విరా. **5.48**; **2.** కొప్పు. కాశీ. 3.109, భీమ. 1.94; **3.** లోకం. భాగ. 10 పూ. 544; **4.** చోటు, ప్రదేశం. కృష్ణరా. 4.49; **5.** గొంది. సీలా. 2.20; **6.** కోణం. అచ్చ.రా.యు. **3.22**: **7.** వీధి మలుపు.

క. మూలె. మూల; కొడ. మూలె; తు. మూలె; త. మూలై. మూల, ఇల్లు, కోణం; మ. మూల; కో. ముల్; తొ. ములై;

పో.చూ. సం. మూల-. మొదలు, ఆధారం.

**మూలకట్టలు** వి.బ.వ. **1.** చెరువు కలుజుకు ఇరుప్రక్కలా ఉండే బటువైన కట్టలు; **2.** మంచానికి వేసిన ఇనప మూలకట్లు. **మూలకట్టు** వి. చేలో ఒకమూల కోసుగా ఉన్న భాగం. **మూలకడి** వి. వీథి మూలలో గోడకు పక్కగా రక్షణ నిమిత్తం పాతిన పొడుగాటి రాయి. **మూలకడ్డీ** వి. మూలవాసం, దూలం మీదనుంచి మూలలకు వేసే వాసం. **మూలకమాను** వి. ముక్కోణమార్చి, త్రిభుజాకారంలోఉండే ఆర్చి. **మూలకు(జొనుపు (-చొనుపు)** స.క్రి. పనికిమాలిన వానిగా చేయు. వసు. 6.9. **మూలకూర్పుగడి** వి. గచ్చు నేల తడిగా ఉండగానే నూలుతాడుతో కొట్టే గడి, మూలల నుంచి కొట్టే గడి. **మూలకైరు** వి. కొంగు నేసిన తరవాత కొనకు నేసిన చిన్న బొగిడి. **మూలకొత్తడము** రూ. మూలకొత్తళము. వి. కోట బురుజు, గడి. ఆం.భా. **2.18**. **మూలకొత్తళము** రూ.చూ. మూలకొత్తడము. వి. కోట బురుజు, గడి. **మూలకొత్తు** స.క్రి. అవమానించు, ఈసడించు. వసు. 3.132. <మూల+-కున్+ఒత్తు. **మూలకొయ్య** వి. మిడి గూటానికి వేసిన నేత మోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి నేత బయలులో ఒక మూలకు పాతిన గూటం. **మూలకోండ్ర** వి. మూలగా వేసిన కోండ్ర. **మూలగడి** వి. ఒకరకం గడి నేత. **మూలగాలి** వి. చలికాలంలో ఈశాన్యంనుంచి వీచే ఈదర గాలి. **మూలగిట్ట** రూ. మూలగొట్టె. వి. కొనన కొద్దిగా వంపుతిరిగిన గిట్ట. **మూలగుజ్జు** రూ. మూలగురుజు. వి. మూల వాసాన్ని మోసే గురుజు. **మూలగురుజు** రూ.చూ. మూలగుజ్జు. వి. మూల వాసాన్ని మోసే గురుజు. **మూలగూటం** వి. మిడిగూటానికి వేసిన నేతమోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి నేతబయలులో ఒకమూలకు పాతిన గూటం. **మూలగూడు** వి. కమానుగూడు, త్రిభుజాకారంలో ఉండే గూడు. **మూలగూన** వి. ఇంటికప్పు మూలకు వాడే పెద్దసైజు పెంకు. **మూలగొట్టు** వి. మారుమూల. **మూలగొట్టె** రూ.చూ. మూలగిట్ట. వి. కొసన కొద్దిగా వంపు తిరిగిన గిట్ట. **మూలగొయ్య(-కొయ్య)** వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే పరికరం. **మూలచాలు** రూ. మూల్చాలు. వి. మూలగా దున్నటం, మూడోసారి దున్నటం. **మూలచుక్క** వి. కాపుచెరువు చుక్క, జాము చెక్క, తెలగాయచుక్క, దొంగచుక్క, నడిజాముచుక్క, రెడ్డిచుక్క. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం, ఈశాన్యమూల పొడిచే నడిజాముకు తూర్పు వైపు కనిపించే చుక్క. **మూలచెక్క** రూ. మూలజెక్క, మూల్జెక్క. వి. గోడలు కలిపే మూలల్లో సున్న బరచటానికి బేల్దారులు వాడే త్రిభుజాకారపు కొయ్య ముక్క. **మూలజెక్క(-చెక్క)** రూ.చూ. మూలచెక్క. వి. గేబిలింటివాసం. **మూలజోడు చౌకోటు** వి. ఇంటరు గుమ్మం, ఇంటరు దర్వాజాపైన గాలి కిటికీఉన్న ద్వారబంధం. **మూలజ్జి** వి. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావి వైపు చొచ్చుకు వచ్చిన కొయ్య. **మూలతాపి** వి. ఎదురాకు తాపి, సన్నగా పొడుగ్గా కోలగాఉండే రేకుగల చిన్నతాపి. **మూలదంతి** రూ. మూల్దంతి. వి. మూలమలుపువాసం, దూలంమీదినుంచి మూలలకు వేసే వాసం. **మూలదబ్బ** వి. మూలదంతి, దూలంమీదనుండి మూలలకు వేసే వాసం. **మూలదాళి** వి. ఐమూలలుగూడా గీతలున్న దాడి ఆట. **మూలదిమ్మి** రూ. మూల్దిమ్మ. వి. మూర్కంగు దిమ్మ. గోడకట్టుబడి గుర్తించటానికి మూలల్లో కట్టేదిమ్మ. **మూలదిమ్మె** వి. టకోరా, తులసికోట పై అంచున అందానికి కట్టబడిన ఆకులాంటి నిర్మాణం. **మూలనున్నవాని ముంగిట(బెట్టు** స.క్రి. ఎదుటపెట్టు. **మూలనేత** రూ. మూల్నేత. వి. అయిమూల డిజైను వచ్చేట్టు నేసిననేత. **మూల(ద్రోచు(-త్రోచు)** స.క్రి. నిరసించు, పరిత్యజించు, విడనాడు. పాండు. **4.208** **మూలపట్టి** రూ.చూ. మూలపట్టె. వి. మూలవాసం. **మూలపట్టె** రూ. మూలపట్టి. వి. మూలవాసం. **మూలపాల్పు అచు** స.క్రి. మూలపారవైచు, నిండుగ విడిచిపెట్టు. కవిక. 3.109. **మూలపీట** వి. లంకెచోడె, నాలుగు ముఖాలు చెక్కన కొయ్యస్తంభంమీది పీట. **మూలపెంకు** వి. ఇంటి మూలలమీద కప్పటానికి వాడే వెడల్పయిన పెంకు. **మూలపెట్టి** రూ.చూ. మూలపెట్టె. వి. కొయ్యతోచేసిన తొట్టి. **మూలపెట్టె** రూ. మూలపెట్టి. వి. కొయ్యతోచేసిన తొట్టి. **మూలపొయ్యి** వి. ఒకవైపు మట్టిపాత్రకు ఒత్తుగాపెట్టిన పొయ్యి. **మూలపోటు** వి. రెండిళ్ళ మూలలు ఒకదానికొకటి ఎదురు రావటమనే దోషం. **మూలబట్టు(-పట్టు[1])** అ.క్రి. మూలపడు, పనికిరాకపోవు. **మూలబద్ద** వి. మరాసు కట్టుబడిలో అడ్డపట్టెలను ఆకులను బిగించిన కట్టె. **మూలబవంతి** వి. మెట్నిల్లు; మూలలుతప్పి కట్టిన ఇల్లు. **మూలబుట్ట** రూ.చూ. మూలబూటా. వి. దుప్పట్లకు మూలల్లో అద్దే రంగు డిజైను. **మూలబుడ్డివాసం** వి. మూలవాసం, దూలం మీదనుంచి మూలలకువేసే వాసం. **మూలబూటా** రూ. మూలబుట్ట. వి. దుప్పట్లకు మూలల్లో అద్దే రంగు డిజైను. **మూలబొంగు** వి. మూలవాసం, దూలంమీదనుంచి మూలలకు వేసే వాసం. **మూలబొద్దు** వి. పెంకుటింటి కప్పు మూలల్లో వేసే సున్నపుబట్టి. **మూలభవంతి** వి. ముందు వెనకల వసారాలు, పెంకు కప్పుగల ఇల్లు. **మూలమట్టపు పలక** వి. వడ్లవాని ఆయుధం, గోడలమూలల్లో సరిచూసే మట్టపలక. **మూలమట్టము** రూ. మూలమట్టాం. వి. **1.**

మూలలు కొలవటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం, ఆంగ్లంలోని 'L' ఆకారంలో చేయబడిన ఇనపబద్దీ; **2.** మరాసు కట్టుబడిలో కీలును ఒగ్గులపట్టెను కలిపిన ముక్కోణపు రేకు ; **3.** మొత్తం, అంతా. **మూలమట్టంతలుపు** వి. ముందు చట్రంలోకి చెక్క చెక్కించిన తరవాత గందెవాట్లు నరికి బిగించిన తలుపు. **మూలమట్టంబావి** వి. చౌకంబాయి, నల్చదరంగా ఉన్న చుట్టుగోడలుగల బావి. **మూలమట్టాం** రూ.చూ. మూలమట్టము. వి. **1.** మూలలు కొలవటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం, ఆంగ్లంలోని 'L' ఆకారంలో చేయబడిన ఇనపబద్దీ; **2.** మరాసు కట్టుబడిలో కీలును ఒగ్గులపట్టెను కలిపిన ముక్కోణపు రేకు ; **3.** మొత్తం, అంతా. **మూలమత్త** వి. మోటబావి కుంట మొ. వాటి నుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట. **మూలమలుపు** వి. వీధిమలుపు. **మూలమలుపువాసము** వి. ములుపాసం, మూలదంతి దూలంమీదనుంచి మూలలకువేసే వాసం. **మూలమాను** వి. **1.** కుండలు మొ.వి పెట్టుకోవటానికి మూలలో ఇరికించిన మాను ; **2.** ఏతపు మానుకు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. **మూలమూరు** వి. దున్నిన చేలోమూలగా గుంటక తోలటం. **మూలముట్టు** క్రి విణ. ఆమూలం. మకు. **3.134.** **మూలముట్టుగ** అవ్య.ద్రు. **1.** ఊచముట్టుగ, సమూలంగా, పూర్తిగా. శివరా. **1.51.** **మూలమూల** అవ్య.ద్రు. అక్కడక్కడ. **మూలమూలలనడంచు** స.క్రి. అక్కడక్కడ దాచిపెట్టు. శుక. **3.345.** **మూలమెట్టు** వి. మేడమెట్లు, వంపు తిరిగినచోట వేసిన మెట్లు. **మూలమెట్న** వి. మూలమట్టం, మూలలు కొలవటానికి తాపీ పనివాళ్ళు వాడే పరికరం. 'L' ఆకారంలో చేయబడిన ఇనపబద్దీ. **మూలమోటి** వి. దండమోటి, రెండుగోడలు కలిపే మూలమీద చూరుకు ఆధారంగా నిలిపినకర్ర. **మూలబడవైచు(-పడవైచు)** స.క్రి. నిష్ప్రయోజనంగా ఉంచు. చిత్రభా. **3.103.** **మూలబడు (-పడు)** అ.క్రి. **1.** చెడు, నశించు. వేంక. పంచ. **1.262** ; **2.** అడగు, అస్తమించు. దశా. **5.27.** **మూలయేలునేర్పరి** వి. నిరృతి, నైరృతి, కుబేరుడు. **మూలరా** రూ.చూ. మూలతా. వి. వజ్రం. **మూలరాయి** వి. **1.** పశువుల వల్లగాని, బళ్ళవల్లగాని మూలగోడలకు దెబ్బతగలకుండా రక్షణ నిమిత్తం గోడ మూలల్లో వీథివైపున పాతిన పొడుగాటిరాయి ; **2.** హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి నాలుగు మూలలా ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి. **మూలరేవులు** రూ. ముల్రేవులు. వి.బ.వ. ఆముకి మూలల్లో ఉంచిన రేవులు. **మూలరౌతు** వి. **1.** కౌలా, రెండువైపులా చదునుగా నున్నగా చెక్కబడి దర్వాజా పక్కనగాని తక్కిన మూలల్లోగాని కట్టుబడికి వాడబడేరాయి ; **2.** హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి నాలుగు మూలలా ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి. **మూలతా** రూ. మూలరా, మూలతాయి. వి. వజ్రం. వసు. 2.57. **మూలతాయి** రూ.చూ. మూలతా. వి. వజ్రం. **మూలతేడు** వి. నిరృతి. కోణపుడు, కుబేరుడు. అచ్చ.రా. సుందర. **41.** **మూలలగూడు** వి. చౌకంగూడు, నలుపలకలుగా ఉండేగూడు. **మూలలబాయి** వి. చౌకంబాయి, నల్చదరంగా ఉండే చుట్టుగోడఉన్న బావి. **మూలపకాడీ** వి. మూలదంతి, దూలంమీదనుంచి మూలలకు వేసే వాసం. **మూలవడ్రంగుర్జు** వి. పెంకుటింటి చట్రాన్ని మామూలుగా దూలాలు, వాసాలు, గుజ్జులు మూలపట్టెలువేసి తయారు చేయగా ఏర్పడే కొయ్యముక్క. **మూలవంపుదూలం** వి. మూలొంపు, దూలాలమీదుగా మూలల్లో వేసే దూలం. **మూలవసము** వి. పట్టణంలోకి అమ్మకానికివచ్చే సరుకులపై విధించే పన్ను. కొండవీటిశా. క్రీ.శ. **1220.** **మూలవాటు** వి. అయిమూల, విదిక్కు. **మూలవాసము** రూ. మూలాసం, మూలాసాం. వి. కచ్చువాసం, దూలంమీదనుంచి మూలలకు వేసే వాసం. **మూలసాలు(-చాలు$^{2}$)** వి. కూచకప్పును మూలలవైపుకు పేర్చే తీరు. **మూలస్తంభం** వి. శంకు, శాస్త్ర పద్ధతిలో చెక్కి గృహనిర్మాణానికి ఓంప్రథమంలో ఉశాన్య మూలన పాతే కొయ్య. సం. స్తంభ-. కంబం <మూల + సం. స్తంభ - + - ము. **మూలాసం** రూ.చూ. మూలవానము. వి. కచ్చువాసం, దూలంమీదనుంచి మూలలకు వేసే వాసం. **మూలాసాం** రూ.చూ. మూలవానము. వి. కచ్చువాసం, దూలం మీద, నుంచి మూలలకు వేసేవాసం. **మూలేటు** వి. లాదులో తొరస రాతిని మూలలనుంచి అతుకుతూ పోవటం. <మూల + ఏటు. **మూలొత్తుడు** వి. మూలలుగా అతకడం < మూల + ఒత్తుడు. **మూలొంపురాయి** వి. వంగిపోయిన రాతిగోడల మూలల్లో బిగువుకోసం పెట్టి అతికినరాయి. <మూల + వంపు + రాయి. **మూల్చాలు** రూ.చూ. మూలచాలు. వి. మూలగా దున్నటం, మూడోసారి దున్నటం. <మూల + చాలు$^{2}$. **మూల్జెక్క** రూ. చూ. మూలచెక్క. వి. గోడలు కలిపే మూలల్లో నున్నపరచటానికి బేల్దారులు వాడే త్రిభుజాకారపు కొయ్యముక్క. < మూల + చెక్క **మూల్దంతి** రూ చూ. మూలదంతి. వి. మూలదబ్బ, మూలపకోడి, మూలమలుపువాసం, దూలంమీదనుండి మూలలకు వేసేవాసం. **మూల్దిమ్మ** రూ. చూ. మూలదిమ్మ వి. టకోరా, తులసికోటపై అంచున అందానికి కట్టబడిన ఆకులాంటి నిర్మాణం. **మూల్నేత** రూ. చూ. మూలనేత. వి. అయిమూల డిజైను వచ్చేట్టు నేసిన నేత. **మూల్రేవులు** రూ. చూ. మూలరేవులు. వి.బ.వ. ఆముకిమూలల్లో ఉంచిన రేవులు. **మూల్రౌతు** వి. మూలరాయి. గోడలోభాగంగా మూలల్లోపెట్టి కట్టుబడి చేసేరాయి.

**మూలం** వి. మార్గశీర్ష మాసంలో వచ్చే కార్తె.

సం. మూలా. ఒకనక్షత్రం, ఒకకార్తె.

<సం. మూలా (అర్థవిపరి.).

**మూలకముగా** క్రి. విణ. ద్రు. ద్వారా.

సం. మూల-. ఆధారం, పునాది, మూలధనం. సంస్కృతమూల శబ్దం పైస్వార్థంలో 'క' ప్రత్యయం చేరింది.

<సం. మూలక- + -ము + అగు + -అ$^{7}$.

**మూలగ** రూ.చూ. మూలుగు$^{2}$. వి మజ్జ, నెనడు. చంద్రాంగ. 2.105.

**మూలటిక్క** వి. ప్రధానస్థానం. పాండు. 4.5.

సం మూల-. ఆధారం, పునాది.

<సం. మూల-+ఇక్క. (మిశ్రన.).

**మూలదుంప** వి. మూలకంద, ప్రధాన కారణం. భీమ. 5.157.

సం. మూల-. పునాది, మూలాధారం.

<సం. మూల-+దుంప. (మిశ్రన.).

**మూలము** వి. మూలశంకవ్యాధి.

సం. మూల-. అడుగు, మూలాధారం ;

త. మూలమ్. మూలశంక ; మ. మూలమ్ ; కో. ముల్క్.

<సం. మూల- (అర్థవిపరి.).

**మూలరతి** వి. సంభోగంలో భేదం. కు. సం. 9.152.

సం. మూల-. అడుగు, మూలాధారం, పునాది, రతి-. సంభోగం.

<సం. మూలరతి- (అర్థవిపరి ).

**మూలవిరాట్టు** వి. మూలకారణం.

సం. మూలవిరాట్. ఆధారమైన బ్రహ్మాండాత్మక స్థూలదేహాభిమాని అయిన ఆదిపురుషుడు.

<సం. మూలవిరాట్- (అర్థవిపరి.).

**మూలశంక** వి. మూలరోగం, గుదరోగం.

సం. మూల-. అడుగు, ప్రధానాధారం, పునాది, శంకా. అనుమానం.

<సం. మూలశంకా (అర్థవిపరి.).

**మూలసంక** వి. పిలక, పిలుక, పిల్క, మొటిమ, మొలక.

సం. మూల-. అడుగు, పునాది, ప్రధానాధారం, శంకా. అనుమానం.

<సం. మూలశంకా.

**మూలాసం** చూ. మూల.

**మూలాసాం** చూ. మూల.

**మూలిగడ్డ** వి. ముల్లంగి.

హిం. మూలి. ముల్లంగి.

<హిం. మూలి+గడ్డ.

**మూలుగు**[1] రూ. మూలుగు[1]. అ. క్రి. 1. ధనదేవత నిరుప యోగంగా ఉన్నప్పుడు తనను పరిగ్రహించమంటూ కూయు. జైమినిభా. 1.66 ; 2. (బాధతో) ఒకవిధంగా రోదనధ్వని చేయు. ద్వి. సా. చ. 1.35పు. 11పం.

**మూలుగుచుండు** అ.క్రి. కావలసినదాని కంటే ఎక్కువగా ఉండు. పాండు. 4.211. **మూలుగులు** వి.బ.వ. పల్లకీ మోసేవారు భుజంమీద వేసుకొనే దూదివేసి కుట్టిన బిళ్ళలు, మెత్తలు.

**మూలుగు**[2] రూ. మూలగ, మూల్గు[2] వి. ఎముకల మధ్య ఉండే మాంస సారం, మజ్జ. హర. 2.121.

త. మూళై. మెదడు, మజ్జ ; మ. మూళ ; కో. మి.ళ్. మజ్జ ; బ్రా. మిలీ. మెదడు, కాయలోనిగుంజు.

**మూలుగు**[3] వి. అంబుదఫలి, అనీలయష్టిక, క్లైబని.

**మూలుగుమాను** వి. ఒకరకం చెట్టు (Morinda brac-feata).

**మూలేటు** చూ. మూల.

**మూలొత్తుడు** చూ. మూల.

**మూలొంపురాయి** చూ. మూల.

**మూలోసం** చూ. మూల.

**మూల్గు**[1] రూ.చూ. మూలుగు[1]. అ.క్రి. 1. (బాధతో) ఒక రకంగా రోదన ధ్వని చేయు. శుక. 2.205 ; 2. ధనదేవత మొ. వారు వ్యర్థంగా ఉన్న నన్ను పరిగ్రహించమని సూచిస్తూ కూయు.

**మూల్గు**[2] రూ. మూలుగు[2]. వి. ఎముకలమధ్య ఉండే మాంస సారం, మజ్జ.

**మూల్చాలు** చూ. మూల.

**మూల్జెక్క** చూ. మూల.

**మూల్దంతి** చూ. మూల.

**మూల్దిమ్మ** చూ. మూల.

**మూల్నేత** చూ. మూల.

**మూల్రేవులు** చూ. మూల.

**మూల్రొత్తు** చూ. మూల.

**మూళ** రూ.చూ. మూర. వి. రెండుజానలు, అరగజం.

**మూళ్ళకలకమ్మి** చూ. మూఁడు[1].

**మూవ**[1] రూ.చూ. మూఁగ[1]. విణ. మూగవాడు, మూగది. వాల్మీ. రా. 2.132.

**మూవ**[2] రూ.చూ. మువ్వ[1]. వి. పశువుల మెడపట్టెడకు వేసే గజ్జె.

**మూవు** రూ.చూ. మూఁగు. అ.క్రి. మునురు. కు. సం. 4.105.

**మూవురు** రూ.చూ. మువ్వురు. వి.బ.వ. ముగ్గురు. (మూడుకు మహన్మహత్యర్థకరూపం). ఉ. హరి. 4.10.

**మూస** రూ. మోస[2]. వి. 1. బంగారం మొ. వాటిని కరిగించే పాత్ర. హంస. 2.181 ; 2. ఆర్చీలు, గ్లాబులు మొ. వాటి నిర్మాణానికి పనికివచ్చే తాత్కాలికపు కట్టు.

సం. మూషా, మూషికా. బంగారం మొ. వాటిని కరిగించేపాత్ర ; ప్రా. మూసగ-, మూసయ, మూసా, మూసియార ;

క. ముసి, మూసి, మూసె, మోస. ఖనిజాల్ని కరిగించేపాత్ర ; తు. మోసె ; త. మూశై ; మ. మూస, మోస, మూసికొది, మూసారి.

**మూసకట్టు** రూ. మూసగట్టు. వి. సెంట్రింగు, పోత పోయవలసిన ద్రవ్యానికి ఆకారమిచ్చే తాత్కాలికపు నిర్మాణం. **మూసకట్టుబడి** వి. సజ్జకట్టుడు, మూసకట్టుసహాయంతో బాల్కనీలు మొ. వి కట్టటం. **మూసకర్ర** వి. మూసపోటికి నిలిపిన కర్ర. **మూసకాల్వు** వి. నల్లకాల్వులో ఒకవిధం. **మూసకుండ** వి. మూస కాల్వులో కాల్చినకుండ. **మూసగట్టు(-కట్టు)** రూ.చూ. మూసకట్టు. వి. పోతపోయవలసిన ద్రవ్యానికి ఆకారమిచ్చే తాత్కాలికపు నిర్మాణం. **మూసబండ** వి. మూసరాయి, మూసగా వాడే రాయి. **మూసరాయి** వి. మూసగా వాడే రాయి.

**మూసకము** వి. 1. ఎలుక ; 2. పందికొక్కు.

సం. మూషక-. ఎలుక.

<సం. మూషక-.

**మూసర** రూ.చూ. మునురు[1]. వి. ఎడతెరిపి లేకుండా సన్నగా

పడే వాన.

మూసా వి. ఫ్రెంచివారు మర్యాదా సూచకంగా పురుషుల పేర్లకు శ్రీలాగా ముందు చేర్చే పదం.

ఫ్రె. *Monsieur*.

< ఫ్రె. Monsieur.

మూసాంబరము రూ.చూ. ముసాంబరము. వి. ఒకరకం మందు.

మూసార రూ.చూ. ముసురు[1]. వి. రొజ్జ, ఎడతెరిపి లేకుండా సన్నగా పడే వాన.

మూసిక వి. మంగళసూత్రంలో తాళిబొట్టుకు ఇటు అటు గుచ్చి కట్టుకునే నానుక్రోవి. నీలా. 1.103.

సం. మూషిక-. ఎలుక, ఎలుకచెవిచెట్టు.

< సం. మూషికా.

మూసికొనివచ్చు చూ. మూయు.

మూసికొను చూ. మూయు.

మూసినకన్ను తెరవలేకపోవు చూ. మూయు.

మూసినగంతలు చూ. మూయు.

మూసినముత్తెము చూ. మూయు.

మూసినముత్యం చూ. మూయు.

మూసినముచికి చూ. మూయు.

మూసినమేను చూ. మూయు.

మూసినవాయసం చూ. మూయు.

మూసిపెట్టు చూ. మూయు.

మూసిముల్లడచు చూ. మూయు.

మృదంగంకుండ రూ. మురదంగికుండ, ముర్దంగంకుండ. వి. మృదంగానికి వాడే మట్టికుండ.

సం. మృదంగ-. వాద్యవిశేషం.

< సం. మృదంగ- + -ము + కుండ.

మెకపుటాము చూ. మెకము.

మెకము రూ. మెగము. వి. 1. పులి, వ్యాఘ్రం, అలాంటి క్రూరజంతువు. భార.ఆది. 6.179; 2. నాలుగుకాళ్ళ జంతువు. భార.శాంతి. 3.16; 3. జింక, కురంగం. భాగ. 9.688; 4. ఏదుపంది, ముళ్ళపంది.

సం. మృగ-. నాలుగుకాళ్ళజంతువు; ప్రా. మిగ-, మయ-. హరిణం, పశువు, మిఅ, మిగీ.; అ.మా. మఅ, మయ-, మిగ-, మియ-; పా. మగ-, మిగ-. జింక, క్రూరజంతువు, మిగీ.;

క. మిక, మిగ, మిగె, మురగ, మురగి, మురుగ, మిరుకమ్, మిరుకుమ్.; తు. మిగ.; మ. మెరువం.; కొలా. మెకం, మేకం.

< ప్రా. మిగ-.

మెకపుటాము(-అము) వి. మృగమదం, కస్తూరి. అచ్చ. రా.అయోధ్యా. 4. మెకములకొలముసామి వి. సింహం. మెకములతిండి వి. మృగాశనం, శివంగి. మెకములదొర వి. సింహం. మెకములఱేఁడు వి. మృగరాజు, సింహం. అచ్చ. రా.యు. 363. మెకములసామి వి. సింహం. మెకములసూడు వి. పెద్దపులి, బెబ్బులి. మెకంబునెక్కుదొర(-ఎక్కుదొర) వి. జింక వాహనంగా కలవాడు, వాయువు. చంద్రికా. 2.74.

మెకంబునెక్కుదొర చూ. మెకము.

మెకమెకపడు అ.క్రి. ఉద్ధతి కలిగి ఉండు, మిట్టిపడు, ఎగసిపడు. భార.శాంతి. 3.392.

మెకమెకపాటు వి. 1. ఉద్ధతి. మను. 3.38; 2. ఓర్వలేని ఆకలిబాధ. ఆం.భా. 3.39.

మెక్కు స.క్రి. ఎక్కువగాతిను, అధికంగా భక్షించు. ఆము. 4.134.

క. మెల్(ఉ), మెల్లు, మెలి. నములు, చప్పుడు చేస్తూ తిను, మెలకు, మెలుకు, మెల్కు, మలుకు. నెమరువేయు; త. మెల్(మెల్వ్-మెన్ఱ్), మెల్కు. నములు; మ. మెల్లుక. నములు; కో. మెక్. నెమరువేయు; తొ. మెల్క్. నెమరువేయు; కుఇ. (మేడ-, మేడి-). నములు.

మెక్కొను చూ. మెక్కు. అ.క్రి. కలుగు, సంభవించు. కువ.చ. 3.58.

మెగము రూ.చూ. మెకము. వి. 1. వేడి. భాస్క.రా.అరణ్య. 2.63; 2. క్రూరజంతువు. వేంక.పంచ. 4.238.

మెగ్గ వి. సెలఏరు, ఊటనీరు.

-మెంగ ప్రత్య. 'నోరు' అనే పదానికి చేర్చే అంత్య ప్రత్యయం. ఉ. నోరుమెంగ "నోరులేని" క్రీడా. 2.23; వి. ముద్దరాలు, బేల.

మెంగెము వి. సున్న, శూన్యం.

మెచ్చించు చూ. మెచ్చు[1].

మెచ్చితలయూచు చూ. మెచ్చు[1].

మెచ్చిమేకతోలుకప్పు చూ మెచ్చు[1].

మెచ్చు[1] స.క్రి. 1. శ్లాఘించు, పొగడు. కు.సం. 12.144, బుడమనారాయలపాడు శాసనం. క్రీ.శ. 7వ శతాబ్ది; 2. లక్ష్యపెట్టు, సరకుచేయు. భార.ఆది. 5.206; 3. గారవించు. భార.ఆది. 7.110; 4. గణించు, లెక్కవేసి చెప్పు. కకుత్థ. 4.35; అ.క్రి. సంతోషించు, ప్రియపడు. భార.ఆది. 2.106; వి. 1. సంతోషం. భార.ఆది. 6.200, దీర్ఘాసిశాసనం. క్రీ.శ. 1075; 2. శ్లాఘ, పొగడ్త. భార. భీష్మ. 2.307; 3. అద్భుతం. భార.శల్య. 1.120; 4. బహుమానం. రం.రా.యు. 333పు. 18పం.; 5. శ్లాఘించువాడు, బట్టు. హర. 6.10; 6. అనురాగం, ప్రీతి. భీమ. 6.11; విణ. శ్లాఘాపాత్రం. భార.కర్ణ. 3.17.

క. మెచ్చు, మచ్చు. సంతోషపరచు, సంతోషపెట్టు, ఇష్టపడు; తు. మెచ్చుని. ఆమోదించు, సంతోషించు; త. మెచ్చు. సంతోషించు; కో. మెచ్. పొగుడు; గోం.కురు. మెయ్-, మయ్.

< మూ ద్రా. *మెయ్.

మెచ్చించు స.క్రి. 1. సంతోషపెట్టు. కు.సం. 6.21; 2. మెచ్చేట్లుచేయు, శ్లాఘింపచేయు. రం.రా.యు. 312పు. 11పం. < మెచ్చు[1] + -ఇంచు[3]. మెచ్చితలయూచు అ.క్రి. సెబాసను. < మెచ్చు + -ఇ[13] + తలయూచు. మెచ్చిమేకతోలుకప్పు అ.క్రి. బూటకపు ప్రసంగంచేయు. < మెచ్చు[1] + -ఇ[13] + మేకతోలుకప్పు. మెచ్చుకొను స.క్రి. శ్లాఘించు. దశా. 1.171. మెచ్చుగొల్పు(-కొల్పు) స.క్రి.

మెచ్చుకొనచేయు, మెప్పించు. కు.సం. 6.28. **మెచ్చుపుట్టు** అ.క్రి. మెచ్చుకలుగు. **మెచ్చులచెట్టు** వి. కల్పవృక్షం. **మెచ్చులాఁడి** వి. మెచ్చుకొనదగ్గ స్త్రీ. కకుత్థ్స. 1.2. **మెచ్చులాఁడు** వి. మెచ్చుకొనదగినవాడు. **మెచ్చులుసేయు (-చేయు)** అ.క్రి. సంతోషం కలిగించు. వసు. 2.11. **మెచ్చువచ్చు** అ.క్రి. స్తుత్యమగు, శ్లాఘాపాత్రమగు. భాస్క. రా.యు. 823. **మెచ్చువడు(-పడు)** అ.క్రి. మెప్పుపడు, శ్లాఘనొందు. వేంక.మా. 5.158. **మెప్పాచారము** వి. నలుగురికి మెప్పుగా ఉండే మాట. సం. ఆచార-. అనుష్ఠానం, సంప్రదాయం, నడత. <మెప్పు+సం. ఆచార-+-ము. **మెప్పించు** స.క్రి. **1**. రంజించు, సంతోషపెట్టు. భార.భీష్మ. 3.177 ; **2**. మెచ్చునట్లు చేయు, శ్లాఘింపచేయు. ఆము. 1.13. <మెచ్చు[1]+-ఇంచు[3]. **మెప్పించుకొను** స.క్రి. మెప్పువచ్చేట్టు చేసుకొను, **మెప్పు[2]** వి. **1**. సంతోషం, ఉ.రా. 2.251 ; **2**. శ్లాఘ, పొగడ్త. ఉ.రా. 7.393 ; **3**. వరం. అచ్చ.రా.అయోధ్యా. 20 ; విణ. శ్లాఘాపాత్రం, మెచ్చదగినది. ఇందు. 5.98.

**మెచ్చు[2]** వి. పడియ, చెలమ, పల్వలం. ఆం.భా. 1.163.

**మెజంటా** రూ. మెజంతా, మెజెంట్, మెజెంట. వి. **1**. ఒకరకం నీలం, చంద్రకాంతంపువ్వురంగు ; **2**. బచ్చలిపండురంగు, పల్కజిమ్మడిపండురంగు ; **3**. వెంపలిపువ్వురంగు, బచ్చలి పండువన్నెకంటే బేలగాఉండే రంగు ; **4**. ఎరుపు ఊదా కలిసిన రంగు.

ఇం. *Magenta*. ఉత్తర ఇటలీలో 1859 లో జరిగిన యుద్ధం, ఈ యుద్ధం తర్వాత కనుక్కోబడిన ఒక రంగు పదార్థం, ముదురుఎరుపు.

< ఇం. Magenta.

**మెజంతా** రూ.చూ. మెజంటా. వి **1**. ఒకరకం నీలం, చంద్రకాంతపువ్వురంగు ; **2**. బచ్చలిపండురంగు, పల్కజిమ్మడి పండురంగు ; **3**. వెంపలిపువ్వురంగు, బచ్చలిపండు వన్నె కంటె బేలగా ఉండే రంగు ; **4**. ఎరుపూ ఊదా కలిసిన రంగు.

**మెజెంట్** రూ.చూ. మెజంటా. వి. **1**. ఒకరకం నీలం ; **2**. బచ్చలిపండురంగు, పల్కజిమ్మడిపండురంగు ; **3**. వెంపలి పువ్వురంగు, బచ్చలిపండు వన్నెకంటె బేలగా ఉండే రంగు ; **4**. ఎరుపు ఊదా కలిసిన రంగు.

**మెజెంట** రూ.చూ. మెజంటా. వి. **1**. ఒకరకం నీలం ; **2**. బచ్చలిపండురంగు, పల్కజిమ్మడిపండురంగు ; **3**. వెంపలి పువ్వురంగు, బచ్చలిపండు వన్నె కంటె బేలగా ఉండే రంగు ; **4**. ఎరుపు ఊదా కలిసిన రంగు.

**మెంచ** వి. మ్లేచ్ఛుడు, తురక, మహమ్మదీయుడు. ఆం.భా. 2.290.

సం. మ్లేచ్ఛ-. ద్వీపాంతరం నుంచి వచ్చినవాడు, అనార్యుడు, పాపి ; ప్రా. మేచ్ఛ-, మిచ్ఛ-, మిలిచ్ఛ- : శౌ. జై.మహా. అ.మా. అప. మేచ్ఛ ; అ.మా. మిచ్ఛ-, మిలక్ఖు- ; పా. మిలక్ఖ-. విదేశీయుడు, అనార్యజాతి, జాతిభ్రష్టుడు, కొండజాతివాడు, మిలా ;

క. మ్లేంఛ ; తు. మ్లేంఛ. అనార్యజాతి, అపరిశుద్ధత, అనాగరికత, మ్లేంఛె. మ్లేచ్ఛుడు.

<ప్రా. మేచ్ఛ-.

**మెట** రూ.చూ. మెట్ట. వి. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువ పట్టెకు బిగించిన కొయ్యపుల్ల.

**మెటల్** రూ. మెట్టలు, మెట్ల. వి. కంకర్రాయి, పునాదుల్ని దిట్టపర్చటం, శ్లాబులు పోతపోయటం, రోడ్లు వేయటం మొ. పనులకి పనికివచ్చే రాతిముక్కలు. ఇవి గట్టిగా పిండాకారంగా ఉంటాయి.

ఇం. *Metal, Mettle* లోహం.

< ఇం. Metal.

**మెటిక[1]** రూ. మెటికె[1]. వి. **1**. అంగుళిపర్వం, వేలికణుపు. సానంద. 5.193, హంస. 3.150 ; **2**. వేలు మొ. వాటిని విరిచి చేసే శబ్దం.

**మెటికకాయ** వి. గోరుచిక్కుడుకాయ. (రాయలసీమలో వ్యవహారం). **మెటికవిఱుచు** స.క్రి. ఏవగించు. శేషధ. 1.95.

**మెటిక[2]** రూ.చూ. మెట్టిక. వి. **1**. సోపానం, మెట్టు. ఆం.భా. 2.22 ; **2**. ఉబ్బు, రాతిలో ఎత్తుగాఉన్న భాగం ; **3**. ఆము గోడ ఎక్కటానికి మెట్టుగా గోడలో బిగించిన రాతి పలక.

**మెటికలగోడ** వి. మెట్లగోడ, మెట్ల పక్కన కట్టిన పొట్టి గోడ.

**మెటికె[1]** రూ.చూ. మెటిక[1]. వి. **1**. అంగుళిపర్వం, వేలి కణుపు ; **2**. కీళ్ళు విరగటంవల్ల కలిగే ధ్వని ; **3**. పాదం.

**మెటికె[2]** రూ.చూ. మెట్టిక. వి. మోటబావిలో దిగటానికి కట్టిన మెట్టు.

**మెటికెలు** రూ చూ. మిటుకుళ్ళు. వి.బ.వ. పెసల మాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం.

**మెటు** రూ.చూ. మెట్ట. వి. కాంక్రీటు, కట్టుబడికి కావలసిన రాళ్ళు దొరికే గుట్ట.

**మెటును** చూ. మెట్ట. వి. ధాన్యం జాడీలు కదలకుండా వాటి చుట్టూ కట్టిన చిన్నగోడ.

**మెట్ట** రూ. మిట్ట, మెట. మెటు, మెట్టు[3], మెంట. వి. **1**. కొండ, పర్వతం. బసవ 7.571 పం. ; **2**. నీరు లేని భూమి, మెరకపొలం. దశా. 2.238 ; **3**. పాదం, కాలు. అచ్చ.రా.బాల. 3 ; **4**. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువపట్టెకు బిగించిన కొయ్యపుల్ల ; **5**. ఆడవాళ్ళు వెంట్రుకల్ని ఎడమవైపుకి మళ్ళించి తురుము కొనే కొప్పు ; **6**. మెరక ; **7**. నీటి వసతి లేని ప్రదేశం ; విణ. ఉన్నతం, ఉత్తానం (జల ప్రదేశం). ఆం.భా. 1.158.

క. మిట్టు. కొండ, మిట్టె. ఎత్తుగా ఉండటం ; తు. ముట్టె. గుట్ట ; గోం. మట్టా, మెటా, మెట్టె ; కొం, మెట్టా. చిన్న కొండ ; కొలా. మెట్టా. కొండ, మిట్ట్. మెట్ ; నా. మెట్.

**మెట్టకెందమ్మి** వి. మెట్టనేలమీద పుట్టే ఎర్రతామర, దాని పూవు. ఉ.రా. 6.24. **మెట్టకొమ్ము** రూ.చూ. మెట్టె కొమ్ము. వి. ఎత్తుగాఉండే కొమ్ము. **మెట్టచాలు** వి. గంగ.

మెట్టచెంగల్వ వి. మెట్టనేల మొలచే ఎఱ్ఱకలువ. ఉ.రా. 4.167. మెట్టజీలుగు వి. సస్య విశేషం. పిష్టపు. పూ. 3. మెట్టంచుకుండ (-అంచుకుండ) వి. అంచు బిళ్ళగా ఉండే మట్టిపాత్ర. మెట్టతమ్మి రూ. మెట్టదమ్మి. వి. మెట్టనేలలో పుట్టే తామర, స్థలపద్మం. ఉ.రా. 1.170. మెట్టతంగేడు వి. లేతపసుపు రంగు పూలు పూసే అందమైన చెట్టు (Cassia glauca). మెట్టతామర[1] రూ.చూ. మెట్టదామర. వి. స్థలపద్మిని. స్థలపద్మం. ఆం.భా. 2.69. మెట్టతామర[2] వి. వెస్టిండీస్ దీవులనుంచి తేబడి మందుల్లో ఉపయోగపడే జిగురు నిచ్చే మొక్క (Cassia alata). మెట్టతామర[3] వి. మెట్ట నేలల్లో పెరిగే మొండిరకం కలుపు మొక్క (Fimbristylis genus). మెట్టతుంగ వి. ఒకరకం తుంగ (Cyperus species). మెట్టతూతి వి. చంద్రకాంత మొక్క (Ipomea glaberrima). మెట్టదమ్మి రూ.చూ. మెట్టతమ్మి. వి. మెట్టనేలలో పుట్టే తామర, స్థలపద్మం. రాజవా. 4.14. మెట్టదామర (-తామర) రూ. మెట్టతామర[1]. వి. స్థలపద్మిని, స్థలపద్మం. ఆము. 5.124. మెట్టదిమ్మ రూ.చూ. పెట్లదిమ్మె. వి. పెట్లగొయ్య, పంటచేలో పిట్టల్ని తోలటానికి మందుపెట్టి పేల్చే కొయ్యయంత్రం. మెట్టదుక్కి వి. మెట్టలో మన్నటం, దున్నిన మెట్టపొలం. మెట్టనాగలి రూ. మెట్టునాగలి. వి. మెరక దున్నే నాగలి. మెట్టపంట వి. 1. నీరు అక్కరలేకుండా పండే పంట. మను. 1.18; 2. వర్షాధారంవల్ల పండే పంట. మెట్టపత్తి వి. మెట్టచేలో పండించే పత్తి. మెట్టపాలతీగ వి. ఎఱ్ఱని పూలు పూసే పెద్దతీగ. మెట్టపొగాకు వి. పొగాకులో ఒకరకం. మెట్ట పొంకడములు వి.బ.వ. నిరుపయోగమైన మాటలు. మెట్ట బందారి వి. వృక్ష విశేషం. హంస. 4.10. మెట్టమడుగు వి. పర్వతాల్లో ఉండే మడుగు, దొన. మెట్టమామి వి. గృహోపకరణాలు చేయటానికి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు, తినకుచెట్టు. మెట్టమామిడి వి. ముళ్ళు కలిగి జిగురు నిచ్చే చెట్టు. మెట్టమార్గము వి. మెరకమార్గం. మెట్టమొల కొలుకులు వి.బ.వ. ఒకరకం ధాన్య విశేషం. మెట్టరాయి వి. తెల్లరాయి, ముగ్గు వేసుకోవటానికి పనికివచ్చే మెత్తని తెల్లని రాయి. మెట్టవంగ వి. పెద్ద వంగ (Solanum melongena). మెట్టవాలుపిట్ట రూ.చూ. మెట్టవాల్పిట్ట. వి. కోడి. చరణాయుధం, పెట్టపోలి. మెట్టవాల్పిట్ట రూ. మెట్టవాలుపిట్ట. వి. కోడి, చరణాయుధం. అచ్చ.రా.బాల. 8. మెట్టవేదాంతము వి. 1. అనుభవం. లేని వేదాంతం; 2. బూటకపు మాటలు. మెట్టులవ వి. ఉలవలో ఒకరకం. < మెట్ట + ఉలవ.

మెట్టంచు చూ. మెట్టె.

మెట్టలు రూ చూ. మెటల్. వి. కంకర్రాయి. పునాదుల్ని దిట్ట పర్చటం, ఖ్లాబులు, రోడ్లు మొ.వాటిని వేయటానికి ఉపయో గించే రాతిముక్కలు.

మెట్టాడు చూ. మెట్టు[1].

మెట్టిక చూ. మెట్టు[1].

మెట్టికుండ చూ. మెట్టు[1].

మెట్టికొను చూ. మెట్టు[1].

మెట్టించు చూ. మెట్టు[1].

మెట్టినయిల్లు చూ. మెట్టు[1].

మెట్టినిల్లు చూ. మెట్టు[1].

మెట్టిమల్లాడు చూ. మెట్టు[1].

మెట్టియ రూ.చూ. మట్టియ[1]. వి. స్త్రీలు కాలి రెండో వేలికి పెట్టు కొనే భూషణం. హర. 5.45.

మెట్టు[1] అ.క్రి. 1. నటించు. భార. ఆది. 8.175; 2. ఏతెంచు, వచ్చు. హంస. 3.139; స.క్రి. 1. (అడుగు) పెట్టు, మోపు. కు.సం. 2.101; 2. తొక్కు. కు.సం. 3.25; 3. చొచ్చు, ప్రవేశించు. ఉ.హరి. 2.37; 4. (పాదుకలు) తొడుగు కొను. భీమ. 2.147; 5. తిరుగు, సంచరించు. వరాహ. 2.176; 6. అణగద్రొక్కు. వరాహ. 8.35; వి. 1. బండి ఇటు అటు కదలకుండ బండికింద కట్టే కఱ్ఱ, తొక్కుడు పలక. కు.సం. 4.83; 2. తిప్ప. భార. అను. 1.220; 3. మెరక. ద.హిం.శా. నంపు. 4. శా.సం. 1384; 4. మొత్తం, వెరసి. హరి.పూ. 8.76; 5. కొండ, పర్వతం. సిం.ద్వా. 9.12; 6. చెప్పు, పాదరక్ష. వేంక. పంచ 1.598; 7. వీణసరకట్టు, వీణాదండానికుండేమెట్టు, ఆము. 1.62; 8. ఆశ్రయం, ప్రాపు. పారి. 1.23; 9. పాదుక. వసు. 5.77; 10. సోపానం. ఉ.రా. 5.154; 11. కాలు. చంద్రరే. 5.57; 12. తొక్కుడు; 13 సుంకం తీసుకొనే చోటు, ఘట్టం; 14. శిరస్సు, తల; 15. వామి అడుగు, గడ్డివామి వేసేటప్పుడు అడుగున వేసిన కట్టలు; 16. సిడెమీద మనిషి తిరగటానికి వీలుగా కొయ్యముక్కలతో వేసిన మెట్టు; 17. తిమ్మెనబల్ల, తూర్పారపోసే మనిషి నిలబడటానికి వీలుగా కట్టిన నిర్మాణం; 18. ముక్కరమాను, కొమిరెకి ఆధారంగా మోట దోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన కొయ్య; 19. చేదుకఱ్ఱల బిగింపుకు దారాలకు వేసే లోహపుచుట్టు; 20. గొంగడినేసే మగ్గం జంత్రానికి కింద బిగించిన కొయ్యచెక్క. విణ. ఉన్నతమైన, ఎత్తైన.

క. మెట్టు. అడుగుపెట్టు, పాదంమోపు, మెటు. ఎత్తు. దిబ్బ. మిట్టు. గుట్ట, మిట్టె. ఎత్తైనదిబ్బ; కొడ. మొట్టి, అడుగుజాడ, అడుగుకొలత, సోపానం; తు. మిట్టె. బాగా కనిపించేట్టుగా ఉన్న, ఎత్తుగాఉన్న, ముట్టె. గుట్టు; త. మెట్టు. మట్టిదిబ్బ, ఎత్తైన ప్రదేశం, కాలితో తోయు తొక్కు, మేటు. దిబ్బ, గుట్ట; మ. మేటు. ఎత్తుగాఉన్న ప్రదేశం, మాటు. గుట్ట, ఎత్తైన ప్రదేశం, మిట్టాల్. ఎత్తుగాఉన్న ప్రదేశం, మిట్ట; కో. మెల్- (మెచ్-). తొక్కు, మెళ్. అడుగుజాడ; గోం. మట్టా. పర్వతం. మెటా. పర్వతం; కొం. మెట్టె. కొండ, మెట్టా. గుట్ట; కొలా. మెట్టా. కొండ, మెట్ట్, మెట్. పర్వతం; మెట్ట్, కొండ, పర్వతం; మాల్తో. మడ్యే. అణగతొక్కు; పో.చూ.త. విటుమ్.

< మూ.ద్రా. *మెట్.

మెట్టాడు అ.క్రి. తొక్కుడులాడు. ప్రభా. 1.107. < మెట్టు[1] + ఆడు. మెట్టిక రూ. మిటిక, మెటిక[2], మెటికె[2]. వి. సోపానం, తావ. రాజవా. 3.29. క. మెట్టిగె. మెట్టు.

**మెట్టికుండ** వి. చావునాడు అగ్గి, అన్నం ఎత్తుకుపోయే మట్టి పాత్ర. < మెట్టు[1] + -ఇ9 + కుండ. **మెట్టికొను** రూ.చూ. మెట్టుకొను. స.క్రి. తొడిగికొను. వేంక. మా. 1.136 < మెట్టు[1] + -ఇ[11] + కొను. **మెట్టించు** స.క్రి. 1. ఆయత్త పరచు, సిద్ధపరచు. హరి.పూ. 6.21 ; 2. తొక్కించు. ముకుంద. 3.291. < మెట్టు[1] + -ఇంచు[3]. **మెట్టినయిల్లు** (-ఇల్లు) రూ. మెట్టినిల్లు. వి. అత్తవారిల్లు. వసు. 1.63. **మెట్టినిల్లు** రూ.చూ. మెట్టినయిల్లు. వి. ఆడుదాని అత్తవారిల్లు. **మెట్టిమల్లాడు** స.క్రి. హతంచేయు, ధ్వంసంచేయు. < మెట్టు[1] + -ఇ[13] + మల్లాడు. **మెట్టుకట్టు** వి. 1. పొయ్యిమీద ఉడికే సంకటిని తెడ్డుతో గెలకటానికి కుండకు ఆనించి దానిపై ఒక కాలు అదిమిపెట్టే కట్టె ; 2. అద్ద, గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టలు, కోసుభాగం వెయ్యనివామి, వామి అడుగు. **మెట్టుకు** అవ్య. ద్రు. 1. తుదకు ; 2. మొత్తానికి **మెట్టుకొను** రూ. మెట్టికొను. స.క్రి. ఒకదాన్ని ఒకటి తాకు. కు.సం. 12.141. **మెట్టుగుది** వి. బెట్టుతాడు, బెట్టుమోకు, మెట్టుగుదితాడు, మెట్టుగుదిమోకు, మెట్టుతాడు, మొండి మోకు, బండి పరాన్ని డొలుపుకు బిగించేతాడు. **మెట్టుగుదితాడు** వి. బెట్టుతాడు, బెట్టుమోకు, బండిపరాన్ని డొలుపుకు బిగించేతాడు. **మెట్టుగుదిమోకు** వి. బండిపరాన్ని డొలుపుకు బిగించేతాడు. **మెట్టుగుదె** వి. ఒకరకం శకటావయవం. కు.సం. 4.439. **మెట్టుచాలు** వి. హంసల విడిది. గంగానది. **మెట్టుతాడు** వి. మెట్టుగుది, బండిపరాన్ని డొలుపుకు బిగించే తాడు. **మెట్టునాగలి** రూ.చూ. మెట్టనాఁగలి. వి. మెట్ట లేక కుష్కి నేలలు దున్నే నాగలి. **మెట్టునేల** వి. మెట్టభూమి, మెరక నేల. ద.హిం.శా.సంపు. 4.శా.సం. 1243. **మెట్టుపలక** వి. తూర్పారపోసేమనిషి నిలబడటానికికట్టే మూడుకాళ్ళపీట. **మెట్టుబండ** వి. చడీరాయి, మెట్లు కట్టటానికి వాడినరాయి. **మెట్టుమోకు** వి. మెట్టుగుది, బండిపరాన్ని డొలుపుకు బిగించే తాడు. **మెట్టుఁబ్రాలు**(-ప్రాలు) వి.బ.వ. తలంబ్రాలు. మను. 5.79. **మెట్టురేక** వి. వేషడుకి వాడే మట్టిపాత్ర. **మెట్టులుగొను**(-కొను) అ.క్రి. మెట్లలా ఏర్పడు, సోపానాలుగా ఏర్పడు. కు.సం. 12.172. **మెట్టువిల్వేలుపు** రూ.చూ. మెట్టు విల్వేల్పు. వి. శివుడు. **మెట్టువిల్వేల్పు** రూ. మెట్టు విల్వేలుపు. వి. శివుడు, గిరిధన్వుడు. అచ్చ.రా.యు. 161. **మెట్లగుంటక** వి. ఒకరకం గుంటక, ఒకానొక సేద్యం పని ముట్టు, ఒకరకం దమ్మిన. **మెట్లగూడు** వి. తాపలగూడు, మెట్లకు ఎండా వానా తగలకుండా కప్పులాగా పెట్టిన గూడు. **మెట్లగోడ** వి. మెటికలగోడ, మెట్లపక్కన కట్టిన పిట్టగోడ. **మెట్లచట్టం** వి. మెట్టుకట్టేగోడ. **మెట్లదంతె** వి. మూడు పలుగుల గుంటక, పైరులో గడ్డి కలుపు పోవటానికి తోలేది. **మెట్లబావి** వి. దిగుడుబావి, నీళ్ళకోసం దిగటానికి మెట్లు పెట్టిన బావి.

**మెట్టు**[2] వి. పులికడుగు, పులిమజ్జిగ.

**మెట్టు**[3] రూ.చూ. మెట్ట. వి. ఎలగడ, గరుపు, గడ్డి, చెలక, చేను, దిన్నె, పొలం, మెరక. వర్షాధారంతో పండే నేల.

**మెట్టుబుడమ** వి. మెట్ట వడ్లలో ఒకరకం. **మెట్టువరి** వి. బుడమ, జిలమ మొ. వర్షాధారంతో పండే వరిసస్యం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1384.

**మెట్టులవ** చూ. మెట్ట.

**మెట్టె** రూ.చూ. మట్టియ[1]. వి. 1. స్త్రీలు కాలి రెండోవేలికి పెట్టుకునే భూషణం. దశా. 2.352 ; 2. అచ్చుగుదులు తగిలించిన చుట్టు.

**మెట్టంచు** రూ.చూ. మెట్టెంచు. వి. లోపల పిశి ఉండి నాలుగు గీతలలాగా ఆడవారి కాలిమెట్లమాదిరి దిట్టంగా కచ్చితంగా ఉండే అంచు. **మెట్టెకొమ్ము** రూ. మెట్టకొమ్ము. వి. ఎత్తుగాఉండే కొమ్ము. **మెట్టెంచు** రూ. మెట్టంచు. వి. లోన పిశిఉండి నాలుగు గీతలలాగా ఆడవారి కాలిమెట్ల మాదిరి దిట్టంగా ఖచ్చితంగా ఉండే అంచు. < మెట్టె + అంచు[3].

**మెట్న** రూ.చూ. మిట్న. వి. మూలలు కొలవటానికి తాపీ పని వాళ్ళు వాడే పరికరం.

**మెట్నడిజైనంచు** వి. మూలమట్టమంచు, నేతలో ఒక డిజైను. **మెట్నబవంతు** వి. మెట్నిల్లు, మూలలుతిప్పి కట్టిన ఇల్లు. **మెట్నరౌతు** రూ. మెట్నారౌతు. వి. మూలరాయి, గోడలో భాగంగా మూలల్లోపెట్టి కట్టుబడిచేసే రాయి. **మెట్నవాసం** రూ. మెట్నోసం. వి. మూలవాసం, దూలం మీదనుంచి మూలలకు వేసే వాసం. **మెట్నిల్లు** వి. మూల బవంతి, మెట్నబవంతి, మూలలు తిప్పి కట్టిన ఇల్లు. < మెట్న + ఇల్లు. **మెట్నోసం** రూ.చూ. మెట్నవాసం. వి. మూలవాసం, దూలంమీదనుండి మూలలకు వేసే వాసం.

**మెట్నక్చూచు** చూ. మెట్నా. స.క్రి. సందుల్లేకుండా సరిచూచు.

**మెట్నా** రూ.చూ. మిట్న. వి. మూలమట్టం, మూలలు కొలవటానికి తాపీపనివాళ్ళు వాడే ఇంగ్లీషు 'L' ఆకారంలోఉండే ఇనపకడ్డీ, దీనికి రెండు భుజాలమీద స్కేలు గీయబడి ఉంటుంది.

**మెట్నాపిల్లు** వి. మెట్నిల్లు, మూలలు తిప్పికట్టిన ఇల్లు. **మెట్నామూల** వి. రెండురాళ్ళు కలిసేమూల. **మెట్నారౌతు** రూ.చూ. మెట్నరౌతు. వి. మూలరాయి, గోడలోభాగంగా మూలల్లో పెట్టి కట్టుబడి చేసేరాయి. **మెట్నార్చి** (-ఆర్చి) వి. ముక్కోణమార్చి, త్రిభుజాకారంలో ఉండేఆర్చి.

**మెట్నిల్లు** చూ. మెట్న.

**మెట్నోసం** చూ. మెట్న.

**మెట్రిలు** అ.క్రి. ప్రసరించు, తొలుకు. శుక. 3.16.

**మెట్ల** రూ.చూ. మెటల్. వి. కంకర్రాయి, పునాదుల్ని దిట్ట పర్చటం, శ్లాబులుపోయటం, రోడ్లువేయటం మొ. పన్లకి పనికివచ్చే రాతిముక్కలు. ఇవి గట్టిగా పిండాకారంగా ఉంటాయి.

**మెట్లంకి** రూ.చూ. మెట్లంగి. వి. 1. రోడ్డు వేసినందుకుపయోగించే నల్లరాతి ముక్కలు ; 2. కట్టుబడికి కావలసిన రాళ్ళు దొరికేగుట్ట.

**మెట్లంగి** రూ. మెట్లంకి. వి. 1. పునాదులు దిట్టపరచటం, శ్లాబులు పోతపొయ్యటం, రోడ్లువెయ్యటం. మొ. పనులకు పనికివచ్చే గట్టిగా పిండాకారంలో ఉండే రాతిముక్కలు ; 2. కట్టుబడికి కావలసిన రాళ్ళు దొరికేగుట్ట.

ఇం. *Metaling*. రోడ్లు, రైలుదారి మొ. వి. కంకర

రాళ్ళతో వేయటం.

<ఇం. Metaling.

మెట్లదిమ్మె రూ.చూ. పెట్లదిమ్మె. వి. పెట్లగొయ్య, పంటచేలో పిట్టల్ని తోలటానికి మందుపెట్టి పేల్చేకొయ్య యంత్రం.

మెట్లగుంటక చూ. మెట్టు[1].

మెట్లగూడు చూ. మెట్టు[1].

మెట్లగోడ చూ. మెట్టు[1].

మెట్లచట్టం చూ. మెట్టు[1].

మెట్లదంతె చూ. మెట్టు[1].

మెట్లబావి చూ. మెట్టు[1].

మెడ వి. 1. కంధరం, గ్రీవం, అబ్బు. భార. ఆరణ్య. 3.396; 2. కుత్తుక, గళం. బసవ. 4.638పం; 3. పాత్రల అంచుకు కిందగా ఉండే మెడభాగం.

క. మెృలె. గొంతు; త. మిటఱు. మెడ, గాలిగొట్టం, గొంతు, మిడఱు; మ. మిటఱు. గొంతు; కో. మిఱ్. కంఠం, కుండమెడ; తొ. మిఱ్. మెడ; గోం. వరేర్. మెడ, వెడెర్. మెడ, గొంతు, వెడోరీ, వెడాగా. గొంతు.

మెడకవ వి. చేనిచుట్టూ కొయ్యలు పాతి కంపకూర్చటం. మెడకాయ వి. కంఠం, గళం. మెడకొంకి వి. మెడముందరి అడ్డ ఎముక. మెడగాని వి. కిరగాని, ఎద్దుకు కాడి మరప టానికి (అలవాటు చెయ్యటానికి) గానుగ మాదిరి కొయ్య యంత్రం. మెడ(గట్టు (-కట్టు) అ.క్రి. తప్పించుకోవటానికి శక్యంకాకుండేటట్లు కూర్చు. కాళ. శ. 9. మెడచింపులు వి.బ.వ. మెడవంపులు, కంఠభాగం. మెడ(జట్టుకొను (-చుట్టుకొను) అ.క్రి. తప్పించుకోవటానికి శక్యం కాకుండా అలుముకొను. పాండు. 5.225, 238. మెడతెరువులు వి.బ.వ. పికిలిపిట్టలు మొ. వాటి మెడమీద చారలు. ప్రబంధ. 1.30. మెడనూలు రూ. మెణ్ణూలు. వి. బొ. కంఠాభరణ విశేషం. ద. హిం. గా. సంపు. 5. శా. సం. 1228. క్రీ.శ. 1503. మెడపట్టనిమేనరికం వి. దగ్గర వ్యవహారం కాని, భరించలేని అవస్త. మెడపట్టు వి. మల్లురుపట్టే ఒక రకం కుస్తీపట్టు. మెడపంపులు వి.బ.వ. కంఠభాగం, మెడ పొంపులు. మెడపలుపు వి. పట్టెళ్ళ బదులు మెడకిందుగా తీసి కాడికి కట్టేతాడు. మెడపాములు వి.బ.వ. మెడకు రెండు పక్కలా ఉండే నల్లటిచారలు. మెడపొంపు వి. మెడవెనక భాగం. మెడబిగురు. వి. పొగరు. మెడపచ్చు అ.క్రి. కోడెలకు కాడి తాకిడిచే ఒరసి మెడపై గుబ్బలేచు. మెడ పంపు వి. గ్రీవాగ్రభాగం, మెడకొనభాగం. ఆం. భా. 2.142. మెడవల వి. ఒకరకం వల. హంస. 4.185. మెడవారు రూ చూ. మెడారు. వి. పట్టెడ. మెడవిరుపు వి. జొన్న, కొర్ర మొ. పైర్ల తెగులు. మెడారు రూ. మెడవారు, మెడోరు. వి. పట్టెడ, ఎద్దుమెడలో అలంకారంగా వేసే మువ్వలుండే తోలుపట్టీ. మెడోరు రూ.చూ. మెడారు. వి. పట్టెడ. మెణ్ణూలు రూ.చూ. మెడనూలు. వి.బ.వ. వి. బొ. కంఠాభరణ విశేషం. హంస. 4.138.

మెడత రూ.చూ. మెణత. వి. ఈతబద్దలు వెదురుబద్దలు మొ. వాటితో అల్లినదడి, మల్లె.

మెడతి వి. జేన.

మెడద వి. 1. వనం, అడవి. ప్రబంధ. 217; 2. చేను.

మెడమ వి. కప్పును దూలాలు సమంగా మోసేటట్లు కదల కుండా ఉంచటం.

మెడవాలు రూ.చూ. మడివాలు. వి. చాకలివాడు.

మెడసరం రూ.చూ. మిడసరము. వి. 1. ఎగురుబోతుతనం; 2. పెడసరం; 3. ఎగిరిపడేవ్యాధి; 4. ఒకరకం వాతపు జబ్బు, జెబ్బలువాచి పశువులు నడవలేనిజబ్బు.

మెడసరి వి. జేష్ఠమాసంలో వచ్చేకార్తె.

నం. మృగశిరా. ఇరవైఏడు నక్షత్రాల్లో అయిదో నక్షత్రం.

<నం. మృగశీర్షా.

మెడారు చూ. మెడ.

మెడిదము వి. ధ్వని, చప్పుడు. యయా. 1.116.

మెడిమి చూ. మడమ. వి. తాపీపిడి.

మెడుకు రూ.చూ. మిడుకు[1]. వి. తుళ్ళు, ఎగిరిపడు. ప్రబంధ. 7.88.

మెడుగు రూ. మెలగు[2], మెలుగు. వి. 1. కొయ్యలు రెండు వైపులా పాతి వాటిమధ్య ముళ్ళకంప దూర్చటం; 2. చుట్టుపాక గుంజలమీద కంపతోగాని బద్దతోగాని గుండ్రంగా కట్టినకట్టు; స.క్రి. అల్లు, కూర్చు.

మెడుద వి. పులికడుగు, పులిమజ్జిగ. ఆం. భా. 2.280.

మెడెముచుక్క రూ. చూ. మడిమచుక్క. వి. బుధుడిపేరుతో ఉండే చుక్క, రోహిణీనక్షత్రం అనికొందఱు.

మెడోరు చూ. మెడ.

మెడ్డాయించు (-ఇంచు[3]) స.క్రి. 1. కుళ్ళగించు, సాధనాలతో నేలను తిరగవేయు; 2. లెక్కచేయకపోవు.

మెడ్త రూ.చూ. మెణత. వి. పూరిళ్ళ చుట్టుగోడ బదులు కట్టినదడి.

మెణకరి చూ. మెణకు.

మెణకు వి. నేర్పు, చాతుర్యం. ద్వి. పరమ. వి. 4.268పు.

మెణకరి వి. 1. నేర్పరి, చతురుడు. ఉ. హరి. 5.26; 2. బ్రహ్మచారి. <మెణుకు+-అరి.

మెణత రూ. మెడత, మెడ్త. వి. 1. ఈతబద్దలు వెదురుబద్దలు మొ. వాటితో అల్లిన ఆవరణం, దడి, మల్లె; 2. బరికె, కొమ్మ; 3. కొరడా.

మెంట రూ.చూ. మెట్ట. వి. 1. మెరక. నె. శా. ఒంగోలు. 47. క్రీ.శ. 1519; 2. పశువుకు, ఒకకొమ్ము ఒకవైపుకు, రెండోకొమ్ము ఇంకో వైపుకు తిరిగి ఉండటం.

మెంటకన్ను వి. మెల్లకన్ను. మెంటకొమ్ము వి. పశువుకు ఒక కొమ్ము ఒకవైపుకు రెండోకొమ్ము ఇంకోవైపుకు తిరిగి ఉండటం. మెంటబ్రరి వి. కురచగా ఉన్న పక్కఎముక.

మెంటవ చూ. మెంట. వి. మూతిఎరుపులోను, మూతిపొడుపు లోను కొంతవార ఉండే ముంగినజాతి.

మెంటికాలు వి. చెడుస్వభావం, తిరుగుళ్ళు కల స్త్రీ.

మెంటిచీల వి. బండిపరాన్ని దోనె మొద్దుకు కలిపే చీల.

మెంటె వి. 1. తలుపుగాలికి పడకుండా దర్వాజాపై కమ్మికి బిగించిన కొయ్యముక్క; 2. లంకె; 3. దోనెగాడిలో లాక బిగించటానికి పెట్టిన సీల; 4. కొమ్మ, కోటేరు

వేసినప్పుడు ఏడికోల కొన అరిగిపోకుండా అతుకు వేసిన కొయ్యముక్క ; 5. పిఱ్రచీల, ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివర కట్టే కొయ్యమేకు.

**మెంటెతల** చూ. మెంట. వి. ఒకటి వెనక్కు, ఒకటి ముందుకు వాలిన కొమ్ములున్న తల.

**మెంఠము** వి. పొట్టేలు. కాశీ. 7.139.

నం. మేఢ్ర-. గొఱ్ఱెపోతు, పొట్టేలు.

**మెండాడు** చూ. మెండు.

**మెండిమోకు** వి. మెట్టుగుది, బండిపరాన్ని డొలుపుకు బిగించే తాడు.

**మెండియము** రూ. మెండెము. వి. చూపుడువేలికి ధరించే ఉంగరం, తర్జన్యాభరణం. విజ్ఞా. 1.77.

**మెండిలు** చూ. మెండు.

**మెండీఁడు** చూ. మెండెము.

**మెండు** వి. 1. ఉద్ధతి, మిడిసిపాటు. రం.రా.ఉ. 120పు. 13పం. ; 2. ఆధిక్యం. భీమ. 3.57 ; 3. అతిశయం. మను. 3.28 ; 4. విధం, రీతి. ఉ.రా. 3.246 ; 5. మిట్టు, ఉన్నతభూమి. ఆం.భా. 1.158 ; 6. మెలి ; 7. ఇనపచీల, గొఱ్ఱుకు కట్టివేసి బిగించేమేకు ; 8. సారె పలకను చుట్టును కలుపుతూ బిగించే కొయ్యముక్క ; విణ. అధికం, మిక్కుటం, అధికుడు, గొప్పవాడు. ఆము. 6.98 ; క్రి.విణ. అధికంగా, మిక్కుటంగా. రాజవా. 3.65 ; స.క్రి. పైకిలేపు ; గడ్డను వదిలేసి పలువూరు గాటువేసి పక్కన నాటిన గుంజ మొ. లగు వాటిని పెగల్చు.

త. మెన్ను. (బరువులు మొ. వి) పైకెత్తు ; పో.చూ. మ. మిఱుంతుఁ.

**మెండాడు** అ.క్రి. సంచరించు, త్రిమ్మరు. కవిక. 4.90, <మెండు + ఆడు. **మెండిలు** అ.క్రి. మెండుకొను, పెంపెక్కు. **మెండుకట్టె** వి. గొసినొగ, కోడిపీటలబండి డొంకిపట్టెనుంచి కాడి వరకు ఉన్న నొగ. **మెండుకొను** అ.క్రి. 1. విజృంభించు. నిర్వ.రా. 2.52 ; 2. అతిశయించు. భార.విరా. 4.243 ; 3. నిండుకొను. ఉ.హరి. 5.84 ; 4. సంపూర్ణమగు. **మెండుకొలుపు** స.క్రి. అతిశయింపజేయు, అధికంచేయు. **మెండుగా** క్రి.విణ.ద్రు. అధికంగా, ఎక్కువగా. <మెండు + అగు + -అ[7]. **మెండుపెట్టు** రూ.చూ. మెండువెట్టు. అ.క్రి. మిడిగూటానికి వేసిన నేతమోకు ఇవతలకు లాగి చేతిగూటానికి మెలివేయు. **మెండుమీఱు** అ.క్రి. అతిశయించు, మెండుకొను. ఆము. 2.56. **మెండువెట్టు(-పెట్టు)** రూ. మెండుపెట్టు. స.క్రి. మెలివెట్టు, పెనవేయు. చంద్రాంగ. 2.61. **మెండేయు** స.క్రి. సారెకఱ్ఱ వేయటానికి ముందు సారె చేతుల్ని పట్టుకొని గట్టిగా తిప్పు. **మెండొగ్గు** అ.క్రి. ఎదిరించు. గా.హరి.ఉ. 894 పం. <మెండు + ఒగ్గు. **మెండొడ్డు** అ.క్రి. 1. చెప్పినదానికి వ్యతిరేకంగా వర్తించు. బహుళా. 1.60 ; 2. ఎదిరించు. <మెండు + ఒడ్డు. **మెండోడు** అ.క్రి. పాటితప్పు. రం.రా. అయోధ్యా. 128పు. 22పం. <మెండు + ఓడు.

**మెండుబండవాడు** చూ. మెండు. విణ. మెండికులానికి చెందిన వాడు.

**మెండె** రూ.చూ. మండె[1]. వి. 1. నలచదరంగా వేసే పంటగడ్డికుప్ప ; 2. పొగాకు తోరణాలు ఆరిన తరువాత పేర్చినకుప్ప ; 3. పొట్టు మొ. వి దాచటానికి చుట్టూ చొప్పతో కట్టే ఆవరణం ; 4. తూర్పారపొయ్యటానికి సిద్ధంచేసిన బూగరరాశి లేక మదనం ; 5. పత్తికాయలు కోసి వేసినకుప్ప ; 6. నలచదరంగా వేసిన చొప్పవామి.

**మెండెకట్టు** రూ.చూ. మండెకట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్ప కట్టు. **మెండెకుచ్చెల** రూ.చూ. మండెకుచ్చెల. వి. కళ్ళంలో మెదిగిన చొప్పను తీసి నలచదరంగా వేసిన కుప్ప. **మెండెగూడు** రూ.చూ. మండెగూడు. వి. కంకులు దాచిపెట్టటానికి గడ్డితో కట్టిన ఆవరణం. **మెండెదింపు** రూ.చూ. మండెదింపు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పవేయు. **మెండెపెట్టు** రూ.చూ. మండెపెట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పగా పెట్టు. **మెండెవేయు** రూ.చూ. మండెవేయు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పవేయు.

**మెండెము** రూ.చూ. మెండియము. వి. చూపుడువేలికి పెట్టుకునే ఉంగరం.

**మెండీఁడు** వి. చూపుడువేలు, తర్జని, ప్రదేశిని. విజ్ఞా. 1.77 ; విణ. మార్గదర్శకుడు. పండి.చ. 5.358పు. <మెండెము + -ఈఁడు.

**మెండేయు** చూ. మెండు.

**మెండొగ్గు** చూ. మెండు.

**మెండొడ్డు** చూ. మెండు.

**మెండోడు** చూ. మెండు.

**మెండ్రించు** స.క్రి. బలంగా కెలుకు.

**మెణ్ణాలు** చూ. మెడ.

**మెతక** రూ.చూ. మెదుక. విణ. 1. మృదువైన ; 2. మందం గల ; వి. మెత్తనినేల.

**మెతకకంచురాయి** వి. తెల్లటి క్వార్జైట్ రాయి. **మెతకకాల్పు** రూ. మెతక్కాల్పు. వి. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగా ఉండటం. **మెతకగొట్టు** రూ. మెతగ్గొట్టు. స.క్రి. గుడ్డపిడచతో పడుగుకు గంజి పట్టించు. **మెతకనూలు** రూ. మెతువనూలు, మెత్కనూలు. వి. పురి తక్కువనూలు. **మెతకమనిషి** వి. మృదుస్వభావం గల మనిషి. **మెతకరాయి** రూ. మెతుకురాయి. వి. మెత్తగా ఉండి ఇసుక రాలుతూ ఉండేరాయి. **మెతక్కాల్పు** రూ.చూ. మెతకకాల్పు. వి. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగా ఉండటం. **మెతగ్గొట్టు** రూ.చూ. మెతకగొట్టు. స.క్రి. గుడ్డపిడచతో పడుగుకు గంజి పట్టించు. **మెత్కనూలు** రూ.చూ. మెతకనూలు. వి. పురి తక్కువనూలు.

**మెతక్కాల్పు** చూ. మెతక.

**మెతకగ్గొట్టు** చూ. మెతక.

**మెతబర్** రూ.చూ. మోతుబరి. వి. 1. మంచిస్థితిలో ఉన్న ; 2. ఆర్థికసంబంధమైన ; 3. అప్పులు చెల్లించే శక్తికలిగి

ఉండటం.

**మెతుక** రూ.చూ. మెదుక. విణ. 1. మృదువైన ; 2. మందం గల. వి. తలవెంట్రుకల్లో చెమట మొ. వాటివల్ల ఏర్పడిన మురికి.

**మెతుకు**[1] రూ. మెదుకు. వి. అన్నకణం, సిక్థం. విజ్ఞా. 1.68.

త. మితవై. అన్నం, పప్పుతో చేసినది, వితలై. అన్నం, మెతుక్కు. అన్నం, మెదుక్కు.

**మెతుకు**[2] రూ.చూ. మెదుక. వి. 1. లజ్జు ; 2. మెత్తదనం.

**మెతుకురాయి** రూ.చూ. మెతకరాయి. వి. బొంతురాయి, మెత్తగా ఉండి ఇసక రాలుతూ ఉండే రాయి.

**మెతువు** రూ.చూ. మెదుక. విణ. మృదువు. వి. లజ్జు, మెత్తదనం.

**మెతువునూలు** రూ.చూ. మెతకనూలు. వి. పురితక్కువ నూలు.

**మెత్కనూలు** చూ. మెతక.

**మెత్త** రూ. మెత్తా. విణ. 1. మృదువైన, సుకుమారమైన. భార. విరా. 4.13 ; 2. అల్పమైన, కొంచెం. పాండు. 5.109 ; 3. సరసమైన, రసార్ద్రమైన. సారంగ. 2.87 ; వి. 1. గుఱ్ఱం బల్లకింద పరుపు. వరాహ. 4.120 ; 2. తల్పం, పరుపు. వరాహ. 4.156, కాళ. 1.99 ; 3. గుఱ్ఱంబల్ల. రసిక. 1.85 ; 4. సాగరం మోసే ఎద్దులగంతమీద పరుపు ; 5. గానుగ చక్రం బెనగకుండా బిగించే కొయ్యముక్క ; 6. బండిమీద జల్లక్రింద వేసే గడ్డి ; 7. పశువులు పడుకోవటానికి కొట్టంలో వేసేగడ్డి ; 8. అరుగుకు ఒక అంచున కట్టే ఆనుదు ; 9. మట్టిపాత్రల్ని సర్సేటప్పుడు కింద ఒత్తుగా పెట్టుకొనే చిన్న దిండు ; 10. కమాను, దూది ఏకే కొయ్యపనిముట్టు ; 11. రంగు తొట్టిలో పరుపుమీద వేసిన ముతకగుడ్డ ; 12. కలంకారీ అద్దకంలో రంగులద్దే బట్ట పరవటానికి ఒత్తుగా గుడ్డలు పెట్టినబల్ల ; క్రి.విణ. మందంగా. దశా. 4.21.

క. మెత్తన్న. మృదువు, సుకుమారం, మెత్త. పరుపు ; కొడ. మెత్తె. పరుపు ; తు. మెత్తెన. మృదువైన ; త. మెత్తై. పరుపుమెత్త, మెతు. మృదుత్వం, మెత్తదనం ; మ. మెత్త. పరుపుచుట్ట, మెత్త ; కో. మెద్. పరుపు ; తొ. మిద్రై. పరుపు, పక్క.

**మెత్తకట్ట** వి. మట్టిపాత్రల్ని సర్సేటప్పుడు కింద ఒత్తుగా పెట్టుకొనే చిన్నదిండు. **మెత్తకట్టరాయి** వి. కమిదమీద కూర్చుని కమిద కట్టమీద కుండనుపెట్టి సర్సేటప్పుడు కమిద ముందుభాగం మడత పడకుండా ఉండటానికి కుండ తిప్పేనప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి, బరువుగా పోటుగా పెట్టేరాయి. **మెత్తకన్ను** వి. చేసుకోసిన తరవాత నిలిచిఉండే బొప్పదంటు. రాజవా. 2.65. **మెత్తకాల్వ** రూ.చూ. మెత్తనికాల్వ. వి. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగాఉన్న స్థితి. **మెత్తకుదం** వి. వంట బానలు మొ. వాటిని రెండోసారి సర్సిన తీరు. **మెత్తగా** ద్రు. క్రి.విణ. మృదువుగా. < మెత్త + అగు + -అ[7] **మెత్తగాల్వ** రూ.చూ. మెత్తనికాల్వ. వి. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగాఉన్న స్థితి. **మెత్తగిలు** రూ. మెత్తగిల్లు. అ.క్రి. మృదువగు, మెత్తనగు. వేంక. పంచ. 1.609. **మెత్తగిల్లు** రూ.చూ. మెత్తగిలు. అ.క్రి. మృదువగు, మెత్తనగు. **మెత్తఁజేయు(-చేయు)** స.క్రి. మృదుత్వం కలిగించు, రసార్ద్రం గావించు. పాండు. 5,52. **మెత్తటిసక(-ఇసక)** వి. మన్నును పాకంగా చేయటానికి మసితోపాటు మట్టిలో కలిపే ఇసక. **మెత్తతుంగ** వి. తుంగలో ఒకరకం (Cyperus species). **మెత్తన** వి. 1. కామక్రోధాదులు లేకపోవటం. భార. ఆది. 4.39 ; 2. మృదుత్వం, మెత్తదనం, ఆము. 4.219, విణ. మృదువు. భార. విరా. 1.98 ; క్రి.విణ. మెల్లగా, ఒయ్యన. శృం.నై. 3.119, హర. 2.95. క. మెత్తగె, మెత్తిగె, మృదుత్వం, మెత్తనె, మెత్తన్నె, మెత్తానె. మృదువైన, మెదు. మృదువైన ; త. మెత్తణవు ; నా. మెత్తె. మెత్తని. **మెత్తనకాల్వ** రూ.చూ. మెత్తనికాల్వ. వి. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగాఉన్న స్థితి. **మెత్తనికాల్వ** రూ. మెత్తకాల్వ, మెత్తగాల్వ, మెత్తనకాల్వ. వి. 1. ఆములో కుండలు సరిగా కాలక మెత్తగాఉన్నస్థితి; 2. మెత్తనిమనస్సు, మృదుహృదయం. **మెత్తనిది** విణ. మెత్తగా ఉండేది, మృదువైన. **మెత్తనివాఁడు** విణ. నెమ్మదైనవాడు. **మెత్తఁదనము(-తనము)** వి. మృదుత్వం, మార్దవం. కు.సం. 10.162. **మెత్తపట్టు** వి. మృదువుగా ఉండే పట్టు. **మెత్తపఱచు** స.క్రి. (తోలును) మెత్తపరచు, మృదువుగాచేయు. **మెత్తపాటు** వి. మృదుత్వం, ఆలస్యం. **మెత్తబారు** రూ.చూ. మెత్తఁబాఱు. అ.క్రి. మృదువగు. **మెత్తబొద్దు** వి. తుంగమాదిరిగా ఉండే మెత్తటి ఆకుల కలుపుమొక్క (Finbristylis genus). **మెత్తమెత్తగావచ్చు** అ.క్రి. మెల్లమెల్లగావచ్చు. హంస. 1.192. **మెత్తఁబడు (-పడు)** రూ. మెత్తపడు. అ.క్రి. 1. లొంగు, వశమగు. భార. విరా. 2.54 ; 2. మృదువగు, బింకం విడచు. భార. ఉద్యో. 3.92 ; 3. తగ్గు, క్షీణించు. విజయ. 3.107 ; 4. రసార్ద్రమగు. రసిక. 3.76 ; 5. లోబడు, ఎదిరింపలేకపోవు. పర.రా. అయోధ్యా. 340 పు. 20 పం. ; 6. ఆర్థికంగా దెబ్బతిను ; 7. ఎద్లు, దున్నలు బాగా పని చేసి గిట్టలు మెత్తబడి నడవ లేకుండు. **మెత్తఁబాటు(-పాటు)** వి. 1. మృదుత్వం మార్దవం, బింకంలేని. భార. ఆరణ్య. 6.34 ; 2. మాంద్యం. చంద్రాంగ. 5.42. **మెత్తఁబారు** రూ.చూ. మెత్తఁబాఱు. అ.క్రి. మెత్తబడు. **మెత్తఁబాఱు (-పాఱు)** రూ. మెత్తబారు, మెత్తఁబారు. అ.క్రి. మెత్తబడు. చంద్రాంగ. 5.42. **మెత్తవడు(-పడు)** రూ.చూ. మెత్తఁబడు. అ.క్రి. 1. మృదువగు ; 2 శాంతపడు ; 3. అణగు.

**మెత్తడము** చూ. మెత్తు.

**మెత్తడి** వి. ఒకజాతి చిన్న చేప.

త. మెత్తంపారై. ఒకరకం చేప.

**మెత్తర** రూ.చూ. ముత్తర. వి. విన్నాణం.

**మెత్తళ్** చూ. మెత్తాళ్. వి.బ.వ. చిన్నరకం చేపలు.

**మెత్తా** రూ.చూ. మెత్త. వి. తలదిండు.

**మెత్తాల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు చన్నీళ్ళతో కలిపి నూలుకు వేసే రంగు.

**మెత్తాళ్** చూ. మెత్తడి వి.బ.వ. చిన్నసముద్రజాతి చేపలు.

దశకు. 5.35. మేడ్వెట్టు స.క్రి. వంచించు, దశకు. 5.38.

**మేడు**[2] చూ. మేడ[1]. వి. మిర్రు, మెట్టభూమి.

**మేడెము**[1] రూ. మేడియము[1]. వి. **1.** యుద్ధం. బసవ. 6.25 ; **2.** కలహం, తగవు. తాళ్ల.సం. 14.2 ; **3.** గుంపు, సంఘం. ఉ.రా. 3.186.

సం. మేళన-. కలయిక.

మేడెముబెట్టు అ.క్రి. **1.** పనిచేయకుండా భీష్మించు ; **2.** హఠం పెట్టుకొను.

**మేడెము**[2] రూ. మేడియము[2]. వి. **1.** చెక్కడపు జమ్మికి అంచు పనితనం. భాగ. 10.6.116 ; **2.** మెట్టపంటలు కోసి కట్టిన కట్టల్ని కోనుగా నిలబెట్టి పేర్చిన కుప్ప.

**మేడెము**[3] వి. గుదస్థానం. విష్ణుపు. 8.371.

సం. మిథః. పరస్పరం.

**మేడెము**[4] చూ. మేలు. విణ. శ్రేష్ఠమయిన. తాళ్ల.సం. 8.140.

**మేడెలం** చూ. మేడి[2].

**మేడ్పఱు** చూ. మేడు[1].

**మేడ్పఱచు** చూ. మేడు[1].

**మేడ్వెట్టు** చూ. మేడు[1].

**మేణత** వి. **1.** ముట్టడి. నె.శా. ఉదయగిరి శిలాశాసనం. క్రి.శ. 1514 ; **2.** చెర, నిర్బంధం.

సం. మేథ-. పొట్టేలు ;

త. మేట్టమ్. పొట్టేలు.

**మేంఢ్రించు** స.క్రి. **1.** పోగొట్టు, నశింపచేయు. భాగ. 10 పూ. 124 ; **2.** భేదించు, స్ఫోటించు ; **3.** చీల్చు ; **4.** నూరు.

సం. మేఢ్ర-. పొట్టేలు.

<సం. మేఢ్ర-+-ఇంచు[3].

**మేఁడి** రూ. మేడి[2]. వి. మేడితోక, నాగటిదుంప వెనక నిలిపిన కొయ్య. శేషధ. 4, ఆం.శా. 2.232.

సం. మేధి-. కళ్ళంలో పశువుల్ని కట్టటానికి పాతిన రాయి ; ప్రా. మేఢీ, మేహి. పశుబంధనకాష్ఠం, ఆధార స్తంభం ; ఆ.మూ. మేఢి. పశువుల్ని కట్టివేసే గుంజ, చిన్నగుంజ ;

క. మేటి, మేడె, మేణి. మేడితోక ; త. మేటి. నాగటిదుంప వెనక నిలిపిన కొయ్య, మేజయర్. వ్యవసాయదారులు ; మ. మేఴి, మేన్నల్. నాగలి చివర ; కో. మె.య్. నాగలి పిడి ; కుఇ. మేరి.

<ప్రా. మేఢీ.

మేఁడికట్టు రూ. మేడికట్టు. వి. నాగటిదుంప వెనక ఉండే కొయ్య. మేడికొయ్య వి. నాగటిదుంప వెనక ఉండే కొయ్య. మేఁడికోరు వి. సేద్యగానికి వచ్చే ధాన్య భాగం. మేఁడికోల రూ. మేడికోల. వి. ఈశ, నాగలి. మేఁడిచీల రూ. మేడిచిల్ల, మేడిజిల్ల. వి. మేడి జారి రాకుండా వేసిన చీల. మేఁడితోక రూ. మేడితాక, మేడితోక. వి. దున్నే వాడు పట్టుకోవటానికి మేడి చివర అడ్డంగా చెక్కిన చిన్న కొయ్య. మేఁడిపాలు రూ. మేడిపాలు. వి. సేద్యగానికి వచ్చే ధాన్య భాగం. మేఁడసోగ రూ. మేడిసోగ. వి. మేడి చివరి కొయ్య, మేడితోక.

**మేతర్లఇనాం** వి. బాటసారుల మూటలు మోసే మాదిగవాని కిచ్చే ఇనాం.

**మేదకము** విణ. స్థిరమైన, కదలని మెదలని. తాళ్ల.సం. 17.187.

సం. మేదస్. వస, సప్తధాతువుల్లో ఒకటి, మేధాక-. బుద్ధికలది.

**మేదకుఁడు** రూ. మేదకుడు. వి. **1.** వెర్రిబాగులవాడు. గౌ.హరి.ఉ. 1497 ; **2.** సాత్త్వికుడు ; **3.** కపటంలేని వాడు.

సం. మేధాక-. బుద్ధిమంతుడు. మృదుక-. మెత్తని వాడు.

<సం. మేధాక-.

**మేదకురాలు** వి. సాత్త్వికురాలు.

సం. మేధాకా. బుద్ధిమంతురాలు.

<సం. మేధాకా+అలు.

**మేదర్లు** వి.బ.వ. మేదరవాండ్రు. ద. హిం. గా. సంపు. 4, గా.సం. 1048.

**మేదతనము** వి. సాత్త్వికత.

సం. మేదా. తెలివి.

<సం. మేధా+-తనము.

**మేదర** రూ.చూ. మాదర. వి. వెదురు తడకలు, చాపలు మొ.వి అల్లుకొని జీవించే ఒక జాతి.

మేదరకులము వి. చాపలు, బుట్టలు మొ.వి అల్లుకునే కులం. మేదరచాప వి. వెదురుచాప. మేదరదబ్బ రూ.చూ. మేదరబద్ద. వి. **1.** పెండె కట్టులో వాడటానికి చీల్చిన వెదురుదబ్బలు ; **2.** పన్నె కట్టుబడిలో ఈనెపుల్ల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద ; **3.** వాట తయారీలో సమ దళసరిని మన్ను లేపటానికి ఉపయోగించే వంకర వెదురు గొయ్య. మేదరది విణ. మేదర స్త్రీ. మేదరపెట్టె వి. వెదురు పెట్టె. మేదరబద్ద రూ. మేదరదబ్బ, మేదరిదబ్బ, మేదరిబద్ద. వి. వాట తయారీలో సమదళసరిని మన్ను లేపటానికి ఉపయోగించే వంకరగాఉండే వెదురుకొయ్య. మేదరమన్ను వి. ఎఱ్ఱదోరమన్ను, ఇటిక తయారీకి పనికివచ్చే మట్టి. మేదరమిట్రాయి వి. గుంటూరు జిల్లా ఒంగోలు సమీపంలోని మేదరమిట్ట ప్రాంతంనుంచి వచ్చే చలవరాయి. మేదరవాఁడు విణ. బుట్టలు మొ. వాటిని అల్లేవాడు. మేదరసాని రూ.చూ. మేదరిసాని. వి. మేదర స్త్రీ.

**మేదరి** వి. మేదరవాడు, వెదురుబద్దలతో చాపలు మొ. వి. అల్లే ఒకజాతివాడు. పండి.చ. 2.162 పు.

<మేదర+-ఇ[9].

మేదరికట్టె వి. వెదురు, నిర్మాణ ద్రవ్యంగా సర్వసాధారణంగా వాడుకలో ఉన్న తృణవిశేషం (Dendrocalanus hamilfonii). మేదరితట్ట వి. ఉప్పరితట్ట, మట్టి మోతకు పనికివచ్చే తట్ట. మేదరితడిక వి. తలుపు తడక, వెదురుబద్దలతో అల్లిన తడికె. మేదరిదబ్బ రూ.చూ. మేదరబద్ద. వి. పెండెకట్టులో వాడటానికి చీల్చిన వెదురు దబ్బ. మేదరిబద్ద రూ. చూ. మేదరబద్ద. వి. వెదురు, నిర్మాణ ద్రవ్యంగా సర్వసాధారణంగా వాడుకలో ఉన్న

తృణవిశేషం (Dendrocalanus hanilfonii). మేదరిసాని రూ. మేదరసాని. వి. మేదరవాని భార్య. పరమ. 1.199.

మేదావి వి. 1. బ్రహ్మచార్లు, 'మేధావీభూయాసమ్' అనే మంత్రాన్ని చెప్తూ అగ్ని కార్యాంతంలో పెట్టుకొనే బొట్టు. హరి.ఉ. 10.233 ; 2. అగ్నికార్యభస్మం, హోమభస్మం. పాండు. 4.125.

సం. మేధావిన్. తెలివికలవాడు, బుద్ధిమంతుడు.

<సం. మేధావిన్.

మేదావిబొట్టు రూ.చూ. మేధావిబొట్టు. వి. బ్రాహ్మణులు అగ్నికార్యాంతంలో కనుబొమల నడుమ పెట్టుకొనే భస్మం.

మేదించు రూ. మెదించు, మేడించు. స.క్రి. 1. మర్దించు, సూరు.కాశీ. 3.118 ; 2. నేర్పు, అభ్యసింపచేయు, మప్పు. నార.పంచ. 5.13.

సం. మృద్. మర్దించు.

మేదిరము వి. మెదడు. మైరా. 3.145.

సం. మేదస్. వస.

మేదు చూ. మ్రేఁగు. స.క్రి. 1. పూయు. భోజ. 2.101 ; 2. మెదుపు. పాండు. 4.152.

మేధావిబొట్టు చూ. మేదావి. రూ. మేదావిబొట్టు. వి. హోమాదులు చేసి ఆ భస్మంతో 'మేధావీభూయాసమ్' ఇత్యాదిగా మంత్రం చెబుతూ నుదుట పెట్టుకునే బొట్టు.

సం. మేధావిన్. మిక్కిలి బుద్ధిమంతుడు.

<సం. మేధావిన్ + బొట్టు.

మేన చూ. మేను.

మేనకపచ్చ వి. ఒకరకం లేత పచ్చరంగు.

సం. మేనా, మేనకా. అప్సరస్త్రీ.

మేనకోడలు చూ. మేను.

మేనగోడలు చూ. మేను.

మేనత వి. పదును.

మేనత్త చూ. మేను.

మేనత్తకొడుకు చూ. మేను.

మేనత్తమగఁడు చూ. మేను.

మేనపడుచు చూ. మేను.

మేనబాయ చూ. మేను.

మేనబావ చూ. మేను.

మేనమరిది చూ. మేను.

మేనమఱఁదలు చూ. మేను.

మేనమఱఁది చూ. మేను.

మేనమామ చూ. మేను.

మేనయత్త చూ. మేను.

మేనయల్లుఁడు చూ. మేను.

మేనఱికము చూ. మేను.

మేనఱికములాడు చూ. మేను.

మేనల్లుఁడు చూ. మేను.

మేనవదిన చూ. మేను.

మేనవదినె చూ. మేను.

మేనవాఁడు చూ. మేను.

మేనవారిపడుచు చూ. మేను.

మేనవావి చూ. మేను.

మేనా[1] వి. పల్లకి.

హిం.ఉ. మ్యానా. పల్లకి, డోలీ ;

క. మేన. పల్లకి.

<ఉ. మ్యానా.

మేనా[2] రూ.చూ. మీనా. వి. 1. నేతలో పడే రంగు చుక్క ; 2. చేతితో అద్దే ఒకరకం కొయ్యఅచ్చు.

మేని చూ. మేను. వి. కాంతి, వెల్తురు.

మేనికతీగ వి. ఆకుపచ్చతోకూడిన పసుపురంగు పూలుపూసే తీగ (Maerua arenania).

మేనిపచ్చి చూ. మేను.

మేనిలోఁగోర్కి చూ. మేను.

మేను రూ.చూ. మే. వి. 1. శరీరం. కు.సం. 2.23, భార. విరా. 1.77 ; 2. పార్శ్వం, పక్క. భార.భీష్మ. 1.251 ; 3. జన్మం, పుట్టువు. విక్ర. 4.198 ; 4. ఏటవాలుగ వేసిన పెద్దమడవ, పైచేనికి కిందిచేనికి ఎత్తులో ఎక్కువ వార ఉన్నప్పుడు ఈ ఏటవాలు మడవ వేసి కింద గుంట పడకుండా చేస్తారు.

మేన విశ. స్త్రీకి తోడపుట్టినవానియొక్క, పురుషునికి తోడపుట్టిన దాని యొక్కయు, స్త్రీపురుషులకు తండ్రి తోడపుట్టిన దాని యొక్కయు, తల్లితోడ పుట్టిన దాని యొక్కయు, దేహ సంబంధం కలవాడు, కలది (దీనికి వ్యస్తప్రయోగం లేదు). క. మయ్దున, మయ్దెద, మయ్దన. స్నేహితుడు, భర్త, బంధుత్వం, సోదరిభర్త, భర్తసోదరుడు, భార్యసోదరుడు, మేనత్త, మేనమామ పిల్లలు ; కొడ. మచ్చినొ. మేనత్తకొడుకు (చిన్నవాడు), బావ, మచ్చిణి, మచ్చిణిచి. (చిన్నది) మేనమామ కూతురు, మయ్మె. మేనఅల్లుడు, అల్లుడు, మయ్మ. మేనకోడలు, కోడలు ; మ. మైతినె, మైదునె. భర్త తమ్ముడు, మేనమామ కొడుకు, సోదరిభర్త, మైతిది, మైతెది. వదిన, మేనత్తకూతురు, మేనమామ కూతురు ; త. మైత్తుణన్, మచ్చుణన్. బావమరిది, బావ, మైత్తుణి. భార్యసోదరి, తల్లిసోదరుని కుమార్తె, తండ్రి సోదరి కుమార్తె, సోదరునిభార్య. మచ్చిణి, మచ్చిణచ్చి, మచ్చిణిచ్చి. వదిన, మచ్చంపి. అక్క భర్త, మేనత్తకొడుకు, మేనమామకొడుకు, మచ్చాంటాల్. భర్త అన్న, మచ్చాలి. అన్న భార్య, మచ్చాళ్, మచ్చి. భార్యసోదరి, మేనత్తకూతురు, మేనమామకూతురు, మచ్చాన్. భార్యసోదరుడు, సోదరిభర్త, మేనత్తకొడుకు, మేనమామకొడుకు, మచ్చుణమై. బావ, బావమరది సంబంధం, మతిణి. అన్నభార్య, వదిన, మైంతన్. కుమారుడు, కుర్రాడు, బలవంతుడు, నాయకుడు, భర్త, మ. మచ్చుణన్, మచ్చిణన్. మేనత్తకొడుకు, మేనమామకొడుకు, మచ్చునిచ్చి. మేనత్త, మేనమామ కూతురు ; కో. మచిన్. బావమరిది ; తొ. మొచిత్రె. మేనత్తకొడుకు, మేనమామ కూతురు ; గోం. మై. స్త్రీ, భార్య, మైజు. భార్య, మెయిదో. భర్త ; కొం. మేమరి.

భర్త. పురుషుడు; కురు. మే, త్. మేత. (పెద్ద) పురుషుడు, భర్త. మై. బాలిక, తనకంటె చిన్నవారైన స్త్రీలను సంబోధించే విధానం. మేనకోడలు రూ. మేనగోడలు. వి.బొ. పురుషునికి తోడబుట్టినదాని కూతురు. స్త్రీకి తోడబుట్టిన వాని కూతురు. మేనగోడలు(-కోడలు) రూ.చూ. మేనకోడలు. వి. పురుషునికి తోడబుట్టినదాని కూతురు, స్త్రీకి తోడబుట్టినవాని కూతురు. మేనత్త రూ.చూ. మేనయత్త. వి. తండ్రితోడ పుట్టినది. భార.ఉద్యో. 3.137. మేనత్తకొడుకు వి. తండ్రి సోదరికొడుకు. భార.శల్య. 2.299. మేనత్తమగ(డు వి. తండ్రి సోదరి భర్త. మేనపడుచు వి. మేనకోడలు. తాళ్ల. నం. 13.177. మేనబాయి రూ.చూ. మేనబావ. వి. మేనత్త కొడుకు. మేనబావ రూ. మేనబాయ. వి. తనకంటె పెద్ద వాడైన మేనమామకొడుకు, మాతులేయుడు, తనకంటె పెద్ద వాడైన మేనత్తకొడుకు. మేనమరిది రూ.చూ. మేనమఱంది. వి. తనకంటె చిన్నవాడైన మేనమామకొడుకు లేక మేనత్త కొడుకు. మేనమఱ(దలు వి. బొ. తనకంటె చిన్నదైన మేనమామ కూతురు. మేనత్త కూతురు. భార. ఆది. 8.208. మేనమఱ(ది రూ. మేనమరిది. వి. తనకంటె చిన్నవాడైన మేనమామ కొడుకు, మేనత్త కొడుకు. భార.అశ్వ. 3.177. మేనమామ వి. తల్లితోడపుట్టినవాడు, మాతులుడు. భార.సభా. 1.268, హరి.ఉ. 1.169. మేన యత్త(-అత్త) రూ. మేనత్త. వి. తండ్రితోడపుట్టినది. భార. ఆది. 5.17. మేనయల్లుడు(-అల్లు(డు) రూ.చూ. మేనల్లు(డు. వి. పురుషునికి తోడుబుట్టిన దానికొడుకు, భాగినేయుడు, స్త్రీకి తోడబుట్టినవానికొడుకు మేనతికము వి. 1. పరిహాసం. మను. 4.96; 2. మేనమామ కూతుర్ని మేనత్తకొడుక్కిచ్చి చేసే పెళ్ళి సంబంధం. మేనతికములాడు అ.క్రి. పరిహాస మాడు. మేనల్లు(డు రూ. మేనయల్లు(డు వి. పురుషునికి తోడబుట్టిన దానికొడుకు, భాగినేయుడు, స్త్రీకి తోడబుట్టిన వాని కొడుకు. భార. విరా. 5.36. మేనవదిన రూ.చూ. మేనవదినె వి. తండ్రిసోదరి లేదా తల్లిసోదరుని కూతురు. మేనవదినె రూ. మేనవదిన. వి. తండ్రిసోదరి లేదా తల్లిసోదరుని కూతురు, మేనత్త, మేనమామలకూతురు. మేనవా(డు విణ. మేనమామ. తాళ్ల. నం. 13.202. మేన వారిపడుచు వి. మేనకోడలు. తాళ్ల. నం. 16-2-89. మేన వావి వి. మేనత్త, మేనమామ సంబంధం. తాళ్ల. నం. 8.258. మేనిపచ్చి వి. శరీరసౌందర్యం. తాళ్ల. నం. 15.77. < మేను + -ఇ[3] + పచ్చి. మేనిలో(గోర్కి వి. కామం, వలపు. < మేను + -ఇ[3] + -లో + కోర్కి. మేనుగను (-కను[3]) అ.క్రి. రూపొందు. విజయ. 1.42. మేనుచెమర్చు అ.క్రి. శ్రమపడు. శశి. 2.96. మేనుతాలుపు రూ. మేను తాల్పు. వి. ప్రాణి, జీవి. మేనుతాలుపులసామి రూ. మేను తాల్పులసామి. వి. వరుణుడు. మేనుతాల్పు రూ.చూ. మేనుతాలుపు. వి. ప్రాణి, జీవి. మేనుతాల్పులసామి రూ. చూ. మేనుతాలుపులసామి. వి. వరుణుడు. మేనుదొఱ(గు (-తొఱ(గు) అ.క్రి. చచ్చు. రుక్మా. చ. 3.77. మేనునిడు వెంట్రుకపెట్టు అ.క్రి. గగుర్పాటుకలుగు. భాగ. 10ఉ.872. మేనుపుట్టువు వి. 1. కుమారుడు; 2. కుమార్తె. మేనుపొంగు అ.క్రి. ఉప్పొంగు. ఉ. హరి. 1.150. మేనుమఱచు అ.క్రి. ఒళ్ళుతెలియకుండు, పరవశం అగు. పాండు. 1.181. మేనుమాను అ.క్రి. జన్మమెత్తు. అవతరించు. మేనువాల్చు అ.క్రి. పరుండు, పండుకొను. మేనువైచు అ.క్రి. పండు కొను, శయనించు. శివరా. 2.22. మేనెల్ల(గన్నులుగావించు అ.క్రి. అత్యాసక్తితో చూచు. మను. 5.7. < మేను + ఎల్లన్ + కన్ను + -లు + అగు + -అ[7] + ఇంచు[3]. మేనోస రించు స.క్రి. శరీరాన్ని విడుచు, చనిపోవు. పాండు. 1.101. < మేను + ఓసరించు.

మేనెల్ల(గన్నులుగావించు చూ. మేను.

మేనేజరు వి. పైఅధికారి, కార్యనిర్వాహకుడు.

ఇం. *Manager*. కార్యనిర్వాహకుడు

< ఇం. Manager.

మేనోసరించు చూ. మేను.

మే(త చూ. మేయు.

మే(తకా(డు చూ. మే(త.

మే(తనడచు చూ. మేయు.

మే(తమేయు చూ. మేయు.

మే(తరి చూ. మేయు.

మే(తరీ(డు చూ. మేయు.

మే(తలాడు చూ. మేయు.

మే(తాడు చూ. మేయు.

మే(తాలాడు చూ. మేయు.

మేపరి చూ. మేయు.

మేపాడు చూ. మేయు.

మేపించు చూ. మేయు.

మేపు చూ. మేయు.

మేపుడు చూ. మేయు.

మేపుడుకోడె చూ. మేయు.

మేము[1] అ.క్రి. స.క్రి. అంగీకరించు, ఒప్పుకొను.

మేముడు వి. 1. అంగీకారం, ఒప్పుదల. ఆం. భా. 1.104; 2. సమ్మతి.

మేము[2] రూ. ఏము[1]. సర్వ. బ.వ. అస్మచ్ఛబ్ద ప్రథమా బహు వచనం. భార. ఆది. 6.128.

క. అమ్, అస్మచ్ఛబ్ద బహువచనరూపం; కొడ. ఎంగ, నంగ; తు. ఎంకుళు-; త. యామ్, నాంకళ్, యాంకళ్-; మ. ఞాఞ్ఙళ్, ఞఙ్ఙళ్-; కో. అమ్; తొ. ఎమ్; గోం. అమ్మట్, మమ్మట్, మమాట్, మాట్, మామట్, మమెట్, మమొ, మరాట్; కొం. మాన్-. మాప్; కుఇ. ఆము, మాము; కువి. మాంబు, మారో, మ్యారో; పర్జి. అమ్, అమొెర్; కొలా. అ.మ్. పెంగో. అప్, అపెజ్, అస్, అహెజ్, ఆసెజ్; మండ. ఆం; నా. అమ్; కురు. మాల్లా. ఎమ్.

< మూ.ద్రా. *యామ్.

మమ్ము[1] సర్వ. ద్రు. మేము సర్వనామశబ్దం యొక్క ద్వితీయా బహువచన రూపం. భార. ఆది. 2.151. మా[4] సర్వ. మేము, సర్వనామశబ్దం యొక్క తృతీయాది విభక్త్యంగం. భార. ఆది. 1.100. మేమే[1]. అవ్య. మేము

మాత్రమే. < మేము + -ఏ³.

**మేమే¹** చూ. మేము.

**మేమే²** అవ్య. తాడనాదుల్లో దుఃఖంవల్ల కలిగే ధ్వనికి అనుకరణం. పార్వ. 4.128.

**మేమే³** వి. మేకయొక్క అరుపు.

**మేయి** రూ.చూ. మై¹. వి. మేను. శరీరం.

**మేయికొను** రూ.చూ. మైకొను. స. క్రి. అంగీకరించు. తాళ్ల. సం. 5.194.

**మేయించిబొంకు** చూ. మేయు.

**మేయు** స.క్రి. 1. (పశ్వాదులు) తిను, భక్షించు. కు. సం. 1.81 ; 2. నోటఉంచు. శృం. నై. 5.157 ; 3. అనుభవించు. చంపూరా. 5.60 ; 4. లోలోపల ఎచ్చు.

క. మే. మేయు, మేయ్. (మేయ్‌ద్-). తిను, గడ్డితిను, భక్షించు, మేయిసు, మేసు. తిను, నములు, మేపు, మేహు, మేవు. పశువులు మేత మేసే పొలం ; కొడ. మె.య్. (మె.వ్-, మెయువు- మెంజ్). పచ్చికమేయు, మెచి. (పశుపక్ష్యాదులు) తిండి, మేత ; తు. మెయుని, మేపిని. పచ్చికమేయు, మేపుని. మేపు, పశువులనుమేపు, మేపావుని. మేపు, తినిపించు, మేచెలు. మేత, పచ్చిక, పచ్చికపొలం, మేపరి, మేపాఁలి. పశువులను మేపేవాడు, మేపు, మేవు. మేత, పచ్చికపొలం, మేవ. తియ్యనిది, తినేది, త. మేయ్ (-వ్,- న్ట్-). తిను. భక్షించు, కొంచెం కొంచెం తిను, మేయు, తినిపించు, మేపు, మేయ్‌క్క, పశువుల కాపరి, గొర్రెల కాపరి, మేయ్‌చ్చల్. నెమరు వేయటం, మేయటం, ఆహారం, చెరునడత, మెయ్‌ప్పణ్. గొర్రెలకాపరి, మేయల్. పశువులమేత, మేయవణ్, మేయాణ్. నివాసి, కాపురమున్నవాడు ; మ. మేయ్‌క. నెమరువేయు, నములు, మెయ్‌క్క. పశువులనుమేపు, తినిపించు, మేచ్చల్. కొంచెంగాతిను, మేయు, కో. మెయ్. (మెచ్-). తిను, మె.చ్. తినిపించు ; గోం. మేయినా. మేయు, మెహ్‌తానా. పశువులనుమేపు, మేహ్‌తార్. పశువులకాపరి, మేహానా. మేయు ; కువి. మెయలి. మేయు. మేనై. తిను ; పర్జి. మేయ్. మేయు. మేకప్. (మేకత్-). మేపు ; కొలా. మి-. (మి-త్-). మేయు, మి-ప్-. మేపు ; నా. మియ్. పచ్చికమేయు. మిప్. మేపు. కురు. మెన్నా. పచ్చికమేయు ; మాల్తో. ంెనె. తిను. మెదె. తిను, భుజించు ; బ్రా. బెయ్. పచ్చిక.

< మూ.ద్రా. *మెయ్.

**మేఁత** వి. 1. పశుపక్ష్యాదుల ఆహారం. పారి. 2.69 ; 2. తిండి. పాండు. 1.213. **మేఁతకాఁడు** వి. తిండిపోతు, మేతరి. వరాహ. 11.14. **మేఁతనడచు** అ.క్రి. ఆహారం కలుగు, తిండిదొరుకు. **మేఁతమేయు** స.క్రి. 1. తిను ; 2. లంచం తిను. **మేఁతరి** రూ. మేఁతరీఁడు. వి. 1. తిండిపోతు, ఘస్మరుడు. అచ్చ.రా.బాల. 113 ; 2. ముఖ్యుడు. చెన్నబసవ. 2.204 ; 3. మేస్త్రి ; 4. శిష్యుల్లో ముఖ్యుడు ; 5. పెద్ద ; 6. చిల్లరకులాలకి కులశ్రేష్ఠనామం. < మేఁత + -అరి. **మేఁతరీఁడు** రూ.చూ. మేఁతరి. విణ. ముఖ్యుడు. చెన్నబసవ. 2.214. **మేఁతలాడు** రూ. మేఁతాలాడు. అ.క్రి. మేతవేయు. < మేఁత + -లు + -ఆడు. **మేఁతాడు** అ.క్రి. మేతమేయు. < మేఁత + ఆడు. **మేఁతాలాడు** రూ.చూ. మేఁతలాడు. అ.క్రి. మేతమేయు. **మేపరి** వి. తినేవాడు. < మేపు + -అరి. **మేపాడు** అ.క్రి. ఆహారం గొను, తిను. వేంక. పంచ. 3.108. < మేపు + ఆడు. **మేపించు** స.క్రి. మేసేట్లుచేయు. < మేపు + -ఇంచు³.

**మేపు** వి. 1. (పశుపక్ష్యాదుల) ఆహారం, తిండి. భార.అను. 3.18 ; 2. దోసె పిండి మొ. వాటికి నూరి కూడా చేర్చే మినపప్పు మొ. వి ; స.క్రి. పశుపక్ష్యాదుల్ని ఆహారం తినేట్లుచేయు. శృం.నై. 4.45. **మేపుడు** వి. మేత అచ్చ.రా.యు. 263 ; విణ. మేసేది. అచ్చ.రా.యు. 293. **మేపుడుకోడె** వి. వ్యవసాయాని కుపయోగించే కోడె **మేయించిబొంకు** స.క్రి. సత్యం అనిపించేటట్లుగా అబద్ధమాడు. హంస. 4.164. త. మెయ్. సత్యం. < మేయు + -ఇంచు³ + -ఇ¹³ + బొంకు.

**మేర¹** వి. ధనరూపకంగాగాని, ధాన్యరూపకంగాగాని విధించబడే సుంకం. ద.హిం.శా.సంపు. 10, శా.సం. 422, క్రీ.శ. 1269.

త. మేరై. గ్రామాధికారులకు గ్రామసేవకులకు కళ్ళం నుంచి ధాన్యరూపంగా వంశపారంపర్యంగా తీసి చెల్లించే పంట భాగం.

**మేరగాండ్లు** వి.బ.వ. ధనరూపకంగాగాని, ధాన్యరూపకంగాగాని ఆయా స్వాస్త్యాలనుగాని చెల్లించే గ్రామీణులు. నె.శా. 8. **మేరగింజలు** వి.బ.వ. మంగలి, చాకలి మొ. ఆయగాళ్ళకు కళ్ళంలో కొలిచే గింజలు. **మేరధాన్యము** వి. ధాన్యరూపంగా చెల్లించే పన్ను లేక సుంకం. నె.శా. రాపూరు శాసనాలు. 3. **మేరవాళ్ళు** విణ.బ.వ. ఆయగాళ్ళు, మానేగాళ్ళు, గ్రామంలో రైతు దగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకున్న ప్రకారం కళ్ళంలో ధాన్యం తీసుకునే చాకలి మంగలి మొ. వివిధ వృత్తులవాళ్ళు. **మేరస్వాస్థ్యము** వి. చెరువుల సంరక్షణార్థమై ధనరూపంగాగాని ధాన్యరూపంగాగాని విధించబడిన పన్ను చెల్లించటానికి ఇచ్చిన స్వామ్యం. నె.శా. కావలి. 1,

**మేర²** రూ. మేఱ. వి. 1. మర్యాద, హద్దు. కు.సం. 1.52. తె.శా.కా.శా. శా.సం. 32, క్రీ.శ. 1258 ; 2. ప్రదేశం, చోటు. భార.విరా. 1.245 ; 3. ఏర్పాటు. భార.ఉద్యో. 3.296 ; 4. పద్ధతి. నృసింహ. 5.17 ; 5. దూరం. కాశీ. 1.53 ; 6. క్రమం, విధం. భాను. 1.23 ; 7. ధర్మం, న్యాయం. పార్వ. 4.160 ; 8. మితి ; 9. వాయిదా ; 10. పొలంగట్టు.

సం. మర్యాదా. సరిహద్దు ; ప్రా. మేరా ;

క. మేరె. హద్దు.

< ప్రా. మేరా.

**మేరకంబము** వి. సరిహద్దు తెల్పటానికి పాతిన స్తంభం. కవిక. 3.146. **మేరకుమేర** వి. సరికిసరి. రాధికా. 2.113. **మేరగట్టు** వి. చక్రవాళపర్వతం. ఆం.భా. 2.28. **మేరతప్పు** రూ.చూ. మేరదప్పు. స.క్రి. హద్దుమీరు, ఆజ్ఞమీరు.

రాజగో. 195. **మేరదప్పు** రూ. మేరతప్పు. స.క్రి. హద్దు మీరు, న్యాయంవీడు. కళా. 8.129. **మేరమానిసి** వి. మర్యాదఉన్న మనిషి, పెద్దమనిషి. సారంగ. 2.264. **మేరమీఱు** స.క్రి. 1. అధికమగు. మను. 3.23 ; 2. హద్దుమీరు. **మేరయగు (-అగు)** అ.క్రి. సరిఅగు. హేమా. 9 ప. 34. **మేరలుమీఱు** స.క్రి. 1. అధికమగు. కకుత్స 2.128 ; 2. హద్దులుమీరు. **మేరవెట్టు (-పెట్టు)** అ.క్రి. కట్టడిచేయు. నృసింహ. 2.118.

**మేరవ** రూ.చూ. మేరువు. వి. ఎత్తుగా ఉండే గోడల్ని కట్టటానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం.

**మేరు** రూ.చూ. మేరువు. వి. 1. ఎక్కటానికి బరువెక్కించటానికి పొడుగ్గా కట్టలా వేయించే ఇసక మొ. వాటి దిబ్బ, సారువ; 2. పీణాగ్రం ; 3. హారం మధ్య వేలాడే మణి.

**మేరువ** రూ.చూ. మేరువు. వి. 1. మిట్ట, మిర్రు ; 2. పిడికి కిందగా ఉండే కుంచె భాగం ; 3. వీణాగ్రం.

**మేరువగవ్వ (-కవ్వ[1])** వి. సన్నని పండుగవ్వ.

**మేరువు** రూ. మేరవ, మేరు, మేరువ. వి. 1. ఎక్కటానికి, బరువెక్కించటానికి పొడుగ్గా కట్టలా వేయించే ఇసక మొ. వాటి దిబ్బ, సారువ. రాజవా. 5.49 ; 2. పీణాగ్రం. చంద్రికా. 2.95 ; 3. హారం మధ్య వేలాడే మణి ; 4. బరంతి, పునాదిగోడల మధ్యనున్న మట్టితో నింపవలసిన గుంట ; 5. ఎత్తుగాఉండే గోడల్ని కట్టటానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం ; 6. నాను పట్టెడల బిగింపు ; 7. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీకి కట్టిన చిన్న గోడ, తరం.

క. మేరువె, దిబ్బ, కుప్ప, ఎత్తైనది ;

పో.చూ. సం. మేరు-. బంగారుపర్వతం.

**మేరువుపలక** వి. మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె.

**మేరోడు** వి. దర్జీ.

**మేర్మాను** వి. 1. కానుక ; 2. గొప్పతనం.

హిం.ఉ. మెహర్. దయ, మెహర్ వాన్. దయాళువు. <ఉ. మేహర్‌వాన్.

**మేర్వుపుసికె (-ఉసుకు)** వి. నునుపైన ఇసుక.

**మేఱ** రూ.చూ. మేర[2]. వి. సరిహద్దు ; క్రి.విశ.ద్రు. సంకోచంగా.

**మేల్** రూ.చూ. మేలు. వి. 1. క్షేమం. ఆం భా. 98 ; 2. శుభం; 3. సెబాసు ; 4. అంతస్తు, ఇంటిపైన వేసిన ఇల్లు.

**మేల్కట్టు** రూ.చూ. మేలుకట్టు. వి. 1. ఉల్లెడ, వితానం. నీలా. 3.48 ; 2. మెట్టు. ద్వి.నల. 2 భా. **మేల్కంట** వి. మేలుకోవటం. **మేల్కత్తి** రు-. మేలుకత్తి. వి. ఖడ్గం, ఆడిదం. ఆం.భా. 2.214. **మేల్కనన్రితేనుపు** వి. మరణం. పాండు. 2 235. **మేల్కనినిద్దుర** వి. పెద్దనిద్ర, చాపు. భాస్క.రా.యు. 1587. **మేల్కను** రూ. మేలుకను. అ.క్రి నిద్రనుంచి లేచు. భార.ఆది. 5.172. **మేల్కనుపు** రూ. మేలుకనుపు. స.క్రి. మేలుకొనచేయు, మేలుకొలుపు. భాస్క.రా.బాల. 338 ; వి. మేలుకొల్పు. **మేల్కమ్మి** వి. ఒకరకం కమ్మి. **మేల్కాంచు** రూ. మేలుకాంచు. అ.క్రి. నిద్రనుంచి లేచు. భార.ఉద్యో. 3.183. **మేల్కొను** రూ.చూ. మేలుకొను. అ.క్రి. 1. నిద్రనుండి తెలివిమెందు, జాగ్రదవస్థనందు. భార.అను. 2.303 ; 2. రాబోయే కష్టాన్ని తప్పించుకొను, జాగ్రత్తపడు ; స.క్రి. మోహించు. **మేల్కొలుపు** రూ.చూ. మేలుకొలుపు. స.క్రి. 1. మేలుకొనచేయు. హర. 7.121 ; 2. వ్యక్తీకరించు, స్పష్టపరచు. **మేల్కొల్పు** రూ.చూ. మేలుకొలుపు. స.క్రి. 1. మేలుకొనచేయు. కువ.చ. 2.125 ; 2. వ్యక్తీకరించు, స్పష్టపర్చు. **మేల్గుజ్జు** రూ.చూ. మేలుగుజ్జు. వి. కొమరగుజ్జు, వెనుగాడిని మోసే పెద్ద గుంజ. **మేల్తరము** రూ. మేలుతరము. విశ. శ్రేష్ఠమైనది. వాల్మీ. 3.130. **మేల్తలఁచు** స.క్రి. కృతజ్ఞుడగు. రాజగో. 5.22. **మేల్దాపరి** వి. వేశ్య. సాంబ.మాన. 13. **మేల్దూలం** రూ.చూ. మేలుదూలము. వి. దూలం మీది గుజ్జులపై అమర్చబడే చిన్న అడ్డ దూలం. **మేల్పడు** రూ.చూ. మేలుపడు. అ.క్రి. వలపుగొను, మోహపడు. ఉ.రా. 4.193. **మేల్పని** వి. శుభకార్యం. అచ్చ.రా.అయోధ్యా. 44. **మేల్బంతి** రూ.చూ. మేలుబంతి. వి. 1. ఒరవడి లాంటిది, ఒక పని ఇతరులు నేర్చుకోవటానికి మొదలు చూపే మాదిరి. ఆము. 6.29 ; 2. విద్యార్థులు ఒరవడి రాసే మాదిరికి మీద మొదట రాసిన అక్షరాల పంక్తి, ఒరవడి, ఒజ్జబంతి ; విశ. శ్రేష్ఠుడు, శ్రేష్ఠురాలు. సారంగ. 2.211. **మేల్మచ్చు** రూ.చూ. మేలుమచ్చు. వి. 1. ఉప్పరిగ, సౌధం. కృష్ణరా. 2.127 ; 2. బాలక్రీడా విశేషం. పాంచాలీ. 1.57. **మేల్మాడి** రూ. మేల్మాలు, మేల్మాలె. వి. ఒకటికన్నా ఎక్కువ అంతస్తుఉన్న ఇల్లు. **మేల్మాలు** రూ.చూ. మేల్మాడి. వి. అంతస్తు, ఇంటిపైన వేసినఇల్లు. **మేల్మాలె** రూ.చూ. మేల్మాడి వి. ఒకటికన్నా ఎక్కువ అంతస్తులున్న ఇల్లు. **మేల్మి** రూ.చూ. మేలిమి. విశ. 1. శుభప్రదం, మేలు కలిగించేది. గౌ.హరి.పూ. 774 పం. ; 2. శ్రేష్ఠం, ఉత్కృష్ఠం. వి. 1. అపరంజి, ప్రశస్తమైన బంగారం. ఇందు. 2.140 ; 2. శ్రేష్ఠత, ఆధిక్యం. శుక. 1.263 ; 3. వలపు, ప్రేమ. **మేల్ముసుఁగు** రూ.చూ. మేలుముసుఁగు. వి. సువాసినులు వేసుకునే ముసుగు, అవకుంఠనం. విప్ర. 2.14. **మేల్వారం** వి. భూఖామందు ప్రభుత్వానికి ధనరూపంగాగాని, ధాన్యరూపంగా గాని చెల్లించే భాగం. **మేల్వారం శ్రోత్రియం** వి. సేద్యం చేసుకొనే హక్కు మాత్రమేకల ఇనాం, విక్రయ హక్కుండరాదు. **మేల్వాటు** వి. మిద్దెటిండ్ల పైకప్పున మట్టి పోయటం.

**మేలగొను** చూ. మేలము.

**మేలమాట** చూ. మేలము.

**మేలమాడు** చూ. మేలము.

**మేలము** వి. 1. పరిహాసం. భార. ఆది. 1.157 ; 2. పరిహాసోక్తి. భార. ఉద్యో. 3.179 ; 3. జాగరూకత. కృ.శకు. 3.59.

సం. మేలా-. కలయిక, ఐకమత్యం. సభ.

<సం. మేలా-. (అర్థవివరి.).
మేలగొను అ.క్రి. పరాచికాలాడు, మేలమాడు. దశా. 1.27. < మేలము + కొను. మేలమాట వి. పరిహాసం చేయటం. పల్నా. 6. < మేలము + ఆట. మేలమాడు అ.క్రి. 1. పరిహసించు, గేలిచేయు. భార. భీష్మ. 1.217 ; 2. కోడిగ మాడు. < మేలము + ఆడు. మేలములాడు అ.క్రి. హాస్యాలాడు. పారి. 5.89. < మేలము + -లు + ఆడు.
మేలాటము చూ. మేలు.
మేలి చూ. మేలు.
మేలికట్టు చూ. మేలు.
మేలిగాఁడు చూ. మేలు.
మేలిచీర చూ. మేలు.
మేలిచ్చుపులుఁగు చూ. మేలు.
మేలిపడుగు చూ. మేలు.
మేలిపూస చూ. మేలు.
మేలిమి చూ. మేలు.
మేలిమిగట్టు చూ. మేలు.
మేలిమిగట్టు విల్మేటి చూ. మేలు.
మేలిమిబొజ్జదుముదారి చూ. మేలు.
మేలిమిమెట్ట చూ. మేలు.
మేలిమిమెట్టవిల్మేటి చూ. మేలు.
మేలిల్లు[1] చూ. మేలు.
మేలిల్లు[2] చూ. మేలు.
మేలు రూ. మేల్. వి. ఔప. అనౌప. 1. లెస్స, బాగు. భార. ఆది. 1.26 ; 2. శుభం. భార. ఆది. 1.50 ; 3. అందం, చక్కదనం. భార. విరా. 2.83 ; 4. ఉపకారం. భార. ఉద్యో. 2.48 ; 5. శ్రేయస్సు. క్షేమం. భార. ఉద్యో. 3.260 ; 6. హితవచనం, మంచిమాట. భార. ద్రోణ. 1.51 ; 7. సుఖం. భార. శాంతి. 4.53 ; 8. వరం, దేవతల వల్ల అయ్యే లాభం. ఉ.హరి. 2.200 ; 9. సుకృతం, పుణ్యం. భాగ. 9.647 ; 10. న్యాయం. పాడి. భాగ. 10 పూ. 1350 ; 11. సారం, నిగ్గు. విక్ర. 2.87 ; 12. లాభం. ఆము. 4.258 ; 13. శ్రేష్ఠత, గొప్పతనం, ఆధిక్యం. ఆము. 6.98 ; 14. వలపు, మోహనం. వసు. 2.130 , 15. భద్రం. చంద్రభా. 3.148 ; 16. మదం. రాజవా. 2.45 ; 17. పైభాగం, ఉపరిదేశం; విణ. 1. శ్రేష్ఠమైన. భార. ఆది. 4.93 ; 2. అధికమైన, ఎక్కుడు, అధికురాలు. హరి.పూ. 7.104. శా.ప.మం. 5.47పు. ; 3. శుభప్రదమైనది, క్షేమంగల. భాగ. 1093. వరాహ. 11.39 ; 4. బాగు, లెస్సైంది. విక్ర. 1.20 ; 5. ఉచితమైన. పారి. 4.60 ; క్రి.విణ. సంపూర్ణంగా. భార. భీష్మ. 1.47 ; అవ్య 1. ప్రశంసను తెల్పుతుంది. భార. ఆది. 6.32 ; 2. పరిహాసాన్ని తెల్పుతుంది. శృం.నై. 6.114.

క. మేలు, మే. పైది, మేఁగు, మేగె. పైభాగం, ఉపరితలం, మేమ్. పై, మేణ్. పైది, మేల్ (ఉ), మేల, మేలె, పైది, మీదది పైభాగం, మేలుడు. పైవస్త్రం కొడ, మె, మది. పై అంతస్థు, మెజ్ గయ్. చెయ్యి వెనకభాగం, మెజ్ గలి. పాదం పైభాగం ; తు. మేలు. పైభాగం, ఆధిక్యత, శ్రేష్ఠత, మేలార. పై ; త. మే. శ్రేష్ఠత, ప్రాశస్త్యం, మేతను. ఉన్నతమైందిగా ఉండు, మేకుక. ఉన్నతస్థానం, మేతకై, మేతకవు. శ్రేష్ఠత, ప్రాశస్త్యం. గొప్పతనం, మేంతవై. శ్రేష్ఠత, ప్రాశస్త్యం, మేమ్-పటు. ఉన్నతమైన, గొప్పవైన, మేల్. ఎత్తైన, ఉన్నతమైన, మీద, ఆకాశం, నాయకత్వం, గొప్పదయిన, మేలుకుక. పైభాగం, అత్యధికమైన, అత్యున్నతమైన, మేలై. పై, పడమటి, మేలోర్, ఉన్నతస్థానాన్ని అధిష్టించిన, మేఝ్కు. పడమర, మేవినమై. గొప్పతనం, శ్రేష్ఠత, ప్రాశస్త్యం ; మ. మే. అధికం, మేన్. శ్రేష్ఠత, ఆధిక్యం, మేనవన్. శ్రేష్ఠమైన, మేఝకై. అధికారం, మేన్మ. శ్రేష్ఠత, గొప్పతనం, మేల్. పైది, శరీరం, మేలన్, మేలవన్. పై అధికారి, మేల్. పైకి, మేర్కుక. పడమటివైపు ; కో. మెమల్. ఉన్నతస్థానం, మెచిమ్. నీలగిరి పడమటి ప్రాంతం, మెకయ్, మైకి. పైచేయి, మెంగణ్. కఱ్ఱతేల వేయు ; తొ. మె-ల్. పైస్థాయి (సంగీతంలో), మె-తల్. (నడుంకి చుట్టుకొనే) గుడ్డపై అంచు, మె-తిన్. పడుకునే అరుగు, మెల్ పల్. పైకిపోయే ఆవిరి.

మేలాటము వి. కోలాటం, ఎక్కువ వాలుగాఉన్న ఆకు కప్పు. < మేలు + -ఆటము. మేలి విణ. మేలయిన ; వి. 1. మేలిమి ; 2. మెరకడి. < మేలు + -ఇ[3]. మేలికట్టు రూ.చూ. మేలుకట్టు. వి. వితానం, చాందినీ. < మేలు + -ఇ[3] + కట్టు. మేలిగాఁడు వి. శ్రేష్ఠుడు. అచ్చ.రా.యు. 267. < మేలు + -ఇ[3] + కాఁడు. మేలిచీర వి. ఎనిమిదిగజాల పొడుగు పెట్టి నేసిన పెద్దచీర. మేలిచ్చుపులుఁగు వి. గరుడుడు < మేలు + ఇచ్చు + పులుఁగు. మేలిపడుగు వి. కళ్ళంలో గింజలు రాలిన గడ్డితీసి గింజలున్న గడ్డితో వేసిన పడుగు. < మేలు + -ఇ[3] + పడుగు. మేలిపూస వి. ప్రధానమైన పూస. < మేలు + -ఇ[3] + పూస. మేలిమి రూ. మేల్మి. వి. 1. శ్రేష్ఠత, ఆధిక్యం. భార. ఉద్యో. 3.21 ; 2. వలపు, ప్రేమ. హంస. 3.228 ; 3. అపరంజి, ప్రశస్తమైన బంగారం. ఆం.భా. 2.279 ; విణ. 1. శ్రేష్ఠం, ఉత్కృష్టం. భార. ద్రోణ. 4.285 ; 2. శుభప్రదమైంది, మేలు కలిగించేది ; 3. ఆధిక్యం ; 4. గౌరవం. మేలిమిగట్టు వి. మేరు పర్వతం. అచ్చ.రా.యు. 204. మేలిమిగట్టువిల్మేటి వి. శివుడు, మేరుధన్వుడు. మేలిమిబొజ్జదుముదారి వి. బ్రహ్మ. మేలిమిమెట్ట వి. మేరుపర్వతం. మేలిమిమెట్టవిల్మేటి వి. శివుడు. మేలిల్లు[1] అ.క్రి. శ్రేష్ఠమగు, ఒప్పు. కు.సం. 10.26 ; వి. ఒప్పు, సొగసు. మేలిల్లు[2] వి. చంద్రశాల, పైమేడ. ఆం.భా. 3.48. < మేలు + ఇల్లు. మేలుకట్టు రూ. మేలికట్టు. మేల్కట్టు. వి. 1. ఉల్లెడ, వితానం, చాందినీ. కు.సం. 3.12. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1019 ; 2. మెట్టు. ద్వి.నల. 3.864 పం. ; స.క్రి. చాందినీ ఏర్పరచు. భార. భీష్మ. 1.242. మేలుకట్లెత్తు స.క్రి. చాందినీలుకట్టు. రం.రా. బాల. 39పు. 21పం. < మేలు + కట్టు + -లు + ఎత్తు[1]. మేలుకత్తి రూ.చూ. మేల్కత్తి. వి ఖడ్గం, అడిదం. మేలుకను రూ.చూ. మేల్కను. అ.క్రి. నిద్రనుంచి లేచు. భార.అరణ్య. 2.81. మేలుకనుపు రూ.చూ. మేల్కనుపు

స.క్రి. మేలుకనచేయు, మేలుకొలుపు. భాస్క.రా.బాల. 338 ; 2. వికసింపచేయు. కాశీ. 1.130. మేలుకమ్మిచీర వి. ఓర మూడంగుళాలవెడల్పు చాయి నూలుతో నేసిన అంచున్న చీర. మేలుకాంచు రూ.చూ. మేల్కాంచు. అ.క్రి. నిద్రనుంచి లేచు. భార.విరా. 1.24. మేలుకాఁడు వి. 1. మేలుకోరేవాడు ; 2. ఉపకారి. మేలుకువ్వ వి. శ్రేయస్స మూహం. భాగ. 10 పూ. 127. మేలుకొనియుండువాఁడు విణ. జాగరూకుడు, మెలకువగా ఉండేవాడు. మేలుకొను రూ. మేల్కొను. అ.క్రి. 1. నిద్రనుంచి తెలివినొందు, జాగ్రదవస్థనొందు. భార.అరణ్య. 2.78 ; 2 రాబోయే కష్టాన్ని తప్పించుకొను, జాగ్రత్తపడు. విష్ణుపు. 5.102 ; స.క్రి. మోహించు. మేలుకొయ్య వి. 1. తలపీటకు ఉండే కొయ్య ; 2. అనుకొలత కొయ్యల్లో మొదటిది. మేలుకొలుపు రూ. మేలుకొల్పు, మేల్కొలుపు, మేల్కొల్పు. స.క్రి. 1. వ్యక్తీకరించు, స్పష్టపర్చు. శృం.నై 5.6 ; 2. మేలుకొనచేయు. ఉ.రా. 4.248 ; వి. మేలుకొలుపు గీతం. మేలుకొలుపులు వి.బ.వ. సుప్రభాతాలు. మేలుకొలుపువాఁడు విణ. మేలుకొల్పేవాడు. మేలుకొల్పు రూ.చూ. మేలుకొలుపు. స.క్రి. 1. మేలుకొనచేయు. భార.సౌప్తి. 1.26 ; 2. వ్యక్తీకరించు, స్పష్టపర్చు. మేలుకోలు వి. 1. మేలుకోవటం. ప్రబంధ. 224 ; 2. మేలుకొనటం, అవబోధం. మేలుగడ్డి వి. కళ్ళంలో ఇంకా తొక్కించనిగడ్డి. మేలుగలవాఁడు(-కలవాఁడు) విణ. ప్రేమికుడు. శుక. 1.446. మేలుగాయ(-కాయ) వి. మంచికాయ. మేలుగాల్పు(-కాల్పు) వి. 1. ఎర్రగాల్పు, ఇటిక మొ. నవి సరిగా కాలటం ; 2. నల్లకాల్పులో పాత్రలు తెల్లగా కాలిన కాల్పు. మేలుగీళ్లు వి.బ.వ. మంచిచెడ్డలు. < మేలు + కీడు + -లు. మేలుగుజ్జు రూ. మేల్గుజ్జు. వి. కొమరగుజ్జు, వెనుగాడిని మోసే పెద్ద గుజ్జు. మేలుచెయ్యి రూ.చూ. మేలుచేయి. వి. 1. హెచ్చు, ఆధిక్యం ; 2. గెల్పుకలవ్యక్తి. మేలుచే రూ. మేలుచేయి. వి. 1. హెచ్చు, ఆధిక్యం ; 2. గెల్పుకలవ్యక్తి. మేలుచేయి రూ. మేలుచెయ్యి, మేలుచే. విణ. 1. హెచ్చైనవాడు. హరి.ఉ. 10.191 ; 2. గెలుపుకలవాడు ; వి. 1. హెచ్చు, ఆధిక్యం. భార.భీష్మ. 2.258 ; 2. గెల్పుకలవ్యక్తి. మేలుచేయువాఁడు విణ. మంచిని చేసేవాడు. మేలుతరము రూ.చూ. మేల్తరము. విణ. శ్రేష్ఠమైనది. మేలుత్తరాసి (-ఉత్తరాసి) వి. పైవుత్తరాసి, ఉత్తరాసి కమ్మిమీద వేసే మరోకమ్మి. మేలుదూలము రూ. మేల్దూలం. వి. దూలం మీదిగుజ్జులపై అమర్చబడే చిన్న అడ్డదూలం. మేలుపట్టి రూ.చూ. మేలుపట్టె. వి. అనుపీటల్లో మొదటిపట్టె. మేలుపట్టె రూ. మేలుపట్టి. వి. 1. గబలపట్టె, కిటికీమీద చూరుగా దించిన చెక్కడపు పనిగల కొయ్యపలక ; 2. అనుపీటల్లో మొదటి పట్టె. మేలుపడు రూ. మేలువడు, మేల్పడు. అ.క్రి. వలపుగొను, మోహమందు. విజయ. 3.31. మేలుబంతి రూ. మేల్బంతి. వి. 1. ఒరవడిలాంటిది. ఒకపని. ఇతరులు నేర్చుకోవటానికి మొదట చూపే మాదిరి. విక్ర. 3.135 ; 2. జాణ. తాళ్ల.సం. 13.191 ; 3. విద్యార్థులు ఒరవడి రాసే మాదిరికి మీద మొదట రాసిన అక్షరాల పంక్తి, ఒరవడి, ఒజ్జబంతి. విజయ. 2.104 ; 4. కుప్పనూర్పిళ్ళకు కట్టిన మొదటి బంతి ; విణ. 1. శ్రేష్ఠమైన. విక్ర. 3.135 ; 2. శ్రేష్ఠురాలు. విజయ. 2.107 ; 3. శ్రేష్ఠుడు. మేలుమచ్చు రూ. మేల్మచ్చు. వి. 1. ఉప్పరిగ, సౌధం. ఘటికా. 1.140 ; 2. బాలక్రీడా విశేషం. మేలుమచ్చులు వి.బ.వ. 1. బాలురాడుకునే ఒకరకం ఆట ; 2. మేడలు. మేలుమడవ వి. పెద్దకాలువనుండి పిల్లకాలువ చీలేచోట వేసిన పెద్దగట్టు. మేలుమాలె వి. మిద్దెలో మొదటి అంతస్తు. మేలుముద్ద వి. మాళవంతం, మిద్దెలకు వేయటానికి కలిపి తొక్కిన మట్టిముద్ద. మేలుముసుఁగు రూ. మేల్ముసుఁగు. వి. సువాసినులు వేసుకునే ముసుగు, అవకుంఠనం. పె.శకు. 2.234, శుక. 3.320. మేలుమేలు అవ్య. సెబాసు.కళా. 2.35. మేలురా అవ్య. ఆశ్చర్యార్థకం. ఇందు. 5.114. మేలురాక వి. స్వాగతం. భాగ. 10పూ. 963. మేలురాసి వి. తూర్పెత్తిన ధాన్యం పోగు, గట్టిగింజల పోగు. మేలురోషం వి. మంచిరకం పురుగుల నుంచి వచ్చే పట్టు. హిం.ఉ. రేషమ్. పట్టు. < మేలు + ఉ. రేషమ్. మేలువడి వి. రుజువు. హర. 4.17. మేలువడు(-పడు) రూ.చూ. మేలుపడు. అ.క్రి. వలపుగొను. కువ.చ. 4.176. మేలువాటు వి. 1. బోలుముద్ద, మిద్దెలకు వేయటానికి నీరుకలిపి తొక్కిన మట్టిముద్ద ; 2. కోరాటం ఎక్కువ వాలుగా ఉన్న ఆకుకప్పు. మేలువాడు అ.క్రి. విజృంభించు. కు.సం. 12.64. మేలువాఁడు విణ. 1. వల్లభుడు. వలపుకాడు. ఘటికా. 2.195 ; 2. శ్రేష్ఠుడు. సారంగ. 3.125 ; 3. జారుడు. శుక. 3.52 ; 4. శుభకరుడు. ఆం.భా. 3.3. మేలెంచు స.క్రి. శుభం కోరు. హేమా. పు.54. < మేలు + ఎంచు. మేలేర్చు స.క్రి. మంచివి ఎన్నుకొను, ఉత్తమమైన వానిని ఏరు. ప్రభా. 1.120. < మేలు + ఏర్చు. మేలైవచ్చు అ.క్రి. అచ్చివచ్చు, కలిసి వచ్చు. ఆం.భా. 3.94. < మేలు + అగు + -ఇ[13] + వచ్చు. మేవీది వి. రాజమార్గం. ద్వి.పరమ. వి. 7.516 పం. < మేలు + వీది.

మేలునాయకుడు చూ. మేళ. వి. మేళంనాయకుడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 663.

మేలెంచు చూ. మేలు.

మేలేర్చు చూ. మేలు.

మేలైవచ్చు చూ. మేలు.

మేళ రూ.చూ. మేళము. వి. వేశ్యాది నాట్యబృందం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 702.

మేళగాఁడు విణ. 1. వర్తక సంఘంలో ఉండేవాడు. ప్రభా. 1.107 ; 2. మేళంవాయించేవాడు.

మేళగించు చూ. మేళము.

మేళము రూ. మేళ. వి. 1. స్వరాద్యనుకూలంగా అమర్చబడింది. మను. 3.57 ; 2. రాగానుగుణంగా స్వరస్థానాల్లో మెట్లు కుదర్చటం. హ.న. 2.68 ; 3. కూడిక ; 4. వేషగాళ్ళ. నటులగుంపు ; 5. వాద్యాలజత ; 6. పాటగాళ్ళ గుంపు. సం. మేల-. కలయిక, మేలనం.
< సం. మేల- + -ము.

**మేళగించు** రూ. మేళవించు. స.క్రి. **1**. జతపర్చు. భీమ. 1.108 ; **2** కలుపు, మిశ్రంచేయు. వరాహ. 9.59 ; **3**. వీణ మొ. వాటి తీగ మొ. నవి స్వరాను కూలంగా అమర్చు ; అ.క్రి. కలియు, మిశ్రమగు. పాండు. 1.155. < మేళము + -ఇంచు[3]. **మేళముఁజేయు** అ.క్రి. వాద్యాలుమోగించు. **మేళంమాన్యం** వి. భజంత్రీవాళ్ళకిచ్చే మాన్యం. < మేళము + మాన్యము. **మేళవించు** రూ.చూ. మేళగించు స.క్రి. **1**. కలుపు, మిశ్రంచేయు. శృం నై. 3.102 ; **2**. వీణ మొ. వాటి తీగ మొ. వి స్వరాను కూలంగా అమర్చు. మను. 3.57 ; **3**. జతపర్చు ; అ.క్రి. కలియు, మిశ్రమగు. క్రీడా. 1.136.

**మేళంమాన్యం** చూ. మేళము.

**మేళవించు** చూ. మేళము.

**మేవ**[1] రూ.చూ. మేవా[1]. వి. మత్స్యవిశేషం, ఒకరకం చేప, బొచ్చు (Stronateus argenteus).

**మేవచేప** వి. ఉప్పువేసి ఎండబెట్టటానికి పనికి వచ్చే చేప.

**మేవ**[2] రూ.చూ. మేవా[2]. వి. కానుక, నూడిద.

**మేవా**[1] రూ. మేవ[1]. వి. బొచ్చు, ఒకరకం చేప. (Stronateus argenteus).

**మేవా**[2] రూ. మేవ[2]. వి. ఎండబెట్టిన కిస్‌మిస్‌పళ్ళు.

హిం. ఉ. మేవా. కిస్‌మిస్. బాదాం,

< ఉ. మేవా.

**మేవీధి** చూ. మేలు.

**మేవు** రూ.చూ. మ్రేఁగు. స.క్రి. పూయు, లేపనం చేయు.

**మేశాకోరు** వి. పెంకితనం చేసేవాడు, చేసేది.

సం. మేష-. పొట్టేలు.

**మేసు** వి. పెంకితనం. శాశ్ల. సం. 6 103.

సం. మేష-. పొట్టేలు.

**మేస్టరు** వి. **1** బడిపంతులు ; **2**. పనిచేసేవాళ్ళ మీదపెద్ద.

ఇం. *Master*. యజమాని, శిక్షకుడు.

< ఇం. Master.

**మేస్తిరి** రూ.చూ. మేస్త్రీ, వి. ఇళ్ళుకట్టే పనివాళ్ళ పెద్ద.

**మేస్త్రి** రూ.చూ. మేస్త్రీ. వి, పనివాళ్ళలో పెద్ద.

**మేస్త్రీ** రూ. మేస్తిరి, మేస్త్రి. వి. ఇళ్ళుకట్టే పనివాళ్ళపెద్ద.

ఉ. పార. మిస్త్‌అరీ. మిస్తరు. ఉపయోగించేవాడు ; అర. మిస్తర్. ఇళ్ళు కట్టేటప్పుడు గోడలు సమతలంగా ఉన్నాయో లేదో చూసేందుకు ఉపయోగించే కట్టడం పనివాని సాధనం

< ఉ. మిస్త్‌అరీ.

**మేహనతు** రూ.చూ. మెహనతు. వి. కష్టం, పరిశ్రమ.

**మేహనత్తు** రూ.చూ. మెహనతు. వి. కష్టం, ప్రయాస.

**మేహన్నతు** రూ.చూ. మెహనతు. వి. పరిశ్రమ. కష్టం.

**మై**[1] రూ. మయి, మెయి[1], మేయి. వి. **1**, శరీరం. దేహం, ఒడలు. భార. ఆది. 5.53 ; **2**. విధం. భార. విరా. 3.124 ; **3**. తడవ. భార. ఉద్యో. 2.140 ; **4**. జన్మ. భాస్క. రా. యు. 567 ; **5**. వింద్భాగం. ద్వి. పరమ. వి. 4 267 ; **6**. పార్శ్వం. ఆము. 6.56.

క. మయ్, మయి, మెయ్, మెయి, మై. శరీరం, పార్శ్వం. పక్క, స్థలం ; కొడ. మయ్. శరీరం ; తు. మై, శరీరం, వ్యక్తి ; త. మెయ్. సత్యం, నిజం, దేహం. శరీరం. మెయికొక్కళ్. నమ్ము. మెయ్‌ప్పి. ఋజువుచేయు, నిరూపించు, మెయిమ్మై. సత్యం, నిజం, సహజత్వం, మెయ్యణ్. నిజం తెలునుకున్న వ్యక్తి ; మ. మెయ్. మై. దేహం. వ్యక్తి, సత్యం ; కో. మయ్. శరీరం, మెయిటవ్. కుమారుడు ; తొ. మొయ్. శరీరం, మీయ్. జంతువుల యోని.

**మైకట్టుదిండు** వి. డొలుపు, బండి ఇరుసుమీద పరానికి ఆధారంగా వేసే అడ్డపట్టె. **మైకట్టుమాను** వి. బండిఇరుసు మీద పక్కసార్ల మధ్యగా అమర్చబడిన లావుపాటి దుంగ. **మైకొను** రూ. మయికొను. మెయికొను, మేకొను, మేయి కొను. స.క్రి. అ.క్రి. సమ్మతించు, అంగీకరించు. కు.సం. 1.72 ; స.క్రి. పొందు. భార. విరా. 1.245 ; అ.క్రి. కలుగు. భాస్క. రా. అరణ్య. 2.24. **మైకోలు** రూ.చూ. మెయికోలు. వి. సమ్మతి, అంగీకారం. శృం. నై. 3.125. **మైక్రోవి** వి. మురళి. **మైగలి** రూ. మయిగలి, మేగలి. విణ. **1**. శూరుడు. భార. కర్ణ. 1.116 ; **2**. బంటు. **మైగనురా** (-కనురా) వి. సహస్రాక్షుడు. ఇంద్రుడు. వ్య. శరీరంపై కన్నులున్న రాజు. ఆం. పదా. సుర. 26. **మైచాయ** రూ.చూ మయిచాయ. వి. దేహకాంతి **మైతాలుపు** రూ. మెయితాలుపు ; మైతాల్పు. వి. ప్రాణి. శరీరి. **మైతాల్పు** రూ.చూ. మైతాలుపు. వి. ప్రాణి, శరీరి. **మైతెంచు** స.క్రి. ధ్యానించు, తలచు. కు. సం. 9.128. **మైతెల్ల** వి. కపిలవన్నె, మైల (నలుపు) కలిసిన తెలుపు. **పైదినుసులు** వి.బ.వ. ధాతువులు **మైనీరగు** అ.క్రి. పరవశ మగు. రాధికా. 2.114 < మై[1] + నీరు + అగు. **మైపాలలు** రూ. మైపాళలు. వి.బ.వ. ఒకరకం ధాన్యం. **మైపాలి** రూ.చూ. మైపాళి. వి. మోటపడ్లలో గింజగట్టిగా ఉండే రకం. **మైపాళలు** రూ.చూ. మైపాలలు. వి.బ.వ. ధాన్య విశేషం. **మైపాళి** రూ. మైపాలి. వి. మోటువడ్లలో గింజ గట్టిగాఉండేరకం. **మైపుల్ల** వి. సన్నగా పొడుగ్గా ఉండేకొయ్య బద్ద. రాతిలో జంపరుతో తొలిచిన కన్నంనుండి మట్టితోడ టానికి వాడేకొయ్య. **మైపూఁత** రూ. మయిపూఁత. వి. కలపం, అంగరాగం, చందనచర్చ. విక్ర. **4**.226. **మైపూఁతపసపు** రూ. మైపూఁతపసుపు. వి. చాయపసుపు. అష్టమ. క. 2.430. **మైపూఁతపసుపు** రూ.చూ. మైపూఁతపసుపు. వి. చాయపసుపు. **మైపోక** విణ. తేలిక. కాశీ. 6.33. **మైమయి** రూ.చూ. మెయిమెయి. వి, అనాయాసం. హరి. ఉ. 6.131. **మైమయిఁబోవు** (-పోవు) అ.క్రి. సులభంగాపోవు. ఉ. హరి. 2.98. **మైమఱచు** రూ. మయిమఱచు. అ.క్రి. **1**. ఒడలెఱుగకుండు, పారవశ్యం పొందు. కు. సం. 10.17 ; **2**. మూర్ఛిల్లు. సాంబ. మాన. 42. **మైమఱపు** రూ. మయి మఱపు. మయిమఱుపు, మెయిమఱపు. మెయిమఱుపు. వి. **1**. మూర్ఛ. ఆం. భా. 2.223 ; **2**. పారవశ్యం. **మైమఱువు** రూ. మెయిమర్వు, మెయిమఱుఁగు, మెయి మఱువు, మేమఱఁగు, మేమరువు. మేమర్వు. మేమఱుఁగు,

మేమఱువు. వి. కవచం, వ్యు. శరీరభాగాన్ని మరుగుపరిచేది. భార. విరా. 3.34. మైమెయి రూ.చూ. మెయిమెయి. వి. అనాయాసం, అవలీల. కు. సం. 12.57. మైమేయి రూ. చూ. మెయిమెయి. వి. అనాయాసం. మైమేయు స.క్రి. నరి చేసేటప్పుడు పడుగు తిరగవేసి కుంచెతో దువ్వు. <మై[1] + వేయు. మైమై రూ.చూ. మెయిమెయి. వి. అనుపద్రవం. భార. ఉద్యో. 1.25. మైమోజు వి. గగుర్పాటు, రోమాంచం. మైవడి రూ. మయివడి, మెయివడి. వి. 1. ఆనుకూల్యం. కు. సం. 4.30 ; 2. సమ్మతి. కు. సం. 5.102 ; 3. నేర్పు. దశకు. 7.52 ; 4. విధం, రీతి. శృం. నై. 3 67. విణ. అనుకూలం. నృసింహ. 3.14. మైసెల వి. ఇంటిచుట్టూ కట్టేదడి.

-మై[2] రూ. మయి[2] (న్). మెయి[2] (న్). ప్రత్య. 1. తృతీయా విభక్తిలో వచ్చే ప్రత్యయం. భార. ఆది. 4.36 ; 2. సప్తమీవిభక్తి ప్రత్యయం. భార. విరా. 5.98 ; 3. చతుర్థీవిభక్తి ప్రత్యయం. ద్వి. పరమ. వి. 3.165వ.

మైకము రూ. మయికము. వి. మత్తు. రం. రా. యు. 290వ. 22పం.

క. మయము. కలవరం, సంశయం ; తు. మైకుని, కంగారు, కలవరం ; త. మయల్. కోరిక, వాంఛ, పిచ్చి, మదం, మయంకు. మత్తిలు, కంగారుపడు, మైంతు. ప్రేమమైకం, పిచ్చి, తెలివితక్కువతనం ; మాల్తో. మెచ. జొన్నలతో తయారు చేసిన మత్తుపదార్థం.

మైకా వి. అభ్రకం.

ఇం. *Mica*. అభ్రకం.

<ఇం. Mica + రాయి.

మైకారాయి వి. అభ్రకంరాయి, కొన్నిసమయాల్లో పారదర్శకంగాను కొన్ని తత్తుల్యంగాను ఉండి తెలుపు నలుపు పసుప్పచ్చ, ఆకుపచ్చ, గోధుమ రంగుల్లో దొరికేరాయి.

మైకు[1] వి. చిన్నధ్వనిని పెద్దదిగా వినబడేటట్లు చేసేసాధనం.

ఇం. *Microphone*. మెల్లగా వినిపించే ధ్వనిని పెద్దగా వినబడేటట్లు చేసే సాధనవిశేషం.

<ఇం. Microphone.

మైకు[2] స.క్రి గోకు, గేరు, గీకు.

మైజార్ రూ.చూ. మైజాఱు. వి. చీర కట్టుకొన్నప్పుడు భుజం మీద వేలాడేట్లు వేసుకొనే చెరగు.

మైజారిచీర రూ.చూ. మైజాఱుచీర. వి. పైటకొంగులో డిజైను నేసిన చీర.

మైజారు రూ.చూ. మైజాఱు, వి. 1. ఆడుదాని కట్టుకొంగు, చీర మొదటి కొంగు ; 2. ఒద్దె.

మైజారుకమ్మిచీర వి. చెరగులో డిజైను కమ్మి నేసిన చీర. మైజాఱుచీర రూ.చూ. మైజాఱుచీర. వి. పైట కొంగులో డిజైను నేసిన చీర.

మైజాఱు రూ. మయిజాఱు, మైజార్, మైజారు, మొజేరు. వి. ఒకరకం పైట కొంగు, కొంత ఎడం ఎడంగా అడ్డకమ్ములు నేసిన చీర కొంగు, ఈ పదంలోని శకటరేఫ కవులచే కృత్రిమంగా కల్పించబడింది. శ్రీ.శృం. 43.

ఉ. మిజార్. మొలగుడ్డ ; పార. మిజార్. ముఖం కప్పుకొనే గుడ్డ, నడుముకు కట్టుకొనే గుడ్డ.

<ఉ. మిజార్.

మైజాఱుచీర రూ. మయిజాఱుచీర, మైజారిచీర, మైజారు చీర. వి. ఒకరకం పైట కొంగున్న చీర. శుక 2.32.

మైద[1] రూ. మయిద[1]. వి. మత్తు, మైకం. హరి.పూ. 8.40.

సం. మద-. మత్తుగల, మాద-. మత్తెక్కటం, మాదత, సంతోషం, గర్వం ; పో.చూ. సం. మాంద్య-. మెల్లన, సోమరితనం, ఉదాసీనం.

<సం. మాద-.

మైద[2] రూ. మయిద[2]. వి. కురంటకం, గోరింట. ఆం.భా. 2.53.

మైదగోరంట వి. కురంటకం.

మైద[3] రూ.చూ. మైదా. వి. పిండివంటలు మొ. వాటికి ఉపయోగించే ఒకరకం మెత్తటి పిండి.

మైదగంజి రూ.చూ. మైదాగంజి. వి. మైదాపిండి ఉడకబెట్టి చేసిన పలచని జావ.

మైదా రూ. మైద[3]. వి. పిండివంటలు మొ. వాటి కుపయోగించే ఒకరకం పిండి.

హిం.ఉ.పార. మైదా. ఒకరకం మెత్తటి పిండి.

<ఉ. మైదా.

మైదాగంజి రూ. మైదగంజి. వి. మైదాపిండి ఉడకబెట్టి చేసిన పలచని జావ. మైదాపిండి వి. పిండివంటలు మొ. వాటికి ఉపయోగించే ఒకరకం పిండి.

మైదానము రూ.చూ. మయిదాను. వి. 1. బయలుభూమి ; 2. పళ్ళెం బావికి చుట్టూ కట్టిన అరుగు ; 3. బట్టల దగ్గర చదును చేసిన నేల ; 4. చీర నేతలో రెండు చెంగులకూ మధ్య భాగం ; 5. సమతలం, అంచు తప్ప మిగిలిన భాగం.

మైదాను రూ.చూ. మయిదాను. వి. 1. బయలుభూమి ; 2. నూతిపళ్ళెం.

మైదు రూ.చూ. మయిదు. వి. 1. మాయ ; 2. చొక్కుపొడి ; 3. వలపుమందు, మోహదవ్యం ; 4. మైకం.

మైదుచల్లు అ.క్రి. మంత్రం పొడి చల్లి మైమరపించు.

మైదుపడు రూ.చూ. మయిదుపడు. అ.క్రి. భ్రమపడు.

మైన రూ.చూ. మైనా. వి. ఒకరకం పక్షి.

మైనగోర వి. ఒకరకం పక్షి. మైనగోరవంక రూ.చూ. మైనగోరువంక. వి. శారిక, ప్రియవాదిని. మైనగోరువంక రూ. మయినగోరవంక, మైనగోరవంక. వి. శారిక, ప్రియవాదిని.

మైనపుకలం చూ. మైనము.

మైనపుగుడ్డ చూ. మైనము.

మైనపుజిగటాల్ చూ. మైనము.

మైనపుజిడ్డు చూ. మైనము.

మైనపుతాడు చూ. మైనము.

మైనపుముక్కు చూ. మైనము.

మైనపుపడి చూ. మైనము.

మైనపువత్తి చూ. మైనము.

మైనము రూ. మయనము. మయినము. వి. 1. సిక్థకం,

మధూచ్ఛిష్టం. శృం.నై. 6.141 ; **2**. తేనెపట్టులో తేనె తీసుకోగా మిగిలిన పదార్థం.

సం. మదన-. మయినం ; ప్రా. మయణ-, మయణా ; అ.మా మయణ-. మతనం ; మరా. మెన్ ;

క. మయణ, మేణ. మైనం ; తు. మయణ. కొవ్వు, మైనం ; మ. మెఴు ; కువి. మేన ; కొలా. మెనమ్. మైనం ; నా. మేనమ్. మైనం ; ఒరయాన్. మఎన్. మైన్ ; బ్రా. మోమ్.

< ప్రా. మయణ-.

మైనపుకలం వి. కలంకారీ అద్దకంకోసం కరగబెట్టిన వేడి మైనంలో ముంచే కుంచె. మైనపుగుడ్డ వి. మైనంగుడ్డ. మైనపుజిగటాల్ వి. ఒకతెగ అగ్నిజ్యోతి. మైనపుజిడ్డు వి. మైనంగుడ్డ. మైనపుతాడు వి. మైనం పూసిన పడి. మైనపుముక్కు వి. సమయానుకూలంగా పక్షాలు మార్చే వ్యక్తి. మైనపువడి వి. మైనం పూసిన వడి. మైనపువత్తి రూ.చూ. మయినపువత్తి. వి. దీపం వెలిగించటానికి మైనంతో చేసిన వత్తి. మైనంమెరుగు వి. మైనంతో పెట్టే మెరుగు.

మైనంమెరుగు చూ. మైనము.

మైనరు వి. స్వాతంత్ర్యానికి లేదా బాధ్యత వహించటానికి తగిన ఈడురాని వ్యక్తి, యుక్తవయస్సుకురాని వ్యక్తి.

ఇం. *Minor*. బాధ్యత వహించే వయస్సురాని వ్యక్తి.

< ఇం. Minor.

మైనస్సు వి. వ్యవకలన సంకేతం, తీసివేతకు గుర్తు.

ఇం. *M:nus*. తీసివేత గుర్తు.

< ఇం. Minus.

మైనా రూ. మైన. వి. ఒకరకం పిట్ట.

హిం.ఉ. మైనా. ఒకరకం పక్షి.

< ఉ. మైనా.

మైల రూ. మయిల. వి. **1**. మలినవస్త్రం, మురికిగుడ్డ. భార. ఆది. 3.135 ; **2**. చీకటి, అంధకారం. భార.ద్రోణ. 5.278 ; **3**. మాలిన్యం, మురికి. భార.అశ్వ. 1.38 ; **4**. మడ్డి. ఆము. 6.80 ; **5**. ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు కలిసిన రంగు ; **6**. ప్రసవించిన వెనక వచ్చే మైల నీరు ; **7**. ముట్టు, అంటు, సూతకం ; **8**. వయసు కోడెకు గంగిడోలు మీద ఏర్పడే నల్లదనం.

సం. మలిన-. మురికిగల, అస్వచ్ఛం, మలినం, మురికి ; ప్రా. మఇల-, మలిణ- ; అ.మా. మఇల- ; అప. మఇల- ; హిం. మైల్ ;

క. మల్లి, మల్లు, మల్లె. మైలి ; తు. మైలె ; త. మైలై ; మ. మయిలె ; బ్రా. మల్.

< ప్రా. మఇల-.

మైలకోక వి. మైలవస్త్రం. శ్రీ.శృం. 76. మైలకోత వి. మిరపపంట మొదటికోత. మైలక్రోల రూ.చూ. మయిలక్రోల. వి. మురళి. మైలక్రోవి వి. మురళి, పిల్లనగ్రోవి. మైలచాయతొండ వి. ఒకరకం తొండ. మైలతేరు వి. బ్రహ్మోత్సవంలో శాస్త్రోక్తంగా మూడు మతాలవారు లాగిన తర్వాత ఇతరులు లాగే రథం. మైలఁదీయు(-తీయు) అ.క్రి. అమ్మవారి గుడిముందు ఊడ్చి శుభ్రం చేయు. మైలపడు రూ. మయిలపడు, మైలబడు, మైలపడు. అ.క్రి. **1**. కాంతిహీనమగు. భార.అశ్వ. 1.38 ; **2**. మాలిన్యం పొందు. జైమినిభా. 6.28. మైలబట్ట వి. నల్ల మచ్చలు కల వస్త్రం. మైలబడు (-పడు) రూ.చూ. మైలపడు. అ.క్రి. మడి విడుచు. మైలరోగం వి. పెసర. కంది మొ. వాటికి పేను పట్టి పూత రాలిపోయే తెగులు. మైలలు వి.బ.వ. చంటిపిల్లలకు తగిలే ముట్టు మైల. మైలలుదీయు (-తీయు) అ.క్రి. అమ్మవారి గుడిముందు ఊడ్చి శుభ్రం చేయు. మైలవడు (-పడు) రూ.చూ. మైలపడు. అ.క్రి. **1**. మాలిన్యం పొందు. కళంకితమగు. జైమిని భా. 6.28 ; **2**. కాంతిహీనమగు. మైలవన్నె వి. తెలుపు నలుపు మిశ్రమైన వర్ణం. మైలఁవాడు విణ. అఘుడు, పాపి. మైలవాయు (-పాయు) అ.క్రి. దిగులు తీరు, మచ్చ తొలగిపోవు. వర.రా. ఆరణ్య.పు. 129. పం. **10**. మైలవిరుపు వి. పత్తి మొదటి విడుపు. మైలసంత వి. చేపలు, మాంసం అమ్మే సంత. క్రీడా.పు. **24**, ద.హిం.శా. సంపు. 4. శా.సం. 248. క్రీ.శ. 1545. మైలసంతలో గంతులు వి.బ.వ. స్వేచ్ఛా ప్రవర్తనలు. మైలసన్నం వి. ఒకరకం వడ్లు. మైలసోకు అ.క్రి. ఆకుతోటకు పసుపుతోటకు బహిష్ఠ అయినవారి మైలతగులు. మైలారి రూ.చూ. మైలారు. వి. **1**. ఒకానొక క్షుద్రదేవతను పూజించేవాడు. చా.మం. 1.138, హంస. 3.29 ; **2**. కోమట్ల నడుక్కొని జీవించేవాడు. మైలారు రూ. మయిలారి, మయిలారు, మైలారి, వి. ఒకానొక క్షుద్రదేవత. కాశీ. 7.230. < మైల + ఆరు[1]. మైలారువాఁడు విణ. కోమట్ల నడుక్కొని జీవించేవాడు. మైలావు వి. ఎరుపు పసుపు తెలుపు నలుపు కలిసిన రంగుగల ఆవు. భార. ఆను. 1.203. < మైల + ఆవు.

మైలతుత్తము రూ. మయిలతుత్తము, మయలుతుత్తము, మైలుతుత్తము, మైలుతుత్తుము. వి. తుత్తం.

సం. మయూరతుత్థ-. మైలతుత్తం.

< సం. మయూరతుత్థ-.

మైలారి చూ. మైల.

మైలారు చూ. మైల.

మైలారువాఁడు చూ. మైల.

మైలావు చూ. మైల.

మైలి రూ. మాలి, మాలీ. వి. తోటమాలి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 155. క్రీ.శ. 1385.

హిం.ఉ. మాలీ. తోటపనివాడు.

< ఉ. మాలీ.

మైలీస్‌పలక వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సటానికి వాడే చదరమైన నలప.

హిం.ఉ. మాలిష్. మర్దనా ; సం. ఫలక-. శిలాది పట్టకం, పలకలాగా నున్ననైన పైభాగం.

< ఉ. మాలిష్ + సం. ఫలక-.

మైలు రూ. మయిలు[1]. వి. అరక్రోసుదూరం. 1760 గజాల దూరం.

ఇం. *Mile*. 1760 గజాల దూరం.

< ఇం. Mile.

**మైలుతుత్తము** రూ.చూ. మైలతుత్తము. వి. ఒకానొక మందు దినుసు.

**మైలుతుత్తము** రూ.చూ. మైలతుత్తము. వి. ఒకానొక మందు వస్తువు.

**మైవాకు(-ఆకు)** వి. ఆడపిల్లలు గోళ్ళకు రంగురావటానికి వేసుకొనే ఆకు.

**మైసమ్మబద్దులు** వి.బ.వ. మైసమ్మ గ్రామదేవతలకు ఇచ్చే పొదుగాటి మట్టిపాత్రలు.

**మైసరి** రూ. మయిసరి. వి. జక్కిణి అనే నాట్యంలోని అంగ విశేషం. ఉ.రా. 6.139.

**మైసాక్షి** వి. పొగవేయటానికుపయోగించే ఒక మందుచెట్టు. పల్నా. పు. 7.

నం. మేషాక్షి. వృక్షవిశేషం.

< నం. మేషాక్షి.

**మైసూరంచు** వి. 1. పదికొలుకుల దారం చిగురు వదిలి ఒక కొలికి రంగు, ఒకకొలికి తెలుపు, నాలుగు కొలుకులు రంగు, ఒకకొలికి తెలుపు వరసగా వచ్చేట్టు నేసిన అంచు ; 2. రెండు లాహిరీల మధ్య ఆకు, తీగ, మొగ్గ, డిజైనులో పడేట్టు నేసిన అంచు.

ఇం. *Mysore*. కర్ణాటకలోని ఒకనగరం.

< ఇం. Mysore + అంచు[3].

**మైసూరు వంకెలు** రూ. మైసూరొంకెలు. వి.బ.వ. ఒకరకంవడ్లు.

ఇం. *Mysore*. కర్ణాటకలోని ఒకనగరం.

< ఇం. Mysore + వంకె + -లు.

**మైసూరొంకెలు** రూ.చూ. మైసూరు వంకెలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**మొకంరాయి** చూ. మొకము.

**మొకంకొట్టు** చూ. మొకము.

**మొకంగాడి** చూ. మొకము.

**మొకంచేయు** చూ. మొకము.

**మొకటు** వి. లేతఆకుపచ్చ పూలుపూసేచెట్టు, దూదిప్పచెట్టు (Hymenodictyon excelsum).

**మొకద్దమా** రూ.చూ. ముకద్దమా. వి. 1. వ్యవహారం ; 2. పని, వ్యాపారం.

**మొకద్దమా** రూ.చూ. ముకద్దమా. వి. వ్యవహారం; విణ. ప్రత్యేకమైన.

**మొకబంగము** చూ. మొకము.

**మొకమజ్జనము** చూ. మొకము.

**మొకమలు** రూ.చూ. ముఖమల్లు. వి. ఒకరకం మేలుజాతిపట్టు.

**మొకమాట** చూ. మొకము.

**మొకమాయకా(డు** చూ. మొకము.

**మొకమాయిచేయు** చూ. మొకము.

**మొకమాల్** రూ.చూ. ముఖమల్లు. వి. ఒకరకం మేలుజాతిపట్టు.

**మొకమాలు** రూ.చూ. ముఖమల్లు. వి. ఒకరకం మేలుజాతిపట్టు. రసిక. 3.141, హంస. 1.69.

**మొకమిచ్చులు** చూ. మొకము.

**మొకమింతచేసికొను** చూ. మొకము.

**మొకము** రూ.చూ. మొగము. వి. ముఖం, వదనం. రం.రా. బాల. 60 పు. 15 పం, హర. 4.27.

మొకంరాయి రూ. మొకరాయి. వి. ఒంటిముఖం రాయి, ఒకవైపు చదునుగా నున్నగా చెక్కబడినరాయి. < మొకము + రాయి. మొకంకొట్టు స.క్రి. మొకమాయిచేయు, రాతిని అన్నివైపులా సమంగా చెక్కి నున్నబరుచు. < మొకము + కొట్టు[1]. మొకంగాడి రూ.చూ. మొగంగాడి. వి. రాట్నం 'బొమ్మ'లో వడిదారం తిరగటానికి చెక్కినగాడి. < మొకము + గాడి. మొకంచేయు అ.క్రి. రాతిని నున్నగాచేయు. < మొకము + చేయు. మొకబంగము వి. మొకం విరుపు, కోపం. ద్వి. పరమ. వి. 4.313. సం. *భంగ-*. విరగటం, విరుపు. < మొకము + సం. భంగ- + -ము. మొకమజ్జనము వి. మొగం కడుక్కోవటం. సారంగ. 3.156. సం. *మజ్జన-*. స్నానం. < మొకము + సం. మజ్జన- + -ము. మొకమాట రూ.చూ. మొగమాట. వి. 1. సంకోచం. హరి. 2.158 ; 2. దాక్షిణ్యం. భోజ. 4.46 ; 3. పరచిత్తానుకూల వర్తనం. భోజ. 6.55 : 4. ఒకఆట. మొకమాయకా(డు రూ.చూ. మొగమాయకా(డు. వి. ప్రత్యక్షంగా మోసం చేసేవాడు. తాళ్ల. సం. 17.18. మొకమాయిచేయు అ.క్రి. మొకంకొట్టు, రాతిని అన్నివైపులా సమంగా చెక్కి నున్నబరుచు. మొకమిచ్చులు వి.బ.వ. ఎదురుగా చేసే పొగడ్తలు, ముఖస్తుతులు. తాళ్ల.సం. 17.5. సం. ఇచ్ఛా. కోరిక. < మొకము + సం. ఇచ్ఛా + -లు. మొకమింతచేసుకొను రూ.చూ. మొగమింత చేసికొను. అ.క్రి. చిన్నబుచ్చుకొను. సారంగ. 2.171. < మొకము + ఇంత + చేయు + -ఇ[11] + కొను మొకముకొట్టు అ.క్రి. తీపి పదార్థాలు అతిగా తిన్నందున వెగటుపుట్టు. మొకమున్వ్రేలు అ.క్రి. 1. ముఖంపై వేలాడు ; 2. తలపునకువచ్చు. ఉ.హరి. 2.6. మొకము రౌతు రూ.చూ ముఖంరౌతు. వి. ఒంటిముఖం రాయి, ఒకవైపు చదునుగా నున్నగా చెక్కబడిన రాయి. మొకమెఱుక వి. ముఖపరిచయం, కొంచెం స్నేహం. విజయ. 2.199. < మొకము + ఎఱుక. మొకమొకములుచూచుకొను స.క్రి. ఒకరిముఖం ఒకరు చూసుకొను. < మొకము + మొకము + -లు + చూచు + కొను. మొకమోట రూ.చూ. మొగమోట. వి. 1. దాక్షిణ్యం ; 2. సంకోచం ; 3. సిగ్గు. మొకమోటము రూ.చూ. మొగమోట. వి. 1. దాక్షిణ్యం, పరచిత్తానుకూల వర్తనం ; 2. సంకోచం ; 3. సిగ్గు. మొకమోడించు స.క్రి. మొగమాటపెట్టు. తాళ్ల. సం. 17.338. < మొకము + ఓడించు. మొకమోడు అ.క్రి. దాక్షిణ్యపడు, సంకోచించు. విజ్ఞా. 2.101. < మొకము + ఓడు[1]. మొకంపట్టు వి. పాత్రకు అంచు కట్టటానికి ముందు వేళ్ళతోను బద్దతోను కుత్తిక ఏర్పడేటట్లు పట్టటం. < మొకము + పట్టు. మొకంబల్ల రూ.చూ. ముగ్గంబల్ల. వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురుబిగించే నిలువుకొయ్య. < మొకము + బల్ల. మొకరాయి రూ.చూ. మొకంరాయి. వి. ఒంటిముఖంరాయి, ఒకవైపు చదునుగా నున్నగా చెక్కబడినరాయి. మొకవర్సేయు అ.క్రి. కొన్ని పాత్రలకు

మూడువచ్చేటట్లు నర్సు. మొకవాలు వి. పాత్రలకు గీట్లుండే భాగం. < మొకము + వాలు[1]. మొక్కట్టు వి. ముఖపైఖరి. < మొకము + కట్టు.

**మొకములు** రూ.చూ. ముఖమల్లు. వి. **1.** దళసరిగా ఉండే ఒకవిధమైన పట్టు ; **2.** వెల్వెటు.

**మొకమెఱుక** చూ. మొకము.

**మొకమొకములుచూచుకొను** చూ. మొకము.

**మొకమోట** చూ. మొకము.

**మొకమోటము** చూ. మొకము.

**మొకమోడించు** చూ. మొకము.

**మొకమోడు** చూ. మొకము.

**మొకంపట్టు** చూ. మొకము.

**మొకంబల్ల** చూ. మొకము.

**మొకర** రూ.చూ. మొక్కరము. వి. మట్టిజాడీ తయారీలో దిమ్మెమీద పైభాగం.

**మొకరం** రూ. మొగరం, మొరం. వి. గెనుసుగెడ్డ, నాలుగైదు నెలల్లో ఒరుపుకు వచ్చే తీగపైరు, ఏడాదిపొడుగునా బతికి ఆకులు దుంపలు కూరదినుసుగా ఉపయోగపడే తీగ (Ipomaea batataslam).

**మొకరంరాయి** చూ. మొకరము.

**మొకరము** రూ.చూ. మొక్కరము. వి. **1.** స్తంభం. వసు. 6.26 ; **2.** గుమ్మంరాయి, గ్రామాలకు చివర పొలాల స్థలాలకు వీధులకు మధ్య సరిహద్దుల్ని సూచిస్తూ పాతి పెట్టిన రాయి ; **3.** కొట్టం కట్టుబడిలో మధ్య వేసే నిలువు గుంజ.

మొకరంరాయి వి. కుర్చీరాయి, రాతికూచాలకు స్తంభాలకు అడుగుభాగంలో మోపుకింద ఉంచబడిన గుంటగల బండరాయి.

**మొకరరు** రూ.చూ. మొఖరరు. విశ. **1.** ఎదురు ; **2.** నిర్ణయింపబడింది ; **3.** రుజువు ; వి. నియామకం.

**మొకరాయి** చూ. మొకము.

**మొకరారు** రూ.చూ. మొఖరరు. వి. నిష్కర్ష. నె.శా. కందుకూరు. 47. క్రీ.శ. 1606.

**మొకరి** రూ. మొకరు. విశ. **1.** అసంబద్ధ వచనాలాడేవాడు, పొసగని మాటలాడేది. రం.రా. సుందర ; **2.** మోగేది, ధ్వని చేసేది. హర. 7.137 ; **3.** అగ్రేసరం, ముందు నడిచేది. కువ.చ. 2.127 ; **4.** శంఖం ; వి. మొకరి ఊదేవాడు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 144. క్రీ.శ. 1158.

సం. ముఖర-. ధ్వనించేది.

< సం. ముఖర-.

మొకరితనము వి. వాచాలత, అసంబద్ధ వచనాలాడటం. నమిూర. 9.138.

**మొకరు** రూ.చూ. మొకరి. వి. బండిమెన.

**మొకరేలు** రూ. చూ. మొకిరేలు. వి.బ.వ. మట్టిపొయ్యికి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మంటి ఉబ్బులు.

**మొక్రరు** రూ.చూ. మొఖరరు. వి. నిష్కర్ష విశ. నిర్ణయించబడ్డది.

**మొకవర్సెయు** చూ. మొకము.

**మొకవాలు** చూ. మొకము.

**మొకాం** రూ.చూ. ముకాము. వి. బస, ఒకటే విభాగం.

**మొకాబిలా** రూ.చూ. ముకాబిలా. వి. **1.** సంప్రదింపు ; **2.** ఎదురుగా ఉంచటం.

మొకాబిలాచేయు స.క్రి. సరిపోల్చు.

**మొకాము** రూ.చూ. ముకాము. వి. బస, ఒకటే విభాగం.

**మొకాసాదార్** రూ.చూ. మొఖాసాదారు. వి. ఒక గ్రామ మొత్తానికి అధికారి.

**మొకిరి** రూ. మొకిరె. వి. **1.** చేనిగనిమలు కలిసినమూల ; **2.** చివరి అంచు ; **3.** చివర.

**మొకిరె** రూ.చూ. మొకిరి. వి. గోడ మొ. వాటి భాగాల్లో ఏర్పడే బొక్క.

**మొకిరెలు** రూ.చూ. మొకిరేలు. వి.బ.వ. పొయ్యిరాళ్ళు.

**మొకిరేలు** రూ. మొకరేలు, మొకిరెలు, మొకిర్లు, మొగిరాలు. వి.బ.వ. మట్టిపొయ్యికి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టిఉబ్బులు.

**మొకిర్లు** రూ.చూ. మొకిరేలు. వి.బ.వ. పొయ్యిరాళ్ళు.

**మొకుజిల్ల** వి. ముక్కరచీల, జంటనొగలను కాడిముందు కలపటానికి బిగించిన ఇనపరేకు.

**మొకుఱు** వి. పిల్లలమారాం, పేచీ.

**మొక్క**[1] రూ. మోక. వి. **1.** చిగురు మొలక. హరి.ఉ. 6.58 ; **2.** మొలక, అంకురం. ఆము. 2.26 ; **3.** పల్లవాంకురం ; **4.** నాటటానికి అనువైన చెట్టు పిలక ; **5.** వరికోసిన తర్వాత ఏర్పడిన మోటు మొదలు.

క. మొలె, మొలుచు. మొలకెత్తు ; తు. మళియుని, మళెయుని, ముళెవుని, మొలిపుని, మొలెపుని. మొలకెత్తు, ముళె. మొలక ; త. ముళై(-వ్-, -న్ట్-, -ప్ప్-, -త్త్-). పల్లవించు, మొలకెత్తు, వి. మొల, అంకురం ; మ. ముళ్. మొలక, లేతమొక్క ; గోం. మొరియానా. మొలుచు ; తొ. మిళ్. మొలుచు, మొలకెత్తు ;

పో.చూ.సం. యూలికా. వేరు.

మొక్కకట్టు రూ.చూ. మొలకకట్టు. స.క్రి. మళ్ళలో జల్లటంకోసం, విత్తనాలు మొలకెత్తటం కోసం తడిపి మడికట్టు. మొక్కగాబు వి. ఆకుమడిలో తీసే కలుపు. మొక్కచిక్కుడు వి. గోరుచిక్కుడు, మటిక, మట్టిక. మొక్కజొన్న వి. **1.** యావనాళ భేదం, ఒకజాతిజొన్న ; వి.బ.వ. ఒకజాతి జొన్నలు. మొక్కజొన్నపొత్తులు వి.బ.వ. మొక్కజొన్న కండెలు. మొక్కడఁగు వి. వరికోసి వెంటనే మిగిలిన మొక్కలు దున్ని వెంటనే మరల పెట్టిన పంట. < మొక్క[1] + అడఁగు. మొక్కతొట్టి వి. పూలమొక్కలు పెంచటానికి వాడే మట్టితొట్టి. మొక్కపిడత వి. మొక్కలు అంటుకట్టటానికి వాడే మట్టి ముంత. మొక్కమామిడి వి. **1.** జీడిమామిడి. (Anacardium occidentale). **2.** విత్తనం నాటి పెంచిన మామిడి, అంటు మామిడి కానిది. మొక్కమొలచిపోవు అ.క్రి. **1.** చెడు ; **2.** మొలకలు కలుగు. మొక్కలకుండీ వి. పూలమొక్కలు

పెంచటానికి వాడే మట్టితొట్టి. **మొక్కలగోలెం** వి. పూల మొక్కలు పెంచటానికి వాడే మట్టికుండీ. **మొక్కలు** వి.బ.వ. **1**. రకరకాలైన చిన్న చెట్లు; **2**. ఒకరకం జొన్నలు. **మొక్కల్తొట్టి** వి. పూలమొక్కలు పెంచటానికి వాడే మట్టితొట్టి. **మొక్కవేప**[1] వి. పంపనచెట్టు, అడవుల్లో పెరిగే చెట్టు (Oroxyleem indicum). **మొక్కవేప**[2] వి. తగడచెట్టు, పచ్చని పూలుపూసే పెద్ద చెట్టు (Stercospermum chelonoides). **మొక్కవేప**[3] వి. గట్టిగా ఉండే కలప కలిగి ఎర్రనిపూలుపూసే చెట్టు, కలగోరుచెట్టు (Stereospermum suaveolens). **మొక్కాకువేయు** వి. మొదట వేసిన ఆకు కాక మళ్ళీ వేసే ఆకు. < మొక్క[1] + ఆకు + వేయు.

**మొక్క**[2] విణ. **1**. మొనచెడినది, వాడిచెడినది. బసవ. 7.861పం.; **2**. లేత, చిన్న. ఆము. **4.35**; **3**. వ్యర్థం; వి. **1**. మడిగిన మొన. భాస్క. రా. యు. 361; **2**. గంటి, గాయం. మను. **1.35**; **3**. కొరత. లోపం. విష్ణుపు. 2.107.

త. మొక్కలై. వాడిలేనిది, మొండిది, మొక్కు. బండతనం.

**మొక్కచెడు** స.క్రి. **1**. ఆశాభంగం పొందు. ప్రద్యుమ్న. 3.75; **2**. భంగపడు, అవమానపడు; **3**. పూర్తిగా చెడిపోవు. **మొక్కచెఱుచు** స.క్రి. భంగపర్చు, అవమానపర్చు. **మొక్కచేయు** స.క్రి. పదును చెరచు. **మొక్కపడు** అ.క్రి. **1**. మొనమడగినదగు. చంద్రాంగ. 3.117; **2**. భంగపడు, చెడు. **మొక్కపఱచు** రూ. మొక్కపఱుచు. స.క్రి. **1**. చెరచు, భగ్నంచేయు. పారి. 1.50; **2**. మొరవపోవచేయు, కుంఠితం చేయు. రాజవా. 3.139; **3**. భంగపర్చు, పరాభవించు. అచ్చ. రా. యు. 332; **మొక్కపఱుచు** రూ.చూ. మొక్కపఱచు. స.క్రి. **1**. భంగపర్చు, పరాభవించు; **2**. మొరవపోవచేయు, కుంఠితం చేయు; **3**. చెరచు, భగ్నంచేయు. **మొక్కపాటు** వి. భంగిపాటు, పరాభవం. విప్ర. 4.88. **మొక్కపుచ్చు** స.క్రి. మొక్కపోవచేయు, కుంఠితం కావించు, భంగపరచు. భాస్క. రా. సుందర. 28. **మొక్కపోవు** రూ. చూ. మొక్కవోవు. అ.క్రి. **1**. వాడిచెడినదగు, మొరపోవు. కుంఠితమగు. భాస్క. రా. కిష్కిం. **4.24**; **2**. నశించు. చెడు. కళా. 1.106; **3**. హానిచెందు, కీడొందు. పాంచాలీ. 3.18; **4**. భంగపడు, పరాభవం పొందు. వాల్మీ. 3.86. **మొక్కమణఁగు** అ.క్రి. మొనచెడు. **మొక్కలువోవు (-పోవు)** రూ. మొక్కల్వోవు. అ.క్రి. మొదలు మడిగినదగు, కుంఠితమగు. భార. భీష్మ 2.71, హరి. ఉ. 7.47. **మొక్కల్వోవు** రూ.చూ. మొక్కలువోవు. అ.క్రి. మొదలు మడిగినదగు, కుంఠితమగు. వసు. 2.165. **మొక్కవోవు (-పోవు)** రూ. మొక్కపోవు. అ.క్రి. **1**. భంగపడు, పరాభవం పొందు. హరి. పూ. **5.168**; **2**. నశించు, చెడు. కళా. 8.106; **3**. హానిచెందు, కీడొందు. వేమ. 7.124.

**మొక్కటీఁడు** రూ.చూ. మొక్కడీఁడు. వి. **1**. చిన్నదంతాలున్న ఏనుగు; **2**. ముష్కరుడు.

**మొక్కట్టు** చూ. మొకము.

**మొక్కట్టుసాపు** చూ. మొగ[2].

**మొక్కడ** రూ.చూ. మొక్కరము[1]. వి. అడ్డగడియ.

**మొక్కడము** వి. **1**. దిట్టతనం; **2**. కాఠిన్యం.

సం. మూర్ఖ-. అవివేకం, తెలివితక్కువతనం; ప్రా. ముక్ఖ-.

మొక్కడీఁడు రూ. మొక్కటీఁడు. వి. **1**. మొక్కడి. ఆం. భా. 2.194; **2**. ముష్కరుడు; **3**. చిన్నకొమ్ముల ఏనుగు.

**మొక్కడి** రూ. చూ. మొక్కలి[3]. వి. **1**. చిన్నదంతాలున్న ఏనుగు; **2**. ముష్కరుడు.

**మొక్కడీఁడు** చూ. మొక్కడము.

**మొక్కఁడు** విణ. **1**. బలసినవాడు; **2**. దృఢచిత్తుడు, పట్టిన పట్టు విడవనివాడు.

త. మొక్కణ్. లావుగా ఉన్న మనిషి లేదా వస్తువు.

**మొక్కదురు** రూ.చూ. మొగకదురు. వి. ఒకరకం ఉన్నికదురు.

**మొక్కన** వి. ఒకజాతి చెట్టు. హంస. 4.11.

**మొక్కపుచెట్టు** చూ. మొక్కము[1].

**మొక్కము**[1] వి. ముక్కిడి, మొక్కవేపచెట్టు, కంప కంచెకు పనికివచ్చే చెట్టు (Schroebera swientctoides).

మొక్కపుచెట్టు వి. ఒకరకం చెట్టు.

**మొక్కము**[2] వి. మోక్షం, ముక్తి.

సం. మోక్ష-. ముక్తి, నిర్వాణం; ప్రా. ముక్ఖ-.

< ప్రా. ముక్ఖ-.

**మొక్కర** రూ.చూ. మొక్కరము[1]. వి. అడ్డగడియ.

**మొక్కరము**[1] రూ. మకరం, మవురా, ముకరం, ముఖరం, మొకర, మొకరము, మొక్కడ, మొక్కర, మొక్కల, మొగరము[2], మొగురము, వి. **1**. నిరోధం, ఆటంకం. నార. పంచ. 1.221; **2**. గడెమ్రాను, అడ్డగడియ, అర్గళం. విప్ర. 4.62; 3. స్తంభం, గుంజ.

సం. ముష్కర-. క్రూరమయిన, దిట్టమైన; ప్రా. మొక్ఖల-.

**మొక్కరము**[2] రూ.చూ. మొగ్గలము. వి. శౌర్యం. ప్రబంధ. 2.217.

**మొక్కల** రూ.చూ. మొక్కరము[1]. వి. అడ్డగడియ.

**మొక్కలపడు** చూ. మొక్కలము.

**మొక్కలపాటు** చూ. మొక్కలము.

**మొక్కలము** రూ.చూ. మొగ్గలము. వి. **1**. మోటుతనం. భార. శల్య. 2.270; **2**. ఉత్సాహవచనం. భార. అశ్వ. 4.136; **3**. మూర్ఖత, మొరకుతనం. భార. మౌసల. 112; **4**. అతిశయం, అధిక్యం. కేయూ. 3.110; **5**. ధైర్యం. ఉ. హరి. 5.87; **6**. ఉత్సాహం. కాశీ. **1.131**; **7**. శౌర్యం. విక్ర. 1.77; **8**. ఔద్ధత్యం, మిడిసిపాటు. గౌ. హరి. పూ. 1169పం.; విణ. **1**. అప్రతిహతం, అకుంఠితం. భార. శాంతి. 3.95; **2**. ముష్కరం, ముష్కరుడు. ప్రబోధ. **1.52**; **3**. మిడిసిపాటు కలవాడు. విష్ణుపు. 8.406.

సం ముష్కర-. పెద్దవృషణాలు కలవాడు; ప్రా. మొక్ఖల-;

క. ముష్క. మొండిపట్టు; తు. ముష్కు. అగౌరవం; త. ముక్కరమ్, ముష్కరమ్. మొండిపట్టు; మ. ముష్క. బలం, ముష్కన్. బలం కలవాడు, స్థూలమైన వాడు, ముష్కరన్. దృఢచిత్తత కలవాడు, ముక్కళమ్. రక్తపుష్టిగల.

మొక్కలపడు అ.క్రి. ఔద్ధత్యం వహించు, మిడిసిపడు. < మొక్కల(ము) + పడు. మొక్కలపాటు వి. ముష్కరత్వం. చంద్రరే. 2.129. < మొక్కల (ము) + పాటు. మొక్కలాడు స.క్రి. దూషించు, నిందించు. తాళ్ల. సం. 14.176. < మొక్కల(ము) + ఆడు.

మొక్కలాడు చూ. మొక్కలము.

మొక్కలి[1] రూ.చూ. మొగ్గలము. విణ. 1. మూర్ఖుడు. శివరా. 4.68; 2. శౌర్యం. కలవాడు. ఘటికా. 1.50; 3. మూర్ఖం. ఉ.రా. 4.221; 4. ఉద్ధతం, ఉద్ధతుడు. సత్య. సాం. 1.74; 5. పొగరుబోతు. ఆం. భా. 3.64; 6. శూరరాలు.

మొక్కలికా(డు వి. ఉద్ధతుడు, పొగరుబోతు, మూర్ఖుడు. వేమ. 2.229, పార్వ. 2.102. మొక్కలించు అ.క్రి. 1. ఉత్సహించు, వేడుకపడు. కవిక. 1.14; 2. ఔద్ధత్యం చూపు. సీతారా. 2.156; 3. పూను. < మొక్కలి[1] + -ఇంచు[3]. మొక్కలితనము వి. ముష్కరత్వం, మూర్ఖత. శుక. 2.531. మొక్కలింపు వి. ముష్కరం చేయటం. మొక్కలీ(డు రూ. మొక్కళీ(డు. విణ. 1. ముష్కరుడు, మొరకువాడు. భార. అశ్వ. 1.18; 2. శూరుడు, ధీరుడు. వరాహ. 6.89. మొక్కలు(డు విణ. శూరుడు. ఉ. హరి. 6.37.

మొక్కలి[2] రూ.చూ. మొక్కళి[2]. వి. కెంపులోని అధికకాంతి.

మొక్కలిక వి. కెంపులోని అధికకాంతి.

మొక్కలి[3] రూ. మొక్కడి, మొక్కళి[3]. వి. చిన్నదంతాలు కల ఏనుగు. ఆం. భా. 3.64.

మొక్కలింగ వి. ఉత్తర సర్కారు దక్కను మొ. చోట్ల అడవుల్లో సుమారు యాభై అడుగుల ఎత్తు పెరిగేచెట్టు (Schrebera swieteniodes).

మొక్కలిపీట రూ.చూ. ముక్కాలిపీట. వి. మూడుకాళ్ళుగల పీట.

మొక్కలీ(డు చూ. మొక్కలి[1].

మొక్కలు(డు చూ. మొక్కలి[1].

మొక్కళము రూ.చూ. మొగ్గలము. వి. అప్రతిహతం, ముష్కరత్వం.

మొక్కళి[1] రూ.చూ. మొగ్గలము. విణ. పొగరుబోతు, ముందు వెనుకలు చూడనివాడు. ఆం. భా. 3.64.

మొక్కళి[2] రూ. మొక్కలి[2]. వి. 1. కెంపులోని అధికకాంతి; 2. అధికకాంతి ఉన్న కృత్రిమ పద్మరాగం; 3. తళుకుకాంతి.

మొక్కళి[3] రూ.చూ. మొక్కలి[3]. వి. గజవిశేషం, చిన్న దంతాలున్న ఏనుగు.

మొక్కళీ(డు రూ.చూ. మొక్కలీ(డు. విణ. 1. మొరటువాడు, ముష్కరుడు. తాళ్ల. సం. 17.162; 2. శూరుడు, ధీరుడు.

మొక్కాకువేయు చూ. మొక్క[1].

మొక్కాము రూ.చూ. ముకాము. వి. బస, ఒకటే విభాగం.

మొక్కిమొక్కించుకొను చూ. మొక్కు[1].

మొక్కు[1] రూ.చూ. మ్రొక్కు. అ.క్రి. నమస్కరించు, దండం పెట్టు; వి. 1. నమస్కారం; 2. మొక్కుబడి.

మొక్కిమొక్కించుకొను స.క్రి. మర్యాద ఇచ్చిపుచ్చుకొను. శుక. 3.381. మొక్కుకొను రూ. మ్రొక్కుకొను. స.క్రి. ప్రార్థన చేసుకొను. మొక్కుబడి రూ.చూ. మ్రొక్కుబడి. వి. 1. దేవతాప్రార్థన; 2. ముడుపు. మొక్కుబడిచెల్లించు స.క్రి. దేవునికి మొక్కుకున్న విధంగా నెరవేర్చు. మొక్కుసొక్కుసామి(-చొక్కుసామి) వి. సూర్యుడు. సాంబ. దేవ. 9.

మొక్కు[2] రూ.చూ. మొగ్గు. వి. 1. మెరక; 2. పెచ్చు.

మొక్కురాయి వి. అబ్బుగుల్ల, సున్నంరాయి.

మొక్కు[3] రూ.చూ. ముక్కు[3]. వి. ముక్కు, కొయ్యముక్క.

మొక్కెర వి. గుర్రం, పోలుకర్రకు కాడికట్టేవైపు అడుగువేసిన కొయ్యముక్క.

మొక్కెరకణి వి. ముక్కరచీల, జంటనొగలను కాడిముందు కలపటానికి బిగించిన ఇనపమేకు.

మొక్తసరు రూ.చూ. మొఖ్తసరు. వి. 1. బలగాలి; 2. నాయకుడు.

మొక్త్యార్ రూ.చూ. ముక్త్యారు. వి. 1. సంపూర్ణాధికారం గల రాయబారి; 2. పై విచారణచేసే వ్యక్తి.

మొఖం వి. ఆములో పేర్చిన ఇటికలోని కనపడే భాగం.

సం. ముఖ-. మోము.

< సం. ముఖ + -ము.

మొఖంరౌతు రూ. ముకంరౌతు, మొకమురౌతు. వి. ఒంటిమొఖంరాయి, ఒకవైపు చదునుగా నున్నగా చెక్కబడిన రాయి.

మొఖద్దమా రూ.చూ. ముకద్దమా. వి. 1 వ్యవహారం; 2. ప్రత్యేకమైన.

మొఖమల్ రూ.చూ. ముఖమల్లు. వి. మెయల్‌బట్ట, వెల్వెట్.

మొఖరం వి. తివాసీమగ్గం కట్టుబడికి నేలలో పాతిన పొడుగు కొయ్య.

సం. ముఖర-. ధ్వనిచేసేది, ఘల్లుఘల్లుమని మోగేది.

< సం. ముఖర- + -ము.

మొఖరరు రూ. మొకరరు, మొక్రరు, మొకరారు, మొఖరరూ, మొఖరీరు, మోకరరు. వి. నియామకం; విణ. నిర్ణయించబడ్డ.

హిం. ముకర్రర్. నిశ్చితం, నియుక్తం; ఉ.అర. ముకర్రర్. రూఢిఅయిన, స్థిరపడిన, ప్రశ్నించుటకు వీలులేని, అమోఘమైన; పార. ముకర్రర్. నిర్ణయింపబడిన, నిశ్చయింపబడిన, ఉద్యోగంలో నియోగించబడిన.

< ఉ. ముకర్రర్.

మొఖరరుచేయు స.క్రి. నియామకంచేయు.

మొఖరరూ రూ.చూ. మొఖరరు. వి. 1. నియామకం; 2. నిర్ణయించబడ్డ.

మొఖరాటా వి. సమాధిపైన ఆర్చి మాదిరిగా కట్టిన కట్టడం.

హిం.ఉ.అర. మక్‌బర్, మక్‌బర. సమాధిచేసేస్థలం,

గోరీ, శిల్పం, కట్టడం.

<ఉ. మక్బర్.

**మొఖరి** రూ.చూ. మొకరి. వి. ముఖరం ఊదేవాడు. ద.హిం.గా. సంపు. 5. శా.సం. 1250.

**మొఖరీరు** రూ.చూ. మొఖరరు. వి. 1. నియామకం ; 2. నిర్ణయించబడ్డ.

**మొఖాం** రూ.చూ. ముఖాము. వి. బస, ఒకటే విభాగం.

**మొఖాబిలావారి** విశ. పోటీక్రమ ప్రకారం.

ఉ.అర. ముకాబలా-వార్. పోటీ క్రమప్రకారం.

<ఉ. ముకాబలా + పార. వార్.

**మొఖాసా** రూ.చూ. ముఖాసా. వి. 1. స్వాధీనం చేయబడిన గ్రామం ; 2. తీరువలేనిభూమి, మాన్యం ; 3. చిన్నజమీందారి ; 4. జమీందారు మొత్తంగా నిర్ణయించుకొన్న శిస్తు కడుతూ గ్రామస్థుల దగ్గర తన ఇష్టానుసారం శిస్తు వసూలు చేసుకొనే ఏర్పాటుమీద పొందిన భూమి.

**మొఖాసాదారు** రూ. మొకాసాదార్, మొఖాసిదారు. వి. 1. స్వాధీనం చేయబడ్డ గ్రామం కలవాడు ; 2. చిన్న జమీందారు ; 3. పాలెగాడు.

ఉ.పార. ముకాసాదార్. ముకాసాభూమి గలవాడు.

<ఉ. ముకాసాదార్.

**మొఖాసిదారు** రూ.చూ. మొఖాసాదారు. వి. 1. గుత్తగాడు, స్వాధీనం చేయబడ్డ గ్రామం కలవాడు ; 2. చిన్నజమీందారు ; 3. పాలెగాడు.

**మొఖాసీ** రూ.చూ. ముఖాసా. వి. ముఖాసాదారుడు. ద.హిం.గా. సంపు. 10. శా.సం. 753. క్రీ.శ. 1600.

**మొఖిరీలు** రూ. ముకిరీలు. వి.బ.వ. అరటిపళ్ళలో ఒకరకం, అమృతపాణి అరటిపళ్ళు.

ఒ. ముఖిరీ. అరటిపళ్ళలో ఒకరకం.

<ఒ. ముఖిరీ + -లు.

**మొఖ్తసరు** రూ. మొక్తసరు. వి. 1. బలశాలి ; 2. నాయకుడు.

ఉ.అర. ముక్తదిర్. శక్తిగల, దృఢమైన.

<ఉ. ముక్తదిర్.

**మొఖ్మల్** రూ.చూ. ముఖమల్లు. వి. 1. దళసరిగా ఉండే ఒక విధమైన పట్టు ; 2. వెల్వెటు.

**మొగ[1]** వి. 1. ద్వారం. రం.రా. ఉ. 9పు. 29 పం ; 2. అగ్రప్రాణి ముఖం. కాశీ. 1.133 ; 3. నదీసముద్రాదుల ముఖం. కాశీ. 2.98 ; 4. మొదలు, ప్రారంభం. జైమినిభా. 2.43.

సం. ముఖ-. మొదలు, మోము ; ప్రా. మోహ-.

<సం. ముఖ-.

**మొగకట్టు** అ.క్రి. 1. అభిముఖమగు, కూడు. భార. భీష్మ. 2.113 ; 2. క్రందుకొను, అతిశయించు. శృం.నై. 6.102 ; 3. మోగు ; 4. ప్రధానమగు ; వి. ఆముగట్టెదుట ఆము పడుగుముందు భాగంలో గోలేలతో కట్టిన అడ్డు. **మొగకదురు** రూ. మొక్కదురు. వి. ఒకరకం ఉన్నికదురు. **మొగకొను** అ.క్రి. 1. అభిముఖమగు. భార. ద్రోణ. 1.301 ; 2. మోహరించు ; స.క్రి. 1. పొందు. భార. శాంతి. 1.189 ; 2. మొదలుపెట్టు ; 3. పూను. **మొగకొలుపు** రూ. మొగకొల్పు. స.క్రి. ప్రోత్సహించు. భార. అశ్వ. 3.31. **మొగకొల్పు** రూ.చూ. మొగకొలుపు. స.క్రి. అభిముఖం చేయు, ప్రోత్సహించు. భార. మౌసల. 167. **మొగచాళము** వి. స్వరవిశేషాన్ని తెల్పే వీణతీగల్లో ఒకటి. బసవ. 3.925 పం. **మొగచాళి** వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 788. **మొగదల** వి. 1. ముందటిభాగం, ముంగల. పద్మ. 9.183 ; 2. ఎదురు. **మొగపాళము** రూ.చూ. మొగవాళము. వి. నిస్సరణం. **మొగపెట్టు[1]** అ.క్రి. పాత్రల అంచులో వాయి బిగిసేటట్లు చేయు. **మొగబంతి** రూ.చూ. ముకుబంతి[2]. వి. పశువులకు శైత్యంతో నాసారంధ్రాల్లో కలిగే కేశావృత పిండరూప వ్యాధి విశేషం. **మొగమాడువు** వి. 1. ముఖమండపం ; 2. ముఖద్వారపు గోపురం. **మొగముట్టు** వి. అశ్వముఖాలంకారం. మను. 4.28. **మొగరాడు** వి. 1. గృహాగ్రస్తంభం, మొగరం. ఆం.భా. 2.20 ; 2. వ్యూహం. **మొగలివాకిలి** రూ. మొగవాకిలి, మొగిలివాకిలి. వి.ఔ. 1. ముఖద్వారం, తలవాకిలి. భీమ. 1.74 ; 2. హజారం, ఆస్థానమండపం. భల్లా. 5. **మొగవాకిలి** రూ.చూ. మొగలివాకిలి. వి.ఔ. 1. ముఖద్వారం, తలవాకిలి ; 2. హజారం కొలువు. **మొగవాడ** వి. 1. ముఖద్వారం. బసవ. 4.98 ; 2. దేవాలయాదుల్లో దేవుడు మొ. వాళ్ళకి ముందు కట్టే అడ్డుతెర. బసవ. 4.332 పం. ; 3. ఎద్దులపై కప్పిన కంబడి. బసవ. 7.186 ; 4. ఏనుగులపై కప్పే రత్న కంబళం. హరి. 6. **మొగవాయి** వి. వామి (గడ్డి కుప్ప) ముఖం ఏటవాలుగా ఉన్న భాగం. **మొగవాళము** రూ. మొగపాళము. వి. 1. కాలెంగూడ మొ. వాటితో తోడే నీళ్ళు పారే కాలవ మొదట పచ్చిక పెల్లలు మొ. వాటితో ఏర్పరచిన ఎత్తు ప్రదేశం. మొత్త. ద్వి.పరమ.వి. 4.288 ; 2. ఇల్లు మొ. వాటి ముందు భాగం. ఆం.భా. 2.23. **మొగవిచ్చు** అ.క్రి. ముఖభాగాన వికాసం కలదగు. పాండు. 4.220. **మొగవీణ** వి. ముఖవీణ, వాద్య విశేషం. **మొగసరి[1]** వి. మొగముట్టు, అశ్వాదుల ముఖాలంకారం. వరాహ. 2.28.

**మొగ[2]** రూ.చూ. మకస్తు. విశ. 1. శూరుడు ; 2. పురుషజాతిది ; వి. 1. పురుషుడు ; 2. భర్త, పెనిమిటి ; 3. రాజు, ప్రభువు.

మొక్కట్టుసాపు (-చాపు) రూ.చూ. మొగకట్టుచాపు. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట. **మొగకట్టుచాపు** రూ. మొక్కట్టుసాపు. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేత బట్ట. **మొగకాయ** వి. మగదసలిపురుగు అల్లిన గూడు. **మొగజోదు** వి. యోధాగ్రేసరుడు. ఉ.హరి. 4.200. **మొగతనము** వి. పుంస్త్వం, పౌరుషం. మై.రా. పు. 66. **మొగదగువాఁడు** (-తగువాఁడు) విశ. మొనగాడు, ప్రముఖుడు. జైమినిభా. 2.43. **మొగదసలిపురుగు** వి. పట్టు ఉత్పత్తి చేసే పురుగుల్లో మొగది. **మొగదిక్కు** వి. మగ దక్షత. **మొగపోల్కికూటమి** వి. ఉపరతి. **మొగబీఱ** రూ. మగబీర[2]. వి. దక్కనుకర్ణాటకల్లో పెరిగే తెల్లని మొక్క. హంస. 1.182. **మొగమానికము** రూ. మగమానికము. వి. రత్నాలలో ప్రధానమైంది, వజ్రం. ద్వి.పరమ.వి. 5.426 పు. **మొగలా** రూ.చూ.

మగణాజు. వి. వజ్రమణి, ప్రధానమణి. చంపూరా. 3.71. మొగవాసి వి. పౌరుషం. రాధికా. 2.53. మొగసిరి రూ.చూ. మగసిరి. వి. **1.** పౌరుషం ; **2.** పెట్టుమందు.

మొగ[3] రూ.చూ. మొగ్గ[1]. వి. ముకుళం, మొగ్గ. యయా. 4.25. మొగించు అ.క్రి. ముడుచుకొను, ముకుళించు. < మొగ[3] + -ఇంచు[3].

**మొగంవాచు** చూ. మొగము.

**మొగంసొలు** చూ. మొగము.

**మొగంగాడి** చూ. మొగము.

**మొగచాటు** చూ. మొగము.

**మొగటిపుగుగు** రూ.చూ. మొగిటిపురుగు. వి. **1.** ఈగ ; **2.** నల్లి.

**మొగటిల్లు** రూ.చూ. మ్రొగ్గతిలు. అ.క్రి. వంగు, మోకరిలు.

**మొగడ**[1] చూ. మొగడు[1].

**మొగడ**[2] చూ. మొగ[1]. వి. మొగసాల. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 653.

**మొగడించు** చూ. మొగడు[1].

**మొగడు**[1] రూ.చూ. మొగుడు. అ.క్రి. ముకుళించు.

మొగడ[1] వి. **1.** కోరకం, మొగ్గ. కు.సం. 4.99; **2.** తలుపులు, ముంజూరు మొ. వాటి మీద నిర్మించే గుబ్బ. భాగ. 3.808 ; **3.** అట్ట అంచున మొగ్గలా నిర్మించిన చిత్ర విశేషం. క. ముగుళ్, ముగళ్. మొగ్గ ; తు. ముగురు. మొగ్గ ; త. ముకిఴమ్. మొగ్గ ; పో.చూ. సం. ముకుళ-. మొగ్గ. **మొగడించు** రూ.చూ. మొగిడించు. అ.క్రి. మొగుడు, ముకుళించు. యయా. 2. < మొగడు[1] + -ఇంచు[3]. **మొగడుదామర** (-తామర) రూ. మొగుడుఁదామర. వి. నమస్కారి. ఆం.భా. 2.68.

**మొగడు**[2] క్రి.విశ. ముష్కరమైన, మొండి.

**మొగడు**[3] వి. ఇంటినడికొప్పు. భాగ. 3.809.

క. మొగడు, మొగళు, మగిల్. ఇంటి పైకప్పు ; తు. ముగిలి. ఆలయశిఖరం, కొన, పైభాగం, మోడు. కొండ ; త. ముకటు. పైభాగం, ఇంటి పైకప్పు ; మ. ముకటు. వస్త్రం పైభాగం, ముకళ్. పైభాగం, శిఖరం, కొన ; కో. మొయ్ళ్. ఇంటి పైకప్పు ; తొ. ముక్స్ల్ (Muxul). ఇంటి పైభాగం ; గోం. ముకుర్. కోడి జుట్టు ;

పో.చూ.సం. ముకుట-, మౌలి. శిఖ ; ప్రా. మౌల. శిఖ ; పా. మకుట. శిఖ.

**మొగతప్పు** రూ.చూ. మొగము.

**మొగతా** రూ.చూ. మాక్తా. వి. **1.** భూకామందుకు రైతు ఇచ్చే డబ్బు లేక పంట ; **2.** ప్రభుత్వం గుత్తకిచ్చిన పొలం.

**మొగతిరుగు** చూ. మొగము.

**మొగదప్పు** చూ. మొగము.

**మొగదాడు** రూ.చూ. ముక్కుటాడు. వి **1.** పంటె కిందివైపున ఆకుల చివర్లన కామకు కలిపి కట్టిన లాడు ; **2.** ముక్కు లోపలినుంచి దూర్చి కట్టే తాడు.

**మొగదారమ్మ** వి. మహాలక్ష్మి.

**మొగద్దమా** రూ.చూ. ముకద్దమా. వి. **1.** వ్యవహారం ; **2.** ప్రత్యేకమైన.

**మొగంనల్లగాచేసుకొను** చూ. మొగము.

**మొగపట్టు** చూ. మొగము.

**మొగపడు** చూ. మొగము.

**మొగపిటిక** చూ. మొగము.

**మొగపు** చూ. మొగ[1]. వి. **1.** హారాదుల ముఖ భాగం. వరాహ. 8.35 ; **2.** వడ్డాణం మొ. వాటిలో కూర్చే బిళ్ళ. ద్వి.పరమ.వి. 2.94 పు. 3 పం. ; **3.** హారం మొ. భూషణాల్లో నీల ఉంచుకోవటానికి ఏర్పరచిన వట్రువైన పూదె, కొలికపూస. ప్రభా. 1.54.

తు మొగపు. వడ్డాణం మొ. వాటి కొక్కెం.

మొగపుతీఁగియ రూ.చూ. మొగపుతీఁగె. వి. స్త్రీల కంఠాభరణ విశేషం. మొగపుతీఁగె రూ. మొగపుతీఁగియ, మొగపుతీవె. వి. స్త్రీల కంఠాభరణ విశేషం. యయా. 4.89. మొగపుతీవె రూ.చూ. మొగపుతీఁగె. వి. స్త్రీల కంఠాభరణ విశేషం. మొగపుముత్యము వి. కొలికిముత్యం, కొలికిపూస. మొగపులతీఁగె రూ. మొగపులతీవె. వి. స్త్రీల కంఠాభరణ విశేషం. ద్వి.పరమ. వి. 2.55 పు. 4 పం. మొగపులతీవె రూ.చూ. మొగపులతీఁగె. వి. స్త్రీ కంఠాభరణ విశేషం.

**మొగపెట్టు**[2] చూ. మొగము.

**మొగమగు** చూ. మొగము.

**మొగమాట**[1] చూ. మొగము.

**మొగమాట**[2] చూ. మొగము.

**మొగమాటపెట్టు** చూ. మొగము.

**మొగమాటము** చూ. మొగము.

**మొగమాయకాఁడు** చూ. మొగము.

**మొగమాలు** రూ.చూ. ముఖమల్లు. వి. ముకమలు.

**మొగమిచ్చు** చూ. మొగము.

**మొగమిచ్చుమాట** చూ. మొగము.

**మొగమిచ్చులాఁడి** చూ. మొగము.

**మొగమిచ్చు** చూ. మొగము.

**మొగమింతచేసికొను** చూ. మొగము.

**మొగము** రూ. ముగము, మొకము, మొవము, మొహము. వి. **1.** వదనం. భార.ఆది. 2.221 ; **2.** ద్వారం. భార.విరా. 2.253 ; **3.** దీని తృతీయా విభక్తి రూప మైన (మొగమున) అనేది కొన్ని భూతార్థక ధాతుజ విశేషణాల కనుప్రయుక్తమై వెంటనే అనే అర్థ మిస్తుంది. భార. ఉద్యో. 1.369 ; **4.** ఎదురు, సమ్ముఖం. భార. ఉద్యో. 4.270 ; **5** అగ్రభాగం. భార. భీష్మ. 1.116 ; **6.** నోరు. కకుత్స్థ. 2.90 ; విశ. ప్రధానుడు, ముఖ్యుడు. భార.అరణ్య. 7.42.

సం. ముఖ-. ముఖం ; ప్రా. ముహం ;

క. మొగ, ముగమ్. ముఖం, నోరు, మొఱె. ముఖం ; తు. మొగ, ముగమి. ముందు ; త. ముకమ్. మొహం, నోరు, ముకప్పు. ముందు, ముందుభాగం ; మ. ముకమ్. మొహం, నోరు, ప్రారంభం, మొదలు ; తొ. మిక్స్ (Mix). గ్రామంలో బయలు ప్రదేశం (ఊరిముందు

జాగా) ; పర్జి. మొకోమ్. ముఖం ; కొలా. మొకమ్. ముఖం ; నా. మొకమ్. ముఖం.

<సం. ముఖ-.

మొగంవాచు రూ.చూ మొగమువాఁచు. అ.క్రి. ఎక్కువ అపేక్షతో ఉండు. < మొగము + వాఁచు. మొగంసాటు వి. పాత్ర ముఖభాగం. < మొగము + చాటు. మొగంగాడి రూ. మొకంగాడి. వి. రాట్నం బొమ్మలో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి. < మొగము + గాడి. మొగచాటు విణ. 1. మొగం మొత్తేది, వెగటైంది. భీమ. 1.112 ; 2. అసహ్యం. వేంక.ఆం. 16. <మొగము + చాటు. మొగతప్పు రూ. మొగదప్పు. అ.క్రి. మొగం మరోవైపుకి పెట్టు, అభిముఖంకాకుండు, వెనుదీయు, పిరుడవియు. భార.ద్రోణ. 1.92. <మొగము + తప్పు. మొగతిరుగు అ.క్రి. మొగతప్పు, పెడమొగంపెట్టు, వెనుదీయు. కు.సం. 4.30, 10.66. <మొగము + తిరుగు. మొగదప్పు(-తప్పు) రూ.చూ. మొగతప్పు. అ.క్రి. 1. సేన చెదరిపోవు. భార.సౌప్తి. 1.27 ; 2. పెడమొగమగు ; 3. జంకు. <మొగము + తప్పు. మొగంనల్లగాచేసుకొను అ.క్రి. కించపడు. <మొగము + నల్ల + అగు + -అ[7] + చేయు + ఇ[11] + కొను. మొగపట్టు వి. ముఖపట్టు, గుర్రం ముఖానికి కట్టిన ఆభరణం. మను. 4.37. <మొగము + పట్టు. మొగపడు అ.క్రి. 1. కనపడు, అగపడు. దశకు. 4.113 ; 2. ముందుకువచ్చు. భాస్క.రా. కిష్కిం. 683 ; స.క్రి. చూచు. రం.రా.ఉ. 57పు. 4పం. <మొగము + పడు. మొగపిటిక వి. కూర్మం, తాబేలు. హ.న. 4.43. <మొగము + పిటిక. మొగపెట్టు[2] స.క్రి. ఎదిరించు. కు.సం. 4.15. <మొగము + పెట్టు. మొగమగు అ.క్రి. మొగంపెట్టు, మొగంతిప్పు, అభిముఖంఅగు. భార.ఉద్యో. 4.257. <మొగము + అగు. మొగమాట[1] వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146. <మొగము + ఆట. మొగమాట[2] రూ.చూ. మొగమోట. వి. 1. దాక్షిణ్యం ; 2. ముఖప్రీతి ; 3. సంకోచం ; మొగమాటపెట్టు అ.క్రి. చనువుని పురస్కరించుకొని బలవంతపెట్టు. మొగమాటము రూ.చూ. మొగమోట. వి. దాక్షిణ్యం. మొగమాయకాఁడు రూ. మొకమాయకాఁడు. వి. ప్రత్యక్షంగా మోసం చేసేవాడు. తాళ్ల.సం. 15.147. సం. మాయ. మోసం. <మొగము + సం. మాయా + -కాఁడు. మొగమిచ్చు వి. 1. ముఖప్రీతి. తాళ్ల సం. 13.88 ; 2. మోమోటం ; 3. దాక్షిణ్యం. <మొగము + ఇచ్చు. మొగమిచ్చుమాట వి. ముఖం ఎదుట సంతోషం కలిగేటట్లు పలికే పలుకు, ఇచ్చకం. పారి. 1.125. మొగమిచ్చులాఁడి వి. ముఖస్తుతి చేసే స్త్రీ. <మొగము + ఇచ్చు + -లు + -ఆఁడి. మొగమిచ్చు అ.క్రి. 1. సుముఖతపొందు, ప్రసన్నత పొందు. కవిక. 6.1 ; 2. సుముఖుడగు. <మొగము + ఇచ్చు. మొగమింత చేసికొను రూ. మొకమింతచేసికొను. అ.క్రి. 1. సంతోషంతో ముఖం వికసింపచేసికొను. కువ.చ. 1.25 ; 2. సిగ్గువల్ల ముఖం ముడుచుకొను. <మొగము + ఇంత + చేయు + -ఇ[11] + కొను. మొగముకడుగు స.క్రి. 1. అవమానించు ; 2. ముఖం కడుగుకొను. మొగముగంటుపెట్టుకొను అ.క్రి. అసంతృప్తినీ కోపాన్ని తెలియపరుస్తూ ముఖం చిట్లించు. మొగముగొట్టు(-కొట్టు[1]) అ.క్రి. అసహ్యం పుట్టు. మొగము చూపు అ.క్రి. కనిపించు, వచ్చు. మొగముచెల్లమి వి. తప్పు చేసినప్పుడు తనవాళ్ళని చూడటానికి సంకోచించటం. పల్నా పు. 63. మొగముతప్పించు అ.క్రి. సమయానికి కనబడకుండాపోవు. మొగముతెలుపుమెకము రూ. మొగముతెల్పు మెకము. వి. భల్లూకం. మొగముతెల్పుమెకము రూ. చూ. మొగముతెలుపుమెకము. వి. భల్లూకం. మొగమున అవ్య. ద్రు. 1. తోడుతో ; 2. కూడ. మొగమునగట్టు(-కట్టు) అ.క్రి. నిరంతరం, జ్ఞాపకానికి వచ్చు, కనిపించు. తాళ్ల. సం. 8.216. మొగమునగంటువెట్టు(-పెట్టు) అ.క్రి. అసమ్మతిని సూచించు. శుక. 3.21. మొగమునఁబడు(-పడు) అ.క్రి. ఎదుటపడు, ఎదిరించు. భార.భీష్మ. 2.17. మొగమునఁవేలు అ.క్రి. ఎదుటనే కనబడు. కు.సం. 5.171. మొగముబిగించుకొను అ.క్రి. మూతిబిగించుకొను. మొగము మటమటలాడించు అ.క్రి. మొగం చిట్లించు. మొగముముడుచు అ.క్రి. మొగం చిన్నబుచ్చుకొను. మొగముముడుచుకొను అ.క్రి. మొగం చిన్నబుచ్చుకొను. మొగమువాఁచు రూ. మొగంవాచు. అ.క్రి. 1. ఎక్కువ అపేక్షతో బాధపడు. కకుత్స. 2.72 ; 2. మిక్కిలికోరికతో ఉండు. మొగమువాడు అ.క్రి. ముఖం కళతప్పి ఉండు. మొగముసెదరు(-చెదరు) అ.క్రి. వైమనస్యం కల్గు, మనసులో నొప్పి కలుగు. హరి.పూ. 8.89. మొగమూర్పు వి. ముఖవాయువు. ఆము. 5.134. <మొగము + ఊర్పు. మొగమెత్తనేర్చు అ.క్రి. తలఎత్తుకొని తిరగగలుగు. బసవ. 5.125. <మొగము + ఎత్తు[1] + -అ[7] + నేర్చు. మొగమెత్తనోడు అ.క్రి. అవమానంతో ముఖం ఎత్తుకొనలేకపోవు. కు.సం. 10.48. <మొగము + ఎత్తు[1] + -అ[7] + ఓడు. మొగమెఱుక వి. ముఖపరిచయం. పరమ. 4.1271. <మొగము + ఎఱుక. మొగమెఱుఁగు అ.క్రి. ముఖపరిచయం కలిగి ఉండు. <మొగము + ఎఱుఁగు. మొగమొగములుచూచు అ.క్రి. ఒకరి ముఖం ఒకరు చూచు. ప్రబోధ. 3.53. <మొగము + మొగము + -లు + చూచు. మొగమొగంబులు చూచుకొనఁగలుగు అ.క్రి. ఒకరి ఎదుట ఒకరుండే అవకాశం కలుగు. శుక. 2.88. మొగమొగాలెదురు వి. ఒకరి ముఖానికి ఇంకోముఖం ఎదురు. తాళ్ల.సం. 17.369. <మొగము + మొగము + -లు + ఎదురు. మొగమొప్పు అ.క్రి. ముఖం వచ్చు. భాస్క.రా. యు. 156. <మొగము + ఒప్పు. మొగమోట రూ. మొకమాట, మొకమోటము, మొగమాట[2], మొగమాటము, మొగమోటమి, మొగమోటము. వి. 1. సంకోచం, ముఖభీతి. నిర్వ.రా. 9.27 ; 2. దాక్షిణ్యం, పరచిత్తానుకూల వర్తనం. భార.అను. 2.279 ; <మొగము + ఓట. మొగమోటకాఁడు విణ. దాక్షిణ్యం కలవాడు. వరాహ. 1.32. మొగమోటపెట్టు స.క్రి. దాక్షిణ్యాన్నుపయోగించు. మొగమోటమి రూ.చూ. మొగమోట. వి. 1. దాక్షిణ్యం. శశాం. 4.210 ; 2. సంకోచం. మొగమోటము రూ.చూ. మొగమోట. వి. 1. దాక్షిణ్యం, పరచిత్తానుకూలవర్తనం ;

2. సంకోచం, ముఖభీతి. మొగమోడు అ.క్రి. 1. దాక్షిణ్య పడు, జాలిపడు. కు.సం. 2.28 ; 2. సంకోచించు. భార.ద్రోణ. 2.237, విజ్ఞా. 2.122. < మొగము + ఓడు. మొగంబల్ల రూ. మగ్గంబల్ల. వి. రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య. < మొగము + బల్ల. మొగంబుల(బయ్యెదలొత్తు(-పయ్యెదలొత్తు) అ.క్రి. ఏడ్చు. ఉ.హరి. 1.53. మొగంబుగ్రవేసినటుల అవ్య.క్రదు. మొగాన కొట్టినట్టు. ఆము. 5.62. మొగంమాడిపోవు అ.క్రి. అవమానభాజనుడగు. < మొగము + మాడు + -ఇ[13] + పోవు. మొగంమీదనేఅను అ.క్రి. ఎదురుగానే తిట్టు. < మొగము + మీ(దు + -అ[7] + ఏ + అను. మొగంమొత్తినట్లు అవ్య. గట్టిగా. < మొగము + మొత్తు + -ఇ[13] + -న + అట్టు. మొగంమొత్తు అ.క్రి. తీపి మొ. వాటిని ఎక్కువగా తిన్నందున వెగటుపుట్టు. < మొగము + మొత్తు. మొగసరి[2] వి. 1. వశీకరణౌషధం. ద్వి.పరమ. వి. 2.81పు. పి.శకు. 1.113 ; 2. లోకమోహనమైన ముఖశోభ, సౌందర్యం. ద్వి. పరమ. వి. 3.167పు. 14పం. ; 3. గుర్రం మొ. వాటి ముఖాలంకారం. వరాహ. 2.28. మొగసాటు వి. మొగం మొత్తటం. < మొగము + చాటు.

మొగమూర్పు చూ. మొగము.

మొగమెత్తనేర్చు చూ. మొగము.

మొగమెత్తనోడు చూ. మొగము.

మొగమెఱుక చూ. మొగము.

మొగమెఱు(గు చూ. మొగము.

మొగమొగములుచూచు చూ. మొగము.

మొగమొగంబులు చూచుకొన(గలుగు చూ. మొగము.

మొగమొగాలెదురు చూ. మొగము.

మొగమొప్పు చూ. మొగము.

మొగమోట చూ. మొగము.

మొగమోటకా(డు చూ. మొగము.

మొగమోటపెట్టు చూ. మొగము.

మొగమోటమి చూ. మొగము.

మొగమోటము చూ. మొగము.

మొగమోడు చూ. మొగము.

మొగంబల్ల చూ. మొగము.

మొగంబుల(బయ్యెదలొత్తు చూ. మొగము.

మొగంబుగ్రవేసినటుల చూ. మొగము.

మొగంమాడిపోవు చూ. మొగము.

మొగంమీదనేఅను చూ. మొగము.

మొగంమొత్తినట్లు చూ. మొగము.

మొగంమొత్తు చూ. మొగము.

మొగరం రూ. చూ. మొకరం. వి. గెనుసుగడ్డ.

మొగరంగోడ చూ. మొగరము[2].

మొగరప్పీట చూ. మొగరము[2].

మొగరము[1] రూ.చూ. మొగ్గరము. వి. వ్యూహం.

మొగరించు స.క్రి. ఎదిరించు. ఉ. హరి. 4.167. < మొగరము[1] + -ఇంచు[3].

మొగరము[2] రూ.చూ. మొక్కరము[1]. వి. 1. మొగరాడు, గృహాగ్రస్తంభం. ఆం. భా. 2.20 ; 2. రాటీకి ఆధారంగా పాతిన నిలువుకొయ్య ; 3. కొయ్యతోచేసిన లావుపాటి స్తంభం ; 4. గానుగ రాతిని తగిలించే కొయ్యదూలం ; గానిగకట్టె ; 5. మోటబావి దోర్నపుట్టెకు ఆధారంగా ఉండే నిలువుగుంజ ; 6. దండెకదురు తిరగటానికి పాతిన పంగలకొయ్య.

మొగరంగోడ చూ. వరంగోడ. ని. మిద్దెపై అంచుల దగ్గర, బట్టీ మశల పక్కన కట్టే పల్చని పొట్టిగోడ. మొగరప్పీట రూ. మొగరాప్పీట. వి. కొయ్యస్తంభాలమీద నిలిపే చెక్కనకొయ్యదిమ్మ. మొగరాప్పీట రూ.చూ. మొగరప్పీట. వి. కొయ్యస్తంభాల మీద నిలిపే చెక్కన కొయ్యదిమ్మ. మొగరాలపీట వి. కొయ్యస్తంభాల మీద నిలిపే చెక్కన కొయ్యదిమ్మ.

మొగరముగడ్డ వి. గెనుసుగడ్డ.

మొగరంబము వి తుమ్మెద. చంద్రాంగ. 1.32.

సం. ముఖర-. ధ్వనించేది.

మొగరాప్పీట చూ. మొగరము[2].

మొగరాలపీట చూ. మొగరము[2].

మొగరించు చూ. మొగరము[1].

మొగరితనము చూ. మొకరి. వి. మొకరి ఊదేకార్యం. ద. హిం. శా. సంపు. 6. గా.సం. 1049.

మొగలాకుపేటు చూ. మొగలి.

మొగలానీ వి. మొగలు వంశపు స్త్రీ.

హిం. ముగ్‌లానీ. మొగలువంశ స్త్రీ, ఆడటైలరు. ఆడపనిమనిషి, మొగలు వ్యక్తి భార్య ; ఉ. పార. ముగ్‌లానీ. మొగలు వంశపు స్త్రీ, కుట్టుపని చేసేస్త్రీ, స్త్రీల గదుల్లో ఉండే నౌకరు.

< ఉ. ముగ్‌లానీ.

మొగలాయి రూ. మోగలా. వి. మొగల్ చక్రవర్తుల సంబంధమైన.

హిం. ముగ్‌లాఈ. మొగలును పోలిన లేక మొగలులకు సంబంధించిన ; ఉ. పార. ముగ్‌లాఈ. మొగలు సంబంధమైన, మొగలుల నాటి ;

క. మొగలాయి ; త. మొకలాయర్.

< ఉ. ముగ్‌లాఈ.

మొగలాసు వి. ఒకరకం ఆను.

మొగలి రూ. మొగిలి[1], మొగులు[2], మొవలి. వి. కేతకి, గేదంగి. ఆము. 4.95. (Pandamus odaratissimus).

త. ముకరి, ముకులి, ముచలి, ముతలి. మొగలి.

మొగలాకుపేటు వి. మగ్గానికి పేటుదారాలు కట్టి నేత అయిమూల వరసల్లో వచ్చేట్టు మూలనేతలో మొగలిఆకు. మొగలికోడి వి. ఒకపక్షి. మొగలిచన్నునార రూ. మొగలి సన్నునార. వి. మొగలిచెట్టు. ఊడనుంచి తీసిననార. మొగలిత్రాచు వి. మొగలిచెట్టుతో ఉండే తెల్లని చిన్న విషసర్పం. మొగలినార రూ. మొగల్నార, మొగిల్నార, మొగుల్నార. వి. మొగలిచెట్టు మట్టలనుంచి తీసిననార, మొగలిపండు వి. సంచీపుష్పం. మొగలిపనస వి. అనాస, ఒకానొక పళ్ళచెట్టు. మొగలిపువ్వు వి. కేతకీపుష్పం. మొగలి

రేకు వి. 1. కంఠంమీది నఖక్షతవిశేషం. వేంక. మాన. 1.75; 2. మొగలిరేకులా ఉండేస్త్రీల శిరోభూషణ విశేషం; 3. తమలపాకు అనేనగకు వెనక బ్రహ్మరం భ్రాన్నంటి అడ్డుగ ఉండేస్త్రీ శిరోభూషణ విశేషం. మొగలి నన్నునార రూ.చూ. మొగలిచన్నునార. వి. మొగలిచెట్టు ఊడలనుంచి తీసిననార. మొగలేఱు వి. బౌ. సువర్ణముఖరీ నది. కేతకినది. కాశ. 2.66. <మొగలి+ఏఱు. మొగల్నార రూ.చూ. మొగలినార. వి. మొగలిచెట్టు ఊడల నుండి తీసిననార. <మొగలి+నార. మొగళులు వి.బ.వ. మొగలిపొదలు. కు. సం. 1.120. <మొగలి+-లు.

మొగలింగ వి. అడవుల్లో 50 అడుగుల ఎత్తుపెరిగే గట్టి కలప నిచ్చే చెట్టు. హంస. 4.11. (Schrebera swietenioides).

మొగలింగం రూ.చూ. మగలింగము. వి. నదుల ఒడ్డున పెరిగి తెల్లని పూలుపూసే మొక్క (Crutaeva relisiosa).

మొగలు వి. మహమ్మదీయుల్లో ఒకతెగ. రంగా. చ. 2.39.

హిం. ముగల్, మొగల్. మొగలువంశస్థుడు, తార్తారు ప్రాంతానికి చెందినవాడు; ఉ. పార. ముగల్. మొగలు వంశస్థుడు, తురాన్‌లేదా తార్తార్ ప్రాంతంవాడు; త. మోకల్.

<ఉ. ముగల్.

మొగలేఱు చూ. మొగలి.

మొగల్నార చూ. మొగలి.

మొగళులు చూ. మొగలి.

మొగవడము వి. 1. ముఖాచ్ఛాదనం, ముఖకవచం. కు. సం. 11.137; 2. ఏనుగుమీద కప్పే నల్లకంబళం. హరి. పూ. 2.108.

సం. ముఖపటు-. ముఖాచ్ఛాదనం.

<సం. ముఖపట-.

మొగవాళము[2] వి. తాబేలు.

మొగసరి[3] చూ. మొగము.

మొగసల రూ.చూ. మొగసాల. వి. 1. రాజగృహం, తలవాకిటి చావడి, మోసల అజారం; 2. తలవాకిట పంచ; 3. ఏనుగుసాల.

మొగసాటు చూ. మొగము.

మొగసాల రూ. మొగసల, మోగసాల, మోసల. వి. 1. తల వాకిటి పంచ. భార. ఉద్యో. 3.176; 2. రాజగృహం, తలవాకిటి చావడి, మోసల, అజారం. రం.రా.యు. 303పు. 28 పం.; 3. ఏనుగుసాల.

సం. ముఖశాలా-. ముందటిఇల్లు.

<సం. ముఖశాలా-.

మొగాతి రూ. మగాతి, మొగాది, మొగాయి. వి. మంటపెట్ట టానికి అముకు ముందు ఆముగోడ మధ్య భాగంలో గుండ్రంగా ఏర్పరచిన నందు.

సం. ముఖ-. మొగం.

మొగాతిగుంట వి. ఆముపొయ్యికి ముందు పక్కగాలి విసిరేదానికి ఏర్పరచిన భాగం.

మొగాది రూ.చూ. మొగాతి. వి. మంట పెట్టటానికి అముకు ముందు ఆముగోడ మధ్యభాగంలో గుండ్రంగా ఏర్పరచిన నందు.

మొగాయి రూ.చూ. మొగాతి. వి. మంట పెట్టటానికి అముకు ముందు భాగంలో ఆముగోడ మధ్యభాగంలో గుండ్రంగా ఏర్పరచిన నందు.

మొగాయిగోడ రూ. మగాయిగోడ. వి. కుండలు కాల్చ టానికి అముకు ఒకవైపు మట్టితోగాని ఇటుకతోగానికట్టినగోడ.

మొగాళము చూ. మొగము. వి. 1. ఏటికాలవ యొక్క మొగ దల, ఆరంభం, (సేద్యంకోసం నీరు తీసుకొనే కాలవముఖం) నదీ సముద్రాభిముఖం; 2. మొదలు.

మొగి[1] వి. 1. పూనిక, ఉత్సాహం. భార. ఆది. 1.28; 2. తడవ, పర్యాయం. భార. ఆది. 2.70; 3. మొత్తం. భార. ఆరణ్య. 1.300; 4. విధం, రీతి. రం. రా. ఉ. 164 పు. 23 పం.; 5. మొవ్వు, లేతఆకు మొలక. భీమ. 2.128; 6. ముందర, ఇకమీదట; అవ్య. ద్రు. 1. కొన్నిచోట్ల వాక్యా లంకారంగా ఉపయోగపడుతుంది. భాస్క.రా. ఆరణ్య. 1.336; 2. పూర్వం, మునుపు. పల్నా.పు. 53; 3. పురో భాగం, ఎదుట. ఆం.భా. 3.73.

క. మొగసు. పనికొరకై తయారగు, పూను; త. ముయల్. ప్రయత్నించు, బాధ్యత వహించు, పూను, ముయల్చి. ప్రయత్నం, ఉత్సాహం, ముయఱ్చి. ప్రయ త్నం, పూనిక, ఉద్యోగం.

మొగికమ్మ వి. మొవ్వాకు. మొగిపురుగు వి. జొన్న, మొక్కజొన్న మొ. పైర్ల కంకి ఊచకొరికే పురుగు.

మొగి[2] వి. ఇళ్ళు మొ.నవి కట్టటానికి కలపగా ఉపయోగపడే చెట్టు (Syzygium alternifolium).

మొగించు చూ. మొగ[3].

మొగిటి వి. నల్లి, గోడపురుగు.

సం. మత్కుణ-. నల్లి.

మొగిటిపురుగు రూ. మొగటిపురుగు, మొగిటిపురువు. వి. 1. ఈగ; 2. నల్లి. మొగిటిపురువు రూ.చూ. మొగిటి పురుగు. వి. 1. ఈగ; 2. నల్లి.

మొగిడించు చూ. మొగుడు.

మొగియు అ.క్రి. 1. కవియు, వ్యాపించు. భాస్క.రా.బాల. 334; 2. పూను, యత్నించు. భాస్క.రా.యు. 1123; 3. చచ్చు; వి. కోరిక.

త. ముయల్, ముయల్లు. అభ్యసించు, ముయఱ్చి. కృషి, ముయంకు. చేయు.

<మూ.ద్రా. *మొయ్.

మొగిరాలు రూ.చూ. మొకిరేలు. వి.బ.వ. మట్టిపొయ్యికి పై భాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టి ఉబ్బులు.

మొగిలి[1] రూ.చూ. మొగలి. వి. సువాసననిచ్చే పూలుపూసే చెట్టు. పల్నా. పు. 115 (Pandanus odaratissimus).

మొగిలినాగు వి. మొగిలిపువ్వు వాసన కలిగి మొగలి చెట్టులో ఉండే పాము. మొగిలిపెంక వి. గూనలో కొంత భాగం '∧' ఆకారంలో కోసివేసిన పెంకు. మొగిలిపొట్ట వి. 16 పిక్కలతో ఇద్దరాడే ఆట. మొగిలియొదం వి. మొగిలూడ. మొగిలిచెట్టువేరుతో తయారుచేసిన కుంచె. మొగిలిరంగు వి.

నీలంరంగు. **మొగిలివిరినీరు** వి. ప్రశస్త జలం. **మొగిల్నార** రూ.చూ. మొగలినార. వి. మొగలిచెట్టు మట్టలనుంచి తీసిన నార.

**మొగిలి**[2] వి. తూర్పు కనుమల్లో నీలగిరుల్లో పెరిగేతీగ (Alphonsea lutea).

**మొగిలివాకిలి** రూ.చూ. మొగలివాకిలి. వి. తలదువారం.

**మొగిలు** రూ.చూ. మొగులు[1]. వి.బొ. మేఘం. భార. విరా. 4.27.

**మొగిలుత్రోవ** రూ.చూ. మొగులుత్రోవ. వి. ఆకాశం. అచ్చ. రా. ఆరణ్య. 118. **మొగిలుదారి** రూ. మొగులుదారి. వి. ఆకాశం. అచ్చరా. బాల. 26. **మొగిలుదొంతికలు** వి.బ.వ. మేఘాలు. **మొగిలుపగవాడు** విశ. వాయువు, గాలి. అచ్చ.రా.కిష్కిం. 87 వ్యు. మబ్బులకు శత్రువైనవాడు. **మొగిలుపగవానికూన** వి. వాయుపుత్రుడు, హనుమంతుడు.

**మొగిలులు** రూ.చూ. మొగిళులు. వి.బ.వ.బొ. మేఘాలు.

**మొగిలులోపలినీళ్లనమ్ము** స.క్రి. మబ్బులోని నీళ్ళను నమ్ముకొన్నట్లుగా ఎప్పుడో రాబోయే సందిగ్ధ ఫలాన్ని అపేక్షించు.

**మొగిళులు** రూ. మొగిలులు, మొగిళ్లు. వి.బ.వ.బొ. మేఘాలు. భార.ద్రోణ 1.132. **మొగిళ్లు** రూ.చూ. మొగిళులు. వి.బ.వ.బొ. మేఘాలు. యయా. 4.4.

**మొగిల్నార** చూ. మొగిలి.

**మొగిళులు** చూ. మొగిలి.

**మొగిళ్లు** చూ. మొగిలి.

**మొగుచు** చూ. మొగుడు.

**మొగుటివాసము** చూ. మొగుటు.

**మొగుటు** వి.బొ. ఇంటి నడికొప్పు.

**మొగుటివాసము** వి. ఇంటి నడికొప్పువాసం. < మొగుడు + -ఇ[6] + వాసము.

**మొగుడ**[1] చూ. మొగుడు.

**మొగుడ**[2] వి. అక్కడికట్టె, గొర్రు వెనక జొన్న (వెద) ఎద పెట్టటానికి కట్టే రెండు బెజ్జాల అక్కిడి పనిముట్టు.

**మొగుడబాఱు** చూ. మొగుడు.

**మొగుడు** రూ. మొగడు[1], మొవుడు. అ.క్రి. ముకుళించు, సంకుచితమగు. భార ఆరణ్య. 2.76, కు.సం. 8.94.

క. ముగి. (నోరు, కళ్ళు మొ. నవి) మూసుకొను, చేతులు దగ్గరగా చేర్చు ; తు. ముగియుని. ముడుచు, దగ్గరగా చేర్చు ; త. ముకిఴ్ (-వ్-, -న్ట్-). ముకుళించు, (పువ్వుల్లా) ముడుచుకొను, (కళ్ళు) మూసుకొను ; మ. ముకిఴ. మొలక, మొగ్గ ; కో. ము-వ్. చేతులు ముకుళించి నమస్కరించు ; కుఇ. మొగొ. చిగురు, మొగ్గ ; పో.చూ. త. -,మొట్టు ;

పో.చూ. సం. ముకుల-, ముద్గర.

**మొగిడించు** రూ. మొగడించు. స.క్రి. మొగడచేయు, ముకుళింపచేయు. కు.సం. 783. మొగుడు + -ఇంచు[3]. **మొగుచు** రూ. మొగుడుచు, మొగుడ్చు. స.క్రి. మొగడచేయు, ముకుళింపచేయు. భార.విరా. 3.79. **మొగుడ**[1] వి. మొగ్గ. తాళ్ల. సం.4.17. పో.చూ. సం. ముకుళ-. మొగ్గ. **మొగుడబాఱు** అ.క్రి. ముకుళించటాని కున్ముఖమగు, మొగుడ నారంభించు. భీమ. 2.28. < మొగుడు + -అ[7] + పాఱు[3]. **మొగుడుచు** రూ. చూ. మొగుచు. స.క్రి. మోడ్చు, ముకుళింప చేయు. పారి. 1.46. **మొగుడుదామర** (-తామర) రూ చూ. మొగడుదామర. వి. నమస్కారి, ముడుగుతామర. **మొగుడ్చు** రూ.చూ. మొగుచు. స.క్రి. మోడ్చు. ముకుళింపచేయు. నిర్వ.రా. 10.48. **మొగుపు** వి. మోడ్పు, మొగడటం, నమస్కృతి. కు.సం. 9.72.

**మొగుడ్చు** చూ. మొగుడు.

**మొగుదాడు** (-త్రాడు) రూ.చూ. ముక్కుతాడు. వి. **1**. పంటె కిందివైపున ఆకుల చివర్లన గామకు కలిపి కట్టిన తాడు ; **2**. ముక్కు లోపలినుంచి దూర్చి కట్టే తాడు.

**మొగుదారి** రూ. మొగేదారి. వి. పనికి ముందుగా సిద్ధపడేవాడు.

**మొగుపు** చూ. మొగుడు.

**మొగురము** రూ.చూ. మొక్కరము[1]. వి. రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య.

**మొగులతెన్ను** చూ. మొగులు[1].

**మొగులు**[1] రూ. మొగిలు, మొయిలు, మొయిలు, మొయులు. వి బొ. మేఘం. కు.సం. 1.88.

క. ముగిల్. మేఘాల గుంపు, మబ్బులబారు, ఆకాశం ; త. ముకిల్. మబ్బు, మేఘం ; మ. ముకిల్. మబ్బు, మేఘం ; గోం. మొయాల్. మబ్బు ; పర్జి. మల్ గుర్. మబ్బులబారు ; కొలా. మొర్ గర్. మేఘాల గుంపు ; గ. మొగుల్. మబ్బులగుంపు, ఆకాశం ;

పో.చూ. సం. మేఘ-. మబ్బు.

**మొగులతెన్ను** వి. ఆకాశం, మేఘాలదారి. **మొగులుతెన్ను** వి. ఆకాశం, మబ్బులదారి. **మొగులుత్రోవ** రూ. మొగిలుత్రోవ. వి. ఆకాశం, మబ్బులదారి. **మొగులుదారి** రూ. చూ. మొగిలుదారి. వి. మేఘమార్గం, ఆకాశం. **మొగులుముట్టు** అ. క్రి. మేఘాన్ని తాకు, మహోన్నతమగు, మిన్నంటు. కాశీ. 1.99. **మొగులువిరి** వి. మేఘపుష్పం, జలం. ఆం.భా. 1.153. **మొగులువిరిపాది** వి. సముద్రం, జలధి. వేంక.ఆం. 16. **మొగులెక్కుప్రోడ** వి. ఇంద్రుడు, మేఘవాహనుడు, మబ్బురౌతు. < మొగులు[1] + ఎక్కు + ప్రోడ. **మొగులేట** వి. అడవిలో మేఘాన్ని పూజించి చేసే ఏటబలి. < మొగులు[1] + వేట. **మొగుల్పుట్టువు** వి. విద్యుత్తు. < మొగులు[1] + పుట్టువు.

**మొగులు**[2] రూ.చూ. మొగలి. వి. ముళ్ళ అంచుల పొడుగాటి ఆకులుండి 20, 25 అడుగుల ఎత్తువరకు పొదగా పెరిగే పూలచెట్టు, కంచెగా వాడతారు (Pandanus odorafissimus).

**మొగులుకడిమి** వి. అందంగాఉండే సువాసనగల పూలు పూసే చెట్టు, నీరుకడిమి (Anthocephalus cadamba).

**మొగుల్నార** రూ.చూ. మొగిలినార. వి. మొగలిచెట్టు మట్టల నుంచి తీసిన నార.

**మొగులు**[3] రూ.చూ. మగులు. వి. ప్రహరీగోడమీద ఆకు మట్టి రాయి మొ. వాటితో రక్షణకోసం గోడకంటె వెడల్పుగా పెట్టిన కప్పు.

**మొగులెక్కుప్రోడ** చూ. మొగులు[1].

**మొగులేట** చూ. మొగులు[1].

**మొగుల్నార** చూ. మొగులు[2].

**మొగుల్పొట్టువు** చూ. మొగులు[1].

**మొగుసేద్యం** చూ. మొగ్గు. రూ. ముయిసేద్యం. వి. ఉమ్మడి సేద్యం, చిన్న రైతులు కొంతమంది కలిసి చేసే సేద్యం.

**మొగేదారి** రూ.చూ. మొగుదారి. వి. పనికి ముందుగా సిద్ధపడే వాడు.

**మొగోసం** రూ.చూ. మగవాసం, వి. పోతువాసం మరవానంతో తగిలించే మొన చెక్కిన వాసం.

**మొగ్గ**[1] రూ. మొగ[3]. వి. 1. ముకుళం, కోరకం. కు.సం. 4.107; 2. టకోరా, తులసికోటపై అంచున అందానికి కట్టిన ఆకులాంటి నిర్మాణం; 3. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను; 4. ఒకరకం అద్దకం డిజైను; 5. పైరు పూతకు వచ్చే ముందుదశ, విప్పారని పువ్వు; 6. పొగమొక్క తలపైన వేసే పూత.

క. మగ్గు, మొగ్గు, మొగ్గె. మొగ్గ, ముకుళం; తు. మొగ్గె, మొగ్గె, ముంగె; త. మొకుళ్ళు, మొకుళ్ళల్.

మొగ్గకమాను వి. తమలపాకార్చి, మధ్యభాగం గుమ్మటం ఆకారంలో ఉన్న గూడు. మొగ్గకమ్మి వి. మొగ్గ మాదిరి డిజైన్లు నేసిన కమ్మి. మొగ్గగూడు వి. రవ్వాకులగూడు, గుమ్మటం ఆకారంలో ఉన్న గూడు. మొగ్గచాపు వి. అంచులో మొగ్గలు పడేట్టు రెండు నాడెలతో ఇద్దరు కలిసి కుప్పడం పట్టి నేసిన పంచెల జత. మొగ్గచెమటలు వి.బ.వ. మొగ్గలా ఉండే చెమట బిందువులు. వరాహ. 7.56. మొగ్గంచు వి. గీరలు, మొగ్గలు పెట్టి నేసిన అంచు. <మొగ్గ[1]+అంచు[3]. మొగ్గతొడుగు అ.క్రి. కోరకితమగు, మొగ్గలు పొడము. మొగ్గపట్టు వి. దసిలీ, ఒకరకం పట్టు. మొగ్గపేటంచు వి. మొగ్గలు వరసగా పడేట్టు నేసిన అంచు. <మొగ్గపేటు+అంచు[3]. మొగ్గపేటు వి. అంచులో మొగ్గ ఆకారంలో నేసిన డిజైను. మొగ్గలంచుచీర వి. అంచులో మొగ్గల మాదిరి డిజైన్లు నేసిన చీర. మొగ్గలపట్టె వి. గబల పెట్టె, కిటికీ మీద చూరుగా దించిన చెక్కడం పనిగల కొయ్యపలక. మొగ్గవిచ్చు అ.క్రి. 1. వికసించు; 2. యథాయథలగు, చెల్లాచెదరగు.

**మొగ్గ**[2] చూ. మొగ్గు. వి. 1. వేశ్యాదులు తలపాదాలతో చేరేట్లు విల్లులా వెల్లికిల వంగటం; 2. పాదక్రియ (అడుగులు, గంతులు మొ.వి).

మొగ్గటిలు రూ.చూ. మొగ్గతిలు, అ.క్రి. వంగు, మోకరిలు. మొగ్గతిలు రూ.చూ. మొగ్గతిలు, అ.క్రి. 1. మొగ్గవాలు, వంగు. గౌ.హరి. 4.26; 2. మోకరిల్లు; 3. తలకిందగు. మొగ్గవాలు అ.క్రి. మొగ్గలేయు, వేశ్యలు మొ. వారు తలపాదాలతో చేరేట్లు విల్లులా వెలికిల వంగు. కళా. 6.180.

**మొగ్గం** రూ.చూ. మగ్గము. వి. 1. నేత బయలులో బట్టలు నెయ్యటానికి అమర్చిన కొయ్యపలకలు (పన్నె బిగించినవి), అచ్చు, దోనె మొ. సాధనాల మొత్తం; 2. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం; 3. తివాచీలు నేసే సాధనం.

మొగ్గంలాకి రూ.చూ. మగ్గంలాక. వి. నేత పడుగులో పై పోగులకు, కింది పోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద. మొగ్గంలైను రూ.చూ. మగ్గంలైను. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. మొగ్గంసట్టం రూ.చూ. మగ్గంచట్టం. వి. 1. మరమగ్గంలో పన్నె పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం; 2. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. మొగ్గంకొయ్య రూ.చూ. మగ్గంకొయ్య. వి. మర మగ్గం చట్రం నిలబెట్టటానికి నేత బయలులో పాతిన ఒకరకం గుంజ. మొగ్గంగద్దె రూ.చూ. మగ్గంగద్దె. వి. మగ్గం ముందు నేతపనివాడు కూర్చునే చోటు. మొగ్గంగుండు రూ.చూ. మగ్గంగుండు. వి. 1. చేతిమగ్గం పన్నె బిగించిన కింది కొయ్య; 2. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. మొగ్గంగుంత రూ.చూ. మగ్గపు గుంత. వి. నేసే వాడు మగ్గం దగ్గర కూర్చున్నప్పుడు కాళ్ళు పెట్టుకోవ టానికి తవ్విన గొయ్యి. మొగ్గంగూటం రూ.చూ. మగ్గం గూటం. వి. 1. ఉన్ని మగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్యగూటం; 2. ఉన్ని మగ్గానికి వేసిన పడుగు బిగింపు కోసం చివర నేలలో పాతిన కొయ్య; 3. నవారు మగ్గం కట్టుబడిలో వడిదారాలు అల్లిన కర్ర ఆధారంగా నేలలో పాతిన కొయ్య. మొగ్గంగొయ్యి రూ.చూ. మగ్గంగొయ్యి. వి. నేత బయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్విన చోటు. మొగ్గంజిల్ల రూ.చూ. మగ్గంజిల్ల. వి. మగ్గం కుచ్చు తాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల. మొగ్గంజొర్రు రూ.చూ. మగ్గంజొరు. వి. మగ్గం ముందు కూర్చొని నేతపని ప్రారంభించటం. మొగ్గంతాడు రూ.చూ. మగ్గంతాడు. వి. గొంగడి నేసే మగ్గం బిగించే తాడు. మొగ్గంనిలువు రూ.చూ. మగ్గం నిలువు. వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె. మొగ్గపుతాడు రూ.చూ. మగ్గపుతాడు. వి. గొంగడి నేసే మగ్గం బిగించే తాడు. మొగ్గంపందిరి రూ.చూ. మగ్గంపందిరి. వి. నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మంచెమాదిరిగా బిగించిన కర్రలు, మగ్గం గుంటకుపైన ఎత్తుగా వేస్తారు. మొగ్గంపలక రూ.చూ. మగ్గంపలక. వి. 1. చేతి మగ్గంపన్నె. బిగించిన పైచెక్క; 2. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; 3. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క. మొగ్గంపాగడా రూ.చూ. మగ్గంపాగడ. వి. మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు. మొగ్గంపులితాడు రూ.చూ. మగ్గంపులితాడు, వి. మరమగ్గం నిలువు పట్టెను మేరువుపలకకి బిగించి సన్నపుల్లతో వడిపెట్టిన దారం. మొగ్గంబడితె రూ.చూ. మగ్గంబడితె. వి. 1. నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్ర; 2. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైనఅమర్చిన కర్ర. మొగ్గం బడ్డీ రూ.చూ. మగ్గంబడ్డీ. వి. 1. నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువురాటకు అడ్డంగా మంచె మాదిరిగాబిగించిన కర్రలు, మగ్గం గుంటకుపైన ఎత్తుగావేస్తారు;

**2**. మరమగ్గంలో పన్నె, పలక మొ. వి. బిగించిన నాలుగు పట్టెల చ(ట్రం. **మొగ్గంబల్ల** రూ.చూ. మగ్గంబల్ల. వి. మర మగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య. **మొగ్గంమోకు** రూ. చూ. మగ్గంమోకు. వి. మగ్గంమీద నేతపడుగును బి(రు పట్టేలావుపాటి తాడు. **మొగ్గాలిల్లు** రూ. చూ. మగ్గాలఇల్లు. వి. ఇంట్లో నేతపనికి కేటాయించిన (ప్రదేశం. < మొగ్గం + -లు + ఇల్లు.

**మొగ్గ(బడు** చూ. మొగ్గు.

**మొగ్గరము** రూ. మొగరము[1]. వి. **1**. పన్నాగం, ఎత్తుగడ. కు. సం. 11.91 ; **2**. గుంపు. నిర్వ.రా. 4.57 ; **3**. వ్యూహం, సేనానన్ని వేశ విశేషం. నిర్వ. రా. 5.123 ; **4**. యుద్ధం. ఉ. హరిశ్చ. 3.61.

సం. ముకుల-. మొగ్గ, శరీరం.

**మొగ్గరించు** అ.(క్రి. వ్యూహంపన్ను. < మొగ్గరము + -ఇంచు[3].

**మొగ్గరించు** చూ. మొగ్గరము.

**మొగ్గలము** రూ. మొక్కరము[2], మొక్కలము, మొక్కలి[1], మొక్కళము, మొక్కళి[1]. విశ. అతిశయించినది, మిక్కుట మైంది. నిర్వ. రా. 8.82.

**మొగ్గవేయు** చూ. మొగ్గు.

**మొగ్గాలిల్లు** చూ. మొగ్గం.

**మొగ్గు** చూ. మొక్కు. రూ.చూ. (మొగ్గు. అ.(క్రి. **1**. వాలు, ఒరగు. రాజవా. 5.73 ; **2**. నేలకూలు, కిందపడు. అచ్చ.రా.యు. 305 ; **3**. చూపనిలుపు ; వి. **1**. హెచ్చు, ఆధిక్యం. చెన్న బసవ. 5.103 ; **2**. గౌరవం.

**మొగ్గ(బడు** రూ.చూ. (మొగ్గ(బడు. **1**. ముందుకుపడు ; వాలు. < (మొగ్గు + -అ[7] + -పడు. **మొగ్గవేయు** రూ.చూ. (మొగ్గవేయు. < (మొగ్గు + అ[7] + వేయు.

**మొంగ** రూ.చూ. వి. ఎన్నులమోపు.

**మొజేరు** రూ.చూ. మైజాఋ. వి. బద్దె.

**మొజ్జ** వి. వరి, జొడి మొ. పైర్లతెగులు, ఆకులు దట్టంగా పెరిగి ఎన్నుపైకి రాని ఒకరకం పంటతెగులు.

**మొటం** వి. గెనుసుగడ్డ, దుంపలు కూరగా ఉపయోగపడే తీగపైరు. (Iponaca bataras).

**మొటమొటలాడు** అ.(క్రి. ముఖం చిట్లించుకొను.

సం. స్ఫుట-. పైకిబాగా కనిపించినది.

**మొటిం** రూ.చూ. మొటిమ[1]. వి. **1**. గునపంలోని పదును లేని కొన ; **2**. కావడిమట్టు జారిపోకుండా బద్దకు చివర్లఉంచిన బుడిపె.

**మొటిక** రూ. మొటికె, మొట్టిక, మోటిక. వి. **1**. మొలక, అంకురం. కువ. చ. 2.26 ; **2**. తునక, చిన్నముక్క. ఇళా. 3.25 ; **3**. మొట్టికాయ ; **4**. ముఖంమీద లేచే యౌవనపు పొక్కులు ; **5**. గునపంలోని పదునులేని కొన ; **6**. కావడిమట్టు జారిపోకుండా బద్దకు చివర్లఉండే బుడిపె.

మ. మొటుకు. చిన్నముక్క, తునక ;

సం. స్ఫుటుక-. పైకి కనిపించేది.

**మొటికకొమ్ము** వి. లావుగా పొట్టిగా బోడిగా ఉండే కొమ్ము. **మొటికపక్క** వి. గూనచివరి వెడల్పాటి భాగం.

**మొటిక్కాయ[1]** వి. గోరుచిక్కుడుకాయ. < మొటిక + కాయ.

**మొటికాయ** రూ. మొటిక్కాయ[2], మొట్టికాయ. వి. తలమీద పిడికిలితో పొడిచే పోటు.

**మొటికిలి** వి. మొట్టికాయ.

**మొటికె** రూ.చూ. మొటిక. వి. మొలక, భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకి వచ్చేభాగం.

**మొటిక్కాయ[1]** చూ. మొటిక.

**మొటిక్కాయ[2]** రూ.చూ. మొటికాయ. వి. మొట్టికాయ.

**మొటిగిడి** వి. సీచుడు. (ప్రబంధ. 644.

సం. మూర్ఖ-. అవివేకి.

**మొటిమ[1]** రూ. బొటిమ, మొటిం, మొటిమి, మొటుం. వి. **1**. యౌవనంలో మొగం మీద లేచే బొటిమ, అవగండం. ఆం. భా. 2.129 ; **2**. గడ్డపారలోని మొద్దువైపు ; **3**. కావడి మట్టు జారిపోకుండా బద్దచివర ఉంచే బుడిపె. విశ. పొట్టి.

క. మొదవి. యౌవనంలో మొగంమీద లేచే మొటిమ ; కో. మొఋదిరై. శరీరంపై మచ్చ.

**మొటిమ[2]** రూ.చూ. మొటం. వి. గడ్డపలుగు పదునైన అంచు.

**మొటిమి** రూ.చూ. మొటిమ[1]. వి. **1**. యౌవనంలో మొగం మీదలేచే బొటిమ ; **2**. రాతిలో ఎత్తుగా ఉన్నభాగం ; (క్రి. విశ. పొట్టి.

**మొటుం** రూ. మొటిమ[2]. వి. గడ్డపలుగు పదునైన అంచు.

**మొటువు[1]** వి. మెట్టు, ఎక్కటానికి దిగటానికి వీలుగా కట్టిన నిర్మాణం.

**మొటువురాయి** వి. నల్లరాతిరాయి, నారగా, అనుఘటితంగా, బండలుగా, చాలా రకాల్లో దొరికే ఖనిజశిల.

**మొటువు[2]** రూ.చూ. మెదుక. విశ. మెతక, మెత్తని.

**మొట్ట** రూ. మొట్టె. వి. మత్స్యవిశేషం, ఎగిరెగిరి పడే చేప. సిం. ద్వా. 1.221.

సం. (ప్రోష్ఠ-. శఫరం, ఎగిరే ఒకరకం చేప ;

క. మెట్ట. పొట్టి.

**మొట్టమొదలు** చూ. మొదలు. వి. జౌ. **1**. మిక్కిలి మొదలు, ఆది. పండి. చ. 2.97వు ; **2**. అత్యంతం.

**మొట్టి** విశ. పొట్టి. ఆం. భా. 2.123 ; వి. గేటుకు మధ్య రెక్కలు ఆనటానికి విలుగా పాతినకొయ్య లేదా రాతిదిమ్మ.

సం. మఠ-. విద్యార్థులు మొ. వారినివాసం.

**మొట్టికొమ్ము** వి. లావుగా పొట్టిగా బోడిగా ఉండేకొమ్ము. **మొట్టిగుజ్జు** వి. ఆసుపోసేటప్పుడు పంటె అమర్చుకోవటానికి పెట్టుకొనే సాధనానికి ఆధారంగా ఉండే కింది మొద్దు.

**మొట్టిక** రూ.చూ. మొటిక. వి. **1**. మొలక, అంకురం ; **2**. తునక.

**మొట్టికాయ** చూ. మొట్టు[1].

**మొట్టికాయలముగ్గు** చూ. మొట్టు[1].

**మొట్టికాయలమెప్పు** చూ. మొట్టు[1].

**మొట్టివామొకము** చూ. మొట్టు[1].

**మొట్టిమెకము** రూ.చూ. మోటుమెకము. వి. అడవిపంది.

**మొట్టు[1]** అ.(క్రి. తలమీద పిడికిలితో పొడుచు, పిడికిలితో పొడుచు. వేమ. 3.58 ; వి. తలమీద పిడికిలితో పొడిచే పోటు.

క. మొట్టు. తలపైమొట్టు; కొడ. ముట్-. (ముట్టి-) బుడితి, దెబ్బ; త. ముట్టు. (ముట్టి-) గుద్దుకొను, ఎదుర్కొను, తలపడు; మ. మొట్టు. తలపైమొట్టు; కో. ముట్టుటుక. ఎదుర్కొను, తలపడు, తొ. ముట్-. అతిశయించు; పర్జి. ముట్స్-. (ముట్టి-). బుడితో దెబ్బ; కురు. ముట్‌గనా. పిడికిలితోగుద్దు;

పో. చూ. సం. ముట్-. నలగ్గొట్టు, విరుచు.

మొట్టికాయ రూ.చూ. మొటికాయ. వి. తలమీద పిడికిలితో పొడిచే పోటు. మొట్టికాయలముగ్గు వి. పిడికిల్లో ముగ్గు పోసుకొని పక్కలకు కొరుతూ వేసే ముగ్గు. మొట్టికాయలమెప్పు వి. వినాయకుడు. మొట్టివామెకము రూ.చూ. మోటువామెకము. వి. అడవిపంది. మొట్లమారి వి. మొట్టికాయలు తినే స్వభావం కలవాడు. చంద్రాంగ. 4.127.

మొట్టు[2] వి. 1. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు దొచ్చుకు వచ్చిన కొయ్య; 2. మోడు; 3. ప్రహరీగోడమీద ఆకు, మట్టి, రాయి మొ. వాటితో రక్షణకోసం గోడకంటె వెడల్పుగా పెట్టిన కప్పు.

మొట్టుమెకము రూ.చూ. మోటుమెకము. వి. అడవిపంది.

మొట్టువామెకము రూ.చూ. మోటువామెకము. వి. అడవిపంది.

మొట్టె రూ.చూ. మొట్ట. వి. ఒకరకం చేప.

మొట్టెకాళ్ళు వి.బ.వ. వేళ్ళకు గోళ్ళులేని కాళ్ళు.

మొట్టెవాడు విణ. అంగవికలుడు, కురూపి.

మొట్లమారి చూ. మొట్టు[1].

మొడతాడు రూ.చూ. మొలత్రాడు. వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు.

మొడతాలు రూ.చూ. మొలత్రాడు. వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు.

మొడికట్టు వి. విధం, రీతి. రాధికా. 2.12, ఇలా. 2.18.

మొడుచు స.క్రి. కలియగల్పు, మెదుచు, మేదించు. కు.సం. 8.66.

మొడుసు వి. గనె, గట్టు.

మొడ్డ వి. మేఢ్రం, మగగురి. ద.హిం.కా.సంపు. 4. శా.సం. 629. కొణిదెలానసం.

సం. మేఢ్ర-. శిశ్నం, మగగురి;

క. మొడ్డ. మూర్ఖుడు.

<సం. మేఢ్ర-.

మొంటి రూ.చూ. మొరిఁటె. వి. బాలికలాడుకునే చిన్న చేట.

మొంటియ రూ.చూ. మొరిఁటె. వి. బాలికలాడుకునే చిన్న చేట.

మొంటె రూ.చూ. మొరిఁటె. వి. బాలికలాడుకునే చిన్న చేట.

మొండరి చూ. మొండి[1].

మొండాటలాడు చూ. మొండి[1].

మొండాటలు చూ. మొండి[1].

మొండాడు చూ. మొండి[1].

మొండి[1] రూ. మొండు. విణ. 1. (కాళ్ళుచేతులు) కొంత తెగినది. కు.సం. 8.135; 2. చేతులు కాళ్ళు తెగినవాడు, తెగినది, కాళ్ళుచేతులు లేనివాడు. భోజ. 5.298; 3. మూర్ఖుడు, మూర్ఖురాలు. చెన్నబసవ. 2.24; 4. మొక్కపోయినది; 5. బోసి అయినది, వట్టిది, ఆభరణాది శూన్యం; వి. 1. ఆటలలో అడ్డం తిరగటం; 2. అక్రమం; 3. హఠం; 4. పని అయినదాక వదలకుండటం.

సం. ముండ-. గొరగబడింది.

మొండరి విణ. మొండివాడు, మూర్ఖుడు. పండి.చ. 2.101పూ. <మొండి[1]+-అరి. మొండాటలాడు స.క్రి. మొండితనంచేయు. <మొండి[1]+ఆట+-లు+ఆడు. మొండాటలు వి.బ.వ. మొండితనం. <మొండి[1]+ఆట+-లు. మొండాడు స.క్రి. మొండితనంచేయు. <మొండి[1]+ఆడు. మొండిఅంగీగుడ్డ రూ. మొండెంగీగుడ్డ. వి. చంకబనీసులకోసం నేసినగుడ్డ. మొండికట్టె వి. 1. మొండితనం కలవాడు, కలది, మూర్ఖుడు, మూర్ఖురాలు. హంస. 5.113; 2. కుజనుడు. ఆం.భా. 3.7. మొండికెత్తు అ.క్రి. బండతనం కలిగి ఉండు, మొండివేయు. <మొండి[1]+-కున్+ఎత్తు[1]. మొండికొర్ర వి. ఒకరకం కొర్ర. మొండిచెయ్యిచూపు రూ.చూ. మొండిచేయిచూపు. స.క్రి. లేదను. మొండిచేటచూపు అ.క్రి. అడిగినదాన్ని లేదను. మొండిచేయిచూపు రూ. మొండిచెయ్యిచూపు. స.క్రి. లేదను. మొండిచేయు స.క్రి. మొండితనంచేయు. మొండిచేవేల్చు స.క్రి. మొండిచేత్తో హోమంచేయు, అసాధ్యకార్యాల్ని నెరవేర్చు. కు.సం. 8.135. మొండితెగులు వి. చెట్టు, ఇగురుపెట్టని తెగులు. మొండిపారు అ.క్రి. 1. కాయకాయు, మొక్కపోవు; 2. మొండికెత్తు. మొండిపురుగు వి. మొండితోక ఉన్న పురుగు. మొండిబండఁడు వి. పాషండుడు. మొండిబండవాడు రూ. మొండుబండవాడు. విణ. పట్టువిడవని మూర్ఖుడు. మొండివాఁడు విణ. 1. చేతులులేనివాడు. పండి.చ. 2.10. 4ప.; 2. మొండితనం కలవాడు, మూర్ఖుడు. మొండీఁడు విణ. మొండితనం కలవాడు, మూర్ఖుడు. కు.సం. 7.49. మొండెంగీగుడ్డ రూ.చూ. మొండిఅంగీగుడ్డ. వి. చంకబనీసులకోసం నేసినగుడ్డ. మొండెముక వి. ఎద్దులకు ప్రక్కల్లో ఉబ్బి ఉండే ఎముక.

మొండి[2] రూ.చూ. మండె[1]. వి. 1. నలచదరంగా వేసే పంటగడ్డికుప్ప; 2. పొగాకు తోరణాలు ఆరిన తరవాత పేర్చిన కుప్ప; 3. పొట్టు మొ. వి దాచటానికి చుట్టూ దొప్పతో కట్టే ఆవరణం; 4. తూర్పార పొయ్యటానికి సిద్ధం చేసిన బూగరరాశి లేక మదనం; 5. పత్తికాయలు కోసి వేసిన కుప్ప; 6. నలచదరంగా వేసిన దొప్పవామి.

మొండికట్టు రూ.చూ. మండెకట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పకట్టు. మొండికుచ్చెల రూ.చూ. మండెకుచ్చెల. వి. కళ్ళంలో మెదిగిన దొప్పను తీసి నలచదరంగా వేసిన కుప్ప. మొండిగూడు రూ.చూ. మండెగూడు. వి. కంకులు దాచి పెట్టటానికి గడ్డితో కట్టిన ఆవరణం. మొండిదింపు రూ.చూ. మండెదింపు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పవేయు. మొండిపెట్టు రూ.చూ. మండెపెట్టు. స.క్రి. పొగాకు, పొట్టు మొ. వి నలచదరంగా కుప్పపెట్టు. మొండివేయు రూ.చూ. మండెవేయు. స.క్రి. పొగాకు, పొట్టు మొ.వి నలచదరంగా

కుప్పవేయు.

**మొండియము** రూ.చూ. మొండెము. వి. కబంధం, తలలేని దేహం. కకుత్థ్స. 4.81.

**మొండీ(డు** చూ. మొండి[1].

**మొండు** రూ.చూ. మొండి[1]. విణ. కొంత తెగినది (కాలు, ముక్కు. మొ. వి). రం.రా.బాల. 6 పు. 16పం.; వి. **1**. తప్పు ; **2**. అసమర్థత ; **3**. పందిరి వాసాలమీది అడ్డకర్రలు కదలకుండా బిగించిన కొయ్యమేకు.

**మొండుబడు** అ.క్రి. మొండికిదిగు. **మొండుబండవాడు** రూ.చూ. మొండిబండవాడు. వి. పట్టు విడవని మూర్ఖుడు. **మొండుమొల** వి. ఛిన్నత్వం.

**మొండెంసరి** చూ. మొండెము.

**మొండెంఅతుకు** చూ. మొండెము.

**మొండెంగీసుడ్డ** చూ. మొండి[1].

**మొండెపుగాము** చూ. మొండెము.

**మొండెపురక్కసు(డు** చూ. మొండెము.

**మొండెము** రూ. మొండియము, మొండ్రెము. వి. తలలేని శరీరం హరి.ఉ. 4.129.

సం. ముండిత-. నరకబడిన, గొరగబడిన ; ప్రా. ముండిఅ ;

క. మొండె, మొండెయ. తలతెగిన శరీరం.

<ప్రా. ముండిఅ.

**మొండెంసరి** వి. అచ్చతికేటప్పుడు కింది పోగులూ పై పోగులూ కలిపి మొత్తం అతికిన పడుగు. **మొండెంఅతుకు** వి. అచ్చతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తంఅతికే పడుగు. **మొండెపుగాము** వి. **1**. కేతుగ్రహం ; **2**. రాహువు. **మొండెపురక్కసు(డు** వి. కబంధుడు. అచ్చ.రా.అరణ్య. 118.

**మొండెముక** చూ. మొండి[1].

**మొండేరు** వి. చూరు వెంట కప్పుమీద వేసే సున్నపుపట్టి.

**మొండ్రెము** రూ.చూ. మొండెము. వి. మొండెం.

**మొతరఫ** రూ.చూ. మొహతరఫా. వి. **1**. ఇళ్ళు, అంగళ్ళ వ్యాపారంమీద వేసే పన్ను ; **2** అదనపుశిస్తు.

**మొతరుసు** వి. ఒక ఉద్యోగి.

ఉ.అర. ముహ్తరిఫ్. ఆర్టిస్టు, పనివాడు.

<ఉ. ముహ్తరిఫ్.

**మొతర్ఫా.** రూ.చూ. మొహతరఫా. వి. **1**. ఇళ్ళు, అంగళ్ళ వ్యాపారంమీద వేసే పన్ను ; **2**. అదనపుశిస్తు.

**మొతిచూరు** విణ. గుండ్రని.

హిం. మోతీచూర్. గుండ్రని ఆకారంలో ఉండే ఒక విధమైన తీపి పదార్థం ; ఉ. మోతీచూర్. ఒకరకమైన తీపి పదార్థం, పావురాల కన్నుల ప్రత్యేక వర్ణన ;

త. మోతిచూర్.

<ఉ. మోతీచూర్.

**మొతువు** రూ.చూ. మెతుపు. వి. మెత్తదనం.

**మొత్త** రూ. మొత్తా. వి. **1**. వాకిటిలోపల పక్కగోడ ; **2**. కారెంగూడ మొ. దానితో తోడే నీళ్ళు పారే కాలవ మొదట పచ్చిక పెల్లలు మొ. వాటితో ఏర్పర్చబడిన ఎత్తు ప్రదేశం, మొగవాశం ; **3**. అధఃకాయం ; **4**. పొట్ట ; **5**. మొల స్థానం ; **6**. ఎడ్లబండి తోలేవాడు కూర్చునే చోటు ; **7**. ఏతంలో తోడిన నీళ్ళుపోయే మొదటి కాలవ ; **8**. పిరుదు, నితంబం ; **9**. గోదాము ; **10**. పశువుల్ని కట్టివేసే కట్టు కొయ్య ; **11**. కొబ్బరి మట్టు మొదలు.

త. మొత్తై. గుండ్రటి ముద్ద, లావుదనం.

**మొత్తకొయ్య** వి. పల్లిరుసు తిరగటానికి ఆధారంగా మోటుబావి లోపలికి చొచ్చుకు వచ్చేట్లు వేసిన కొయ్య. **మొత్తగూడు** వి. దర్వాజా పక్కన ఉన్న గూడు. **మొత్తచెక్క** వి. మగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **మొత్తతాడు** వి. ఏడె తాడు, బండి జల్ల తెరచిఉన్నవైపు అడ్డం కట్టే తాడు. **మొత్తపిరి** వి. ఏతాం కడవ కింద మెత్తగా ఉండటంకోసం అరిణ మొదట ఉంచే అల్లిక పిరి. **మొత్తబండ** వి. **1**. అరబండ, మోటబావి దోనె అర (లోతట్టు)కు అడుగున వేసిన బండ ; **2**. ద్వారబంధపు నిలువు కమ్మికీ గోడకూ మధ్యలో బిగించిన రాయి. **మొత్తసుడి** వి. తోకకింద సుడి.

**మొత్తగా(డు** చూ. మొత్తము.

**మొత్తము** రూ. ముత్తెం. వి. **1**. సమూహం. కు.సం. 11.106, నిర్వ.రా. 1.50 ; **2**. బాహుళ్యం, తరచు. మార్క. 6.10 ; **3**. సేన. భాస్క.రా.యు. 660 ; **4**. వెరసి, అంతు ; **5**. జంటనొగలబండి నొగల ముందువైపు కలిసే చోటు ; విణ. సాంద్రం, తరచైంది. భార.భీష్మ. 2.367.

క. మొత్త. మొత్తం, సమూహం ; త. మొత్తమ్. అంతా, వెరసి. సాంద్రం ; మ. మొత్తమ్. అంతా, మొత్తం.

**మొత్తగా(డు** వి. సేనానాయకుడు. వరాహ. 9.26. <మొత్తము + -కాఁడు. **మొత్తమునకు** రూ. మొత్తానికి. అవ్య.ద్రు. ఎంత శ్రమపడ్డా. **మొత్తముమీ(ద** అవ్య.ద్రు. **1**. అన్ని విషయాల్లో ఆలోచించి చూడగా ; **2**. మొత్తాని కాపని జరగలేదన్నమాట. **మొత్తానికి** రూ.చూ. మొత్తమునకు. అవ్య. ఆఖరికి, ఎంత శ్రమపడ్డా.

**మొత్తసము** చూ. మొత్తము. వి. సమృద్ధి.

సం. సమ-. సమం.

**మొత్తా** రూ.చూ. మొత్త. వి. తొట్టి, బండి తోలే మనిషి కూర్చోవటానికి వీలుగా పరం (చట్రం) నుంచి కాడివరకున్న తాడు అల్లకం.

**మొత్తానికి** చూ. మొత్తము.

**మొత్తికొను** చూ. మొత్తు.

**మొత్తించు** చూ. మొత్తు.

**మొత్తిమోదరలాడు** చూ. మొత్తు.

**మొత్తిమోదు** చూ. మొత్తు.

**మొత్తు** స.క్రి. **1**. కొట్టు, తాడించు. కాశీ. 2.80, హర. 1.25 ; **2**. వాయించు, మోగించు. కాశీ. 6.145 ; **3**. పగలగొట్టు. కాశీ. 7.34 ; **4**. ఇది కొట్టు ధాతువులా కొన్ని ధాతువుల తుమున్నంతాల కనుప్రయుక్తమై ప్రేరణార్థాన్ని సూచిస్తుంది. భీమ. 2.157 ; **5**. అరుచు, క్రుంగచేయు. రామాభ్యు. 6.88 ; **6**. నరకు. అచ్చ.రా.

సుందర. 115 ; అ.క్రి. గుచ్చుకొను, నాటు. అహల్యా. 2.109 ; వి. 1. దెబ్బ, క్షతి, కొట్టటం. శుక.చ. 2.77 ; 2. ఇటికబట్టీ పైభాగం.

క. మోదు. కొట్టు, మోహు. కొట్టు ; త. మొత్తు (మొత్తి-). కొట్టు, దెబ్బ, గుద్దు ; మ. మోతు. కొట్టు, ఎదుర్కొను.

మొత్తికొను రూ. మొత్తుకొను. స.క్రి. 1. తన తలని తానే కొట్టుకొను ; 2. ప్రాధేయపడు ; అ.క్రి. గట్టిగా కేకలువేయు. <మొత్తు + -ఇ$^{11}$ + కొను. మొత్తించు స.క్రి. మొత్తచేయు, కొట్టించు. దశా. 4.172. < మొత్తు + -ఇంచు$^{3}$. మొత్తిమోదరలాడు స.క్రి. పట్టిపల్లార్చు. శృం.శా. 2.22. <మొత్తు + -ఇ$^{13}$ + మోదర + -లు + ఆడు. మొత్తిమోదు స.క్రి. పట్టిపల్లార్చు. తాళ్ల.సం. 11.3.78. <మొత్తు + -ఇ$^{13}$ + మోదు. మొత్తుకరిణె వి. డిజైన్ పనికి వాడే చిన్న కరణి. మొత్తుకొను రూ.చూ. మొత్తికొను. స.క్రి. తన తలని తానే కొట్టుకొను. మొత్తుకోళ్లు వి.బ.వ. ఏడ్పులు, పెడబొబ్బలు. మొత్తులాడు అ.క్రి. కొట్లాడు, దెబ్బలాడు శృం.నై. 3.32, వరాహ. 11.16. <మొత్తు + -లు + ఆడు. మొత్తువడు (-పడు) అ.క్రి. కొట్టుపడు, దెబ్బతిను. శృం.నై. 8.74.

మొదం వి. ఆడగొడ్డు, పెంటి.

మొదట చూ. మొదలు.

మొదటికిమోసమగు చూ. మొదలు.

మొదటికేమోసమువచ్చు చూ. మొదలు.

మొదటికొయ్య చూ. మొదలు.

మొదటికోల చూ. మొదలు.

మొదటిచూపు చూ. మొదలు.

మొదటిచెయ్యి చూ. మొదలు.

మొదటిచేయి చూ. మొదలు.

మొదటిజాతిదొర చూ. మొదలు.

మొదటిదాపు చూ. మొదలు.

మొదటిది చూ. మొదలు.

మొదటిదిక్కు చూ. మొదలు.

మొదటిదిక్కుసుబాదారి చూ. మొదలు.

మొదటిపంట చూ. మొదలు.

మొదటిపలుకులు చూ. మొదలు.

మొదటిపల్కులు చూ. మొదలు.

మొదటిపీట చూ. మొదలు.

మొదటిపుట్టుక చూ. మొదలు.

మొదటిపెండ్లాము చూ. మొదలు.

మొదటిపేరు చూ. మొదలు.

మొదటిమోకు చూ. మొదలు.

మొదటివాఁడు చూ. మొదలు.

మొదటివిరుపు చూ. మొదలు.

మొదటివేలుపు చూ. మొదలు.

మొదటివేల్పు చూ. మొదలు.

మొదటిహత్తి చూ. మొదలు.

మొదండ్లకాంపులు చూ. మొదలు.

మొదనిక రూ.చూ. మదినిక. వి. ఒకరకం కలుపుమొక్క, మదనబుడమ.

మొదయము వి. తృణవిశేషం, ఒకజాతి గడ్డిమొక్క. ప్రబంధ. 201.

మొదలంట చూ. మొదలు.

మొదలంటఁగోయు చూ. మొదలు.

మొదలంటు చూ. మొదలు.

మొదలారి రూ. మొదలియారి. వి. 1. అరవ శూద్రుల్లో ఒక తెగవాడు. తాళ్ల.సం. 5.158 ; 2. నాయకుడు.

క. ముదలిగ. ముఖ్యుడు ; త. ముతలియార్. తంజావూరు జిల్లాలోని జైనుల్లో ఒకతెగ, ముతలి. ముఖ్యుడు, సన్యాసి, మఠాచార్యుడు.

<త. ముతలియార్.

మొదలార్చు చూ. మొదలు.

మొదలాకు చూ. మొదలు.

మొదలి[1] రూ.చూ. మొసలి. వి. నక్రం, జలజంతు విశేషం, మకరం.

మొదలి[2] చూ. మొదలు.

మొదలిగాము చూ. మొదలు.

మొదలిగాముపట్టి చూ. మొదలు.

మొదలిజేజే చూ. మొదలు.

మొదలితామరగన్న ముద్దుకొడుకు చూ. మొదలు.

మొదలిదివాణము చూ. మొదలు.

మొదలిదుర్గము చూ. మొదలు.

మొదలిధనము చూ. మొదలు.

మొదలిపట్టణము చూ. మొదలు.

మొదలిపేరు చూ. మొదలు.

మొదలిప్రోలు చూ. మొదలు.

మొదలిమాడలు చూ. మొదలు.

మొదలియారి రూ.చూ. మొదలారి. వి. 1. అరవదేశపు శూద్రుల్లో ఒకతెగ ; 2. నాయకుడు.

మొదలివహి చూ. మొదలు.

మొదలివేలుపు చూ. మొదలు.

మొదలివేల్పు చూ. మొదలు.

మొదలిసాని చూ. మొదలు.

మొదలిసొమ్ము చూ. మొదలు.

మొదలు అవ్య. ప్రభృత్యర్థకం. ఆరంభించి, మొదలు కొని. భార.ఆది. 1.44 ; వి.ఔ. 1. చెట్లకిందిభాగం, ప్రకాండం. భార.ఆది. 5.166 ; 2. మూలకారణం. భార.ఆది. 6.262; 3. ఆది, ప్రారంభం. భార.సభా. 1.53 ; 4. మూలధనం. భార.అను. 5.75 ; ద. హిం. శా. సంపు. 6. శా.సం. 160. క్రీ.శ. 1130 ; విశ. 1. ముఖ్యుడు, ప్రధానుడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1054 ; 2. ప్రథమం, తొలుతటిది. భార. ఆది. 5.40 ; 3. ప్రాక్తనం, తొల్లిటిది, తొల్లిటివాడు, పూర్వుడు. భార.ఆది. 3.120.

క. మొదలు. ఆది, ప్రారంభం, మొదలిగ. ముఖ్యుడు, ప్రధానుడు, మొద. మొదలు. మొట్టమొదలు, వేరు, మూలం ; కొడ. మొద. ఒకరికి చెందిన వస్తువు ; తు.

ముదెళు. మొదలు, **అసలు** కారణం, చెట్టు మొదలు ; **త.** ముతల్. ప్రారంభం, మొదలు, ఆది, గొప్పది, అడుగు **భాగం**, చెట్టుమొదలు, ముతల్‌వన్. మొదటివ్యక్తి, **ముఖ్యుడు** ; పర్జి. మొదెల్. చెట్టుమొదలు ; కొలా, మొదల్. చెట్టుమొదలు, మొడ్డ్. మొదలు, కాండం ; నా. మొద్‌హల్. చెట్టుమొదలు ; పో.చూ.**త.** ముతల్.

మొదట **అవ్య.**ద్రు. ముందు. < మొదలు + -అ[7]. **మొదటికి మోసమగు** **అ.**క్రి. మూలచ్ఛేదిఅగు, అసలుకే మోసం **అగు.** భాస్క.రా.6. < మొదలు + -ఇ[6]- + -కున్ + మోసము + **అగు.** మొదటికే మోసమువచ్చు **అ.**క్రి. అసలుకే విఘాతం కలుగు. < మొదలు + -ఇ[6]- + -**కున్** + -ఏ[3] + మోసమువచ్చు. **మొదటికొయ్య** వి. తలపీటకు ఉండే మొదటివరసకొయ్య. < మొదలు + -ఇ[6]- + కొయ్య. **మొదటికోల** వి. తలపీటకుఉండే మొదటివరస కొయ్య < మొదలు + -ఇ[6]- + కోల. **మొదటిచూపు** పి. ఎలగోలచూపు. < మొదలు + -ఇ[6]- + చూపు. **మొదటిచెయ్యి** రూ. మొదటిచేయి. వి. **1.** మేలుచేసే చేయి ; **2.** మొనగాడు ; **3.** మొనకత్తె. < మొదలు + -ఇ[6]- + చెయ్యి. **మొదటిచేయి** రూ.చూ. మొదటిచెయ్యి. వి. **1.** మేలుచేసే చెయ్యి ; **2.** మొనగాడు ; **3.** మొనకత్తె. **మొదటిజాతిదొర** వి. బ్రహ్మ, నలువ. **మొదటిదాపు** వి. **అ**ముగోడ పక్కన అనిచ్చే ఓటికుండల వరస. < మొదలు + -ఇ[6]- + **దాపు.** **మొదటిది** విణ. మొదలు, ఆది. < మొదలు + -ఇ[6]- + అది. **మొదటిదిక్కు** వి. తూర్పు. సం. దిశ్, దిక్. దిక్కు. < మొదలు + -ఇ[6] + సం. దిక్. **మొదటిదిక్కుసుబాదారి** వి. ఇంద్రుడు. **మొదటిపంట** వి. సారువాపంట. < మొదలు + -ఇ[6] + పంట. **మొదటిపలుకులు** రూ.చూ. మొదటి పల్కులు. వి.బ.వ. వేదాలు. **మొదటిపల్కులు** రూ. మొదటి పలుకులు. వి.బ.వ. వేదాలు. ప్రబంధ. 51. < మొదలు + -ఇ[6] + పల్కు + -లు. **మొదటిపీట** వి. అనుపీటల్లో మొదటిది. < మొదలు + -ఇ[6]- + పీట. **మొదటిపుట్టుక** వి. మొదటిసంతానం. < మొదలు + -ఇ[6]- + పుట్టుక. **మొదటిపెండ్లాము** వి. **1.** సహధర్మిణి, **భార్య** ; **2.** మొదటి భార్య. < మొదలు + -ఇ[6]- + పెండ్లాము. **మొదటిపేరు** వి. ప్రముఖస్థానం. రాధా. 1.54. < మొదలు + -ఇ[6]- + పేరు. **మొదటిమోకు** యా. మొదిటిమోకు. వి. పోలుతాడు, కాడిని పోలుకర్రకుకలిపి కట్టేతాడు. < మొదలు + -ఇ[6]- + మోకు. **మొదటివా(డు** వి. అన్న ; విణ. **1.** అగ్రగణ్యుడు ; **2.** ప్రాగ్రసరుడు, **అ**గ్రయాయి. < మొదలు + -ఇ[6]- + వా(డు. **మొదటి విరుపు** వి. నేతపడుగులో మగ్గం కొలతకు సరిపడ్డ **భాగం.** < మొదలు + -ఇ[6]- + విరుపు. **మొదటివేలుపు** రూ.చూ. మొదటివేల్పు. వి. **1.** బ్రహ్మ ; **2.** గణపతి. **మొదటివేల్పు** రూ. మొదటివేలుపు. వి. **1.** సురజ్యేష్ఠుడు, బ్రహ్మ. మను. 1.50; **2.** గణపతి. < మొదలు + -ఇ[6]- + వేల్పు. **మొదటిహత్తి** వి. ఐరావతం. < మొదలు + -ఇ[6]- + హత్తి. **మొదండ్ల కాంపులు** వి.బ.వ. ప్రధానగ్రామవాసులు లేక వ్యవసాయదారులు. ద.హిం.శా. 6.235 సం. < మొదలు + -లు + కాంపు + -లు. **మొదలంట** **అవ్య.** ద్రు. సమూలంగా, పూర్తిగా. పాండు. 5.238. < మొదలు + అంటు[1] + -అ[7]. **మొదలంట(గోయు(-కోయు)** స.క్రి. మొదటిదాకా కోయు. శుక. 2.223. **మొదలంటు** **అ.**క్రి. సమూలమగు, పూర్తగు. రం.రా బాల. 27వ. 19పం. < మొదలు + **అంటు**[1]. **మొదలార్చు** స.క్రి. సమూలంగా నశింపచేయు, క్షీణింపచేయు. రుక్మా.చ. 3.30. < మొదలు + ఆర్చు. **మొదలాఱు** **అ.**క్రి. సమూలంగా నశించు. సిం.ద్వా. 9.10. < మొదలు + ఆఱు[1]. **మొదలి**[2] వి. ముఖ్యుడు, ప్రధానుడు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1054 ; విణ. మొదటి. **కు.**సం. 2.30. క. ముదలిగ. ముఖ్యుడు ; **త.** ముతలి. ముఖ్యుడు. **మొదలిగాము** వి. సూర్యుడు. **ఆం.** పదా. సుర. 21. < మొదలు + -ఇ[3]- + గాము. **మొదలిగాముపట్టి** వి. **1.** శని ; **2.** యముడు. **మొదలిజేజే** వి. పూర్వదేవుడు, రాక్షసుడు. **అ**చ్చ.రా.యు. **480.** < మొదలు + -ఇ[3]- + జేజే. **మొదలితామరగన్న ముద్దుకొడుకు** వి. బ్రహ్మ. < మొదలు + -ఇ[3]- + తామర + కన్న ముద్దుకొడుకు. **మొదలిదివాణము** వి. ప్రధాన ఆస్థానం, **వ**ట్టినిల్లు. పాండు. 1.107. < మొదలు. + -ఇ[3]- + దివాణము. **మొదలిదుర్గము** వి. ప్రధానదుర్గం. నె.శా. కందుకూరు. శా.సం. 78. క్రీ.శ. 1536. < మొదలు + -ఇ[3] + దుర్గము. **మొదలిధనము** వి. మూలధనం. ద.హిం.శా.సంపు. **4.** శా.సం. 784. సం. ధన-. డబ్బు, సంపద. < మొదలు + -ఇ[3] + సం. ధన- + -ము. **మొదలిపట్టణము** వి. రాజధాని. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 504. క్రీ.శ. 1313. < మొదలు + -ఇ[3] + పట్టణము. **మొదలిపేరు** వి. **1.** అగ్రగణ్యుడు, మొదట పేర్కొనతగినవాడు ; **2.** అగ్రగణ్య, మొదట పేర్కొనదగినది. శేయూ. 1.36. < మొదలు + -ఇ[3] + పేరు. **మొదలిప్రోలు** వి. రాజధాని, ముఖ్యపట్టణం. **అ**చ్చ.రా.అయోధ్యా. 115. < మొదలు + -ఇ[3] + ప్రోలు. **మొదలిమాడలు** వి.బ.వ. మూలధనంగా ఇచ్చిన మాడలు. నె.శా. కావలి. శా.సం. 25. క్రీ.శ. 1244. < మొదలు + -ఇ[3] + మాడ + -లు. **మొదలివహి** వి. మొదటితడవ. ద.హిం.శా.సంపు. **4.** శా.సం. 711. క్రీ.శ. 1653, < మొదలు + -ఇ[3] + వహి. **మొదలివేలుపు** రూ. మొదలివేల్పు. **వి.** ప్రధానదైవం, శివుడు. సిం.ద్వా. **4.22.** < మొదలు + -ఇ[3] + వేలుపు. **మొదలివేల్పు** రూ.చూ. మొదలివేలుపు. వి. ప్రధానదైవం, శివుడు. **మొదలిసాని** వి. మేళనాయకురాలు. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1049. < మొదలు + -ఇ[3] + సాని[3]. **మొదలిసొమ్ము** వి. కంతాల, కలశి, పెరుగు కడవ. < మొదలు + -ఇ[3] + సొమ్ము. **మొదలుకొను** రూ. మొదల్కొను. అ.క్రి. **1.** ప్రారంభం చేయు, ఉపక్రమించు. భార.భీష్మ. 1.73 ; **2.** సమూలమగు, మొదలంటు. జైమినిభా. 2.83 ; **3.** యత్నించు. స.క్రి. ప్రారంభించు, తొట్టు. **మొదలుచూచిచెట్టెఱు(గువారు** విణ.బ.వ. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేవారు. ఉ.హరి. **4.95.** **మొదలుచెడు** రూ. మొదల్చెడు. స.క్రి. సంపూర్ణంగా నాశనమగు. **మొదలుచేయు** స.క్రి. **1.** ప్రారంభించు ; **2.** పూను, యత్నించు. **మొదలుతామర(గన్నముద్దుకొడుకు** వి. బ్రహ్మ. **మొదలుతుదలేని** అవ్య. ఆద్యంతాలులేని, అనంత

మైన. కళా. 8.245. మొదలుపెట్టు స.క్రి. ప్రారంభించేయు, ఉపక్రమించు. మొదలుమాయు అ.క్రి. వంశనాశనమగు. మొదలుముట్టు అ.క్రి. సమూలమగు, మొదలంటు. నీలా. 2.59, గా.హరి. 2.1250. మొదలూకొనాలేకుండు అ.క్రి. తలాతోకా లేకుండు. మొదలూడగ(గ(గూలు అ.క్రి. మొదలంట కూలు. పారి. 5.31. మొదలు + ఊడు + -అ[7] + అగు + -అ[7] + కూలు. మొదలూడు అ.క్రి. నిర్మూలమగు, మొదలంట పోవు. కవిక. 6.211. < మొదలు + ఊడు. మొదలెత్తు అ.క్రి. మొదలంట పోవు, సమూలంగా నశించు. శృం.నై. 6.7. < మొదలు + ఎత్తు[1]. మొదల్కొను రూ.చూ. మొదలు కొను. అ.క్రి. 1. ప్రారంభించేయు, ఉపక్రమించు ; 2. సమూలమగు, మొదలంటు ; స.క్రి. ప్రారంభించు, తొట్టు. < మొదలు + కొను. మొదల్చెడు రూ.చూ. మొదలుచెడు. అ.క్రి. చచ్చు, మరణించు. ఆం.భా. 2.228. < మొదలు + చెడు. మొదిటిమోకు రూ.చూ. మొదటిమోకు. వి. పోలు తాడు, కాడిని పోలుకర్రనూ కలిపికట్టే తాడు.

మొదలూకొనాలేకుండు చూ. మొదలు.

మొదలూడగ(గ(గూలు చూ. మొదలు.

మొదలూడు చూ. మొదలు.

మొదలెత్తు చూ. మొదలు.

మొదల్కొను చూ. మొదలు.

మొదల్చెడు చూ. మొదలు.

మొదవ[1] రూ. మొదువు. వి. బల్బజం, ఒకజాతిగడ్డి (Saccharum cytindricum).

క. మొదె. ఒకరకం గడ్డి, సంస్కృత ముంజ శబ్దభవ మని కిట్టెల్.

మొదవ[2] రూ.చూ. మొదవు. వి. మొదటి ఈత అయిన ఆవు.

మొదవు రూ. మొదవ[2]. వి. 1. పాడిఆవు, ఆవు. భార.ఆది. 2.171, ద.హిం.కా.సంపు. 4. కా.సం. 1317 ; క్రీ.శ. 1081 ; 2. తొలిచూలిఆవు. ఆం.భా. 2.262.

కొం. మొదొ, మొద్వ, మొద్వొ. ఆవు.

మొదాలు రూ.చూ. మోదొలు. వి.బ.వ. ఆవులు. < మొదవు + -లు.

మొదసుడి వి. ముడ్డికి బెత్తెడు దిగువ ఉండేది.

మొదాలు చూ. మొదవు.

మొదికిని రూ.చూ. ముదినిక. వి. ఒకరకం కలుపుమొక్క, మదనబుడమ.

మొదిటిమోకు చూ. మొదలు.

మొదిమివేళ్ళు చూ. ముదిమి, మొదలు. వి.బ.వ. ఒకరకం గడ్డిమొక్క వేళ్ళు.

మొదిమై వి. బొద్ద, బొజ్జ, మొదవ, ఒకరకం గడ్డి, కప్పుకు పనికివచ్చే గడ్డి (Imperata cylindrica, saccharum cylindricum).

మొదుక విణ. 1. కరకు, బిరుసు. హరి.పూ. 6.161 ; 2. సాంద్రం, దట్టం ; క్రి.విణ. 1. కరకైన ; 2. దట్టమైన.

సం. మంద-. అలసమైనది, పాటవం లేనిది.

మొదుకన వి. 1. బరువు. భార.భీష్మ. 2.71 ; 2. కరకుదనం. హరి.పూ. 5.142. మొదుకని విణ. బరువైన.

మొదుగు స.క్రి. మెత్తగా నలగొట్టు.

సం. మృదుక-. మెత్తటిది.

మొదుగ్గొట్టు స.క్రి. మొదిగేటట్లు మట్టిపెల్లల్ని నున్నగా కొట్టు. < మొదుగు + కొట్టు[1].

మొదుగ్గొట్టు చూ. మొదుగు.

మొదుము రూ.చూ. మదుము. వి. మెత్తటినేల.

మొదువు రూ.చూ. మొదవ[1]. వి. బల్బజం, ఒకరకం గడ్డి

మొదెము వి. 1. చీపురుపుల్ల ; 2. ఈనె.

మొద్దగు చూ. మొద్దు.

మొద్దంచు చూ. మొద్దు.

మొద్ద(డు రూ.చూ. ముద్దు(డు. విణ. 1. మూఢుడు. సురా. 60 ; 2. లావైనవాడు.

మొద్దాపి చూ. మొద్దు.

మొద్దు రూ.చూ. ముద్దు(డు. విణ. 1. లావైంది, స్థూలం. గా.హరి.ఉ. 1090పం. ; 2. మూఢుడు, మూఢురాలు. చంద్రరే. 3.42 ; 3. వాడి చెడినది, మొనపోయినది ; 4. చేతకానివాడు, చేతకానిది ; వి. 1. కొమ్మలు విరిగిన మాను. సురా. 57 ; 2. చెట్టు కొమ్మల కిందిభాగం, ప్రకాండం. ఆం.భా. 2.30 ; 3. గుడి, దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య ; 4. అడ్డగుమ్మి కింది పీట ; 5. ఆసుకొయ్య ; 6. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య ; 7. పట్టాదారం పంటెకు తోడేటప్పుడు పంటెకామ కింద ఊనిగా పెట్టే కొయ్య ; 8. రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట ; 9. నూలు దబ్బా తిరగటానికి వంపుతిరిగిన ఇనపచువ్వ, బిగగొట్టిన కొయ్య మొద్దు ; 10. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య ; 11. పంటకోసిన తర్వాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు ; 12. గానిగ కట్టె తిరగటానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప ; 13. గోడలో బిగించే దర్వాజాకమ్మి ; 14. అచ్చుగా వాడే కొయ్యదుంప ; 15. కొయ్యదూలం.

మొద్దగు అ.క్రి. 1. బండబారు ; 2. లావగు. < మొద్దు + అగు. మొద్దంచు రూ.చూ. ముద్దంచు. వి. 1. బెత్తెడు వెడల్పుకు పైగా రంగులో నేసిన మామూలంచు ; 2. వేలెడు వెడల్పు కడ్డీలు పడేట్టు నేసిన అంచు ; 3. పెడచీల్చకుండా లోపల పిశి ఉంటూ మందంగా కడెంలాగ పాత్రలకు పెట్టే అంచు. < మొద్దు + అంచు[3]. మొద్దాపి రూ.చూ. మొద్దుతాపి. వి. కట్టుబడిలో వాడే మందపాటి రేకుగల కొంచెం పెద్దసైజు తాపీ. మొద్దుకత్తి వి. కంప మండలు నరకటానికి ఉపయోగించే పిడి లేని కత్తి. మొద్దుకాలు వి. అడ్డగుమ్మి అమర్చిన తిరుగుడు చట్టం కింది పీటకు వేసిన పొడుగు పట్టె. మొద్దుగట్టం వి. కొయ్యదిమ్మ. మొద్దుగా క్రి.విణ.ద్రు. 1. లావుగా ; 2. మూఢంగా. < మొద్దు + అగు + -అ[7]. మొద్దుగులాబి వి. లంబాడి ఆడవాళ్ళు వాడే ఒకరకం నేతబట్ట. మొద్దుగూటం రూ.చూ. ముద్దగూటాం. వి. 1. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటె కామకు ఊనికగా పెట్టే కొయ్య ; 2. నూలు దబ్బా తిరగ టానికి వంపు తిరిగిన ఇనపచువ్వ దిగగొట్టిన కొయ్య

మొద్దు ; **3**. రాటి తిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్య గూటం ; **4**. రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. **మొద్దుగొయ్య (-కొయ్య)** వి. రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. **మొద్దుతాపి** రూ. మొద్దాపి. వి. కట్టుబడిలో వాడే మందపాటి రేకుగల కొంచెం పెద్దసైజు తాపీ. **మొద్దుతిరిగిణి** రూ. మొద్దుతిరిగిని. వి. రాటి గుమ్మటం లాంటి పనిముట్టు. **మొద్దుతిరిగిని** రూ.చూ. మొద్దుతిరిగిణి. వి. రాటి గుమ్మటం లాంటి పనిముట్టు. **మొద్దునిలువు** వి. రాటిని ఆధారంగా పాతిన నిలువుకొయ్య. **మొద్దుపిడత** వి. మూనెడు పాలు కాగబెట్టటానికి వాడే మట్టి పాత్ర. **మొద్దుపీట** వి. రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. **మొద్దుపుల్ల** వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **మొద్దుమేకు** వి. డంగు మొద్దుమీద నాటిన మేకు. **మొద్దుమొగము** వి. చేతకానివాడు, తెలివిలేనివాడు. **మొద్దురాచ్చిప్ప** వి. మొద్దు మనిషి. **మొద్దులవంగపట్ట** వి. మెరిసే ఆకులుగల చెట్టు. **మొద్దువాఱు(-పాఱు$^{3}$)** అ.క్రి. వాడిలేనిదగు, మొక్కపోవు. **మొద్దువోవు (-పోవు)** అ.క్రి. వాడిలేనిదగు, మొనచెడినదగు. శృం.నై. 8.139.

**మొన** వి. **1**. అగ్రం, కొన. భార.సభా. 2.46 ; **2**. సైన్యం. భార.విరా. 4.147 : **3**. వ్యూహం. భార.శాంతి. 3.380 ; **4**. దురం, పోరు. భాస్క.రా.యు. 6.51 ; **5**. ఖడ్గాదుల ధార, వాదర. వరాహ. 5.41 ; **6**. ముందు, పురోభాగం. చంపూరా. 5.72 ; **7**. బాణాగ్రం. చంపూరా. 6.45 ; **8**. శస్త్ర విద్యా విశేషం, ఒకరకం సాధన. ఆం.భా. 2.205 ; **9**. సేనాముఖం. ఆం.భా. 2.210 ; **10**. మొలక, భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే దశ ; **11**. నాడె చివర కొనతేలిన భాగం ; **12**. కఱ్ఱు బిగించే నాగలి కొన ; విశే. ఎదురు, ప్రతి. ద్వి.సార.చ. 2.517 పం.

క. మొనె. కొన ; త. మునై.

**మొనఎక్కుడు** వి. పోవటానికి కష్టమనిపించే దారి, ప్రదేశం. **మొనకట్టు** అ.క్రి. **1**. మూర్కొను, ప్రతిఘటించు, కలిసివచ్చు. భార.కర్ణ. 3.127 ; **2**. ఉత్సహించు. ఉత్సాహపడు. హరిశ్చ. 1.208 ; **3**. గుంపుగూడు. ధనా. 3.28 ; వి. **1**. ఉత్సాహజనకమైన మూలికా విశేషం. చంద్రాంగ. 5.120 ; **2**. ఉత్సాహం. **మొనకత్తియ** రూ. మొనకత్తె. వి. శూరురాలు. **మొనకత్తె** రూ.చూ. మొనకత్తియ. వి. శూరురాలు. **మొనకాఁడు** రూ.చూ. మొనగాఁడు. వి. **1**. ముఖ్యుడు, ప్రధానుడు ; **2**. శూరుడు ; **3**. సేనాధిపతి. **మొనకాలు** వి. పాదాగ్రం, కాలి కొన. ఘటికా. 2.126. **మొనకెక్కు** అ.క్రి. హెచ్చు. గంధ. 1.38. < మొన + -కున్ + ఎక్కు. **మొనకొను** అ.క్రి. **1**. తోచు, స్ఫురించు. అధ్యా.ఉ. 224 పు. ; **2**. సమీపించు, చేరువగు. రంగా.చ. 3.155 ; **3**. ఉత్సహించు ; **4**. ఢీకొను, తలపడు ; **5**. కలుగు, **మొనగాఁడు** రూ. మొనకాఁడు. వి. **1**. శూరుడు. అచ్చ.రా. బాల. 202; **2**. సేనాధిపతి. మల్లుపు. 2.10; **3**. ముఖ్యుడు, ప్రధానుడు ; క. మొనగాఱ. ధైర్యవంతుడు. **మొనగాలు (-కాలు$^{2}$)** వి. అశ్వగతి విశేషం. వేంక.పంచ. 2.150. **మొనగుబ్బ** వి. స్తనాగ్రం. హంస. 4.38. **మొనగురుపు (-కురుపు)** వి. ఒకరకం కురుపు. సిం.ద్వా. 1.53. **మొనగోరు** వి. గోరు చివర. చంద్రాంగ. 2.84, తాళ్ల.సం 12.274. **మొనచన్ను** వి. చనుమొన. **మొనచూపు** అ.క్రి. కనిపించు. తాళ్ల.సం. 7.181. **మొనచేయు** రూ. మొనసేయు. స.క్రి. వాడిచేయు, పదునుపెట్టు. విజయ. 3.15 ; అ.క్రి. **1**. ఉదయించు, పొడచూపు. కృ.శకు. 3.54 ; **2**. మోహరించు. **మొనఁజూపు (-చూపు)** అ.క్రి. ముల్లుచూపు, సమానమగు. నిరంకు. 2.10. **మొనతప్పు** రూ. మొనదప్పు. స.క్రి. విముఖమగు. భార.సౌప్తి. 1. **మొనదప్పు** రూ.చూ. మొనతప్పు. అ.క్రి. విముఖమగు, సుక్కు. **మొనదేఱు (-తేఱు)** అ.క్రి. నిశితమగు, వాడికలదగు, పదునెక్కు. రాజవా. 3.130. **మొనదేలు(-తేలు$^{1}$)** అ.క్రి. **1**. నెత్తురుగడ్డ వ్రణాలు, పగలగొట్టటానికి ముందు మొన ఏర్పడు ; **2**. ఒక వివాదం పరిష్కారముఖమగు. **మొనపడు** అ.క్రి. **1**. ఆవృతమగు, కప్పబడు. ఉ.హరి. 1.147 ; **2**. వాడి అగు. **మొనపల్లు** వి.ఔ. దంతాగ్రం, పంటి కొన. ఉ.రా. 1.319. **మొనపొట్టి** వి. ఆకుల మరుగున ఉన్న ఎన్ను. **మొనపోటు** వి. తమలపాకు కొనలు ఎండిపోయే తెగులు, రెక్కల మిడత ఆకు పసరు పీల్చటంవల్ల ఇలా అవుతుంది. **మొనయిడు (-ఇడు)** అ.క్రి. వాడి కల్గించు, పదును పెట్టు. దశా. 2.282. **మొనరాయికట్టుబడి** వి. చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి. **మొనలకైదువ** రూ. మొనలకైదుపు. వి. త్రిశూలం. అచ్చ.రా. అయోధ్యా. 118. **మొనలకైదువు** రూ.చూ. మొనలకైదువ. వి. త్రిశూలం. **మొనలవాలు** వి. త్రిశూలం. నీలా. 1.119. **మొనలిడు** అ.క్రి. అంకురించు, మొలకెత్తు. కళా. 6.196. < మొన + -లు + ఇడు. **మొనలు** వి.బ.వ. శస్త్రవిద్యా విశేషం. **మొనలెత్తు** అ.క్రి. మొలకలెత్తు. నరస. 5.175. < మొనలు + ఎత్తు$^{1}$. **మొనలేర్పరించు** స.క్రి. వ్యూహాలు పన్ను. పారి. 5.2. < మొనలు + -లు + ఏర్పరించు. **మొనల్పడు** అ.క్రి. మొనలేర్పడు. చంద్రాంగ. 2.95. < మొన + -లు + పడు. **మొనవాఁడి** వి. ముందుండేవాడు. తాళ్ల.సం. 7.197. **మొనవాలు** వి. **1**. త్రిశూలం. చెన్నబసవ. 4.80 ; **2**. బల్లెం. **మొనవ్రేలు** వి.ఔ. అంగుళ్యగ్రం, వేలి కొన. వసు. 3.100. **మొనసరి** విశే. శూరుడు, మొనగాడు. **మొనసెలవి** వి. సెలవిమొన, సృక్వాగ్రభాగం. మను. 6.78. **మొనసేయు (-చేయు)** రూ.చూ. మొనచేయు. అ.క్రి. **1**. ఉదయించు, పొడచూపు. చంపూరా. 3.72 ; **2**. మోహరించు ; స.క్రి. వాడిచేయు, పదునుపెట్టు. **మొనులి** వి. రాతిమీద నగ్షా ప్రకారం లైను కొట్టటానికి వాడే ఉలి. < మొన + ఉలి.

**మొనక** వి. **1**. పేర్పులోని వరస ; **2**. బారు ; **3**. వాదర.

**మొనపు** చూ. మొనయు.

**మొనయించు** చూ. మొనయు.

**మొనయు** అ.క్రి. **1**. సిద్ధమగు. భార.ఆది. 5.50 ; **2**. ఉన్ముఖమగు. భార.ఆది. 5.138 ; **3**. యత్నించు, పూను. భార. ఆది. 8.249 ; **4**. ఇది కొన్నిచోట్ల వాక్యాలంకారంగా ప్రయోగింపబడుతుంది. కు.సం. 8.179 ; **5**. జరుగు. నిర్వ.రా. 7.83 ; **6**. కలుగు, జనించు, పుట్టు. నృసింహ. 1.83 ; **7**. ఒప్పు, శోభిల్లు. కాశీ. 6.30 ; **8**. వ్యాపించు, అలం. పల్నా.వు. 11 ; **9**. అవతరించు. భాగ. 10 పూ. 533 ; **10**. నశించు, అణగు. మను. 6.109 ; **11**. రూపొందు. వసు. 2.27 ; **12**. సంభవించు, తటస్థించు. ఉ.రా. 3.219 ; **13**. ప్రత్యక్షమగు, గోచరించు. కుచే. 1.95 ; అ.క్రి. స.క్రి. మార్కొను, ప్రతిఘటించు. భార.అరణ్య. 3.9 ; స.క్రి. ఆచరించు, చేయు. భాగ. 10 పూ. 454.

క. మొనె. పోరు, యుద్ధం ; త. మునై. నిమగ్నమగు. దెబ్బలాడు. మ. మునక్క. ముందుగా వెళ్ళు. మునుక. అధిగమించు.

మూ. ద. ద్రా. *మున్, *మున్- అయ్ ;

< మూ. ద్రా. *ము-, మున్.

**మొనపు** అ.క్రి. **1**. కలుగు, పుట్టు. వరాహ. 3.5 ; **2**. ప్రకాశించు, ఒప్పు. వరాహ. 4.147 ; **3**. హెచ్చు, అతిశయించు. వరాహ. 4.180 ; స.క్రి. **1**. కలిగించు, పుట్టించు. రామాభ్యు. 1.190 ; **2**. మొనయచేయు, పూనచేయు. చంద్రాంగ. 4.127 ; వి. మొలక, భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చేభాగం. **మొనయించు** స. క్రి. **1**. మోపు, ఉంచు. పారి. 4.12, **2**. వ్యాపింపచేయు. ఉ. రా. 1.99 ; **3**. మొనయచేయు, కలిగించు. ఉ. రా. 1.171 ; **4**. పూనచేయు ; **5**. కలుగచేయు. < మొనయు + -ఇంచు[3]. **మొనవు** వి. పూనిక.

**మొనరు** చూ. పొనరు. స.క్రి. ఒప్పు.

**మొనవు** చూ. మొనయు.

**మొనులి** చూ. మొన.

**మొన్న** వి. ఔ. **1**. కడచిన దినానికి పూర్వదినం. భార. విరా. 5.349 ; **2**. అచిరభూతకాలం, కడచిన కొద్దికాలం. ఇందు. 3.4.

క. మొన్నె. కడచినరోజుకు ముందు (పూర్వం రోజు).

**మొన్నజరిగినట్టుగా** అవ్య.ద్రు. ఇటీవలే జరిగినట్లు.

**మొన్నబిల్లు** వి. దూదిప్పచెట్టు (Hymenodictyon excelsum).

**మొపికి** చూ. మొటిమ. వి.బ.వ. యౌవనసూచకంగా లేచే చిన్నగుల్ల, పోతరంపొక్కు.

**మొప్ప** వి. ఒకరకం జలజంతువు ; వి.బ.వ. చేపమెడకి రెండు పక్కల ఉండే ద్వారాలు, చేపలగ్యాసకోశాలు.

**మొప్పము** చూ. మొప్పు.

**మొప్పియ** రూ.చూ. మొప్పె. విణ. **1**. బండైన. భల్లా. 4 ; వి. మూర్ఖుడు ; **2**. మూర్ఖురాలు.

**మొప్పు** రూ.చూ. ముప్పు. వి. కీడు, హాని.

**మొప్పము** వి. **1**. మోసం ; **2**. ప్రమాదం.

**మొప్పె** రూ. మొప్పియ. విణ. **1**. మూర్ఖుడు. వేమ. 2.68 ; హంస. 5.117, తాళ్ళ. సం.17.563 ; **2**. మూర్ఖురాలు.

**మొప్పెతనము** వి. మూర్ఖత. చంద్రరే. 3.106.

**మొఫసల్** రూ.చూ. ముఫసలు. విణ. ప్రత్యేకమైన ; వి. పల్లెటూరు.

**మొబలగు** రూ. మొబల్లగు. వి. మొత్తం.

ఉ. అర. ముబలగ్. ఒకమొత్తం, రొక్కనగదు, కొంతరూకలు వచ్చేచోటు, ఎక్కువ, ఎన్నో ;

క. మొబలగు. మొత్తం, డబ్బు ; త. మూపలకు.

< ఉ. ముబలగ్.

**మొబల్లగు** రూ.చూ. మొబలగు. వి. మొత్తం.

**మొబహము** క్రి. విణ. సంగ్రహంగా.

ఉ. ముబాహ్. సంగ్రహంగా, మొత్తంగా, సందిగ్ధంగా. వివరాలు లేకుండా, పేరులేకుండా, ఊహతో, అస్రుత,

< ఉ. ముబాహ్.

**మొబ్బు** రూ.చూ. మబ్బు. వి. **1**. మత్తు, మాంద్యం, మగత ; **2**. చీకటి, అంధకారం ; **3**. మేఘం, మొయిలు ; **4**. అజ్ఞానం ; **5**. మందకొడి తనం ; **6**. మాపు, సందెవేళ.

**మొమ్మటు** వి. మైనం.

హిం. ఉ. మోమ్. మైనం.

**మొమ్మాయి** చూ.చూ. మమ్మాయి. వి. ఒకవిధమైన లేహ్యం.

**మొయనం** రూ. మోయినం. వి. తగిన నిష్పత్తిలో మట్టిలో మసిని కలపటం.

**మొయమొయ్యగా** అవ్య. ద్రు. కచ్చాపచ్చాగా, తగిలీ తగలనట్లుగా.

త. మొయ్. వ్యాపించు.

**మొయలు** రూ.చూ. మొగులు[1]. వి. ఔ. మబ్బు.

**మొయిన** రూ. చూ. మోయీను. వి. శుభాశుభకార్యాల్లో బ్రాహ్మణులకిచ్చే స్వయం పాకం, బియ్యం, పప్పు, చింతపండు, అకుకూరలు, ఉప్పు, నెయ్యి మొ. వి.

**మొయిపురుగు** వి. సుంకు తినే పురుగు.

త. మొయ్. ఒత్తు, గట్టిగా అదుము.

**మొయిలు** రూ.చూ. మొగులు[1]. వి. ఔ. మేఘం. కు. సం 9.61. భార. విరా, 4.86.

**మొయిలుమేయు** అ.క్రి. మబ్బు పర్వతశిఖరాల్ని చుట్టుకొను, **మెయిలులు** రూ. మొయిళులు, మొయిళ్లు. వి.బ.వ. ఔ. మేఘాలు, మబ్బులు. **మొయిళులు** రూ.చూ. మొయిలులు. వి.బ.వ. ఔ. మేఘాలు, మబ్బులు. **మొయిళ్లు** రూ.చూ. మొయిలులు. వి.బ.వ. ఔ. మేఘాలు, మబ్బులు.

**మొయిళులు** చూ. మోయిలు.

**మొయిళ్లు** చూ. మొయిలు.

**మొయులు** రూ.చూ. మొగులు[1]. వి. ఔ. మేఘం, మబ్బు.

**మొర**[1] రూ. చూ. మోర. వి. జంతువులు. మొ. వాటి దీర్ఘముఖం. క్రీడా. 101.

**మొర**[2] రూ.చూ. మొఱ. వి. ఆర్తనాదం.

**మొరపెట్టు** రూ.చూ. మొఱపెట్టు. స.క్రి. **1**. విన్నవించు. తాళ్ల. సం. 9.34 ; **2**. అరచు, ఆర్తధ్వని చేయు. రాధికా. 1.154 ; **మొరపెట్టుకొను** స. క్రి. తనకు కలిగిన అన్యాయాల్ని గురించి చెప్పుకొను. **మొరలిడు** రూ.చూ. మొఱ

లిడు. అ.క్రి. ఆర్తనాదంచేయు. <మొర² + -లు + ఇడు.

మొరం¹ రూ. చూ. మొకరం. వి. గెనుసుగడ్డ, నాలుగైదు నెలల్లో ఒడుపుకు వచ్చేతీగ. (వేళ్ళనంటుకొని దుంపలు పెరుగుతాయి. కూరగాను, ప్రధానాహారంగాను తింటారు. కొందరు లేతఆకులు కూరగా వండుకొంటారు) (Iponaea bataras).

మొరం² రూ. మొరవ¹. వి. మోకాళ్ళు కొంకులువాచి పశువు నడవలేని కీళ్ళజబ్బు.

మొరకడము చూ. మొఱకు. పి. దౌష్ట్యం.

మొరకు రూ. చూ. మొర్కు. వి. 1. మూర్ఖుడు ; 2. క్రూరుడు ; విణ. 1. మూర్ఖమయినది ; 2. క్రూరమయినది.

మొరకుతనము రూ. చూ. మొఱకుతనము. వి. 1. మూర్ఖత్వం ; 2. కినుక.

మొరకుఁడు రూ. చూ. మొర్కు. వి. 1. మూర్ఖుడు ; 2. క్రూరుడు. విణ. మూర్ఖమైనది ; 2. క్రూరమైనది.

మొరసలాడు చూ. మొఱుఁగు. అ.క్రి. (కుక్క మొ. వి) అరచు. తాళ్ల. సం. 17.143.

మొరటి రూ.చూ. మొరటు. విణ. గట్టిదైన, కఠినమైన.

మొరటు రూ. మొరటి, మొఱటు. వి. మూర్ఖుడు. వేమ. 1965 ; విణ. మూర్ఖమైన.

క. మురుడు, మొరడు. మొరటుతనం ; తు. మురుడి, మురుడు. మొరటుతనం, కాఠిన్యం ; త. మురటు. కాఠిన్యం, కఠినత్వం, మొరటుతనం, మురటన్. కఠిన హృదయుడు, మూర్ఖుడు ; కో. మొర్డ్ఎన్. హింసాప్రవృత్తి గలవాడు, క్రూరుడు ; పర్జి. మురుమ్ ;

పో.చూ. సం. మూర్ఖ-. తెలివితక్కువది.

మొరటుతనము రూ. మొఱటుతనము. వి. మూర్ఖత్వం.

మొరడు రూ.చూ. మ్రోడు. వి. 1. మోడు, స్థాణువు. వేంక. పంచ. 3.165, శేయూ. 2.34 ; 2. మొద్దు.

మురడుపారిన క్రి.విణ. 1. గట్టిపారిన ; 2. వయసుచేత గట్టిపడిన.

మొరనేడు చూ. మొట్టి. వి. కొయ్యకాలు, పంటకోసిన తర్వాత పొలంలో మిగిలే కాళ్ళతో ఉన్న మోడు.

మొరప రూ.చూ. మొరము. వి. సన్నని గులకరాయి ఎక్కువగా కలిసిన రాయి ; విణ. గులకరాళ్ళుగల.

మొరపగడ్డ వి. నేల మొరం కలిసిన నేల. మొరపనేల రూ.చూ. మొరుంనేల. వి. మొరుం కలిసిననేల.

మొరపము¹ చూ. మొరయు.

మొరపము² రూ.చూ. మొరము. వి. శర్కర, గులకరాయి. ఆం.భా. 2.29.

మొరము రూ. మరుం, మొరప, మొరపము², మొరవు, మొరుం, మొరుము, మొర్మ. వి, 1. శర్కర, గులకరాయి. భార. ద్రోణ. 3.36 ; 2. గురుకైన చూర్ణం. హరి.ఉ. 7.17 ; 3. గులకరాతినేల ; 4. మెట్టలో వేసే వరి.

త. మురంపు. రాతిగుట్ట ;

ఉ. మురమ్. ఒకవిధమైన గులకరాతినేల.

మొరంపొచ్చ వి. కట్టుబడికి కావలసిన రాళ్ళుదొరికే గుట్ట. మొరంపొచ్చ చూ. మొరము.

మొరయిక చూ. మొరయు.

మొరయించు చూ. మొరయు.

మొరయు రూ. మొఱయు. అ.క్రి. 1. (పక్షులు మొ.) కూయు. కు.సం. 11.204 ; 2. మోగు, ధ్వనించు. భార. విరా. 1.186 ; 3. (ధ్వని) ప్రవర్తిల్లు, కలుగు, రామాభ్యు. 3.117.

క. మొరల్. కూనిరాగాలు తీయు, కూయు, మొర్. ధ్వనిచేయు, రణగొణధ్వనిచేయు, మొరహ, మొరహు, మొరెహు. కూనిరాగాలుతీయు ; కొడ. మొరడె. ఏడ్చు ; తు. మురెసుని, మురెసుని. ధ్వనించు, మురెపుని, మురెపుని, మురెలుని. అరచు, మురియ. ఏడ్చు, మురియొ. గట్టిగా ఏడ్చు ; త. మురుమురు, మురల్. ధ్వనిచేయు, కూయు, అరచు ; మ. మురళుక, మురలుక. కూనిరాగాలుతీయు ; కూయు. మురళి. మురశ, మురచు, మురజమ్. వాద్యవిశేషం ; గోం. రీతానా. గురకపెట్టు ; కువి. మూరూ - కీఅలి. అరచు ; పర్జి. మురా - గర్జించు, అరచు ; కొలా. మొరయ్. సంగీతపరమైన ధ్వనులుచేయు, మొర్ప్. (మురళీ మొ. వి) మోగించు ; నా. మొరయ్. మోగించు ; నా. మొరమ్. మోగించు ; కురు. మ్యురనా. పిడుగు పడిన శబ్దం ; మాల్తో. మురె. మాట్లాడు ; బ్రా. మ్రామ్. అరుచు, పిలుచు, ఏడ్చు ;

పో.చూ.సం. మురళీ. వేణువు, మురజ. వాద్య విశేషం.

మూ.ద.ద్రా. *మొర్-అయ్-*మొర్-అల్ ;

<మూ.ద్రా. *మొర్-.

మొరపము¹ వి. ధ్వని, మోత. కు.సం. 8.179. మొరయిక రూ. మొఱయిక. వి. మోత. రాజవా. 4.64. మొరయించు రూ. మొఱయించు. స.క్రి. 1. మోగించు, ధ్వనింపచేయు. కు.సం. 3.82 ; 2. చాటించు. విక్ర. 4.49. <మొరయు + -ఇంచు³.

మొరలి రూ.చూ. మొరళి. వి. ప్రియాల వృక్షం.

మొరళి రూ. మొరలి, మోరలి, మోరల్లి. వి. మోరటి, ప్రియాలం, ఒకానొక చెట్టు. పి.శకు. 1.98.

క. మొఱలె. వృక్షవిశేషం ; మ. ముఱల్, మురళ్.

మొరవ¹ రూ.చూ. మొరం². వి. పశువుల మోకాళ్ళు నీరుదిగి ఉబ్బే కీళ్ళ జబ్బు.

మొరవడి¹ వి. పశువులకు వచ్చే కీళ్ళవాపు జబ్బు.

మొరవ² రూ.చూ. మడవ². వి. అలుగు, చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లి పోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరచిన రాతి కట్టడం.

మొరవగొమ్మ వి. అలుగు, చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరచిన రాతికట్టడం. మొరవడి² వి. 1. రెండుపొలాలమధ్య హద్దుగా వేసిన మట్టికట్ట ; 2. మాగాణిలో మడికి మడికి మధ్య అడ్డుగా వేసిన కట్ట ; 3. కీళ్ళవాపులు.

మొరవంక రూ. మొఱవంక. విభ. వంకరైన. తాళ్ల.సం. 4.1.

మొరవంక కడియము రూ. మొఱవంక కడియము. వి. వంకీ, రెటకడియం. క్రీడా.పు. 31.

మొరపు రూ.చూ. మొరము. వి. సన్నగులకనేల, కట్టుబడిలో వాడకానికి పనికిరానిది.

మొరస రూ.చూ. మొరను. వి. సన్నగులకనేల, కట్టుబడిలో వాడకానికి పనికిరానిది.

మొరసరాయి రూ. మొఱసరాయి. వి. సున్నపురాయి, ఈ శిలాజాతి భిన్నరూపాల్లో, భిన్న లక్షణాలతో విస్తృతంగా దొరికేరాయి.

మొరసము రూ.చూ. మొరసు. వి. 1. గులకరాయి; 2. మోత.

మొరసు రూ. మరస, మొరస, మొరసము, మొరుసు, మొఱ్స, మొర్సు. వి. 1. మొరం, గులకరాయి. కవిక. 2·100 ; 2. కాపుల్లో ఒకతెగ. హంస. 4.136 ; విణ. మోటు.

మొరసునేల వి. శర్కిలం.

మొరాయించు రూ.చూ. మురాయించు. అ.క్రి. మొండిబడు, మొండికెత్తు.

మొరాయింపు రూ.చూ. మురాయింపు. వి. 1. బుకాయింపు; 2. ఎదురు తిరగటం.

మొరాయింపు చూ. మొరాయించు.

మొరాల్‌నాగలి వి. ఎఱ్ఱనేలలు దున్నేది, మెట్టనాగలికి బురద నాగలికి నడిమి రకం పరిమాణంగల నాగలి.

మొరి రూ.చూ. మొట్టి. వి. తొఱ్ఱి, అంగలోపం.

మొరిపోవు రూ.చూ. మొఱ్ఱుపోవు. అ.క్రి. ఆములో కుండలు కాలేటప్పుడు కుండలపైన బరువెక్కువై కొన్ని కుండలకు అంచులు మొక్కపోవు.

మొరికి రూ.చూ. మొట్టి. వి. 1. అంగలోపం ; 2. చిన్న గుంట.

మొరింటె రూ. మొంటి, మొంటియ, మొంటె. వి. బాలికలాడు కొనే చిన్న చేట. సమీర. 2.70.

త. ముఱమ్. చేట, ముఱ్ఱిల్, ముచ్చిల్. అరుకానే చేట ; మ. ముఱమ్. చేట ; కో. మొల్మ్. చేట ; తొ. ముఱ్స్. చేట.

మొరీ రూ.చూ. మొహరీ. వి. 1. సొరంగం ; 2. నీళ్ళుకాలవ తూము.

మొరీసుపార వి. పొడుగాటి కామగల ఒకరకం పార.

మొరుం రూ.చూ. మొరము. వి. 1, సన్నగులకనేల, కట్టుబడిలో వాడకానికి పనికిరానిది ; 2. పునాదులు దిట్టపరచటం, గ్లాబులు పోతపొయ్యటం, రోడ్లు వెయ్యటం మొ. పనులకు పనికివచ్చే రాతిముక్కలు.

మొరుంరేగడి చూ. మొరుము.

మొరుకుడు చూ. మొరము. వి. పెప్పుకుండలో దసలికాయలు ఉడకబెట్టినప్పుడు ఉడకనికాయ.

మొరుంగడ్డ చూ. మొరుము.

మొరుంనేల చూ. మొరుము.

మొరుము రూ.చూ. మొరము. వి. రాతిపలుకులతో నిండినమట్టి.

మొరుంరేగడి రూ. మొరుసురాగిడి. వి. సన్నని ఎఱ్ఱ గులక కలిసిన రేగడి, (నల్లనేల). < మొరము + రేగడి, మొరుంగడ్డ వి. 1. నేల, మొరుం కలిసిననేల ; 2. గణుసు గడ్డ. < మొరము + గడ్డ. మొరుంనేల రూ. మరుంనేల, మొరపనేల. వి. సన్నని గులకరాయి ఎక్కువగా కలిసిన నేల, వేరుసెనగ, ఆముదాలు, ఉలవ మొ. పంటలు వేసే గులక రాతినేల. < మొరుము + నేల.

మొరుసు రూ.చూ. మొరసు. వి. 1. మొరం, గులకరాయి ; 2. కాపుల్లో ఒకతెగ ; విణ. మోటు, మూఢం.

మొరుసునేల వి. సన్నని గులకరాయి ఎక్కువగా కలిసిన నేల, వేరుసెనగ, ఆముదాలు, ఉలవ మొ. పంటలు వేసే గులకరాతి నేల. మొరుసురాగిడి రూ.చూ. మొరుంరేగడి. వి. సన్నని ఎఱ్ఱగులక కలిసిన రేగడి.

మొర్కు రూ. మొరకు, మొరకుఁడు, మొఱకు. మొఱకుఁడు, మోరకు, మోరకుఁడు, మోఱకు, మోఱకుఁడు. వి. 1. ఒకానొక ఆటవిక జాతి. కు సం. 6.35 ; 2. మూర్ఖుడు ; 3. క్రూరుడు ; విణ. 1. పరుషం ; 2. మూర్ఖం ; 3. క్రూరం.

సం. మూర్ఖ-. మూర్ఖుడు, తెలివితక్కువయినది ; ప్రా. మురుక్ఖ-, ముక్ఖ- ; శౌ.మా. ముక్ఖ- ; అప. మురుక్ఖ-. ప్రాచ్యా. మరుక్ఖ-, మురిక్ఖ ;

క. ముక్ఖ, ముక్కె. మూర్ఖుడు ; కువి. మురుక్.

< ప్రా. మురుక్ఖ-.

మొర్నాడె రూ.చూ. మరనాడె. వి. పసుగు పై పోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చు తాళ్ళసాయంతో విసిరే నాడె.

మొర్మ రూ.చూ. మొరము. వి. శర్కరశిల, రాయి. హరి.ఉ. 7.20.

మొఱ్ఱి రూ.చూ. మొట్టి. వి. 1. అంగలోపం ; 2. నేరేడు పండు రంగులో పుల్లని గుండ్రని పళ్ళుకాసే చెట్టు ; విణ. అవయవలోపంకల.

మొఱ్ఱిపోవు రూ.చూ. మొఱ్ఱుపోవు. అ.క్రి. ఆములో కుండలు కాలేటపుడు కుండలపైన బరువెక్కువై కుండలకు అంచులు మొక్కపోవు. మొఱ్ఱిపడ్లు వి.బ.వ. వడ్లలో ఒకరకం.

మొఱ్ఱిగూతులు చూ. మొట్టి. వి.బ.వ. వడ్లలో ఒకరకం.

మొఱ్ఱు రూ.చూ. మొట్టి. వి. అవయవలోపం ; విణ. అవయవ లోపం కల.

మొఱ్ఱుతొట్టి వి. ఎద్దులకు తవుడు పెట్టేదానికి వాడే మట్టితొట్టి. మొఱ్ఱుపోవు రూ. మొరిపోవు, మొఱ్ఱిపోవు, మొఱ్రోవు. అ.క్రి. ఆములో కుండలు కాలేటప్పుడు కుండలపైన బరువెక్కువై కొన్ని కుండలకు అంచులు మొక్కపోవు. మొఱ్ఱేయు రూ. ఒఱ్ఱేయు. స క్రి. సాధనాలతో నేలను తిరగవేయు. మొఱ్రోవు రూ.చూ. మొఱ్ఱుపోవు. అ.క్రి. ఆములో కుండలు కాలేటప్పుడు కుండలపైన బరువెక్కువై కొన్ని కుండలకు అంచులు మొక్కపోవు. మొర్లుపోవు అ.క్రి. ఆములో కుండలు కాలేటప్పుడు కుండల పైన బరువెక్కువై కొన్ని కుండలకు అంచులు మొక్కపోవు.

మొఱ్ఱేయు చూ. మొఱ్ఱు.

మొఱ్రోవు చూ. మొఱ్ఱు.

మొర్లి వి. ఒకవిధమైన జిగురుస్రవించే, గట్టి కాండం కలిగి తినే గింజలు కాసే చెట్టు (Buchanania Lanzan).

మొర్లిసర వి. పెద్ద మొర్లిచెట్టు, ఒకవిధమైన జిగురు

ద్రవించే కాండం కలిగి తినేగింజలు కాసే చెట్టు (Buchanania angustifolia).

మొర్లపోవు చూ. మొర్రు.

మొర్స రూ.చూ. మొరను. వి. సన్నగులకనేల, కట్టుబడిలో వాడటానికి పనికిరానిది.

మొర్స్స రూ.చూ. మొరసు. వి. సన్నగులకనేల, కట్టుబడిలో వాడకానికి పనికిరానిది.

మొఱ రూ. మొర², మొఱ్ఱ¹. వి. ఆర్తధ్వని. భార.అను. 4.58. క. మొఱె. ఆర్తధ్వనిచేయు ; త. ముఱ. దుఃఖం, మొఱ్ఱయ్. ఫిర్యాదుచేయు.

మొఱపెట్టు రూ.చూ. మొఱవెట్టు. స.క్రి. విన్నవించు. శాశ్వ. సం. 6.97. మొఱయిడు (-ఇడు) అ.క్రి. ఆర్తనాదంచేయు, మొరపెట్టు. కు.సం. 5.68. మొఱలిడు రూ. మొరలిడు. అ.క్రి. ఆర్తనాదంచేయు, మొరపెట్టు. దశా. 4.84. < మొఱ +-లు+ఇడు. మొఱలువెట్టు (-పెట్టు) అ.క్రి. 1. కష్టాలు చెప్పుకొను. కుచే. 1.75; 2. ఆర్తనాదం చేయు, కూపెట్టు, 3. పెద్దగా ధ్వనిచేయు. మొఱవెట్టు (-పెట్టు) రూ. మొరపెట్టు, మొఱపెట్టు, మొఱ్ఱపెట్టు. అ.క్రి. 1. విన్నవించుకొను. శివరా. 3.16 ; 2. పెద్దగా ధ్వనిచేయు. ఆము. 4.187; 3. కష్టాలు చెప్పుకొను. కుచే. 1.75; 4. ఆర్తనాదం చేయు, కూపెట్టు. దశా. 1.273. మొఱవైచు అ.క్రి. మొరపెట్టు, ఆర్తనాదం చేయు, పెద్ద ధ్వనిచేయు. పారి. 4.63.

మొఱక చూ. మొఱ్ఱి. వి. 1. మొక్క, మొన, వాడి. వేంక. పంచ. 4.540 ; 2. న్యూనత, తక్కువతనం ; విణ. న్యూనం, తక్కువైంది.

మొఱకడము చూ. మొఱకు.

మొఱకు రూ.చూ. మొర్కు. విణ. 1. మూర్ఖుడు. భార.విరా. 1.221 ; 2. పరుషం. గౌ.పరి.ఉ. 2269పం. ; 3. క్రూరుడు. రంగా.చ. 2.36 ; వి. ఒకానొక ఆటవికజాతి.

మొఱకతము వి. 1. దౌష్ట్యం. హరి.పూ. 9.170 ; 2. మూర్ఖత ; 3. మోటుదనం. మొఱకుఁడు రూ. చూ. మొర్కు. వి. మూర్ఖుడు. భార.ఉద్యో. 2.278. మొఱకుతనము రూ. మొరకుతనము, మొఱకుఁదనము. వి. మూర్ఖత్వం. భీమ. 4.123. మొఱకుఁదనము(-తనము) రూ.చూ. మొఱకుతనము. వి మూర్ఖత. ఉ.రా. 4.291.

మొఱఁగు స.క్రి. 1. వంచించు, మోసగించు. భార.అను. 3.101 ; 2. కప్పిపుచ్చు, మాటుపర్చు, పొందు. ఉ.హరి. 4.95 ; 3. దాగు, పొంచు ; వి. 1. వంచన, మోసం. వేంక. పంచ. 4.466 ; 2. మోసపుపలుకు, వంచనావచనం. విష్ణుపు. 6.226 ; విణ. మొరపెట్టేవాడు. భాగ. 8.87.

మొఱఁగుడు వి. వంచన, మోసం. ఆం.భా.292.

మొఱటు రూ.చూ. మొరటు. విణ. మూర్ఖమైన ; వి. మూర్ఖుడు. మొఱటుతనము రూ.చూ. మొరటుతనము. వి. మొరకతనం.

మొఱపు చూ. మొఱ. వి. మొర్ర, ఆర్తధ్వని.

మొఱమొఱ చూ. మొఱ. వి. 1. బట్టలు మొ. వాటి మోతకను కరణం. ద్వి. పరమ. వి. 2.56పం ; 2. కోపవికారం, చిరచిర.

క. మొరె. గట్టిగా అరుచు, కేకలుపెట్టు ; త. ముఱుముఱు(-ప్పు-, -ట్టు), మొఱుమొఱు(-ప్పు-, -ట్టు-), మొరుమొరు(-ప్పు-, ట్టు-). గొణుగు, అస్పష్టంగా మాట్లాడు ; మ. ముఱుముఱుక్క. గొణుగు ; కో. ముర్గ్. గుర్రుమనేధ్వని, గుర్రుమను ; తొ. ముఱ్క్. గుర్రుమనే ధ్వని, గుర్రుమను ; గోం. మొహ్‌చానా, ముహ్వాన, ముహ్‌చానా, మొహ్‌చన. బట్టలు మొ. వాటి మర్మర ధ్వని ; కుయి. ముస్క. బట్టలు మొ. వాటి మర్మరధ్వని ; కువి. మోఖలి, ముర్హనై. అరచు ; పో.చూ. త. మురల్.

మొఱమొఱలాడు అ.క్రి. మొరమొర అని ధ్వనిచేయు. < మొఱమొఱ +-లు+ఆడు.

మొఱయిక చూ. మొరయు.

మొఱయించు చూ. మొఱయు.

మొఱయు రూ.చూ. మొరయు. అ.క్రి. ధ్వనిచేయు. మల్లు. 2.89.

మొఱయిక రూ.చూ. మొరయిక. వి. ధ్వని, మోత. మల్లు. 2.89. మొఱయించు రూ.చూ. మొరయించు. స.క్రి. మోగించు, ధ్వనింపచేయు. రాజవా. 3.9. < మొఱయు +-ఇంచు³.

మొఱవ విణ. వాడిచెడిన, మొక్కవోయిన.

మొఱవవోవు(-పోవు) అ.క్రి. 1. క్షీణించు. కాశీ. 6.83 ; 2. వాడి చెడినదగు, మొక్కవోవు. సిం.నార. 4.

మొఱవంక రూ.చూ. మొరవంక. విణ. వంకరైన.

మొఱవంకకడియము రూ.చూ. మొరవంక కడియము. వి. వంకీ, రెట్టకడియం.

మొఱవు చూ. మొఱమొఱ. రూ.చూ. మొఱుఁగు. అ.క్రి. 1. (కుక్క) కూయు, అరచు ; 2. పేలు, ప్రలాపించు.

మొఱసడము చూ. మొఱ. వి. ఉడుపకుక్క. ఉడుములు మొ. వాటిని వేటాడేకుక్క. మను. 4.41.

క. మొఱె. అరచు, దుఃఖించు.

మొఱసరాయి రూ.చూ. మొరసరాయి. వి. అబ్బుగుల్ల, సున్నం రాయి.

మొఱి. రూ.చూ. మొఱ్ఱి. విణ. మొర్రి, అంగవిహీనత.

మొఱిక వి. చిన్నగుంట, దొరువు.

మొఱికి రూ.చూ. మొఱ్ఱి. విణ. మొర్రి, అంగలోపం.

మొఱుఁగసాగుమెకము చూ. మొఱుఁగు.

మొఱుఁగు చూ. మొఱమొఱ. రూ. మెఱువు. అ.క్రి. 1. పేలు, ప్రలాపించు. భార. ఆది. 5.234 ; 2. (కుక్క) కూయు, అరచు. భార. సభా. 2.38 ; వి. 1. కుక్కకూత, భాషణం ; 2. ప్రలాపం, పేలటం.

క. మొఱె. గట్టిగా అరుచు ; తు. మురె. అరుపు ; త. మొఱుమొఱు. గొణుగు ; మ. ముఱళుక. అరచు. బొబ్బలుపెట్టు ; కో. ముర్గ్-. గుర్రుమను ; తొ. ముర్క్. గుర్రుమను ; గోం. మొహ్వా. (కుక్కలాగా) అరచు. కుయి. ముస్క. అరుచు ; కువి. మొఝ్ఝా. అరచు.

< మూ. ద్రా. *మొఱ్- ఉంక్/-క్క-.

మొఱుఁగసాగుమెకము వి. వేటకుక్క. మొరగటానికి వెళ్ళే జంతువు. మొఱుఁగుడు చూ. మొఱమొఱ. వి. కుక్క

కూత, భషణం.

**మొఱుములు** చూ. మొర్మ. వి.బ.వ. చేటతో తనవైపు కోడగా వచ్చిన పెద్దగింజలు, నూకలు మె. వి.

**మొఱవు** చూ. మొఱమొఱ. రూ.చూ. మొఱుఁగు. అ.క్రి. 1. (కుక్క) కూయు, అరచు ; 2. పేలు, ప్రలాపించు ; వి. 1. కుక్కకూత ; 2. ప్రలాపం, పేలటం.

**మొఱో** రూ.చూ.మొఱ్రో. వి. (భయదుఃఖాదులతోచేసే) ఆర్త ధ్వనికి అనుకరణం. కాశీ. 7.89.

**మొఱ్ఱ**[1] రూ.చూ. మొఱ. వి. ఆర్తధ్వని. పరమ. 4.110.

**మొఱ్ఱపెట్టు** రూ.చూ. మొఱపెట్టు. అ.క్రి. మొరపెట్టు.

**మొఱ్ఱ**[2] రూ.చూ. మొఱ్ఱి. వి. 1. అంగలోపం ; 2. తక్కువ.

**మొఱ్ఱ**[3] వి. జిగురు పదార్థాన్నిచ్చే ఒకరకం చెట్టు.

**మొఱ్ఱి** రూ. మొరి, మొరిక, మొఱ్రి, మొఱ్రు, మొఱి, మొఱిక మొఱ్ఱ[2], మొఱ్ఱీ. విణ. 1. న్యూనం ; (సందర్భాదుల)కొరత ఉన్నది. మృత్యు. 2.32 ; 2. అవయవలోపం కలది, మొరి, వి. అంగన్యూనత. ఆం. భా. 2.124.

కురు. ముఱ్రా. మొండికోక.

**మొఱ్ఱిపడు** అ.క్రి. అంగలోపం కలుగు. **మొఱ్ఱిపోవు** రూ.చూ. మొఱ్ఱివోవు. అ.క్రి. అవయవలోపం కలదగు. **మొఱ్ఱివోవు (-పోవు)** రూ. మొఱ్ఱిపోవు. అ.క్రి. అవయవలోపం కలదగు.

**మొఱ్ఱీ** రూ.చూ. మొఱ్ఱి. వి. అంగన్యూనత, మొఱ్రి.

**మొఱ్ఱో** రూ. మొఱో. వి. (భయదుఃఖాదులతో చేసే) ఆర్త నాదాని కనుకరణం. భీమ. 4.121.

**మొల**[1] చూ. ముల్లు. రూ. మల[2], మళ. ముల. వి. 1. చీల, కీలం. కు.సం. 9.149 ; 2. త్రాసుముల్లు, తక్కెడ ముల్లు ; 3. నాడెలో పేకదారం కండెగుచ్చే ఇనపపుల్ల ; 4. డిజైన్లు నేసే మగ్గంలో పేటుదారాల వడులకు బరువు కోసం కట్టిన ఇనపపుల్ల ; 5. ఉన్నిమగ్గం దోనుగ గాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల ; 6. గొంగడి మగ్గంలో జంత్రం పైకట్టెకు కిందిపట్టెకు బిగించిన మేకు ; 7. తివాసీ మగ్గంపై దోనెకు పడుగు పట్టెలను కట్టటానికి బిగించిన మేకు ; 8. ఆనుపీటలకు దిగగొట్టిన నిలువపుల్ల ; 9. అడ్డగుమ్మి ఇరుసుకొన ; 10. వాటల్ని కోయటానికి వాడే కొంత లావుపాటి కమ్మి ; 11. కర్రను అరుకు బిగించే ఇనపకొండి ; 12. తలబుడిపె లేని లావుఇనపచీల ; 13. నాగలికర్రను ఇమిడ్చే చీల ; 14. రాతిని చెక్కే సాధనం ; 15. రాతిని చీల్చటానికి చెక్కటానికి పనికివచ్చే పరికరం ; 16. మొనగల ఇనప లేక కొయ్యముక్క ; 17. తికటీ కాలికింద నాటిన ఇనపముక్క ; 18. సారెకు మధ్య ఉంచే కర్రమేకు ; 19. కొయ్యతో చేసినమేకు ; 20. గందపృట్టెల మీద బలానికి, అందానికి నాటిన గుండ్రటి మేకు ; 21. తొలిచిన సన్నటి రంధ్రం.

**మొలకట్టు** వి. కర్రను అరుకు బిగించే ఇనపకొండి. **మొలకొలికి** రూ. చూ. మొలగులికి. వి.బ.వ. ఒకరకం సస్య విశేషం. **మొలకొలుకులు** రూ.చూ. మొలగులికలు. వి.బ.వ. నెల్లూరు, రాయలసీమ ప్రాంతాల్లో పండించే మంచిరకం వడ్లు. **మొలగులికలు** రూ. మొలకొలుకులు. వి.బ.వ. 1. సస్యవిశేషం ; 2. ధాన్య విశేషం. **మొలగులికి (-కులికి)** రూ. మొలకొలికి. వి. 1. సస్య విశేషం ; 2. ధాన్యవిశేషం. **మొలత్రాసు** వి. ముల్లుగల త్రాసు. హంస. 2.181. **మొలయిచ్చు (-ఇచ్చు)** అ.క్రి. మేకులు బిగించు.

**మొల**[2] వి. నడుం, కటిప్రదేశం. భార. విరా. 1.275 ; 2. కట్టుబట్ట. దశా. 9.135.

పర్జి. ముల్కబూల. నడుం ; కొలా. ముల్కె. వెనుక. నడుం, కటిప్రదేశం ; నా. ముల్కె. నడుం, కటిప్రదేశం ; బ్రా. ముఖ. నడుం, కటిప్రదేశం.

**మొలకట్టు**[1] వి. 1. మొలతాడు, కటిసూత్రం. దశా. 2.184, చెన్నబసవ. 5.328 ; 2. కట్టుకోక, అంతరీయం. చంద్రాంగ. 2.39. **మొలకత్తి** వి. బాకు, మొలను చెక్కుకొనే కత్తి. శగా. 5.14. **మొలకిడియమ్ము (-అమ్ము[1])** వి. మొలలో దోపుకొనే గుజ్జుకోల. **మొలగుంజ** వి. గానిగకట్టె తిరగటానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప. **మొలచుట్టు** వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ వేసినగీత. **మొలతాడు** రూ.చూ. మొలత్రాడు. వి. 1. మొలకి కట్టుకొనేతాడు ; 2. రాట్నం ఆకులకి చుట్టిన తాడు ; 3. వరిగడ్డి తాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ వేసేగీత ; 4. పంటెతల చిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు ; 5. గూడు నడుంకు అటూఇటూ కట్టినతాడు. **మొలతాడుకైవారం** వి. పరిధి. **మొలతాడుపెండి** వి. గుండు పెండి, గుండ్రంగాఅల్లిన పెండె. **మొలత్రాడు** రూ. మలతాడు. మల్తాడు, మొడతాడు, మొడతాలు, మొలతాడు మొల్తాడు. వి. ఔ. కటిసూత్రం, మొలకి కట్టుకునే తాడు. పండి. చ. 2.100, **మొలదట్టి** వి. 1. మొలకు కట్టుకునే కాసె ; 2. లంగోటి. **మొలదారం** వి. రాట్నం ఆకులకు చుట్టేదారం. **మొలనూలు** వి. ఔ. 1. వడ్డాణం. కు. సం. 1.52 ; 2. స్త్రీలు అలంకారార్థం ధరించే కటిసూత్రం, రశన. విక్ర. 8.39. **మొలనూలు గట్టివడు (-పడు)** అ.క్రి. సులభంగా వశమగు. ప్రభా. 5.120. **మొలపంచ** వి. ధోవతి. **మొలపూస** వి. మొల తాడులో కట్టేపూస, బాలుర కటిసూత్రంలో గుచ్చే బంగారు మొ. వాటి ఘుటిక. తాళ్ల. సం. 7.9. **మొలపేగు** వి. పాత్రల్ని వాడేటప్పుడు బట్టలమీద మట్టినీళ్ళు పడకుండా కమ్మరి చుట్టుకునే పాతబట్ట. **మొలబరిణ** వి. సారెమొల బిగింపుకు సారెపలక కింది భాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణె కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. **మొలబిళ్ల** వి. ఆడపిల్లలకు మొలకి కట్టేబిళ్ల. **మొలలోచేయిపెట్టు** అ.క్రి. బలవంతంగా డబ్బులాగు. **మొలలోచేయివేసినిలవేయు** అ.క్రి. బొడ్డులో చెయ్యివేసి నిలవేయు. **మొలవంకి** వి. మొలలో పెట్టుకునే కత్తి. చంద్రాంగ. 2.57. **మొలవడి** రూ.చూ. మొలవిడి. వి. గిట్టల సందున లేచేపుండు. **మొలవిడి** రూ. మొలవడి. వి. పశురోగ విశేషం. నవనాథ. 1.41పు. 3పం. **మొల్తాడు**[1] రూ. చూ. మొలత్రాడు. వి. 1. పంటెతలచిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టిన తాడు : 2. రాట్నం ఆకులకు చుట్టిన తాడు. **మొల్తాడుకసీదా** రూ. మొల్తాడుకస్సిద. వి. మొల తాడు మాదిరిగా అంచులో నేసిన డిజైను. **మొల్తాడుకస్సిద**

రూ.చూ. మొల్తాడుకసీదా. వి. మొలతాడు మాదిరిగా అంచులో నేసిన డిజైను.

మొల$^{3}$ రూ.చూ. మల$^{3}$. వి. **1**. సరి చెయ్యటానికి చాపిన పడుగు ; **2**. పడుగేరే కర్రలమీద నెరిపిన పడుగు ; **3**. అచ్చుతికిన పడుగు ; **4**. నేతకు సిద్ధంచేసి చుట్టిన పడుగు ; **5**. మగ్గానికి అమర్చి నేత బయలులో చాపిన పడుగు నూలు ; **6**. పడుగు పాయకు చివర వేసిన ముడి, మెలిక.

మొలకచ్చి రూ.చూ. మలకచ్చి. వి. సరి చేసిన పడుగులో అనికి దగ్గరగా నాకలు చేర్చిన కచ్చి. మొలకట్టు$^{2}$ రూ.చూ. మలగట్టు. అ.క్రి. **1**. అచ్చుతికి చాపిన పడుగులో చివరి పాయలు కట్టు ; **2**. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు ; వి. పన్నె కట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి. మొలకర్ర రూ.చూ. మలగర్ర. వి. నేత మడుగులో చివరి పాయలు బిగించిన కర్ర. మొలగట్టు (-కట్టు) రూ.చూ. మలగట్టు. అ.క్రి. **1**. అచ్చుతికి చాపిన పడుగులో చివరి పాయలు కట్టు ; **2**. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు ; వి. పన్నె కట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి. మొలగుది రూ.చూ. మలగుది. వి. **1**. నేత పడుగులో చివరి పాయకు కట్టిన దారం ; **2**. పెదకోలకు తగిలించే మలగర్ర. మొలచివ్వ రూ.చూ. మలచివ్వ. వి. నేత పడుగులో చివర పెట్టిన సన్నని బెత్తం. మొలచేయు రూ.చూ. మలజేయు. స.క్రి. **1**. పడుగు పోగులు సాపు చేయు ; **2**. ఏరిన పడుగుచుట్టు ; **3**. పడుగేరిన తరవాత అవి చివరికి జరుపు. మొలజాపు (-చాపు) రూ.చూ. మలజాపు. స.క్రి. **1**. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచేయు ; **2**. మగ్గం బయలులో పడుగు చాపు. మొలబద్ద రూ.చూ. మలబద్ద. వి. నేత పడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద. మొలమగ్గం రూ.చూ. మలమగ్గం. వి. **1**. మగ్గంమీద పడుగులో చివరిభాగం కర్రలకు చుట్టి నేసే మగ్గం ; **2**. మగ్గంమీది పడుగులో చివర, పొట్టెలు కట్టి నేసే మగ్గం. మొలలగుంత వి. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి తీసిన చిన్న గొయ్య. మొలసుట్టు (-చుట్టు) రూ.చూ. మలచుట్టు. స.క్రి. అల్లు చేసిన పడుగును మలలుగా విడదీసి చుట్టు. మొలసుట్టుకర్ర (-కఱ్ఱ) రూ.చూ. మలచుట్టకర్ర. వి. నేత పడుగులో చివరి పాయలు బిగించిన కర్ర. మొలసేయు (-చేయు) రూ.చూ. మలజేయు. స.క్రి. **1**. పడుగు పోగులు సాపుచేయు ; **2**. ఏరిన పడుగు చుట్టు ; **3**. పడుగేరిన తరువాత అవి చివరికి జరుపు. మొల్తాడు$^{2}$ రూ.చూ. మలతాడు. వి. అచ్చుతికిన పడుగులో చివర పొట్టెలు ముడుల వెంబడి దూర్చిన దారం. < మొల$^{3}$ + త్రాడు. మొల్తాడుగోలెం వి. జాడి మొ. వాటికి పైభాగంలో అంచు కింద చుట్టూ అలంకారంగా పెట్టిన గొలుసుకట్టు. మొర్రాయి రూ. మొర్రాయి. వి. సారె మొలను దించటానికి రంధ్రం ఉన్న నల్లరాయి. < మొల$^{3}$ + రాయి. మొర్రాయి రూ.చూ. మొర్రాయి. వి. సారె మొలను దించటానికి రంధ్రంఉన్న నల్లరాయి.

మొల$^{4}$ రూ.చూ. మొలక. వి. మొలక, నాటుకున్న గింజ పగిలి పైకి వచ్చే భాగం.

మొలతెంచు అ.క్రి. కలుగు, పుట్టు. కు.సం. 3.108. మొలతేరు స.క్రి. పుట్టు, కలుగు. మొలలిచ్చు అ.క్రి. మొలకలెత్తు. కు.సం. 9.149. < మొల$^{4}$ + -లు + ఇచ్చు. మొలవడి వి. పైరు కోసిన తరవాత చేలల్లో రాలిన గింజలు వానకు మొలచిన మొలకలు. మొలవేయు స.క్రి. నాటు.

మొలక చూ. మొలచు.

మొలకకట్టు చూ. మొలచు.

మొలకకాయ చూ. మొలచు.

మొలకకుంపటి చూ. మొలచు.

మొలకకెంపు చూ. మొలచు.

మొలకచీని చూ. మొలచు.

మొలకతెగులు చూ. మొలచు.

మొలకతొట్టి చూ. మొలచు.

మొలకనవ్వు చూ. మొలచు.

మొలకబంగారు చూ. మొలచు.

మొలకబారు చూ. మొలచు.

మొలకబేడలు చూ. మొలచు.

మొలకయెత్తు చూ. మొలచు.

మొలకలపున్నమ చూ. మొలచు.

మొలకలపున్నమి చూ. మొలచు.

మొలకలు రూ.చూ. మొలకొలుకులు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

మొలకలెత్తు చూ. మొలచు.

మొలకాలు వి. కుక్కగొయ్యలమీద మోసే కదురు.

మొలకులపేటు వి. జరీతోగాని కృత్రిమపట్టుతోగాని వరసగా 2-6 పోగులతో గీరలు నేసిన డిజైను.

మొలకెత్తు చూ. మొలచు.

మొలక్కుంపటి చూ. మొలచు.

మొలగ వి. ఒకజాతి చెట్టు. పి.శకు. 2.14.

సం. మూలక-. ముల్లంగి.

మొలచు రూ. మొలుచు$^{2}$, మొల్చు$^{1}$. అ.క్రి. **1**. వృక్షాది. స్థావరాలు పుట్టు, జనించు. కు.సం. 7.19 ; **2**. సంతోషాది మనోధర్మాలు పుట్టు, జనించు. నిర్వ.రా. 8.132 ; **3**. ప్రాప్తించు, సంభవించు. పండి. చ. 2.109 పు. ; **4**. మానవాది జంగాలు. భాగ. 1.7 ; **5**. ఆవిర్భవించు, ప్రత్యక్షమగు. కకుత్స. 3.45.

క. ముళె. మొలచు ; తు. ముళెయుని, ముళెవుని, ముళియుని ; త. ముళై ; మ. ముళెక్క ; గోం. మోడి- (-య్-, -త్-) ; కుఇ. ముఈర-, ముఈర్.

మూ.ద్రా. *మూళ్-, ముళ్-వ్-/మూణ్.

మొలక రూ. మలక, మొక్క, మొల$^{4}$, మొల్క, మొల్ల$^{3}$. వి. **1**. అంకురిత బీజం, మొలకెత్తిన విత్తు. కు.సం. 8.173. భార.విరా. 5.60 ; **2**. అంకురం, మొక్క. శృం.నై. 6.82 ; **3**. వ్రణంలోని దుర్మాంస విశేషం. భీమ. 1.4 ; **4**. మూలవ్యాధి, అర్శం అం.భా. 2.182 ;

**5.** అరటి పిలక, పెద్ద అరటిచెట్టు పక్కన మొలచిన మొక్క ; విణ. **1.** లేత, చిరత, చిన్న ; **2.** పదునైన, మొనదేలిన. క. మొళె. బీజం, మొగ్గ, మొలక, అంకురం, లేతకొమ్మ ; తు. ముళియుని, ముళెయుని, ముళెవుని, మొళెవువి. మొలక, అంకురం ; త. ముళై (-వ్-, -న్ద్- ; -ప్ప్-, -ట్ట్-). బీజం, మొలక ; మ. ముళ్. మొలక, బీజం, అంకురం ; గోం. మొరియానా. అంకురం, మొలక ; పో.చూ. సం. మూలికా. ఓషధి. **మొలకకట్టు** స. క్రి. మొక్కకట్టు, మళ్ళల్లో చల్లటం కోసం విత్తనాలు మొలకెత్తటం కోసం తడిపి మడి కట్టటం. చెన్నబసవ. 5.328. **మొలకకాయ** వి. నల్లవార్తాకి, నల్లవంకాయ (Solanum hisutum). **మొలకకుంపటి** రూ. మొలక్కుంపటి. వి. మొలకల పున్నమప్పుడు మొలక పోసి పండుగ చేసుకోవటానికి వాడే మట్టి కుంపటి. **మొలకకెంపు** వి. రత్నాంకురం, లేత కెంపు. రఘునా. 7 పు. 13 పం. **మొలకచీని** వి. నారింజ భేదం (Linonia frifoliata). **మొలకతెగులు** వి. మూలవ్యాధి, మొలలజబ్బు **మొలకతొట్టి** వి. మొలకల పున్నమప్పుడు మొలక పోయటానికి వాడే కుంఫటి. **మొలకనవ్వు** వి. చిరునవ్వు. శృం.నై. 2.26, హర. 5.40. **మొలకబంగారు** వి. పుట్టల్లో పురుగుల వల్ల కలిగే బంగారం, పుట్టబంగారం. **మొలకబారు(-పాఱు[3])** అ.క్రి. మొలకెత్తు. **మొలకబేడలు** వి.బ.వ. నీటిలో నానబెట్టి పొట్టుతీసిన కాయధాన్యాల దళాలు. బ్రహ్మో. 3.330. **మొలకయెత్తు(-ఎత్తు[1])** రూ.చూ. మొలకెత్తు. స.క్రి. మొలచు. **మొలకలపున్నమ** రూ.చూ. మొలకల పున్నమి. వి. వైశాఖమాసంలో పున్నమనాడు స్త్రీలుచేసే పండుగ. **మొలకలపున్నమి** రూ. మలకల పౌర్ణమి, ములకలి పున్నమి, మొలకల పున్నమ, మొల్కలపున్నమి. వి. శ్రీరామ నవమి తరవాత వచ్చే పౌర్ణమి, వ్యాసపూర్ణిమ. **మొలకలెత్తు** అ.క్రి. కలుగు, అంకురించు. పాండు. 4.207. < మొలక + -లు + ఎత్తు[1]. **మొలకెత్తు** రూ.చూ. మొలకయెత్తు. అ.క్రి. కలుగు, అంకురించు. < మొలక + ఎత్తు[1], **మొలక్కుంపటి** రూ.చూ. మొలకకుంపటి. వి. మొలకల పున్నమప్పుడు మొలకపోసి పండుగ చేసుకోవటానికి వాడే మట్టికుంపటి. < మొలక + కుంపటి. **మొలపించు** స.క్రి. మొలిచేటట్లుచేయు. కళా. 1.92. < మొలచు + -ఇంచు[3]. **మొలవఁబెట్టు** స.క్రి. నాటు. కు.సం. 7.19. < మొలచు + -అఁ + పెట్టు.

**మొలపించు** చూ. మొలచు.

**మొలవ[1]** చూ. మొలచు. వి. అంకురం, మొక్క. ఆం.భా. 2.35.

**మొలవ[2]** రూ. మలవ[2]. వి. మాగాణిలో ఎక్కువగా పెరిగే గడ్డి.

**మొలవఁబెట్టు** చూ. మొలచు.

**మొలాజమతు** వి. ఆశ్రయించటం. రంగా.న. 2.89.

హిం.ఉ. మిల్‌నా. కలియటం, జమాత్. మనుష్య సమూహం.

**మొలామ** వి. కలంగడిపండు.

ఇం. *Melon*. పుచ్చకాయ ;

త. మొలాన్.

< ఇం. Melon.

**మొలామపండు** వి. ఒకరకం పుచ్చకాయ.

**మొలాము** రూ.చూ. మోళము. వి. **1.** బంగారు, వెండి మొ. వాటి పూత ; **2.** పుళ్ళకు పూసేమందు.

**మొలికి** రూ.చూ. ముల్కి. వి. **1.** ఉన్ని కదురు ఊచకు బిగించిన మేకు ; **2.** కందిగింజంత ఉరువున అడ్డంగా మూడు కొలుకులు నేసి దానికిపైన నిలువుగా రెండు కొలుకులు ఒకరకం డిజైను ; **3.** గానుగమొద్దు మధ్య నాటిన మేకు.

**మొలిచిపోవు** చూ. మొలుచు[2].

**మొలిపించు** చూ. మొలుచు[2].

**మొలుగు** రూ. మొల్గు, మోలుగు. వి. వృక్షవిశేషం, మద్దిచెట్టు. వేంక. పంచ. 4.522. (Morinder tinctoria).

**మొలుగుతీగ** వి. కొండల్లో పెరిగే తీగ (Morinda umbellata).

**మొలుచు[1]** రూ.చూ. మలుచు[1]. స.క్రి. **1.** చెక్కు, తరిమెన పెట్టు ; **2.** చేయు, కల్పించు ; **3.** బియ్యం మొ. రాళ్ళు పోయేట్లు చేటలో బాగుచేయు ; **4.** మందలో అమ్మిన గొర్రెలకు గుర్తుగా రోమాలు కత్తిరించు.

**మొలుపు[1]** వి. రాతిని చెక్కటం.

**మొలుచు[2]** రూ.చూ. మొలచు. అ.క్రి. విత్తినగింజ మొక్కగా పరిణమించు.

**మొలిచిపోవు** అ.క్రి. మొలకెత్తు. < మొలుచు[2] + -ఇ[13] + పోవు. **మొలిపించు** స.క్రి. మొలవజేయు. < మొలుచు[2] + -ఇంచు[3]. **మొలుపు[2]** వి. మొలక, భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం. **మొలుపుజూపు(-చూపు)** అ.క్రి. స్ఫోటకంపోయు. **మొలుపుపదును** వి. మొలకలు మొలవటానికి చాలినంత తడి.

**మొలుపు[1]** చూ. మొలుచు[1].

**మొలుపు[2]** మొలుచు[2].

**మొలుపుజూపు** చూ. మొలుచు[2].

**మొలుపుపదును** చూ. మొలుచు[2].

**మొలుమలు** రూ.చూ. ముఖమల్లు. వి. ఒకవిధమైన నాణ్యమైన గుడ్డ.

**మొలుము** వి. రాతిలోకి గుండ్రంగా ఉండే పెచ్చు.

**మొలుసు** రూ.చూ. మలుచు. స.క్రి. రాతినిచెక్కు.

**మొల్క** రూ.చూ. మొలక. వి. **1.** చిన్నభాగం. భీమ. 1.68 ; **2.** అంకురం, మొక్క. ఇందు. ప. 17 ; **3.** మూలవ్యాధి, అర్శం ; **4.** వ్రణంలోని దుర్మాంస విశేషం ; విణ. లేత, చిరుత, చిన్న. భీమ. 1.94.

**మొల్కబోయు(-పోయు)** స.క్రి. మొలకకోసం వడ్లుపోయు. **మొల్కలపున్నమి** రూ.చూ. మొలకలపున్నమి. వి. శ్రీరామ నవమి తరవాత మార్చి నెల్లో వచ్చే పౌర్ణమి.

**మొల్కి** రూ.చూ. ముల్కి. వి. **1.** ఉన్నికదురు ఊచకు కింద బిగించిన మేకు ; **2.** కందగింజంత ఉరువున అడ్డంగా మూడు కొలుకులు నేసి దానికిపైన నిలువుగా రెండు కొలుకులు నేసిన ఒకరకం డిజైను.

**మొల్గు** రూ.చూ. మొలుగు. వి. వృక్షవిశేషం. హంస. 4.135.

**మొల్చు[1]** రూ.చూ. మొలచు. అ.క్రి. మొలుచు.

**మొల్చు[2]** రూ.చూ. మలచు[1]. స.క్రి. రాతినిచెక్కు.

మొల్లాడు[1] చూ. మొల[2].

మొల్లాడు[2] చూ. మొల[3].

మొల్లాడుకసీదా చూ. మొల[2].

మొల్లాడుకస్సిద చూ. మొల[2].

మొల్లాడుగోలెం చూ. మొల[3].

మొల్రాయి చూ. మొల[3].

మొల్ల[1] వి. కుందలత, బొడ్డుమల్లె, బొడ్డుమల్లెపువ్వు. కు.సం. 4.83. (Jasminum auriculatum).

క. మొల్లె, మొళ్ళె. బొండుమల్లె; త. ముల్లై. మల్లె (Jasminum Sambac); మ. ముల్ల. మల్లె;

పో.చూ.సం. మల్లికా, మల్లీ. మల్లె.

మొల్లతీఁగె వి. కుందలత. మొల్లమ్రాను వి. వృక్షవిశేషం. హంస. 4.11. మొల్లవెదురు వి. నదనపు వెదురు. మొల్ల సుగంధి విణ. మొల్లపువ్వులాంటి పరిమళంకల. విష్ణుపు. 2.233.

మొల్ల[2] రూ.చూ. మూల. వి. కుని, చేలో కోసుగాఉన్న ఒక మూల.

మొల్ల[3] రూ.చూ. మొలక. వి. నాటుకొన్న గింజ పగిలి పైకి వచ్చే భాగం, చిన్నమొలక.

మొల్ల[4] రూ.చూ. ములు. వి. గద్దగోరును తగిలించే వలయం,

మొల్లం వి. గూడతో పొలాలకు నీరుతోడే గుంట.

మొల్లంమాను వి. సిడె (మనిషితొక్కే ఏతంకొయ్య)ను మోసే పంగల గుంజ.

మొల్లమి[1] రూ.చూ. మొల్లము[1]. విణ. సాంద్రం, దట్టమైంది, తరచైంది. శివ. సా. 449; వి. 1. వర్గం, గుంపు. రామాభ్యు. 7.135; 2. సాంద్రత, తరచు. కళా. 6.224.

మొల్లమిగా రూ. మొల్లముగా క్రి.విణ.ద్రు. దట్టంగా, దండిగా, విస్తారంగా. మను. 3.39.

మొల్లమి[2] రూ.చూ. మొల్లము[2]. వి. 1. ధనం. విష్ణుపు. 7.103; 2. వెల; 3. పందెం.

మొల్లము[1] రూ. మొల్లమి[1]. విణ. 1. అధికం, హెచ్చు. భాస్క. రా.యు. 1.374; 2. సాంద్రం, దట్టమైంది. కృ.శకు. 2.220. వి. 1. పెంపు, అతిశయం. కాశీ. 7.185; 2. తరచు, సాంద్రత. మను. 4.37; 3. మొత్తం, గుంపు. పాండు. 5.261.

మొల్లముగా రూ. చూ. మొల్లమిగా. క్రి.విణ. దట్టంగా. దండిగా, విస్తారంగా. మొల్లమైన విణ. విస్తారమైన, అనేకమైన, విష్ణుపు. 2.11. <మొల్లము[1]- + అగు + -ఇ[12] + -న[1].

మొల్లము[2] రూ. మొల్లమి[2]. వి. 1. ధనం. భార. సభా. 2.194; 2. వెల; 3. పందెం.

సం. మూల్య-. వెల, ధర.

<సం. మూల్య-.

మొల్లమైన చూ. మొల్లము[1].

మొల్లా రూ. ముల్లా. వి. 1. న్యాయాధిపతి. ద. హిం. శా. సంపు. శా. సం. 753. క్రీ.శ. 1600; 2. మహమ్మదీయ పురోహితులుచ్చరించే మంత్ర విశేషం. చంద్రాంగ. 4.208.

హిం. ఉ. ముల్లా. ముస్లిం పండితుడు.

<ఉ. ముల్లా.

మొల్లాము రూ.చూ. మోళము. వి. 1. బంగారు, వెండి మొ. వాటిపూత. ద్వి. పరమ. వి. 3.146; 2. పుళ్ళకుపూసే మందు.

మొల్లి వి. 1. గుంట. ఆం. సా. ప. ప. సంపు. 24. సం. 1.; 2. చిన్నపిల్ల; 3. కుని, దున్నేటప్పుడు చేలో మూలగా వచ్చిన భాగం, చేలో కోసుగా ఉన్నభాగం.

మొల్లిచాలు వి. కునిచాలు, వంకరగా వచ్చినచాలు.

మొల్లుతీగ చూ. మొల్లు[1]. వి. నదీతీరాల్లో పెరిగి సువాసనగల పచ్చనిపూలు పూసే తీగ (Caesalpinia nuga).

మొల్వాట చూ. మొలక. వి. మొలక, అంకురం.

మొళ రూ.చూ. ములు. వి. చిన్నసైజు లోహపుమేకు.

మొళ్రాయి చూ. మొల[3].

మొవము రూ.చూ. మొగము. వి. ముఖం. దశా. 2.273.

మొవలి రూ చూ. మొగలి. వి. మొగలి. E.I. క్రీ.శ. 1092.

మొవు రూ. మొవ్వు. వి. మోపు. కవిక. 6.209.

మొవుఖూఫు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగం నుంచి తీసివేత.

మొవుజ్జాలు రూ.చూ. ముఅజ్జల్. వి. 1. స్త్రీధనం; 2. భర్త యొక్క గృహాన్ని ప్రవేశించక పూర్వమే అడుగదగిన ధనం; 3. వివాహ విచ్ఛేద సమయంలో అడుగ తగిన ధనం.

మొవుడు రూ.చూ. మొగుడు. అ.క్రి. ముకుళించు.

మొవ్వ[1] రూ.చూ. మువ్వ. వి. గజ్జ.

మొవ్వ[2] వి. మృదువుగా ఉండే ఎన్నుపైకొన.

మొవ్వకాయ వి. పండబారిన కాయ.

మొవ్వి వి. ఒకానొకచెట్టు. పి.శ.కు. 2.14.

మొవ్వు వి. రూ.చూ. మొవు. వి. మోవు, అరటిచెట్టు మొ. వాటిలో పుట్టే మురత విడని లేత ఆకుమొలక. భాను. 2.68.

మొసడి రూ.చూ. మొసలి. వి. మొసలి. భార. ఆది. 8.148.

మొసరిక వి. మొలక, మొక్క.

మొసరు వి. పెరుగు. కు. సం. 1.12.

క. మసరు, మొసర్. పెరుగు; త. ముచర్.

<క. మొసర్.

మొసలాయి రూ.చూ. ముసలవాయి. వి. చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లో పైతూము.

మొసలి రూ. మొదలి, మొసడి. వి. మొసలి. భార. ఆది. 5.256.

క. మొసలె, మొసలి, ముదలె, మూదలె; త. ముతలై, ముతళై, ముచలి, మొసలి; మ. మతల; కో. మొచళ్; పర్జి. మోచ; కొలా. మొసెలి;

పో. చూ. సం. మాచల-. మొసలి, బల్లి.

మొసలికట్టు వి. మొసలికార్జం. మొసలికట్టుకొడవలి వి. గడ్డకొడవలి, ఒకరకం కోత కొడవలి. మొసలికన్నీరు వి. పైకి కనబరచే జాలి. మొసలికాటు వి. మొసలిముకం రూపంలో ఉన్న కత్తిపిడికొన, చిమట. ఆం. భా. 2.216. మొసలికిపడిశము వి. అసంభవం. వేంక. ఆం. 74.

మొసలిగుఱ్ఱపురౌతు వి. **1**. వరుణుడు. సాంబ. దేవ. 19; **2**. వాయుదేవుడు. మొసలిచేదు వి. మొసలికార్జం. మొసలిటెక్కెముజోదు వి. మకరకేతనుడు, మన్మథుడు. జాహ్న. 1.6. మొసలిడాలువేల్పు రూ.చూ. మొసలిడాల్వేల్పు. వి. మకరకేతనుడు, మన్మథుడు. మోసలిడాల్వేలుపు రూ.చూ. మొసలిడాల్వేల్పు. వి. మకరకేతనుడు, మన్మథుడు. మొసలిడాల్వేల్పు రూ. మొసలిడాలువేల్పు, మొసలిడాల్వేలుపు. వి. మకరకేతనుడు, మన్మథుడు. నీలా. 3.41. మొసలిదోరణము (-తోరణము) వి. మకరతోరణం. అచ్చ. రా. సుం. 101. మొసలిపట్టు వి. **1**. మకరాలయం, సముద్రం. అచ్చ. రా. యు. 16; **2**. గట్టిపట్టు. మొసలిపోగులు వి.బ.వ. మకర కుండలాలు. చంపూరా. 2.5. మొసలిరాసి వి. మకరరాశి. మొసలివా రూ.చూ. మొసలివాయి. వి. **1**. మొసలి ఆకారంలో ఉండేకత్తి, చివరిభాగం, చిమటా; **2**. మొసలికాటు. మొసలివాతమ్మంట్లు వి.బ.వ. మకరకుండలాలు, మొసలిముఖం చెక్కిన కర్ణాభరణ విశేషం. విప్ర. 5.65. మొసలివాపో(గు వి. మొసలిఆకారంలో చెవికి పెట్టుకునే ఆభరణం. మొసలివాపో(గులు వి.బ.వ. మకరకుండలాలు. అచ్చ. రా. సుం. **34**. మొసలివాయి రూ. మొసలివా. వి. **1**. మొసలి ఆకారంలో ఉండే కత్తి చివర భాగం, చిమటా; **2**. మొసలికాటు. మొసలివాయొంట్లదారి వి. మకర కుండలధారి, విష్ణువు. మొసలివాయొంట్లు వి బ.వ. మకరకుండలాలు, ఉ. రా. 280. <మొసలివాయి + ఒంట్లు. మొసలిసిడముబా(డు విశ. మన్మథుడు, మకరకేతనుడు. పి. శకు. 3.74. మొసలిసిడెముమేటి వి. మకరకేతనుడు, మన్మథుడు. మొసలిసొమ్ములు వి.బ.వ. మకరకుండలాలు. ద్వి. పరమ. వి. 2.122పు.

మొసలు వి. గోడలోకి పోయే దూలపుచివర.

మొసవల వి. చివర.

మొసాలము క్రి. విశ. పూర్తిగా, బొత్తిగా.

మొస్తరు రూ.చూ. మోస్తరు. వి. **1**. మాదిరి, నమూనా; **2**. రీతి, విధం; **3**. స్వభావం.

మొహతఫాన్ రూ.చూ. మొహతరఫా. వి. **1**. ఇళ్ళు, అంగళ్ళ వ్యావారం మీద వేసే పన్ను; **2**. అదనపుశిస్తు.

మొహతరఫా రూ. మొతరఫ, మొతర్ఫా, మొహతఫాన్. మొహతర్పా. వి. **1**. ఇళ్ళు, అంగళ్ళ వ్యాపారం మీద వేసే పన్ను; **2**. అదనపుశిస్తు.

హిం. ఉ. ముహ్‌తరిఫ: అర. మొహతరిఫ. వ్యాపారం పన్ను;

క. మొహతర్ప. గ్రామం లేదా పట్టణాల్లో దుకాణాలపై విధించేపన్ను, ఇంటిపన్ను; త. మొకతర్పా. వర్తకంమీద వృత్తులమీద వేసేపన్ను.

<ఉ. ముహ్‌తరిఫ.

మొహతర్పా రూ.చూ. మొహతరఫా. వి. **1**. ఇళ్ళు, అంగళ్ళ వ్యాపారంమీద వేసేపన్ను; **2**. అదనపుశిస్తు.

మొహతాడు రూ. మహతాడు, మొహతాదు[2], మోతాదు[2]. వి. పంటలను రక్షించేందుకు నియమించబడ్డ గ్రామ సేవకుడు.

హిం. ఉ. మహ్‌తా. గ్రామపెద్ద, క్లర్కు, లేఖకుడు.

<ఉ. మహ్‌తా.

మొహతాదు[1] రూ.చూ. మోతాదు[1]. వి. ఒకసారి ఇచ్చేమందు.

మొహతాదు[2] రూ.చూ. మొహతాడు. వి. ఊరినౌకరు, ఉమ్మడి నౌకరు.

మొహదా వి. అర్ధకత్తి, పట్టినం. మను. 4.28.

ఉ. పార. ముహ్‌దా. బహూకరించబడిన.

<ఉ. ముహ్‌దా.

మొహమల్ రూ.చూ. ముఖమల్లు వి. **1**. దళసరిగా ఉండే ఒకవిధమైన పట్టు; **2**. వెల్వెటు.

మొహమలు రూ.చూ. ముఖమల్లు. వి. మేలైన పట్టువస్త్రం.

మొహమాస్ రూ.చూ. మహమాస్. వి. కొత్తవాడు.

మొహమింతచేసికొను చూ. మొహము.

మొహము రూ.చూ. మొగము. వి. ముఖం.

మొహమింతచేసుకొను అ.క్రి. చిన్నబుచ్చుకొను.

<మొహము + ఇంత + చేయు + -ఇ[13] + కొను.

మొహర్ రూ.చూ. మొహరు వి. **1**. ముద్ర; **2**. నాణెం.

మొహరము వి. **1**. మహమ్మదీయుల పండుగ; **2**. మహమ్మదీయ సంవత్సరంలో ఒక నెలపేరు.

హిం.ఉ.అర. ముహ్‌ర్రమ్. పవిత్రమైన, నిషేధించబడ్డ, కూపావద్ద యాజీది చేత చంపబడిన అలీకుమారుడైన హుస్సేన్ జ్ఞాపకార్థంగా పవిత్రంగా భావించబడే ఒక మహమ్మదీయుల నెలపేరు;

క. మొహరమ్, మొహరమ; త. మొకరం; మ. మొహరమ్.

<ఉ. ముహ్రమ్.

మొహరా రూ.చూ. మొహరు, వి. **1**. ముద్ర; **2**. నాణెం.

మొహరి రూ.చూ. మొహరు. వి. **1**. ముప్పైచిన్నాలెత్తు బంగారునాణెం; **2**. ముద్ర.

మొహరించు రూ.చూ. మోహరించు. స.క్రి. మొనచేయు, వ్యూహం పన్ను.

మొహరీ[1] రూ.చూ. మొహరు. వి. ముప్పైచిన్నాలెత్తు బంగారునాణెం.

మొహరీ[2] రూ. మొరీ, మొహిరీ[1]. వి. **1**. సొరంగం; **2**. నీళ్ళకాలవ, తూము.

హిం. మోరీ. నీళ్ళకాలవ, తూము, జలదారి, ఆడనెమలి, చిరునవ్వు; ఉ.పార. మహ్‌రీ. కాలవ, తూము, ఇంటిమీద కురిసేవాన నీళ్ళు జారిపోయేందుకు పెంకులు దోనెలాగా పెట్టి ఉండే కాలువ;

త. మోరి.

<ఉ. ముహ్‌రీ.

మొహరు రూ. ముహురీ, మొహర్, మొహరా, మొహరి, మొహరీ[1], మొహిరి, మొహిరీ[2], మొహురి, మోరీ. వి. **1**. ముద్ర. వేణు.శ. 59; **2**. నాణెం; అ.క్రి. సీలుచేయు.

హిం.ఉ. ముహర్, మోహర్. బంగారునాణెం: మరా. మోహర్;

క. మొహర, మొహరి; త. ముకర్, మోకరా, మోర్, మోరా; మ. మొహర్. మొహర్‌చేయు.

<ఉ. మోహర్.

**మొహర్నీ** వి. ఆడవాళ్ళ చెవికి ధరించే ఒక ఆభరణం.

హిం. మోర్‌నీ. ఆడనెమలి ; ఉ. మొర్‌నీ. నెమలి, స్త్రీలు చెవికి పైభాగంలో ధరించే ఒకవిధమైన ఆభరణం.

<హిం. మోర్‌నీ.

**మొహలము** రూ. మొహళము. వి. ఒకరకం కూరాకు చెట్టు.

**మొహళము** రూ.చూ. మొహలము. వి. ఒకరకం కూరాకు చెట్టు, మోహనం.

**మొహిరి** రూ.చూ. మొహరు. వి. 1. ముద్ర ; 2. నాణెం.

**మొహిరీ[1]** రూ.చూ. మొహరీ[2]. వి. 1. సొరంగం ; 2. నీళ్ళ కాలవ, తూము.

**మొహిరీ[2]** రూ.చూ. మొహరు. వి. 1. ముద్ర ; 2. నాణెం.

**మొహురి** రూ.చూ. మొహరు. వి. ముప్పైచిన్నాలెత్తు బంగారు నాణెం.

**మోక** రూ.చూ. మొక్క[1]. వి. 1. చిన్నచెట్టు, వృక్షకం. నిర్వ.రా. 8.32 ; 2. అంకురం. ఆం.భా. 2.35 ; 3. మొగ్గ.

**మోకదిప్పకొయ్య** రూ.చూ. మోకుదిప్పకొయ్య. వి. మగ్గం మీద నేత బిగ్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య.

**మోకమాను** వి. పోలు, బండి దొలుపుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య.

**మోకమానుబండి** వి. పోలుగ్రబండి, ఒంటినొగబండి.

**మోకరరు** రూ.చూ. మొఖరరు. విణ. స్థిరపరచబడ్డది ; వి. నిశ్చయం.

**మోకరించు** చూ. మోకాలు.

**మోకాం** రూ.చూ. ముకాము. వి. ఆగేచోటు.

**మోకాటిదండె** చూ. మోకాలు.

**మోకాటిలోమెడనరముపట్టు** చూ. మోకాలు.

**మోకాబిలా** రూ.చూ. ముకాబిలా. వి. సదృశం, పోలిక.

**మోకారించు** చూ. మోకాలు.

**మోకాలిచ్చలఁజూచు** చూ. మోకాలు.

**మోకాలించు** చూ. మోకాలు.

**మోకాలిమరవ** చూ. మోకాలు.

**మోకాలిలో మెడనరమువట్టు** చూ. మోకాలు.

**మోకాలు** రూ.చూ. మ్రోఁకాలు. వి.ఔ. 1. జానువు. కు.సం. 9.102 ; 2. ఒకరకం కలుపుమొక్క.

**మోకరించు** రూ.చూ. మ్రోకరించు. అ.క్రి. మోకాళ్ళ నేలకు ఆనేటట్లు వంగు. **మోకాటిదండె** వి. 1. బండి బరువు ఎక్కువ అయినప్పుడు ఎద్దులు ముందు మోకాళ్ళపై వ్రాలి పూని లాగటం ; 2. ఎక్కువైన ప్రయత్నం. <మోకాలు +-ఇ[6]+ దండె. **మోకాటిలో మెడనరముపట్టు** రూ. మోకాలిలో మెడనరము పట్టు. అ.క్రి. అసంభవాన్ని గూర్చి చెప్పు. <మోకాలు+-ఇ[6]-+లో+మెడనరము పట్టు **మోకారించు** రూ.చూ. మ్రోకరించు. అ.క్రి. మోకాళ్ళ నేలకు ఆనేటట్లు వంగు. **మోకాలిచ్చలఁజూచు** స.క్రి. మొక్కు. తాళ్ల.సం. 17.124. <మోకాలు+ఇచ్చ+-లు+-అ[7]+చూచు. **మోకాలించు** స.క్రి. మోకాళ్ళ నేల మీదకు ఒరిగేటట్లు ముందుకొరుగు. <మోకాలు+-ఇంచు[3]. **మోకాలిమరవ** వి. మెట్టు మరీ ఎత్తుగా ఉన్న తావు. < మోకాలు +- ఇ[3]-+ మరవ. **మోకాలిలో మెడనరముపట్టు** రూ.చూ. మోకాటిలో మెడనరముపట్టు. అ.క్రి. 1. విచారం నటించు ; 2. అసంభవాన్ని గురించి చెప్పు. **మోకాళ్లబంటి** వి. మోకాలిలోతు. తాళ్ల.సం. 7.116. <మోకాలు+-లు+-అ[11]+-బంటి. **మోకాళ్ల మఱవ** వి. మెట్లు మరీ ఎత్తుగా ఉన్న తావు. <మోకాలు +-లు+-ఇ[3]-+మఱవ. **మోకాళ్లసాటు(-చాటు)** వి. మోకాళ్ళపైన కుండను పెట్టుకొని సర్సే తీరు. **మోకాళ్ల దొ్రలుపోగొట్టుకునేవయసు** వి. యౌవనం. **మోకాళ్లను బట్టతలలునుముడివెట్టనేర్చు** అ.క్రి. అసాధ్యకార్యాల్ని చేయ గలుగు. పండి.చ. 1.2. 359పు.

**మోకాళ్లబంటి** చూ. మోకాలు.

**మోకాళ్లమఱవ** చూ. మోకాలు.

**మోకాళ్లసాటు** చూ. మోకాలు.

**మోకాళ్లదొ్రలుపోగొట్టుకునేవయసు** చూ. మోకాలు.

**మోకాళ్లనుబట్టతలలునుముడివెట్టనేర్చు** చూ. మోకాలు.

**మోకు** రూ.చూ. మ్రోకు. వి. 1. లావుతాడు, తాటి మొ. చెట్లెక్కటానికి ఉపయోగించే లావుతాడు. అచ్చ.రా.సుం. 165 ; 2. పొట్టె, నాగలి, గొ్రు, గుంటక మొ. వ్యవసాయ పరికరాల్లో కాడినొగలు కలిపి కట్టే లావుపాటి తాడు ; 3. ఊడ్తెను నిలబెట్టి కింది గూటానికి బిగించేతాడు ; 4. మగ్గం మీద నేతపడుగును బిగ్రుపెట్టే లావుపాటి తాడు ; 5. నారతో పేనిన లావుపాటి తాడు ; 6. గానుగ దూలాన్ని కాడితో కలిపి కట్టే లావాటి తాడు.

**మోకుగుంజ** రూ. మోకుడుగుంజ. వి. మగ్గం మీద నేత బిగ్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య. **మోకుగుది** రూ. మోగ్గుడి. వి. పడుగు చాపేటప్పుడు ఊడ్తె అడ్డపట్టెనూ పడు గేరే కఱ్ఱనూ కలిపేతాడు. **మోకుగూటం** రూ. మోగ్గూటాం వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకుకట్టే కొయ్య. **మోకుచుట్టుకఱ్ఱ** వి. మగ్గం దగ్గర చేతిగూటానికి కట్టిన తాడులో చివరిభాగం చుట్టిన కఱ్ఱ. **మోకుడుగుంజ** రూ.చూ. మోకుగుంజ. వి. మగ్గంమీద నేత బిగ్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య. **మోకుతిప్పకొయ్య** రూ.చూ. మోకుదిప్ప కొయ్య. వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకుకట్టే కొయ్య. **మోకుతిప్పడుకొయ్య** రూ.చూ. మోకుదిప్పకొయ్య. వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య. **మోకుతిప్పడుగుంజ** వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకుకట్టే కొయ్య. **మోకుతిరుగని** విణ. మిక్కిలి లావైన. **మోకుదిప్పకొయ్య** రూ. మోకదిప్పకొయ్య, మోకుతిప్ప కొయ్య, మోకుతిప్పడుకొయ్య, మోకుదిప్పడుకొయ్య. వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకుకట్టే కొయ్య. **మోకుదిప్పడుకొయ్య** రూ. చూ. మోకుదిప్పకొయ్య. వి. మగ్గంమీద నేతబిగ్రు పెట్టటానికి మోకుకట్టే కొయ్య. **మోకుదిబ్బ** వి. నేతబయలులో చివరపాతిన కొయ్య. **మోకుదిబ్బకఱ్ఱ** వి. మగ్గంమీద నేత బిగ్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య. **మోకుపన్ను** వి. 1. ఊడ్తెను నిలబెట్టి కిందిగూటానికి బిగించే తాడు ; 2. మగ్గం

మీద నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటితాడు. మోకుపుల్ల వి. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టేకొయ్య. **మోకుబిడికొయ్య(-పిడికొయ్య)** వి. మగ్గంమీద నేతబిర్రు పెట్టటానికి మోకుకట్టేకొయ్య. మోకుబిళ్ల వి. గడ్డి, కంప మొ. బండిమీద తోపుగావేసి బిగించే మోకుల చివరన కట్టి ఉండే కొయ్యబిళ్ల. మోకుమాను(-మ్రాను) వి. బండి డొలుపులో అమర్చిన లావుపాటి పలకలకొయ్య. మోగ్గుది రూ.చూ. మోకుగది. వి. పడుగు చాపేటప్పుడు ఊత్తై అడ్డుపట్టెనూ పడుగేరే కర్రనూ కలిపేతాడు. < మోకు + గుది. మోగ్గూటాం రూ.చూ. మోకుగూటం. వి. మగ్గంమీద నేతబిర్రు పెట్టటానికి మూకుకట్టేకొయ్య. < మోకు + గూటాము.

మోకూప్ రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగం నుంచి తీసి వేయటం.

మోకూపు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోకూఫ్ రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోకూఫు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోకూబ్ రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోకూబు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోకోబు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోఖూపు రూ. చూ. మవకూపు వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోఖూబ్ రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోఖూబు రూ.చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోఖోబు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

మోగరాయి రూ.చూ. మూగరాయి. వి. దొంటురాయి, సాధారణంగా పునాదులు నింపటానికి వాడే చక్కనిరాయి.

మోగలా రూ.చూ. మొగలాయి. వి. తురుష్కదేశ నివాసి.

మోగసాలి రూ.చూ. మొగసాల. వి. మొగసాల. నె.శా. కందుకూరు శాసనం. 22. క్రీ.శ. 1237.

మోగించు చూ. మోగు.

మోగు రూ.చూ. మ్రోఁగు. స.క్రి. ధ్వనిచేయు.

మోగించు రూ.చూ. మ్రోఁగించు. స.క్రి. మోగేటట్లు చేయు. ఊదు. < మోగు + -ఇంచు³.

మోగ్గుది చూ. మోకు.

మోగ్గూటాం చూ. మోకు.

మోఁకరించు చూ. మోఁకాలు.

మోఁకరించుకొను చూ. మోఁకాలు.

మోఁకరిలు చూ. మోఁకాలు.

మోఁకరిల్లు చూ. మోఁకాలు.

మోఁకటించు చూ. మోఁకాలు.

మోఁకటించుకొను చూ. మోఁకాలు.

మోఁకటిలఁబడు చూ. మోకాలు.

మోఁకటిలు చూ. మోఁకాలు.

మోఁకటిల్లఁబడు చూ. మోఁకాలు.

మోఁకటిల్లు చూ. మోఁకాలు.

మోఁకారించు చూ. మోఁకాలు.

మోఁకాలు రూ.చూ. మ్రోఁకాలు. వి. జానువు. భార. ద్రోణ. 4.45.

మోఁకరించు రూ.చూ. మ్రోఁకరించు. అ.క్రి. మోకాళ్ళు నేలకు ఆనేటట్లు ముందుకు వంగు. < మోఁకాలు + -ఇంచు³. మోఁకరించుకొను రూ.చూ. మోఁకటించుకొను. అ.క్రి. మోకాళ్ళు నేలకానేటట్లు ముందరికొరుగు. మోఁకరిలు రూ.చూ. మోకరిల్లు. అ.క్రి. మోకాళ్ళు నేలమీదకానేటట్లు ముందుకొరుగు. మోఁకరిల్లు రూ. మోఁకరిలు, మోఁకటిలు, మోఁకటిల్లు. మ్రోకరిల్లు. అ.క్రి. మోకాళ్ళు నేల మీద కానేటట్లు ముందు కొరుగు. భార. అరణ్య. 3.329. మోఁకటించు రూ. చూ. మ్రోఁకరించు. అ. క్రి. మోకాళ్ళు నేలకు అనేటట్లు ముందుకు వంగు. మోఁకటించుకొను రూ. మోకరించుకొను. అ.క్రి. మోకాలు నేలమీదకానేటట్లు ముందరికొరుగు. మను. 4.115. మోఁకటిలఁబడు(-పడు) రూ. మోఁకటిల్లఁబడు. అ.క్రి. మోకరించు, మోకాళ్ళు నేలకానేటట్లు ముందరికొరుగు. భార. శల్య. 2.267. మోఁకటిలు రూ.చూ. మోఁకరిల్లు. అ.క్రి మోకాళ్ళు నేలమీదకానేటట్లు ముందుకొరుగు. మోఁకటిల్లఁబడు రూ.చూ. మోఁకటిలఁబడు. అ.క్రి. మోకరించు, మోకాళ్ళు నేలకానేటట్లు ముందరికొరుగు. ఉ.హరి. 3.65. మోఁకటిల్లు రూ.చూ. మోఁకరిల్లు. అ.క్రి. మోకాళ్ళు నేలమీదకానేటట్లు ముందుకొరుగు. భాగ. 10ఉ. 1305. మోఁకారించు రూ.చూ. మ్రోఁకరించు. అ.క్రి. మోకాళ్ళు నేలకు ఆనేటట్లు ముందుకువంగు. కాశ. 4.73. మోఁకాలుచిప్ప వి. మోకాలిఎముక.

మోచికొను చూ. మోచు.

మోచీవాడు చూ. మోజా. విణ. చెప్పులు చేసేవాడు.

హిం.ఉ.ఒ.బెం. ; మోచీ. చెప్పులుకుట్టేవాడు.

< ఉ. మోచీ + వాఁడు.

మోచు చూ. మోయు. స.క్రి. 1. వహించు. భార. ఆది. 2.49 ; 2. ఎత్తికొను. భార. విరా. 1.151 ; 3. అను, ఆక్రమించు. భార. ఉద్యో. 2.250 ; 4. తాకు, స్పృశించు. కాశీ. 1.91 ; 5. పోషించు. గౌ.హరి. ఉ. 2477 పం ; 6. మొదలుకొను. E. I. శా.సం. 1223. క్రీ.శ. 1434 ; 7. అంటుకొని పోవు. పారి. 4.21 ; 8. లక్ష్యంగాకొను, గురిచేయు. ప్రభా. 1.139 ; 9. పొందు. సారంగ. 2.263 ; 10. కలుగు, సంభవించు ; అ.క్రి. 1. అనుకొను. కు.సం. 7.93 ; 2. మొదలుకొను, ప్రారంభించు. మను. 5.44 ; 3. నిండు. మను. 6.111.

క. మోట్. తలపైమోయు, మోపు. బరువు. బాధ్యత ;

త.మో. (-ప్ప్-,-స్ట్-). బాధ్యత వహించు, ఎత్తుకొను ; కువి. మోచ్. ఎక్కువ బరువుమోయు ; కొలా. మోప్. బరువు.

మూ.ద.ద్రా. మూ.ద.ద్రా. *ముయ్-/ *మొయ్-.

మోచికొను స.క్రి. ఎత్తికొను, వహించు. భార. విరా. 1.155. < మోచు + -ఇ$^{11}$ + కొను. మోచువా(డు విశ. మోపుకాడు, భారవాహకుడు. మోపగు అ.క్రి. 1. బరువగు ; 2. జబ్బు ఎక్కువగు. మోపనాడు అ.క్రి. మనసుకు తగిలేటట్లుగా మాట్లాడు, తాకనాడు. తాళ్ల.సం. 4.37. < మోచు + -అ$^{7}$ + ఆడు. మోపరం$^{1}$ రూ.చూ. మోపురం$^{1}$. వి. చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి అధారంగా ఉండే పక్కభాగం. మోపరి వి. 1. భారాన్ని వహించేవాడు, బరువు మోసేవాడు, ఆము. 5.126 ; 2. బెస్త. < మోపు + -అరి$^{3}$. మోపరిగా(డు వి. నీచుడైన మోసేవాడు. పండి.చ. 1.29 పు. మోపరీ(డు వి. 1. మోసేవాడు. లక్ష్మీవి. 1.95 ; 2. బెస్త. మోపాది వి. అపాయం, ఇక్కట్టు. సం. ఆది. మొదలైన. < మోపు + సం. ఆది. మోపిక వి. 1. భారం, బరువు ; 2. మూట. మోపించు స.క్రి. మోయచేయు. భార.సభా. 1.14, కు.సం. 4.25. < మోచు + -ఇంచు$^{3}$. మోపిడు స.క్రి. 1. మూటకట్టు. బసవ. 3.88 ; 2. (విల్లు మొ. వాటిని) ఎక్కుపెట్టు. భాగ. 10.1090 < మోపు + ఇడు. మోపిళ్లు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. మోపు వి. 1. భారం, బరువు. కు.సం. 8.9 ; 2. ఎక్కు, నారిని సంధించటం. భార.విరా. 1.170 ; 3. సమూహం, గుంపు. భార.సౌప్తి. 1.16 ; 4. కట్ట. భార.అను. 3.223 ; 5. మూట. భార.అశ్వ. 1.62 ; 6. బాధ్యత, పూచి. భార.ఆరణ్య. 5.23 ; 7. మోయటం, వహనం. హరి.పూ. 5.142 ; 8. బరువైన వస్తువు. హరి.ఉ. 7.16 ; 9. పాత్రలు తీర్చటానికి సారె పలకమీద లింగాకారంగా పెట్టిన మట్టి ముద్ద ; 10. పెద్ద ప్రయత్నం ; 11. సంభోగం ; 12. కోపం ; 13. భూమిలో నాటుకొన్న గింజ పైకివచ్చే భాగం ; 14. గడ్డి కట్ట ; స.క్రి. 1. గుచ్చు, నాటచేయు, దోపు. భార.విరా. 1.175 ; 2. చేర్చు. భార.విరా. 1.247 ; 3. అనించు, అనేటట్లుచేయు. భార.శాంతి. 4.190 ; 4. లేనిది కల్పించు, ఆరోపించు. పరమ. 3.55 ; 5. వహింపచేయు, మోవచేయు. దశా. 2.197 ; 6. గర్భంచేయు ; 7. గొట్టాలను అతుకు ; 8. నగకు రాళ్ళు తాపు ; 9. అధికమగు ; విశ. అధికమైన. మోపుకట్టు రూ.చూ. మోవుగట్టు. స.క్రి. కొన్ని పనలను కలిపి పెద్ద కట్టగా కట్టు. మోపుకా(డు రూ. మోపుగా(డు. వి. భారవాహి. భార. ఉద్యో. 3.300. మోపుకొను స.క్రి. చేర్చు, పెట్టుకొను. కళా. 4.59. మోపుకొలుపు రూ.చూ. మోపుకొల్పు. స.క్రి. మోపుకొనచేయు, ఆవేశింపచేయు. మోపుకొల్పు రూ. మోపుకొలుపు. స.క్రి. మోపుకొనచేయు, ఆవేశింపచేయుహంస. 2.169. మోపుగట్టు (-కట్టు) రూ. మోపుకట్టు. స.క్రి. కుప్పలుపోయు. తాళ్ల.సం. 3.158. మోపుగా క్రి.విశ.ద్రు. మెల్లగా. < మోపు + అగు + -అ$^{7}$. మోపుగా(డు రూ.చూ. మోపుకా(డు. వి. మోపేవాడు. మోపుడుకడవ వి. నీళ్ళు మోయటానికి వాడే మట్టిపాత్ర. మోపుడుసుడి వి. మోకాళ్ళ మీద ఉండే సుడి. మోపుదల వి. 1. ఆరోపణం ; 2. బరువు, భారం ; 3. సరయిన కలయిక ; విశ. అధిజ్యం. మోపుపట్టు స.క్రి. పెద్ద పాత్రలను సర్సేటప్పుడు కొంత సహాయంగా రెండోవాడు వచ్చి పట్టుకొను. మోపుపెట్టు అ.క్రి. పచ్చిపాత్రల్ని సర్సేటప్పుడు కుండ లోపల సర్సుడు రాయికి ఆపుగా పెట్టు. మోపుమెద వి. మొయ్యటానికి వీలుగా కట్టిన గడ్డికట్ట. మోపురం$^{1}$ రూ. మోపరం$^{1}$, మోప్రం. వి. చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం. మోపురం$^{2}$ రూ.చూ. మూపురం. వి. ఎడ్ల మెడ వెనక ఎత్తుగా ఉండే భాగం. మోపురాయి వి. కుండల్ని సర్సేటప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి కమిదపై బరువుగాను కమిదకట్టుకు పోటుగా ఆపుగాను పెట్టే రాయి. మోపెట్టు స.క్రి. ఎక్కుపెట్టు, జ్యా సంధానంచేయు. భార.ఆది. 7.25. < మోపు + పెట్టు. మోప్రం రూ.చూ. మోపురం$^{1}$. వి. చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం.

మోచ్చీర్ రూ.చూ. మోతిచూరు. వి, జరీతోగాని కృత్రిమమైన పట్టుతోగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను.

మోజా వి. 1. ఒకరకం చెప్పు, మునివైపు వంకర కలిగిన తురకల పాదరక్ష. పి.శకు. 3.41 ; 2. ఆకుచెప్పులు ; 3. సమ్మాళిగలు.

హిం.ఉ. మోజా. మేజోడు ; మరా. మోజా. కాలితొడుగు, మేజోడు ; పార. ముజా, మూజ. పాదరక్ష, కాలితొడుగు, మిజహ్, మోజహ్. ముచ్చెలు ; పహ్లావి (ప్రాచీన పారశీకం). మౌచక్. పాదరక్ష ;

క. మోజా. బూటు.

< ఉ. మోజా.

మోజు వి. 1. ఇష్టం, ఆశ. వేమ. 1524 ; 2. వాంఛ ; 3. సమ్మతి.

హిం.ఉ. మౌజ్. ఆవేశం, మానసికోత్సాహం ;

క. మోజు. క్రీడ, ఆనందదర్శనం.

< ఉ. మౌజ్.

మోజ్జాలు రూ.చూ. ముఅజ్జల్. వి. 1. స్త్రీధనం ; 2. భర్తృగృహాన్ని ప్రవేశించక పూర్వమే అడుగదగిన ధనం ; 3. వివాహ విచ్ఛేద సమయంలో అడగదగిన ధనం.

మోజ్జూలు రూ.చూ. ముఅజ్జల్. వి. 1. స్త్రీధనం ; 2. భర్తృగృహాన్ని ప్రవేశించక ముందే అడుగతగిన ధనం ; 3. వివాహ విచ్ఛేద సమయంలో అడగతగిన ధనం.

మో(చెయి రూ.చూ. మో(చెయ్యి. వి. కూర్పరం.

మో(చెయ్యి రూ. మో(చెయి, మో(చేయి. వి. కూర్పరం. పండి.చ. 2.135.

క. మొళకయ్. మోచేయి ; త. ముఒన్కై. మోచేయి ; మ. ముఒన్కై. మోచేయి ; కొలా. ము-ర. మోచేయి, మొపక మోచెయ్యి. కురు. మూకా. మోచేయి, మోకాలు, ముకా. మోచేయి.

మో(చేతి[కిందగంజి[తాగు చూ. మో(చేయి.
మో(చేతి[కిందనీరు[తాగు చూ. మో(చేయి.
మో(చేతి[కిందనీళ్లు[తాగు చూ. మో(చేయి.
మో(చేతిగంజి[తాగు చూ. మో(చేయి.
మో(చేతిదెబ్బ చూ. మో(చేయి.
మో(చేతిపోటు చూ. మో(చేయి.
మో(చేతిమడుపుటిల్లు చూ. మో(చేయి.
మో(చేతిమడ్పుటిల్లు చూ. మో(చేయి.
మో(చేతిమీసము చూ. మో(చేయి.
మో(చేతివంపుటిల్లు చూ. మో(చేయి.
మో(చేయి రూ.చూ. మో(చెయ్యి. వి. కూర్పరం. పల్నా.పు. 109.

మో(చేతి[కిందగంజి[తాగు అ.[కి. ఒకరికింద [బతుకు. < మో(చేయి + -ఇ[6] + [కిందు + -అ[7] + గంజి[తాగు. మో(చేతి[కిందనీరు[తాగు అ.[కి. దీనాతిదీనంగా ఒకరిపై ఆధారపడి ఉండు. మో(చేతి[కిందనీళ్లు[తాగు అ.[కి. ఒకరి కింద బతుకు. మో(చేతిగంజి[తాగు అ.[కి. ఒకరి కింద బతుకు. మో(చేతిదెబ్బ వి. చాలా బాధాకరమైన దెబ్బ. మో(చేతిపోటు వి. మోచేతి దెబ్బ. మో(చెతిమడుపుటిల్లు రూ. మో(చేతిమడ్పుటిల్లు. వి. మోచేతి మడుపులా కట్టిన కట్టడం. మో(చేతిమడ్పుటిల్లు రూ.చూ. మో(చేతిమడుపుటిల్లు. వి. మోచేతి మడుపులా కట్టిన కట్టడం. మో(చేతిమీసము వి. ఆడవారికి ఎంతో అరుదుగా మోచేతికి పైన కుచ్చుగా ఉండే రోమరాశి. మో(చేతివంపుటిల్లు వి. రెండిళ్ళు కలిపి కట్టిన కట్టడం. మో(చేయిచూపు రూ. మో(చేయి జూపు. అ.[కి. లేదను. మో(చేయిజూపు(-చూపు) రూ.చూ. మో(చేయి చూపు. స.[కి. ఎగబెట్టు, పిల్లకాయలు ఆటల్లో నియామకానికి భిన్నంగా ఎదురుతిరిగినప్పుడు మోచేయిచూపిస్తారు.

మోట[1] వి. కపిలె, ఎడ్లను కట్టి నీరు తోడే యం[త విశేషం. ఆం.భా. 2.293.

[పా. మోట్టు-. సంచి ;

క. మొట్టె. తోలు సంచి, బంగీ, మూట.

<[పా. మోట్ట-.

మోటకట్ట వి. కుంట మొ. వాటినుంచి నీళ్ళుతోడి పోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట. మోటగూన వి. మోటబాన. మోటతాడు వి. మోట కట్టటానికి వాడే మోకు. మోటదారి వి. మోటలాగే ఎద్దులు ముందుకు వెనక్కు నడిచే ఏటవాలుదారి, మోటనుయ్యి వి. నీళ్ళుతోడటానికి మోట అమర్చిన బావి. మోటపట్టె వి. కామిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. మోటపంపు వి. మోటతోలి పారించే పొలం. మోటపారు వి. నీళ్ళు తాగేటప్పుడు బావిచుట్టూ పశువులు తిరిగే స్థలం. మోటబండ వి. మోటబావి దోనె అరకు (లోతట్టు) అడుగున వేసిన బండ. మోటబల్ల వి. నాలికబల్ల, కోడిపీటలబండి (ఒకరకంబండి)ని తోలే మనిషి కూర్చోవటానికి వీలుగా కోసి నొగదగ్గర వేసిన చెక్క. మోటబల్లకోడు వి. వాటను సాగగొట్టి అడుగు మూయటానికి వాడే సలప. మోటబాన వి. ఏతానికి కట్టి నీళ్ళు తోడే గూన, కడవ, బాన. మోటబాయి రూ.చూ. మోటబావి. వి. పొలాలకు పట్టటానికి నీళ్ళిచ్చే లోతైన పెద్ద బావి. మోటబారు వి. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి. మోటబావి రూ. మోటబాయి. వి. పొలాలకు పట్టటానికి నీళ్ళిచ్చే ఎత్తైన పెద్ద బావి. మోటబొల్లెద్దుకుముకుదాడుకట్టు స.[కి. సాహస కార్యం నిర్వర్తించు. మోటమొత్త వి. కుంట మొ.వాటినుంచి నీళ్ళుతోడి పోసేవైపు ఎత్తుగా కట్టినకట్ట. మోటరాయి వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. మోటలుగట్టు (-కట్టు) స.[కి. కాలువలు గట్టు. లక్ష, 1.35. మోడసొర్వ వి. మోట నీరుపోయే దోనిమాను.

మోట[2] రూ. మోటు. విశ. 1. స్థూలం, బలిష్ఠం. రం.రా. కిష్కిం. 209పు. 3షం. ; 2. మూర్ఖుడు. గౌ.హరి.ఉ. 1252పం. ; 3. మొద్దు.

క. మోటు, మోటు. మూర్ఖత్వం ;

సం. ముగ్ధ-, మూఢ-. మూర్ఖమయిన ; [పా. ముడ్డ- ;

హిం.ఉ. మోటా. లావైన, స్థూలమైన.

మోటకత్తి వి. మచ్చుకత్తి, చెట్టుకొమ్మల్ని కొట్టే పెద్ద కత్తి. మను. 4.33. మోటచుక్క. వి. శు[కుడనే నక్ష[తం. మోటతాపి వి. కట్టుబడిలో వాడే మందపాటి రేకుగల పెద్ద తాపి. మోటనోరుమెకము వి. అడవి పంది. మోటపని వి. కర్మాగారం పని. మోటబరి వి. బరువుమోసే ఎద్దు. మోటబ[రి వి. పక్క ఎముకల్లో ఒకటి. మోటవా(డు విశ. 1. ఖండగుడు ; 2. శక్తుడు ; 3. రస[గహణం లేనివాడు. మోటసుత్తి వి. పెద్దసైజు సుత్తి.

మోటపాటి రూ.చూ. మోటాటి. వి. రెడ్లలో ఒక తెగ.

మోటపాటిరెడ్లు రూ.చూ. మోటాటిరెడ్లు. వి.బ.వ. రెడ్లలో ఒక తెగ.

మోటర్ రూ.చూ. మోర్టర్. వి. కట్టుబడికి పనికివచ్చే ఇసక కలిపిన సున్నం.

మోటా విశ. 1. ముతకైన ; 2. సాధారణమైన ; 3. దళసరైన : 4. లావైన ; 5. మొరటు.

హిం.ఉ. మోటా. లావైన, స్థూలమైన, మందంగా ఉండే, దళసరి, గట్టి, గుం[డని, తక్కువరకపు, సాం[దత గల, పెద్ద, బరువైన, గర్వం కల, పెద్దపరిమాణంగల, దురహంకార పూరితమైన ;

త. మోట్టా.

< ఉ. మోటా.

మోటాటి రూ. మోటపాటి. వి. రెడ్లలో ఒకతెగ. హంస. 4.136.

మోటాటిరెడ్లు రూ. మోటపాటిరెడ్లు. వి. రెడ్లలో ఒకతెగ.

మోటామి రూ.చూ. మూటాము. వి. కుండలాము, ఆకుపైన కనువేసి బురదమెత్తి కాల్చే ఆము.

మోటారు వి. బండి.

ఇం. *Motor*. చలనయం[తం.

< ఇం. Motor.

మోటార్కారు వి. బండి.

ఇం. *Motor car*. చలనయం[తంతో నడిచే

వాహనం.

< ఇం. Motor car.

**మోటి** రూ. మోటీ. వి. **1**. చూరుకు ఆధారంగా గోడమీద నిలిపిన కఱ్ఱ ; **2**. గోడలో బిగించే దర్వాజాకమ్మి ; **3**. గోడమీద కప్పు మదురు.

హిం.ఉ. మోటా. లావైనది.

**మోటిచ్చు** స.క్రి. తగులుకొనేటట్లు చేయు. < మోటి + ఇచ్చు. **మోటించు** రూ. మోటీయించు. స. క్రి. పోటీగా నిలుపు. < మోటి + -ఇంచు³. **మోటిబండ** వి. గోడకన్నా ఎక్కువ వెడల్పుగా ఉండి, ఎండ వానల నుంచి దాన్ని కాపాడుతూ ఆచ్ఛాదనగా రెండువైపులా ముందుకు పొడుచుకొని వచ్చిన రాయి.

**మోటిక** రూ.చూ. మొటిక. వి. **1**. అంకురం, మొలక. విప్ర. 2.23 ; **2**. నరకగా లేక కోయగా మిగిలిన చిన్న మొదలు.

**మోటికచ్చు** వి. రాళ్ళ పైకి కనిపించే సన్న పూతగల గోడ. **మోటికలు** వి.బ.వ. చిన్నపాత్రలు పొయ్యిలోపలికి జారిపోకుండా ఉండటానికి పొక్కళ్ళ దగ్గరే లోపలికి చిలక ముూతుల్లా పెట్టిన కొండీలు.

**మోటికె** రూ.చూ. మొటిక. వి. మొలక, భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకి వచ్చే భాగం.

**మోటీ** రూ.చూ. మోటి. వి. **1**. చూరుకు ఆధారంగా గోడమీద నిలిపిన కఱ్ఱ ; **2**. గోడలో బిగించే దర్వాజాకమ్మి ; **3**. బట్టీ గోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ.

**మోటీకప్పు** వి. ముక్కోణపు ఆకారంలో ఉండే బంగళా కప్పు. **మోటీయించు(-ఇంచు)** రూ.చూ. మోటించు. స.క్రి. తగులుకొనేటట్లుచేయు. **మోటీరాయి** వి. కిటికీలపైభాగంలో ఎండవానలు తగలకుండా గోడలనుంచి ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు బిగించినరాయి.

**మోటు** రూ.చూ. మోట². వి. **1**. మాటు, వేటకాడు, పంది వేటలో దాగటం కోసం ఉపయోగించే తెర, పల్లం మొ. వి. మను. **4.34** ; **2**. స్థాణువు, మోడు. ఉ.రా. 1.170 ; **3**. మొద్దుగుఱ్ఱం, మూఢహయం. ఆం.భా. 2.196 ; **4**. మూఢుడు. ఆం.భా. 3.8 ; **5**. దూలం చివరిభాగం ; **6**. ఇటికకు అతుక్కున్న మట్టిపెళుసు ; **7**. కోసిన గడ్డితో గూడునేసేటప్పుడు పైన కోసుగా వచ్చే భాగం ; **8**. వామి (గడ్డికుప్ప) ముఖం ; **9**. మోటలాగే ఎద్దులు బావిపైకి ఎక్కి వచ్చి నిలిచే చోటు ; విశే. **1**. పెద్దది, స్థూలమయినది. రాజవా. 5.20 ; **2**. పరుషమయినది, కరుకైనది.

**మోటుకన్ను** వి. మొద్దువారినకన్ను, ఒకరకంగా చెడిన కన్ను. పండి.చ. 3.273పు. **మోటుకసువు** వి. కళ్ళంలో మెదిగిన గడ్డి. **మోటుకాఁడు** వి. మాటుపెట్టుకొని వేటాడే వాడు. మను. 4.40. **మోటుగడ్డి** వి. కళ్ళంలో మెదిగినగడ్డి, గింజలు రాలినగడ్డి. **మోటుగాడు(-కాఁడు)** వి. రాళ్ళుమోసే పనివాడు. **మోటుచొప్ప** వి. కంకులు కోసిన గడ్డి. **మోటుతనము** వి. మూఢత్వం, మౌర్ఖ్యం. **మోటుతలుపు** వి. చెక్కడప్పని చేయని తలుపు. **మోటుదింపుడు** వి. కొలత ప్రకారం రాతిని పగలగొట్టి తరువాత శాణంతో సరి చేయటం. **మోటునాగలి** వి. రేగడినేలలు దున్నే మెట్టనాగలి. **మోటుపఱచు** స.క్రి. **1**. నరకు, ఖండించు. భాన్క.రా.యు. 361 ; **2**. కొట్టు, ప్రహరించు. అచ్చ.రా.యు. **133**. **మోటుపురుగు** వి. జొన్న, మొక్కజొన్న మొ. పైర్ల మోను తినే పచ్చపురుగు. **మోటుపెసలు** వి.బ.వ. మిటుకుళ్ళు. పెసల మాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం. **మోటుపొలము** వి. మిట్టనేల. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 729. **మోటుమెకము** రూ. మొట్టిమెకము, మొట్టుమెకము. వి. అడవిపంది. **మోటురాయి** వి. **1**. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కనిరాయి ; **2**. గోడకట్టేటప్పుడు మునుముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చినరాయి. **మోటువడు (-పడు)** అ.క్రి. మొద్దువారు, చెడిపోవు. వరాహ. 1,96. **మోటువామి** రూ.చూ. ముటాము. వి. కుండలాము, ఆముకు పైన కసువేసి బురద నెత్తి కాల్చే ఆము. **మోటువామెకము** రూ. మొట్టివామెకము, మొట్టువామెకము. వి. అడవిపంది, **మోటువారి** వి. చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి. **మోటుసరసము** వి. అనాగరక హాస్యం. **మోటుసావం** వి. పోటీగావచ్చే కురుమాడు బద్దలు. **మోటెంగలు** వి.బ.వ. ముతక వడ్లలో ఒకరకం. **మోట్లుగొట్టేవేళ** వి. వేగుచుక్క పొడిచినంతనే మోట్లు కట్టటానికి వెళ్ళే సమయం.

**మోటెంగలు** చూ. మోటు.

**మోటోళ్ళు** చూ. మోటు. విశే.బ.వ. నామధారులు కానివారు.

**మోట్లుగొట్టేవేళ** చూ. మోటు.

**మోడ**¹ రూ.చూ. మోడము. వి. మేఘం.

**మోడ**² వి. ఉప్పు తయారుచేసే మూకుడు.

**మోడంకంది** చూ. మోడము.

**మోడపాకు** రూ. మడపాకు, మాడపాకు. వి. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపు మొక్క.

**మోడము** రూ. మాడ². మూడం, మోడ¹, వి. మేఘావరణం, వానమబ్బు. ఆం.భా. 1.71.

క. మోడ. మేఘం, మబ్బుగా ఉండటం ; తు. మూడ, మోడ. నీరసంగా ఉంశటం, మోడు. మబ్బుగాఉన్న ; త. మూటమ్. చీకటిగా ఉన్న, మేఘావృతమైన ఆకాశం, చల్లదనం ; మ. మూటల్. చీకటి, ఆకాశం.

< క. మోడ.

**మోడంకంది** వి. వర్షం ఎక్కువగా పడితే పండేరకం కంది. < మోడము + కంది.

**మోడామోడి** వి. ఒకానొక స్వరస్థాయి. బసవ. **3.942** పం.

క. మోడామోడి. అందమైనఉదాత్త శైలి లేదా విధానం.

**మోడి**¹ రూ. మోళి, మోళీ. వి. **1**. గణికాదులు ముగ్గవాలి కాలికి సమీపంలో ఉంచిన వస్తువు చేకొనటం. ప్రబంధ. 108 ; **2**. దొమ్మర మొ. జాతులవారు ; **3**. అనాదరం ; **4**. గారడీ.

క. మోడి. ఇతరులశక్తిని పరీక్షించే విద్య, భూమిలో ఏదో పాతిపెట్టి ప్రతిస్పర్ధిని మంత్రాలు చదువుతూ దాన్ని తొలగించమని సవాలు చేయటం.

**మోడిఅతుకు** వి. అచ్చతికేటప్పుడు కిందిపోగులూ పై

పోగులూ కలిపి మొత్తం అతికే పడుగు. **మోడికట్టు** వి. గారడివాని కనుకట్టు; అ.క్రి. గారడివాడు కనుకట్టుచేయు. **మోడితీయు** అ.క్రి. కనుకట్టు విప్పు. **మోడిరాయి** వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. **మోడిరాయి కట్టుబడి** వి. చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి. **మోడిసేయు(-చేయు)** అ.క్రి. **1**. అనాదరం చూపు. హరి.ఉ. 10.316; **2**. ఈసడించు.

**మోడి**[2] విణ. **1**. మూఢుడు. వరాహ. **4.24**; **2**. మొండి, మూర్ఖుడు. వైజ. 2.95; వి. **1**. బింకం. సారంగ. 1.81; **2**. చలం, పట్టుదల. శశా. 4.84; **3**. కోపంతో తాల్చే మౌనం; **4**. స్పర్ధ.

సం. మూఢ-. మూర్ఖుడు;

క.త. మోడి. గర్వం.

<సం. మూఢ-.

**మోడి**[3] వి. **1**. నగిషీపైఖరి, విధం. ఘటికా. 2.66. **2**. దస్తూరి, రాతయొక్క వైఖరి; **3**. మహారాష్ట్ర లిపి; **4**. గోడకట్టేటప్పుడు మునుముందు పెంచుకోవటానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

మరా. మోడీ. మరాఠీలిపి విశేషం;

క. మోడి.

<మరా. మోడీ.

**మోడు** రూ.చూ. మ్రోడు. వి. **1**. ఉండవలసిన అవయవాదులు పోవటంవల్ల మొద్దులాఉండే పదార్థం. భార. కర్ణ. 3.371; **2**. స్థాణువు. ఆం.భా. 2.36; **3**. తలనరికిన చెట్టు; **4**. (చేనుకోసిన) కొయ్యగాలు; **5**. మల్లబంధం; **6**. అటక నిర్మించటానికి గోడలో పాతిన కొయ్య; విణ. మూఢుడు. నీతి. 73.

**మోడుచరుచు** రూ.చూ. మోడుచఱచు. అ.క్రి. **1**. మోటగు; **2**. తునుగు; **3**. మ్రాన్పడు; స.క్రి. ఖండించు. **మోడుచఱచు** రూ. మోడుచరుచు. అ.క్రి. మ్రాన్పడు, బిర్రబిగియు. **మోడునకు సిగ్గు** వి. అనంభవం అనేటప్పటి నానుడి. వేంక. ఆం. 72. **మోడుపడు** రూ. మోడ్పడు. అ.క్రి. **1**. మొక్కవోవు. నృసింహ. 1.87; **2**. తునుగు, తెగు. హరి.ఉ. 8.176; **3**. మ్రాన్పడు, నిశ్చలమగు. ప్రబోధ. 2.8; **4**. బోడిఅగు, కొమ్మలు ఆకులు లేక ఉండు. శుక. 3.489. **మోడుబ్రతుకు** వి. శుష్కజీవితం. **మోడురాయి** వి. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కని రాయి. **మోడ్పడు** రూ.చూ. మోడుపడు. అ.క్రి. **1**. తునుగు. తెగు; **2**. బోడిఅగు, కొమ్మలు ఆకులు లేక ఉండు; **3**. మొక్కవోవు; **4**. మ్రాన్పడు, నిశ్చలమగు.

**మోడుచు** రూ. చూ. మోడ్చు. స.క్రి. **1**. జోడించు. కాశీ. 6.5; **2** (పూలు) ముడుచు; **3**. (కన్నులు) మూయు.

**మోడుపు** రూ.చూ. మోడ్పు. వి. మొగడటం, ముకుళించటం దశా. 3.77. **మోడుపు(గేలు(-కేలు)** రూ.చూ. మోడ్పు(గేలు. వి. దోసిలి, అంజలి. భార. ద్రోణ. 5.409.

**మోడుపు** చూ. మోడుచు.

**మోడుపు(గేలు** చూ. మోడుచు.

**మోడెం** రూ.చూ. మ్రోడు. వి. పంటకోసిన తర్వాత పొలంలో మిగిలే వేళ్ళతోఉన్న మోడు.

**మోడెంజొన్న** వి. ఒకరకం జొన్న. **మోడెముబోవు(-పోవు)** అ.క్రి. వరి పరుగు దగిలపోవు.

**మోడెముబోవు** చూ. మోడెం.

**మోడ్చు** చూ. మొగడు. రూ. మోడుచు. స.క్రి. **1**. (కన్నులు) మూయు. భార. విరా. 2,321; **2**. జోడించు. భార. విరా. 5.341; **3**. (పువ్వులు) ముడుచు.

**మోడ్పు** రూ. మోడుపు. వి. మొగడటం ముకుళించటం. మను. 2.27. **మోడ్పు(గేలు(-కేలు)** రూ. మోడుపుగేలు. వి. దోసిలి, అంజలి. నిర్వ.రా. 9.37. **మోడ్పు(జేయు** వి. నమస్కారం కోసం చేసిన అంజలి. శృం.నై. 3.6.

**మోడ్పడు** చూ. మోడు.

**మోడ్పు** చూ. మోడ్చు.

**మోడ్పు(గేలు** చూ. మోడ్చు.

**మోడ్పు(జేయు** చూ. మోడ్చు.

**మోత**[1] రూ.చూ. మోఁత. వి. మోయవలసిన బరువు.

**మోత**[2] రూ.చూ. మ్రోఁత. వి. ధ్వని.

**మోతకాల్వు** వి. నల్లకాల్వులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్వు.

**మోతకబుడమ** రూ.చూ. ముతకబుడమ. వి. మెతక వడ్లలో ఒకరకం.

**మోతగ** రూ.చూ. మోదుగు. వి. నల్లరేగడి నేలల్లోను, ఉప్పు పర్రల్లోను బాగా పెరిగే పెద్దచెట్టు.

**మోతబు** వి. అనుచరుడు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1312, క్రీ.శ. 1599.

ఉ. ముత్‌బి. అనుచరుడు; పార. ముత్‌బి.

<ఉ. ముత్‌బి.

**మోతర్పాకాంపులు** వి.బ.వ. ఒకవిధమైన పన్ను. నె. శా. ఒంగోలు. శా.సం. 12.

**మోతర్భా** రూ. మోతర్బా. వి. పన్ను, సుంకం.

హిం.ఉ. ముతరిఫా. పన్ను;

త. మోతరిపా. వర్తకులపై విధించబడే పన్ను.

<ఉ. ముతరిఫా.

**మోతర్బా** రూ.చూ. మోతర్భా. వి. పన్ను.

**మోతాదు**[1] రూ. మొహతాదు[1]. వి. అనల్పానధికం అయిన పదార్థం, ఒకసారి ఇచ్చే మందు. రంగా.చ. 2.7.

మరా. మోతాద్. తక్కువ ఎక్కువ కాని పదార్థం, దుర్భిక్షం; ఉ. మోతాద్, మోతద్, మోతద్ద్. లెక్కించబడ్డది, సుమారు చేయబడిన, ఒకసారి ఇచ్చే మందు; పార. మాతాద్, ముతాద్. పరిమాణం.

<ఉ. మోతాద్.

**మోతాదుమించు** అ.క్రి. మితిమీరు.

**మోతాదు**[2] రూ.చూ. మొహతాదు. వి. గ్రామరక్షకుడు.

**మోతాదుమాన్యం** వి. ప్రభుత్వ వర్తమానాలను పట్టణాల నుంచి గ్రామోద్యోగులకు అందజేసేవాడి కిచ్చిన మాన్యం.

**మోతాదు**[3] వి. గౌరవం.

**మోతిచూరు** రూ. ముత్తసూరి, మోచ్చీర్, మోతుకుచూరు. వి. జరీతోగాని కృత్రిమమైన పట్టుతోగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను.

హిం. మోతీచూర్. చిన్నబూంది మిఠాయి (లడ్డు).
<హిం. మోతీచూర్.
మోతీలాల్ వి. ఒకరకం లేతనీలం రంగు.
హిం.ఉ. మోతీ. ముత్యం, లాల్. ఎరుపు.
<హిం. మోతీలాల్.
మోతుకు రూ.చూ. మోదుగు. వి. పలాశం. నవనాథ. 10 పు. 1 పం. (Butea frondosa).
మోతుకుచూరు రూ.చూ. మోతిచూరు. వి. జరీతోగాని కృత్రిమమైన పట్టుతోగాని వరసగా రెండు ఆరు పోగులతో నేసిన డిజైను.
మోతుపరి రూ.చూ. మోతుబరి. వి. 1. మంచి స్థితిలో ఉన్న; 2. ఆర్థిక సంబంధమైన; 3. అప్పులు చెల్లించే శక్తి కలిగి ఉండటం.
మోతుబరి రూ. మాతుబరి, మెతబర్, మోతుపరి, మోతుబరీ, మోతుబరు, మోతుబారు. వి. 1. కలిమి కలవాడు, ధనవంతుడు; 2. గొప్పతనం కలవాడు; 3. నమ్మిక కలవాడు.
హిం. ఉ. అర. ము'త్‌బరీ. నమ్మదగిన, కీర్తిగల, విశ్వసనీయమైన, గౌరవం, రహస్యమైన;
క. మాతుబరి, మాతుబరు. గౌరవింపదగిన, విలువైన, నమ్మకమైన, గౌరవం, నమ్మకం.
< ఉ. ము'త్‌బరీ.
మోతుబరిరైతు వి. ఆసామి, ఎక్కువ పొలం ఉన్న రైతు.
మోతుబరీ రూ.చూ. మోతుబరి. వి. మంచి స్థితి; విణ. పరపతిగల.
మోతుబరు రూ.చూ. మోతుబరి. విణ. 1. మంచి స్థితిలో ఉన్న; 2. ఆర్థిక సంబంధమైన; 3. అప్పులు చెల్లించే శక్తి కలిగిఉండటం; వి. స్థితిపరుడు.
మోతుబారు రూ.చూ. మోతుబరి. వి. 1. మంచిస్థితిలో ఉన్న; 2. ఆర్థిక సంబంధమైన; 3. అప్పులు చెల్లించే శక్తి కలిగి ఉండటం; వి. స్థితిపరుడు.
మోద[1] రూ. మోదు[2]. వి. రెండు నూర్ల తమలపాకుల కట్ట, రెండు వందల తమలపాకుల కట్ట.
త. మోతు. గడ్డిమోపు.
మోద[2] రూ.చూ. మోఁద. వి. 1. ఎముక విరిగిన చోట కలిగిన వాపు; 2. నెత్తురు కదుము.
మోదగ రూ.చూ. మోదుగు. వి. నల్లరేగడి నేలల్లోనూ ఉప్పు పఱ్ఱల్లోనూ బాగా పెరిగే పెద్దచెట్టు.
మోదపురి వి. మోదగడ్డి వేళ్ళతో కట్టిన కుంచెపురి.
మోదయము వి. మొదవగడ్డి.
మోదర వి. తునక, ముక్క.
మోదరలాడు స.క్రి. తునకలుచేయు, ఖండించు. పి.శకు. 2.12.
మోదవగడ్డి రూ. మోదెవగడ్డి. వి. దర్భగడ్డి.
మోదాలు చూ. మొదవు. రూ.చూ. మోదొలు. వి.బ.వ. పాడి ఆవులు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 35, 10వ శతాబ్ది.
మోది[1] రూ. మోదీ. వి. వెచ్చమిచ్చేవాడు.
హిం. మోదీ. వర్తకుడు.
<హిం. మోదీ.
మోది[2] వి. మందుల్లో ఉపయోగపడే గింజలు కాసే తీగ (Piper longum).
మోదించు అ.క్రి. క్రీడించు, విహరించు. రం.రా.ఆరణ్య. 173 పు. 19 పం.
సం. మోద-. సంతోషం.
<సం. మోద-+-ఇంచు[3].
మోదిలు రూ. మోదిల్లు. అ.క్రి. సంతోషించు. రం.రా.బాల. 62 పు. 17 పం.
సం. మోద-. సంతోషం.
మోదిల్లు రూ.చూ. మోదిలు. అ.క్రి. సంతోషించు.
మోదీ రూ.చూ. మోది[1]. వి. వెచ్చమిచ్చేవాడు.
మోదు[1] రూ.చూ. మోఁద. వి. నెత్తురు కదుం.
మోదు[2] రూ.చూ. మోద[1]. వి. రెండు వందల తమలపాకుల కట్ట.
మోదు[3] రూ.చూ. మోఁదు. అ.క్రి. కొట్టు. మొత్తు. భార.కర్ణ. 5.304.
మోదులాడు అ.క్రి. దెబ్బలాడు. అచ్చ.రా.యు. 194.
<మోదు[3]+-లు+ఆడు.
మోదుగ రూ.చూ. మోదుగు. వి. కింశుకవృక్షం. ఆం.భా. 2.44 (Botea frondosa).
మోదుగతీగె వి. ఎఱ్ఱని పూలు పూసే తీగ (Butea superba). మోదుగతొడిమలు రూ. మోదుగుతొడిమలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. మోదుగపువ్వు వి. 1. ఎరుపులో తెలుపు వన్నె; 2. మోదుగచెట్టు పువ్వు.
మోదుగు రూ. మోతగ, మోతుకు, మోదగ, మోదుగ, మోదువు, మోదెగ, మ్రోదుగు, మ్రోంతువు. వి. కింశుక వృక్షం, దీని విత్తు. కు.సం. 7.3 (Erythrina indica).
క. ముత్త, ముత్తగ, ముత్తుగ, ముత్తుల, ముత్తిగ, ముత్తుగ. మోదుగచెట్టు; తు. ముత్తక; త. మురుక్కు. కింశుకవృక్షం (Butea fromdesa); మ. మురిక్క. మోదుగచెట్టు; గోం. ముర్‌మఊ; కొలా. మొద్గ్; కురు. ముర్కా; మాల్తో. ముర్కొ. చెట్టు పేరు.
మోదుగుతొడిమలు రూ.చూ. మోదుగతొడిమలు. వి.బ.వ. శాలిధాన్యం. మోదుగుమాడ వి. మోదుగువిత్తు. మోదుగుమాడలు వి.బ.వ. 1. మోదుగువిత్తులు; 2. శాలిధాన్య విశేషం. మోదుగుమొగ్గ వి. మోదుగుచెట్టుమొగ్గ. మోదుగుమొగ్గపుల్లు వి. శుకం. వేంక. ఆం. 99.
మోదుపుకాయ వి. నార పరిశ్రమలో ఇండిపి, కంక కాయలతో పాటు ఉపయోగపడే ఒకరకం కాయ.
మోదువు రూ.చూ. మోదుగు. వి. కింశుకవృక్షం, దీనివిత్తు. భార. ద్రోణ. 3.259.
మోదువునార వి. మోదుగు చెట్టునుంచి తీసిననార.
మోదెగ రూ.చూ. మోదుగు. వి. 1. కింశుకవృక్షం; 2. కింశుక బీజం.
మోదెన రూ. మోదెనము. వి. శివమల్లిక.
మోదెనము రూ.చూ. మోదెన. వి. శివమల్లిక.

మోదెమలం వి. ఒకరకం కలుపుమొక్క.
మోదెవగడ్డి రూ.చూ. మోదవగడ్డి. వి. దర్భగడ్డి (Imperta cylindrica).
మోదొలు చూ. మొదవు. రూ. మోదాలు, మోదాలు, మోదోలు, వి.బ.వ. ఆవులు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 593. క్రీ.శ. 709-746.
మోదోలు రూ. చూ. మోదొలు. వి.బ.వ. ఆవులు.
మోన రూ.చూ. మొన. వి. మీద, పైన.
మోనము వి. మౌనం. తాళ్ల. సం. 7.108.
సం. మౌన. మాట్లాడక ఉండటం.
<సం. మౌన-.
మోఁత చూ. మోయు[1].
మోఁద చూ. మోఁదు.
మోఁదకట్టు చూ. మోఁదు.
మోఁదు రూ. మోదు[3]. స.క్రి. కొట్టు. ప్రహరించు. కు.సం. 2.66; వి. దెబ్బ, ప్రహారం. భాస్క. రా. కిష్కిం. 203.
క. మోదు. కొట్టు; త. మోతు; మ. మోతుక.
మూ. ద. ద్రా. *మోత్-/*మొత్-.
మోఁద రూ. మోద[2], మోదు[1]. వి. దెబ్బచేత కట్టిన నెత్తురుగడ్డ. కు. సం. 5.70. మోఁదకట్టు అ.క్రి. దెబ్బచేత నెత్తురు గడ్డకట్టు. మోఁదులాట వి. కొట్లాట, దెబ్బలాట. భార. మౌసల. 95. <మోఁదు+-లు+ఆట. మోఁదులాడు అ.క్రి. దెబ్బలాడు. అచ్చ. రా. యు. 194.
<మోఁదు+-లు+ఆడు.
మోపగు చూ. మోచు.
మోపనాడు చూ. మోచు.
మోపరం చూ. మోచు.
మోపరి చూ. మోచు.
మోపరిగాఁడు చూ. మోచు.
మోపరీఁడు చూ. మోచు.
మోపాది చూ. మోచు.
మోపి చూ. మోయు[2].
మోపిక చూ. మోచు.
మోపించు చూ. మోచు.
మోపిడు చూ. మోచు.
మోపిల్లు చూ. మోచు.
మోపు చూ. మోచు.
మోపుకట్టు చూ. మోచు.
మోపుకాఁడు చూ. మోచు.
మోపుకొను చూ. మోచు.
మోపుకొలుపు చూ. మోచు.
మోపుకొల్పు చూ. మోచు.
మోపుగట్టు చూ. మోచు.
మోపుగా చూ. మోచు.
మోపుగాఁడు చూ. మోచు.
మోపుడుకడవ చూ. మోచు.
మోపుడుసుడి చూ మోచు.
మోపుదల చూ. మోచు.
మోపుపట్టు చూ. మోచు.
మోపుపెట్టు చూ. మోచు.
మోపుమెద చూ. మోచు.
మోపురం[1] చూ. మోచు.
మోపురం[2] చూ. మోచు.
మోపురాయి చూ. మోచు.
మోపూరుచక్కెర వి. విషశర్కర. మోపూరులో ఒకసంసారి ఆస్తికై ఒకబిడ్డకు విషాన్ని చక్కెర అనిచెప్పి ఇచ్చి చంపి నట్లు తెలుస్తుంది.
మోపెట్టు చూ. మోచు.
మోప్రం చూ. మోచు.
మోప్పు రూ.చూ. మువకూపు. వి. ఉద్యోగం నుంచి తీసివేత.
మోబత్తు రూ. చూ. మోంబత్తి. వి. ఒక కరదీపిక.
మోభరత వి. నట్టువ. 'మో' ధ్వన్యనుకరణ శబ్దం కావచ్చు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 422. క్రీ.శ. 1269.
సం. భరత-. నాట్యశాస్త్ర కర్త.
మోమాట చూ. మోము.
మోమాటము చూ. మోము.
మోమిచ్చ చూ. మోము.
మోమిచ్చు చూ. మోము.
మోము రూ. మొగ, మొగము, మొవము. వి. ముఖం. కు. సం. 5.70.
సం. ముఖ-. మొగం; ప్రా. ముహ-; పా. ముఖ-; అప. అ. మా. ముహ-;
క. ముక, మొక, మొగ; తు. ముక, మొగ; త. మ. ముకమ్; కుఇ. ముహు; పర్జి. మొకొం; కొలా. మొకం.
<సం. ముఖ-.
మోమాట రూ.చూ. మోమోట. వి. 1. దయ; 2. మనస్సంకోచం; 3. ముఖప్రీతి. మోమాటము రూ.చూ. మోమోట. వి. 1. దయ; 2. మనస్సంకోచం; 3. ముఖప్రీతి. మోమిచ్చ వి. ముఖప్రీతి. <మోము+ఇచ్చ. మోమిచ్చు స. క్రి. అంగీకరించు. నిర్వ. రా. 3.107. <మోము+ఇచ్చు. మోముకొను స. క్రి. మోయు, వహించు. మోముచూచు అ.క్రి. మోమోటపడు. గౌ. హరి. పూ. 1527పం. మోముచెవిఁజేర్చు (-చేర్చు) అ.క్రి. రహస్య సంభాషణ. చేయు. కళా. 4.51. మోముఁజూడక (-చూడక) అవ్య. లక్ష్యంచేయక. గౌ.హరి. పూ. 1428పం. మోముట్టు రూ.చూ. మోముముట్టు. వి. అశ్వాదుల ముఖాలంకారం. ఉ. హరిశ్చ. 3.131, సానంద. 5.136. <మోము+ముట్టు. మోముద్రిప్పలు (-త్రిప్పలు) వి.బ.వ. మూతివిరుపులు. శుక. 3.349. మోమునవెన్నెలలుగాయు (-కాయు) ముఖవికాసం కలుగు. ద్విప. కల్యా. 124. మోమునన్నేలు అ.క్రి. ఎల్లప్పుడు కనబడుచుండు. భార. కర్ణ. 3.33. మోముపట్ట వి. అశ్వాదుల ముఖాలంకారం. పి. శకు. 1.117. మోముబిడారంపులేమ మగఁడు వి. బ్రహ్మ. మోముముట్టు రూ. మోముట్టు. వి. అశ్వాదుల ముఖాలంకారం. రామాభ్యు. 2.20. మోముముడుచుకొను అ.క్రి.

కోపగించు. బహుళా. 2.61. మోమువిచ్చు అ.క్రి. ముఖ వికారంచేయు. నృసింహ. 2.86. మోమువెలుకపాఱు అ.క్రి. మొగం వెలవెలపోవు. శుక. 2.94. మోమెట్టిచేయు అ.క్రి. కోపించు. కాశ. 2.18. < మోము + ఎట్టు + చేయు.

మోమోట రూ. మోమాట, మోమాటము, మోమోటమి, మోమోటము, మోమోటి. వి. 1. దాక్షిణ్యం, కనికరం. హరి. ఉ. 3.203; 2. మనస్సంకోచం. భాగ. 10పూ. 826; 3. ముఖప్రీతి. వేంక. పంచ. 4.122. < మోము + ఓట. మోమోటపడు అ.క్రి. మనస్సంకోచం పొందు. అష్టమ. క. 2.92పు. 14పం. మోమోటమి రూ. చూ. మోమోట. వి. 1. ముఖదాక్షిణ్యం. పారి. 1.83; 2. మనస్సంకోచం. అచ్చ. రా. అయోధ్యా. 49. మోమోటము రూ.చూ. మోమోట. వి. మనస్సంకోచం. భాస్క.రా. అరణ్య. 2.72. మోమోటి రూ.చూ. మూమోట. వి. మనస్సంకోచం. మోమోడు అ.క్రి. 1. సంకోచించు. శార.నధా. 2.192; 2. దాక్షిణ్యపడు. కాశీ. 2.37. < మోము + ఓడు.

మోముబత్తి రూ.చూ. మోంబత్తి. వి. కొవ్వుతో చేసిన బిళ్ళ.

మోమెట్టిచేయు చూ. మోము.

మోమొనువాళ్ళు రూ. మోమొనోళ్ళు. విశ. బ.వ. అచ్చులు కట్టే వాళ్ళలో ఒకతెగ.

మోమొనోళ్ళు రూ.చూ. మోమొనువాళ్ళు. విశ.బ.వ. అచ్చులు కట్టే వాళ్ళలో ఒకతెగ.

మోమోట చూ. మోము.

మోమోటపడు చూ. మోము.

మోమోటమి చూ. మోము.

మోమోటము చూ. మోము.

మోమోటి చూ. మోము.

మోమోడు చూ. మోము.

మోంబత్తి రూ. మొంబత్తి, మొంబొత్తి, మోబత్తి, మోముబత్తి వి. మైనపు వత్తిగల దివ్వె. హంస. 3.27.

హిం. మోమ్‌బత్తీ.; మరా. మోమ్‌బత్తీ.; ఉ. మోమ్‌బత్తీ. మైనపువత్తి.

< ఉ. మోమ్‌బత్తీ.

మోయన రూ.చూ. మోయీను. వి. 1. సరిపోయేది; 2. పల్లెల్లో సంసారుల ఇళ్ళకు బ్రాహ్మణ అతిథులు వచ్చినప్పుడు వారి భోజనానికి కావలసిన వంటసామగ్రిని ఒక బ్రాహ్మణుని ఇంటికి పంపటం; 3. ఒకపాటి పరిమాణం గలది.

మోయనిమోపు చూ. మోయు[1].

మోయించు చూ. మోయు[1].

మోయినం రూ.చూ. మొయనం. వి. తగిన నిప్పత్తిలో మట్టిలో మసిని కలపటం.

మోయిను రూ.చూ. మోయీను. వి. 1. రీతి; 2. బత్తెం.

మోయీను రూ. మొయిన, మోయన, మోయిను, మోహిని. వి. 1. బత్తెం. వేణు.క. 65; 2. రీతి.

హిం.ఉ. ముయీన్. ఏర్పాటు;

త. మోయన్, మోయిన్, మోయినీ. ఏర్పాటు, దేవాలయ నిర్వాహక సభ్యులు.

< ఉ. ముయీన్.

మోయు[1] స.క్రి. 1. వహించు. హర. 6.48: 2. అంటు, తాకు. రాఘవ. 4.236.

క. మోవు, బరువు, బాధ్యత; త. మో(-ప్ప్-, -న్త్-). బాధ్యత వహించు; కువి. మోచ్. ఎత్తుకొను; కొలా. మోస్. బరువు, ఎక్కువ బరువుమోయు.

< మూ.ద్రా. *ముయ్/*మొయ్

మోఁత రూ. మోత[1]. వి. 1. మోయటం, వహించటం. వేమ. 3.196; 2. బరువు, భారం. మోయనిమోపు వి. భరించరానంత భారం. తాళ్ల.సం. 6.167. మోయించు స.క్రి. మోపచేయు, వహింపచేయు. హర. 6.49. < మోయు[1] + -ఇంచు[3].

మోయు[2] అ.క్రి. వైధవ్యం పొందు.

క. మోచు. విధవఅగు, వైధవ్య చిహ్నంగా ముసుగు వేసుకొను; త. మోప్పి. విధవ.

మోపి వి. ముండమోసింది. విధవ. క. మోచు. ముండ మోయు; త. మోప్పి. విధవ.

మోర్ రూ.చూ. మోర[2]. వి సున్నగా రుద్దటం.

మోర[1] రూ. మొర, మోరము, మోరి[3]. వి. పశ్వాదుల దీర్ఘ ముఖం, ముట్టె. భార. భీష్మ. 3.239; 1. ముఖం. భీమ. 3. 135; 2. తల.

సం. మౌఖ-, మౌఖర్య. ముఖసంబంధి; ప్రా. మోహర-; మరా. మోహర-. ముఖం;

క. మోఱె. ముఖం; త. ముఱై, మోఱై, మోఱె. ముఖం; మ. ముకద, మోర్.

< ప్రా. మోహర-.

మోరకట్టు వి. చేతిమగ్గం పలకను గుండును కలిపి బిగించిన దారం. మోరకొట్టు వి. చెంపకాయ, చపేటం. శుక. 1.441; స.క్రి. గద్దించు. మోరటిల్లు రూ. మోరటిల్లు. అ.క్రి. ముఖం మీదికెత్తు. విష్ణుపు. 3 ఆ. మోరటిల్లు రూ.చూ. మోరటిలు. అ.క్రి. మోము మీదికెత్తు. మోరతాడు వి. పిరతాడు, గూడనడుముకు అటూఇటూ కట్టిన తాడు. మోరతెలుపుమెకపుఱేఁడు రూ.చూ. మోరతెల్పు మెకపుఱేఁడు. వి. జాంబవంతుడు. మోరతెలుపుమెకము రూ. మోరతెల్పుమెకము. వి. ఎలుగుబంటి. మోరతెల్పుమెకపు ఱేఁడు రూ. మోరతెలుపు మెకపుఱేఁడు. వి. జాంబవంతుడు, ఎలుగుబంట్ల రాజు. అచ్చ.రా.యు. 298. మోరతెల్పు మెకము రూ.చూ. మోరతెలుపుమెకము. వి. ఎలుగుబంటి. మోరతోపు రూ.చూ. మోరత్రోపు. వి. 1. అనాలోచనం. తాళ్ల.సం. 1.75; 2. ఆలోచనలేనిపని. ద్వి.పరమ. వి. 4.309; 3. పెడముఖం. మోరత్రోపు రూ. మోరతోపు. వి. అనాలోచనం, అనాలోచనం చేష్ట. రం.రా.యు. 311పు. 22పం. మోరత్రోపు(దనము(-తనము) వి. 1. అనాలోచనం. వరాహ. 11.64; 2. అనాలోచన చేష్ట. నవనాథ. 1.41పు. 10పం.; 3. పెడముఖం. మోరపక్కియ రూ. మోరపక్కె. వి. ఒకజాతిచేప. హంస. 4.187.

మోరపక్కె రూ.చూ. మోరపక్కియ. వి. ఒకరకం చేప.

మోరబెట్టు(-పెట్టు) అ.క్రి. గోడకు సున్నపు ఒంట్రు పూయు.
మోరమెకము వి. వానరం, కోతి. అచ్చ.రా.యు. 81.
మోరసెల వి. ముక్కు నరాల్లో నెత్తురు పేరుకొని బిగదీసుకు పోవటం.
మోర[2] రూ.మోర్, మోరా[2]. వి. నున్నగా రుద్దటం.
మోరరాయి వి. అరవైనెంబరురాయి, కఠినశిలల ఉపరితలాన్ని అరగదీసి మెరుగు పెట్టటానికి వాడే ఒకానొక శిల.
మోరకించు చూ. మోరకు.
మోరకు రూ.చూ. మొర్కు. వి. 1. మూర్ఖుడు ; 2. క్రూరుడు ; విశ. 1. మూర్ఖమైనది ; 2. క్రూరమైనది.
మోరకించు అ.క్రి. మొండితనంపూను. < మోరకు +-ఇంచు[3].
మోరకు(డు రూ.చూ. మొర్కు. వి. 1. మూర్ఖుడు ; 2. క్రూరుడు.
మోరచెంగు రూ.చూ. మోర్చింగు. వి. చిన్న ముఖవీణ.
మోరట వి. ఇప్ప, మధుస్రావం, వృక్షవిశేషం.
సం. మోరటు-. తియ్యని రసం కలచెట్టు, ముర్రుపాలు, ఇక్షుమూలం, ఊడుగుచెట్టు.
సం. మోరట-(అర్థవిపరి.).
మోరటి వి. ప్రియాళం, ద్రాక్షతీగ.
మోరడి వి. హెచ్చరికపదం. ప్రబంధ. 605.
మోరడు చూ. మ్రోడు. రూ. మొరడు. వి. మోడు, మొద్దు, స్థాణువు. నృసింహ. 2.83.
మోరపాక చూ. ఓరపార. వి. పంచను దూలాలు లేదా గోడమీద నుంచి పక్కకి దింపి రాటలు ఆధారంగా కట్టినశాల, ఓరపాక.
మోరము రూ.చూ. మోర. వి. మోర, ముఖం. పార్వ. 2.168.
మోరలి రూ.చూ. మొరళి. వి. ఒకరకం పళ్ళచెట్టు.
మోరల్లి రూ.చూ. మొరళి. వి. ఒకరకం పళ్ళచెట్టు.
మోరా[1] వి. కాలిపీట.
త. మోరా. కాలిపీట.
< త. మోరా.
మోరా[2] రూ.చూ. మోర[2]. వి. సాపు చేస్తూ తాపీతో రుద్దే పొడి.
మోరాయించు రూ.చూ. మురాయించు. అ.క్రి. బుకాయించు.
మోరి[1] రూ. మోరీ[2], మోరు[2]. వి. 1. నీటి కాలువ ; 2. చిన్న వంతెన ; 3. కప్పుమీది నీరు కిందికి కారటానికి వీలుగా అమర్చిన పొడుగాటి క్రోవి ; 4. సున్నపు బట్టీలోని పొయ్యి.
హిం.ఉ. మూరీ, మోరీ, మోహ్‌రీ. మురికి కాలవ ;
క.త. మోరి. నీటి కాలవ.
< ఉ. మూరీ.
మోరి[2] రూ.చూ. మోరు[1]. వి. మజ్జిగ.
మోరి[3] రూ.చూ. మోర[1]. వి. 1. ముఖం ; 2. చెంప.
మోరికొట్టులు వి.బ.వ. చపేటాలు. శుక. 1.530.
మోరిజా రూ.చూ. మోర్చా. వి. తుపాకులు ఫిరంగులు పెట్టుకొనే చోటు, కందకం. రంగా.చ. 3.77.

మోరీ[1] రూ.చూ. మొహరు. వి. 1. ముద్ర ; 2. నాణెం.
మోరీ[2] రూ.చూ. మోరి[1]. వి. 1. ఇంటి కప్పుమీది తూము ; 2. స్నానం చేసిన నీళ్ళు పోయే దారి, మురుగు కాలవ ; 3. వంతెన.
మోరీబండ వి. నీళ్ళు పోవటానికి తూముగా మలిచి చెక్కిన రాయి.
మోరు[1] రూ. మోరి[2]. వి. చల్ల, దండాహతం. ఘటికా. 2.16.
క. మోసరు. మజ్జిగ ; తు. మోర్ ; త. మ. మోర్.
< త. మోర్.
మోరుండ వి. భక్ష్య విశేషం. హర. 6.55. < మోరు[1] + ఉండ. మోరువొట్టు వి. కల్లు.
మోరు[2] రూ.చూ. మోరి[1]. వి. 1. బోదె, పొలంలోకి నీళ్ళు తెచ్చే కాలవ ; 2. గూడ కొమ్ము, గూడకు పైవైపు తాడు కట్టే చోటు.
మోరుదోపు వి. చెప్పితే వినని వాడు. మోరుదోపుచేష్టలు వి.బ.వ. చేతగాని సోమరి చేష్టలు.
మోరు[3] వి. 1. (పర్వత) శిఖరం, కొండ కొన. ఉ.హరి. 6 76 ; 2. కదుం, శరీరంపై కలిగే వాపు.
మోరు(డు వి. అటూ ఇటూ చెందని స్థితిలో ఉన్నవాడు.
మోరు[4] వి. నెమలి.
హిం. మోర్. నెమలి ;
క. మోర. నెమలి ; త. మోరా.
< హిం. మోర్.
మోరుచిక్కు చూ. మోర[1]. వి. ఎదురుబడటం.
మోరుమోరులువోవు (-పోవు) అ.క్రి. మొక్కపోయేటట్లు చేయు, మొగ్రెపోవు. పండి.చ. 1.2.302.
మోర్కి రూ.చూ. మోర్కె. వి. సిగమోర, తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం.
మోర్కె చూ. మోర[1]. రూ. మోర్కి. వి. సిగమోర, తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం.
మోర్చా రూ. మోరిజా. వి. 1. తుపాకులు, ఫిరంగులు పెట్టుకొనే చోటు, కందకం. రంగా.చ. 3.61 ; 2. వ్యూహరచన.
హిం. మోర్‌చా. కందకం, ఎక్కడినుండి కోటను రక్షించునో ఆ స్థానం ; మరా. మోర్చా. ఫిరంగుల సమూహం ; ఉ. మోర్‌చా. సేన, కోటను రక్షించే స్థానం, మోర్‌చాల్. శత్రువుల్ని ఎదుర్కోవటానికి ఏర్పరచుకొన్న గుంట ; పార. మూర్చా, మూర్చాల్. కోటను రక్షించుకోవటానికి సేన ఏర్పాటు చేసికొన్న కందకం.
< ఉ. మోర్చా.
మోర్చింగు రూ. మోరచెంగు, మోర్సింగు. వి. చిన్న ముఖవీణ.
సం. ముఖశంఖి-. వాద్య విశేషం ;
క. మోర్చంగ్. వాద్య విశేషం ; త. మోర్చింగు, యాదుల తీగలు కల వాద్య విశేషం.
మోర్టర్ రూ. మోటర్. వి. కట్టుబడికి పనికివచ్చే ఇసుక కలిపిన సున్నం.
ఇం. *Mortar*. రోలు.

<ఇం. Mortar.

మోర్లు చూ. మొరం[2]. వి. కీళ్ళవాపు, మోకాళ్ళ కొంకులు వాచే నడవలేని జబ్బు.

మోర్సల్‌బట్ట వి. సారెమీద పాత్రల స్వరూపం తయారువుతున్నప్పుడు నునుపు పట్టటానికి అంచు ఏర్పరచటానికి వాడే తడిబట్ట.

ఇం. *Morsel*. ముక్క.

మోర్సింగు రూ.చూ. మోర్చింగు. వి. చిన్నముఖవీణ, శ్రుతి గల వాద్య విశేషం.

మోఅకకత్తియ చూ. మోఅకు.

మోఅకకత్తె చూ. మోఅకు.

మోఅకము చూ. మోఅకు.

మోఅకించు చూ. మోరకము.

మోఅకు రూ.చూ. మొర్కు. వి. 1. మూర్ఖుడు. భార.విరా. 4.208 ; 2. క్రూరుడు ; విణ. 1. మూర్ఖమైనది ; 2. క్రూరమైనది.

మోఅకకత్తియ రూ.చూ. మోఅకకత్తె. వి. మూర్ఖురాలు. మోఅకకత్తె రూ. మోఅకకత్తియ. వి. మూర్ఖురాలు. మోఅకము వి. మూర్ఖత్వం. నృసింహ. 1.20 ; విణ. మూర్ఖం. వాశి.రా. 4.145. మోఅకించు అ.క్రి. మూర్ఖత్వం, అవలంబించు. వరాహ. 11.64. <మోఅకు + -ఇంచు[3].

మోఅకుఁడు రూ.చూ. మొర్కు. విణ. 1. మూర్ఖుడయిన. హర. 2.57 ; 1. క్రూరమైనది ; వి. 1. మూర్ఖుడు ; 2. క్రూరుడు.

మోల[1] రూ.చూ. మ్రోల. వి. 1. ముందు. అష్టమ.క. 2446 ; 2. ఎదురు, సమ్ముఖం ; 3. సమీపం.

మోలగించు రూ.చూ. మ్రోలగించు. స.క్రి. 1. ఎదుర్కొను, ఢీకొను ; 2. దగ్గరించు.

మోల[2] వి. డబ్బు సంచి.

సం. మూల్య-. వెల, ధర.

మోలము రూ.చూ. మోళము. వి. 1. బంగారు వెండి మొ. వాటి పూత, ములాము. తాళ్ల.సం. 13.116 ; 2. పుళ్ళకు పూసే మందు.

మోలియాచెక్క వి. పెంకుటింటి చూరు కింద వేసిన వెడల్పాటి చెక్క.

మోలుగు రూ.చూ. ములుగు. వి. నల్లచాయ చెక్క. ఆము. 4.35.

మోలెం[1] వి. ఏడె, బండిజల్ల తెరచిఉన్నవైపు.

మోలెం[2] రూ.చూ. మోడెం. వి. పొగమంచు.

మోల్డింగుకప్పు వి. పోతపోసిన సిమెంటుకప్పు.

ఇం. *Moulding*. పోతపోయటం.

<ఇం. Moulding + కప్పు[1].

మోల్డు వి. 1. మేడకు పిట్టగోడగాను, కింది భాగానికి పెంకులాగాను ఉన్న నిర్మాణం ; 2. పాత్రలు తీర్చటానికి సారె పలక మీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద ; 3. సిమెంటు పలక.

ఇం. *Mould*. రూపం, ఆకారం.

ఇం. Mould.

మోళంగి రూ.చూ. ములుక[2] వి. ములక.

మోళము రూ. మలా, మలామ, మలామా, మలాము, ములాము, ముల్లాము, మోలము. వి. 1. బంగారం, వెండి మొ. వాటి పూత. శృం.నై. 6.64 ; 2. పుళ్ళకు పూసే మందు.

హిం. ములమ్మా. వస్తువుకు బంగారు వెండి పూత వేయటం ; మరా. ములామా ; ఉ.అర. ములమ్మా. బంగారు లేదా వెండి పూత వేయబడిన, కుదువ పెట్టటంలో ఒక పద్ధతి, అరబ్బీ పద్యం ; పార. ములమ్మ ;

త. మలామ్.

<ఉ. ములమ్మా.

మోళా వి. 1. రీతి : 2. తరగతి.

మరా. మోళా. రీతి, పద్ధతి.

<మరా. మోళా.

మోళి రూ.చూ. మోడి[1]. వి. గారడీవిద్య.

మోళీ రూ.చూ. మోడి[1]. వి. గారడీవాని విద్య.

మోవి[1] వి. పెదవి. కు.సం. 3.62.

త. మోవాయ్. గడ్డం ; తొ. మొ.య్. గడ్డం.

మోవిగిరుపు స.క్రి. పెదవి విరుచు. తాళ్ల.సం. 17.157. మోవితీపాను అ.క్రి. అధరపానంచేయు, ముద్దుగొను. కళా. 5.32. మోవి విరుచు స.క్రి. పెదవి విరుచు. మోవులు నంజుకొను అ.క్రి. అదరామృతం గోలు, ముద్దులుగొను. కళా. 6.128. <మోవి[1] + -లు + నంజుకొను.

మోవి[2] వి. ఒకజాతి అడవి పళ్ళచెట్టు. కాశ. 3.69.

మోవి[3] వి. చిన్న మట్టిపాత్ర. అహల్యా. 3.28.

మోవి[4] వి. అగ్రభాగం. అష్టమ. క. 1.26 పు. 20 పం.

మోవి[5] రూ.చూ. మోవు. వి. చుట్టగావచ్చే లేతఆకు, ముఖ్యంగా అరిటాకు.

మోవు రూ. మొవ్వ, మోవి[5]. వి. 1. ముడత విడని లేతఆకు మొలక, అలాంటి తాటిచెట్టు మొలక. ఇందు. 3.19 ; 2. భూమిలో నాటుకొన్న గింజపగిలి పైకివచ్చే భాగం.

మోవుపిప్పి వి. తమిద, జొన్న మొ. పైర్ల తెగులు, ఒక రకం ఈగ తలకొమ్మ కొరకటంవల్ల ఎన్నుపైకి రాని తెగులు. మోవుపురుగు వి. వరిమోవు (తల) కొరికే పురుగు.

మోవులునంజుకొను చూ. మోవి[1].

మోస[1] రూ.చూ. మోసము. వి. 1. ప్రమాదం. భార. అను. 2.214 ; 2. వంచన. శృం.నై. 7.192 ; 3. దొంగతనం. కాశీ. 5.68 ; 4. అడ్డు. నార. పంచ. 1.138 ; 5. అసత్యం. ప్రబోధ. 1.21.

మోసకత్తె అ.క్రి. మోసగించేస్త్రీ. మోసకారి వి. వంచకుడు, మోసం చేసేవాడు. శుక. 3.223. మోసగాఁడు వి. వంచకుడు. మోసగించు స.క్రి. వంచించు. మోసపుచ్చు.< మోస + -ఇంచు[3]. మోసపుచ్చు స.క్రి. వంచించు, మోసం చేయు. పండి.చ. 2-4-214, భార.అను. 5.105. మోసపోవు అ.క్రి. భంగపడు, వంచితుడగు. భార. విరా. 2.226. మోసరి వి. మోసంచేసే వ్యక్తి. < మోస + -అరి.

మోస[2] రూ.చూ. మూస. వి. 1. బంగారం మొ. వాటిని కరిగించే పాత్ర ; 2. ఆర్చీలు, శ్లాబులు మొ. వాటి నిర్మా

ణానికి పనికివచ్చే తాత్కాలికపు పట్టు.

మోసనాలు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

మోసము రూ. మోస. వి. **1.** వంచన, దగా. భార. విరా. 4.230 ; **2.** అజ్ఞానం. భార. శాంతి. **4.123 ; 3.** అపరాధం. కేయూ. **3.277 ; 4.** అసత్యం. ఉ.హరి. **4.40 ; 5.** ప్రమాదం, పొరపాటు. భీమ. 3.8 ; **6.** అవమానం. కాశీ. **3.163 ; 7.** భంగం, అపాయం. భాగ. 7.251.

నం. మోష-. దొంగ, దోపిడికాడు, దొంగతనం, దోపిడి, నాశనం; ప్రా. మోస-. వంచన, అసత్యభాషణం ; పా. మోస- ; అ.మా. మోస-, మోసా. అసత్యం ;

క. మోస, మోసు ; తు. మోస ; త. మోచమ్ ; మ. మోశమ్.

<ప్రా. మోస-.

మోసముతెచ్చు అ.క్రి. ఊనంతెచ్చు, మొదటికేమోసం అగు. ఆము. 2.79. మోసమువచ్చు అ.క్రి. ప్రతిఘాతం కలుగు, ఊనంవచ్చు, మొదటికే మోసంవచ్చు. వర.రా. సుం. 88 పు. 11 పం.

మోసంబి రూ. ముసంబి. వి. బత్తాయి (Sinensis, osbeck).

మోసరాయి వి. ఉష్ణదేశాల్లో వానాకాలం తరవాత భూమి లోపలి పొరల్లో ఉన్న సుద్దనీరు భూమి ఉపరితలానికి వచ్చి ఆతరవాత పెట్టగాఉండే దీర్ఘకాలంలో ఎండిభూమిపై పొరకు దిగువనే పొరగట్టి గట్టిపడే 'కేల్సైట్ కంకర్' అనే సాంకేతిక నామంకల ఒకరకం రాయి.

మోసరిక చూ. మోసు. రూ. మోసీరిక. వి. అంకురం.

మోసల రూ.చూ. మొగసాల. వి. **1.** నగరి తలవాకిటి పంచ. నిర్వ.రా. **2.5,** రం.రా.ఉ. 125 పు. **23** పం. ; **2.** ముంగిలి, ఇంటిముందలి సాల. వాశి.రా. 2.177 ; **3.** తలవాకిలి, నోరు. నీలా. 1.52.

మోసాల రూ.చూ. మొగసాల. వి. **1.** ముంగిలి, ఇంటి ముంగలి సాల. కాశీ. **2.41 ; 2.** నగరి తలవాకిలి. సారంగ. **3.34 ; 3.** తలవాకిలి, నోరు.

మోసీరిక రూ.చూ. మోసరిక. వి. అంకురం.

మోసు[1] వి. **1.** మొలక, అంకురం. కు.సం. **4.87 ; 2.** మొవ్వ, మోవు. పండి.చ. 2.103 ; **3.** అందం. వైజ. **4.30.**

తు. మూంకు. జొన్నవిత్తనం ; గోం. మడీ. మొలకెత్తు, అంకురించు ; కుయి. మొక. మొలక ; కువి. మ్లొగ్ల, వెదురుమొలక ; కురు. మూ. చిన్నకాడ, తొడిమ.

మోసులెత్తు అ.క్రి. **1.** పుట్టు, కలుగు. మార్క. **6.132 ; 2.** కొంచెం కొంచెంగా పైకివచ్చు. రామాభ్యు. 7.171 ; **3.** మొలకలెత్తు, అంకురించు. వసు. 1.100. <మోసు + -లు + ఎత్తు[1]. మోసెత్తు అ.క్రి. **1.** మొలకెత్తు, అంకురించు. విష్ణుపు. **3.152 : 2.** కొంచెంకొంచెంగా పైకివచ్చు ; **3.** పుట్టు ; కలుగు. <మోసు + ఎత్తు[1].

మోసు[2] వి. పేరుకొన్న మట్టికుప్ప.

మోసూలు వి. కావలి.

ఉ. మొహస్సల్. అరెస్టు, పారిపోకుండా ఒకవ్యక్తి ఏర్పరచిన నిర్బంధం.

<ఉ. మొహస్సల్.

మోసెత్తు చూ. మోసు[1].

మోసేను వి. పిటీషన్.

మోస్తరు రూ. ముస్తరు. వి. మాదిరి, విధం, రీతి, నమూనా, స్వభావం.

మోహటించు రూ.చూ. మోహరించు. అ.క్రి. వ్యూహం పన్ను.

మోహనపుదుంప వి. చిలగడదుంపల్లో ఒకరకం.

నం. మోహన-. మోహాన్ని కలిగించేది.

మోహనపునరులు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

నం. మోహన-. మోహాన్ని కలిగించేది.

మోహనబ్రాహ్మణులు వి.బ.వ. బ్రాహ్మణుల్లో ఒకతెగ.

నం. మోహన-. మోహాన్ని కలిగించేది.

మోహరము వి. **1.** వ్యూహం, మొగ్గరం. నిర్వ.రా. **3.13 ; 2.** సేన. భార. విరా. **5.187 ; 3.** సమూహం. జక. 2.508.

నం. మౌఖర్య-. వాచాలత ; ప్రా. మోహర-;

క. మోహర. గుంపు, సేన.

<ప్రా. మోహర-.

మోహరించు రూ. ముహరించు, మోహటించు. అ.క్రి. వ్యూహంగా ఏర్పడు. నిర్వ.రా. **6.82 ;** అ.క్రి. స.క్రి. ఎదుర్కొను, ప్రతిఘటించు. భార. విరా. **4.237 ;** స.క్రి. మోహించు, ప్రేమించు. ప్రబంధ. **746.** <మోహరము + -ఇంచు[3].

మోహరించు రూ. మోహరము.

మోహరీ రూ.చూ. ముహరీ. వి. ముహిరీ.

మోహిని రూ.చూ. మోయీను. వి. ఒకవిధమైన గవర్నమెంటు గ్రాంటు.

మోహినీపేటంచు చూ. మోహినీపేటు.

మోహినీపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

నం. మోహినీ. విష్ణువు అవతారం.

<నం. మోహినీ + పేటు.

మోహినీపేటంచు వి. ఒకరకం డిజైను పెట్టినేసిన అంచు. <మోహినీపేటు + అంచు[3].

మోహీము వి. దండువిడిసే చోటు. రంగా. చ. **3.38.**

హిం. ఉ. మరా. మోహీమ్. దండయాత్ర ; అర. ముహిమ్మ.

<ఉ. మోహీమ్.

మౌఖూబు రూ. చూ. మవకూపు. వి. ఉద్యోగంనుంచి తీసివేయటం.

మౌజీ రూ.చూ. మౌంజె. వి. గ్రామం, పల్లె.

మౌజీవారీ రూ. మవుంజేవారి. విణ. పల్లెల లేదా మౌజేక్రమ ప్రకారం.

ఉ. అర. మౌజ- ; పార. -వారి ;

త. మౌజి-వార్, మౌజి-వారి.

<ఉ. మౌజ- పార. వారి.

మౌజుదాతు రూ. మవుజుదాతు. వి. నిలవఉంచబడ్డ సరుకు.

ఉ. అర. మౌజూదాత్. కొనుక్కొనబడిన, ఉన్న, జీవిస్తున్న, ముందటి, అందుటాటులో ఉండటం, జీవులు, సృష్టించబడిన ప్రాణులు, జీవించిఉండేవి, సిపాయిల హాజరు.

